తెనుఁగులెంక తుమ్మల

సమగ్ర సాహిత్యము - 4

# ఖండకావ్యములు

ప్రచురణ

తుమ్మల శతజయంతి ఉత్సవ సంఘము

గుంటూరు

ఖండకావ్యములు

తెనుఁగులెంక తుమ్మల సీతారామమూర్తి

తుమ్మల శతజయంతి ప్రచురణ

24 డిసెంబరు, 2001



మూల్యము : రూ. 150/-

ప్రతులకు :

1. డా॥ కొండబోలు బసవపున్నయ్య
   1, నలందానగర్, రింగ్‌రోడ్
   గుంటూరు
   ఫోన్ - 350461

2. తుమ్మల శ్రీనివాసమూర్తి
   విద్యానగర్, నిడుబ్రోలు - 522 124
   ఫోన్ - 46567

3. తుమ్మల నారాయణ
   305, స్వగృహ మోతీ అపార్ట్‌మెంట్స్
   మోతీనగర్, హైదరాబాద్ - 18
   ఫోన్ - 3834437

ముద్రణ :

శ్రీలక్ష్మి ప్రెస్

14/2 అరండల్‌పేట, గుంటూరు

ఫోన్ - 230643

# తుమ్మల శతజయంతి ఉత్సవ సంఘము

గుంటూరు

గౌరవాధ్యక్షులు

**శ్రీ వై.వి. రావు**

పార్లమెంటు సభ్యులు

అధ్యక్షులు

**డా॥ కొండబోలు బసవపున్నయ్య**

ఉపాధ్యక్షులు

**శ్రీ పోలిసెట్టి ఏకనాథగుప్త**

**శ్రీ పొన్నెకంటి హనుమంతరావు**

కార్యదర్శి

**శ్రీ కాకరపర్తి వెంకటేశ్వర్లు**

కోశాధికారి

**శ్రీ పాలడుగు లక్ష్మణరావు**

కన్వీనర్

**డా॥ ముద్దన హనుమంతరావు**

తెనుఁగులెంక తుమ్మల

# సమగ్ర సాహిత్యము

నాలుగవ సంపుటము ప్రచురణకు

**భూరి విరాళము లొసగిన**

వదాన్య శేఖరులు

## విజ్ఞాన్ విద్యా సంస్థలు

**గుంటూరు**

## ఎల్.వి.ఆర్. & సన్స్ క్లబ్ రీడింగ్ రూమ్

**గుంటూరు**

# శతజయంతి సమర్పణ

తిక్కన పలుకుబడులను పుణికిపుచ్చుకొని తెనుఁగుదనమును రంగరించిన తమ కవితలో గాంధీయమును వెలయించి ధన్యజీవులైనవారు తెనుఁగులెంక శ్రీ తుమ్మల సీతారామమూర్తిగారు జీవితమంతయు నైతికములయిన విలువలకే మీదుకట్టిన మహనీయు డాయన రాష్ట్రసిద్ధి కొఱకు రక్తమ్ము గార్చిన గాంధికవి. బడలి బడలి తల్లి బాసకూడెము సేసిన దేశికవి, మేడిబట్టి నాగలి దున్నిన కర్షక కవి.

అమరజ్యోతి యగు గాంధీ సంపూర్ణ జీవితచరిత్రను మహావీరకావ్యాలుగా తీర్చిదిద్ది మహాత్ముని ఆస్థానకవి యని పేరొంది, సిసలైన గాంధీ అనుయాయిగా బ్రతుకును పండించుకొనిన మహనీయులు తుమ్మల వారు చక్కని చిక్కని తెనుఁగుదనపు గుట్టు తెలిసి, నుడికారమునకు మారుపేరైనది తుమ్మలవారి సాహిత్యము తెలుగుసీమ పల్లెపట్టులు కన్నులకు గట్టినట్లు చిత్రించిన మేటి కైసరులు వారు. మాతృభాషాభిమానము, ఆంధ్రరాష్ట్రాభిమానము వీరి కావ్యములకు జీవగఱ్ఱలు జీవితము వేఱు, కవిత్వము వేఱు అని వారేనాడును భావింపలేదు నీతిని ఊతగా గొని బ్రతికిన వారికి మాత్రమే తమ కృతులను అంకితమొనర్చి కృతార్థులైనారు

మేనెంత నలగినను, తమ మనుగడ లోకసేవనమ్మున కొసంగి, నవ్య భవ్య కవితా సృష్టి ద్వారా సామాజిక కల్యాణము కామించిన తుమ్మలవారి శతజయంతి ఉత్సవమును (24-12-2001) పురస్కరించుకొని వారి సమగ్ర సాహిత్యమును సంపుటములుగా ప్రచురింపదలపెట్టినాము. ఈ బృహత్కార్యము వ్యయసాధ్యము. అయినను గుంటూరు నగరమునను, ఆంధ్రదేశమందంతటను గల సహృదయశేఖరులు తెనుఁగులెంకపై గల అపారమైన ఆదరాభిమానములతో భూరి విరాళములొసగి ఈ కార్యమును సఫలీకృతము చేసినారు

వీరెల్లరకు మేము కృతజ్ఞతాంజలి ఘటించుచు తెనుఁగులెంక సమగ్రసాహిత్యమును ఆంధ్ర పాఠకుల కరకమలములందు అర్పించుచున్నాము.

ఇట్లు
**డా॥ కొండబోలు బసవపున్నయ్య**
అధ్యక్షులు
**తుమ్మల శతజయంతి ఉత్సవ సంఘము**
గుంటూరు

# కృతజ్ఞత

తెనుఁగులెంక శ్రీ తుమ్మల సీతారామమూర్తి దాదాపు ఇరువదియైదు వేల పద్యములు విరచించినారని ప్రతీతి. అంత విస్తృతమైన తుమ్మలవారి సమగ్రసాహిత్యమును ప్రచురించుట అలఁతిపని కాదు. ఆత్మకథ, మహాత్మకథ అను మహావీరకావ్యములు వీరి రచనలలో సాఁబాలు నాక్రమించుచున్నవి. కనుక వానిని వేఱు వేఱు సంపుటములుగా ముద్రించితిమి

తుమ్మలవారి ఖండకావ్యములన్నింటిని మఱి రెండు సంపుటములుగా వింగడించి ప్రచురించితిమి. వారి కైతలోని క్రమవికాసము తేటపడుటకు వీలగు విధమున ఆ ఖండకావ్యములను కాలానుపూర్విగ కూర్చి వెలువరించితిమి. ఇట్లు వారి రచనలు మొత్తము నాలుగు సంపుటములుగ తేఱినవి. మొదటి సంపుటము - ఆత్మకథ, రెండవ సంపుటము - మహాత్మకథ, మూడవ సంపుటము - ఖండకావ్యములు, నాలుగవ సంపుటము - ఖండకావ్యములు.

ప్రచురితములైన వారి తొలి రచనలలో 'నామదేవచరిత్రము' అను హరికథ లభింపలేదు. రామశతకము, రామలింగేశ్వరశతకము, మహాత్మాగాంధి తారావళి, రామకృష్ణస్మృతి, మాహేంద్ర జననము - అను గ్రంథముల నెట్లో సంపాదించి ఇందు చేర్చితిమి.

చక్కని చిక్కని తెనుఁగుదనము తొణికిసలాడు తుమ్మలవారి కవిత్వమును ముద్రించు పట్టున ప్రూఫ్ సరిచూచుట పండితజనైకసాధ్యము. ఈ నాలుగవ సంపుటమునకు ప్రూఫ్ సరిచూచిన శ్రీయుతులు పరమాత్ముని దత్తప్రసాద్, జి. వైదేహి, పాపినేని శివశంకర్, నాగభైరవ ఆదినారాయణ, చింతపల్లి సత్యనారాయణగార్లకు కృతజ్ఞత వెల్లడించు చున్నాము.

ప్రచురణలో తమ అమూల్యమైన సలహాలనిచ్చి తోడ్పడిన సుప్రసిద్ధ విమర్శకులు శ్రీ నాగళ్ళ గురుప్రసాదరావు గారికి, శ్రీ సూర్యదేవర రవికుమార్ గారికి, విద్వత్కవులు శ్రీ యార్లగడ్డ వెంకటసుబ్బారావు గారికి, కవివతంసులు శ్రీ కొల్లా శ్రీకృష్ణారావు గారికి, శ్రీ తుమ్మల శ్రీనివాసమూర్తి గారికి ధన్యవాదములర్పించుచున్నాము.

సంపాదకులు

గుంటూరు
24-12-2001

పులిచెర్ల సుబ్బారావు
వెన్నిసెట్టి సింగారావు

# తెనుఁగులెంక శ్రీ తుమ్మల సీతారామమూర్తి
# జీవితం - కృతులు

**జననము** : 25-12-1901, కావూరు, రేపల్లె తాలుకా, గుంటూరు జిల్లా; తల్లిదండ్రులు చెంచమాంబా నారయ్యలు; **కుటుంబము** . 1930లో శ్రీమతి అన్నపూర్ణమ్మతో వివాహము. ఒక కుమార్తె, నలుగురు కుమారులు. **గురువులు** : శ్రీయుతులు కావూరి శ్రీరాములు, జాస్తి సుబ్బయ్య, తాడేపల్లి వేంకటప్పయ్యశాస్త్రి, దువ్వూరి వేంకటరమణశాస్త్రి, విద్య : ఉభయభాషా ప్రవీణ (ప్రథమశ్రేణి), ఆంధ్రవిశ్వవిద్యాలయము - 1930; **వృత్తి** : సేద్యము, తరువాత అధ్యాపనము; 1924-29 తిలక్ జాతీయ పాఠశాల - కావూరు, 1930-57 గుంటూరు జిల్లా బోర్డునందలి దుగ్గిరాల, బాపట్ల, నిడుబ్రోలు, అప్పికట్ల - ఉన్నత పాఠశాలలు, 1920-30 కాంగ్రెసు సేవ, శిక్ష - 1922.

**అభిమాన విషయములు** : గ్రామజీవనము, గాంధీతత్త్వము, సర్వోదయము, ఆంధ్రాభ్యుదయము, తిక్కన కవితామార్గము, చిన్నయసూరి సిద్ధాంతము

**కృతులు** : **గాంధీకావ్యాలు** - ఆత్మకథ, మహాత్మకథ, అమరజ్యోతి, సర్వోదయగానము, గాంధీగానము, మహాత్మాగాంధీతారావళి. **రాష్ట్రకావ్యాలు** - రాష్ట్రగానము, ఉదయగానము. **ఖండకావ్యాలు** - పఱిగపంట, పెద్దకాపు, శబల, పైరపంట, సమదర్శి, కదంబకైత, చక్కట్లు, దివ్యజ్యోతి. **కథాకావ్యాలు** - ఆత్మార్పణము, ధర్మజ్యోతి. **సామాజికకావ్యాలు** : ఎక్కట్లు, సందేశ సప్తశతి. **స్వీయచరిత్ర కావ్యాలు** - నేను, నాకథలు, తపస్సిద్ధి. **వేదాంతకావ్యాలు** - గీతాదర్శము, భజగోవిందం, లక్ష్మీనృసింహస్తోత్రము, హనుమాన్‌చాలీసా **నీతికావ్యాలు** - తెనుఁగునీతి, నీతికుసుమము. **స్మృతికావ్యాలు** - రామకృష్ణస్మృతి. **శతకములు** - పురాంతకశతకము, రామ శతకము, రామలింగేశ్వరశతకము. **జంగంకథలు** - బిల్హణీయము. **నాటకాలు** - గిరిజా పరిణయము, హనుమద్విజయము, మాహేంద్రజననము. **హరికథలు** - అన్నదాన మహాత్మ్యము, సాత్రాజితీ పరిణయము, నామదేవచరిత్రము.

**సమ్మానములు** : 1949 నిడుబ్రోలులో - గజారోహణము, గండపెండేరము, కనకాభిషేకము, సువర్ణకంకణము. 1960లో అఖిల భారత తెలుగు రచయితల మహాసభ సత్కారము. 1967లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ విశిష్ట సభ్యత్వ ప్రదానము. 1969లో కేంద్ర సాహిత్య అకాడమీ బహుమానము, ఆంధ్ర విశ్వవిద్యాలయము "కళాప్రపూర్ణ" బిరుదుతో సత్కారము. 1985లో నాగార్జున విశ్వవిద్యాలయము "డాక్టర్ ఆఫ్ లెటర్స్ (డి.లిట్)" బిరుదుతో సత్కారము. విశాఖ పట్టణములో సహస్ర చంద్రదర్శన మహోత్సవము. నెల్లూరు, అప్పికట్ల, ముక్త్యాల, తెనాలి, గుడివాడ, మద్రాసు, గుంటూరు, విజయవాడ మొదలగు తావులలో 1987లో గుంటూరు, విజయవాడ పట్టణాలలో భారత ఉత్సవాల సందర్భంగా ఘనసన్మానం.

**జయంతి మహోత్సవములు** · 1952 నుండి పెక్కుచోట్ల

**బిరుదులు** : ఇతరుల దృష్టిలో "అభినవ తిక్కన", తన దృష్టిలో "తెనుఁగులెంక"

**నిర్యాణము** . 21-3-1990 అప్పికట్ల, బాపట్ల తాలుకా, గుంటూరు జిల్లా

# తెనుఁగులెంక సమగ్రసాహిత్యము
# నాలుగవ సంపుటము నందు
# ప్రచురింపబడు ఖండకావ్యములు

పేజీలు

# పైరపంట

## విషయ సూచిక

# రెండు మాటలు

పునాస పంట, పైరపంట - అని పంటలో రెండు తెగలు కలవు. ఇంచుమించు పునర్వసుపుకార్తెలో విత్తన విత్తినములపంట పునాసపంట. (పునర్వసువు శబ్దభవమే పునాస). ఇది సంవత్సరమునందలి పూర్వార్ధమున ఫలించును. ఉత్తరార్ధమున వానలు తగ్గిన వెనుక 'పైర' గాలిలోని తేమతో పండెడి పంట పైరపంట. 'పయిర' రూపాంతరమే 'పైర'. ఇది దక్షిణపుగాలి. (పైరుగాలి, పైరు నూవులు - అని కొందరనుట చింత్యము). నా మనుగడయం దుత్తరార్ధమున సాగిన ఖండకావ్యములే ఈ సంకలనములో నున్నవి. కాన దీనికి 'పైరపంట' అని పేరిడితిని.

ఈ రచనయందును నా లాఁతికృతులయందును 'గోంగుర' అనుమాట కలదు. ఇది శాస్త్రమునకు లొంగని పలుకు. ఐనను బలీయసియగు రూఢింబట్టి యంగీకృత మయినది. అంగీకార్యము కాదేని దీనిని 'గోంగూర' అని చదువుకొనవచ్చును. ఈ రూపమునకు వ్యాకరణ మియ్యసేయును. అర్థవ్యక్తికిని 'గోంగుర' అన్నది ప్రతికూలము కాదు. 'పేఁట' మున్నగు శబ్దముల రూపాంతరము లిట సమీక్షింపఁదగిన వనుకొందును. మఱియు 'లోపడు' 'లోఁబడు' - అనువాన మొదటిదే సాధువు.

ఇందలి సంక్రాంతి ముచ్చటలు, వరినాటు, జడికారు, దేశరక్షణ, స్వతంత్రభారతి, చిక్రోడపంచదశి- అనుముక్కలు 'ఆకాశవాణి' వారి సౌజన్యముతో వెలువరించితిని.

తమ నిర్వహించు 'విద్వత్ప్రవేశ పరీక్ష' కీ కృతినొక పాఠ్యముగా నియమించి నన్ను సంభావించిన ఉస్మానియా విశ్వవిద్యాలయమువారికి నా కృతమెఱుక చెల్లించు చున్నాఁడను.

తెనుఁగులెంక

# ప్రేమాంకము

క. శ్రీ 'వెలువోలు' కులోదధి, జైవాతృక ! సజ్జన ప్రశంసితచరితా !
కోవిద కవి మండల గో, ష్ఠీ వికసిత హృదయపద్మ ! సీతారామా ! 1

క. బంధుత్వము హేతువుగా, సంధిల్లినకూర్మి కొనలుసాగెను మనకున్
గాంధేయధర్మపథ నిర్మంథర సంచరణ తత్పరత్వముకతనన్ 2

ఉ. మాటికి మాటికిన్ జెఱల గ్రుగ్గుచు స్రగ్గుచు నీవు బాపుజీ
బాటను బొచ్చుచున్ బ్రదుకుఁ, బ్రన్నఁదనమ్ము గడింప, నచ్చమౌ
మాటకుమాటకున్ జెఱల, గ్రుగ్గుచు స్రగ్గుచు నేను బాపుజీ
బాటను మెచ్చుచున్ బ్రదిమి. ప్రన్నఁదనమ్ము గడింపఁ జాలితిన్ 3

ఆ. గద్యపద్యసృష్టి కావించి నీవును, జేసినాఁడ వాంధ్రిసేవనమ్ము ;
ఉచిత శైలి వెలయ రచియించినట్టి నీ, 'ప్రేమ' కావ్య మది సుధామయమ్ము 4

గీ. నిరవధిక సాహితీ పయోనిధిని ద్రచ్చి, యమృతమును దీయ నేర్చె మీ యమృతలూరు;
త చ్చిరంతన కీర్తిపతాక నిలుపఁ, గల వలంతులయందు నొక్కరుఁడ నీవు 5

ఉ. నా కవితాసరస్వతి ననర్ఘ సువర్ణ మహాభిషేక సు
శ్రీక నొనర్పఁగాఁ బగలు రేలు నలంగినవారికెల్లఁగ
న్నా కయి నీ వహెూ! నిలిచినాఁడవు నాఁడు; తదీయసంస్మృతుల్
నాకు నిరంతరమ్ముగ మనమ్మునఁ, గ్రమ్ముకొనున్ సుహృన్మణీ! 6

ఉ. ఆ మధురానుభూతి కతమై, పచరించిన మామకీన నా
నా ముఖ ఖండకావ్యరచనమ్మునయందిది పైరపంట; ధ
ర్మామృతపూరవర్ధితము నక్షరరూపము నై తనర్చు నీ
శ్రీ మెఱయింప నెంచితి విశిష్టమతీ! భవదంకితమ్ముగన్ 7

ఉ. ముందుగ నేతదీయమగు ముచ్చట నీకడఁ దెచ్చి సమ్మతిం
బొందమి కన్యథా తలఁపఁబోకుము! కబ్బము నిచ్చుపట్ల నా
చందము నీ వెఱుంగవొకొ సాధుజనస్తుతశీలలుబ్ధమున్;
సందియ మేల మే లని రసజ్ఞులు మెచ్చఁ గృతిన్ గ్రహింపవే! 8

ఉ. నాలుగు కోట్ల తెన్గులు వినన్ గవితన్ వినిపింతుఁ గాని యా
నాలుగుకోట్లకున్ నిను మనస్విమణిన్ బ్రతిఁగా గణింతు; నీ
మేలిమి తెల్గుభారతపుమేలిమి నిల్చినదాఁక నిల్చు; న
న్నే లినయట్టి వాణికృప యిట్టి దటంచు వచింతు నమ్రతన్. (9)

# పైరపంట

## సంక్రాంతి ముచ్చటలు

### గీతమాలిక

ఏమి సుబ్బయా! మీవార లెపుడు లేచి, యెపుడు చేసిరి యీపను?-లపుడే కమ్మ
కమ్మగా సాగె మీ యింట గారెముక్క, లుడుకువాసన-యీ రాత్రి నడుమువాల్చి
నట్లె తోఁచుటలేదు మీయాఁడువారు!-ఎన్ని మ్రుగ్గులు!-తోరణాలెన్ని!-యెన్ని
యెన్ని పూలదండలు!-పండుగెల్ల వచ్చి, నీటుగా నేఁడు మీయింటఁ బీఁటవెట్టి-
గోఁటుగా నేఁడు మీయింటఁ గొలువుదీరె 1

*　　　*　　　*　　　*

రావయా! రామభద్రయా! రాక రాక, వచ్చితివి మంచివేళకే!-బాగు! బాగు! -
బల్లమీఁదఁ గూర్చుండుము!-పనులు తేలి, వచ్చెనా?-పాఁడి కలదుగా?-బావగారు
తిందు రొకపట్టుగారెలు తెచ్చి పెట్టు, మోసి-జానకీ !-గిన్నెకుఁ బోసి నేయి
కూడఁ గొనితెమ్ము-భద్రయా! క్రొత్త చోటు,గాదు-కానిమ్ము-వెనుకాడఁగాఁ బనేమి? 2

*　　　*　　　*　　　*

చాలు నిఁకఁ జాలు సుబ్బయా ! చాలు-నాది, కడుపు గాని చెఱువు కాదుగద?-బలే తె
గింపుచేసితి - వౌనులే ! గింజ లెస్స, రాలె నీ యేఁడు నీ-కహెూ ! నాలుగైదు
కట్టితివి పెద్దపురులు-సంక్రాంతిసిరులు, సర్వమును నిన్ను ఁజేరె-నుత్సాహమునకు
నెట్టికొఱంతయు లేని నీ విపుడు లక్ష, విందు లైనను జేసెద వందఱకును 3

*　　　*　　　*　　　*

కాదు భద్రయా! దైవము కలసివచ్చి, జాయవానలు కురిసె నీ సాలునందు-
విసమువంటి తప్పుడుగాలి విసరదాయెఁ-జలియు నెండయు వాలుగా సాగె-మఱియుఁ
బంటకాల్వల మురుగుకాల్వలను దీర్చి, మంచివిత్తుల నెరువులఁ బంచిపెట్టి
నాటునకుఁ దగ్గసూత్రముల్ తేటపఱిచి, తెగులు నరికట్టుమందులు తెచ్చియిచ్చి
యల్పమైన వడ్డీలకు నప్పు లొసఁగి, దొరతనమువారు పెక్కురీతులను సేద్య
గాండ్రకున్ దోడుపడినారు గానఁ బంట, గొప్పగాఁ బండెఁ - దొండలు గ్రుడ్లు పెట్టు
పొలము లీనాఁడు బంగారుభూము లయ్యె-నొడలు వంచి కష్టించుట కొప్పుకొనని
సోమరుల చేలసంగతి కేమిగాని, చెమ్మటోడ్చి భూదేవిని నమ్మికొలుచు
కాఁపులపొలాలు వరహాలకాపు గాచె-వెనుక నెకరాన కొకపుట్టి ఘనము గాని
యిప్పుడో రెండుపుట్లైన నేమి గొప్ప?-యెంతకాలము తెల్లవాఁ డేలలేదు?-
నాఁడు మనకిట్టిమే లొనగూడెనా?-మ, హాత్ముఁ డాగాంధిగారిపుణ్యాన యుగయు

గాల పాపము లన్నియుఁ గూలి కూలి, బానిసముద్రాడు తెగి పీడ వదలి వచ్చె
దేశమునకు స్వరాజ్యము-దిక్కు మ్రొక్కు, లేనిపల్లెల నొక పొంగు కానిపించె 4

* * * *

నిజము నీ వన్న దంతయు నిజము-కాని, సుబ్బయా! గోదకుఁ బునాది శూన్యమయ్యెఁ-
బంట పెరిఁగె - నూరూరను బారశాల, పుట్టె - బాటలేర్పడె - బారు బూరు మనుచుఁ
బరుగుదీయుచునుండెను బస్సు-లింట, నింటఁ దళతళలాడుచు నెగసె మెఱపు
దీపములు-లోపములు పెక్కు తీఱెఁ-గాని, నీతినియమాలు దిగజాఱె జాతిలోనఁ-
బొలము పండినఁ జాలునా?-బుద్ధికూడఁ, బండవలయుఁగదా; - తనబాగు తప్ప
నిరుగుపొరుగువారల బాగు నెంచువాఁడు, చిక్కు నా నేఁడు నూటికి నొక్క డైనఁ?-
బట్టణాల సరే!-మనపల్లెలందు, నెంతస్వార్థము!-తలబిఱు సెంతపెరిఁగె!-
నెంతయీసు!-దురభిమాన మెంతరేఁగె!-, నెంతకుట్ర!-యసత్య మ దెంత హెచ్చె!-
నేగతికిఁ బోవునో దేశ-మిది యధర్మ, మనిన పెద్దలమాటకు నావగింజ
పాటివిలువయు లేదాయెఁ-బల్లెపల్లె, కేర్పడె మురాలు నాలుగై-దేమి బావు
కొనుటకో చిన్న పదవికిఁగూడ వేలు, కుమ్మరింతురు మొనగాండ్రు కొంద్ర నమ్మి-
కూటికిని గుడ్డకును లేక గోడుగుడుచు, పేదవంక కుఁ జూదరు-వీరియందు
లేదు దయ-లేదు ముంజూపు-లేదు ప్రేమ-, లేదు వినయము-లేదు మర్యాద-లేదు
పాపభీతి-యీమూఁకను బాగుపఱుచు, నాథుఁ డెవ్వఁడో తెలియక బాధపడెద 5

* * * *

భద్రయా! నాకుఁగూడ నీ బాధ కలదు-, కాని మన మేమి సవరింపఁగలము?-నేఁటి
యాగడము లాఁప భావేమహర్షివంటి, వారె సతమతమగుచున్నవారు-నూఱు
చట్టములు వచ్చినను మాఱునట్టి తెగులు, కాదు కా దిది-కాల మొక్కటియె చక్కఁ
జేయవలయును దీని-నమ్మాయి! జాన, కీ! యెచట నుంటివో యింతపాయసమును
దీసికొనిరావె! బావకు-దీనిఁగూడ, భద్రయా! పుచ్చుకొను-మావుపాలతోడ
వండి రీపాసెమును-మాకు రెండు కోడె, దూడ లీయేఁడు పుట్టెను-జూడు మవిగొ!-
జంటమెడ ముద్దమూఁపుర మంటుబొడ్డు, ముట్టెకుఱుచ గుజ్జుపుగిట్ట పొట్టితోఁక
వెన్నుబారు కాటుకకన్ను చిన్న చెవులు, వెల్లవన్నెయు జోడుగా వెలసి దూడ
లచ్చముగ రామలక్ష్మణులట్లె యుండుఁ-గోరతలకట్టు వచ్చెనా కోరఁదగిన
కవలికలు వీని కిం కేమి కలవు చెపుమ!-వామిదిబ్బను బూచిన బంతిపూల
నెల్ల మా పిల్ల లీజతకే యలంక, రించినారయా! - యివి కాఁడిక్రింది కెపుడు
వచ్చునో భాగ్యములు పండివచ్చు నపుడు, 6

* * * *

మంచిమాట వింటిని-మఱి మాఖమాస, మందు మనజానకికి వివాహమును జేయు
దృష్టిలో నుంటివా?-తగ్గ యీడుకూడ, వచ్చెఁగా? పిల్లదాని-కేవంకనైన
నైనసంబంధ మున్నదా?-యదియు నిదియు, నడిగితిని సుబ్బయా! కోపపడెదవేమొ! 7

*　　　*　　　*　　　*

బెదరకుము! తప్పు లేమిచెప్పితివి?-కాని, మాటలా యాఁడుపిల్లకు మనకుటుంబ
ముల వివాహము? భద్రయా! పొలము నగలు, కానుకలు కట్నములు హద్దులేనిఖర్చు
లెన్నియో చూడవలెఁగదా!-మన్ను మిన్ను, బోరుకొనునట్లు కట్నాలు పుచ్చుకొనుట
తగ దనుచు నుపన్యాసాలు దంచినట్టి, దేశభక్తులే, చట్టాలు తెచ్చినట్టి
పెద్దలే చాటుచాటుగా బిడియ మూడ్చి, బిఱ్ఱబిగిసి తెగించి మాపిల్లవాని
కెకరమునకు రెండెకరాల ని మ్మటంచు, విద్యకై కొస రొక పదివే లటంచు
బేరములు చెప్పసాగి-రీ పెండ్లిచదువు, కూటికా గుడ్డకా-యున్నకొండ్ర నమ్మి
యెదురుపెట్టి యుద్యోగము లీడ్చువారి, బ్రదుకు నెవ్వరెఱుంగరు?-పిదపబుద్ధు
లేర్పడెన్ బ్రజ-కీదాహ మెట్టు లున్న, మంచిమనువు కావలెఁగదా!-మాకు నైన
వారిలో జతపడుకుఱ్ఱవాఁడు లేఁడు, వాడవాడల మే మాడనాడఁ గొన్ని
జాడలను దీసితిమి గాని సంప్రదాయ, మున్నవియ్యము తగులలే-దెన్ని లక్ష
లాస్తి యున్నను గుణగణా లమరనపుడు, నేను దలయూఁపఁజాల-నే మౌనొ కొసకు 8

*　　　*　　　*　　　*

కథ యిదా? చెప్పినాఁడవుకావు-నీకుఁ, దగిన యల్లుఁడు మా పినతల్లికొడుకు
కలఁ డయా!-నేఁటి చిలిపిపోకడలు వాని, కంటలే-దెంతచదివిన నతఁడు పొలము
పాటు మానఁడు-వేషాలనీటు మరగి, కులుక నొల్లఁడు బురదనాఁగలియు దున్ను
నప్పసము సేద్యగాఁడుగా నందఱకును, మంచివాఁడుగా మెలఁగును-మా గిలియును
మెట్టయును నాలు గరకల గట్టికొండ్ర, వాని కున్నది-పదివేలు వడ్డిమీఁద
నడుచుచున్నవి-బలఁగ మెంతయును గలదు- పెద్ద లోఁగిలి కలదు-నీయొద్ద మిగులఁ
బుచ్చుకొనువాఁడు కాఁడు-నీబుద్ధి కితఁడు, నచ్చు ననుకొందుఁ-జూచిరావచ్చు నీవు 9

*　　　*　　　*　　　*

మంచివార్త చెప్పితివి-నీమాట చాలు, భద్రయా!-దైవ మనుకూలపడిన జనుము
మినుము గట్టెక్కినంతనే మనము నిశ్చ, యించుకొందము లగ్నము-నిదిగొ! మఱచి
నాఁడ నొకటి-జానకిపెండ్లినాఁడు పులుసు, ముక్కలకు వచ్చుఁ గాని మీ మూలచేని
గట్టుమీఁదను గుమ్మళ్లు కాచెనంట, దాఁచిపెట్టు ముహూర్తముదాఁక నాల్గు
మంచిపండ్లు-నా మాటలు మఱచిపోకు! 10

# వరినాటు

## గీతమాలిక

నారుపిడి ఋవ్వఁగా నది నాటుచున్న, చేతి కల్లంతలో వచ్చి చేరవలయు-
నింతదూరాన వేసితి వేమిబలిమి?-, యింత బురదను బూసితి వేమి తెలివి?-
ముసురు చినుకుల కీతడి కొసరు కాఁగ, సాగి వచ్చెడిచలి నెట్లు విప్పఁగలను-
చప్పుచప్పునఁ బిడి నెట్లు సైఁపఁగలను-, సిల్కుచొక్కా జరీపంచె జేబుగుడ్డ
యేసపాపట గొఱెతోఁకమీస ముంగ, రాలజోడు బంగారుగుండీలు సోకు
లెన్ని యో దిద్దితివి గాని చిన్నమంత, యెఱుఁగ వైతివి పనితీరు-సరస మన్నఁ
దెలియదా యేమి? రుసరుసల్ మొలకలెత్తె, నయ్యగారి మొగాన-వెంకయ్యనాయఁ
డా! నిదానింపు-మీ యేఁడె మేనమామ, కల్లుఁడవు నైతినంట!-యాయమ్మి చదువు
కొన్నదంట!-శ్రావణములోఁ గ్రొత్తకాఁపు, రమ్మునకు వచ్చుతంట! యారాణితోడ
నెంత చక్కగా సంసార మీఁదఁగలవొ, యింతతిక్కగా నాటువేయించు నీవు 1

* * * *

ఓసి! నీతస్సదీయ! నిన్ జేసికొన్న, మగఁ డెటుల్ వేఁగుచుండెనో-మాట లిన్ని
యెపుడు నేర్చితివే?-వెన్క నెవరొ కేక, వేయఁగా నటు చూచుచు విసరినాఁడఁ
గాన గుఱిదప్పినది నారుకట్ట-దీని, కింతరగడ చేయుదువటె!-యిల్లుదిద్దు
వగలు చాలనినాఁడు నీమగని నడిగి, పారములు నేర్చుకొందులే!-ప్రక్కమునుము
చూడు మెక్కడనున్నదో-సుద్దులిఁకను, గట్టిపెట్టవె సుబ్బులూ-వట్టి మూఁగ
నాటువేసెద వుయ్యాలపాట పాడ, లేవె-తుమ్మెదపాట రాదా-వరాలు
"రామగోవింద" పాట సూరన్నగారి, పంపులో నెంతహొయలుగాఁ బాడుచున్న
దో వినుము-కోకిలమ్మగొం తేవిధాన, దాని కబ్బెనో-నీవైనఁ దక్కువా?-ప
సందుగాఁ బాడెదవు-బలే! చందమామ, పాట నీనోట వెన్నెలతేటవోలె
వెదలుచున్నది-మేఘాలవెంటఁ బోవు, పక్షు లాఁగెను జూడు నీపాట వినఁగ-
గట్టిదానవె!-సరిగాని గట్టుమీఁద, మూఁగినవి కాకు-లన్నపుమూట నచట
దాఁచివచ్చితివా?-పోయి చూచిరమ్ము!, పగటిబువ్వకు శనిగాఁడు పట్టుకొన్న
జాతిపోదువు నూకలజావరీతి 2

* * * *

అమ్మయో! కొంచె మాలస్య మైనఁ బుట్టి, మునిఁగిపోయెడిదే!-యుక్కు ముక్కు మూఁక
లివి దొరా! కూటిమూటపై నిడినబరువు, లన్నిటిని ద్రోసివేసె-నీ కన్ను లెంత
మంచివో యిటు పడె-నారుమడికిఁ గంచు, కోటగా నున్న గోఁగులకూర గిల్లి

తగినయా కేఁతి యేర్చి గుత్తముగ వండి, యెత్తునకు నెత్తుగా నూనె యెళ్లగడ్డ
చేర్చి తాలింపు పెట్టి చేసేత నన్ను, మునకు నిబ్బడి ముబ్బడి మూటఁగట్టి
తెచ్చుకొని రుచులూరఁగాఁ దినుట యెప్పు, డెప్పుడా యని నే నెదురెదురుచూచు
చుండఁగా దాపరించె నీవండ దీని-కింతదిగుచున్న దేమి చే?-నెన్ని చాళ్లు
దమ్ము చేయించితివి?-గుండెదడయు రొప్పు, వచ్చె నటు నిటుఁ బరుగెత్తి వచ్చుసరికి-
నైన నేమిలే! నీ చల్వ నారగించు, పద్దు నా కుండెఁ-బేదలు పగలు రేయి
నలియగుట పొట్టకేకదా!-నాగిరెడ్డి, గారిజన మదే దిబ్బకుఁ జేరెఁ-బ్రొద్దు
తిరిగెఁ బడమటి-కాఁకలిదీఱ మేము, నింత తిందుము-మీయమ్మ యేమి వండి
పంపెనో నీవుకూడ సాపడఁగదయ్యా! 3

* * * *

దాపులో నున్న నేమిలే! తప్పు లేదు-, బెదరకుము-గాంధితాత చెప్పినదివినవె?-
యంటుదోసము లేదు నేఁ-దచట నచట, దేవళములను మీకును దెఱచి-రంత
దూర మేల-మా పెద కాఁపుగారియింట, వండి వడ్డించుపిల్ల మీ బావకూఁతు
రంజి కాదటె!-యే మాయె నచట నంటు?-, పెద్దపిన్న కులాలకుఁ బెండ్లిపొత్తు
కూడ సాగిన-దిం కేడఁ గులము గిలము?-మొదట లేదంట! తరువాత మొలచెనంట!
కులము-కుల మేటికే చెప్పు!-గుణముచాల, దందువా?-యొక్క మనదేశమందుఁ దప్ప
నెక్కడను గానరావంట యీకులాలు, హెచ్చుతగ్గులు నీలుగు లీసడింపు-
లీశ్వరునిబిడ్డలేకదా యెల్లవారు?-, వీరిలో నిన్ని తేడాలు వింగడాలు
నుండవచ్చునా?-మంచివా రొక్కకులము, చెడ్డవా రొక్కకుల మని చెప్పవచ్చుఁ-
గానిచో వాన కెండకు నాని నవసి, తెక్క లాడించి బ్రతుకువా రొక్కకులము
బొజ్జ లెగఁబెంచు సోమరిపోతు లొక్క, కులమునని చెప్పవచ్చు-నీపలుకునందుఁ
దప్పు లే దని జగమెల్ల నొప్పు-గాని, పుట్టుకనుబట్టి కుల మంటఁగట్టుతీరు
మంచి దని మెచ్చునా?-యొకమ్రానియందె, కొన్ని తియ్యనికాయలు కొన్ని చేఁదుఁ
గాయ లేర్పడుచుండ నీకట్టులోని, కులములం దొకదానిలో గొప్పవారె
యూడిపడుదురా?-యొకదాన నుత్తనీచు, లే జనింతురా?-యీతీర్పు నెవఁడు నమ్ము?-
నాయమా యిది?-యీపురాణమున కేమి, గాని సుబ్బులూ! మాదోసకాయపప్పు
కొంత రుచిచూతువా?-కాయగూర లెన్ని, యెంతకమ్మగా వండిన నేను దీని
కిష్టపడినట్లు పడఁజాల నితరమునకు-, నేమె! మఱికొంత వడ్డింతు-నేల తిండి
యొద్ద మొగమోట-మీమూల నుండె నావ, కాయముక్కయు-నిదికూడఁ గలిపికొనుము-
బువ్వ చాలనట్లున్నదే?-పొట్టనిండఁ, దినుము-మాయమ్మ యొకని కంపినది నలుగు
రైనఁ దినవచ్చుఁ-జాలునా?-యన్న మెట్టు, లుండె?-సన్నాలుమావి-మాతిండి కెపుడు

వీనినే వాడుకొందుము-కాని మరకుఁ, బంప మేనాఁడు-మరకూడు పడదు మాకు-
ముదుకగా దంచెదము-దౌడఁ గదపి నమలి, తిననఁ దియ్యగా నుండు నీతిండి-యింకను
నేనుఁ దినియెద-నీ దుత్తలోన వలసి, నన్ని చిక్కనిమజ్జిగ యున్న-వొకటి
రెండుదోసిళ్ళు పట్టు-మా వండునీరు, ముట్టనేల బోలెఁడు చల్ల మూల్గుచుండ 4

* * * *

చిన్నయా! దొడ్డవిందు చేసితివి-రుక్మి, ణమ్మతల్లి వండినవంట కమృతమునకు
భేదమే లేదు-నీ పుణ్య మేదొ పండి, పుట్టినాఁడ వాదొరసానిబొజ్జయందు-
నబ్బ! యూపిరాడదు-పొట్ట యుబ్బుచుండె-, వంగి చే నెటు లూడ్చెద-రంగమా! మ
తింతయొదుపు సాగింపు-మిం కెంతప్రొద్దు, కలదు?-మిన్నెళ్ళువాతె-మాయలకుమనకు
నెఱుక లే-దంచుగలిపి చేతెఱపి లేని, తీరులో మొక్క వేయుము-తీర్చి నూలు
పట్టిన ట్లుండవలెఁ జాళ్ళు-పదుగు పేక, యెగుడుదిగుడుగా నూడ్చుట తగదు-మొన్న
బాపనయ్యపొలాన జపానునాటు, నాటిన ట్లుండవలయు-నో నాగమక్క!
కలవు కాసరగాయ లాకాల్వలంక-, లేఁత ముదురులు చూచి గాలించి నాల్గు
గుప్పిళులు మంచిమంచివి కోసితెమ్ము-, బుచ్చిదొరకు నిదే మనమిచ్చు కట్న -
ముప్పి వార్చి తిరుగఁబోఁత గుప్పి దీని, నమ్మ వడ్డించినప్పు డోయయ్య! నీవు
మఱలమఱలఁ గోరెద-విది మంచికూర-, గౌరమా' నాటు ముగిసె-నానారుపిడిని
దీసికొని రావె యీశాన్యదిశకు-నచటఁ, బెట్టవలెఁ బంటమూన-తబ్బిబ్బుపడక
కమ్మగాఁ బాటపాడి వెంకయ్య బాబు, పేరు సెప్పి దీవింపవే-బిడియమేల 5

* * * *

మునుములను దీర్చి నాటిన మొక్క లెల్లఁ, దేఱుకొని పచ్చమూనకుఁ దిరుగవలయు-
నెందుముఱుగులు లేక చే నెదుగవలయు-, వేయికట్టులుగా దుబ్బు విరియవలయుఁ-
జిత్తలోఁ జిఱుపొట్టకుఁ జేరవలయుఁ-, దోదుతోదుగఁ బోటాకుఁ దొడుగవలయు-
సుంకుమోయుచు నందాలు చూపవలయు-, మడమతా లూఁచతెఱ మచ్చ మానుకాయ-
పొలకువలు లేని కాపుతోఁ గులుకవలయు-, జంపుగల కంకితో నఱ్ఱు పంపవలయు-
వలి ముదిరి ముగ్గఁబాఱి కై వ్రాలవలయుఁ-, బాయ కొకపుట్టి రాజనాల్ పండవలయు-
మూలమూలకు నొకకుప్ప తేలవలయు-, సందడిగఁ బొలికేకలు సాగవలయు-
మేరువో యన మేల్ రాసి మెఱయవలయు-, దేవతలపేరఁ బొంగళ్ళు తీరవలయు-
బిచ్చగాండ్రకు సంతోష మెచ్చవలయు-, బహుమతులతోడఁ బాలేరు బలియవలయు-
నేపుగల వెల్లగుఱ్ఱము నెక్కి పొంగి, కాఁపు ధాన్యపుబండ్లతోఁ గదలవలయు-

మందువాగాదెగంపల నిండవలయుఁ-, జిన్న దొరసాని జలతారుచీర గట్టి
రంగురంగుల తాపితారైక దొడిగి, సొగసుగా నేడువారాలనగలు దాల్చి
నాయనిమనస్సు కరఁగించునడత నేర్చి, యిరుగుమేలు పొరుగుమేలు నెపుడు కోరి
కనుల కల్లారుముద్దుగాఁ గడుపుపండఁ, బసపునిగ్గులు కుంకుముపసలు వెలయ
వేయికాలాలపాటు జీవింపవలయు 6

*         *         *         *

ఎపుడు నేర్చెనె గౌరమ్మ యింతపెద్ద, పాట!-యిది పెద్దదే కాక తేట తేట,
తియ్యతియ్యనిబాసలోఁ దీరి ముద్దు, ముద్దుగా నెన్నియొయ్యారములను జూపు
చున్నదో కంటివా?-గౌరి సన్నసన్న, కంఠమున మంచిరాగానఁ గలిపి తగిన
కుదిలికలు గూర్చి దీనికిఁ గ్రొత్తగ్రొత్త, ప్రాణములు దెచ్చె-మాసూలుపండుగమ్మ
యిప్పుడే వచ్చి దర్శన మిచ్చి నంత, సంబరము దెచ్చె మన-కిఁక జాగు మాని
బసవమా! చిమ్మవే! దొరపైకి నీరు-, విసరవే! నారుపిళ్ల సావిత్రి! - చాలు
నాఁపరే! కోడిగాలు-చిన్నయ్యగారు, తడిసి ముప్పందు మాయెలే!-దరికి రండు-
నాయుఁడా! యిది మా పెత్తనాలగడియ-, దక్కు నీలగ్న మేఁదాది కొక్కసారి-
చిలిపిపను లెన్నియో నేఁడు చేయుచుందు-, మలుగ రీనాఁటియల్లరి కయ్య లెవరుఁ-
బెండ్లిని వసంతముగ దీనిఁ బెద్ద లోర్చి, నవ్వుకొనియెద-రవ్వలనాఁటినుండి
వచ్చు వేడుక యిది-మేము వదలరాని, యానవాయితి యిది-యౌను గాని తేపు
దివ్వటీలపండుగునాఁడు బువ్వ పెట్టి, తలకు నొకరూకగా నీయవలయుఁ బంట
మూనకట్నము-తెలియునా-నానగారి, యొరవడిని బట్టి నీవు పేరొందవలయు!-
మెఱవడి యొనర్చి ప్రజ నిన్ను మెచ్చవలయు! 7

**15-9-1961**

# జడికారు

క. వేసవికి దస్సి వసుమతి, చేసినతపమునకు సిద్ధి చేకూరె ననన్
దాసె వియదంచలమ్ము న, వాసితజీమూతశకల మాషాఢమునన్ 1

చ. అది జవరాలికంటికొన కద్దిన కాటుక రేక కైవడిన్
ముదిత లలాటభాగమున మూఁగినముంగురులట్లు సుందరీ
పృథుజఘనాగ్రలంబి యగు పెన్జడవోలె మనోజ్ఞమూర్తియై
పొదలుకొనంగ సమ్మదము పొందిరి కాఁపులు తేఱిచూపులన్ 2

క. నలుగడ నయ్యెడ దళమై, యలమిన చీఁకటియె వెన్నెలై తనరారెన్
పెళపెళ నుఱిమినయుఱుములె, కలకలనాదమ్ములయ్యెఁ గర్షకతతికిన్ 3

చ. కదఁగి జగద్భయంకరముగా వెలువద్దహలాహలంబు నిం
పదరఁగ మ్రింగి విశ్వహితుఁడై నుతులందిన చంద్రచూడున
ట్లిడుములు సైఁచి లోకమున కింతప్రసాదము పెట్టు రైతుమ
న్గడ సఫలమ్ముకాఁగ జడి కారు దిగెన్ దెలుఁగుంబొలమ్మునన్ 4

క. హాలికకన్యలు వర్షా, కాలప్రభురాక కలరి కమ్మనిగీతం
బాలాపించిన లయకున్, వీలుగఁ బింపిళ్లుగునిసెఁ బెంపుడునెమిళుల్ 5

క. చిటిపొటిచిన్కులు పడెఁ బి, మ్మట జల్లులు సాగె నవల మాతంగకర
స్ఫుట పటుధారావళి ను, త్కటమై పెనువాన గురిసి కాల్వలు పఱచెన్ 6

క. వాఁగులు పొంగె నదీనద, వేగం బనిరుద్ధమయ్యె విశ్వశ్రేయో
రాగమున వేల్పు తనకృప, నీగతిఁ బరఁగించె ననిరి వృద్ధులు హాలికుల్ 7

గీ. అంతసెగ(క్రక్కు వేసంగియదటు నొక్క జల్లుతో డించి మహి కహింసామహత్త్వ
నెఱుక చేసిననీ కెవ్వ రీ డటంచు, మెచ్చెఁ గప్పలు వర్ష నామ్రేడితముగ 8

ఆ. బక్క చిక్కియున్న పసరమ్ములకుఁ గప్పు, విచ్చునట్లు బీళ్ళు పచ్చగిల్లె
నొంటిపూఁటపడిన యొసపరిపెయ్య మై, మఱచి పొదుఁగు రేపు మాపుఁ జేపె. 9

గీ. కాఁపుబిడ్డలు మందలకాపు పట్టి, పుంజెలో గ్రామదేవతాపూజ సల్పి
రంబకై పాయసము వండినట్టియవ్వ, తృప్తిపడ రాల్చి రల్లొనేరేడుపండ్లు 10

ఆ. తోఁక లెత్తి కోడెదూడలు బీటిలోఁ, జెంగనాలుకొట్టఁ జిఱుత లుబ్బి
"యాఁగుఁదోసి! కాఁడి కంటఁదీసెదములే, రే" పటంచు హెచ్చరించి రపుడు 11

సీ. ఊపిరాడకపోయె నూరివఁద్రంగికిఁ, బగలు రే నాఁగటిపణతఁ దీర్ప
కళ్ళు చెక్కుడుపాఱ గాల్పుచో నెగసిన, పొగలోనఁ గమ్మరి బ్రుంగువడియె
రేపేమి టని రైతు కోపింప నెట్టెటో, వాతెనల్ గొడగరివాఁడు పెనఁచె
చేతితో నోటితో సెనగవిత్తులు దుల్చి, గాసిల్లెఁ జిన్నారికాఁపువెలఁది

గీ. పలుపు పగ్గాలు సంతనపఱుచుపనికిఁజిక్కి చిడిముడిపడసాగె జీతగాఁడు
కర్షకునిపాట్లు వివరింపఁగాఁ బనేమి, యతనితలమీఁద నుండెఁ గొండంతబరువు 12

గీ. పసపుజగ్గులు కుంకుమపస లెసంగ, నెదురువచ్చిన ముదియవ్వ కెరఁగి కరఁగి
చేరెఁ జేనికి రైతు కోటేరుతోడ, నొత్తుకొను క్రొత్తసేద్యంపు టూపుతోడ 13

ఆ. మేఁడి నదిమి గిత్తత్రాడు చేకొని మహా, యోగివోలె దృష్టి నునిచి కాఁపు
కొంౘ్రవేయ గోటికొసపాటివంక లే, దాయె నతని బ్రతుకునందుఁబోలె 14

క. మెట్టపని పల్లపుంబని, నెట్టుకొనన్ సవ్యసాచినెతి నతఁ డొప్పెన్
పట్టుదల యున్నవానికి, నెట్టన కార్యమ్ములెల్ల నెఱవేఱుఁగదా! 15

ఆ. అలసిసొలసి యింటి కరుదెంచినంతన, కాఁపు మఱచిపోయెఁ గష్టమెల్ల
నింతిసెనరుతోడ నిల్లా లొసంగిన, పాలపాపతొక్కుఁబలుకుతోడ 16

గీ. ఆకుమడిలోని గోంగూర నతివ యెంత, కమ్మగా వండి తీర్చెనో కలిపి కలిపి
యన్న మంతయు దానితో నారగించి, కొసకు గ్రుక్కెఁడు మజ్జిగ క్రోలె రైతు 17

క. సోమరికి క్షు త్తెఱుంగని, గోమరి కైదాఱు వలయుఁ గూరలు; కృషిపైఁ
బ్రేమముగల - పాటుపడన్, గామముగలవాని కొక్క కారమ చాలున్ 18

క. ఆఁకటికంటెను రుచిగల, పాకము కన్పడునె? మడఁకపట్టిన, చెమటన్
జీకిన, వ్రేఁకన కోర్చిన, దూఁకినవారలె యెఱుంగుదురు దానిచవిన్ 19

గీ. తిన్న మెతుకు గొంతుదిగెనొ లేదో గట్టు, గనుము సవరచేయఁ జనియెఁ గాపు
చిగురు తగులకుండ జగడాలు రాకుండఁ, జెక్కి నొక్కి చేనిచెలువు నింపె 20

క. పొడినారుమడికి నీరిడి, కుడియెడమల నొడిసి పిడుల గూఁడులుపొడిచెన్
నడుముబిగి దప్ప హాలికుఁ, దడుసున మోఁకాళ్ళ నిల్చి యాకుం దిగిచెన్ 21

గీ. సాగె నూడ్పులు, బీదలసంబరమ్ము, కదలుకొనెఁ, బ్రాఁతగిలినకోకకు మెఱుంగు
దిద్ది తలదువ్వుకొని కూటిముద్దతోడఁ, గదలెఁ గూలికిఁ బేదరాల్ కన్నెతోడ 22

గీ. మల్లెపూ లుజ్జగిలె నన్నమాటె కాని, కొమ్మలకు నేఁడు కల్గినకొఱత యేమి?
మొగలివిరి విచ్చి ధమ్మిల్లమునకు వచ్చి, కమ్మకమ్మనితావులు కుమ్మరింప 23

ఆ. ఉవిద యోర్తు పాడు నుయ్యాలపాటలో, నలఁత మఱచి రూడ్పునెలఁతలెల్లఁ
దెల్లవాఱియున్న పల్లపుఁజేనిమో, మదిర! పచ్చవాఱె నంత నంత 24

ఆ. చిట్లుచున్న కుసుమచేనిలోఁ గ్రమ్మిన, కలుపు దీయఁ దొడఁగెఁ గర్షకుండు
పగటిబువ్వ దెచ్చు పడఁతియు మునుములో, వంగె నొక్కనాఁడు వరునిసరస 25

ఆ. పుబ్బయుబ్బ కుడికి బుసకొట్టునీటిలో, నడుగు నిలుపలేక జడిసె లేమ
గట్టుఁజేరి “యెంతగాసి కోర్చెద” వని, మగనిఁ గుస్తరించె దిగులుతోడ 26

ఆ. నిప్పుసెగను సైఁచు నీకంటె నీ నీటి, వెట్ట నోర్చు నేను దిట్టనటవె!
అగుదుఁగాక కష్ట మనుభూతమైకదా, కదియు సుఖ మటంచుఁ గాఁపు నవ్వె 27

11-8-1961

# ఆ మంచి రోజులు

గీ. “ఓదొరా! మ్రొక్కు చున్నాఁడ బీదవాఁడ, నన్నుఁ గరుణింపవే! నీవె నాకు దిక్కు
గోఁచి పెట్టిన దాది మీగొడ్లఁ గాచి, యేను ద్రాగెద వేళకు నింతగంజి 1

ఆ. లేకలేక పుట్టె నాకొక్క కూఁతు; రీ, బిడ్డ పెరిఁగి పెరిఁగి పెద్దదాయె
నుప్పు పప్పు చూచి యొకయయ్య చేతిలోఁ, బెట్టవలయు దీని నెట్టులైన 2

ఆ. బుద్ధిమంతురాలు పొదుపరి కనువంక, కాలివంక లేనికన్నె యగుట
నయ్య! నా కొమార్త కనువైనమను విష్టు, సిద్ధమయ్యెఁ బెండ్లి సేయవలయు. 3

ఆ. ఏమి సేయనేర్తు నెఱ్ఱునియేగాని, లేని కటికిపేద నేను దండ్రి!
నీకుఁ జెప్పవలెనె నాకున్న బందార, మేమిబ్రదుకు నాది లేమిబ్రదుకు 4

గీ. పదివరా లప్పుగా నిమ్ము ప్రభువ! వచ్చు, నేఁట ‘ముద్దరసుద్ది’ గా నిదెదసొమ్ము
చలువగలచేయి నీది నీసాయ మున్నఁ, గ్రొత్తగాఁ దోరణము గట్టుకొందు నింట 5

గీ. బాబయా! పెండ్లి నూతేండ్లపంట యందు, రెంతవాఁడను నీచెంత నింత సెప్ప
నన్ను మన్నించి దరిఁజేరు తెన్ను చూపి, నాదిగుల్ తొలఁగించి పుణ్యమునఁ బొమ్ము” 6

ఆ. ఒదిఁగి యొదిఁగి లెంక యొకఁ డొకనాఁ డిట్లు, విన్నవింప సాగె విభునిమ్రోల
దొర గభీరమూర్తి మెఱయ రెడ్డిగముతో, నాలకింపఁ దొడఁగె నతని మనవి 7

సీ. ఇటు నంజ నటు పుంజె నెల్లపంటలు పండ, దిగులెఱుంగని కమ్మతీఁడతండు
కూడుగుడ్డలు లేక కుంటువాఱినపేద, కస్తి నోరువలేనిగే స్తతండు
మొగమోట విడనాడి తగినతీర్పులు సెప్పి, యూరు, పాలెము దిద్దునొజ్జ యతఁడు
నీవంటి మంచిమానిసి లేఁడులేఁడన్న, వాడిచూపు వెలార్చువలఁతి యతఁడు

గీ. మన్నెవా రొనరించినపున్నెమునకు, రూపుగా నప్పికట్లలోఁ గాఁపురించి
పదియునేదేండ్లనాఁ డిహబంధ మూడ్చి, విష్ణుపదముఁ జేరిన రామకృష్ణుఁ డతఁడు 8

ఆ. మౌనముద్ర విడక మందువాలోఁగిట, నమరియున్న పెట్టె నతఁడు తెఱచి
పదివరాలు దెచ్చి పనివానిదోసిటఁ, గుమ్మరించెఁ గరుణ ముమ్మరింప 9

ఆ. మబ్బువిడినచందమామయై మాలని, మొగము విరిసి లేఁతనగవు గురిసె
మఱవరానిమేలు మాకాఁపు చేసినాఁ, డనుచు నిల్లు సేరె నపుడు లెంక 10

గీ. పప్పు బియ్యము కూరలు బట్ట లాకు, వక్క లాదిగఁ బెండ్లికై వలయుసరకు
దెచ్చుకొని చుట్టపక్కాలు మెచ్చురీతి, నాతఁ డొనరించెఁ జిన్నారికూఁతు పెండ్లి 11

గీ. పెండ్లివేడుక లెన్నాళ్ళు పీఁటవెట్టు, నోపఁగారాని లేమిడి కాఁపురములఁ
గడపపచ్చనలో లోటు పడకముందె, యతనిగుండియలో రేఁగె నప్పుపోటు 12

గీ. ఉత్తమగుణంబులకునెల్ల మెత్త యగుట, నతనివేదన చూచి మాలెత కలంగెఁ
బ్రాలుమాలక కూలికి నాలి కేగి, నాల్గురూకలు చేపట్ట నడుముకట్టె 13

గీ. కడుపు నాఁకట్టి వెడపీలికలను జుట్టి, మగువయుం దాను నేఁడాది ముగియులోన
మాటినధనమ్ము పదివరా లౌట యెఱిగి, పేద సంతోషజలరాశి నీఁదులాడె 14

క. ఆ సొమ్ము సంచి నిడుకొని, యాసామిని జేరి "దేవరా! మొద లిదిగో!
తీసికొనుము వడ్డీనొక, మాసములో నిత్తు" ననియె మాలఁడు నతుఁడై 15

ఆ. కాఁపు తన మొగమ్ము కంద గా నవలికిఁ, ద్రోసె నుద్దవడిని రొక్క మెల్ల
లెంక తల్లడిల్లె నింకనివాఁగులై, కదలె వానిమేన ఘర్మజలము 16

గీ. "ఔను! మొద లిచ్చి నే వడ్డి నాఁపినపుడు, దొరకు రోసమువచ్చుట దోస మగునె
తప్పుచేసితి" నని మాలఁ దప్పు దపుడె, గూఁటికిం జేరి నారి కీగొడవ సెప్పె 17

క. ఆ పూసల నీ పూసల, నా పైదలి కుదువపెట్టి యపు డొకవరహా
చేపడుమార్గము చూచెను, బ్రాపై పతిబరువు డించి పరువున్ నిలిపెన్ 18

ఆ. కొమ్మ నాదరించి గుఱ్ఱమునెక్కిన, కరణి మాల వచ్చి కాఁపుఁ జేరి
తెచ్చినాఁడ నేఁడు 'దేవరా! వడ్డియు, నందుకొనుము సర్వ మనుచు నిలిచె 19

గీ. ఉఱిమి చూచెను యజమానుఁ డుఱ్ఱుద్రాళ్ళఁ, గొట్టసాగెను మొఱవెట్టుకొలఁది లెంక
నక్కట! పెరిల్ పెరి ల్లనునట్టిమ్రోఁత, లెగసి యచ్చటి కాపల్లె నెల్లఁ జేర్చె 20

ఆ. 'ఆగు! రామకృష్ణయా! కొట్టఁబోకు మీ, బక్క వానిఁ బసిని బాఁదినట్లు
నేర మేమి చేసె నేఁడు వీఁ; డావేశ, ముడిగి తెల్పు" మనిరి యూరివారు 21

ఆ. "ఇతనిబిడ్డ పెండ్లి కిడినాఁడ నొకమాడ, నది ఋణం బటంచు మొద లటంచు
వడ్డి యనుచు వీఁడు దొడ్డసాహువిధానఁ, దెచ్చునేమి? మూట నిచ్చు నేమి? 22

క. ఎందఱ కొసఁగితినో మీ, కందఱకును దెలియు వీనికైనఁ దెలియదా
వందల పెండ్లిండ్లకు నే, నింద మనుచు నంత యింత యిచ్చుట చెపుఁడీ! 23

ఆ. పిన్న నాఁటినుండి న న్నాశ్రయించి నా, కొట్టమూడ్చి యూడ్చి గొడ్లఁ గాచి
బ్రతుకుచున్న పేద కిది యెంతయావి యీ, మాత్రమరయఁ దేమిమనిసి యితఁడు 24

క. ఒకసారి త్రోసితిఁ గద్దా, యిఁక మానఁగవలదె రొక్కమిచ్చుట మాలం;
దకటా! నేఁ డిటు మీానిం, దకు బలిగావించి నన్నుఁ దల్లడపెట్టెన్ 25

క. అప్పని వీఁ దడుగుట నిజ, మప్పుడు నే మూఁగవోయి యది యిది తెలియం
జెప్పకయే సొమ్మిచ్చితి, నిప్పటి కి ట్లాయె రగడ యేమందు విధిన్ 26

ఆ. నన్ను ఁజుట్టనేల నల్వురనోటిలో, నాని కలఁగుయోగ; మేను మేలు
సేయఁ గీడువచ్చునే!" యని యెలుఁగు రా, ల్పదఁగ మన్నె కాఁపు నుడివె నపుడు 27

ఆ. తెల్లవోయె మాల; నల్లవో! దెబ్బల, కాతఁ దుజ్జగించునశ్రుకణము
లుడిగెఁ గాని, తేనియుపకృతి విన్నంత, విడుచుబాష్పధార వెల్లివొడిచె 28

క. కుప్పవడి లెంక "బాబూ!, త ప్పొనరించితిని సైఁచి దయఁజూపవె! నీ
గొప్పతనం బెఱుఁగక ని, న్న ప్పా! బాధించినాఁడ నవివేకమునన్ 29

గీ. వందలకొలంది మేళ్ళు నీవలనఁ బడిసి, దాఁటినాఁడను గడగండ్లఁ గాటకముల
నిదియు నా లెక్కలోఁ జేర్తునేని బరువు, హెచ్చు నని జంకి నేఁటికి నిట్టు లైతి 30

గీ. ఏను మూర్ఖుఁడ దేవరా! యింతకంటె, నేమితోఁచును నాకు లోఁ తేమి తెలియు
నూఅడిల్లవె! నీకు నీవారి కెపుడు, నండగాఁ బరమేశ్వరుఁ డుండు!" ననియె 31

గీ. 'ఏమి యిచ్చితి' నని సామి 'యింతయావి, నందలే' నని లెంకయుఁ గుంది రపుడు;
'ఏమి యిచ్చితి' వని లెంక 'యింక నెంత, యిత్తు'నని సామియున్ గలహింతురిపుడు 32

గీ. సేవకునిపట్ల సామియు సేవ్యు నెడల, లెంకయును సర్వదా కుట్రలేని మమత
నించుకొని తేఁటి బ్రదుకు నామంచిరోజు, లెప్పటికి వచ్చునో మన కప్పటియును 33

**18-05-1961**

# కృష్ణార్పణము

గీ. సహ్యగిరిసానువుల మెల్ల సాగిసాగి, యలఁతివాఁగుల నీలోనఁ గలిపికొనుచుఁ
బెల్లుబికి సుళ్ళతోఁ బఱవళ్లు ద్రొక్కు, కృష్ణవేణమ్మ! నిలు! నిలు! మించకంత 1

గీ. ప్రావృడభ్రము తనకంటఁ బడినవెంట, హర్షపరవశమై యాడునఁట మయూర;
మకట! తన్మేఘజలపుష్ట వైననిన్నుఁ, గన్గొనినయంత మా కింతకలఁత యేల? 2

గీ. నీవు చల్లనితల్లివి; నీదుకరుణ, బ్రదుకుచున్నది ప్రజ పాఁడిపంట లొదవి;
నిక్కమే! కాని యిట్టు లొక్కొక్క తడవ, 'రెచ్చి భీకరాకృతిని ధరింతు వేమి? 3

ఆ. గట్లనొదిఁగియొదిఁగి కదలెడి నీసాధు, మూర్తి మాకు మోదమును ఘటించు,
దరుల నొరసియొరసి పఱచు నీ రూక్షరూ, పమ్ము మాకు భయభరమ్ము గూర్చు 4

ఆ. మేలు కలుగ నుబ్బుమెయి నేర్చితిమి గాని, కీడు గదుర నోర్చుకీ లెఱుంగ;
మెనిమిదేండ్లనాఁటి దీ వొనరించిన, చెట్ట నేఁడు నుదిలపెట్టు మమ్ము 5

మధ్యా ఆనాఁడు నీవానకట్ట నట్టిట్టు లాడించిత్రెంచి,పైనము సాగించునపుడు,లేఁబొట్టపైరులిఁకేమి
కానున్నవోయనికర్షకులదలికంపించునపుడు,దీనమై కర్తవ్య మిది యని జగము తేల్పలేనపుడు 6

ఆ. జాలి పొంగి పొరలి సాహసస్ఫూర్తిమై, నిన్ను నిలువరింప నిలిచినట్టి
పుణ్యపురుషుఁ డతఁడవో! కృష్ణమూర్తి వే, పాన్వయప్రభూతుఁ డమరకీర్తి 7

ఉ. నేఁ డధికారగర్వమున నిప్పులు క్రక్కెడివారు, ధర్మువున్
జూడక లాఁతివారిసిరి జుట్టఁ గడంగెడివారు, లోక మే
కీడున బ్రుంగి యెంత తల క్రిం దయినన్ దయరానివారుఁ గా
కోడక యిట్టి త్యాగమున కొగ్గెడివా రిల నెంద ఱుందురో! 8

చ. తనయధికారమెల్ల జనతాసుఖసాధనకే యటంచు న
మ్మినమహనీయు నెట్లు దిగ మ్రింగితి వీని? మహాస్రవంతి!; మా
కనులఁ దొరంగు బాష్పముల కాల్వలు పట్టియుఁ బట్టనట్టులే
చనియెద; వింతబెట్టిదము సైఁచుట కీ వెటు లిచ్చగించితో! 9

గీ. ఏల నీ కింతపొం; గిది యెన్నినాళ్లు, నిలువఁగల దోసి! మాయింజనీరు కృష్ణ
మేను కబళించితివి గాని వానివిశద, కీర్తి కాయమ్ము చెనకఁగల్గితివె నీవు? 10

మధ్యా అది నిర్వికల్పమ్ము, కర్జ మెఱుగని యధికారియెదఁదఁ
గుదురుకొన్న తమస్సుఁ జీల్చి చెండాడు క్రొత్త వెలుంగు,
కదలి విజయవాడకు నరుదెంచెడిగఱువల కంటి
తుద నది యశ్రు లూరించి భక్తి హేతువుగాఁ జెలంగు 11

18-6-1961

# తారాహారము

ఉ. నెవ్వలు సైఁచిసైఁచి ధరణీ ప్రజయాఁకలి దీర్చుకర్షకుల్
గవ్వకురువ్వకేని కొఱగాక తపించుతతిన్ ద దాపదల్
దవ్వులు సేయ నిల్చిన యుదాత్తచరిత్రుఁడ వీవు-నీకథల్
కవ్వముపాటలై శ్రుతిసుఖంబు నొసంగును రంగనాయకా! 1

మ. తెలుఁగుంగడ్డనె కాదు భారతమునందే కాదు సర్వక్షమా
వలయంబందును "రైతుపాలఁ గలఁ దెవ్వం" దన్న నిన్నే కదా
తొలుతం జెప్పెదరిట్టినీవు తెనుఁగుందోఁటబుట్టువై మాతపం
బులు పండించితే! వాసికిన్ దగినకాపుం జూపె నీసేద్యముల్ 2

చ. పదుగురుబిడ్డ లేర్పడి శుభమ్ములభమ్ములు సందడింపఁగాఁ
జిదికినరైతె కార్మికుఁడు, చేవలు దేలిన కార్మికుండె రై
తిదిగద నగ్న సత్యఁమిక నీ ప్రజలోఁ దెరగట్టి కయ్యముల్
మొదలిడువారు వెఱ్ఱు లని మూదలచేసిన నిన్ను మెచ్చెదన్ 3

ఉ. కాఁపులు కూలివాండ్రు నొకకాఁడికిఁ గట్టిన రెండుగిత్తలై
రాపిడిలేనిబాటలఁ బరస్పర బాంధవసౌహృదమ్ములన్
జూపిననాఁడె నాఁడెములు చొప్పడు వీరి కటంచు వేఱిమిం
జోపి వెలుంగునిచ్చు జగజ్జోతికి నీకు నివే నివాళికల్ 4

ఉ. మట్టి బిగించి పాఱగొని మాగిలిచెక్కక చెట్టునీడలో
గట్టుననిల్చి చుట్ట లెగఁగాల్చుచు నిక్కుట నేర్తువేని నీ
పుట్టి మునుంగు నీబ్రదుకు బోరగిలంబడు నంచు సేద్యపుం
గు ట్టెఱిఁగించి కాఁపు నెసకొల్పితివే! తడికయ్యలో దిగన్ 5

ఉ. కాఁపుఁదనమ్ము సార్థకముకావుటకున్ దటినీసమంత మెం
తో పొల ముండుఁగాక పతితో మడికింజని కంకణమ్ములన్
రాపిడిసేయుచుం బసిఁడిరవ్వలగాజులు గుల్క నోర్మికిన్
బ్రా పయి నాటు వేయవలెఁ బైదలి యన్న నినున్ గణించెదన్ 6

మ. ఎకరా లేఁబదిలేవు ముప్పదియులేవే యంచు నిట్టూర్చు క
ర్షకులారా! చిఱుదోఁటతోఁ బదుగురన్ రక్షించు పూరింటి హా
లికునిం జూడుఁడు చెమ్మటల్గురిసి వెల్లిం దీర్చునేర్పున్న ఖం
డ్రిక లేలా తలవ్రేఁగటందు విది ధాత్రిం దేర్చు సూత్రమ్మురా! 7

మ. ఇది సర్వోదయరుక్ప్రసార మిది వహ్నిజ్వాలికామాలికా
స్పద నిర్భాగ్యనరప్రపంచముఖ వర్షావారివాహచ్ఛటా
భ్యుదితాసారము ధర్మపూర మఖిలాంహోవాసనాదూర మి
య్యది భావేపరమర్షి బోధిత మహీయస్త్యాగసారమ్మురా! 8

ఉ. విత్తము పంచిపంచి యొక విశ్వకలాపరిషత్తు శేముషీ
మత్తకుఁ బేరుగన్న గురుమండలి నిల్పి జగాన కెంత వి
ద్వత్త నొసంగు నంత కొకవందమదుంగులు హెచ్చుగాఁ దమ
శ్శక్తి యొనర్చి తీవు పలుసీమల వేసవిపాఠశాలలన్ 9

శా. ఆచార్యం దననీవ! నిన్గొలిచి విద్యాచాతురి న్గన్నవా
రేచాయం గనుఁగొన్న నుందురుకదా యా సీమ; నీశిష్యకుల్
సాచివ్యమ్మున గ్రామపాలనమునన్ సామర్థ్యముల్ నింపి చాం
ద్రీ చారు స్థిరకీర్తికిం గుదురులై దీపింతు రీ ప్రొద్దులన్ 10

శా. అంతేవాసుల పెంపు నీ పెనుపుగా హర్షింతు - సేవారత
స్వాంతుల్ దాంతులుముద్దుసేయఁదగుస్తోవంబోదు - వేదిక్కునన్
శాంతిచ్ఛేదకవాదముల్ వొడమినన్ సైరింప - వుర్వీహిత
క్రాంతిప్రేరక ధర్మపీఠమవు రంగా! నీవు ముమ్మాటికిన్ 11

చ. ఒకటికి రెండుమార్లు సుగుణోత్తరునిన్ నినుఁగేంద్రమంత్రిపీ
ఠిక నిలుపం బెనంగినపటిష్ఠుల కింతయు లొంగవైతి - సే
వకు నధికార మడ్డుపడవచ్చు నహంకృతిగూర్పవచ్చు న
న్నకిటుకు గంటివే! యిటు లొనర్చుట కెందఱు నేర్తు రిమ్మహిన్ 12

ఉ. క్రొత్త తెలుంగురాష్ట్రమునకున్ సమకూడినచీడ లెన్ని యో
తుత్తుమురై నశింపఁ దతితో మొనకట్టినజెట్టి వీవు, నీ
సత్తయు దేశభక్తియుఁ బ్రసన్నతయుం బ్రతిలేని శౌర్యసం
పత్తియుఁ ద్యాగరక్తియును బ్రస్ఫుటమయ్యె నిటన్ మహామతీ! 13

ఉ. నెయ్యపుబల్మి నీవ కననేర్చితి - వేటికి లేనిపోని రా
కయ్యములంచుఁ దమ్ములను గౌఁగిటఁజేర్చితి వాంధ్రకీర్తు లాఁ
బెయ్యలమందలై పరువు పెంచినయంచలబారులై కడున్
దియ్యనివై మహీస్థలికి నింగికి నిద్దపుడాలు దిద్దఁగన్ 14

ఉ. ఇంతటినీకుఁ దెల్గుఁబ్రజయెల్ల ఋణంపడె నన్నమాట క
భ్యంతర మెవ్వఁడాడు? నఖిలాంధ్రము నాలుగుకోట్ల గొంతులన్
బంతులుదీరి గద్యములఁ బద్యములన్ నిను మెచ్చు నేఁడు - నీ
కాంతులు నాఁచికొన్న ములుఁగఱ్ఱలే రేపటిరాజదండముల్ 15

ఉ. అన్నవు నీవు నాకు - నటు లయ్యును దమ్మునికంటె లేఁతగాఁ
గన్నుల కింపుగూర్చెదవు - "కారణ మెయ్యది దీని" కంచు నా
కున్న మనీషతోఁ దఱచి యొక్క రహస్యము గంటి - గెల్పులన్
బన్నములన్ సమానపరిపాటి గణించి గడింతు వీసిరిన్ 16

మ.ఇది యాత్మోన్నతిలేనివారిసిరి కానేకాద! గీతాజనుః
పదమై కృష్ణుడు నిర్వచించిన "స్థితప్రజ్ఞ"త్వమే దీనితీ;
రదిరా! నీ వజరుండ వౌట యొకలెక్కా? యేఁబదాతేమి? నీ
బ్రదు కెన్నెన్నియొపుట్టుపండువులతోఁ బ్రత్యగ్రమౌనగ్రజా! 17

శా. యావద్భారతరాజ్యతంత్రముల నీయాప్తుల్ హలారాధ నా
జీవుల్ కష్టసుఖాభిదర్శనులు రక్షింపన్ బ్రజా గ్రాసవా
సోవైక్లబ్య మొకింతలేమిఁ గనుగొంచున్ దుష్టియున్ బుష్టియున్
బూవుల్ పూవసుఖింపవయ్య! తెనుఁగుంబుణ్యంబుగణ్యంబుగన్ 18

శా. నాపల్కుల్ 'వితగావు కా' వనుచు నన్నా! కెన్నడానుండి నీ
వే పంపించినవాఁడ వుత్తరము లేదేగుర్తు? గర్వచ్యుతిన్
నీపల్కుం దలఁదాల్తు నీకలిమికై నీ బల్మికై కూర్చు నా
యీపద్యావళిసార్థమై భువనసౌహిత్యమ్ము సంధిల్లఁగన్ 19

శా. సాహిత్యంబును మానవాభ్యుదయబీజం బన్నసత్యంబు నీ
యూహందోఁచుట, దద్వికాసమున కీ వుద్యోగముంజేఁత, వా
చా హేవాకవిశిష్ట శిష్టరచనల్ సాగించుటంజేసి నీ
స్నేహంబున్ వరియింత్రు మాదృశకవుల్ శ్రీభారతీవల్లభా! 20

ఉ. నీజత కెందఱోకవులు నిచ్చలు వత్తురు కావ్యగోష్ఠిలో
రోజులు రోజులే మఱచరూపము నీది - గుణాగుణజ్ఞతా
రాజితబుద్ధి నీది - రుచిరం బగు తర్కము నీది - కావునన్
రాజులఁ గొండపల్లిబొమరాజులఁ గన్గొన వొక్క తీరునన్ 21

చ. కవి యెవఁడో ప్రజాభ్యుదయకాముకధీపరిణద్ధుఁ డెవ్వఁడో
ప్రవిమలవృత్తిదీప్తి పరిభాసురుఁ డెవ్వఁడొ నిగ్గుదేల్చువా
రవనికి నేతలై వెలసినప్పుడె ధర్మువు గెల్చు గారడీ
రవరవ లిచ్చటం బనికిరావు కులమ్ములు గావు నిచ్చెనల్ 22

మ. శరవేగమ్మునఁ గమ్మ వ్రాసెదవు భాషా దేవిమంజీరమం
జురవంబై మధుకోశమౌ నదియు - నెచ్చో నేర్చి తీపల్కు? నీ
పరమప్రేమలుగన్న పల్లియల సంపాదించితో, భారతీ
తరుణీ సంతతసాహచర్యముల నందంగంటివో తెల్పవే! 23

ఉ. భారతిపొత్తు నీ మధురభాగ్యము - దక్షిణభారతక్షమా
భారము నోర్చినట్టి గణపత్యవనీంద్రునిముద్దుపట్టిరే
ఖారమఁ జూతు మా వదినెగారిముఖమ్మునఁ - గాకతీయ రో
చీ రమణీయమై తెలుఁగుసీమ వెలుంగుత! మీకతమ్మునన్ 24

చ. ఇది బృహదాంధ్రరాష్ట్రమున కీకవినిన్ బురికొల్పుమాట - నేఁ
డొదవిన పొట్టిరాష్ట్రమున కున్నతి నీఁదగుమాట - తెల్గుసం
పదకు దివాణమై పొదలు 'బస్తరు' నుండి 'కొలారు' దాఁక నొ
క్క దొరతనమ్మె సాగుట జగద్ధిత మౌ ననుమాట సోదరా! 25

ఉ. నాలుగుకోట్ల తెల్గు లొకనాయఁకరమ్మున వెల్గునాఁడు పాం
చాలముఁదొట్టి ద్రావిడ, మసాముదొడంగి మరాటదాఁక నీ
నేలకు సాటివచ్చు నవనిం గనుఁగొందుమె? యాంధ్రజాతికీ
మేలు ఘటింపు మంచుఁ బ్రణమిల్లెద దుర్గకు నిష్టభర్గకున్ 26

చ. జనని భవాని యీవర మొసంగుట నిక్కము గోలకొండలోఁ
దెనుఁగుమహారథుల్ కొలువుదీరుట నిక్కము - పెద్ద లందఱున్
నిను సముదారవాక్యసరణిన్ బతిమాలి ప్రధానమంత్రిఁగా
ననుచుటనిక్క - మీవుజయమొందుటనిక్కమునిక్క మగ్రజా! 27

20-9-1955

# మన్నన

చ. మదివికసింప వాఙ్మయసుమమ్ములు చల్లెద వెల్లమేనికిన్
బెదరుచు దేశమెల్ల దురపిల్లెడు వేళ సబర్మతీమహా
నదికడ మ్రోసినట్టిరణనాదముతోఁ బులకించి సింగపుం
గొదమవిధాన రంగమునకున్ జనుదెంచినరామసామికిన్ 1

ఉ. కత్తి కటారిలేని పెనుకయ్యము రేఁగిననాఁడు శాత్రవుల్
తత్తఱపాటుసెంద సముదాత్తము నాత్మబలమ్ముఁ జూపి ధీ
మత్తతి మాయురే! యనుచు మైమఱపుంగన మాతృదాస్యవి
చ్ఛిత్తియొనర్చినట్టి శుభశీలుని మాశరణున్ గణించెదన్ 2

ఉ. పన్నుల ధిక్కరింపుఁడని పల్లెలకున్ రణశిక్ష నిచ్చుచున్
'బొన్నురి'లో నితం డెగసి బుఱ్ఱయసత్రముముందటన్ దొరల్
పన్నినకట్టు త్రెంచి శ్రుతిపర్వముగా వెదలించినట్టి ప
ల్కెన్నఁటి దైననేమి ధ్వనియించును నా చెవిలోన నేఁటికిన్ 3

ఉ. గుంటురిపేరు విన్నదొరకున్ వణఁకెత్తెను పార్లమెంటులో
గంటకు మూఁడుమార్లిచటికయ్యము చర్చకువచ్చి సీమకున్
గంటకమయ్యె నాఁడు; మొనకట్టినయోధవరేణ్యు లిట్టివా
రుంటఁగదా లభించె యశయున్నతి గర్తపురీధరిత్రికిన్ 4

ఉ. రక్కసిరాజ్య ముక్కడఁగి రావలయున్ బ్రజపెత్తనమ్ము,నల్
దిక్కుల నవ్యదీధితులు దీటుకొనన్వలె నంచు నిష్ఠమై
రక్కసతాల్మి నొడ్డి పలురాపులుపడ్డమగం డితండు నేఁ
డెక్కినపీఠ మెట్టిదని యెంచి కలంగకపోరు మాదృశుల్ 5

5-9-1961

# నాఁగేటిప్రెగడ

శా. తిమ్మారెడ్డి! త్రిలింగదేశజనయిత్రీ సేవకశ్రేణిలో
సమ్మానార్హత గన్న రెడ్డి! ప్రతిభాసౌజన్యసౌశీల్యముల్
సొమ్ముల్గా హవణించు రెడ్డి! కృషికస్తోమమ్ము ప్రాణమ్ముగా
నెమ్మిన్ దేలెడిరెడ్డి! సంతతజయానీకమ్ము నీ కబ్బుతన్! 1

గీ. రైతుపై నీఁగ వ్రాలెనా రక్తమెల్ల, నుడికి ఘూర్ణిల్లునట్టి! నీ కుదధివోలె
నాంధ్ర కర్షకభాగధేయములు పండి, నేఁడు నాఁగేటిప్రెగడ వైనాఁడ వీవు 2

ఉ. కాఁపులకల్మిలో జగముకల్మిని జూచినమేటి వీవు రా
రాపులు ముట్టడించినను రైతులఁ గా చెడిమంత్రి వీవు నీ
చూపునఁ దోఁచుసత్యమును సూరెలవారిమొగాలు ప్రేలినన్
దాఁపక బాహిరించు శుచితారుచిమన్మణి వీవు తిమ్మయా! 3

సీ. ఎకరాలు నూ ఱున్న నేమిసంబడ మయా, కించిత్తు వాన వక్రించెనేని
నిలువెత్తుపై రైన నిండున దే మయా!, గాలిపా టొఱవయై కంకి సెడిన
పంట లవ్వారిగాఁ బండిన నే మయా!, విపణిలో గింజకువిలువ పడిన
బస్తాకు ధర యెంతపల్కిన నే మయా!, బండిపట్టా కైదుపదుల నిడిన 4

గీ. వచ్చెఁబో! రైతునకుఁ బదివంద లేమి
యొఱగు నమ్మాయి పెండ్లిపందిరులు వైవ
ఎవఁ డెఱుంగును గాఁపులయిడుమపాట్లు
మదక దున్నెడి నీవంటి మంత్రి తక్క 5

క. నీతలఁపులు నీపల్కులు, చేఁతలు కర్షకులపాలిసిరికే వెడలున్
నీతప మెందఱ కబ్బెను?, రైతులలోఁ జూతు వీవు రాము రహీమున్ 6

ఉ. మట్టబిగించి యొద్దెవలె మట్టినిమోయుచు కే.సి. కాల్వకున్
గట్టలుదిద్ద నేర్చితివిగాని మహాంధ్రము నేలుముద్ర చే
పట్టినమంత్రి నే ననెడుభావము నీ వెపుడైనఁ గంటివా!
యెట్టులు నేర్చి తీనడత యీనిరహంకృతి రెడ్డిసోదరా! 7

ఉ. పాటకుఁ దగ్గవీణ జతపద్దగతిన్ దగుమంత్రి వైతి వీ
నాఁటితెలుంగుహాలిక జనమ్ములు; కీ వెట నేది పల్కినన్
దోఁటపొలమ్మునన్ గపిలె దోలెడి సోలెడి రైతుగుండియన్
మాటికిమాటి కిన్ గదలునాదములే మొరయున్ సమశ్రుతిన్ 7

ఉ. ఈవు శతాధికాయువు సమిద్ధపదమ్ము సుఖమ్ము నంది నీ
చేవ సమస్తమున్ గృషికజీవనరోచికి వెచ్చ పెట్టుమీ
పావనభావసౌరభము పర్వ సభాసదు లిచ్చు నచ్చపుం
దీవనలెల్లఁ బండి నవతేజము నీ కొసఁగన్ సుహృన్మణీ! 8

ఉ. కట్టడ తప్పనట్టికవి కన్పడినన్ బులకింతు వీవు, స
ద్రమాట్టును జూచిన ట్లతని మన్ననచేసెదు, రాచప్రేఁగు చే
పట్టినవారి కెందఱకుఁ బట్టిన దీయనురక్తి? నీకు నేఁ
డిట్టిప్రశంస లీయక మ తేగతి మిన్నక యుంద్రు మాదృశుల్? 9

ఉ. రెడ్డికి నాంధ్రవాఙ్మయ చరిత్రకు నబ్బినపొత్తు పెద్దయున్
దొడ్డది సత్కవీంద్రపరితుష్టికి నుత్తమకావ్యసృష్టికిన్
రడ్డి తపించి కాంచె నపరాజితమైనయశస్సు; చంద్రులో
మడ్డిని జూచి తద్ద్యుతులు మాటిమాటికి నవ్వుఁ దిమ్మయా! 10

ఉ. 'తిమ్మ' పదార్థము న్గనినతెల్గులు పెక్కురులేరు; 'శాంత' మీ
కమ్మనిమాట కర్థము; వికారములై చను రాగవైరమో
హమ్ములు లేనినీకు నిది యాహ్వయమై నుతికెక్కె; నిన్గనన్
దిమ్మన కాక కాఁక మొలతెంచునే! ధన్యుఁడ వీవు ప్రెగ్గడా! 11

5-12-1959

# బ్రహ్మోత్సవము

ఉ. పొంగులు వాఱుచున్ సుడులువోవుచుఁబైకొనివచ్చు వేనవేల్
భంగములన్ గణింపక విపత్కరనక్రకరోరదంష్ట్రికా
శృంగము లూడ్చి కృష్ణ కెదురీఁదిన దిట్టవు నీవు; నేఁడునున్
ఖంగున ఘంటసాలజయగాథలు నల్గడ మ్రోయ బ్రహ్మయా! 1

ఉ. వైరుల నోర్చి బాహుబలవైభవధూర్వహనైకజీవులై
వీరరసప్రధాను లన విశ్రుతికెక్కిరి నీపితామహుల్
వైరుల నోర్చి యాత్మబలవైభవధూర్వహనైకజీవివై
వీరరసావతార మన విశ్రుతికెక్కితి వీవు సత్కృతీ! 2

ఉ. బందరులో మహామహులు ప్రాజ్ఞులు ముప్వరు నీకు నొజ్జలై
వందలు వేలుగా వలయువన్నెలు దిద్దఁగవచ్చుఁగాని మీ
యందఱిలోన గాంధి కలఁ డయ్యది కారణమై నిరంతరా
నందపునిట్టనై సొగసినాఁడను నేనును నీమహస్సునన్ 3

ఉ. బంధురదేశదాస్య పరిభావ నికృంతనదీక్ష పూని ని
ర్బంధములెల్ల సైఁచితివి బాముని లగ్గన నొక్కరీతి ని
ర్మంధరవృత్తి సాగితివి మాన్యచరిత్రుఁడ వైతి వద్దిరా!
గాంధికి నిన్ను వంటిమొనగాండ్రెకదా విజయైక హేతువుల్ 4

ఉ. విచ్చినమోముతోఁ జెవికివిందులుసేయు మృదూక్తితోఁ బొరల్
పొచ్చెములున్ గనంబడనిపోకడతో వెడనిక్కుటెక్కులన్
మెచ్చనిచూపుతో నెనరుమేలిమితో నెనలేనితాల్మితో
నచ్చుపుఁబల్లెటూరిసొగ సంతయు లోఁగొని తీవు కర్షకా! 5

ఉ. ఏపదవుల్ వశంపడిన నేబెడఁదల్ చలపట్టిముట్టినన్
గాఁపుఁదనమ్ము వీడ్కొనని కమ్మనిమానిసి వీవు హాలికున్
దోఁపిడిచేసి కుల్కు గజదొంగల వంచినరైతుపెద్ద వీ
వాపదనున్న జీవులకు నందఱ కాపుఁడ వీవు బ్రహ్మయా! 6

చ. హలమును బట్టి ప్రాణులకు నన్నముపెట్టెద బట్టనిచ్చెదన్
గలమును బట్టి వ్రాసెదను గావ్యము మోసెదరాజ్యభారమున్
వలసినవేళ నుగ్రకరవాలముఁ బట్టి ప్రపంచశాంతికై
నలఁగెద నన్ననీపలుకు నామదికిన్ వెలుఁగిచ్చు నగ్రజా! 7

ఉ. తిన్ననిరూపుతో బిగువుదేఱెడికందలతో నెసంగు నీ
యున్నతదేహయష్టి హృదయోన్నతికిన్ బహిరంక మందు; నీ
చిన్నెలు తోఁచువారె కవిశేఖరు లౌటయుఁ గానిపించు మా
నన్నయ విశ్వనాథపయి నాపయి నింకొకమూఱెఁ దుండఁడా? 8

ఉ. గంతులు కావు పట్టములు కావు సదస్యుల ముంచియెత్తు దు
ర్దాంతవచః ప్రవాహములు తంత్రము లాస్తులు కావు శైలజా
కాంతశిరస్సర ద్దివిజగంగ నదల్చు పవిత్రశీలమే
సంతనచేయుఁ గీర్తి నని చాటెద మూదల నిన్నుఁ జూపెదన్ 9

చ. ఇతరకులమ్ములందు మనసిచ్చి నినున్ గొనియాడువారు నీ
హితమున కొగ్గువారు కల రేదెస కేగిన వేనవేలుగన్
బ్రతు కన నిట్టిదేకద! సెబాసని యూరకపల్కునా జనం
బతులితమౌ నుదారతయు నార్ద్రతయున్ గని కాక బ్రహ్మయా! 10

ఉ. రాపునకేమిలే! తెలుఁగురాష్ట్రము వచ్చెను దానివెంటనే
చేపడియెన్ మహాంధ్ర, మది శిష్టసభన్ సృజియించినంతనే
ప్రాపయి తత్సభన్ నడుపుభాగ్యము నిన్ను వరించె, గర్వమున్
జూపవు గాని నీ వికటఁ జొక్కదు నే నొకసాత్త్వికోద్ధతిన్ 11

ఉ. నే ననఁగాఁ ద్రిలింగధరణీహితగాథతపోగ్ని దుర్భర
గ్లాని సహించినట్టి ఋషికల్పుఁడ మామకరాష్ట్రగానముల్
వీనుల సోఁకి యీ తెలుఁగువిశ్వముమేల్కొనె నీ యథార్థతన్
గాననివిజ్ఞు లుండెదరుగాక! నతుల్ పదివేలు వారికిన్ 12

ఉ. నావలె నంధ్రతావికసనమ్మున కెమ్మనమూల్గ మృగ్యమై
పోవఁ గృతుల్ రచించుతమి పొంగి నలంగు తెలుంగులెంకలన్
నీవలె గారవింపఁగలనేతలు పెక్కురు లేమి నిక్క మౌఁ
గావున నీమహోత్సవము కన్నులపండువు మాకుబ్రహ్మయా! 13

చ. పదపదమందు నీకనుల బాష్పము లూరును నేఁడు మేనికిన్
గదురు గగుర్పు పైరతతిఁ గాఁకరగాయకుఁబోలె నౌర! యీ
కదలిక లాభలోభములు క్రమ్మినప్రాణికి రాదు ధర్మువున్
వదలనివానికే దొరకు వైభవ మీయనుభూతి బ్రహ్మయా! 14

చ. మునికులచక్రవర్తియగు ముట్నూరికృష్ణుఁడు గాంధి గాక నీ
కనులకు నీమహాజనము కన్పడునా? యిది కా దటన్నచోఁ
గనఁబడు భోగరాజు, మఱి కన్పడునేమొ నృసింహుఁ, దవ్వలన్
గనుపడవచ్చు నీపరువు కాచినరాణియు నేఁడు బ్రహ్మయా! 15

సీ. ఒకకూర సరిపోవదో యని నీవన్న, నతిథికి మఱియు రెండలవరించి
ఇపు డెట్లు బడలెదవే! యన్న జంకక, గుండిగల్ నడిరేయి వండి వార్చి
ఏయగ్నికుండమం దీవు దూఁకుదు నన్న, గెలిచిర మ్మని వీరతిలక మలఁది
తనముక్తియెల్ల నీతనివిలోఁ గల దని, భక్తియై నిను వేల్పుపగిదిఁ గొలిచి

గీ. చిరవియోగవ్యథా పరిస్విన్నమైన, యెదఁద నిను దాఁచుకొని తేఱ యిల్లుదిద్ది
ధర్మధేనువు నీకీర్తివర్మ మైన, మావదినె కీవు కదు ఋణంపడితి వన్న! 16

శా. ఆలున్ బిడ్డలు నూరునాడును జయవ్యాహారముల్ పల్కని
ర్వేలోత్సాహము నంది మందిసిరికైవెచ్చింపు మాయుష్యమున్
నీలో సంయమశక్తికిన్ గొఱఁత లేనేలేదు, నీపై నొరుల్
ఱాలన్ రువ్వఁగ నెన్నఁడో విరిసరాలన్ రువ్వి తవ్వారిపై 17

ఉ. మేడలవారు గాదు మెఱమెచ్చులమ్రుచ్చులు కాదు వీధిలో
నూడకు నుట్టిగట్టి మనుచున్న విపన్నుఁడు రాజనీతిఁ గొం
దాడవలెన్ దదీయహృది నగ్ని రగుల్కొనకుండుమార్గముల్
చూడవలెన్ మహాశయులు సుస్థిరశాంతిరతుల్ భవాదృశుల్ 18

ఉ. నీతులు నీకడన్ నుడువ నే నెవఁడన్ ఫలభోగదూర సే
వాతతకీర్తి సౌరభసమంచిత మంజులజీవనుండవై
మాతృమహీమహత్త్వసుషమావలమానపతాకవై ప్రజా
నేతృత గంటివీవు కమనీయచరిత్రఖనీ! సుహృన్మణీ! 19

ఉ. లోకము వక్రమార్గములలోఁబడియెన్ జెడియెన్ భవిష్యమే
పోకలఁబోవునో యనుచు బుద్ధిమదగ్రణు లారటించుచో
నీకిటు షష్టిపూర్తిమహనీయమహస్సు ఘటించినట్టి సు
శ్లోకుల మెచ్చెదన్ సుగుణలుబ్ధులకున్ గయిమోడ్పు లిచ్చెదన్ 20

ఉ. మండలి కృష్ణరావు యజమానుఁడుగా నిలువన్ శుభక్రియా
చండిమ చూపి పేర్గనియె సత్కృతిసంఘము; దీని నాంధ్రభూ
మండలమెల్ల నొజ్జవలె మన్ననచేసి ప్రజాసపర్యలోఁ
బండినవారి కందఱకుఁ బందువులన్ సమకూర్పుఁగావుతన్ 21

చ. అఱువదియేండ్లు నిండిన రవంతయు జంకనిదండిగుండెతో
నిరువదియేండ్లవానివలె నీవు చరింతువు; నీకు భ్రాంతియా
మఱియొకషష్టిపూర్తి? మనుమల్ మునిమన్మలు వారిపంటలున్
గుఱువునఁగుల్కఁగా మురిసికొందువులే! భగవత్కృపాయతిన్ 22

# కట్నము

**ఉత్పలమాలిక :-**

ఒక్కొకయేఁడు పైఁబడుచునున్నకొలందిని మేనిచేవకున్
దక్కువపాటువచ్చి మతిదార్ఢ్యము సర్వ మడంగి యాత్మయున్
జిక్కి వృథా దురాశలను జిక్కి జగమ్మునవార లెందఱో
క్రుక్కినపేలుగా నొదిఁగి కొండొకచోఁ బడియుందు, రందలే
రిక్కడ నక్కడన్ సుఖము, లేటికి వార లజాగళస్తనాల్
లెక్కకుమాత్రముందు రిటులే జను లెల్లరు నుండ-రెవ్వఁడో
యొక్కఁడు నిన్నువంటియతఁ డుందును-నాఁటికినాఁటి కీవు పై
కెక్కితి-వాత్మకున్ బలము హెచ్చెను-దామరపాకుమీఁదినీర్
చుక్కవిధాన నైహికము సోఁకియు సోఁకదునీమన-స్సహో!
చుక్కమనోముపంటవలెఁ జూపఱకున్ గనిపింతు-విప్పు డీ
వక్కటికంబుతావల, మహంకృతిదూరుఁడ, వార్ద్రతాసుధా
చిక్కణభావసంపదకు సేవధి, వర్వదియేండ్లవాఁడ- వీ
దృక్కమనీయ జీవనగరతప్పుఁడవౌటనె కావ్యవాణికిన్
జొక్కెదునేఁడు-సత్కవులు శుద్ధమనస్కులు వెన్నముద్దకున్
నిక్కపుటన్నలై కరఁగి నిర్భరభావసమాధిమగ్నులై
చొక్కముగా వచించినదెచూ! కవనం-బది పాపతాపముల్
క్రక్కదలించి జాతికి సుఖం బిడుచుట్టము-నన్నపార్యుఁడున్
దిక్కనశంభుదాసులును దెల్గుజగమ్మున కందదండలై
చక్కఁదనాలుచింద జయసత్కృతి పల్కుట నెన్ని భాగ్యముల్
దక్కెనొ నీ వెఱుంగుదువు-తాదృశులౌ కవులన్ గణించి స
మ్యక్కుసుమార్చనాదులను మన్ననసేయుట నేర్చువారవో!
మిక్కిలిధన్య-లిట్టి నెఱమేలిగుణంబులమీఁద నిచ్చలున్
మక్కువ నీకు-లోకహితమార్గములం బరికించు నెప్డు నీ
దృక్కులు-దేశమాతృపరిదీనత కోర్వక రాగభోగముల్
నెక్కొను ప్రాయమందె పయనించితి త్యాగమయుందు బాపుజీ
త్రొక్కినబాటయందు-సుఖదుఃఖములన్ సమదృష్టిఁగంటి-వా
చక్కిని శాత్రవుల్ జగము సైఁపఁగరాని కఠోరకృత్యముల్
పెక్కు లొనర్చినన్ మదిఁ జలింపక సత్యముతో నహింసతో
రెక్కొనుతాల్మితో నపు దరిందమవిక్రమరేఖ చూపి నల్

దిక్కుల మెప్పు లందితివి దేశముదాస్యము వోయి గద్దియల్
దక్కిననాఁడు ధర్మమును దప్పక నిప్పువలెన్ జెలంగి-తీ
పెక్కువ, యీయశమ్మును లభించుట కన్నిటిమించు హేతువున్
వక్కణసేయఁగావలె నవశ్యము నీసతి సచ్ఛీల-నా
యక్క తెలుంగులేమలకు నద్దమువంటిది-మాతృసేవలో
స్రుక్కుట కెన్నఁడున్ బెదరుచూపని మానిని-తొండకైవడిన్
గ్రక్కున రంగురంగుబురఖాలు ధరించుచు నాటలాడు తై
తక్కలమారి బూటకపుఁదత్త్వము మీయెడఁగానరాదు-ప్రాఁ
జెక్కలమోటురాటమున జిఱ్ఱున లాగిననూలిపోఁగుతోఁ
దక్కిరిబిక్కిరై సరిగతళ్కులు బెళ్కులు లేని ఖద్దరున్
దక్కమతొండు వేసమును దాల్పరు నాఁటికి నేఁటి కీరు-లో
చక్కన మెచ్చువారు వెలిసొరున కారటపాటుఁజూపరన్
వాక్కు యథార్థమయ్యె మిమువంటిదృఢవ్రతులుంటఁజేసి-నా
ఫక్కియు నిట్టి దౌట మనభావములన్ శ్రుతిమైత్రి పుట్టి నేఁ
డిక్కవితార్ఝురోదిత సమీహిత గీతికి హేతువయ్యె-నే
యక్కజమున్ గనంబడనియట్టులు, దుందుభి తూర్య కాహళీ
ధక్కలక్రందు లేర్పడనిడంబునఁ, గూడినయాత్మబంధువుల్-
ప్రక్క వినమ్రతన్ నిలిచి ప్రన్ననికార్యము లొండు రెండు నీ
వక్కఱమైనొనర్ప నిపుడాదటఁజూపుట లెస్స-మోదముల్
పుక్కిటిబంటియయ్యె - ఫలభోగము లొల్లనికర్మయోగికే
చిక్కును-దేవదానవులు శ్రీరమణీ రమణీయ మంగళ
స్రక్కలనార్థులై మెడలుసాఁచుచు ముంగడ కెంతయెంతగా
నిక్కిన నేమి? వారల గణింపక లక్ష్మి పయోధి శేషుపై
నెక్కటినున్న విష్ణుమెడనే సుమదామము వైచెఁగాదె-నీ
యిక్కనె నీవు నిల్వ నిట కేమె హుటాహుటి వచ్చినార-మ
మ్మక్క! బలే! విచిత్ర మగుమార్గ మెతింగితి-వౌనులే! రుజా
స్పృక్కులె వెజ్జుదాపునకుఁజేరెద-రేము సుఖింప నీవునుం
గ్రిక్కిఱిమేళ్లు చేకొని సుఖింతువుగాక!-దివాకరేందులున్
దిక్కలు నిల్చుదాఁక ధరణీజనమాన్యము సౌఖ్యకందమై
మిక్కిలుఁగాక! నీకుదురు-మించునుగాక నిసుంగుజాళువా
పొక్కిలి ముద్దుసవ్వడుల బుద్ధఁడు నీ తనయుండు రంగయా!

1-1-1957

# నెఱదాత

సీ. ప్రాగబ్ధివీచికాపటలంపు నిటలంపు, మురువు నింపెడి క్రొత్తనురువు కాఁగ
సింహాద్రినరహరిశ్రీవక్షమున వ్రేలు, పరువంపుఁదెలిదమ్మిసరము కాఁగ
శ్రీగిరిభ్రమరాంబ చిన్నారిపొన్నారి, కొప్పుపై విరజాజిగుత్తి కాఁగఁ
దిరుమల ప్రభుమౌళి దీర్ఘ బాహుచతుష్క, సంలిప్తచందనచర్చ కాఁగ

గీ. ధన్యతర సర్వమానవాదర్శ మృదుల, మధుర జీవనసాధితామ్లానకీర్తి
కాయ మిట డించి పుణ్యలోకమ్ము నేలు, కోర్కిమై నేగినాఁడవా కుప్పుసామి! 1

సీ. వలచివచ్చినగౌరవమును మెచ్చితి కాని
పదవికై తంత్రముల్ పన్నఁబోవు
అది ప్రజాసేవగా నరసి దస్సితి కాని
యధికార మనుచు నహంత గనవు
ఈర్ష్యాళువులపట్ల హితమ కోరితి కాని
మచ్చరించుట కెన్నఁ డిచ్చపడవు
తెరువుదప్పినవాని దిద్ది తీర్చితి కాని
కడుపుపైఁ గొట్టు టెన్నఁడు నెఱుఁగవు

గీ. గర్తపురమండలము నిరాఘాటగరిమ, నేలినన్నాళ్ళు నీ వొక యింటివేల్పు
నటులు పాలితహృదయంబు నాఁచికొంటి, వప్పు! నీ కెవ్వఁ డెనవచ్చుఁ గుప్పుసామి! 2

సీ. తాతముత్తాతలు దాఁచియిచ్చిన మేటి
కలిమితో నడవడిబలిమితోడ
అన్వయశ్రీదత్తమై రాచసిరి గుల్కు
రీవితో సరిలేనియీవితోడ
దిగ్దంతు లగువారు తెలతెలఁబోవు వి
ద్వత్తతోఁ బ్రతిభామహత్తతోడ
కవిరాజ పండితాఖండల శ్రేయోను
రక్తితో దృఢదేశభక్తితోడ

గీ. నొక తెలుఁగునాటికే కాక సకల దక్షి, ణాపథమ్మునకును మాపు ఱాపు లేని
రాణ దెచ్చిన కర్షకప్రభుని నిన్నుఁ, జెప్పి యొరుఁ జెప్పవలెఁగదా! కుప్పుసామి! 3

సీ. వినయాశ్రమమ్ము నీవితరణమ్మునఁగదా!, యొక యింటిదై జగత్ ప్రకట మయ్యె
కమ్మహాస్టలు భవత్కారుణ్యమునఁగదా!, మిన్నంది లాలించెఁ జిన్న వాంధ్ర
ఉన్నవమంత్రి నీ వొసఁగు పెంపునఁగదా, స్త్రీజనాభ్యుదయమ్ము సృష్టిచేసె
ఆంధ్రరత్నమ్ము నీయండతోడనకదా, చీరాలపేరాలపోరు నడిపె

ఆ. ఎన్ని చెప్పనేర్తు మీ వొసంగిన మహా, దానములను నిరుపమానములను
గాంధి మెచ్చు ధర్మకర్తగా బ్రతికిన, మేటి వీవు పుణ్యపేటి వీవు 4

గీ. కులమునకు రాజకీయసంకుచితభావ, సరణికి మతమ్మునకు లొంగి సంతసించు
మానిసివి కావు సమతాభిమాని వీవు, విశ్వకల్యాణకాముకవృత్తి వీవు 5

చ. అడిగిన నిచ్చు సత్పురుషు లచ్చట నచ్చట నుంద్రు గాని నీ
వడుగనివారికిన్ ధనము నంపెదు వందలు కాదు వేలుగన్
పుడమిని నిన్నువంటి కృత బుద్ధులు నిచ్చలు నుద్భవింతురా
పొడముదు రెప్పుడో ప్రజల పుణ్యము పండి శతాబ్దు లేగఁగన్ 6

ఆ. మఱల భువికి నంపు సురలోకమునఁ గాదు, జననమరణ దుష్ప్రసక్తి లేని
నెలవునందు నీవు నిలువుము నీ వెల్గు, లఖిలవిశ్వవీథు లావరింప 7

క. శ్రీచంద్రమౌళి నఖినం, ద్యాచారప్రియుని యుష్మదాత్మజుఁ గని మే
మాఁచెదము నేఁటియలమట, చూచెద మీచిఱుత ననుఁగుఁజుట్టమపోలెన్ 8

3-1-1961

# సార్థకాఖ్య

గీ. పిల్లలకు మంచిపే రిడు తల్లిదండ్రు
లెల్లతావులఁ గలదు గానీ, తదాఖ్య
సార్థకమ్మును గావించు సాధువమ్మ
వంటిపిల్లలు లేరులేరింటనింట 1

ఆ. అకట! విధి బలీయమై యీామెయెదఁదలోఁ, జిన్నతనమునందె చిచ్చువెట్టె
సెగలు వగలు రేఁపి చెరలాడుచిచ్చున, కెదురుదిరిగి నిల్చి యీాపె గెలిచె 2

గీ. ఆర్తసేవానురక్తిమై నార్ద్రమైన
యీామెహృది నుండలేక పర్వెత్తె నగ్ని
భగ్న జీవనలకు, నొజ్జబంతి యగుచు
మమ్మరే! పండినది సాధువమ్మబ్రతుకు 3

ఆ. రెండుకాళ్ల పశువురీతి నుగ్రారణ్య, వీధిఁ దిరుగుబాల విదుషి యయ్యె
మానవత నడంచు మతకులకుడ్యముల్, చిద్రుపలయ్యె నీమెసేవకతన 4

ఆ. దిక్కు లేనివారితిండికి సత్రమ్ము, పెట్టె నీమె కరుణ పెరిఁగి పెరిఁగి
మొండితనము సైఁచి కొండంతమేనితో, దేశమెల్లఁ దిరిగి తెచ్చె బువ్వ 5

ఆ. పరులకొఱకు నవయు బ్రదుకుగదా! ముక్తి, కారణమ్ము, విజయతోరణమ్ము;
సాధువమ్మ! నీకు సమకుఱినట్టి యీా, గొప్పతనము వీరగురునికృపన! 6

ఆ. గురునికీర్తి నిల్ప వరణీయకవితావి, ధాతృపూజ కొగ్గి తనిసె దీవు
కవులు జాతిజీవగఱ్ఱ లన్న రహస్య, మెఱుకపడిననీకు నెవ్వ రీడు? 7

ఆ. నీకు నఱువదేండ్లు నిండ నీసేవకు, నలువదేండ్లె నిండినవిగదమ్మ!
చేయవలయు నీదుసేవకు శతవార్షి, కోత్సవమ్ము లాంధ్రు లూర నూర! 8

క. నీసేవలు నీ త్రోవలు, నీసైదోదులకు మాననీయమ్ములుగన్
వాసంతమల్లికాసుమ, భాసంతయశమ్ముతోడ బ్రదుకుము చెల్లీ! 9

21-3-1962

# సమాజ వికాసము

గీ. బాపుజీదుర్భరతపమ్ము పండిపండి, ప్రజల యతిమానుషత్యాగబలము హెచ్చి
భారతక్షోణి వేయేండ్లబరువు ద్రోసి, క్రొత్తవెల్గులతోఁ దలయెత్తి నిలిచె 1

క. పరతంత్రత చనినంతన, పరిపూర్ణం బగునె దేశభాగ్యమ్ము? పోరిం
బోరి నిల్లలికినయంతన, జరుగునె పండువు రసప్రశస్తాన్నములన్? 2

క. దారిద్ర్యం బజ్ఞానము, రారమ్మని పిలుచు మనధరన్ నలుగడలన్;
ఈ రెండుదయ్యములతోఁ, బోరాడఁగవలయు నేఁడు పురుషులు సతులున్ 3

గీ. వాఁగులను వంకలను గట్టి సాగు పెంచి, మిట్టపల్లాలు సవరించి గట్లు వైచి
బస్సునకు బండి కనువైనబాట దిద్ది, యూరు పాలెము సౌఖ్యమ్ము నొందవలయు 4

గీ. కోహినూరును గన్న తెల్గుంబొలాన, ఖనిజసంపద కేలోటు కానరాదు
నదులు నర్తించు మనభూమి కెదురులేని, వైద్యుతబలమ్ము కల్గు టబ్రంబు గాదు 5

క. సంపదల కేమి మన కవి, గుంపులుగాఁ గలవు కాని గుటకలువేయన్
బెం పొదవదు, చెమ రోడ్చుట, యింపిత మైనపుడె జాతి కేర్పడు లగ్గుల్ 6

క. శ్రమపడుటే జాతికి సిరి; శ్రమపడుటే రాజ్యమునకు సంపద; యెచటన్
శ్రమకన్నదు నచ్చుటనే, రమ కన్నదు నఖిలసుఖపరంపర లిడఁగన్ 7

గీ. పదవికంటెఁ మేడలకంటె బసిఁడికంటె, మాననీయమ్ము పని యన్న మాట నెంచి
దేశసౌభాగ్యమునకుఁ బందెములు గట్టి, బదవలయుఁ బ్రజల్ రేయి పవలు మఱచి 8

క. ఇది కావలె నది కావలెఁ బదివేలిమ్మనుచు వేఁడుపని మానవలెన్;
ఇది చేసితి మదిచేసితి, మెది బహుమతి? యనుచుఁ బ్రభుత నెసకొల్పవలెన్ 9

క. రాచఱికమువారికడన్, దాఁచిననిధు లేమి కలవు? తలబరువైనన్
వైచెదరు వారు పన్నుల, సైఁచెదరా? ప్రజలు పేదసంసారములన్ 10

క. ప్రామవలె నీరసమ్ముల; గ్రామం బొకకుదురుగాఁ బ్రకాశింపవలెన్;
ప్రేమ గలచోటు హర్మ్యా, రామం బగు నన్న తెలివి రావలెఁ బ్రజకున్ 11

క. పంచాయతిసభ్యతకై, కంచము మంచమ్ము నమ్మఁగా వలయునె? రెం
డంచులకత్తులు వలయునె?, కొంచెపు బ్రదుకునకు నియ్యకొనఁగావలెనే? 12

ఆ. ఇరుగువానిమేలుకొఱకు నలంగెడి, యన్నకొసఁగు దున్నతాసనములు
పొరుగువానిఁ జెఱిచి పొగరెక్కి నిక్కెడి, దున్న కేల పూలతోరణములు 13

ఆ. అంగబలముకతన నర్థబలమ్ముచేఁ, బెత్తనాలు వచ్చు టుత్తమాట
వచ్చుఁగాక వానివైభవ మెన్నాళ్లు?, మఖను బుట్టి పుబ్బ మణఁగిపోవు 14

క. అవివేకమునకు స్వార్థ, ప్రవణతకున్ బాదులైన పల్లెలు జగతీ
భవితవ్యము నణఁచుఁగదా!, సవరింపఁగవలయు వీనిజడతన్ నడతన్ 15

ఆ. ప్రతినసేయవలయుఁ బ్రజలు భారతి లేని, పట్టునందు గంగ ముట్ట మనుచు
హరిని హరుని జేరి యర్చించుటకు ముందె, సలుపవలయుగ్రంథనిలయపూజ 16

క. పత్రికలు చదువవలె నీ, ధాత్రిం గల రాజకీయతత్త్వము లెఱుఁగన్
జిత్రమ్ములసొగసుల నప, విత్రకథలఁ దనియువలపు వీడఁగవలయున్ 17

క. కమ్మనిబాస బలా మన, సొమ్మైనది రక్తి భక్తి జోడించి తదీ
యమ్మగు నైపుణి వదయుఁడు,సమ్మానములందుకొనుఁడు సభలన్ దెనుఁగుల్! 18

క. నేర్చినది నన్నయాదులు, తీర్చినమార్గమ్మునకు విధేయం బగుతన్
కూర్చినది విశ్వమానవ, వర్చోజనయిత్రియై ధ్రువత్వము గనుతన్ 19

క. మంజులసారస్వతమున, కంజలిగావింపవలయు "నాంధ్రులు విద్వ
త్కుంజరములు కవితాశుకి, పంజరము" లటంచు నొరులు భావింపవలెన్ 20

క. పల్లె కొక పాఠశాలయు, నెల్లరకున్ జదువుపట్ల నిచ్చయు వలయున్
చెల్ల విఁక వ్రేలిముద్రలు, కల్ల నిజం బెఱుఁగలేని కసటుంబ్రదుకుల్ 21

ఆ. కత్తివంటియోటు కలదు నేఁ డెల్లర, కది సమాజవృద్ధి కొదవ వలయు
గ్రుడ్డివానిచేతిగడ్డగా నది ప్రయో, గింపరాదు కీడు నింపరాదు 22

క. అది పేదలకున్ బెన్నిధి, యదిజాతీయతకుఁ జిహ్న మది బాపూజీ
కదలించిన ప్రావెల్గదె, 'ఖద'; రది సోఁకనిప్రజల్ వికాసవిదూరుల్ 23

గీ. మగ్గములు రాట్నములు మనమందిరముల
నాడవలయుఁదియ్యనిపాటపాడవలయుఁ
జేతిపను లింటనింట భాసిల్లునపుడె
కలిమి తానై వరించి సాక్షాత్కరించు 24

గీ. మనకుటీరపరిశ్రమల్ మనుచుకొన్న, నుండునా? దేశమున నిరుద్యోగబాధ
పట్టములఁ జంకనిడుకొని పొట్టకొఱకు, మూల్గుదురవస్థ నెన్నాళ్లు మోయఁగలము! 25

గీ. యంత్రములువచ్చి మనశక్తి నాహరించె
నింజనులు వచ్చి మనచేవగుంజుకొనియెఁ
గలిమి పోవచ్చు రావచ్చుఁ గాని మేని
బలిమి పోయిన వచ్చునా? బ్రహ్మకైన 26

క. దంచినబియ్యము గానుగ, దించిన తైలాదికములఁ దిరుగటిపిండిన్
మంచివి గావని రోసిన, మంచములే మనకు దిక్కు మాపులు తేపుల్ 27

ఆ. మందులేక చచ్చు మానిసి మనపల్లె, నుండరాదు ప్రాణి యెందరాదు
వాడవాడ కొక్క వైద్యు రప్పించుట, మానరా దుపేక్ష పూనరాదు 28

ఆ. ఒకనిగోడప్రక్క నొకఁడు పుల్లెలు వైచి, కులుకరాదు గెలుపు గొంటి మనుచు
వానివీనికంపు వాడల కెగఁబ్రాఁకి, వెతలఁ గూర్చు నూరి బ్రతుకు నార్చు 29

క. వఱువాత లేచి వీథుల, గరగరగా నూడ్వవలయు గ్రామప్రజ; లం
దఱసుఖమే తనసుఖ మను, పరమార్థ మెఱుంగవలయుఁ బ్రతిమానవుఁడున్ 30

క. సహకారసంఘములదెస
కహమహమిక నేగవలయు నార్థికలాభ
స్పృహఁ జూపవలయు సాహుల
కహరహమున్ వంగి క్రుంగు టది పోవలయున్ 31

క. మనపాఁడికి మనపంటకు, మనుగడ కాధారమై శ్రమంపడు పశువుల్
తిని తిరుగఁ దగినబీడుల, నొనగూర్పఁగవలయు నూరనూరన్ మేరన్ 32

గీ. పంచదరికెల్ల వరి నాటి పాఁడియావు, మేపునకు మైలుఱాలను జూపరాదు
దోమలకుఁ జిక్కి రోగాలఁ దోఁగి తోఁగి, మూల్గరా దకటా! ప్రజ నీల్గరాదు 33

గీ. అడవులను గాల్చి దున్నుట, వెడఁగులపని; గగనచుంబివిటపిచ్ఛటతోఁ
గడుకొని వను లున్నప్పుడె, జడివానలు కురియు నన్నసత్రములగుచున్ 34

ఆ .ప్రజలజీవనమ్ము పండింప నిండింప, దొరతనమ్మువారు తొడఁగినారు
మండలములలో సమాజవికాస కేం, ద్రముల నేర్పరింపఁ దరలినారు 35

క. ఐదేండ్ల కొక్క మెట్టుగ, నీదేశము నుద్ధరింప నెంచిరి, ప్రజలో
నాదారు బ్రదుకు కన్పడ, రాదని చాటించి రెల్లరాష్ట్రములందున్ 36

క. నాగార్జునసాగరమున, కేగొడవయు లేనితీర్పు లేర్పడె నదవుల్
మాగాణు లగును ఢిల్లీ, భోగమ్ములు పండు ఆతిపారమీఁద నిఁకన్ 37

క. ఒకకృష్ణ యనఁగ నేటికి, సకలాపగ లిఁక నపారసస్యశ్రీ మా
తృక లగు, నేల్బడివా రీ, సుక మేర్పడుదనుక విడువఁజూదరు దీక్షన్ 38

క. మనసంపద మనసంస్కృతి, మనకీర్తిని బెంపుసేయు మంత్రులు కల రి
ష్టణఁగె నపశ్రుతు లన్నియుఁ, దెనుఁగుందేజముల నెల్లదెస లొప్పు నిఁకన్ 39

ఆ. కోట్లకొలఁది సొమ్ము గుప్పుచున్నారు దే, శమునుదిద్దఁ బ్రభుతసల్పువారు
నవ్యభారతమ్మునకుఁ గంకణమ్మును, గట్టినారు జంకు నెట్టినారు 40

క. మనవిత్తము మన చిత్తము, మనతను వీయజ్ఞమున సమర్పింపవలెన్
మనరాగము మనత్యాగము, మనభోగము గని జగంబు ప్రమాన్పదవలయున్ 41

ఆ. లోకమెల్ల మనకు లోపడుఁ గాక సం, స్కార మబ్బకున్న ఘనత రాదు
వినయ మార్జవము వివేక మౌదార్య మీ, నాల్గు సంస్కృతికిఁ బునాదిఱాలు 42

గీ. ఏది చేసిన ధర్మువు నెదుటనిల్పి, చేయవలె మానవుఁడు వక్రచింత లేక
ధర్మదూరము లైన యర్థములు గాని, కామములు గాని సుగతికిఁ గావు కావు 43

ఆ. పెక్కునీతు లేల యొక్కటి చాలు; నా, యొక్కదానిఁ జెప్ప నూరు చాలు
వలచివచ్చు కైతవడిఁ జిన్నపుచ్చుఁగా, నోడి యింతపాట పాడినాఁడ 44

## 1955-56

# దేశరక్షణ

మ. అరరే! యెంతకు సాహసించితివి! సత్యాహింస లశ్రాంతమున్
బరమార్థం బని నమ్మి సర్వవసుధాబంధుత్వ మాసించు మా
భరతక్షోణికె చిచ్చు వెట్టితఁటరా! పాపాత్మ చైనీయ! నీ
తెఱఁగున్ గన్గొని దేశదేశములు ధిగ్ ధిగ్రావముల్ చేసెడిన్ 1

ఉ. ఏ మసమర్థతన్ బడి యహింసకు నొగ్గినవార మంచు నే
మేమొ తలంపఁబోకుము సహిష్ణులుగా జగదేకవిక్రమ
స్థేములుగా మమున్ దతిమిదిద్దు మహాత్ముఁడు గాంధి మా మన
స్సీమల నేఁటికిన్ గలఁ దజేయమహస్సముదీర్ణమూర్తియై 2

ఉ. కత్తిని గత్తితో నణఁపఁగా దని పల్కెద; మింతెకాక యీ
నెత్తురుకూడు కీ దని యనిన్ దెగనాడినక్రీడి ధైర్యవి
చ్ఛిత్తియు నింద్యవృత్తి యని చెప్పెద; ముత్తమధర్మరక్షకై
యెత్తిననాఁ దగత్య మగునేని వరించెద మస్త్రశస్త్రముల్ 3

చ. అసురుసురై గడించుకొనినట్టి స్వరాజ్యము, బాపుజీతపః
ప్రసవముగా బయల్మెఱసి ప్రస్తుతిగన్న స్వరాజ్య, మిష్టు నీ
బుసబుస కుల్కి క్లైబ్యమున బ్రుంగి త్యజింపము; రిత్తరిత్తగా
నసువులు కోలుపోక జగ మౌ నన వచ్చినత్రోవఁబట్టుమా! 4

ఉ. ముక్కడిమూఁకఁ జూచుకొని మోహమునం బడఁబోకు మోయి! మా
యొక్కొక భారతీయభటుఁ డొక్కొక వజ్రపుముక్కసుమ్ము!తా
నెక్కటికయ్యమందు యమునే నెదిరించుట కోహటిల్లఁ; డీ
పెక్కువ క్రొత్తగాదు కనిపించు యుగమ్ములనుండి మొక్కలీ! 5

ఉ. ఇద్ధచరిత్ర భారతమహీమహిళన్ విన వాక్కొ! భీరుతా
విద్ధముగాని దెందమున విశ్వజనస్తుతి దక్కె నీమెకున్!
క్రుద్ధభుజంగివంటి దనుకొమ్మిది కోల్తల సేయుపట్లు; మీ
యుద్ధతి దూల్పమాయువతియొక్కతి చాలునురా! దురాశయా! 6

మ. తొలిగెల్పుం గని సంబరపడుచు గంతుల్వెట్ట కోరోరి! మున్
తులువల్ పెక్కురు విఱ్ఱవీఁగి తుదకార్తుల్ గారె కయ్యాన; మా
వలనన్ ధర్మమునిల్చి యుంట సమరవ్యాపార మేపార మం
జులరోచిన్ జయలక్ష్మి మా కెదురువచ్చున్ తేపు ముమ్మాటికిన్ 7

ఉ. అచ్చపుమంచుఁగొండ నెలవై వెలయన్ బరమప్రసన్నతన్
నిచ్చలు ప్రొద్దుపుచ్చు మహనీయుఁడు మాశశిమౌళి రుద్రుఁడై
చిచ్చులకన్ను విచ్చునటు చేసితి వక్కట! దుర్నివారమై
వచ్చెడి యీమహావిలయవహ్నికి నీఱయిపోక నిల్తువే 8

శా. నీతో నెందఱు బూదిపా లగుదురో నీ బుద్ధి నూహింప కీ
శీతాద్రిన్ నవరక్తధాతుపటలిన్ సృష్టించి దృష్టించుచున్
జేతఃప్రీతి గడించుకోఁ దలఁచితే! చీనీ! భవత్ క్షుద్రపుం
జేఁతల్ రోఁతలు గూర్చెఁ జాలు నిఁక నిస్సీ! దుర్విదగ్ధక్రియల్ 9

ఉ. లోకమునెల్ల నొక్క త్రుటిలో మసిచేసెడి మారణాయుధా
నీకము పుట్టి నేలకును నింగికి వ్రేఁగయినట్టివేళ నీ
దూఁకులు బాఁకు లీ కదనదోహల మేటికి వల్లకాటికా?
నీ కనులింతగ్రుడ్డి వగునే! పరికింపవు సర్వనాశమున్ 10

ఉ. నీ కిలువేల్పు బుద్ధుఁ; డిది నిన్నటిమొన్నటివార్త కాదు; హిం
సాకులమై వగర్చు జగ మాతనిధర్మమె తారకమ్ముగాఁ
జేకొనఁ జూచువేళ నసి చేకొని వచ్చితి వేమి? యేమి యీ
మైకము? దుగ్ధమున్ వదలి మద్యము గ్రోలినయట్లు తోఁచెడిన్ 11

ఉ. సత్యము వట్టికల్ల యని చాటఁదలంచి కుతర్కధోరణిన్
నిత్యము వాఁగినన్ నిలుచునే? మనకున్న యుగాలనాఁటిసాం
గత్యము మట్టిలోఁగలిపి కాఱులుప్రేలకు మెంతచేసినన్
వ్యత్యయ మేలవచ్చు విజయంబె వశంబగు గాక పాడికిన్ 12

26-12-1962

# నాకు వచ్చిన లేఖ

ఓహెూహెూ! రాష్ట్రకవీ!, ఓహటిల్ల వలదు! వలదు!
దేహమునకు విలువ యెంత?, దేశమునకు విలువ యెంత?-

నీ వెఱుఁగని ధర్మంబులు, నీతులు జీవనరీతులు
లేవుగాని మోహపంక, లేపముతో నిటులైతివి -

మాతృమహీ గౌరవములు, మానవునకుఁ బ్రాణమ్ములు
స్వాతంత్ర్యము లేనిజాతి, చచ్చుజాతి మచ్చుజాతి-

రెచ్చి రెచ్చి తనగడ్డకు, వచ్చిన శాత్రవుల నణఁప
వెచ్చని వెచ్చని నెత్తురు, వెచ్చింపని ప్రాణి యేల?-

మనది వీరజాతికదా!, మన కేటికిఁ బిఱికితనము?
తనువు కాదు కాదు గురూ!, మనకు వలయుఁ జెదనికీర్తి -

జబ్బులతో గబ్బుగొట్టి, చావరాదు రాచబిడ్డ
ఉబ్బుచు వైరులఁద్రుంచుచు, నొఱగవలయు వాఁ డనిలో

నాపుణ్యం బేనాఁటిదొ, ననుఁ జేర్చెను రణభూమికి
బాపూజీ సాధించిన, భాగ్యము కాపాడెద నిఁక

రానీయను నల్లమందు, రక్కసి నీకొండపైకి
రానీయను మువ్వన్నెల, రాజిలుజెండా కవనతి -

సత్యము ధర్మము వీడని, జగ మీభారతదేశము
దైత్యులు చైనేయుల కిది, దక్కదులే! యెప్పటికిని

జగజ్జనని కాత్యాయని, భగవానుఁడు శివుఁ దేలెడి
నగముపైకి దండెత్తిన, నాస్తికునకు లేదు గెల్పు

తుహినమహీ సంచరణము, దుర్భర మని భావింపకు!
మహోఋషుల చిరతపములు, మా కాఱని చలిమంటలు

నమ్ముము! నీనందనుఁ డీ, నారాయణ పల్కుమాట
అమ్మయు నీవు నొసంగిన, యాశీస్సులె నాకవచము

**3-1-1964**

# స్వతంత్రభారతి

ఆ. కాలగర్భమందుఁ గలఁగుచు నలఁగుచుఁ, దొంబదేండ్లు కాఁపురంబు బొనర్చి
ప్రభవమందినట్టి భారతస్వాతంత్ర్య, రమకు నిత్యవిజయ మమరుఁగాక! 1

ఆ. నేఁటికిన్ బదేండ్లు దాఁటె బాలారిష్ట, కాండ నెట్లొ కడచి గట్టుపట్టి
చక్కఁదనమునెల్ల సవరించుకొనెడి నీ, పాప క్రొత్తపుట్టుపండువునకు 2

సీ. కడదాఁక రిపుచేతఁ బడని నానాసాహె
బాకంటి మెఱపులో నధివసింప
నభిమానఖని తాంతియావీరసింహ మా
గంభీరవదనరంగమున విడియ
నేకజాతీయతాకృతి బహదూరుషా
యాప్రసన్నోక్తి వాహ్యాళి సలుప
శూరతాజ్యోతి ఝాన్సీరాణి యామేని
మురుపులో దాఁగురుమూఁతలాడ 3

గీ. దయకు సత్యమ్మునకుఁ బెన్నిధానమైన, గాంధి తనమ్రోల నద్దమై కానిపింప
దిద్దుకొనుచుండెఁ దన తీరుతీయములను, భారతీయస్వతంత్రతా భాగ్యలక్ష్మి 4

చ. తనకొఱకై సమస్తమును ద్యాగమొనర్చిన దేశభక్తులన్
వినయవినమ్రయై కొలుచువేళ నిజోదయముఖ్యహేతువై
తనరినయట్టి గాంధి కఱుతన్ సుమదామము వైచి కన్గవన్
దొనఁకెడి మోదబాష్పములతోనభిషేక మొనర్చునేఁడహో! 5

సీ. నగరసీమలఁ బెత్తనము సేయు కాంగ్రెస్సు
పల్లెపల్లెకు బహిఃప్రాణమయ్యె
నెఱ్ఱటోపీఁ జూచి యిట్టింకునెడఁదలో
వెల్లియై ప్రవహించె వీరరసము
పొగలతో సెగలతోఁబోరాడు తెగలలో
నన్యోన్యసౌహార్ద మవతరించె
నెందకన్నెఱుఁగనియింతి ధిక్కృతి పల్కె
రవి యస్తమింపని రాజ్యమునకుఁ

గీ. గత్తికంటెను గవచమ్ముకంటె సత్య, దీక్షయు సహింసయును మేటిరక్ష లయ్యె
బాపుజీకనుసన్నలో భారతమ్ము, నడచి పడసిన యీబల్మి చెదనికల్మి 6

ఉ. హేతికి హేతి పట్టు టొకటే మొనమొన్నటిదాఁక మాన్యమౌ
నీతిగ నుంటఁ బ్రాక్తను లనింద్యులె కాని మథించి చూడ నీ
హేతుల కంత మెక్కడ? సహిష్ణుత యొక్కఁడలోకశాంతికిన్
హేతు వటన్న గాంధిపలుకే కద నేఁడు శరణ్య మయ్యెడిన్ 7

క. ఈ పలుకుఁ బట్టి ధర్మ, స్థాపన మొనరింపఁ బ్రతినదాలిచి ప్రజకై
రేపవలు పెనఁగు సేవా, రూపుఁడు జవహరుఁడు జయనిరూఢుం డగుతన్ 8

గీ. పంచవర్ష విధాపరంపరలు నెఱపి
పంచశీలపథానుజీవనము పఱపి
యింట బయట నపూర్వసౌహిత్యమునకు
మూలమై నిల్చు ధన్యతామూర్తి యితఁడు 9

ఆ. ఇరుగుపొరుగువారితృప్తిలో మనతృప్తి
కలదటంచు నాయకులు వచించు
మాట శిరమునందు మందారసుమముగా
నిలుపుకొంట ప్రజల నేర్మిపంట 10

ఉ. వచ్చినపెత్తనమ్ము చిరవైభవ మీవలె, జాతిరీతిలో
నచ్చుపుమైత్రి పుట్టవలె, నాఁకటిమంటలతో నవిద్యతో
ముచ్చుముడుంగువారు నగుమోములతోఁ దలయెత్తఁగావలెన్
మెచ్చి స్వతంత్రభారతికి మేదిని హారతిపట్టఁగావలెన్ 11

30-7-1957

## ఊరస

చ. పదవులమీఁది మోహములు పైకొని విస్మృత దేశగౌరవా
భ్యుదయులుగాఁ బ్రజల్ చెదరియొడ్డులుపన్నఁదొడంగి; రీతెగుల్
ముదురకముందె మందొసఁగి ముష్కరులన్ సవరింప నిర్మముల్
కదలవలెన్ మహామహులు కాంగ్రెసు పెద్దలు పల్లెపల్లెకున్ 1

ఉ. ఎక్కుమ! యెక్కు! మంచొకనినింద్రపదమ్మునఁజేర్చి పేర్చినల్
దిక్కులు పిక్కటిల్ల వినుతింతురు ముంతురు పూలజల్లులో
నక్కట! వానిరొప్పు సగమైనను డిందకముందె తంత్రముల్
పెక్కులు పన్ని డించెదరు పెద్దలు; పిన్నలమాట యేటికిన్ 2

ఉ. వంకలు వందలున్నఁ దనవంతు ముహూర్తము వచ్చుచో నరుం
డంకిలిలేని గౌరవము లందును బెండ్లికుమారుఁడై; యశో
లంకృతులైన పెద్దలు కలంగక పల్లకినున్న పిన్న కి
ర్వంకలఁ బాదచారులయి వత్తురు, వచ్చిన నేమి లోటగున్ 3

ఉ. అందఱు నొక్కలగ్నమున నందలమెక్కరు, భావభేదముల్
వందలువేలుగా సభల వచ్చునుగాక జయించినట్టి పా
ర్టిం దలఁ దాల్చుటొప్పు, వికటించెదరేని ప్రజాప్రభుత్వముల్
చిందఱవందఱై చెడును జిల్లులువోయిన ముట్టిముంతలై 4

ఉ. ఎక్కినవాఁడు నానొసటనే పొడిచెన్ రవి యంచు నా కులం
బొక్కటి చాలు నే గెలుపునొందుట కంచు బుజాలు ద్రిప్పుచున్
నిక్కఁగరాదు పాదుకలు నీట ధరింపఁగరాదు, నమ్రతా
రుక్కలితాత్మవైభవ నిరుద్ధవిపక్షబలుండు కావలెన్ 5

ఉ. ఎక్కినవాఁడు ధర్మమున కెగ్గొనరింపక యెల్లవారికిన్
జక్కనిచుట్టమై వెలయు చందము నందము నేర్చుకోవలెన్
జక్కటిఁ దప్పినప్పుడు విచార మొకింతయు లేక నమ్రుఁడై
గ్రక్కున గద్దెవీడవలెఁ గార్యమిదేయని విన్నవించెదన్ 6

చ. కలఁతలు పుట్టవచ్చు, నలుకల్ మొలకెత్తఁగవచ్చు, వర్గముల్
వెలువడవచ్చు దేశమున; వీసముకా దరవీసమేనియున్
వెలచెదరాదుపాడి, కది వెల్వలఁ బోవఁగరాదు, పోయెనా
నలియగుజాతి కుక్కలును నక్కలునుంబడరానిపాటులన్ 7

ఉ. జాతికి నెగ్గువచ్చుపని సల్పఁగరాదు నరుండు, జాతికై
యాతఁడు స్వప్రయోజనము నాఁగి పెనంగుట నీతి, జాతిపెం
పే తనపెంపుగా నెద సహించుట వాని కవశ్యకృత్య, మీ
రీతియె శాంతిమూలము ధరిత్రికిఁ దారక మీసరాగమే! 8

**30-12-1958**

# అర్చన

చ. పరువపు రేకసాగిమెయిఁబ్రాఁకియుఁ బ్రాఁకనినాఁడె మోముపై
మురువులుచిందుమీసములు మొల్చియు మొల్వనినాఁడెప్రోడయై
గురువులకోపు గాచి కవికుంజరులన్ జలిపించుధీరునిన్
మఱవఁగఁ దెల్గువారితరమా శివరామకిశోరసింహునిన్ 1

చ. ఇతనికిఁ గష్టముల్ సుఖము లెట్లు సమంబులొ యట్లెజాతులున్
మతములు వంగసమ్ములును; మాయురె! వీనితపోగ్నికీలలో
హుతమయిపోయెసర్వవిషమోహము మోహము; సుప్రసన్నతా
స్థితమతు లంతనంత వికసించిన వీతనిజీవితమ్మునన్ 2

మ. ఇతఁడోహెూ! ఋషిచక్రవర్తి; ధిషణా హేతిన్ హృదంతర్విరో
ధితతిన్ జెండి నిరంతరాత్మసుఖవీధిన్ ధర్మపీఠస్థుఁడై
శ్రుతిసామ్రాజ్యము నేలు; నీతనిగుణస్తోమం బుదాత్తమ్ము సం
స్తుతిపాత్రంబగుచున్ గవీంద్రులకుఁగూర్చున్ నిర్భరానందమున్ 3

ఉ. అన్నిటికంటె నాకు నితఁ డాప్తుఁడు నాత్మసఖుండు; మున్నుగాఁ
బ్రన్ననిగద్యమం దితఁడు పల్కినగాంధిచరిత్రమున్ జగ
త్సన్నుతిపాత్రమున్ సుదువఁజాలితిఁ బద్యమునందు నేను; నే
నన్నఁ గరంగు నీతఁ డితఁ డన్నను నేను ద్రవింతు నెంతయున్ 4

శా. నాకీ 'యాంధ్రధనలంద' మున్ను ఘనసన్మానమ్ముతో మోదమున్
రేకెత్తించెను గాని దాని కుఱవౌ నిర్వృత్తి చేకూర్చె నేఁ
డీకవ్యగ్రణి కీమహాఋషికి నీ హేవాకవారాశి కీ
నైక బ్రాహ్మికి నర్చనల్ నెఱపి గణ్యంబైన విద్వత్సభన్ 5

# జయ! జయ!

చ. జయ! జయ! షష్టివర్షవయసా పరిపక్వ రసైకభావనా!
జయ! జయ! నిర్నిరోధయశసా పరిపూర్ణ కవిత్వజీవనా!
జయ! జయ! చిక్కణోక్తిపయసా పరిపోషిత సాహితీవనా!
జయ! జయ! విశ్వనాథమహసాపరిపూత! కృతాంధ్రసేవనా! 1

చ. అఱువదియేండ్లఁ జుట్టుచు నిరంకుశమై పరువెత్తు కాలపుం
దురుసులు సైఁచి మానవుఁడు తొల్లి జనించినయేఁటిపట్టు క్ర
మ్మఱఁగనుఁగొంటభాగ్యముసుమా! సుకృతమ్ములుపండిపండిమ
మ్మరమయి నీ కనేకములు మన్మథదర్శనముల్ ఘటిల్లుతన్! 2

ఉ. చిక్కని సౌరభమ్ము విరఁజిమ్మెడి కమ్మని తెల్గుఁదోఁట నీ
త్రొక్కనిబాటఁ గాన మకుతోభయతన్ రసరాజ్యవీధి నీ
వెక్కనిగద్దెఁ జూడము కవీంద్రులు నన్నయతిక్కనాదికుల్
దక్కిరి మాకు నేఁటి కిటు తావక రూపమునన్ మహాకవీ! 3

సీ. ఒఱపుగాఁ బండిన మిరెపగుమ్మటములోఁ
గుంకుమాంకితఁ బెండ్లికూఁతుఁ జూచి
పాయలుదీసిన పంటపొలాలలో
సస్యసీమంతినిసౌరు నెంచి
మిడియెండలోఁ జేల నడుచుచు వరిమ్రోళ్ళ
చిలికినమంచుబొట్టులను దడిసి
ఆ వీనినట్టిరే యాలితో జాగర్య
గావించురైతుసౌఖ్యము భజించి

గీ. అద్దిరా! కాఁపుఁదనమెల్ల నాఁచికొన్న
భావుకున్ నినుఁ గన్న నాపండ్లు పులియు
విశ్వతోముఖశేముషీ విభవలబ్ధ
నిఖిలధర్మానుభూతి మానితుఁడ వీవు 4

శా. నీ కేకాగ్రత జీవగఱ్ఱ - కృతులన్ నిర్మించుచోఁ బాడుచో
వాకల్ గట్టును బాష్పముల్ । రఘుకులస్వామిన్ బ్రకీర్తించుచో
లోకం బన్నది విస్మరించెదవు నీలో భక్తియోగమ్ము నా
లోకింతున్ గవితామయమ్ము నఘుధూర్ణుంటాకమున్ సత్కవీ! 5

శా. గుట్టుల్ మట్టులు విప్పి రామకథనిగ్గుల్ చాటి నిర్భీకయై
పుట్టంబుట్టినవానితోఁ దొదరి గెల్పుంగన్న నీవాణి బ్రాఁ
బుట్టింబుట్టినవానితో నెదిరి మెప్పుల్వొంది యందాలకుం
బట్టుంగొమ్మగ జాతికిన్ బ్రియతరప్రాణమ్ముగా నిల్చుతన్! 6

చ. కవులు ప్రజల్ పరస్పరవికాసములన్ మది నిల్పి సత్యమున్
శివమును సుందరమ్మునగు జీవనమున్ గడియించి దేశపై
భవమున కండదండలుగ వర్ధిలుచుందురుగాక! విశ్వమా
నవ నవభావసీమ "సహనావవతు"ల్ రవళించుఁగావుతన్! 7

**14-1-1956**

# ఒకగెల్పు

ఆ. వారివీరిపొత్తు కారణమై నేను, సస్యమునకు లొంగినాఁడ ననుట
బుద్ధిలేనిమాట, పోరానిపాపముల్, మూటగట్టుకొనెడి చేటుమాట 1

క. నా చిత్తము దుర్బలమై, నీచవ్యసనంబు లోకనింద్యం బిది నన్
లోఁచినది యేచి బారలు, సాఁచినది కవీంద్రు గెల్వఁజాలితి ననుచున్ 2

క. ఒకయేఁడా! పదియేండ్లా!, యకటా! నను నల్వదేఁడు లణఁచిన దిది నా
తికమక కే మని వగచెద, సుకమౌ నని దీని కిడితి జోహారువులన్ 3

ఆ. సిగ్గువిడిచి తొలుతఁ జేతులు సాఁచితిఁ, బిదప సంచికట్టు పెట్టుకొంటిఁ
బొడుము నమ్ము పుణ్యపురుషుఁ డెవ్వం డనివెదకివెదకి దీని విలుచుకొంటి 4

ఆ. గంట కొక్కసారిగా మొదలై యర, గంట కొక్కసారి - కాదు - పావు
గంట కొక్కసారి - కాదు - నిమేషాన, కొక్కసారి రేఁగె ముక్కుతీఁట 5

గీ. పొడుము గా దిది చదువులపొలఁతిమేనఁ, జిటిలి ప్రిదిలి మానవులకుఁ జిక్కి నట్టి
గంధపుంబూఁత యని జగాకైతతోడ, మెచ్చుఁదొడఁగితి నస్యంబు నిచ్చదీఱ 6

క. అన్నము దినుచున్ బీల్చితిఁ, బున్నెములకు నెలవు లైన పురుషులమ్రోలన్
విన్నంబోవక పీల్చితి, నన్నన్నా! పొడికి నెంత యారటపడితిన్! 7

ఆ. ఎపుడు నిద్ర సడలెనపుడు తటుక్కునఁ, జేయి కదలెఁ బొడుముకాయదెసకు
నువిద లేని సెజ్జ నోర్చితిఁ గాని న, స్యంబు లేని సెజ్జ సైఁపనైతి 8

గీ. చచ్చుపొడుము బజారువాఁ డిచ్చుపొడుము
లొచ్చుపొడు మిది రోగాలఁ దెచ్చుపొడుము
వలదు వలదని వలయువస్తులను గూర్చి
తీఱుబడి చూచి సస్యంబు నూఱుకొంటి 9

గీ. ఇంటినేయి లంకపొగాకు హెచ్చుతగ్గు, లేనికాపు నవోదితమైన సున్న
మేకమై పాకమై రుచిశ్రీక మైన, గాటుతో సొంతపొడుము సాక్షాత్కరించె 10

క. ఇది కొంచెము రుచిచూడుఁడి, యిది సొంత మటంచు దాని నితరుల కిడి వా
రదిరా! కమ్మఁదనం బన, మదినుబ్బుచుఁ బీల్చినాఁడ మఱియున్ మఱియున్ 11

గీ. ఎంతపీల్చితినో జగ మెంతరోఁత, పడియెనో నన్నుఁ జూచి నాపాటుఁ జూచి
యేల పీల్చితినో దీన నెట్టిఫలము, గంటినో యవివేకంపుఁబంట నేను 12

ఆ. రాను రాను బొడుమురాయిడి హెచ్చి నా, ముక్కు మొగము రోఁత కిక్క లయ్యె
మాటతేట సెడియె మదుపులసొగసెల్ల, జాతిపోయెఁ జూపు సన్నగిల్లె 13

ఆ. ఎంతసెడిన నేమి యేను, నస్యంబుపై, వల్లచఱవలేని మనిసి నైతిఁ
గుంది కుంది తుదకుఁ గ్రం దిది మెలమెల్ల, దాఁటవలయు నన్న బాట గంటి 14

గీ. దంతధావన మొనరించినంత నొక్క
గంటతడ వీపిశాచము నంటుకొనక
శౌచసుఖ మందవలె నన్న సమయ మేర్ప
రించుకొంటిని గాసె బిగించి మొదట 15

క. ఒకనాఁడు పండ్లుదోముచు, నిఁక నస్యసుఖమ్ము గంట కీవల రాఁబో
దు కదా యని పొడు మూరక, చెక చెక జుట్టితిని వెట్టి చిడిముడిపడఁగన్ 16

క. డబ్బీపొడు మంతయు నా, గుబ్బుకొనన్ ముక్కునందుఁ గ్రుక్కితి నవలన్
మబ్బుపయి మెఱుపువలె నా, గబ్బిమదిన్ దలఁ పొకండు కదలన్ దొడఁగెన్ 17

ఆ. ఎంతచేసె నస్య! మిా నాల్గునిముసాల, నింతదుమ్ము పీల్చు టేమితెలివి?
గంటకాదు జాముకాదు జీవితమెల్ల, ముట్టకున్న నెట్టిముప్పు వచ్చు 18

ఆ. పొడుము లే కెవండు మడిసె నిసీ! యిది, యుర్వి నెచట నెవని నుద్ధరించె
నల్లమందు చుట్ట నస్యము సిగరెట్టు, మరగి బాగుపడ్డమనిసి కలఁడె 19

క. ఏతాదృశతర్కము నా, చేతమునం దపుడు రేఁగి జీవితమం దీ
రోఁత నిఁక సైఁపరా దని, వీతవ్యసనుండనై వివేకముతఱుమన్ 20

క. ఉన్నపొడుము రాల్చి మన్నుపా లొనరించి, పగులఁగొట్టి బుఱ్ఱ పాఱవైచి
ముక్కులోని కుదక మెక్కించి యెక్కించి, చీఁది చీఁది శౌచసిద్ధి గంటి 21

క. ఏఁడాది యయ్యె నాకీ, పీడ వదలి; నేఁడు పొడుముపీల్వ సరిగదా
యొడెద నీవాసన క, ల్లాడెద నరుఁ డింత మాఱునటె! కట్టడకున్ 22

# జీవిత కళ

## మంజరి ద్విపద

ఓయన్నలార! ఓహెూ! తమ్ములార!, ఓమిత్రులార! ఓహెూ! తెన్గులార!
సంగీత నర్తన సాహితీ శిల్ప, వర్త కాదికము లర్వదినాల్గుకళలు
నేర్చుట సమ్మాననీయమే కాని, జీవితకళ నభ్యసింపనినాఁడు
రిత్తలాకళ లిసీ! చెత్త లాకళలు, 1

నిర్భయం బార్జవనిష్ఠ త్యాగమ్ము, సర్వధర్మప్రీతి శ్రమ మసంగ్రహము
దమము సత్య మహింస దయ వినయమ్ము,
సాత్త్వికాన్నము విశ్వజనసోదరత్వ, మొరునిదూఱమి దేశి కొప్పుకో లిడుట
జీవగఱ్ఱలుసుఁడీ! జీవితకళకు, మచ్చుముక్కలుసుఁడీ! మనుగడసిరికి 2

అధికారవాంఛ యహంకారపటుత, భోగాభిరతి లౌల్యభూయిష్ఠబుద్ధి
చెలరేఁగి చెలరేఁగి యిలభయంకరము, నవమానకరము నైనట్టి యీనాఁడు
కావలె జీవితకళ నేర్చువారు, రావలె ధర్మానురక్తులౌ వారు 3

గర్వాదివికృతులఁ గడచినవారు, సర్వమానవశుభాసక్తులౌ వారు
పాపమ్ములకు నేవపడియెడి వారు, బాపుజీభక్తులై భాసిల్లువారు
గురువు లీకళ నందఁగోరుశిష్యులకు, బరువు లీనెఱి లేని పాండితుల్ ప్రజకు 4

సాధింపుఁ డీకళన్ శ్రమ కోర్చి యోర్చి, బోధింపుఁడీ సంఘమునకుఁ బారమ్ము
కస్తూరిఘుమఘుమల్ కరణి మీ బ్రదుకు, పొరుగువారికి హాయి పుట్టింపవలయు
శరదిందుచంద్రికాసరణి మీవాణి, యిరుగువారికి నెమ్మి నెసఁగింపవలయు 5

31-8-1963

# రామసేవ

ఆ. నీకు వెఱచువారు నీముందు మోమోట, పదెదువారు లేరు పదుగురైన
నిన్ని వేలవిత్త మెవరు నీకిడిరయా, శేషయా! మహావిచిత్ర మాయె 1

గీ. నీవు సకలప్రజాప్రతినిధివి, నీవు, శుద్ధసంకల్పుఁడవు, ఫలావిద్ధమైన
కర్మయోగము నీభావకవచ మగుట, సిద్ధిగంటివిలే! రామసేవనమున 2

గీ. అఁకటిమంటల ద్రుగ్గెడి, చాకియు మంగలియు నీదుసందేశమునన్
రూకలు పంపెను రామున; కీ కదలిక నా కవిత్వహేతువు సుకృతీ! 3

క. నాపేరఁ జిన్న కానుక, మీపత్రికఁ జూచి యేను మిణికెడితతి 'నే
నే పంపితి' ననె మత్స్రుతి, యీపనిచేసినవెలందు లెందఱు కలరో! 4

క. ఆస్తికత నిట్లు రేఁపి స, మస్తాంధ్రప్రియత గన్న మహనీయుఁడ; వీ
శస్తము సామాన్యమె! నీ, నిస్తులతప మిట్లు విరిసె నీలము రాజా! 5

ఆ. గాంధి యన్న నీవు కరఁగెద వా యొజ్జ, రాముఁ దన్నఁగడుఁ గరంగి పొంగు
గురునిబట్టి శిష్యుగుర్తు లేర్పడు నన్న, వాదమునకు నిన్ను మూదలింతు 6

ఆ. 'లక్ష్మి' యనిన నీదులక్ష్య మెప్డో పండి, కురియుచున్నవోయి! కొసరువేలు
కొసరి కొసరి నీవు కూర్తువు రెండవ, లక్ష్మసైత మని తలంతు నేను 7

ఆ. శివుఁడు చంద్రమౌళి శ్రీరాముసేవకై, పెనఁగి పెనఁగియెదఁదపెంపు దెలుప
సెజ్జవై భజించు శేషయా! ప్రభుకార్య, మూన కెట్లు మిన్నకుందు వీవు 8

క. నీ విమ్మెయి వేయేఁడులు, జీవింపుము! భక్తలోకసేవధి తెనుఁగుం
దేవర భద్రాచల సీ, తావల్లభుఁ దలరి నిన్నుఁ దనుపన్ బెనుపన్ 9

8-11-1960

# చిక్రోడపంచదశి

క. బడి తొలఁగి నాకు నించుక, విడుమర యేర్పడిన దాది విడువక నన్నున్
మిడియెండ వచ్చి చూచెద; వుడుతా! నీభావ మెద్దియో తెల్పెదవా? 1

క. ఒకనాఁడు కాదు నా చెం, తకు దినదిన మేల వచ్చెదవు? వచ్చుటలో
నొకలిప్తయుఁ దడయవు గం, టకు నీకు ని దేమిలంకె? నాకుం జెపుమా! 2

ఆ. ఒంటిగంటయయ్యె నుడుత యేదీ? యని,చూచునంతఁ దోఁక నూఁచుకొంచుఁ
గిచకిచారవమ్ము పచరించుచు మదీయ, నంసపీఠి నెక్కి యాడె దహహ! 3

ఆ. వ్రాయుచున్న కైత వదలి రావే యని, దోయిలింప నటకు దూఁకె దీవు
మేనిచాఱలందు జానకీజాని నా, కభయహస్త మిచ్చినట్లు తోఁప 4

క. నీ వింతయలంతివి నీ, సేవయు నదియెంత? యైన శ్రీరామకృపా
సేవధి వైతివి యుష్మ, ద్భావ మగాధమ్ము భక్తిబంధుర మగుటన్ 5

ఆ. భక్తి కింత యగ్గపడునట్టె! రామయ్య, ప్రజ్ఞ కతఁడు తృప్తిపడయఁ డట్టె!
యీ మహారహస్య మెఱిఁగించి నామదిన్, దేర్ప వత్తువొక్కొ దినదినమ్ము? 6

క. ఈ పాండితి యీ కవనము, లీపట్టము లీప్రసిద్ధి యీశ్వరకరుణా
వ్యాపారమ్మునఁ జెల్లని, రూపాయలె? భక్తియోగరుచి లేకున్నన్ 7

ఆ. భక్తి నేర్తురెట్లు? ప్రహ్లాదుఁ డేగురు, నాశ్రయించి భక్తి నభ్యసించెఁ
బండిపండి యున్న ప్రాగ్భవసంస్కృతి, ప్రాణి నుద్ధరింపవలయుఁ గాని 8

క. నీ పూర్వజన్మములలో, నీపుణ్యము కలదొ లేదొ యే నిపుడైనన్
జూ పిడి యీయోగమ్మును, జేపట్టెదఁగాక యన్యచింత లిఁకేలా? 9

క. ప్రాతస్స్నాన మొనర్చెదఁ, జేతన్ దాళములు పట్టి శ్రీపతినుతిసం
గీతము పాడెద బమ్మెర, పోతనపద్యములు చదివి పొంగెద నెడఁదన్ 10

ఆ. రామనామకోటి వ్రాసెద నాసేతు, శీతనగము యాత్రచేసి వత్తు
నామములను దిద్ది తోమాలె ధరియించి, నిలిపికొందు నఱుతఁ దులసిబొందు 11

గీ. ఇల్లలికినంతనే పండు వెట్లుజరుగు, నిచ్చపడినంతనే భక్తి యెట్లుకుదురు
నెంతపెనఁగిన నిది యబ్బునే గుణత్ర, యమ్మునకు దవ్వుదవ్వుగా నరుగకున్న 12

క. ఓచిక్రోడమ! వెలికిన్, ద్రోచిన త్రిగుణమ్ములట్లు తోఁచుఁగదా! నీ
మైహాఱ; లెన్నితపములు, సైఁచిన మాచిత్త మింత చక్కంబడునా? 13

సీ. అఖిలభూతహితమ్ము నర్థించువారు నిం
దాస్తుతు లొకటిగాఁ దలఁచువారు
సుఖదుఃఖముల నొక్క చూడ్కిఁ జూచెడివారు
కృతమెల్ల హరికి నర్పించువారు
గతమోహులై వశంగతచిత్తు లగువారు
దేహాభిమానమ్ము తెగినవారు
భగవదారాధన పరతంత్రు లగువారు
నిత్యసంతుష్టిమై నెగడువారు

గీ. భక్తులై ముక్తులౌదు; రీపరమనిష్ఠ, యేడ నేనేడ? నీయమాయికత నైన
నేర్చికొందు నెదంద నోదార్చుకొందు, నిదియె శ్రీరామరక్షగా నెసఁగు నాకు 14

ఉ. అప్పపునెయ్యముం బఱపి యజ్ఞుని నన్నుఁ, గృతార్థుఁ జేయఁగా
వచ్చితి విన్నినాళ్లు; గుణ, పారము లిమ్మెయి నేర్పి నాకనుల్
విప్పితి, వీవు నాగురుఁడవే! యనుకొందు; మదంతరంగమున్
ద్రుచ్చుట కన్వహమ్ము నుదుతా! చనుదెమ్ము శుభమ్ము నీ కగున్! 15

**10-7-1960**



# విషయసూచిక

# ఆముఖము

తుమ్మల సీతారామమూర్తిగారు తెలుఁగునాట నేఁడును రాణించుచున్న పెద్దతరము కవులలో నొకరు. వారు తెలుఁగువారికి తెలియనివారుగారు. క్రొత్తగా నేను వారిని గూర్చి చెప్పఁదగినది లేదు. దేవునకు నైవేద్యము పెట్టుట మనయాఁకలి పెరుఁగుటకే యని యొక నవీనవిమర్శకుఁ డనెను. నే నీప్రస్తావన చేయుటయు నాప్రసిద్ధి కొరకే. ఈయవకాశము నాకుఁ గల్పించుట కవిగారి యౌదార్యమునకు గుర్తు.

సీతారామమూర్తిగారు రాష్ట్రకవి. గాంధీకవి ఆయన రాష్ట్రగానము చేసిన వైతాళికుఁడు రాష్ట్రసిద్ధికొఱకు రాష్ట్రాభ్యుదయము కొఱకు కలము పట్టిన వీరరాహుత్తుఁడు. ఈ శతాబ్దపు టాంధ్రచరిత్ర వారి కావ్యములకు కొన్నిటికి వస్తువు. నవభారతచరిత్రలో గాంధీయుగ మొక ముఖ్య ప్రకరణము. సీతారామమూర్తిగారు బాపూజీ ఆత్మకథను తెలుఁగున పండించి గాంధీ యాస్థానకవి యయ్యెను. బాపూజీ ప్రవచించిన సత్యాహింసలు వారి కావ్యములందు వివిధ భూమికలతో గోచరించును. మఱి మహాత్ముని ప్రధాన శిష్యుఁడగు వినోబా సాగించిన సర్వోదయమును గూర్చియు సీతారామమూర్తిగారు గానముచేసిరి రాష్ట్రాభిమానము, జాతీయత, సర్వోదయము అను మూఁడు తత్త్వములును త్రివేణీసంగమమువలె వారి కావ్య ప్రపంచమున మేళగించినవి. వారిది యుగానుకూలమైన కవిత.

ఈనాఁడు సీతారామమూర్తి గారు "సమదర్శి" యను ఈ కావ్యమును తెలుఁగునాటి కందించుచున్నారు. 'సమదర్శి' విలక్షణమయిన కావ్యము. ఇం దాయారంగములలో ప్రసిద్ధి పొందినవారి ప్రశంసలు కలవు. నీతిబోధనమున్నది. ధర్మప్రవచనమున్నది. చాటుప్రాయము లయిన పద్యము లున్నవి.

సీతారామమూర్తిగారు బాపూధర్మమును నమ్మిన, నమ్ముచున్న కాంగ్రెసువాది. ఆస్తికులు, కాని యీ కావ్యమున వారిపొగడ్త పొందిన వారిలో గాంధేయవాదులు కానివారున్నారు. నాస్తికులున్నారు. అయిన నేమి? వా రాయా ధర్మక్షేత్రములలో నిస్స్వార్థమగు సేవగావించి రాణించినవారు. కావుననే కవిగారి ప్రశంస కెక్కిరి. వాదభేదములను విదళించి, విషమదృష్టిని పరిహరించి, యితరుల సుగుణములను గ్రహింపఁగల ఓర్పు నేర్పు లున్నకవియే యిట్లు వ్రాయఁగలఁడు. ఇది శుద్ధమయిన గాంధేయతత్త్వము. మనకవిగా రీతత్త్వమునకు ప్రాణము పోసిరి. ఒక కవి సమకాలిక కవులను మెచ్చుట అరిదియేకాదు; అరుదును, సీతారామమూర్తి గారు సమకాలిక కవులకు సైతము జయకారములు పలికిరి. ఇది వారి సమదర్శనమునకు విజయపతాక.

తుమ్మలవారి కవితకు ముఖ్యలక్షణములు మూఁడు కలవు. ధారాళమయినశయ్య మొదటిది. మాధుర్యముతో కూడిన సౌలభ్యము రెండవది. మూఁడవది తెనుఁగుఁదనము. తెనుఁగుమాటలు గుదిగ్రుచ్చినంతనే తెనుఁగుఁదనము మొలకెత్తదు. ఆంధ్రభాష జీవద్భాష. దాని కారకము బహుధా విచిత్రముగా నుండును. ఇందు పదబంధములు లోకోక్తులు పెక్కులు కలవు. నుడికారము సొగసులుపోవుచుండును అన్నిటిని మించి తెనుఁగు గుండె గలవాఁడు తన తలంపులు వెలువరించు తీరుతెన్నులు గలవు వీని గుట్టెఱిఁగినఁగాని తెనుఁగుదనము పుట్టదు. సీతారామమూర్తిగారివలె తెనుఁగుఁదనమును వలచి వ్రాయఁ గలవా రెందఱో లేరు. ఈ పద్యమును చూచిన వీరికవితా లక్షణము తెల్లమగును.

**ఇంతనేర్చి నేర్చి, యిన్నాళ్ళు ప్రజలకై! నలఁగి నలఁగి, యింత కలఁగి కలఁగి**
**రైతుకల్పకమ్మురంగా గడించిన! పంట యెంత? తృప్తిపడుట యెంత?**

ముదిమి మూఁగుచున్నప్రొద్దులో సీతారామమూర్తిగా రీ 'సమదర్శి'ని రచించిరి. అయినను వారి పలుకుపదను నేఁడును తగ్గలేదు చెప్పఁదగినది యెంతబెట్టిదముగా నున్నను, మోమోట లేకుండ, చాటుట వారికలవాటు. వారిది కూచిమాట. గుళ్ళపల్లిపున్నయ్యశాస్త్రికి సాధువాదము లిచ్చుచు సీతారామమూర్తిగా రిట్లు పలికిరి.

**జందెముంటతక్క శాస్త్రియునొకమంత్రిగామికిన్ గొఱంతయేమికలదు**
**నాఁడు ఖద్దరైన వాడనివారలే! నేఁడు ప్రభువు లైరి వాడవాడ**

**కాంగ్రెసును దిట్టి బ్రదికినకవులు తక్క!**
**నొరులు లెక్కకురాకుంటయును ఘటిల్లె.............**

నేడు కవులలో నిట్లు చెప్పఁగల దిట్టలు తక్కువ.

ఆనందోపదేశములు కావ్యప్రయోజనములు. సీతారామమూర్తిగారి యితరకావ్యములందు వలె, "సమదర్శి"యందును ఈ రెండు ధర్మములు గలవు. ఉల్లమునకు వెల్గు నొడఁగూర్చి, సూనృత! ప్రీతి, లోకసేవ, ప్రేమ, కరుణ గఱపు రచనఁజదువమరగుఁడుప్రజలు! కోవిదులు గండు! మీకునొదవుజయము.

నాగళ్ల గురుప్రసాదరావు, ఎం.ఏ.

# సూడిద

ఉ. పట్టుబిగించి పొత్తములు బంధ్లకుబంధ్లు పఠించి యెవ్వియో
పట్టములన్ గడించుటయె ప్రస్తవనీయము కాదు; ప్రేమకున్
బుట్టినయి ల్లుదారతకు మూదల యావికి నందదండయై
నట్టిహృదిన్ గడించుట సమంచితకృత్యము మానవాళికిన్. 1

ఆ. తెలివిముదిరి వెఱ్ఱితలవైచి నరుఁ దధో, గతికిఁ జనెడి నేఁటికాలమందు
నచట నచట నాయఁడా! నినువంటి యు, త్తములఁ గందు హృదయధర్మరతుల. 2

చ. కొడుకులు లేనివాఁడు తనకూర్చినసంపద వేనవేల యా
మడలకొలంది నున్న కొఱమాలినచుట్టముపాలు చేసి వాఁ
డెడపెడ వెచ్చపెట్టుతతి నేడ్చు 'లబో' యని; నీవుమాత్ర మీ
బెడఁదను దప్పుకొంటివి వివేకవిఖండితమోహవల్లరీ! 3

చ. సిరిగలవారు భోగములచెంతకుఁ బోక జగద్ధితక్రియా
పరు లగు టొప్పు నంచు మనబాపు వచించినపల్కు నీదెసన్
గరము ఫలించె; నీరసలఁ గ్రాఁగుసమాజముగుండెపై భవ
చ్చరితము చాఁగురే! యమృతసారము చిల్కెను బుచ్చినాయఁడా! 4

మధ్యాక్కర
నీపేర నీయావి పరమహేతువై నిడుఁద్రోలునందు
రూపుదాల్చిన కళాశాల భవదాత్మరోచిఃపతాక;
ఏప్రొద్దు భారతీచరణమంజీర మృదుఘులంఘులలు
నీప్రాంగణమ్మున మొరయు; ధన్యతానిధి వోయి! నీవు 5

ఉ. నిన్నుఁ బరిష్కరించిన మనీషిచయమ్మున మున్ను మున్నుగా
సన్నుతిసేయఁదగ్గకృతి సైరికబంధువు గోగినేని రం
గన్న కరంగఁగా నెనరుకాలువలన్ బరఁగించి పల్లెటూ
రన్నతినందఁ జేసితె! గుణోజ్జ్వల! పాములపాటిసత్కులా! 6

చ. వినయ వదాన్యతా రుచిర వేంకటసుబ్బమ నీవధూటియున్
దన యనవద్యమైన సహధర్మచరీత్వము కోటికెక్కఁ దీ
ర్చెను సదనం బుమాపతికిఁ బ్రీతిగ శ్రీగిరినెత్తమందు; మీ
మనుగడ వస్తువై కవుల మాదృశులన్ గదలించు నాయఁడా! 7

ఆ. నీకు నఱువదేండ్లు నిండిన వని మహో, త్సవ మొనర్ప జగము సాగెనట్టె!
మంచిమాట వింటి మది నిర్భరానంద, భవన మయ్యె నుదితకవన మయ్యె. 8

మ. ఇదిగో! యీ 'సమదర్శి' కావ్యమును నీ కీనాఁడు మేల్బంతిసూ
డిదగా నిచ్చెద మాననీయజనగోష్ఠిన్ దీనిఁ గైకొమ్ము సొం
పొదవన్ విచ్చినమల్లెపూఁబొదవలెన్ యుష్మద్యశఃకాంతిసం
పద దిగ్భిత్తులకెల్ల వెల్లగ సుహృన్మౌళీ! విరాజిల్లఁగన్ 9

మ. విమలస్వాంతులు త్యాగమూర్తులు ప్రజావిక్లేశవిచ్ఛిత్తిల
క్ష్యముగా రాపిడిపడ్డవారు మహితాచారప్రియంభావుకుల్
సమదర్శిన్ సమగౌరవమ్ము గని రీసాహిత్యమున్ షష్టిపూ
ర్తిముహూర్తమున నీకొసంగి పరితృప్తిన్ గందు విద్యావనా! 10

ఆ. వయసువెంట నాత్మవైభవ మధికమై, మబ్బు విడిన గగనమణివిధాన
ముసురుకొనెడి మోహమును ద్రోసి విడుమర, మరగి సజ్జనుండు మెఱుఁగు దేలు. 11



'సమదర్శి' కృతిస్వీకర్త

**శ్రీ పాములపాటి బుచ్చినాయుడు**

# ప్రణతి

క. నీ కరుణ లేక యెవ్వని, వాకునకున్ జెలువు బలువు వచ్చు, నెవం డీ
లోకమున గణ్యుఁ డగు, నెవఁ, డాకల్పము చెదనికీర్తి నందును? వాణీ! 1

క. ఆదికృతికర్తయును గా, శ్రీదాసుఁడుఁ దిక్కనయు ఫలించుట కెన్నా
ళ్లేదీక్ష నిన్నుఁ గొల్చిరొ, తాదృక్షకవీంద్రు లెవరు తల్లీ! జగతిన్? 2

క. చక్కన లేకున్నను సిరి-, పెక్కువ లేకున్నఁ గులముబిగి లేకున్నన్
దక్కువ పుట్టదు నీ దగు, నక్కటికం బున్నవాని కదిరా! జననీ! 3

క. జ్ఞానేశ్వరికి విధాతృ, శ్రీనాథహరాదు లర్చసేయఁగ నవదా
తానర్ఘపద్మపీఠిక, పై నెలకొని వెల్గునీకుఁ బ్రణతి సవిత్రీ! 4

8-5-64

---

# సుకవి

ఆ. దేశభక్తునందు దీనునియందును, జెమట నోడ్చి బ్రదుకుజీవియందుఁ
గరుణ సూనృతమ్ము కలవానియందును, వాసుదేవుఁ జూచువాఁడు సుకవి 1

ఆ. వెలుఁగు నిచ్చు రవికి వెన్నెల నిడు నిశా, పతికిఁ గమ్మతావి పంచువిరికి
నీశ్వరునకు భేద మిసుమంత లే దని, యెతఁడు విశ్వసించు నతఁడు సుకవి 2

గీ. ఱాలు రువ్వినవానిపైఁ బూలు చల్లి, ముండ్లుగ్రుచ్చిన చేతిలోఁ బండ్లువెట్టి
రిపునిలో నిష్టసఖుని దర్శింపనేర్చి, యపహతక్రోధుఁడై నిల్చునతఁడు సుకవి 3

ఆ. ప్రాజ్ఞుఁడై ఫలానుబంధగంధము లేని, కర్మములకు వేల్పు కరఁగు నన్న
సత్య మెఱిఁగి నిత్యసాహిత్యసేవలో, నలసి నవసి తనిసినతఁడు సుకవి 4

ఆ. తనసృజించుకైత తనవరించుపథంబు, మేలి దని జనాళి మెచ్చునాఁడు
మురియ కెవఁడు వినయమునకు నాలంబన, మనఁగ మనఁగ నేర్చు నతఁడు సుకవి 5

2-4-67

## బాపూజీ

గీ. ఇతఁ డహింసాపరాయణుఁ డితఁ డనంత, భువనకల్యాణదాత యీబోసినోటి
ముదుకఁడే యాంగ్లసర్పము నదిమిపట్టి, వాఁడిగల వేఁడిగల కోఱ లూడఁబెఱికె 1

క. ఒకనెత్రుబొట్టు త్రావక, ప్రకటావనియెల్ల ముక్కుపై వ్రే లిడ ని
య్యకలంకుఁడు మనదాస్యము, పెకలించెఁగదా పునాదివేరులు కదలన్ 2

శా. ముద్రల్ కోట్లకొలంది వెచ్చపడినన్ ముంగైమురా మున్న సం
విద్రాసుల్ సరకార్లు విశ్వపరిషద్వీధుల్ ప్రఘోషించినన్
నిద్రం బాయనిపల్లెపట్ల కితఁ డున్మేషమ్ము సంధించె నీ
చిద్రోచిష్ణుజనుర్దినం బగుట వాసిన్ గాంచె నేఁ డెంతయున్ 3

గీ. రాజదండము వలదు, స్వర్గంబు వలదు, జననమరణార్తు లంటనిజగము వలదు
తెఱపిలేని దిగుళ్లతో దేవురించు, జనులఁ దేర్చుట వలయు నా కనియె నితఁడు 4

క. ఈతని సేవానిష్ఠయు, నీతని వినయంబు నితని యీవియు ధర్మ
ప్రీతియు నొదవుత నిచ్చలు, నీతఁడు సాధించురాజ్య మేలెడిదొరకున్ 5

క. పెద్దలనుబట్టి నీతికి, హద్దులు వాటిల్లు, వీని నందుకొనంగన్
దద్దయుఁ జూతురు పిన్నలు, పెద్దలె మూలము జగమ్ము పెరుఁగన్ విఱుగన్ 6

ఆ. వీథిలో సిమెంటువిగ్రహమై గాంధి, మెఱసినంత నేమిమేలు కలదు
మనసులో నితండు మహనీయతేజమై, తోఁచినపుడె ప్రజకుఁ దొలఁగు దోసఁగు 7

క. యుగయుగములకుం జాలిన, ప్రగతిని జూపించినట్టి భవ్యాశయు నీ
జగదాప్తుని భావించుట, తెగనీల్గెడి పాతకములఁ ద్రెంచుటయ కదా! 8

ఆ. గాంధివంటి ఋషులె కతముగా మానవ, హితము లావహిల్లె నెల్లయెడల
కనుఁడు బుద్ధుఁ డేమి కావించెనో జీస, సెది యొనర్చెనో సమీక్షచేసి 9

క. పట్టాకత్తులతోడను, జట్టమ్ములతోడ శాంతి సమకూరునొకో
నెట్టన కామాదుల నరి, కట్టిన యోగమ్ముతోడఁగాక జగానన్ 10

2-10-64

# ఆత్మజ్ఞానము

క. ఎవఁడతఁ? దధునాతనమా, నవుఁడా! యే మంతవిసరునన్ బోయెద? వాఁ
గవయా! కొంచెము మాటా, ద వలెన్ నీతోడఁ దమ్ముఁడా! యాఁగవయా! 1

క. మొనగాఁడవు కావచ్చును, మునుమిడి తిరుగాడవచ్చు ముల్లోకములన్
విను మొక్కటి; నీ వెంతటి, ఘనుఁడ వయిన వెనుకచూపు కావలె నీకున్ 2

క. వ్రేలాడుచు మింటంగల, గోళములే పరమసౌఖ్యకోశము లనుచున్
నీలో నెంచకు చిత్త, వ్యాలోలత నణఁచి కడఁగుమా నిజ మరయన్ 3

ఆ. నీదురాగ్రహమ్ము నీదూఁకుడును జూడ విస్మయమ్ము భయము విస్తరిల్లె
నక్కటకట! దారుణాసుర రాజ్యంబు, తెచ్చిపెట్టకోయి! తిరిగి యిటకు 4

చ. చదివితి శాస్త్రముల్ ప్రకృతి సర్వ "మసా"దని నీదుచేతిలో
నొదిఁగెను గాని యెంతహృదయోన్నతి నందితివయ్య! నీవు? నీ
మదిఁగల లాభలోభమదమత్సరముల్ విడనాడినాఁడవా?
వదలితివొక్కొ జాతిమతవర్గ విభేదకరప్రవృత్తులన్? 5

సీ. చంపివైచితి వహింసాజ్యోతి గాంధిని, దుర్మతావేశంబు తొందరింప
కాల్చి కూల్చితి జాతిగతదురహంతమై, సన్నుతాశయుఁడైన కెన్నడీని
రెండుగాఁ జీల్చ నేర్చితి విసీ! వర్గాభి, మానమ్ముతో విశ్వమానవతను
కేవలస్వార్థచింతా వశంవదుఁడవై, కల్పించితివి దురాక్రమణపరుల

గీ. తమ్ముఁడా! నీతెలివి వెఱ్ఱితలలువైచి, లోకమంతయు నల్లకల్లోల మయ్యె
చాలు నిఁకఁజాలుఁ గాలూని చక్కనిలిచి, చూడు మొకసారి నీచేయు కీడు మేలు 6

క. మేలున్ గీడును గూర్పఁగఁ, జాలును విజ్ఞానశాస్త్రచాతురి; యైనన్
దేలిచి యిది కీ డియ్యది, మే లనఁగా నేరనిదిసుమీ యది లవమున్ 7

క. విను మాత్మజ్ఞానమపో!, మనుజునకున్ దెలుపఁగలదు మంచిని జెడుగున్!
అణఁగు నిదిలేక లోకము, పెనుఁజీఁకటిఁ జిక్కి వగలపెల్లునఁ బడుచున్ 8

క. నరుఁ డీరెం డెఱకలతో, బిఱబిఱ ముందటికి సాగు విహగము తన రెం
డెఱకలతోడ నభస్సం, చరణక్రియ పూరగించుసరణిన్ ధరణిన్ 9

మధ్యాక్కరలు

తిరముగాఁ బ్రకృతిశాస్త్రమ్ము జగమున దీపించుకొఱకుఁ
బరిహరింపనవలె హింస; నీ రెంటిఁ బాయక నిలుపు
తెరువునఁ జనిన నియ్యవి సమూలమ్ము ద్రెళ్ళుటే కాక
యతీముతీ మానవజాతి సర్వంబు నణఁగారిపోవు. 10

అకలంకమైన యహింసకున్ దూరమై లోకమునకు
సుకము నీఁజాలదు ప్రకృతిశాస్త్ర మించుకయేని కనుము
వికలాత్ముఁడా! ప్రేమమూర్తి బాపూజీ వినిచినపలుకు
లొకసారి స్మరియించుకొనుము భక్తిసంయుక్తిమై నెడఁద 11

భూదానసవనకంకణము దీక్షమైఁ బూని యాఁకొన్న
పేదలమనుగడ నిల్ప బడుగు భావే పూఁట కొక్క
పాదుగా నడచుచు శాంతిమయము విప్లవమును దెచ్చు
నాదరింపు మితని విశ్వవాదము నమృతసోదరము 12

ని న్నీవు ప్రేమించుకొనెడికై వడి నీ యింటిప్రక్క
నున్నమానవుని బ్రేమింపు మని పల్కెనోయి! జీసస్సు
కన్నాఁడవా దీనికీలు? నీలోనఁ గల జగాజ్యోతి
యన్న! నీ దరివానియందును గలద యని తెలుపుటయ 13

భౌతికంబైన యీనాఁటి మేటివైభవముల నేన
నూతనముగ సృష్టిచేసినాఁడ గణ్యుఁడ ననుకొనకు
నీ తెల్వియెంత నీ వెంత వినయము నేరిచి విశ్వ
నేతగా వేల్పొకఁ డుండె నని గమనించి జీవింపు! 14

పరిణామశీలమై పరఁగుచుండెడి ప్రకృతియందెల్లఁ
బరమేశ్వరుఁ డొకఁడె నిండియుండె సర్వమ్ము నాతనిదె
నరుఁడ! వానిది వానికే సమర్పించి నలుసంత విడక
పరితృప్తినందుము కర్మఫలముపై వదలు మాసక్తి 15

ఇది క్రోధిసంవత్సరమ్ము తమ్ముఁడ! యీవును గ్రోధి
వదిర! నిప్పులు త్రొక్కినట్టి క్రోఁతివి యగుదువో యేమొ
బ్రదుకుట యన నేఁడు కత్తిపై సామువంటిది సుమ్ము
పదిలమ్ముగాఁ బొమ్ము నిన్ను నిచ్చలు బలయు భద్రమ్ము! 16

1–3–64

## పశ్చాత్తాపము

ఆ. తనయొనర్చినట్టి త ప్పెఱింగి నరుండు, నొచ్చుకొనుట కసటు వ్రచ్చుకొనుట
యొదలి నుజ్జగింప కొండొక పుట్టువు, నందుకొనుట సుఖముపొందు గనుట

1-5-66

## శౌంఠిరామమూర్తి

సీ. యుగయుగమ్ములు బొజ్జ నునిచి నాగానది, యాంధ్రుల కొసఁగిన యమృతవీచి
తరతరమ్ములనుండి తలఁగని కఱ వార్చి, పశ్చిమాంధ్రులకుఁ దోడ్పడినయన్న
దండకాటవులఁ గేదారఖండమ్ములు, వెదలింపఁ బెనఁగిన గడుసుకాఁపు
సకలాంధ్రజాతీయ సంపత్ర్సవంతులు, వెల్లిగొల్పిన సంవిదుల్లసితుఁడు

గీ. గణితశాస్త్రముతో జగత్కర్తగుట్టు, నూఁచముట్టుగఁ జూచిన యుత్తమర్షి
శౌంఠికులజుఁడు నమ్రతాసుందరుండు, కదలెనా! రామమూర్తి సత్పదము దెసకు 1

గీ. మర్త్యుఁ డిట నెల్లకాలమ్ము మనఁడు గానఁ, బ్రాజ్ఞుఁ డితఁ డేగె నని డిల్లపడను గాని
యితనికిన్ దగ్గపీరము నీయలేక, చెడెఁగదా! తెల్లువాఁ డని సిగ్గుపడెద 2

6-2-64

## కర్తవ్యము

ఆ. ఈఱతాఱలైన కోరికలకుఁ జిక్కి, దోసములకుఁ దొడఁగు మాసిపట్లఁ
గస్సుమనుట గఱువకర్తవ్య; మీపని, సేయకున్న నతఁడు చేటు గుడుచు

10-7-67

## రాష్ట్రవాణి

ఆ. లేనిపోని రగడ లేపి మరాటీలు, కన్నడీలు బూటకములు పన్ని
యెగసి తెల్గునీటి కెసరుపెట్టిరి మన, వీరు లెంతవట్టు పోరఁగలరొ! 1

గీ. అతఁడు మత్స్యావతార మియ్యది యనంగ, నితఁ డిసీ! గుంటమీ నని యీసడించుఁ
దెనుఁగుల సరాగ మీగతిఁ దెల్లవాఱ, నెంతపరు వబ్బునో వీరి కిభపురాన 2

క. రాయలసీమ తెలంగా, ణా యాంధ్ర మటన్న కల్పనలు జల్పనముల్
పాయవు పెద్దలబుద్ధుల; నీ యయ్యలు జాతి కెంతహితు లయ్యెదరో! 3

క. వెడవెడ కయ్యమ్ములతో, మదఁగని వైయక్తికాభిమానమ్ములతో
సుడివడువారలు దేశపు, గొడవలు వారింప నియ్యకొను టె ట్లొదవున్ 4

క. మదరాసు ధారవోసిరి, పదపడి బళ్లారి కోలుపడి రా పిదపన్
వదలిరి తి ర్తని యెపుడో, బెదరి బరంపురము విడిచిపెట్టిరి దిట్టల్ 5

గీ. అదిర! భాషాప్రయుక్తాంధ్ర మన్నవారు, నేఁటికిని దెన్గునుడిని మన్నింపరేమి
రాదొకో దేశభాషకు రాచవిలువ, లేదొకో లాఁతిపల్కు తూలెడిదినమ్ము 6

గీ. అక్కటా! తెల్గుబోధించు నయ్యవారి, కింగిలీ సక్కఱంట! యిది యేమి తీర్పొ!
తెల్లవాఁ డేఁగెనేకాని యల్లవాని, బాస పెనుదయ్యమై పట్టి పఱచు మనల 7

గీ. జగ మహో! యన శ్రీరామనగర మనెడు, పేరు మనరాచవీటికిఁ బెట్టవలదె
యింతమాత్ర కృతజ్ఞతయేని దెలుప, రట్టె! తెల్గువలంతు లా పొట్టిఋషికి 8

క. సకలాంధ్రము నొకయేలుబ, డికిఁ దెచ్చినవీరుఁ డీ కడిందినిరాబా
రి కదా, యీతని బలిదా, న కథన్ మఱపించుకథ వినంబడదు కదా 9

క. ఔచిత్య మెఱిఁగి సముదా, త్తాచారము వలచి యావదాంధ్ర ధరిత్రీ
రోచిష్కారణ జీవన, శౌచము నార్జించినపుడె జయ మాంధ్రునకున్ 10

15–9–61

---

## రంగా

క. ఇంత నేర్చినేర్చి యున్నాళ్ళ ప్రజలకై, నలఁగినలఁగి యింత కలఁగికలఁగి
రైతుకల్పకమ్ము రంగా గడించిన, పంట యెంత? తృప్తిపడుట యెంత? 1

ఆ. అతఁడు కర్మఫలము నాసచేయని మహా, యోగి యన్నసత్య మొప్పుకొందు
నంతమాత్రఁ దీఱునా మనకర్తవ్య?, మింతమాత్ర మరయరేమి ప్రజలు? 2

క. దేవునకు బువ్వ లేదా?, నైవేద్యము పెట్టునేమి నరుఁ డర్చకుఁడై?
కేవల మొకభక్తి వినా, యేవంవిధధర్మమునకు హేతువు కలదా? 3

ఆ. వేల్పుపట్లఁబోలె విశ్వప్రజాళికై, బడలుపురుషపట్ల భక్తి వలదె?
యేరుదాటి తెప్ప కెగ్గొనరించిన, బాటసారి కెంతబైసి దక్కు? 4

క. ఇది దేహం బిది ప్రాణం, బిది విత్తము దేని వలతు వీ వని రంగా
పదసన్నిధి నాడినవా, రెదలన్ బరికించుకొందురే యిపుడైనన్? 5

క. కానిండు చిరాయుర్భల, మీనేతకుఁ గలదులే! మహీయస్థానం
బీనేతకు నున్నదిలే!, భానుని మేఘములు సతము బాధింపవులే? 6

వీరాలజయంతి 29-10-58

చ. చిరతరభక్తిగౌరవ విశిష్ట వచః కమనీయ సాహితీ
భరముల గద్యపద్యసుమబంధములన్ రచియించి నేఁడు నీ
యఱువదియేండ్ల పండువున కాయితమైతిమి నెయ్యతియ్యముల్
పఱపి పరిగ్రహింపవె! యుపాయన మీయది రంగనాయకా! 7

చ. అఱువదియేండ్లు మానవునియాయువునం దొకమెప్పుమెట్టు; త
ద్గరిమము నెల్లవారలును గాంచరు లోకహితక్రియాధురం
ధరు లనవద్యశీలరుచిధాములు విశ్వజనీనవైదుషీ
పరిణతు లౌ భవాదృశులె పాత్రులు తన్మహనీయలబ్ధికిన్ 8

ఉ. ఆసలదంగి నింగిదెస కక్షలుసాఁచినరైతుపట్ల నీ
చేసినసేవకున్ విలువ చెప్పఁగఁ జాలినవాఁ డెవండు? నేఁ
డీసకలావనిన్ హలికు డేలుచు నుంట యథార్థ; మాతఁ డీ
వాసికి వచ్చుటెల్ల గుణవన్మణి! నీకృషి చేతనే కదా! 9

ఉ. నీకు నుదాత్తవీర మిడనేరద! లోక మటంచు మామనం
బాకులమౌను గాని జగదద్భుత నిర్మమతానిరూఢ యో
గాకృతి వైననీ విట రవంత కలంగవు క్రుంగ; వీతపం
బేకొనకొమ్మఁజుంటిచవు లిచ్చి నినున్ దనియింపనున్నదో! 10

ఉ. నీకరినవ్రతమ్మునకు నిగ్రహచండిమ కందయై పురం
ధ్రీకులరత్నమై వెలయు దేవిని భారతి నుగ్గడింతు న
స్తోకశుభానుషంగపరితుష్టిని మీ రిఁక నర్వదేఁడు లీ
లోకమువారికిన్ గనువెలుంగులు కం డని పల్కరించెదన్. 11

షష్టిపూర్తికి 12-10-60

ఉ. ఏలిక లెట్టిదుర్గతుల కీడ్చి కలంచిన లేమి యెంతగా
మూలగ జుత్తీ నెవ్వగల ముంచిన ముప్పులకెల్ల దైవమే
మూల మటంచు నమ్మి కనుమోడ్చిన కర్షకజాతిపాలి వై
తాళిక! నీకుఁ గల్గుత! నితాంతసుఖమ్ములు రంగనాయకా! 12

మ. నుతిపాత్రంబగు శేముషీపటిమతో నూనూఁగుమీసాలతో
నతివేలప్రభుశక్తితో హాలికదైన్యధ్వాంతవిచ్ఛేదక
క్రతుదీక్షాధ్వజ మూంగిలేయులయొదల్ కంపింప నిచ్చోఁ బ్రతి
ష్ఠతముం జేసితి వప్పికట్లసుకృతశ్రీ పొంగి ఘూర్ణిల్లఁగన్ 13

చ. నలువదియేండ్లనాఁటి సవనం బిది; యప్పటి కంకణమ్ము నెం
తలువెత లేచి యెన్ని బెడిదంబుల కొగ్గిన నెవ్విధిన్ మదిన్
గలఁచిన నుజ్జగింపని జగాజదదారివి నీ వయారె! నిన్
వలచినభారతమ్మకును వం తొకఁ దున్నది నీ మహత్తలోన్ 14

మ. ఇచటన్ బుట్టినకర్షకోద్యమమె నీహేవాకసేవాతపః
ప్రచురంబై సకలప్రపంచహాలిక ప్రత్యూషమై పొల్చె నీ
రుచిరత్వమ్మున్న కానవాలుగ భవద్రూపమ్ము మాపల్లెలో
నచలంబై మధురస్మృతుల్ గొలుప నీయారంభసంరంభముల్. 15

అప్పికట్లలో విగ్రహ ప్రతిష్ఠకు 7-6-64

---

## కల్లూరి సుబ్బారావు

ఉ. కందలు నెత్తురున్ నెతియుఁ గల్మియు బల్మియు మాతృసేవలోఁ
బిండినసుబ్బరావున కపేతసుఖాభిరతిన్ త్రిలింగభూ
మండలమెల్లఁ గ్రుమ్మరిలి మాపులు తేపులు తెల్లవాని రా
దుందతికమ్ము చాటి సయిదోడులబుద్ధులు దిద్ధి బాపుజీ
దండును బెంచి కాంగ్రెసు నుదాత్తమొనర్చిన, షష్టివర్షముల్
నిండిన సుబ్బరావునకు నిస్తులసంపద లెన్ని యుండినన్
దండుగుపోనియాంధ్రమును, దక్కిరిబిక్కిరిపొత్తు భారమై
గుండియజాతినాంధ్రమును గూర్చి జపించి తపించి రాష్ట్రపుం
బందువు పుట్టుదాఁకఁ దనపట్టు దొఱంగనిదిట్టయై ప్రథన్
బండినసుబ్బరావునకుఁ బ్రాజ్ఞులు తెల్గులు నేఁడు మల్లెపూ

దండలు వైచి తద్గుణకథల్ ప్రకటించి నుతించుపట్ల నే
నెండకు జంకి యిల్ వదల కెండకుజంకనిదండ నంపి యీ
పండితు గౌరవింతు సుఖభాజనుఁడై యితఁ డింక సర్వదేం
ద్ధుందునుగాక దేశమున కూడిగముం బొనరించువారి కీ
దండితచిత్తుఁ దేగినపథమ్ములు గమ్మము లౌనుగాక ధీ
మండితు లీసదస్యులకు మంగళ మేర్పడుఁగాక! నిచ్చలున్

14-5-57

## కొనకళ్ల

క. పంకజభవతరుణీ పద, కింకిణిరవమై రసజ్ఞకృత నుతిభరమై
వేంకటరత్నము గేయము, బింకము వెదలించుఁ దెనుఁగుపేఁటల నదిరా?

18-3-65

## వంశస్మృతి

ఆ. అతఁడు నిశితబుద్ధి యతఁ డింగిలీసు ప, రాసుబాసలందు రాణకెక్కె
అతనిచదువు లింతమెతుకునకు బదాయి, బ్రతుకునకును సాయపడఁ దొడంగె 1

ఆ. "రామకథను ద్రచ్చి రమణీయ కావ్యమ్ము, వ్రాసినట్టి తులసిదాసుకోవ
నీవు పుట్టి చదువనేలేదె సంస్కృత?" మని తృణీకరించె నతని నొకఁడు 2

ఆ. అపుడు కన్ను దెఱచె నతఁడు వంశస్మృతి, చేసిచేసి కనియె దోసమెల్ల
నిర్వికల్పనిష్ఠ నేర్చె గీర్వాణంబు, నుపచరించి గురులకృపను గాంచి 3

గీ. శ్రుతుల నాలించె నుపనిషత్సుధను గ్రోలె, బ్రహ్మసూత్రార్థ మెదఁదలోఁ బదిలపఱిచె
దిట్టయై భగద్గీతగు ట్టెతింగెఁ, దెలివి పొంగి యాతఁడె రామతీర్థుఁ డయ్యె 4

క. అతఁ డాత్మానాత్మజ్ఞత, నతివేలప్రౌఢి వడసె నక్షరతత్త్వ
ప్రతిపాదకుఁడై సకల, క్షితికిన్ వెలుఁగిచ్చె బుధులు జేజే యనఁగన్ 5

గీ. ఇంతి యొకతె, కొడుకు లిద్ద, ఱొక్కకొమార్త-, యింతచిన్నలంబి నిముడఁజాల
విడిచివైతు దీని విశ్వకుటుంబముం, బదతు ననియెఁ బ్రేమ పండి యతఁడు 6

గీ. హిందువులు ముస్లిములు సిక్కు లేసుభక్తు, లంద ఆత్మస్వరూపులే యంద అస్మ
దనుజులే జగమెల్ల మదాలయంబె, యనిన యద్వైతియై ముక్తుఁడయ్యె నతఁడు 7

క. తనవంశస్మృతిచే నతఁ, డనవద్య చరిత్రుఁ డయ్యె నందఱు నరు లీ
పనికిం బూనినఁ జీఁకటి, విరియుఁగదా జగమునుండి విటతాటముగన్ 8

క. ప్రతిపురుషునివంగడమున, యతీంద్రుఁడో భక్తుఁడో మహాయోగియొ మా
నితకవితానిధియో పం, డితుఁడో కనిపించు నరయ నేర్చినవేళన్ 9

క. తనతాతలు ముత్తాతలు, ఘను లని పైకొనక వారిగౌరవ మందన్
బెనఁగవలె నరుఁడు నిచ్చలు, మనసంస్కృతి నిల్చు నిట్టిమానిసికతనన్ 10

25-9-64

---

## రాయప్రోలు

ఆ. రాయప్రోలువారి రమణీయకవిత శా, రదకు నింపు నింపు రాయప్రోలు
సుబ్బరావు సుకృతసుందరుఁ డీ మహా, కవి శతాధికాబ్దకలితుఁ డగుత! 1

క. సముచితవాక్కుల దేశా, భిమాన మొదవించి తెలుఁగుబిడ్డకుఁ గర్త
వ్యము నేర్పిన తొలికవిగా, నమస్య లొనరింతు నీ మనస్వికి నర్థిన్ 2

గీ. తెనుఁగుఁదనమునకును భారతీయతకును, సమవికాసమ్ము వలచిన సరసుఁ డితఁడు
గ్రామజీవనమాధురీగరిమ సాధు, కవిత మెఱసిన బాఁపనకాఁ పితండు 3

క. ఎందఱు రవీంద్రుసన్నిధి, నందరు సాహిత్యశిక్ష? నందఱు నవతా
సుందర కవితాకౌశల, మందిరొకో సుబ్బరావునట్టు లయారే! 4

క. కవనముతోడన యితఁ డు, ద్భవ మందినవాఁడు సహజభావుకతా వై
భవసంపన్ను లె జాతి, చ్ఛవికారణ భవ్యకావ్యసర్గ విధాతల్ 5

21-2-63

---

## జాషువా

ఉ. రాజులు ప్రెగ్గడల్ మతివిరాజులు కావ్యకళారమా సమ
ర్చాజయశీలు రాదరధురానతులై నుతు లాచరింప రా
రాజువిధాన భవ్యరసరాజ్యము నేలుచు నున్న మద్యశ
స్తేజము నందుకొన్నసుకృతీ! పరమాయువు నీకు జాషువా! 1

ఉ. వందలు వేలు పొత్తములు వాములు వాములు కూర్చినంతనే
పందెముగెల్చునా కవికిఁ బారకలోకపుముద్ర లేనిచో
నందనవాటికాకుసుమ నవ్యమరందఝరీతరంగముల్
చిందఁగ నీవలెన్ గృతులు సెప్పక విందులు గుప్పకున్నచో 2

ఉ. నీ వొకక్రొత్తనోటఁ గమనీయపథమ్మునఁ దెల్గుగుండెకున్
జీవము నిచ్చుపల్కున విశిష్టత గంటివి; లేఁత కారు నీ
త్రోవల నిచ్చ మెచ్చి శ్రమతో నిను వెన్కొనె; నీదుసృష్టికిన్
జా వనుమాట లేదు కులశైలము లబ్ధులు క్రుంగి పొంగినన్ 3

ఉ. ముమ్మరమైనపాపముల మోపినతా వగుఁగాక వాఁకలై
కమ్మనిదేశి పొంగునెడ కావున నీనెల వింతమంచిపా
కమ్మునఁ బల్క నేర్చితివి కైతలు రోచిరుపేత లగ్రహా
రమ్ముల నాఁచికొన్న కవిరాజులమోములు వెల్లఁబాఱఁగన్ 4

ఉ. "త్రోసిన నేమిలే రుచులఁ దోఁగెడిగారెలబుట్టలోఁ బడెన్
దోసము లేనికుట్టఁ" దనుధోరణిగా నతలంబుదాఁక ధీ
రాసులు నిన్నుఁ ద్రొక్క నవురా! ధ్రువుకై వడి నున్న తోన్నత
శ్రీసముదీర్ణ మౌపదముఁ జెందితి వందితి వక్షరత్వమున్ 5

ఉ. మాలల–పంటకాఁపుల–యమాత్యులవోలెఁ దెలుంగునేలఁగా
జాలినవారు లేరనుట సత్యము; ప్రత్యయముల్ తగిల్చినన్
వాలినముక్కు ద్రుంచినను వచ్చునొకో! సురభాష కెన్ని జ
న్మాలకు నైనఁ దెన్గుపస? మల్లియతావి గులాబి కబ్బునా? 6

ఉ. అఁకటిమంటతోఁ గులధనాగతవైభవదృప్తకల్పితా
నేకనిరాకృతుల్ కుడుపునెవ్వగతో నణఁగారుదీనులన్
గైకొని వారికష్టమయగాథలు చక్క వచించి కానుకల్
చేకొని తీవు నీప్రజలు జేనకు వేనకువేలు కావునన్ 7

చ. ప్రజలను జూచి సంఘమునఁ బైకొనుకోర్కి గణించి స్వార్థపుం
గజిబిజి డిగ్గఁద్రావి పరిణామవశంబు సమాజ మన్ నెఱా
నిజము నెఱింగి నిర్మలుఁడు నిశ్చలుఁడై కృతి సెప్పువానికిం
ద్రిజగములున్ హసా దని విధేయములౌ టరుదా? మహాకవీ! 8

ఉ. హైందవనాగరాజు విషమాశయుఁడై బుసకొట్టి సంఘమున్
వందకులాలుగాఁ బఱియవాపి దురాపద ముంచి శ్రామికున్
గ్రిందికిఁ ద్రొక్కి సోమరిని గేవలుఁగాఁ బయి కెత్తెఁ గాని నీ
ముందఱఁ బందయై వెఱపుముంపులతోఁ దలవంచె నేఁటికిన్ 9

ఉ. తిక్కనపుట్టుగడ్డగ నుతిం గను గుంటురిసీమ నియ్యెడన్
లెక్కకు నెందఱోకవులు లేచిరి గాని రవీందుతారకల్
మిక్కిలుదాఁక నిల్వఁగలమేలిమి నల్గురకే లభించె నీ
వొక్కఁడ వందు నందు బెగడొందక నిక్కము వక్కణించెదన్ 10

చ. యతుల నెఱింగి ప్రాసనియమావళి నేర్చి గణానుకూల మౌ
గతిఁ గృతి కూర్చువాఁడు కవి గాఁ డెతఁ డన్యకవీంద్ర దుర్లభ
ద్యుతి నొకటిన్ గడించు నకుతోభయుఁడై గుణలుబ్ధుఁడై జగ
ద్ధిత మగువస్తు వెంచి వరియించు నతండె జయించుఁ గైతలన్ 11

ఆ. కవితచక్కఁదనము గరితచక్కఁదనమ్ము, కోటికోటిగతులఁ గుల్కఁ గాన
నిలకుఁ గాళిదాసుఁడే మహాకవి కాఁడు, రతియె సోయగంపురాశి కాదు 12

ఉ. దెబ్బదియేండ్లు నిండినఁ బటిష్ఠమ నీతనుయష్టి; దుష్టపుం
బెబ్బులిరీతి జాతినెతి పీల్చునధర్మము నూఁచముట్టుగాఁ
ద్రొబ్బుకృతుల్ రచింపఁగలదొడ్డసిరిన్ మెఱయించు నేఁటికిన్
ప్రబ్బుత! నీ ప్రబంధములు; ప్రాభవముల్ భువినెల్ల సుబ్బుతన్! 13

చ. నవఁతలు సైఁచిసైఁచి భువనప్రియముల్ నవతామనోజ్ఞముల్
కవితలు సృష్టిసేయు మొనగాండ్రు జనింతురుగాక వారి ప
ల్కవు నని గారవించురసికాగ్రణి లేనపు దేమిలెస్స? యీ
భవికముపై మనం బిడిన పాములపాటి ప్రసాదు నెంచెదన్ 14

14-2-66

---

## కృతజ్ఞత

క. కృతము నెఱుంగును ధన్యుఁడు, కృతమునకున్ సాటివచ్చుకృతి సేయును ధ
న్యతరుండు దానిమించిన, కృతి సల్పును ధన్యతముఁడు కృతధీకతనన్

19-7-67

## వివేకానందవాణి

ఆ. కుఱ్ఱలార! మీరు గురుతరకార్యంబు, లాచరింప నొదవినట్టివారు
కదలి పొంగుఁగాక పిడుగులు పడుఁగాక, మానకుఁడు మహోద్య మానురక్తి 1

ఆ. మనకు నేఁడు వలయు మగఁటిమి గలవారు, సాటిలేని తెగుఁవ జాటువారు
గుండెబెదరులేని కొండలై మీ రందు, కొనుఁడు జయము జాతికొఱకు మనుఁడు 2

ఆ. వలదు పిఱికితనము వలదు మృత్యుభయమ్ము, భయ మటన్న నేవపడెద నేను
విలయవేళనైన వెఱవని యోద్ధలై, పౌరుషమ్ము మెఱసి పేరు గనుఁడు 3

ఆ. ఆత్మగతము విజయ; మది దేహగత మని, విశ్వసించువాఁడు వెఱ్ఱివాఁడు;
ఎవ్వఁ డీరహస్య మెఱుఁగు నవ్వానికి, మోఁకరించితీరు ముజ్జగమ్ము 4

క. ఏ నల్పుఁడ నసమర్థుఁడ, దీనుఁడ నని పగలు రేయి దిగులుం గను నే
మానవుఁ డతఁడే నాస్తికుఁ, డానరుఁడే పతితుఁ డతఁడె యధమాధముఁడున్ 5

21-2-63

## శివరామశాస్త్రి

ఆ. కావ్యసృష్టి సేయఁ గాఁడుపో? ఋషిగాని, వాఁ డటన్న మాటవాసి నిల్పి
తెలుఁగువానికన్ను తెఱచినశివరామ, శాస్త్రి! వెడలి తేమి జగతి వీడి 1

క. అందఱు నేగెడువా రని, మందునకుం దెలియుఁ గాని మహనీయుఁడు పో
వం దెలివిసెడి నరుం డెదఁ, గుందుఁగదా కుడిబుజమ్ము కోల్పడ్డ గతిన్ 2

గీ. ప్రాఁబలుకుఁదొట్టి బవినీంద్రపాటదనుకఁ, ద్రచ్చిన మహామనీషిసత్తముఁడ వీవు
ఇంత దయ్యుటవలనన యెంతకడిఁది, చదువు నైనను వివరింపఁ జాలి తీవు 3

ఆ. అన్న! నీదుకృతులు కొన్ని కాలిన వను, వార్త మదిని గలcచివైచుc గాని
యొక్క పలుకు చాలు యుష్మదీయము బుధ, వ్యూహవినుతు లంద యుగయుగాలు 4

ఆ. విత్తదాహ మెగసి చెత్త చెదారము, పూcట కొక్కబండి ప్రోవుసేయు
కవులకతన వాపుగాక సాహితి కెంత, బలుపు వచ్చు నెంతపొలుపు సొచ్చు 5

గీ. ఈవు కాటూరి వేటూరికోవిదుండు, శిష్యులై తన్ను సేవింపc జెళ్ళ పిళ్ల
కనినతృప్తికి మితిలేద మునుపొనర్చు, పున్నెములు పండి యతని కీవన్నె వచ్చె 6

ఆ. మతము కులము శాఖ మఱచి యెవ్వనిపాల, నొఱపు లున్న మెఱయ నోర్తు వీవు
ప్రజలు భవదుదారభావమ్మునకు సత్య, నిష్ఠ కంజలింత్రు నింత్రు ముదము 7

గీ. ఒరుల మెచ్చుట తక్క నీ వెఱుcగ వాత్మ, శంసన మహంత యెఱుcగ వీర్ష్యయు నెఱుంగ
వఖిలదైవసంపదయు ని న్నాశ్రయించె, నిఖిల దేశము నిను దేవునిగ భజించె 8

క. ప్రాత స్స్మరణీయమ్ములు, నీ తెన్నులు దంభమోహ నిర్మూలకముల్
జోతింబలె నీ వాంధ్రుల, చేతమ్ముల నుందు వెపుడు శివరామసుధీ! 9

19-4-67

## రామనాథబాబు

గీ. "మామగారూ! నమస్కార; మేమిపనికి, నిటకు వచ్చితి?" రనుచు న న్నెచటc గన్న
నెమ్మి నమృతప్రవాహమ్ముc గ్రుమ్మరించు, సాధు విల వీడెనా? రామనాథబాబు 1

క. మా యేర్లగడ్డ భూపతి, మీ యల్లుం డగుట నేను మీ యల్లుcడc గా
నా? యని వావిం దెలుపుచుc, దీయము ప్రకటించుబాబు దివికిం జనెనా? 2

గీ. "బస్సు కల" దని యే నెంత పల్కుచున్న, ననుమతింపక "డ్రైవరూ! అప్పికట్ల
కీకవీంద్రులc జేర్చి రమ్మీ!" యటంచు, నన్నుc గరcగించు బంధు వీనాcడు లేcడె? 3

క. తాతలు తండ్రులు నేర్పిన, దాతృత్వము వలచి యితc డుదాత్తవితరణ
స్రోతస్సులc బరcగించెను, మాతృమహీదీనతా ప్రమార్జన రతుcడై 4

గీ. బావలై మామలై జగత్ ప్రథిత దాన, గణ్యులై పుణ్యులైన జాగర్లమూడి
వారి నోడింపవలె నన్న వలపు హెచ్చి, యిచ్చెనా? యిన్ని లక్షల నితcడు ప్రజకు 5

గీ. పంతమున కిచ్చుఁగాక యాస్పర్ధ సుజన, మోహనము విశ్వకల్యాణమూల మగుట
మెత్తు రీదృశ భావనాయత్త హృదయు, నుత్తములు బుద్ధిమత్తముల్ యుగయుగాలు 6

ఆ. రామనాథసుకృతి! నీ మృతిపట్ల మా, యెదఁద కలఁగి నలఁగి యడలుఁ గాని
కాకివోలెఁ జిరము కోకిల నిల్చునా?, తక్కువైన నేమి దానిబ్రదుకు? 7

క. ఊహింపన్ జెడినది నీ, దేహమ, నీ వెట్లు చెడుదు దేహివి? మాయా
వ్యూహమునఁ జిక్కి దేహికి, దేహమ్మున కున్న వేర్మి తెలియరు మూర్ఖుల్ 8

క. తేజోమయమగు తత్త్వము, లోఁ జేరితి వీవు నీకు లుప్తము లింక న
న్నాఁ జనన మరణ రోగ జ, రా జంబాలములు సంసరణబంధనముల్ 9

3-10-60

---

## కరుణ

ఆ. గడ్డిమేయు మేఁకకండకంటె నికృష్ట, మలము దినెడు పందిపోలసుకంటె
నేతికూడుమెక్కు నీచియ్య కమ్మగా, నుండు నని యెఱుంగుమోయి! నరుఁడ! 1

ఆ. నిన్నుఁ జంపి తినఁగ నీజాతిలోఁ గొంద, ఱెదురుసూచుచుందు రిపుడు కూడ
వారికత్తిక్రింద వంగెదవా తల, ద్రుంపుఁ దనుచు నారగింపుఁ దనుచు 2

క. ఆకత్తిని గన్నంతనె, నీ కేర్పడు నంగలార్పు నిర్భరము కదా!
నీకత్తిక్రిందఁ జచ్చెడి, మేఁకకునే నిట్టిదుఃఖమే కల్గదొకో! 3

క. ఈపాటి చింతసేయక, పాపమ్మున కేల సిద్ధపడియెద వకటా!
యీపని మానుము దనుజ, వ్యాపారము చేయఁదగినదా మనుజునకున్ 4

గీ. "ఆత్మవత్సర్వభూతాని" యన్న పలుకు, నెఱుఁగవా మానవతకెల్ల నిదియె ప్రాణ;
మిదియె మును విశ్వకల్యాణ మిచ్చగించి, శాక్యముని సమ్మతించిన సాధనమ్ము. 5

క. నీవలె సర్వప్రాణులు, జీవింపన కోరు సుఖముచెందన కోరున్
భావింపు మీరహస్యము, లావరి నని యల్పజీవులను జంపకుమీ! 6

ఆ. మాంసభక్షణంబు మరగి దేవళ్లపే, ర్వెట్టి సాధుజంతువితతిగొంతు
నుత్తరింపకోయి! చిత్తమ్ము సవరించి, మచ్చలేనిబ్రతుకు మెచ్చవోయి! 7

గీ. నిన్ను నీ వర్పణముచేసికొన్న నాఁడు, దేవతలు పరితృప్తి నందెదరు గాని
యన్యజీవుల నర్పించుట్టి నిన్నుఁ, జూచి పొంగరు నీ కింత సుఖము నిదరు 8

క. మమత నహంత నసత్యము, నమితాశను వేల్చి వేల్పు నర్చింపుము; నీ
కమృత మపు డొదవు; నానం, దము పొంపిరివోవు; శాంతి తలమున్క లగున్ 9

క. తెలియక చేసిన దోసము, దలంచి వగంబడకు! పడకు! తక్కినబ్రతుకున్ నీ
మలఁపు మిఁక మంచిబాటకుఁ, దొలఁగనిపుణ్యములు విరియు తోఁటకు నరుఁదా! 10

3-2-64

---

## కవితాసేవ

మ. తెలుఁగుంబల్కుల తీరుతీయనలకున్ దిక్కన దిక్కన్న చోఁ
దలలూఁగింపనిప్రోడ లుండరుగదా! తన్మాధురీ సాధురీ
తులకున్ నోఁచిన యేటుకూరికవిచంద్రున్ ధన్యుఁగా నెంచు నీ
యలరాజున్ బలనాటికృష్ణుఁ గని సర్వాంధ్రమ్ము ని స్తంద్రమై 1

చ. సురభిళ మీమహాంధ్రకవిసూనము పంచినతావి సోఁకి మై
మఱచితి మింతలోనె మటుమాయమొనర్చెను దైవ మీవిరిన్;
పరిణతగంధమై ప్రభునిపజ్జ సుమం బిది వెల్గుఁగాక తె
ల్గురసికలోక మీకొఱఁతకున్ గలకాలము కుందకుందునే? 2

ఉ. ఉన్న కవీంద్రుకబ్బముల కున్నతిగూర్చుట యబ్బురంబె? యీ
చన్న కవీంద్రుకావ్యములు చాటుట గొప్పతనమ్ముగాని; యీ
పున్నెముపై మరుల్గొని యపూర్వయశమ్ము గడించుకొన్న మా
యన్నను రంగయాఖ్యుఁ గొనియాడెద మూల్పురివంశవర్ధనున్ 3

చ. అవిరతరాజకీయసమ రాంకితజీవను లైనవారిలో
నెవరికిఁబట్టె నీకవిత లీకళ లీసభ లీవదాన్యతల్?
కవికులకల్పభూజములుగా నుతు లందెడివార లిద్దఱో
ముపురొ తెలుంగునన్ గలరు మూల్పురిరంగయవంటిసజ్జనుల్ 4

ఉ. సంగరముల్ వివాదములు జాతికి నీతికి నెగ్గుగూర్చి రా
జ్యాంగము నార్చు నన్న పరమార్థము దెల్ప, ననల్పకాల మీ
రంగయకీర్తి నిల్ప నలరాజుచరిత్ర తెనుంగుభారతీ
మంగళదామబద్ధ నవమౌక్తికమై కురియున్ ధగద్ధగల్! 5

6-5-59

# శ్రీమంతురాజా

చ. నే౨టికిఁ జల్లపల్లిధరణీధవరాజ్యరమానివాసమౌ
కోటనుగంటి; నీనృపతికుంజరుఁడో నను మెచ్చువార లె
చ్చోటికిఁ బిల్వ నచ్చుటికి స్రుక్కక వచ్చెను రెందుమాఱు; లీ
మేటితనమ్ము నెంచి కుసుమించు మదీయమనమ్ము నిచ్చలున్ 1

చ. ఏశుభకార్య మీనగర నేర్పడినన్ ననుఁ బేర్మిమీఱ ను
ర్వీశుఁడు పిల్చుఁగాని యెదియే నవరోధ మెదుర్చు నెప్పుడున్;
కాశనికుంజకల్ప మనఁ గన్పడుమీసము నేఁడు ప్రేమటన్
శ్రీశివరామసత్కృతివిశిష్టత చూడ నెటో శ్రమించితిన్ 2

చ. అల్లునిషష్టిపూర్తి మహ మన్న నెలర్చితిఁగాని యంతలోఁ
జెల్లెనె యర్వదేఁడు లనుచింతకుఁ జిక్కితి; నైననేమిలే
చల్లనిచూపులన్ బఱపి శాంకరి భక్తుల నేర్లగడ్డరా
ట్తల్లజులన్ సదా మనుచతల్లికదా! యని వెండి తేఱితిన్ 3

గీ. చల్లపల్లీశ! యింకొక షష్టిపూర్తి, సకలవైభవముల నీకు జరుగుఁగాక
మంచివా రెన్నినాళ్ళు జీవించినను శు, భమ్ములే పొంగిపొరలు దేశమ్మునందు 4

గీ. తాతముత్తాతలిడిన యౌదార్యమునకు, రాణదెచ్చితి శ్రీశివరామ! నీవు
రాజుగా మంత్రిగా నాదరంబు గనిన, నేర్పరివి నీవు మేటిమానిసివి నీవు 5

ఆ. ఎంతకల్మి యున్న నెంతపెత్తన మున్న, నిండుకుండవోలె నుండె దీవు
పరుషమైనపల్కు పల్కు టెఱుంగని, పెద్ద వీవు వినయపీఠి వీవు 6

క. దారిద్ర్యము రుజ యజ్ఞత, రారమ్మని పిలుచు మనధరన్ నలుగడలన్
నీ రాజకీయ సేవల, నీ రాపులు తొలఁగి దేశ మెలమిన్ గనుతన్! 7

క. ఆలున్ బిడ్డలు చుట్టము, లేలోపములేనిబ్రదిమి నెసఁగన్ బొసఁగన్
బా లారగించు మనుమల, యాలాపంబులకు సొగయుమా! శ్రీమంతూ! 8

ఆ. తెనుఁగుభారతమ్ము తిరుపతివెంకన్న, విజయవాదదుర్గ వేణికృష్ణ
యెన్నినాళ్లు నిల్చు నన్నినాళ్లు త్వదీయ, మేర్లగడ్డవంశ మిగ్రుచు రాజ! 9

25-10-66

---

# పున్నయ్యశాస్త్రి

గీ. అచట సాబర్మతీతటి నసహయోగ, సమరదుందుభిరావంబు సాగె నిచట
గుళ్లపల్లిపున్నయశాస్త్రి గొంతునుండి, వెడలె గాంధికిజే యన్న వీరవాణి 1

ఆ. తెలుఁగునేల నితఁడు తిరుగనిసీమ లే, దపుడు కాంగ్రెసునకు నండ యగుచు
పశ్చిమాంధ్రభూమిఁ బ్రాభాతభేరి మ్రో, గించె నితఁడు దెసలయంచు లదర 2

క. ఒకకాలు బందిగమ్మున, నొకకాల్ గుంటూర నిడి మహోద్యమనిర్వా
హకుఁడై పున్నయ యానాఁ, డకుతోభయుఁడై యెదిర్చె నాంగ్లప్రభుతన్ 3

గీ. ఎంతనలఁగిన నేమి స్వతంత్ర భార, తావతరణమ్మునకు నెంతతీవ్రమైన
తప మొనర్చిననేమి యే తాదృశులకుఁ, జోటులే దేల్బడిని జిన్నపీఁట లేదు 4

ఆ. జందె ముంట తక్క శాస్త్రియు నొకమంత్రి, గామికిన్ గొఱంత యేమికలదు
నాఁడు ఖద్దరైన వాదనివారలే, నేఁడు ప్రభువులైరి వాదవాద 5

గీ. కాంగ్రెసును దిట్టి బ్రదికిన కవులు తక్క, నొరులు లెక్కకు రాకుంటయును ఘటిల్లె
పాప మిది పండి యేరీతి బ్రద్దలౌనొ, లోక మిఁక నెంత యల్లకల్లోల మగునొ 6

గీ. అర్హణీయుల మఱువ నభ్యాసపడిన, తెలుఁగు దేశాన నిన్నుఁ గీర్తింపఁజూచు
హనుమయాదికు లుంట మదాత్మ తనిసె, నన్నయా! పున్నయా! వీరి కగు జయమ్ము

ఆ. బోటికఱవు దీర్చి ము న్నొకహనుమయ్య, యొక్క ప్రాణిబాధ నుక్కడంచె
నీటికఱవు దీర్చి నేఁ డొక *హనుమయ్య, కోటిమందిప్రజల గోడు మాన్పె 8

క. ఈ చేఁబ్రోల్ వంశజుఁడీ, శౌచప్రియబుద్ధి నిన్ను సమ్మానింపం
జూచుట యన నౌచిత్యము, పూచుటకద గుళ్లపల్లి పున్నయశాస్త్రీ! 9

ఆ. పరులమేలు వలచుగఱువ మేదూరి నా, గేశ్వరునిమహత్త నీసదస్సు
సకలవైభవముల జరుగును గాంధేయ, గౌరవంబు నెల్లకడలఁ జాటు 10

క. ఇంకొక యర్వదియేండ్లు ని, రంకుశభాగ్యమున నుత్కటారోగ్యమునన్
జంకనియశమున గౌరీ, శంకరకారుణ్యమున నెసంగుము శాస్త్రీ! 11

* గుంటూరికి కృష్ణనీరు సాధించిన చైర్మన్

గీ. ఆంధ్రరాష్ట్రమునకు నారటించి వటించి, సిద్ధినందినట్టి జెట్టి వగుటఁ
బట్టు పట్టు మిఁకను బళ్లారి కోలారు, తమ్ములెల్ల మనకు దక్కునట్లు 12

ఆ. ఇంగిలీసురామి నేను గుమాస్తాల, చెంత లజ్జఁ గూరు టెంతకాల
మోర్వవలయు? వలయునుద్యమ మూహించి, తెలుఁగునుడికి వాసి తెమ్ము శాస్త్రి 13

క. ఉపవాసగౌరవం బిపు, డపాత్రులకతానఁ జెడియె నది పూనక లా
తిపథమ్ము ద్రొక్కి పెఱబా, సపోట తప్పింపుమయ్య! సైదోదులకున్ 14

ఆ. తంజనగర శారదాభవనమ్మునఁ, జీకువడిన తాటియాకుఁబొరల
మూల్గు తెల్గుకైతమును దెచ్చి పూజింపఁ, బంపుమయ్య! రాచపెంపువారి 15

క. లండనులో నమరావతి, పండించినప్రతిమ లుండఁ బనియేమి కళా
ఖండము లవి మనగడ్డకుఁ, దెండా! యని తఱుమవయ్య! తెనుఁగుందొరలన్ 16

8-11-66

---

## పెండ్లి

క. అతిమృదులం బతికర్కశ, మతిసుఖ మతికష్టమై మహాద్భుతమగు సం
గతికద పాణౌకరణము, కృతమతులగు నాలుమగలు గెల్తురు దీనన్ 1

గీ. వలపు ధర్మవు బెరసి వివాహరూప, మందుకొనె భారతీయ గేహమ్మునందు
ధర్మమున కవిరుద్ధమై తనరుకామ, మేన యనినట్టి కృష్ణున కేటికోళ్లు 2

క. ఇది ధర్మవీరమున కా, స్పదమైన ధరిత్రి; యేకపత్నీవ్రతకో
విదులు సతీమతల్లిక, లెదిగినదేశమ్ము; సుకృత మెసఁగిన మహియున్ 3

10-4-43

---

## గోరా

క. కుల మత వర్గ పిశాచా, వళి కోఱలు నఱికి మానవతకున్ నవతా,
కలితద్యుతి చేకూర్చిన, బలుమానిసి గోపరాజవంశజు మెత్తున్ 1

గీ. పురుషకారంబు మఱచి సోమరితనమ్ము, వలచి తనభారమెల్ల దైవంబునెత్తి
నునిచి గుఱువెట్టు మూఁక నల్లన కదల్చి, దిద్దఁజాలిన 'గోరా' కృతిత్వ మెంత 2

ఆ. సత్యనిష్ఠ యున్న జంకమి యున్న సే, వానురక్తి యున్న మానవునకు
నెంతవారలైన హితు లౌదు రనుట కీ, గఱువ తారకాణగా లభించె 3

క. ఆస్తికులమనసు దోఁచిన, నాస్తికుఁ డీగోపరా; జనన్యార్జిత మీ
శస్తము; సేవా త్యాగ, ప్రశస్తత నదలించి యితఁడు తగె నీపనికిన్ 4

క. బాపూజీ భావేఋషి, యీపురుషునిచరిత మెచ్చు నితరులమె ప్పే
లా? పరమాయుస్సౌఖ్యము, లీపండితుపాలివై మహిన్ దనుపవలెన్ 5

7-9-63

---

## అవధానకవిత

(గుంటూరు 1926)

### దత్తపది

చ. ఋణ మది లేఖ నోకురుకులేశ్వర! నీకును రాజ్యలక్ష్మికిన్
రణమొనరింపఁగా సకలరాజవరేణ్యులఁ గూడి దాయ లీ
క్షణమున నేగుదెంచి నినుఁ జక్కడఁగింతురు భాగమీనిచో
గణముగలాఁడ నే ననెడుగర్వము చెల్లదయా! సుయోధనా! 1

కావూరు 1929

### పంజాబు హత్యలు

చ. ఎఱుఁగరె తమ్ములార! కృపయించుక లేక సుధాహ్రదమ్మునన్
బిరబిర నాంగ్లసైనికులు ప్రేల్చిరి గుండ్లు ప్రజాళి కూలఁగన్
మఱచితిరొక్కొ నాఁటియవమానము; ప్రాణము లొడ్డియైన మీ
రరయుఁడు దేశముక్తి త్రుటియైనను జెల్లదు జాల మియ్యెడన్

ప్రత్తిపాడు 1926

### సమస్య

క. భ్రాంతిని నలకూబరుసం, గాతమునకు నేగు రంభకకుకుం గని కా
మాతురతఁ బట్టిన సురా, రాతికి నచ్చరకు విరసరతి సమకూరెన్

పచ్చలతాడిపఱ్ఱు 1929

### నిషిద్ధాక్షరి

క. హర! శంభూ! భయదాహివి, సరదామ! సురేద్య! సర్వశస్తద! కామా
రి! రజత దేవాగ తనూ, ధర! పుణ్యనివేశ! నగసుతాసరిదీశా!

యనమలకుదురు 1928

## మహాకవి

మ. అవనిం గీరితిగన్న మానవుల భవ్యశ్రావ్యచారిత్రముల్
భవవారాన్నిధిమగ్నులౌ నరులకున్ బల్మాఱు విన్పించుచున్
స్తవనీయమ్ముల ధర్మమర్మముల నశ్రాంతమ్ముగాఁ జాటుచున్
గవితామార్గమునన్ మహాకవి జగత్కల్యాణమూలంబగున్

పెదపాఱుపూఁడి 1928

## అవధాని

క. మొదట నవధాని గురుఁ డగుఁ, బదపడి తా శిష్యుఁ డగును బరిషత్తునకున్
బదము పదము చెప్పుటచే, బెదరుచుఁ బద్యంబులెల్ల వినిపించుటచే

తోట్లపాలెము 1930

## దత్తపది

క. లెండు సుయోధనుకడకున్, బొం డింగిత మెఱిఁగి సంధి పొసఁగింపుఁడు వే
రం దది గాకున్న గెలుపు, తెం డీభృత్యులకు నాజి దీనశరణ్యా!

చింతలపూఁడి 1944

## తెలుఁగు కవి

క. తిక్కనయజ్వ వరించిన, ఫక్కిని దెనుఁగుందనమ్ము పాయక సుమనో
వాక్కులు విడువక యౌచితి, తక్కక మనకవి కృతార్థతన్ గనవలయున్

కోడూరు-కృష్ణ 1946

## తిలక్

శా. ఏనాఁ డెవ్వఁడు చల్లువిత్తనము నేఁ డీరీతి యావత్పుర
శ్రేణిన్ బల్లెల నాక్రమించుతరువై శ్రీమంతమై కాంతమై
నానామానవ మంజులస్తుతుల నానందించు భాగ్యంబు సం
ధానించెన్ భరతోర్వి కాతిలకు నుద్దామున్ బ్రశంసించెదన్

వెలగలేరు 1948

## గోడ

క. ఈ గోడ యిసుక సున్నము, యోగించినవస్తు వనుచు నూహింపకుఁడీ
ప్రేగులు మూల్గెడిపేదల, మైఁ గల రుధిరాస్థు లిట్లు మనకుం దోఁచున్

ముదునూరు 1948

## కూలుచున్న గాంధి

ఉ. మానాము విత్తమున్ భరతమాతృసపర్యకు ధారవోసి లో
కానకు సేవచేయునవకాశమ కాంచితి నింతదాఁక, నా
ప్రాణము నిచ్చి రక్తమును బాయలుపాయ లొనర్చి భారత
క్షోణికి సేవచేసితినిజూ! యిపు డంచు మహాత్ముఁడుబ్బెడిన్

---

## సుబ్బన్న

శా. పావిత్ర్యప్రథితాంధ్రసంస్కృతకలాపాథోనిధానత్వభా
భావప్రస్ఫుటహర్ష కారణముగా భాషావధూటీప్రియ
గ్రైవేయమ్ముగఁ గైతసెప్పి గెలుపున్ గాంచెన్ వధానక్రియన్
సి.వీ.సుబ్బన ధారణాకుశలతన్ జీరాలపట్నమ్మునన్

16-1-66

---

## నార్ల

ఆ. సత్యమునకుఁ దపము సల్పు నించుకో మొగ, మోటలేక నిక్కమును వచించు
ప్రభుత ప్రజలపాలఁ బడినట్టితతి నిట్టి, నార్లకల్మి తెనుగునాటిబల్మి

19-8-65

---

## వావిలాల

ఆ. కోరఁ దర్థములను గోరఁడు కాంతను, కోరఁ దాజ్ఞసేయ గొప్పపదవి
కోరు వావిలాల గోపాలకృష్ణుఁ డ, ట్టడుగువానికొల్పు నహరహంబు 1

చ. ఇతని కఠోరజీవితమె యాతనకిన్ జయహేతువై నుతి
ప్రతతి గడింప వీని కొకపక్షముతోఁ బనియేమి? సత్య సం
గతులగువారు భోగములఁ గాదనువారు పరార్థకల్పన
వ్రతులగువారు లేకుదుటివారయినన్ విడనాడ రీతనిన్ 2

గీ. తాన యుదికినవలువను దాల్చుఁగాని, చలువసవరింత లేనాఁడు వలపఁ డితఁడు
వంకరలులేనినడత కావలయుఁ గాని, మడత యెట్లున్న నేమిలే మానవునకు 3

30-12-66

## బాపట్ల - వ్యవసాయ కలాశాల

సీ. ప్రకటితాంధ్రోద్యమ ప్రథమశంఖారావ, కంపిత దశదిశాకందరంబు
భావనారాయణప్రభు కటాక్షశ్రీ ప, రంపరా వలయిత రమ్యభూమి
ప్రాగబ్ధివీచికా పరిశీతల సమీర, శాబక క్రీడా ప్రచారవేది
వివిధవిద్యాకలాభవన సంతర్పిత, భారతీ దరహాసభా విభాసి

గీ. భావనగరంబు సర్వప్రపంచ జీవ, హర్ష కారణ హాలికవిద్యామయూఖ
పీఠమై ఖేటమై పంచిపెట్టెఁ దెలుఁగు, గడ్డ కీనాఁ డపూర్వ సంక్రాంతి సుఖము 1

క. *వెలనాటివీరు లిద్దఱు, వెలనాటికి వెలుఁగులిచ్చు వీటికి మిగులన్
వెల నాటిరి కపురపు ది, వ్వెల నాటిరి తెనుఁగుతల్లి వెడలెడిబాటన్ 2

16-7-45

---

## చంద్రమౌళి

గీ. నాఁడు ప్రజలోన భగవానుఁ జూడనేర్చె, నేఁడు భగవానులోఁ బ్రజం జూడనేర్చె
నాఁడు నేఁడును జంద్రమశ్శూడుఁ డితఁడు, భగవదారాధనాధ్వర ప్రవణమతియె 1

క. అన్నిట ననుఁ దిలకించుచు, నన్నిటి నాయందుఁ జూచునాతనిదరి నే
నున్నాఁడ నన్న కృష్ణుని, ప్రన్ననిప ల్కెఱిఁగి యితఁడు పండె నయారే! 2

ఆ. పండకున్న నితఁడు పగతురఁ జెలికాంద్రఁ, దిట్టుపల్కు నెడఁదఁదేర్చుమాట
నొక్కరీతి నెంచు టొదవునె సుఖదుఃఖ, సమత ననుభవించుచదురు గనునె 3

క. ఈసమదర్శనయోగ వి, కాసము సామాన్యసిద్ధి కాదుగదా! ప్రా
గ్యాసన లెగసి కఠోరా, భ్యాసం బిది చంద్రమౌళిపాలిది యయ్యెన్ 4

గీ. కర్మఫల మాసచేయని ధర్మవీరు, నితని వెంకన్న రామన్న లిలకు నొజ్జ
బంతిగా మెఱయించుచు బహుళవిజయ, మహితుఁ జేయుచు వేయేండ్లు మంత్రుగాక

13-4-65

---

*శొంఠి రామమూర్తి, భాగవతుల విశ్వనాథము

## రామానుజులు రెడ్డి

క. రామానుజరెడ్డికి ననుఁ, బ్రేమించు నుదారమతికిఁ బిన్నలు పెద్దల్
తోమాలియ లర్పించుట, శ్రీమద్భారతికి భక్తిసేయుట యనెదన్ 1

ఉ. శిక్షితచిత్తుఁ డాంధ్రబుధసింహుఁడు ముప్పదియేండ్ల సాహితీ
దీక్ష ఫలింప శిష్యుల సుధీజనమాన్యుల సాధుజీవి కా
దక్షులఁ జేసినట్టి గురుతల్లజుఁ డీమహనీయుఁ డంచు నేఁ
డీ క్షణమున్ ఘటించి సుకవీంద్రుల నుత్తమశాస్త్రభారతీ
రక్షకులన్ రసజ్ఞుల నిరంతర సత్కవితా సమర్చ నా
తిక్షుధితాత్ములన్ బిలిచి తియ్యము నెయ్యము చూపి దేశికున్
లక్షణచోదిత క్రమములన్ గొనియాడి బహూకరించు న
ధ్యక్షులు సభ్యులున్ నుతికి నర్హులు వీరి కఖండధాత్రిలో
నక్షయకీర్తి కల్గుత! మదాప్తుఁడు బూదురుసత్కులుండు ప
ద్మాక్షదయాబలమ్మునఁ జిరాయువు నంది నిలింపరాడ్వ నీ
వృక్షలతాంతకాంత కృతివిశ్వవిరించనుఁడై త్రిలింగవా
ణ్యక్షరచారిమప్రదగ ణాగ్రసరత్వము గాంచి శాంతి దాం
తిక్షముఁడై ముముక్షుకులదీపకుఁడై హవణించుఁ గావుతన్! 2

29-10-54

---

## రాయలు

గీ. కృష్ణరాయ! కళింగమహీజిగీషఁ, గదలి శ్రీకాకుళస్వామికరుణ వడయ
నతనిసన్నిధి నీవు ని ద్రవధరించి, భక్తిలో స్మృతిలో హరిపాదసేవ
నార్చనాదులలో బ్రుంగి యలసి సొలసి, మైమఱచి నిద్ర గన్నవు దాముదారి
నీకలన్ గనిపించి గోదాకుమారి, రంగమునఁ దన్ను వలచిన రమ్యకథను
దేశభాషల లెస్సయౌ తెలుఁగునందు, నందములుగుల్క నిర్మించి యస్మదీయ
చిత్త మలరింపు మని శుభాశిషము లొసఁగి, నిన్నుఁ గరఁగింప మెలఁకువగన్న వెనుకఁ
గైతవ్రాసితివా! మంచికథయ; పగఱ, నెద్రిచి పోరాడఁ జనువాని కేనికేని
రక్తసంసిక్త రణవిహారములుగాక, జయపరాజయ లాస్యదాస్యములుగాక
యిట్టికల వచ్చునా? మఱి యిది యసత్య, మనుట నీపట్లఁ బొసఁగునా? యదిర! యెంత
వింతమనుగడ నీది? భూకాంత! యెంత, సుస్థితప్రజ్ఞ నీది? నీజోడువచ్చు
యోగి యెవ్వఁడు? రసరసాభోగతృష్ణ, లొడిఁగె నీలోనఁ; గానిచో నురక నిన్ను

"సాహితీసమరాంగణసార్వభౌమ!, కృష్ణరాయేంద్ర! కృతి వినిర్మింపు" మనుచు
వివిధవిద్వజ్జనావళి వినుతిసేయ, నెంచునా? దక్షిణాపథం బెదురులేని
చేవc బాలించునీవు రాసిక్య మేచి, యెంతసేయవు కవులకై! యెంతభక్తి
బాహిరింపవు! పెద్దన్నపదము పట్టి, తొడిగితివి పెండెరము; కవీంద్రుని కడాని
పల్లకీ మోసితివి; తెన్గుcబలుకు వెలcది, పున్నెములు పండి క్రైవ్రాలి పుట్టి తీవు;
'రాయ' లనినంతనే 'కృష్ణరాయ' లన్న, యర్థమే తోcచుc గాని విద్యాపురాధి
పతులు పరిహారముఖ్యు లిప్పట్ల మాకుc, గానిపింపరు పరమభాగ్యమ్ము నీది;
నీకళారాధనాసక్తి నీకవిత్వ, సృష్టియును గారణంబు లీశ్రేయమునకు
నెంతసిరి యున్న నెంతవిక్రాంతి యున్న, నెంతదొరతన మున్న సాహిత్యమైత్రి
లేనివాc డెవ్వcడు చరిత్రలో నెసంగె? నున్న వాcడెవ్వc డుద్దీప్తి నొందకుండె?
ధన్యతామూర్తి వీవు విద్వత్కవీశ!, మాన్యతారాశి వీవు సమ్రాడ్వతంస!

10-3-62

## మా వెంపటి

ఆ. తనసుఖమ్ముకొఱకుc దనయాలుబిడ్డల, సుఖముకొఱకుc గాక నిఖిలజనుల
సుఖముకొఱకు బ్రదుకు సూర్యనారాయణు, నెదcదపెంపు నుదువ నెవనితరము? 1

ఆ. ఎన్నcదగిన యెదcద యెది? విపన్నుని గని, నంత జాలువాఱునదియ కాక
నరున కిదియ గుర్తు నాc జెల్లు రెండు కా, ళ్లుంట కాదు బువ్వc దింట కాదు 2

ఆ. అనఘమైన శాక్యమునికోవలో మేటి, నరుc డితండు పొదమినాcడు నేcడు
ఇతని కొజ్జ లైరి యెరవాడసంయమి, ధీమదు త్తముcడు వినోమహర్షి 3

గీ. కరుణ సత్యము నిష్కామకర్మయోగ, మేకమై సూర్యనారాయణాకృతిc గనె
ఇమ్మహామతి సర్వోదయమ్ము దక్క, వలచునా స్వీయ ధనధాన్య వైభవములు 4

ఆ. మాడ కాసపడిన మా డాక్టరు తెనాలి, వాడ కొక్కమేడ వైచుc గాని
మాడ కాసపడక మహినెల్ల మేడలు, కట్టె నితcడు కీర్తి కాంత లుండ 5

క. ఇది మల మిది మూత్రం బని, యెద రోయక వీథు లూడ్చు నీతని బ్రదుకే
బ్రదు; కీ పాకీసూరయ, పద మంటినచోటు శౌచపద మౌ టరుదా? 6

క. తా నూడ్చెడితావును భగ, వానునిముంగిలి యటంచు భావించు నహో!
తా నుపచారమొనర్చెడి, ప్రాణి నితం దూహసేయుc బరమేశ్వరుcగన్ 7

ఆ. నిక్కమైన సేవనిగ్గులు తిలకింప, నేగుదెంత్రు సుజను లితనికడకు
నాఫ్రికోర్విసుండి యమెరికానుండి యిం, గ్లాండునుండి తాయిలాండునుండి 8

క. ననుఁ జూడనేల మీ రల, తెనాలికిం బోయి కనుఁడు తెనుఁగన్న భిష
జ్మణి వెంపటి నని భావే, పనుపన్ జనుదెంతు రాత్రపాటున వీరల్ 9

గీ. వెలఁదుల నితండు వందల వేలఁ దీర్చి, సకలభూముల శాంతిదూతికలఁ జేసె
ఇతని యాచార్యకంబున కెంతయేని, ఋణపడె నయారె! తెల్గునారీజగత్తు 10

ఆ. అగ్ని శిఖలవంటి యతివ లూరూర స, ర్వోదయోద్యమ ప్రయోగనిపుణ
లగుట చూచి పురుషు లణఁతురు తమబింక; మెంతచేసె దాక్ట రెఱుఁగనట్లు! 11

క. లోకంటిని సవరించుట, పై కంటికి మం దటంచు బదలు నితం డీ
పోకద ఐహికభవసుకృత, శ్రీకతమునఁ గాక ప్రజ్ఞచే వశపడునా? 12

ఆ. ఎంతబదలునీతఁ దంతచేవ గడించు, నదిర! సేవ నీమహత్త యొదవె
సేవ మఱచి స్వార్థచింతల నల్లాడు, జంతువులకు మేలుబంతి యితఁడు 13

ఆ. అఱువదేండ్లతాత యని వెంపటికులీను, మెచ్చువారు వట్టిపిచ్చివారు
శతము కా దితండు శతశతవర్షముల్, మనుట నిజము గాన మనపొలాన 14

ఆ. ఊరకుండఁజాల నొకమాట చెప్ప కీ, సాధుమౌళి యెంత బాధపడిన
నన్ను వంటివాండ్రు నా కంటె మొనగాండ్రు, బ్రతుకు దిద్దుకొందు రితనిఁ జూచి 15

ఆ. నలువదేండ్లు నన్ను నలిపినపెనుదయ్య, మితనిఁ జూచి పరువులెత్తె నన్య;
మోటివాని నన్నుఁ బూఁట కామదదూర, మరుగఁజేసెఁ బాదయాత్ర నితఁడు 16

క. సహధర్మచరీ పదభర, వహనక్షమ సుందరమ్మవల్లభుఁడై యీ
మహముం గనె మా దాక్టరు; నహి! నహి! తత్సతిని దొరయునారి జగానన్ 17

క. స్వకజీవితమే జాతికి, నొకసందేశముగ సాగు యోగీశ్వరుఁ డీ
యకలంకచరిత్రుఁడు గాం, ధికుటుంబముపరువు నిల్పుఁ దెనుఁగుంబుడమిన్ 18

గీ. గోవులు పతివ్రతలు నేల క్రుంగకుంద, మనుచుకై వడి నీదృశుల్ మాననీయ
సేవనాసక్తమతులు సౌశీల్యనిధులు, కాచుచుండ్రు కాంగ్రెసువారి రాచగద్దె 19

* * * * *

గీ. నీకు సర్వదివత్సరాల్ నిండె ననుచు, సలుపుచున్నారు పెద్ద లుత్సవము నేఁడు
సతత సర్వోదయోద్యమ వ్రతుని నిన్ను, నెంత కరఁగించు వెంపటీ! యీమహస్సు? 20

ఆ. ఆర్తసేవ కౌగ్గి యసురుసురై ననాఁ, డింద్రియముల నిగ్రహించినపుడు
తత్త్వదర్శనమ్ము దక్కినతతిఁ గాక, పొంగ వీవు ప్రజలు పొగడుపట్ల 21

క. పొంగమి య ట్లుండఁ గడున్, గ్రుంగెద; వెనలేనికుందు గుడిచెద; వీనాఁ
డంగద లెట్లున్న సరే, యంగీకృతి నిమ్ము ప్రజలయాసక్తిదెసన్ 22

క. నిన్నువంటివారి నిస్స్వార్థయోగాన, సిద్ధిగన్నవారి సేవ లీవు
లిట్లు మెచ్చి మెచ్చి యేనాఁటికైన వీ, రాసచేయవచ్చు నన్యహితము 23

క. నీ వాంధ్రప్రజపాలిటి, భావేసంయమిని నీవు బాపూధర్మ
శ్రీ విలసితుఁడవు నీకు న, నావిలునకు స్వస్తి సూర్యనారాయణకున్ 24

24-6-64

---

## రాజబాబయ్య

ఆ. మదికిఁ బదనువెట్టి హృదికి వెన్నెలఁజేర్చి, శిష్యతతికిఁ గ్రొత్తచేవదెచ్చి
ప్రథితి గన్న రాజబాబయ్య పోయెనా! గురుకులమ్ము లార్తిభరము మోయ

26-7-67

---

## వినోబావాణి

క. ఎదలోఁ గదలిన రవమే, మృదువాక్కుల వెలువరింపుమీ! సత్యముపై
మది నిల్పుట పేదలకున్, బదిఖండ్రిక లిడుటకంటెఁ బరిగణ్య మగున్ 1

క. మనము పేదవాని మఱచుటచేతనే, పెక్కు సంకటములఁ జిక్కినార
మతఁడె నేఁడు మనకు నారాధ్యదైవత, మతనిఁ గొల్చుటే సుఖావహమ్ము 2

క. బెదరించి ధనాఢ్యుని సం, పద గైకొను టేల? యతనిమంచికి మనదౌ
బ్రదు కుపకరించినప్పుడు, వదలున్ మనకొఱకు నతనివసువు నతండే 3

ఆ. నూలుదీయుసతుల నాలోకనమొనర్ప, నస్మదాత్మ లెస్స యలరెఁ గాని
వడుకుచున్నవారి యొడలిపై ఖద్దరు, చీరలేమిఁ జూడ సిగ్గుపడియె 4

ఆ. పూఁటకూటియవ్వబువ్వగా మీనూలు, పరులకొఱకు వెచ్చపడుట తగదు
ఆవరింపవలయు నది మీశరీరంబు, నమ్మలార! మెత్తు నపుడు మిమ్ము 5

గీ. ఎన్ని చెప్పినఁ జేసిన నెంతపెంపు, వచ్చు నిమ్మహి ఖద్దరు హెచ్చుకున్న;
మన మహింసాత్మకసమాజమును సృజింప, నేర్తుమె కుటీరగతవస్తునిష్ఠ లేక 6

గీ. స్త్రీలు పురుషులు పెద్దలు చిన్నవాండ్రు, చదువవలె గీత; నిది మనబ్రదుకుబత్తె;
మెవరినుడిని వా రిది పరియింపవచ్చు, మూలమే పార్య మనుమాట మొఱకుమాట 7

22-3-64

---

## మేదూరి

క. మేదూర్ నాగేశ్వరుఁడు క, వీదార్ఢ్య రసజ్ఞతా మహిష్ఠుఁడు సేవా
రూఢచరిత్రుఁడు తోడై, తేఁడై గుంటూరిసీమ రెక్కొనఁజేసెన్ 1

ఉ. సంపద లెన్నియున్నఁ బరిషత్తులుమెచ్చిన విద్యలున్న గ
ర్వంపడఁ డీమనస్వి; రిపువర్గముసైతము మెచ్చు నీతనిన్
లంపులమారి మూఁకల బళాబళిసందడి యెంత రేఁగినన్
దింపఁడు పెద్దవారి; వెనుదీయఁడు సత్యము నాదరింపఁగన్. 2

6-4-66

---

## కులము

ఆ. ఎఱుకలేనివార లెల్లరు శూద్రులే, ఉన్నవార లంద ఱుర్విసురులె
చచ్చువాద మింకను జాలించి మేలెంచి, కన్నువిప్పరయ్య! యన్నలార! 1

క. కులగతవైరమ్ములతో, నలఁగి నలఁగి కోలుపోయినారము ప్రభుతన్
చెలమిన్ మరగుఁడు వచ్చిన, బలిమిన్ గాపాడుకొనుఁడు ప్రాజ్ఞులుమెచ్చున్ 2

1-1-67

---

## తల్లిదండ్రులు

ఆ. తప మనంగఁ దండ్రి ధర్మమునాఁ దండ్రి, విద్య యనఁగఁ దండ్రి వేల్పు తండ్రి
తండ్రి కింపుసేఁత దైవతములకెల్ల, నింపుసేఁత కీర్తి పెంపుసేఁత 1

ఆ. ఒజ్జకంటె జనకుఁ డుఱవుగా జనకుని, కంటె జనని గణ్యగా వచించి
రాదిబుషులు; పేద కర్ధవంతున కమ్మ, యుంట బహుసుఖాలపంట యనిరి 2

క. ఎవ్వనిమన్గడఁ గన్గొని, యవ్వయు నయ్యయును దనివి నందెద రెద వాఁ
డవ్వారిగ రాణించుచు, నువ్వెత్తుగ నందనేర్చు నుత్తమపదముల్ 3

2-5-64

---

# సుబ్బరామయ్య

(నిడుఁద్రోలు కాలేజి ప్రిన్సిపాలు)

శా. అంతర్వాణులు సచ్చరిత్రు లధికార్యగ్రేసరుల్ వేనవే
లంతేవాసులు కొల్వఁగా సొగయుభాగ్యం బందుకోనేర్చి వి
శ్రాంతిన్ గంటివె! నేఁడు; శాంతిజగతీ సామ్రాజ్య సింహాసనా
క్రాంతిన్ బ్రొద్దులు పుచ్చు మింక గురువర్యా! సుబ్బరామాహ్వయా 1

చ. పరుఁ దెదిచేసినంత నిజభావము దావశిఖల్ వెలార్చుఁ దా
నొరుదెస దానిఁ జేయమి సముజ్జ్వలధర్మ మటన్న సూక్తి నీ
చరితకు జీవధాతు; వది సత్కవిశేఖర కావ్యవస్తువై
తరతరముల్ త్రిలింగజనతాహృదయమ్ముల గూఁడుకట్టెడిన్ 2

క. ఎవ రూహించిరి నాయఁడు, కవి యౌ నని యేఁబదేండ్లు కడచిన వెనుకన్
భవదీయమైత్రి నీతని, కవురా! యీగాలి సోఁకె నన కే మనెదన్ 3

ఉ. ముగ్గినమావియౌ తెనుఁగు మున్వనమూదలగా నిగా జగా
పగ్గెలు చూపి కబ్బములు పల్కిన మేలితరమ్మువాఁడ వీ
వుగ్గును గ్రోలునాఁడె చవు లూరెడి కైతలు గూర్చి రచ్చలో
నెగ్గినవాఁడ వీ; వగుట నీఁ డిటు లౌటకు నబ్ర మున్నదే! 4

ఉ. తిక్కనకైత నాంగ్లమునఁ దీర్చెద వుత్తమకావ్యశక్తి; నీ
చక్కనిసృష్టి 'విశ్వకవిచంద్రుఁడు కొమ్మనముద్దుగుఱ్ఱ' యన్
నిక్కము చాటి తెల్గులకు నిర్భరకీర్తి ఘటించు; ధన్యతా
రుక్కమనీయ! నీకు నివె మ్రొక్కులు గుఱ్ఱమువంశవర్ధనా! 5

5-8-65

---

# నవయుగము

చం. నవయుగ రేఖ తోఁచె నరనాథులకున్ బ్రజ లానవెట్టి రీ
భువి నిఁక సామ్యవాదరుచి పొంపిరివోవును గాదు కూడ దం
చెవఁ దెదురాడినన్ నిలువ దీ సమతామమతాప్రవాహ మె
క్కువ దిని త్రేఁచి వెజ్జుకదకుం బరుగెత్తెడివార లాఁకటన్
జివసెడి కుందువారు మనసీమల నుందరు మేడ లొక్కచోఁ
జివికినయట్టి పూరిగుడిసెల్ మఱియింకొక చో ఘటిల్ల వీ
యవనియు నగ్నియున్ జలము నాకసమున్ పవనంబు నెల్లమా
నవులకు దైవ మిచ్చినధనం బనువాదము రేఁగె నేఁడు దీ
నివిసరు దీనిధాటి ధరణిన్ వణఁకింపఁదొడంగె ధాత్రిలో
నవము సలామొనర్చెను 'హసా' దనె దీనికి భారతోర్వియున్
జవిగొని తీవ్రవేగమున సాగిన దీపరిణామలబ్ధి కా
ర్యవికసనాలవాల మనఁ జాలి జగద్ధిత కార్యకల్పన
ప్రవణమతిన్ మహాశయులప్రస్తుతి గన్న వినోయతీంద్రుఁడున్
బవ లని రే యటంచుఁ బరిపాటియొనర్చక పాదయాత్రతో
శ్రవణసుఖమ్ములౌ నుడులజల్లులతో నదిరా! యపూర్వవి
ప్లవమును సామ్యయోగమును బల్లెకుఁబల్లెకు దెచ్చె భోగపుం
దివములు పోయె నియ్యవి వితీర్ణికి వేళలు సుమ్ము సత్యమున్
శివమును సుందరమ్ము నగు జీవన మీవిని గాక లోభముం
దవిలినచూపుతో నరుఁ దెతందును జేకొనలేఁడు మూర్ఖతన్
అవఱవ చూపువారలు పరాజితులౌదు రిటన్ జరిత్రచే
నవగతమైన సత్యమిది యర్థము లద్రులవోలెఁ బెంపఁగాఁ
దివురుట తప్పు కోర్టునకుఁ దెక్కలికాండ్రకు మర్త్యరూపదా
నవులకు బెగ్గడిల్లుచు ధనమ్మును గాచుట వెట్టి పుత్రపౌ
త్రవితతి నెంచి మానవుఁ డదభ్రముగా సిరి సంతరింప స
ర్వవిధవిపత్తులం గుడువరా దలఁతం బడి సంతరించినన్
ద్రవిణము నిల్చునా? శతపథమ్ముల నయ్యది దుయ్యుఁ గాన గ్రు
క్క విడక దయ్యఁబో కెవనికర్మము వాని దదే ధనాదులన్
సవరుచుఁ గాని యొండొకటి చాలదు దీని కటం చెఱింగి కృ
త్యవిదుల నాశ్రయించి సముదారతమై సకలప్రజాసుఖో
ద్భవమున కాసచేసి ప్రియతామయజీవన మిచ్చగించి సత్
కవులు మనీషిసత్తములు తత్త్వవిదుత్తము లద్దిరయ్య! నా
నవిరతశాంతిమైఁ దనివి నందుము పొందుము కీర్తి సోదరా!

5-3-64

## మొఱకు

క. నిప్పునకున్ జెద లంటుట, చొప్పద దని కనక మొఱ కసూయావశుఁడై
చెప్పును బొం కనఘునిదెసఁ, ద ప్పిది యని నరులు నవ్వఁ దరులకుఁ జెప్పున్
25-6-68

---

## ప్రాజ్ఞుఁడు

గీ. ము న్నొకం దెదుతొమ్ముపైఁ దన్నినపుడు, వెన్నుఁడు ప్రసన్నతం జూపఁగన్నకరణి
నజ్ఞుఁ దేచెట్ట చేసిన నది సహించి, ప్రాజ్ఞుఁడు నిజప్రతిష్ఠకు బలిమి గూర్చు
20-6-67

---

## అడుసుమల్లి

ఆ. అడుసుమల్లివారి కర్వదియేఁడులా, మొగముమీఁద నొక్కముడుత లేదె
కన్ను గుట్టి యెవరొ పన్ని రీయాగము, ముసలితనము చూడ నెసరు పెట్టి 1

క. కాకానివారి తంత్రమొ, కాకున్నను విన్నకోటకవి కల్పనమో
లేకున్న నెఱ్ఱియొజ్జల, ధీకిటుకో యింతవఱకుఁ దెచ్చిన దనెదన్ 2

క. వెఱచె నధర్మ మసత్యము, వెఱచినగతి నితనిఁ జేర వృద్ధతయు నహో!
గరువమ్ము వోనికైవడిఁ, బరువమ్మును బోవ దితనిప్రాపున కెదయై 3

క. కష్టములన్ సుఖముల సమ, దృష్టిం గను కర్మయోగి యితఁడు జరాసం
దష్టుఁ దగు టెట్లు పొసఁగును, శిష్టున కీయగ్ని కెట్లు చెద లంటు నయా! 4

గీ. రాచవారలదెందము ఱాతిముక్క, పలుకు సరిక్రొత్తవెన్నయై పరఁగు నన్న
నన్నయకు దిద్దెఁగద పంగనామ మితఁడు, కూచినుడి మెత్తమెత్తనిగుండె వడసి 5

క. క్షత్రియుఁడు కాఁడు కమ్మని, ధాత్రీసురుఁ డిత దటన్నఁ దగవాడక తా
ర్యత్రిక మంగళ గౌరవ, పాత్రుని గావింతు సత్యభారతి నితనిన్ 6

క. కవి యయ్యు నితఁడు నిచ్చలు, కవిపూజ లొనర్చుఁ బరసుఖము తనసుఖ మం
చవిరత విపన్న సేవా, ప్రవణమతిన్ బదలు నిట్టిప్రాజ్ఞులు కలరా! 7

గీ. రాజకీయాధి జీవనరంగములకు, నన్నిటికి నీదృశు లుదారు లబ్బిరేని
దేశమున కెంతకాంతి ప్రాప్తించి యెంత, శాంతి సమకూడి యెంతసంక్రాంతి యగునొ

క. నారాయణరాయ! భవ, చ్చారిత్రము సాధలోక సంభావ్యము నీ
గౌరవమున కీ నవసుమ, హారము నర్పించువాఁడ నంజలితోడన్ 9

5-1-62

---

## మా స్వామి

మంజరి

జోహారు! స్వామిజీ! జోహారు! నీకు, జోహారు! గాంధేయ శోభాశరణ్య!
ధన్యతామూర్తి! సీతారామయోగి!, జోహారు! వినయాశ్రమాహుతప్రాణ! 1

నిఖిలభారతభూమి నేఁడు నీపూజ, నెఱపుచున్నది భక్తినిష్ఠమై నిలిచి
సేవామయంబైన, చిరతర త్యాగ, తేజోమయంబైన, నీ జీవితమ్ము
దలపోసి పులకించి తనియుచున్నది, మహా కవి కావ్యమ్ము నట్లు నీ బ్రదుకు
సకలమ్ము లోకైక సందేశమయము, వికృతుల నన్నింటి వేలిచి వేల్చి
శాంతి నార్జించిన సంయమి వీవు 2

నిష్ఠానిధీ! నీవు నిల్చిన యడవి, తీర్థమై మహినెల్లఁ దిగిచె నచ్చటికి
బాపుజీ వేంచేసె భన్సాలి వచ్చె, వచ్చె భావేఋషి వచ్చె రాజేంద్రుఁ
డభినవ భారత ప్రభ కాదికార, ణములైన పెద్దలందఱు వచ్చితనిసి
రద్దిరా! నీ వినయాశ్రమక్షోణి, యాచార్యపీఠమై యలరె యోగీంద్ర!
అర్థంబు కామంబు నామిక చూపి, ధర్మువు నణఁచి తైతకలాడు నేఁడు
నీవు లేవని మేము నిట్టూర్చుచుండు, మీవు లేవని క్రుంగి యుల్లిగ్గుచుండు
మొకవినోబా తప్ప నిఁక నేఁడు మాకు, దిక్కెవ్వరయ్య! గాంధియుగమ్ము పేరు
నిలుపఁగా నత్యంతనియతిమైఁ బెనఁగు, వలఁతుల కార్తసేవాతత్పరులకు
సర్వోదయోద్యమ సంచాలకులకు, భవదీయ శీలంబు భవదీయ తేజ
మండగా దండగా నలరారుఁగాక!, అభయం బొసంగి మే లని పల్కుఁగాక! 3

28-3-64

* * * * *

క. జీవనమును మాతృమహీ, సేవనమున కప్పగించి చిరతరకీర్తి
శ్రీవాల్లభ్యము నందిన, కోవిదు మా గొల్లపూఁడికులజున్ దలఁతున్ 4

ఆ. తెల్లవానిగుండె తెర్లె సీతారామ, శాస్త్రినితని విన్న జలదరించి
కుంటువడక వచ్చు గుంటూరివాసికి, వాసి దెచ్చె వీరవర్యుఁ డితఁడు 5

క. కత్తి కఱుకు లేని కదన మీ సర్దారు, నేర్పినాఁడు తెనుఁగు నేల కెల్ల
బోసినోటి నవ్వుపొంగులతో "విజ, యో" స్తటంచు గాంధి యుగ్గడింప 6

గీ. నిర్భయుఁ డితండు నమ్రత నిండి తొనఁకు, మానిసి యితండు దైవసంపదలనెల్ల
నాఁచికొన లెస్స పెనఁగిన యనఘుఁ డితఁడు, సిద్ధి వడసిన సాధక శ్రేష్ఠుఁ డితఁడు 7

ఆ. భారతీయధర్మ పరిపాకమూర్తిగా, సంన్యసించినట్టి స్వామి యితఁడు
కావి గట్టుఁగాక సేవకు దవ్వుగాఁ, జనఁడు ప్రాజ్ఞుఁ దన్న సాధు వితఁడు 8

2-4-65

* * * * *

గీ. దేశము స్వతంత్ర మైనను దృప్తిపడక, పదవులకు నారటింపక పట్టువిడక
తనువు నుజ్జనకావించుదనుక నొరుల, నొవ్వు లణఁచిన మాస్వామి కెవ్వ రీడు 9

ఆ. తేటతెల్లమైన తెలుఁగున వేదముల్, వెలువరించె ధర్మవీరుఁ డితఁడు
తాఁకరానితనము పోకార్చి యర్చింపఁ, దగినబాఁపఁ డాయె ధన్యుఁ డితఁడు 10

ఆ. హరిజనప్రవేశ మంగీకరించిన, తెలుఁగునాటి మొదటిదేవళమ్ము
కలదు కలదు మాకుఁ గల దని కావూరి, కవిని నేను గుల్కఁ గత మితండు 11

ఆ. ప్రజలకొఱకు బడలి బడలి పోయిన సుచ, రిత్రు నితని సంస్మరించుకొనుచు
నంధ్రజాతి గణ్య మగుఁగాక! స్వామిజీ, వెలుఁగు లిరుల ననుభవించుఁగాక! 12

2-4-66

---

## గద్దెలింగయ్య

గీ. స్వీయదేశ స్వతంత్రతాసిద్ధికొఱకు, నైకముఖసేవ లొనరించి యలసి యలసి
గఱువ లిడుగద్దె వడసిన గద్దెలింగ, యాఖ్యుఁ డిల వీడెనా! షష్ఠియైనఁ గనక 1

గీ. సరసతయు సానుభూతియు సందడింప, నొరులతో ముచ్చటించునేర్పరి యితండు
నేర్పు గా దిది యెనలేని యోర్పు గాని, యుక్తి గా దిది సరిలేనిరక్తి గాని. 2

27-12-63

---

# శుకయోగి

క. నరసయ్యా! నీ మనుగడ, నఱువది యేండ్లైన నింద వదియేమి మహిన్
దొఱఁగితి వీ మాత్ర కెటన్, సురిఁగితి సచ్ఛాత్రబంధుసుహృదులు కుందన్ 1

క. నా మేనల్లుఁడ వనుచున్, నామెఱుఁగులు కొన్ని లేని నాదార పటం
చేమఱి చులుకంజేయక, వేమఱు ప్రేమించి గౌరవించితి నిన్నున్ 2

క. నీ జనకుఁడు జనకధరి, త్రీజానికి దొర యగున్ బ్రతిష్ఠితబుద్ధిన్
నీజీవన మీ సుబ్బయ, తేజునకున్ దేజు గూర్చె ధృతయమనిష్ఠన్ 3

గీ. ఔపనిషదార్థ మెఱిఁగితి వఫలసంగ, యోగమర్మము గంటి గీతోక్తి త్రచ్చి
మూఁడునాలుగుబాసలఁ బ్రోడ వైతి, పెద్ద లౌనన మనువును దిద్దుకొంటి 4

ఆ. నిప్పువంటిబ్రదుకు నీది, జితేంద్రియ, చక్రవర్తి వీవు, వక్రమార్గ
గామి గాని దృష్టితో మహర్షివిధాన, మంటి వీవు, గెలుపుగంటి వీవు 5

క. పెదపూఁడి వీడి పండిత, పద మీకొని చిలుకలూర బహువత్సరముల్
కుదురుకొని శిష్యసంతతి, మదికిన్ వెలుఁగిడితి రేపు మాపు మనస్వీ! 6

ఆ. మతము కులము లేని మానిసివై చిల్క, లూరిపేఁటవారి యుల్లములను
దోఁచుకొంటి వీవు శౌచనిధాన! నీ, ప్రజ్ఞచూడ జగముపండ్లు పులియు 7

గీ. అలుబిడ్డలు కలవారి నరయుచుట్ట, లుర్విఁ బదుగురొ యిరువంద్రొ యుంద్రు గాని
దారిదప్పని యూర్ధ్వరేతసుని నిన్నుఁ, గాచుబందుగు లింటింటఁ గానిపింత్రు 8

క. మున్నీరువోలె వెచ్చని, కన్నీరు వెలార్చె దాత కన్నయ నీకై
వెన్నకు మెత్తన నేర్పిన, యన్నకదా జాస్తినరసయార్యుం డనుచున్ 9

క. కూడులేక నవఁత గుడుచుపేదలు నీవు, పోక తమకు ముప్పు రాక యనుచుఁ
బేఁటనాల్గుదెసల బెగ్గిల్లి యేడ్చుట, వింటి నిన్ను మెచ్చు కొంటి సుకృతి! 10

క. వందలుగా నపుడప్పుడు, చందాల నొసంగి దానశాసనముల కె
క్కం దలపోయవు దీనుల, కింద మనుచుఁ బరక వీస మిచ్చెదవెపుడున్ 11

క. పూఁటకూటి కీవు పోవుచు దారిలో, నాఁకటం దపించు ననదఁ జూచి
దయకు లోఁగి నీదుదరిని వి స్తరిని వే, యింతు వతని కెవ్వఁ డింత కరఁగు? 12

క. కరఁగి యిచ్చిన దల్పమౌఁగాక యదియ, నిక్కమగు నీవి జగము మన్నింపఁదగిన
దాతయు నతండ తాదృశు లేతదవని, భరము సైరింతు రుక్కుఁగంబములవోలె 13

క. తల్లిబానిసమ్ము తలఁగ నూనూఁగుమీా, సాలనాఁడె చెఱకుఁ జని నలంగి
దేశభక్తి చాటితివి లోకసేవార్థి, కెదిరి పెండ్లి యనుచు నెంచి తపుడె. 14

గీ. ఈవు గ్రంథాలయోద్యమ సేవనమున, ముగ్గినాఁడ వటం చేల యుగ్గడింప
ఉద్యమము లెన్ని సాగె సర్వోదయమున, కవి సమస్తము సేవ్యంబు లాయె నీకు 15

క. కృతులు రచించితి విద్యా, చతురులు దావూదువంటిసత్కవు లిడఁగాఁ
గృతు లందితి ప్రజ మెచ్చన్, బ్రతికితి నరసయ్య! కీర్తి పందెను నీకున్ 16

గీ. జగము నాతలపై విరుల్ చల్లునపుడు, కనెదు కనకాభిషేకసుఖమ్ము నీవు
చిన్నకృతినైన నీకు నిచ్చితిని గానఁ, గుడుతు నీపట్ల నరసయా! కొంతశాంతి 17
(నాకృతి 'శబల' యితనికంకితము)

క. రేపే యని నేఁడే యని, యీపూఁటన యని త్వదీయమృతి నెఱిఁగింపన్
నీ పడసిన పాండిత్యము, నీ పూనిన జపము తపమునెఱి యెట్టిదియో 18

గీ. ప్రన్నప్రన్నని విరులలో నిన్నుముంచి, ముదుఁగుమోములఁ బితృవనమ్మునకుఁ జేర్చి
పేఁటవారెల్ల నీదెసఁ జాటినట్టి, చరమగౌరవ మేనాఁడు మఱవఁజాల 19

క. శోకము మోహము పుట్టని, చీఁకటిచిన్నియలు లేని సీమకుఁ జని య
వ్యాకులమతి నున్నాఁడవె!, నీ కొదవుత శాంతి గుణఖనీ! యవిరతమై 20

క. మీయమ్మ శేషమాంబకు, మా యక్కకు నిన్నుఁ జూచి మైగగ్గురుతో
దాయు నుదాత్తచరిత్రకు, నాయంజలి సెప్పవోయి! నరసమనీషీ! 21

ఆ. చెల్లి *రాఘవమ్మఁ దల్లితో నిలిచి నీ, తనువు నిమురు పిన్న దానిఁ జూచి
యేమితప్పు చేసె మామయ్య? నీవిట, కేలవచ్చి తోసిబేల! యనుము 22

ఆ. దీనికొఱ కేను దపసినై తీవ్రదీక్ష, నూఁదితిని జవ్వనమ్మును మీాఁదుకట్టి
మెఱపువోలెఁ దళుక్కున మెఱసి యపుడ, కదలె నిది నన్నుఁ బాసి లోకమును రోసి 23

గీ. ఈమెయెడ నింతవక్కణ యెఱుకలేని, చేఁత యగుఁ గాని నరసయా? నాతలంపు
నాకనులు చెమ్మగిల్లుచున్న విర! యిచట, వ్రాయని మ్మింతమాత్ర నావంత సమయ 24

ఆ. నవ్వఁబోకుమోయి నన్ను బాధించెదు, మమతఁ జూచి విడని మఱపుఁ జూచి
సుఖము దుఃఖ మొక్కచూడ్కి నీక్షించిన, జ్ఞాని వీవు మోహధాని నేను 25

*ఈమె నా మొదటి భార్య

ఆ. శుకునిబ్రదిమి కీడుజోడుగా బ్రదుకుట, నేర్చి తీవు; నీవు నిల్చుకతనఁ
జిలకలూరిపేఁట తెలుఁగునాటం దన, పేరు సార్థకమ్ముగా రహించె 26

గీ. నిన్నుఁ దనగడ్డలో దాఁచుకొన్న పేఁట, తెలుఁగువారికి నరసయా! తీర్థమయ్యె
ప్రజలు యుష్మత్సమాధికై! బ్రసవమాల, లునిచి నీశౌచ మెంతురు యుగయుగాలు 27

4-5-67

## అభయవాణి

ఆ. వేగుజామునందు విశ్వపితన్ దల, పోయునపుడు చెవికి దాయునట్టి
కోకిలారవమ్ము లోకేశ్వ రాభయ, వాణి యనుచుఁ దలఁచువాఁడు గెలుచు

1-2-64

## చదువరి

గీ. మదుఁగుఁదనమున కెవ్వానియెదఁద విడిది, యింద్రియమ్ము లసా దను నెవనియాన
కన్యులవిపత్తి దొలఁగింప నలయు నెవ్వఁ, దతఁడ తగువాఁడు చదువరి యని వచింప

10-6-67

## పిల్లలమఱ్ఱి

క. జం కెఱుఁగక పిల్లలమఱి, వేంకటహనుమంతరావు వేయేండ్లు గుణా
లంకృతులు మెచ్చ శారద, లెంక యగుచు నాంధ్రమండలిన్ హావణిలుతన్!

29-12-66

## నరేంద్రుఁడు

క. తాతయుఁ దండ్రియు నన్నయు, హేతువుగ నరేంద్రుఁ దంతకృప నేర్చె ననన్
జేతం జొప్పదు 'ఋషివా, లీ' తీర్థమె బీజ మతనిలెస్సకునెల్లన్ 1

ఆ. ఆర్తసేవ యావి యణఁకున కృప యప, రిగ్రహమ్ము నెమ్మి ఋతవచస్సు
గఱపు శిష్యతతికి గురుకుల; మది మది, వెఱపు దీర్చి బ్రదిమి కొఱపు గూర్చు 2

ఆ. సిరులు హెచ్చినపుడు నరుఁడు దానము సేయ, వచ్చు నీవి కొగ్గవచ్చుఁ గాని
కృపను జూపఁగలఁడె? కృప పేదకై నను, గలుగవచ్చు నార్తుఁ గన్నవేళ 3

క. కృప యన్న నేమి? కరఁగుట, విపన్నుల యవస్థఁ జూచి వేఁగుట; శీతా
తపబాధల నీరెండిటి, నెపుడున్ వరియించుసుకృతి యెన్నా ళ్లుండున్? 4

ఆ. ఉండ కమ్మనస్వి కొండికనాఁడె యీ, పుడమి నుజ్జగించి పోవుఁగాక
పోదు వానికీర్తి భువనమ్మున రవీందు, మండలములరుచులు మలయుదాఁక 5

క. వేదులసూర్యుని కవితయు, నాదరువై యతని మెఱయు నాంధ్రధరిత్రిన్
స్వాదూక్తికి శుచివాణికి, రాదుగదా చేటు యుగపరంపర చనినన్ 6

ఆ. తిమ్మరాజ! సాహితీబాంధవమ్ము నీ, కహరహమ్ము నిష్ఠ మగుటకతన
నింత చేసితివి నరేంద్రునకున్; బల్కఁ, దగిన, పాడఁదగిన తండ్రి వీవు 7

ఆ. అతఁడు నీ నరేంద్రుఁ డైన నీ వడలుట, తప్పుగాదు కాని తత్ కృపాళు
వెల్లమానవుల నరేంద్రుఁ డైనాఁ డిఁక, వలదు నీకు దిగులు వలదు రాజ! 8

12-3-66

---

## పావులూరి

చ. జయ! జయ! కృష్ణచౌదరి! ప్రశస్తచికిత్సకలోక శేఖరా!
జయ! జయ! సాధుశీలపరిసర్పిత గౌరవదీప్తిధూర్వహా!
జయ! జయ! సాహితీరసవశంవదధీపరిణద్ధజీవనా!
జయ! జయ! దుర్మతాంధతమసప్రసరాపహవాదకోవిదా! 1

క. మమ తాహంత లెఱుంగని, సమతాధర్మానురక్తి సదలని బ్రతుకె
ట్లమరినది నీ; కహో! గొ, తమదర్శననిష్ఠ యిట నిదానం బనెదన్ 2

క. అనగుమొగ మావినయం, బానెయ్యం బామృదూక్తి యాగఱువతనం
బేనెఱి నందితి వన్నా!, యీ నిక్కులమారిలోక మెదుటన యుండన్ 3

ఆ. చదివినట్టి చదువు చాలక మతికొంత, తెలియ నాసచేసితే! సెబాసు!
అంతు లేదు విద్య కనుకీ లెఱింగిన, నీకుఁగాక యెవ్వనికి జయంబు? 4

ఉ. లండనువారు నిన్నుఁ దగులాగున దిద్దినవెన్కఁ బాపముల్
పండినమూఁకలన్ నిజము పల్కు తెఱుంగనిమూఁకలన్ రవల్ -
పిండిపిసాళిమూఁకల శపింపక మెత్తు రి దేమి? దారికిన్
రం డని వారికిన్ బలుతెఱుంగుల బుద్ధులు సెప్పి రావయా! 5

10-10-65

## జవ్వాది

క. రాయలకైవడి లక్ష్మయ, నాయఁ డహో! కవులపాలి నందనవనమై
మాయనికీర్తి గడించెను, తీయనిచట్టముగ బ్రదికెఁ దెనుఁగుంబ్రజకున్ 1

క. కొండఱమెప్పుం గను వా, రెందఱొ కన్పింత్రు; నాయఁ డెంతసుకృతియో
యందఱమెప్పుం గనె; నీ, చందమువా రప్పుడపుడు జనియింతు రిలన్ 2

1-5-61

## మా హెడ్మాస్టరు

శా. రాజై న న్నెవఁ డేలి హృద్గగనమున్ రంజించె నంచత్కళా
సౌజన్యప్రభుతావశంగత యశ శ్చాంద్రీ విభామాలికా
రాజీమండిత దిగ్విభాగుఁ డగుచున్ రాణించె నెవ్వాఁడు త
ద్రాజామాత్యున కంజలించెద సభారంగమ్ము జేపెట్టఁగన్ 1

ఉ. నీకనుసన్నలో మెలఁగనేర్చినయొజ్జలు నీదుశిక్షకున్
లోఁకువయైనశిష్యు లతిలోక పురాకృత పుణ్యవాసనా
శ్రీకు లటన్నమాట పలుసీమల నున్నది; యక్షరాల న
వ్వాకునిజం బటంచుఁ బగవాఁ డయినన్ నుడువున్ గురూత్తమా! 2

ఉ. నీమృదుభావనల్ నెనరు నిండినపల్కులు కూచిముల్కులై
ప్రామి యహంకృతిన్ మెఱయుబాలురవృద్ధులఁ దార్చె లజ్జకున్
ప్రేమముధామమైన ఋషి వేంకటరత్నము నిన్ను సంయమి
స్వామిని జేసె శిష్యకులసత్తముఁ జేసె నహింసనప్రియా! 3

ఉ. ఒజ్జనముజ్జగించి యిఁక నూఱట గందువటయ్య! శేముషీ
సజ్జితమైన నీయెడఁద సమ్మతిచూపునె యిట్టిచేఁతకున్
మజ్జనమాడదా యది సమాహితనిష్ఠను రాజవిద్యలో
విజ్జిన మాయచీఁకటి దవీయ మొనర్చెడి పండువెన్నెలన్ 4

మ. గడియించితివి దేశికప్రధానుండవై, యనితరప్రాప్తమైనట్టికీర్తి
చేపట్టితివి కులస్త్రీకదంబక శిరో, ధార్య చరిత్రమైఁ దనరుసతిని
ముద్దాడితివి జగన్మోహన శేముషీ, శీలసంపన్నులై చెలఁగు సుతుల
ఆర్జించితివి ధర్మ వరసి భోగత్యాగ వహనక్షమంబులై వఱలు సిరులు
గీ. కొదవ లిం కేమికలవు!, లోకులకుఁ బంధ్లు, పులియునట్లు స్వతంత్రతా లలిత పవన
వీచికాడోలికా సుఖాన్వితుఁడవై చి, రమ్ము నిల్వుము! కొమరవోల్ రాజయార్య! 5

26-7-42

---

## తెన్నేటి

క. తెన్నేటి విశ్వనాథము, పన్నీటిని గెల్చుఁ బ్రన్నప్రసన్నిమాటన్
మున్నీటి నోర్చు దిటమున, మిన్నేటి నదల్చు మేలిమేలియశానన్ 1

క. పరభాష లెన్ని నేర్చిన, మఱవఁడు మనచదువు కైత మఱవఁడు రీతిన్
మఱవఁ డితఁ; డిట్టి యుత్తమ, పురుషులు జీవింపవలయుఁ బుదమిన్ జిరమున్ 2

11-9-65

---

## తీర్థయాత్ర

సీ. శాతవాహన మహాచక్రవర్తుల రాజ, ధానియై వెలసిన ధరణికోట
ఆంధ్రభూమికిని మహారాష్ట్రమునకు నా, ధారమై నిల్చిన ధరణికోట
ప్రాకృతానర్ఘసంపద స ప్తశతి జని, స్థానమై యలరిన ధరణికోట
సత్యంబునకు నహింసకు మేలిచుట్టమై, తతయశమ్మును గన్న ధరణికోట
గీ. శత సహస్ర వర్షీ యాంధ్రసంప్రదాయ, శరణమై ప్రజఁ దన్పిన ధరణికోట
కంటి నమరావతియు ధాన్యకటక మనఁగఁ, దనరు నగరంబు కొంటి నుద్దాంత శాంతి 1

ఉ. ఈ యమరేశ్వరుండు మన కెల్లశుభమ్ముల నిచ్చుఁగాక త
జ్జాయ వెదందకంటికొసచల్లనచే మనచిత్తతాపముల్
పాయునుగాక! యీ పసిఁడిపంటల జాలువు కృష్ణవేణి దీ
ర్ఘాయు రనామయమ్ము లనయ మ్మిడుఁగాక యభంగభంగయై 2

గీ. సకల దేవతామండల చక్రవర్తి, వేణుగోపాలుఁ దమరావతీనిశాంతుఁ
దఖిలకల్యాణదాయకుఁ డగుచు బ్రహ్మ, యాదులను మమ్ము రక్షించు నహరహమ్ము 3

ఆ. అంతరాజ్యమునకు నధిపతి యయ్యు న, హంత వీడి దాస్య మవధరించి
వేల్పునెదుట నిల్చె వేంకటాద్రీంద్రుఁ డీ, భక్తి వలచు గొట్టిపాటి గెలుచు. 4

16-12-66

(ఆంధ్ర శాసనమండలి - అధ్యక్షులు శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారితో, అమరావతి వెళ్ళినపుడు ఆశువుగా చెప్పిన పద్యములు)

---

## నందమూరి

ఉ. తారకరామరాయ! బహుధా పరిపుష్టము నీమనీష, యే
దారికి నేగినన్ బరిణతస్థితి నంది నటింతు వీవు పల్
నేరుపు లున్న నీమది జనింప దహంకృతి; నీదునామమే
తారకమంత్రమై మొరసె దక్షిణభారతచిత్రశాలలన్

19-7-58

---

## నారాయణరెడ్డి

క. ధీరస్తు సకలవిద్యా, పారమ్యావాప్తిరస్తు! పరిషద్విజయ
శ్రీరస్తనియెద నెయ్యరి, నారాయణరెడ్డికిన్ మనస్వికి నర్థిన్ 1

ఆ. జాను జవర యైన నూనూఁగు మీసాల, వయసునందె రెడ్డి వాసి గాంచె
ముసలితనము గాదు సిసలైన ప్రతిభయే, కారణమ్ము కవుల గరిమమునకు 2

ఆ. గేయ మనుచు రెడ్డి వ్రాయును గాని ప, ద్యమున కుద్ది యగుచుఁ దనరు నద్ది
చదురు గన్నవార లెది వ్రాసినను దాన, నందచందములకుఁ గుందు రాదు 3

ఆ. వెనుక ముందు చూచి జనతా హితంబగు, క్రైత గూర్చు హృద్యగతి నితండు
యుగయుగాలనుండి జగమునఁ బేరిన, దుమ్ముదులుప నలఁత దోఁగు నితఁడు 4

గీ. ఉసుఱుగల తెల్గు వలచిన, రసజ్ఞులు పఠింపవలయు రద్దికృతుల; నీ
పస కాఁపుబిడ్డ యగుటన్, వసంపడియె సింగిరెడ్డి వారి చిఱుతకున్ 5

19-7-67

---

## తెనుఁగు రాజు

ఉ. పాయక దిగ్గజేంద్రములపజ్జ వసించెన కాని 'లాకలూ
కాయ' లచెంత నిల్వ మమకారము చూఁపదు మా తెనుంగురా;
జేయిదుమల్ కదల్మోనిన నింగువకట్టినగుడ్డ యౌట నీ
రాయఁడు తేఱితేఱి గజరాజముగా నెగడెన్ జగమ్మున్ 1

ఆ. నేల విడిచి సాము నెఱపని లోకజ్ఞ, పుంగవుఁడుకదా! తెలుంగురాజు
తేనెతేటవోని తీయనిమాటతో, నుర్వినెల్ల గెలుచుయోద్ధ యితఁడు 2

ఉ. రెండవకృష్ణరాయలు వరించెను విక్రమదేవవర్మ యీ
పండితు నీకవీంద్రుఁ, బలుపల్కు లిఁకేటికి రాజుసాహితీ
చండిమ నుగ్గడింప నిది చాలదె చాలనిచో 'నలంద' యీ
పండువొనర్చి యాకొఱంతఁ బాపెఁగదా! 'పెనుమెచ్చు' బిడ్డకున్ 3

ఆ. అఱువదేండ్లు నిండెనా సత్యనారాయ, ణాఖ్య! నీకు; నిది యథార్థ మైనఁ
దగ్గదేమి నీదునిగ్గు నీజగ్గు నీ, మిసిమి నీదుక్రైతపసయు బిసయు 4

క. నాకర్థమయ్యెలే కథ, నీ కున్న జితేంద్రియత్వనియతి వినా వే
తే కారణమ్ము కలదా, యీకాంతికి నీమనీష కీచక్కనకున్ 5

మం. ఓతెల్గురాజ! ఓహో! కవిరాజ!, వరణీయ మహనీయ వైదుషీ తేజ
రిత్తమాటలు వెల్వరింప నేఁ జాల, నుత్తమాటలమీఁది యుత్సాహ మేల
మనము పుట్టినవేళ మంచి దోరాజ!, మనము నేర్చినవిద్య మంచి దోరాజ!
మనబాట నన్నయ మలచినబాట, మనబాట తిక్కన మరగినబాట
మనబాట చిన్నయ్యమది కెక్కు బాట, మనబాట యుగయుగాల్ మాఱనిబాట
యీబాటనే క్రైత సృష్టింపుమయ్య!, రాబాటనే కవీంద్రా! సాగుమయ్య!
తెలుఁగువాణికి నీవు తీర్చినకృతులు!, జిలుఁగువెల్గులు చిందు చిన్నారినగలు
అర్చింపు? మర్చింపు! మాంధ్రి నప్పటియు, జీవింపు! జీవింపు! చిరసుఖోన్నతిని
జయ! వాఙ్మయతపస్వి! జయ! తెల్గురాజ!, జయ 'నలందా' దత్తసాహితీపూజ! 6

22-1-59

## పరాకు!

ఆ. కవులు లేనినాఁడు గ్రంథములేదు గ్రం, థాలయమ్ము లేదు మేలిమేలి
తలఁపు లేదు ధన్యతాకారణం బగు, వలపు లేదు నరునిగెలుపు లేదు 1

ఆ. కవులకంటె నేఁడు కవు లెక్కుడై పుట్టి, రానికృతులు ముట్టరాని కృతులు
వ్రాయుచుంటఁ జూచి వాగ్దేవి ఖిన్నయై, వెచ్చనూర్చు నశ్రువితతి రాల్చు 2

ఆ. ఓనమాలు రాని మానితాచారంపు, టానవాలులేని యప్రశస్తు
లెగసి జాతినీతి కెగ్గొనరించు పొ, త్తములు నేఁడు వ్రాసెదరు పరాకు! 3

ఆ. ఉల్లమునకు వెల్గు నొదఁగూర్చి సూనృత, ప్రీతి లోకసేవ ప్రేమ కరుణ
గఱపురచనఁ జదువ మరగుఁడు ప్రజలు! కో, విదులు గందు! మీకు నొదవు జయము!

10-2-64



# మొగమాట

తెనుఁగువినోబా వెంపటి సూర్యనారాయణగారు తమ వెలువరించు సర్వోదయ పత్రిక సామ్యయోగమునకుఁ దగినరచన నొక దానిని బంపుఁ డని నన్నుఁ గోరఁగా ఒకనాఁటి నాయనుభూతిని 'అమృతధార' అనుపేర (23-4-1967) నక్షరరూపమునఁ దీర్చి పంపితిని. ఈ రచన చదివిన సహృదయులు కొందఱు మీ రిట్టికథలు మరికొన్నింటిని సంతరించి మమ్మలరింపుఁ డని నాకు లేఖలు వ్రాసిరి వీరియామోదము నా కెనలేని భావోద్దీపనము నావహించుడు నపుడపుడు నాజీవితఘట్టములను ఛందస్సునకుఁ దెచ్చితిని. సామ్యయోగము, భారతి, స్రవంతి, గ్రంధాలయ సర్వస్వము, తెల్గువిద్యార్థి మున్నగు పత్రికలవారు వీని నావిష్కరించి నాకృతజ్ఞతకుం బాత్రులైరి. ఈకథలే నేఁడు 'నాకథలు'గా నొకయాకృతి నందినవి.

సర్వాంగీణమగు ఆత్మకథగా నే నీకావ్యమును నిర్మింపలేదు. డెబ్బదిరెండేండ్లమనుగడలో నే నాదరించి యనుభవించిన జీవనవిధానము నవలోకించుచు సత్యారాధకుఁడనుగా వినీతుఁ డనుగా దీనిని గూర్చితిని. ఇందుఁ జదువరులపురోగతికి నించుక దారిబత్తెము లభించునేని నా కృషి పంటకువచ్చినట్లు భావింతును

ఈకథలు వ్రాయుటయం దొక ఆనుపూర్వి లేకున్నను ముద్రణమున దానిని పాటించితిని, కాన 1971లో రచియించినది మొదటికథ కాఁగా 1967లో వ్రాసినది రెండవ కథగా నేర్పడినది. ఇట్లే తక్కినవియు.

నా తీరుతెన్నుల నెఱుఁగందలంచువారు నాకృతితోపాటు "ధర్మజ్యోతి" "నేను"అను నా రచనలను సైతము పరిశీలించుట సముచిత మని విన్నవింతును

సువిశాలమగు కార్యక్షేత్రమునఁ గుదురుకొని విశ్రాంతిలేనివారయ్యు నా కోరికను మన్నించి యీ కావ్యమునకు ఉదాత్తము రమణీయమునగు సమీక్ష కావించిన వైదుషీనిధులు నమ్రతామూర్తులు ఆంధ్రవిశ్వకళా పరిషదాంధ్రాచార్యులు డాక్టరు తూమాటి దోణప్పగారికి నాకృత మెఱుక చాటి వారి ఋణము కొంతయే నీఁగుట యిట నా కనీయః కర్తవ్యము.

మఱియు ఆయా ప్రయోగముల సామంజస్యమును గూర్చి లేఖ వ్రాసినంతన విపులము ప్రామాణికము నగు ప్రత్యుత్తరము ననుగ్రహించిన పండితప్రకాండులు వ్యాఖ్యాతృ శిరో మణులు మహాకవులు వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారి సౌజన్యము మఱవఁజాలను

ఈ రచనమున వివరణము నపేక్షించు ప్రయోగములు కొన్ని కలవు. ప్రాజ్ఞులు చిత్తగింతురుగాక!

పేళ్ళన్ – దీనికి చిన్నయసూరిగారి 'కొన్ని లక్షణగ్రంధముల పేళ్ళుమాత్రము' 'గోళ్ళు పోయినవి' అను ప్రయోగము లాధారములు.

తెంపుఁజేసి – తెంపుచేత నని దీనియర్థము. తృతీయకు ద్వితీయ ప్రయుక్తము. " . . . . . ఏకవచనంబున నుకారంబుమీఁదిద్వితీయముఁ దృతీయావిభక్త్యర్థక మయ్యెడు నని తెలియవలయు, ఈయర్థమునకు 'ఇతరత్రచ ద్వితీయా' అను స్థాననియమశూన్యవిధియు

నవకాశమిచ్చుచున్నది ఉదా॥. .. తండ్రి పనుపుఁజేసి ముదిమి గొని జవ్వనం బిచ్చెఁ। బూరుఁ డనుసుతుండు భూరియశుఁడు" ఆదిపర్వము 3-65 (చూ. ప్రౌఢవ్యాకరణము - కారకపరిచ్ఛేదము, నాల్గవ సూత్రము)

కూడునకు(కూటికి) - "కదియుం గాష్ఠము కాష్ఠము నదిలో; మఱి కొంతసేపునకుఁ బాయును" అను తిక్కన గారి ప్రయోగ మిట చూడఁదగినది. (శాంతి 4-10)

కైగట్టు - 'వాఁడు నామీఁద కైగట్టినాఁడు' మొదలగు పల్కులు వాడుకలోఁ గలవు. కాన ధర్మియగు కవికిని ధర్మ మగు కవితకును ఇచట అభేదాధ్యవసాయము జరిగినది. అనుఁగు, వియ్యము మున్నగునుడుల కిట్టి అర్థపరిణామ మున్నది.

జిహ్వాదిపొగరు

లోభాదిరొంపి

ఇచట విశేష్యము లగు ఇంద్రియ, గుణశబ్దము లధ్యాహార్యములు. రాయలవారి 'విషయాదివలన నెమ్మన మాహరించి' శ్రీనాథుని "అనుదినంబును దేహయాత్ర కాయితమౌనె నీవారపాకాది పూవుఁబోఁడి వంటి ప్రయోగములఁబట్టి యీరూపములు సాధ్యములు.

వేంకటపురస్సుబ్బరావు - దేనికి వేంకటశబ్దము ముందుగల సుబ్బారావు శబ్ద వాచ్యుఁ డని యర్థము ఇచట "దేవపూర్వంగిరిం" అను కాళిదాస ప్రయోగమును "భృంగభంగిరివ రుద్రపరాక్ష శ్రేణి రశ్రయత రుద్రపరస్య" అను శ్రీహర్ష ప్రయోగ మును గమనింపఁ దగ్గవి. ఇంతేకాక "రాఘవ పురోనారాయణాఖ్యుడ" నను తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రులుగారి ప్రయోగముసైతము గుర్తింపఁదగినది.

కమ్మతీంద్ర - దీనిని 'కమ్మతీల' అని చదువవలయును

నూరుగా - దీనిని "నూర్లుగా" గ్రహింపఁదగును.

వెండియు ఈ కృతిలో "ఉండు" ధాతువునకు క్త్వవదర్థమున "ఉన్న" అను రూపము నాద రించితిని. బాలవ్యాకరణమును బట్టి "ఉండిన" అను రూపమే యిచ్చట సాధ్యము. కాని సూరిగారు నీతిచంద్రికలో "నిన్న యున్నవాఁడు నేఁడు లేఁడు" అని ప్రయోగించిరి. లాక్షణికుల లక్ష్యము సైతము లక్షణమువంటిద.

మఱియు "వలయు"న కాదేశ మగు "వలె" ఇందు పలుతావులఁ గలదు. దీని కీ మహాకవి ప్రయోగములు శరణ్యములు.

"నీపరోక్షంబున రాజు గావలె" (నన్నయ)

" ..శ్రీ గావలె నంచు....." (తిక్కన)

"చెప్పవలె నాప్తమంత్రులు" (నాచనసోమన)

నా ప్రమాదమునంజేసి యీరచనలో నిరాధారప్రయోగము లేవేని యున్నచో సుధీమణులు నా కెఱిఁగించి సాయపడుదురుగాక!

తెనుఁగులెంక

**తుమ్మల సీతారామమూర్తి**

# సమీక్ష

సదాచారచారుతామహితు లయిన ధర్మోపాసకులయింటఁ బుట్టువందిన సీతారామమూర్తి గారు దేశికవితానిర్దేశకులును, హరిహరాత్మకరూప ధర్మాద్వైతతత్త్వోపదేశకులను నయిన కవిబ్రహ్మ తిక్కన దివ్యాంశను పుణికిపుచ్చికొనిన ధన్యజీవులు

ఎరవాడయోగిఅడుగుజాడలకు 'ముందస్తు'గా చలువపందిరులమజిలీనుమడుఁగులను పఱచి కదురుకవ్వములసవ్వడులతో ఎదురుకోలుముస్తీదులు దిద్దిన తెలుఁగుతల్లి నోముల పంటగా, కల్ల కసటు లేని పల్లెపట్టుల నాఁగలిని నమ్మిన పరార్థప్రాపకులను సర్వోదయాసక్త చిత్తులును నగు తుమ్మల చెంచమ నారయల కడుపుపంటగా జననమందిన సీతారామమూర్తి గారు గాంధీతత్త్వ ప్రచారకులుగా సర్వోదయసిద్ధాంతభాష్యకారులుగా మూర్తినందుట అతి సహజమయిన సంఘటనము. పరవిపత్ప్రతీకారతత్పరమతులగు తాతముత్తాతల కీర్తిప్రతిష్ఠల నయాచితముగా నితరులు కొనియాడఁగా వినునదృష్టము, నానందము నందఱ కబ్బునవి కావు. అట్లయ్యును, తన తాతలు ముత్తాతలు ఘనులని పైకొనక వారి గౌరవమందన్ మన సంస్కృతి నిల్పునిమిత్తము సతతము జతనము సలుపు నియమనిష్ఠలు వీరియం దంతర్నిహిత ములు ఏతాదృశతాత్పర్యముతో తుమ్మలవారు తాము బ్రిదికినబ్రదుకుతీ రించుక వెల యింపఁగ ప్రకృతరచనమునకుఁ గడంగుట ఆంధ్రావళికిఁ బ్రమోదకారణము

సమధర్మము సహజధర్మముగాఁ గల సామాజిక చైతన్యమునకు దోహదముసేసి తెలుఁగు మాగాణమున నుత్తమాభిరుచులను పెంపొందించిన ఉదాత్తరచనములను బెక్కింటిని శౌచశ్రీచిక్కణముగా రచించి తెనుఁగుతల్లిని గైసేసిన నవయుగకవితావైతాళికులలో తుమ్మలవా రగ్రసరులు. 'తిక్కనపుట్టుగడ్డగ నుతింగను గుంటూరిసీమ నియ్యడన్ లెక్కకు నెందఱో కవులు లేచిరి గాని రవీందుతారకల్ మిక్కిలుదాఁక నిల్వఁగల మేలిమి నల్గురకే లభించె. .' ఈ నల్గురలో తుమ్మలవారు వీను మిగిలినవారనుట అత్యుక్తికాదు. తాము లోకవృత్త మెఱింగి లోకముతోపాటు పరువెత్తద మనియు, ఈ పరుగులో ఒకనాఁడును బోర్లఁబడ మనియు, ముందువెనుకలు చూచి మంచిచెడ్డలు యోజించి లోకప్రగతికే ముడుపుగట్టిన కవితను సృష్టించితి మనియు అనేకధా స్ఫుటీకరించినవారు తుమ్మలవారు. వీరితత్త్వమునందలి వైవిధ్యము నొకసారి పరిశీలించుట యుక్తము.

భారతీసేవతో పాటు భారతదేశసేవ యొనర్చిన వీరి సాధుకవిత్వసృష్టికి నేపథ్యమును సవదరించిన ప్రత్యక్షశక్తులు ప్రధానముగా మూఁ డని విశ్లేషింపవచ్చు. పారలౌకికము మీఁది పరమార్థదృష్టితో పరమలౌకికమునెడ ననాస్థబుద్ధిని అలవరిచికొనిన యుదాసీన వైఖరి వలన నిమ్మకునీరెత్తినటులు నిమ్మళముగాఁ గన్పట్టు పల్లెటూరివాతావరణమునఁ బుట్టి పెరిఁగి, ఒకవంక కులగోత్రాదికముల కట్టుపాటులను కట్టుదిట్టముసేసికొనుచు, వేఱొక వంక సాంఘికసామరస్యముమీఁదను సంపన్నుల ధర్మకర్తృత్వము మీఁదను సంపూర్ణ విశ్వాసమును పెంచికొనిన ఆదర్శవాదముల అమాయికతమూలమున కులమతవర్ణభేదముల

నంతగాఁ దడవక అందఱును వావివరుసలు కల్పించికొని మనసిచ్చి మసలెడి జానపదుల నడుమ తిరిగి, భూమియే ప్రధానవస్తూత్పత్తిసాధనముగాఁ బ్రవర్తిల్లిన పాఁడిపంట పల్లెసిరి బ్రదుకుల తీరుతీయముల మరగి, దాని కనురూపముగా దిద్దికొనిన తుమ్మలవారిజీవనవిధాన మీ శక్తులలో మొట్టమొదటిది.

ఆనాఁడు జాతీయతకు దేశభక్తికిని పవిత్రాంకములుగా భాసించిన ఆంధ్రోద్యమము, ఖాదీప్రాముఖ్యము, గ్రామవ్యవస్థాపునర్వికాసము, విదేశవస్తుబహిష్కరణము, సాంఘిక సంస్కరణము, స్వస్థాన వేషభాషాప్రియత్వము, హరిజనోద్ధరణము, హిందీభాషా ప్రచారము వంటి ఉజ్జీవనోద్యమములు అంతర్భాగములుగా ప్రవర్తితమయిన భారతజాతీయ స్వాతంత్ర్య సమరమున కంకితమయిన క్రియాశీలకసభ్యులుగా వీరికిఁ గల సన్నిహిత సంబంధము రెండవ ఉద్బోధకశక్తి. ఈ ఉద్యమ లక్ష్యములను అవగహన మొనర్చికొనిన విధానమును, వానిని సాధించుటలో స్వీకరించిన ప్రధాన సాధనములును, ఈ రెండింటిని సమరసముగా సమన్వయించిన తీరును పరిశీలనార్హములు

కావూరి శ్రీరాములుగారి పల్లెకూటసిరిచుక్కల చిన్ననాఁటినుండి ఈనాఁటివఱకు వీరు జిజ్ఞాసతో చదివిన చదువు, జిగీషతో గడించిన పాండితి విశిష్టదీక్షతో, కఠోరనియమములతోఁ గూడినవి. అందును తప్తచక్రాంకనాలవంటి చిట్టిగూడూరిముద్ర అల్పియమయినది కాదే; అది చెఱుగని చిన్నయసూరి ముద్ర, అపరచిన్నయసూరి దువ్వూరివారి చిన్మయముద్ర. ఇట్టి యాచార్యకమున నిరంతర పరిశ్రమముచే, నిశితశాస్త్రపరిశీలనముచే – సర్వమును వశీకార మొనర్చుకొనిన వీరి గురుకుల క్లిష్టబుద్ధిని, 'నేర్చినది నన్నయాదులు తీర్చిన మార్గమ్మునకు విధేయంబగుతన్' అనుచూపుతో దివ్యబోధాఢ్యమయిన వీరి మనఃప్రవృత్తిని సమాహరించి మూఁడవుశక్తిగాఁ బేర్కొనవచ్చు. ఇవిమూఁడును ఉత్తరోత్తరము బలీయములయిన సంస్కార విశేషములు. 'శాస్త్రతోగురుతశ్చైవ త్రిసిద్ధయః' అని ప్రామాణికోక్తి వ్యక్తివికాసమున కివి ప్రాణములవంటివి ఇంకను 'మూఢవిశ్వాసములు ముచ్చుముడుఁగుపొంటె గాసిలిన కందుకూరి', త్రిపురనేని రామస్వామిచౌదరుల హేతుబద్ధమయిన సంస్కరణవాదము, రాజకీయ సమరాంకిత జీవనులయిన రంగా మున్నగు నాయకోత్తముల సావాసము వీరి సాహిత్యవ్యక్తికి మూలమయిన సాధనసంపత్తిమీఁదను, ఆలోచనాసరళి మీఁదను నెనలేని ప్రభావమును నెఱపినవి. వెరసి సంప్రదాయముమీఁద భక్తి, ఆధునికతమీఁద ననురక్తి తుమ్మలవారి తత్త్వముయొక్క స్థూలమయిన సమాహారస్వరూపము

విద్యాబోధకులుగా, ఉత్తమసాహితీ సమారాధకులుగా, సత్య సంశోధకులుగా, సర్వోదయ తత్త్వసాధకులుగా వీరుపూనిన దృఢవ్రతము, సాధనసేసిన కఠోరాభ్యాసము పూర్వోక్తశక్తుల రాశీభూతతత్త్వము 'నేల విడిచి సామునెఱపినయట్లుండు సంఘగతికి దవ్వుసాగి వ్రాఁత.. యుగ లక్షణము గుబాళింపవలయుఁ గావ్యలేఖనమున' అని వివరించుటవలనను, మనువు మాట కాక మన మాటయే మన సమాజమునకు మప్పిన మనుగడయని మనసార నమ్మి ప్రవచించుటచేతను. వర్ణాశ్రమధర్మవ్యవస్థను నిరసించుట, కులాంతర వర్ణాంతర వివాహము

లను, వితంతువివాహములను బ్రోత్సహించుట మున్నగు సాంఘికసంస్కరణముల యెడల నభ్యుదయదృక్పథము గలిగి యుండుట మూలముననను ఆధునికతపై వీరికిఁగల అనురాగము స్పష్టము. పురాతనమహాకవుల రచనల ననేకపర్యాయములు పఠించి, మనసుసేసి వాని గుణములను సహస్రగుణముగా పుక్కిలించు ప్రాచీనలక్షణబద్ధమయిన భాషాసరణి వీరి కుగ్గుఁ బాలతో నలవడినవిద్య. అటనట కొంతకొంత సడలింపున కొప్పుకొనినను మొత్తముమీఁద భాషానియమములవిషయమున తుమ్మలవారు ప్రాచీనవాదులు

**కావ్య బహీరూపము :** బ్రదుకుపట్లను బాసపట్లను తాము పూనిన కఠిన నియమములను బ్రకటించు నిమిత్తము హవణించిన వీరి కృత్యంతరము 'నేను' అనునది ఒకరకముగా ప్రకృతకృతి 'నాకథలు'కు పరిపూరకము. 'నేను', 'నాకథలు' అనుటలో కర్తృగతమగు నహం కారము ప్రతీయమానమగుటలేదా యని లఘుచేతసులయాక్షేపము రావచ్చు 'నాహంకారా త్పరోరిపుః' అను మపనిషద్వాణిని కాదనము. కాని, ఇట నేననుట, నాదనుట పారమార్థిక దృష్టికాదు; వ్యావహారికదృష్టి 'కర్తబహిరకర్తాంతర్లోకే విహర శుద్ధదీః' అను మహోపనిష ద్వాక్యముచొప్పున సాధారణ మయిన బోధసౌకర్యము కొఱకీవ్యవహారము. కావున దోషైక దృక్కులగు నాక్షేపకుల యిష్టసిద్ధి కీ నామనిర్దేశము దోహదము కాఁజాలదు.

దెబ్బదియవుపడిలోఁబడిన తుమ్మలవారు 1967-72 సంవత్సరముల నడుమ ననఁగా దాదాపయిదేండ్లవ్యవధిలో అప్పుడప్పుడు తమజీవితము నందలి కతిపయఘట్టములను మాత్రము స్వీకరించి, ఒక్కొక్క ఘట్టము నొక్కొక్కఖండికగాఁ గవితారూపమున మలఁచిన యేఁబదియైదు శీర్షికల క్రిందఁ దీర్పఁబడిన సుమారు వేయినూటపదాఱుపద్యము లీ యుత్తమకృతికి బహిరాకృతి నిచ్చినవి. చిననాఁటి బ్రదుకు సొగసులను, పొలముపనుల నాఁటి పోకడలు, ఒజ్జనమునాఁటి మనుగడతీరులను, కయితలల్లి కనకస్నానములు సేసిన నాఁటి గాథలను సంపూర్ణ పూరుషాయుషజీవిగా తుమ్మలవారు సాధించిన జీవితపరమార్థము లను జిత్రించు రేఖామాత్రమయిన స్వీయచరిత్ర మిది. పరులమాట యెటులున్నను వంశస్మృతి వలననైన నరు లనవద్యచరితులు కాఁగలరని వీరియాశంసనము

'విద్యానవద్యో వినయావనమ్రః' అన్న సూక్తికి తుమ్మల సీతారామమూర్తిగా రక్షరముల సరితూఁగువారు. 'ఎందఱో సజ్జనులు బుధులింతయంత నేర్పులెక్కకు వచ్చితినేను నేఁటి, కైన నేమాయె నెటిఁగిన దణువుపాటి యెఱుఁగనిది మిహికామహీధరముపాటి" అని మేరువు వంటి మహావ్యక్తి తనక్రింది యంతరువునకు దిగివచ్చి, "నాయజ్ఞతహేతువుగా నీయపశబ్దంబు వొడమె నిట్టిదొసగు లెన్నోయుండవచ్చు మత్కృతి... " (186) అని తమ తప్పు నొప్పుకొనఁ జాలిన సత్యనిష్ఠ యెందఱకున్నది?. "మంచిపాకమ్మున కమ్మని దేశిరీతులఁ బల్కు నేర్చిన సుకవిరాజులకు" జయవెట్టి, "అంటుసొంటులేని యందాలు కొఱవోని మాటనేర్చి మాట కోటువడని బ్రదుకు నోర్చి కృతులు పల్కిన యానాఁటి నేఁటి కవులకెల్ల నేటికోళ్ళు" ఎత్తఁ గలిగిన సౌశీల్యమెందఱకున్నది? "ఎఱుఁగనిది బ్రదికినన్నా ళ్ళెఱుఁగఁగ వలయు" ననియు, "తెలియని దెంతోకలదని వలఁతులకడ మస్తకంబు వంచెద. .." ననియు, "మున్ను నడిసన్న

పెద్దలు నన్నులంతిగఁజూడఁగినిసినాఁడను; నేఁడో పిన్నలు నీచదురేమనియనినను మునినై యొనర్తు నాత్మపరీక్షన్" అన్న వీరి పలుకులు వినయమునకుఁ దలపాలము. "మంచిలగ్న మరసి కించిద్జ్ఞుఁడు జగాబిరుదుదాల్చి కులుకుటకుఁ బిదపగడియ లావరించిన నేఁడు" కవితాతపఃఉన్మిషితమతు లెందఱోమహానుభావులు కొలువుతీఱిన పేరోలగములో సహృదయ చక్రవర్తి కట్టమంచి వంటి మనీషిసత్తముని చేతి మీఁదుగా వచ్చిన "అభినవతిక్కన" బిరుదమునకుఁ దాను దగ ననియు, తాను వట్టి "తెనుఁగులెంక" ననియు, "తిక్కనమార్గదేశి శిల్పముల జగాపెక్కువ నా కబ్బినదా?" యని ప్రశ్నించుకొనుపద్ధతి వీరి వివేకమునకు పరాకాష్ఠ.

పేరున కిది తుమ్మలవారి స్వీయచరితము. కాని, తుమ్మలవారికి సమకాలికులగు తెనుఁగుజనుల అచ్చుపుచరితమును ప్రదర్శించు కావ్యదర్పణము కూడ. కొన్ని ఘట్టముల తుమ్మలవారి కొలముసాముల చరిత్రమును రేఖామాత్రముగఁ జిత్రితమయినది ఈ రూపముగా జాతిఋణమును పితౄణమును తీర్చికొనుటకు హేతువయిన తుమ్మలవారి యీకావ్యసృష్టి ఆంధ్రసృష్టిలో ఒకమైలురాయి. "విత్తదాహమెగసి చెత్తచెదారము పూఁట కొక్కబండి ప్రోవుసేయు" దుష్కవులవలన సాహితికి వాపుగాక బలుపుపొలుపు లేదని తుమ్మల వారి యభిభాషణము "చేయలంతియైనఁ రామాయణములు" తొంబది భారతములు కావడి మోఁతలుగా గూర్పవచ్చు కాని లక్ష్యశుద్ధితోపాటు పవిత్రమయిన సాధనమును సంమిళితముసేసిన జీవన విధానముగల యీకవికులవృద్ధుని కవిత జాతికి తఱుగనిసిరి.

**కృషీవల జీవనము :** నాఁటికి నేఁటికి మనకవులుచాలామంది యెత్తువారిచేతిబిడ్డలు; వీరికలాలు సిరిగలవారి కమ్ముడువోయిన వందిమాగధవర్గము. జనపదములనుగూర్చియు, జానపదులనుగూర్చియు సానుభూతితో రచించిన భాగము తెలుఁగు సాహిత్యములో చాలా తక్కువ. ప్రబంధాదుల నగరవర్ణన సందర్భమున ముసలియెద్దు నెక్కి తిరుగు దిసమొల వేలుపును, వట్టినాఁగలిని బట్టి తిరుగు దుక్కినాలుదాలుపును దిసంతులుగొట్టు కృషికు లాయూరఁ గలరను నొండు రెండు పద్యములతో సరిపెట్టుట అనూచానముగాఁ గన్పట్టు సంప్రదాయము. వాననాని, యెండనెండి, చలినులికి, "సేద్యపుంబాటున మున్గితేలు బలభద్రుల" "సాములకెల్ల బోసమిడి సాకెడి" దయాసముద్రుల గొడవఁ దడవిన ఆధునికు లగు సుకవులుసయితము వ్రేళ్ళమీఁదికి చాలరు పింగళి కాటూరులు, దువ్వూరి రామిరెడ్డి, తుమ్మల సీతారామమూర్తి, గుఱ్ఱము జాషువా, ఏటుకూరి వేంకటనరసయ్య, కొండవీటి వేంకటకవి మున్నగు కవిరాజులు కృషీవలజీవనము నభిమానించి తమసాహితీప్రభలో స్థాన మిచ్చినవారు. అయిన నొకమాట. ఈ వ్రాసినవారిలో తుమ్మల, ఏటుకూరి, వేంకటకవి వంటివా రేకొందఱో తక్క తక్కినవారు కర్షకజనపక్షపాతులేగాని స్వయముగా కాఁడిపట్టిన కర్షకులు కారు. కర్షకకుటుంబములఁ బుట్టినను కారణాంతరములచే కృషీవలజీవనము నవలంబించినవారు కారు.

తుమ్మలవారు మడికొకపూఁటగా, బడికొకపూఁటగా నరిగి, ఉభయక్షేత్రములలోని యాను

పానులను, సేద్యపు లగుబిగువులను, సాహిత్యపు గుట్టుమట్టులను ఊంచముట్టుగా నెఱిఁగిన సవ్యసాచి. "కృషితో నాస్తి దుర్భిక్షమ్" ఐడిలోఁగాని మడిలోఁగాని వీరికి శ్రీరానిపూఁట యేనాఁడును లేదు. తామార్జించినది పదిమంది పాత్రులకుఁబంచి, ఆర్జవాదిసుగుణములను పెంచి సైయనిపించికొనినవారు తరతరములుగా ఆదర్శహాలికులుగాఁ బేర్వడసిన కుటుంబమున జన్మించిన యీరైతుబిడ్డ ఆకుమళ్ళలో నడ్డపచ్చ క్రమ్మిననాళ్ళలో గొడ్లనుగాచినాఁడు; ఎండప్రొద్దుల నీటిపట్టుల గొడ్డుగోదల యొడలుగడిగినాఁడు తోడి యాలకాపరులతోఁ గూడి కోఁతికొమ్మచ్చులాడి, గోంగూరపచ్చడితో కుండెఁడుకూడు మెక్కినాఁడు. చెట్టుచాటుననో, గట్టుమీఁద తాటాకుగొడుగు మాటుననో బాసికపట్టువేసి వట్టికళ్ళుపెత్తనముసేసినవాఁడు కాక, అఱుగాలమును కూలిజనముతో పాటు నడుముగట్టి మునుమువట్టి సేద్యపుపనులను సుతారముగా సుదారించిన మొనగాఁడుగా నిలిచి నక్కదోసబజ్జితో ముద్దతిని, తెట్టలుతెటలై మిసిమిదేలిన మజ్జిగబువ్వ దోసిటంబట్టి జుఱ్ఱి గఱ్ఱుమని త్రేన్చిన అసలయిన హాలికుఁడు. కొంద్రవేసినను, కోతేరుమోసినను పదిమంది రైతులు 'భళిరా' యని ప్రశంసింపవలసినదే! దుక్కిదున్నుట, దమ్ముసేయుట, త్రాళ్ళు తలుగులు పేనుట, బండిదోలుట, బంతిత్రిప్పుట, పడుగునూర్చుట, పిడికట్టగొట్టుట పురులు గట్టుట, పండించినది పదిమందికి పంచిపెట్టుట – అదేమి యిదేమి రైతుజనుల సబ్బండుపనులలో ఈయన అందెవేసినచేయి.

తుమ్మలవారు స్వయముగా "ముప్పదేండ్లు సేద్యమున మున్గితేలిన" సన్నకారుకృషికులగుటవలనను, సహజముగా గ్రామజీవనముమీఁద గాఢానురక్తి గలవా రగుటవలనను, గ్రామసౌభాగ్యము నాసించిన గాంధిమహాత్ము నాస్థానకవి యగుటవలనను వీరిలోఁ గానవచ్చినంత జానపదజీవనముద్ర ఏటుకూరిసృష్టిలో తప్ప ఇతరత్ర కానరాదు. వీరి పఱిగపంట, ధర్మజ్యోతి, పెద్దకాఁపు, పైరపంట, శబల – మున్నగు కృతులలోని కృషీవలజీవనసంబంధి ప్రశంసలు హాలికులు పురాపుణ్యములు పూచి కాచినఫలములు. వానిలో సంక్రాంతి, జడికారు, వరినాటు, సంక్రాంతితలఁపులు, సంక్రాంతిముచ్చటలు, మున్నగు కావ్యఖండములు మఱింత మనోహరములయిన అపూర్వకళాఖండములు. ప్రకృతకృతియందలి అన్నతఫలము, జాలి, నారయ్యదివ్వె, పొలముబువ్వ – మొదలగునవి కృషీవలజీవన చిత్రణమునకుఁ దలపాలములు, బుక్కులమీఁది బుక్కులు. "పొలముపండినఁజాలదు, బుద్ధికూడ పండవలయు" ననునది రైతుల కీయన యొసఁగెడి సందేశము, విద్వత్కవిగా వీను మిగిలినను, ఆదర్శాధ్యాపకుడుఁగా వాసికెక్కినను, తుమ్మలవారు నేఁటికిని హాలికజీవనేచ్ఛ దిగఁద్రావని అచ్చపురైతులు.

## శిల్పసౌందర్యము

**1. ఛందోరీతులు :** 'నాకథలు'లో అక్కరలు, ఆటవెలఁది, కందము, తేటగీతి, మంజరీద్విపద, సీసము మున్నగు దేశీయచ్ఛందములే నూటికి తొంబదితొమ్మిదివంతులు ప్రయుక్తములయినవి. మధురాక్కర యొక్కటి, మధ్యాక్కరలు నలుఁబదింటికి పైఁగా వాడఁబడినవి. మిక్కిలి అరుదుగా ఉత్పలమాల చోటుచేసికొనినది. దేశీయమైన వీరి మేలి నడవడిని తేటతెల్లముసేయు మేటిరచన మిది గావున దేశీయచ్ఛందములే యుపయుక్తములగుట ప్రకరణోచితమయిన ఛందశ్శిల్ప

రహస్యము. మధ్యాక్కరలో నన్నయ మార్గము ననుసరించి అయిదవ గణము ఆద్యక్షరమున యతిస్థానము పాటింపఁబడినది. తగినశయ్య నొయ్యారములుగులుకు నాటవెలఁది తుమ్మల వారి కలమునఁ గ్రొత్తయందములు సంతరించికొనినది. వెనుకటికి ఆటవెలఁదిపై చేయివేసి మెప్పించినవాఁడు వేమనయొక్కఁడే యని వేత్తలు చెప్పుదురు.

ఛందస్సు నవ్వులు చాలామందికి గుదిబండ. ఈ బందోబస్తు లెందుల కని వారి నింద. కాని, వీరికిమాత్ర మిది నల్లేరుపై బండినడక. 'యతియుఁ బ్రాసంబు నెట్లమరు నటంచుఁ దలగోఁకికొనఁడు సీతారామమూర్తి' వీరి యీ గురుపద్యవిద్యకు తిక్కన గురుస్థానము. తిక్కన కూర్పు నేర్పు తుమ్మలవారి తీర్పులో అడుగడుగునఁ గన్పట్టుచున్నది.

**2. కథాకథనము :** కావ్యశిల్పరహస్యములలో కథాకథనము సహితము ప్రముఖస్థాన మాక్రమించుచున్నది. కథాచ్ఛలమున భాషాజ్ఞానము, నీతికుశలత్వము, లోకజ్ఞత కలుగుట గౌణము, ఆయాకథాభాగములను వివృతముసేయు ఖండికలను ఎత్తుగడసేయుట, మెట్టు మెట్టుగా వానిని పరిపోషించుట, సొగసుగా ముక్తాయింపు సేయుట-యివి కథనము నందలి పరమ రహస్యములు. ఇట్టి ప్రత్యేకశిల్పదృష్టితో "నాకథలు"లోని కొన్ని కథలను దడవిచూతము

"హరిభక్తి" యను కావ్యఖండమున ఒక ముగ్ధభక్తుని అమాయకతను వర్ణించుచు ఏతత్కథా ఘట్టమున కాలంబమయిన వ్యక్తి యెవరో చెప్పక "ఆయన వయస్సు వింశతిహాయనముల మించ, దాతఁడు చదివినమేటి కాఁడు'అని మొదలిడి చిట్టచివర 'అహో! మత్పిత యతఁడు' ఆయన మానాన్నగారండి! అను ధోరణితో ముక్తాయింపుసేయుటలోని సొగసు ఇతరకవి వ్యావృత్తమయినది.

"ఏఁబదేండ్లనాఁటి దీకథ .. 'అని పాఠకుల కాసక్తిరేకెత్తునట్లు ఎత్తుకొన్నాఁడు జ్ఞానస్నానకథా భాగమును కవి. ఖండిక వ్రాయఁబడిన కాలము 2-7-67. నాఁటి కేఁబదేం డ్లనఁగా దరిదాపుగా 1917 నాఁటి మాట. కవిగారే కాక దేశము కూడా గాంధియూరుపేరుల నెఱుఁగని కాలము. కందుకూరి వీరేశలింగముపంతులుగారి సంఘసంస్కరణోద్యమము ఉవ్వెత్తుగా సాగుచుండిన కాలము. కవిగారికి అనాఁటికి పట్టుమని పదునాలేండ్లు లేవు. ఆ రోజులలో నాయన యొకహరిజన దంపతులయింటఁ గడుపార నారగించినయంశ మీ ఘట్టమునందలి కథ. హరిజనులయింట సొపడి-

> **"ఇంటికిఁ జని కులభూతము**
> **గెంటితి నని యేను దండ్రికిం గథ చెప్పన్**
> **వింటివికదర! శబరి ముని**

పంటఁ గొఱికియిడినపండ్లు ప్రభుఁ డాను టనెన్" ఇట్లు ముక్త సరిగా తండ్రి యిచ్చిన యీ జవాబు సర్వదర్శనసారసంగ్రహము. ఈఘట్టము నందలి తండ్రికొడుకు లిద్దఱు నిద్దఱే. అలఁతియలఁతి పలుకుల ననల్పార్థమును పొదిగిన యీముక్తాయింపు మనోహరశిల్ప సహితము.

ఇట్లే "కల నిజమైనది" అను ఖండమును బరికింపుఁడు. ఊరుపేరులు తొలుత వివరింపక "అతఁడు గానవిద్య నందెవైచినచేయి యతఁడు నేర్చె నాలుగైదుబాస లతఁడు కవిత పల్కు నందాలుకుల్కఁగా.. " ఇత్యాదిగా నాలుగైదు పద్యములలో కధాగతపాత్రము గుణగణములలో మొదలుపెట్టి పాఠకుల కమితమయిన కుతూహలమును గలిగించుట మఱియొక నెఱతనము. పొరుగూరిలోఁ గల యొకయాప్తమిత్రుని దినదినమును గలసికొని ఎవెవో సాహితీచర్చలు సలిపినను వీరికిఁ దనివిసనదు. అది యొక "రసపిచ్చి" రోజునదేపనిగా పయనముల మీఁదఁ బయనములు సాగినచో ఎంత తలలోనాలుకగా మెలఁగు సాధుస్వభావ మయినను ఇల్లాలు మగని నిదేమని యడుగక మిన్నకుండునా? ఒకనాఁడు నిలఁదీసి అట్లే అడిగినదాయమ్మ ఏదో సాకుచూపి చెలికానిఁ జూడఁ బోకతీఱదు. కవితలు కాఁకరకాయ లన్నచో కట్టుకొన్నది పదేపదే ఒప్పుకొనదు అరనిముస మట్లే నిలువులుపడిన ట్లుండి, నీళ్ళునమలి కొంతసర్దుకొని తటాలున నేదో నెప్పునకు రాఁగా మిత్రునిముద్దులపట్టి పుట్టినరో జని బొంకి, నెపమిడి పలికినందుల కొకింత గొంకి, ఆలిచే "సరే" యనిపించికొని, బ్రదుకుజీవుఁడా యని బయటఁ బడి, ఆదరబాదర బాపట్ల కరిగి మిత్రునియింట నడుగునిలిపినాఁడు అహో! అద్భుతము. వాస్తవముగా మిత్రునికుమారుని జన్మదినమది "రా దనృతంబు మీనోట ననిరి" ఆయాలు మగలు సత్కవివాక్యము రిత్తవోవునే?

"నానాఁగలి నాకు లేదా?" యను కావ్యఖండికలోని ఉపక్రమణోపబృంహణోప సంహార ణములు నిట్లే పరమరమణీయములుగాఁ దీర్పఁబడినవి. జాతీయోద్యమవ్యతిరేకపక్ష నాయకుఁడగు బొబ్బిలి మునిసామి నాయఁడుగారు చెన్నపురిరాష్ట్ర మంత్రిశేఖరుఁడుగా రాజ్య చక్రము త్రిప్పుచుండినకాల మది. పాలకులను గాదని వాదించినచో ఊరిలో నుప్పుపుట్టని గడ్డురోజు లవి. జాగర్లమూఁడి కుప్పుస్వామిచౌదరిగారు ఆనాఁటి గుంటూరుజిల్లాబోర్డున కధ్యక్షులు. చౌదరిగారు తుమ్మలవారిని రారమ్మని పిలిచి బాపట్ల – ఉన్నతపాఠశాలలో పండితపద మిప్పించినవారు కప్పుస్వామిచౌదరిగారి కోరికమేరకు పాఠశాలను చూచుపని మీఁద బాపట్ల రానున్న మంత్రి మునిసామినాయఁడుగారిపై సమ్మానపద్యములను వ్రాయ గోరగా తుమ్మలవారు నిరాకరించిరి. కొలువుకాఁడు అధికారుల నెదిరించుట యుక్తము కాదని పాఠశాలాప్రధానాధ్యాపకుఁడు మందలింపఁగా రైతుబిడ్డఁ డగు తుమ్మల నవ్వి "భయ మేల నాకు లేదె నానాఁగలి" అని జవాబిచ్చుటలో నిర్భీకతమాట యటుండ అందలి పద సంయమము, భావసంయమము పోటీపడి నిలిచినవి. ఇట్టివిశిష్టదృష్టిని స్ఫుటీకరించు శిల్ప రహస్యము లీకృతిలో కొల్లలు

మఱియొక ఖండముమాట: "అమృతధార"లోని "కూడు కూరపెట్టు కొమ్మపాదమ్ములు చూతుఁ గాని మోముచూడ నంటి" అనుపద్య పాదములు –

"నాహం జానామి కేయూరే నాహం జానామి కుండలే నూపురేత్వభిజానామి నిత్యం పాదాభివందనాత్" అను లక్ష్మణుని శీలసంపద నభివ్యక్తముసేయు వాల్మీకమునందలి శ్లోక మీసందర్భమున స్మృతిపథమున మెదలక తప్పదు.

ఇ ట్లేఘట్టమును బట్టిచూచినను కధాకధనమునందలి ప్రశస్యములయిన సర్వ రహస్యము లును విస్ఫారము లగుచున్నవి "ప్రాంతక్రొత్తల మేలిరీతు లెఱింగి" సేసిన సాహితీ సృష్టికిశిల్ప విన్యాసము చక్కని నిదర్శనము.

**3. భాషావిషయము :** "ముగ్గురుసత్కవుల్ కరంగిపోసిన భారత కావ్యసృష్టిలో నిగ్గను ఘంటి కాగ్రమున నిల్పిన..." ఉత్తమకవి యని తుమ్మలవారిపలుకుముద్రనుగూర్చి నవయుగ కవిచక్రవర్తి జాషువా కైవారము. తెనుంగుదనమునర్థించియే "మఱుంగువడిన తెన్గుమాటల గాలించి కుస్తరించి కైతం గూర్తు నేను" అనియు "ఎంతదవ్వైన తెనుంగుంబల్కేని యగ్గలించి మనకైతలో రవళింపవచ్చు" ననియు తుమ్మలవారి సమర్థనము తెనుంగుబాసకు పరిపుష్టి కలిగింపవలయు నను వీరి సత్సంకల్పము ప్రశంసకు పాత్రమయినది. ప్రాంతవడ్డమాటలను పట్టుంబట్టి తమ కృతులలో ప్రయోగించుటనుబట్టి చూడ ప్రాంతను పునరుజ్జీవింపం జేయ వలయునను కుతూహలము వీరి కున్నట్లు స్పష్టము. ఇప్పుడుగాని మఱొకప్పుడుగాని తెలుం గున వాడుకలో నుండిన పదసామస్త్యము ప్రయోగార్హమని తుమ్మలవారిమతము. ఇది కొంద ఱకు "చాదస్తము"గాం బొడగట్టకతప్పదు.వ్యవహారయోగ్యత నశించిన పలుకుబడులను వెదకి వెదకి తెచ్చి వానిపుట్టుపూర్వోత్తరములను వివరించుట యుక్తమేకాని ఆధునిక రచనములలో వాని నదుకుటవలన స్ఫుటాభివ్యక్తికి భంగము వాటిల్లక తీఱదు అందువలననే కాంబోలు నిట్టిమాఱుమూలమాటలకుంగొన్నింటికి తుమ్మలవారు గ్రంధాంతమున లఘుటికను గూర్ప వలసి వచ్చినది. నన్నయ, తిక్కన, ఎఱ్ఱన మున్నగు నాచార్యకవులముద్ర వడని పల్కెన్నడుమెచ్చ నను వీరి ప్రతిజ్ఞ పూర్వపూర్వకవిప్రయోగము లన్న వీరికిఁగల ప్రమాణబుద్ధిని బ్రకటీకరించు నట్టిది.

సంస్కృతభాషాసంసర్గమువలన తెలుంగుభాష చాలవఱకు పరిపుష్టమయినను, తెలుం గును మ్రింగివేయునంత సంస్కృతముద్ర కూడదని తుమ్మలవారి యభిప్రాయము. "ఇది తెల్గని నూటికిం దొంబదిసంస్కృత పదము లునిచి పలికినకావ్యం బది బాసకుం జే టంటిని..." అని అతివేలమయిన సంస్కృతభాషావ్యామోహమును నిరసించిన దేశికవి ఈయన. కన్ను పోవునంతకాటుక పనికిరా దను సామ్యమున తుమ్మలవా రంతులేని సంస్కృతభాషా ముద్రను గూర్చి గర్హించినమాట ఉభయకవిత్వతత్త్వవిభవోజ్జ్వలులును మెచ్చినమాట. "సురభాష కెన్ని జన్మాలకునైనం దెన్గుపస" కలుగదని కంఠోక్తిగాం బల్కిన ఉభయభాషాప్రవీణులు వీరు. "మూలమే పార్యమనుమాట మొఱకుమాట" అని తెనుంగుతీపిని మెచ్చినకవి ఈయన. "రసికుండగువాండు తనదు జాఱుసిగలోనం దులసినే యిడుకొనునొ జాజులనెయిడువో" అను ప్రాక్తనోక్తి కనుప్రాసమయిన ప్రసంగ మిది. ఏభాషసొగసు లాభాషవి. ఒకదానిసొగసు మఱియొకదానికి రాదు.

వీరికి మాండలికపద సంగ్రహణము, తత్సముద్ధరణ ప్రీతికరములని "ఊరి కొక్కలెంక యుండి చదువురాని పజనోట వెడలంబడు నొయారినుడుల నెత్తి బాస కుడుగరసేంత సంభావనార్హమయిన సేవయంటి" అనుపద్యము మూలమున నూహింపనగును. తమ రచన

ములో కోవెల, జంపు, పెండ, మటికలు, మనువర్తి, మాగాణి మున్నగు మాండలిక పదములను గూడ ప్రయోగించిరి

తుమ్మలవారి యీరచనమున నుపయుక్తములయిన అన్యదేశ్యములను మాదిరికిఁ గొన్నింటిని అవధరింపుఁడు: ఆదాయము, ఈనాము, కచేరీ, కదరు, కర్చు, కలము, కాతా, కొరడా, ఖదరు, ఖర్చు, ఖాదీ, ఖిలాఫత్తు, గావంచా, చందా, చాఁగురే, జగా, జమ, జాబు, జిల్లా, జేబు, టోపి, తాలూకా, దరఖాస్తు, దుస్తు, నగదు, నాజూకు, నాదారు, నేబులు, పట్టీ, పంతులు, పాకీ, పావు, పావులా, పైస, బజఋ, బందా, బయానా, బలా, బస్తా, బాకి, బాకీ, బాపు, బాపూజీ, బాపురే, బాబూ, ముస్లిము, రాట్నము, రావు, రుసుము, రైతు, రోజు, రౌతు, లాటీ, వకీల్, వరహా, వరా, వారెవా, వీసె, శిస్తు, సర్కారు, సర్దారు, సాలు, సాల్వు, సాహు, సాహుకారు, సిపాయి, సెబాసు, సేలు, హద్దు, హంవీరులు, హిందీ, హిందువు మున్నగు ఉర్దూ, హిందీ, మరాటీ భాషాపదములును, ఇంగిలీసు, ఇంగ్లీషు, ఎకరము, ఎకరా, కలెక్టరు, కవరు, కాంగ్రెసు, కాఫీ, కారు, కాలేజి, కౌన్సిలు, టీ, పికెటింగు, పోలీసు, బస్సు, బోర్డు, రైలు, లాంతరు, లాయరు, వేలము, హిల్‌కాలనీ, హైస్కూలు మున్నగు పాశ్చాత్యభాషా పదములును ప్రకరణోచితముగా నూతనభావస్ఫోరకములుగా నుపయుక్తములు. ఏరాళము, తిరునాళ్ళు, సంజ, పల్లెకూటము, బాడిగ, మడఁక, సంబళము, సాపాటు, హొరంగు మున్నగు నితరద్రావిడభాషాపదములును ఆయాతావుల నేదోయొకప్రత్యేక ప్రయోజనదృష్టితో ప్రయోగింపఁబడినవి వీనివలన భాషకు పుష్టియే కాని నష్టి కానరాదు

సత్కావ్యనిర్మితికి సరసవచస్సంపదయే చాలదు ఔచితీసుందరమగు వచఃశ్రీదాంపత్యము ముఖ్యము భాషలో వాక్యము చాల ప్రధానమయినదని భాషావిజ్ఞానవేత్తలును పేర్కొందురు. అందువలననే

> **"వెదకి వెదకి తెల్గు నదికినంతన యది**
> **తెలుఁగుకాదు; దాన వెలుఁగు రాదు**
> **జాతి కారకమ్ము సంప్రదాయమ్మును**
> **దేశ్య మయిననాఁడె తెలుఁ గలర్చు"**

అని తుమ్మలవారు నీరహస్యమును విప్పిచెప్పుట వాక్యాంశము లయిన పదములు, పద బంధములు మార్పుల కగ్గమయినను వాక్యవిన్యాసము చాల వఱకు మాఱదు. సాధారణముగా వచన రచనమునందలి వాక్యములనే భాషా విజ్ఞానవేత్తలు తమపరిశీలనమున కాధాసామగ్రిగా స్వీకరించుట మామూలు ఏలయనిన, పద్యరచనలో వాక్యనిర్మాణమునందలి నిసర్గతత్త్వము తాఱుమాఱగు చుండుట క్రొత్తకాదు. కాని తెలుఁగుఁదన ముట్టిపడు విష్టవ్యవహారమునందలి భాషాఫక్కియే లక్షణమున కొదిగి తుమ్మలవారిరచనములో వించందముల నందగించుచు పద్యవాక్యప్రమాణజ్ఞుల పరీక్ష కాఁగఁజాలినదిగా వెలసినది

వీరికవితలో ఎంతతెలుఁగుదేసితనము వాసించినను వాక్యవిన్యాసము నందు అక్కడక్కడ సంస్కృతభాషాముద్ర గోచరింపక తప్పలేదు. వెన్నకు మెత్తన నేర్చితిన్ననిపలుకుల నడుమ

నయినను సంస్కృతభాషాపరమయిన వీరిదృఢవ్యుత్పత్తి వీరికనుగప్పి ప్రత్యక్షమగుచున్నది. ఆయనమట్టు కేమిచేయఁగలరు? "నన్నయాదులు త్రొక్కినతెన్ను వట్టికూర్చుండె నది తెన్గువాణి సరస" – ఇట్లు ఇలుద్రొక్కికొని వచ్చినవారికి స్వాగత మీక పొండని సాగనంపుటకు మొగమోట మడ్డు. తెలుఁగుపైఁబడిన సంస్కృత కారకముద్ర వీరి రచనమున బహుముఖముల విస్తరించి నది. విశేష్యవిశేషణములకు సమానలింగవిభక్త్యాదికనియమము గీర్వాణవాణీ పరిక్షుణ్ణ మార్గము. ఈమార్గము తెలుఁగువాక్యనిర్మాణరీతికి విపరీతరీతి. అయినను విశేషంబునకుం బోలె విశేషణంబునకు లింగవిభక్తి వచనంబు లగు" (బాలవ్యాకారక. 19) అని సూరి సూత్రించుట తెలుఁగువాక్యనిర్మాణములోని సంస్కృతప్రభావద్యోతకమగు నొకరీతిని సూచించు టకే కాని అట్టిది తెలుఁగునకు నిసర్గ మని ఆయన అంగీకరించినట్లు కాదు.

ఇట్లే సంస్కృతభాషా ప్రసిద్ధమయిన యత్తదర్థకప్రయోగము తెలుఁగునకు విజాతీయము. తెలుఁగుబాసవిశిష్టతను వెల్లడించుచు "బాస వేఱు పలుకుబడి వేఱు కారకరీతి వేఱు వాక్యసృష్టి వేఱు తీరుతెన్ను వేఱు" అని తుమ్మలవారు నిర్ద్వంద్వముగా నిరూపించుట నీయెడ విస్మరింపరాదు.

శాఖాచంద్రమోన్యాయముగా సాగిన నా యీసమీక్ష తుమ్మలవారి కమనీయకవితకు యోగ్యతాపత్రిక కాదు. సాహిత్యవిద్యార్థిగా నాదర్శించిన స్వరూపమున కిది అక్షరరూపా వతారము మాత్రమే. ఈరూపముగా వారి రచనములను మఱియొకతూఱి సమాలోకనము సేయు సదవకాశము కలిపించినందులకు తుమ్మలవారికి నా కృతజ్ఞతాభివందనములు.

ప్రమాది–ఉగాది
ఏప్రిల్ 4, 1973
(మార్టిన్ లూథర్‌కింగ్ వర్ధంతి)

**తూమాటి దోణప్ప**
తెలుగుశాఖ
ఆంధ్రవిశ్వవిద్యాలయము, వాల్తేరు.



'నా కథలు' కృతిస్వీకర్త

**శ్రీ మార్టిన్ లూథర్ కింగ్**

# కథాసూచిక

# ఉపద

ఆ. ఆత్మ నిత్య మాద్య మచ్ఛేద్య మనుసత్య, మెఱిఁగినప్పు డెవ్వఁ డెవనిఁ జంపు ?
చంపఁబడు నెవండు ? సంహననంబు న,ణంచి జదుఁ దహంకరించుఁగాని. 1

క. అల సోక్రటీసు చచ్చెనె, పొలిసెనె జీసస్సు గాంధి పోయెనె రవిసో
ములు నిల్చుదనుక వారలు, నిలువరె నిరవద్యకీర్తినిధులై ధరణిన్. 2

ఆ. అమరు లమ్మహాత్ము లఖిలభూతమ్ముల, యందుఁ గనిరి తమ్ము; నఖిలభూత
సముదయమ్ముఁ గనిరి తమయందు ? సమదర్శ, నానుషక్త చిత్తు లాత్మరతులు. 3

ఆ. మిన్ను మీఁదఁబడిన వెన్నిచ్చు టెఱుఁగని, మగలు వారు పెల్లుతెగువ యున్న
నించుకేని వినయ మెడయరు వా రెట్టి, బెడఁదనైన మృదుత విడరు వారు. 4

గీ. హంతలగువారియజ్ఞాన మరసి యరసి, జాలిపడఁ జాలినట్టి సజ్జనులు వారు
తుందుదుకమీఱఁ దెగిన మృత్యువును జూచి, నవ్వనోర్చినధృతి నేర్చినారు వారు. 5

క. అరిదియగు వారివలచిన, తెరువునఁ జని నీవు విశ్రుతిం గనిన మహా
పురుషుండవు మార్టినులూ, థరుకింగూ ! భవదుదారతకు జోహారుల్. 6

క. తనలోని తమోనైల్యము, గనఁజాలక యొరునిమేనికప్పుం గని భ
గ్గున మండువానిఁ దేర్పం, బెనఁగిన నీప్రేమరసముపేర్మిని మెత్తున్. 7

క. ఖలునజ్ఞతకున్ బలియై, కలకాలము నీవు నిల్వఁగంటి వయారే !
తలఁపించి తహింసకు మూ, దల నా నుతిగన్న ధన్యతము మాగాంధిన్. 8

గీ. దంభమానమదమ్ములఁ దగిలి పొంగు, లోకమున కద్దకట్టగా లుప్తధర్మ
దృష్టులకు వెల్గుగా భవాదృశులచరిత, లుపకరించు మార్టినులూథరూ ! చిరమ్ము. 9

క. నీకథలముందు నాకథ, లేకొలఁదివి ? యైన వీనినే ప్రీతిమెయిన్.
నీ కిడి కృతార్థతంగన, నాకాంక్షయొనర్తు నందుమా ! యీ యుపదన్.

14-10-'72

# టీకన్న

ఆ. దక్షిణాపథోర్వి నక్షీణముగ ఖార, తీయ సంస్కృతిప్రదీప్తి నిలుపఁ
గంకణమ్ము గట్టి కడిమిచాటిన నర, పతులు తెల్గువారి పరమహితులు. 1

క. నరపతులకు మొనకాండ్రై, పరపార్థివ భీతిహేతు బాహాశౌర్య
స్థిరులై ధర్మచ్ఛవిసుం,దరులై పెమసానివారు తనిపిరి జగమున్. 2

ఆ. పెమ్మసానికులుఁడు తిమ్మనాయఁడు పన్ను, లిచ్చెఁ గృష్ణరాయనృపతిసేన;
"కాదివీర" బిరుద మర్పించి రాయ లీ, యోద్ధ నాదరించె నోలగమున. 3

ఆ. ఇచ్చె గండికోట నితనికి; నల్లల్ల, నేలు మనియెఁ దెల్గునేలనెల్ల
నెట్టిచిక్కు తన్ను ముట్టినఁ బెమసాని, తేనిపల్కు లవధరించి తేటె. 4

ఆ. తిమ్మవిభునిచెంతఁ దుమ్మల వీరన్న, ప్రెగడ యయ్యె దండు పెద్ద యయ్యెఁ
గావ్యమునకుఁ డీకగతి రాజుశంకల, కితఁడు తీర్పరిగ రహించె సభను. 5

క. ఈకతమున మా వీరన, టీకనగా మాటె, రణపటిష్ఠతఁ బగఱన్
జేకొని యితండు తిమ్మమ, హీకాంతునికీర్తి నెల్ల యెడలకుఁ బఱపెన్. 6

ఆ. రాయరాజ్యమునకు రాహువై త్రుళ్లు ద, స్తూరిఖాను నణఁప దురము నడిపి
విజయలక్ష్మి నందె వీరన్న తిమ్మభూ; పాలుఁ దలరి పసిఁడివా లొసంగ. 7

గీ. కొండపడమటఁ గుట్ర యొక్కండు రేఁగ, నధిపుననుమతి వీరన్న యటకు వచ్చి
శాత్రవవ్యూహమును జీల్చి శాంతులైన, జనులమన్ననలన్ దనిసనుచు నుండ-8

ఆ. రాయ లవని వీడె, రవి క్రుంకినవిధాన, నెగసె నిరులు విజయనగరవసుధ
మధుర నేలు తెల్గుమన్నీని కండగాఁ, జనిరి దొరలు పెమ్మసానివారు. 9

క. టీకన్న విధిన్ దూఱుచు, నాకారణచేసినట్టి యాప్తులపలుకున్
గైకొని చేరెనుజెఱకూ(బాపట్లతాలూకా),రీకొనె మడిదున్ని బ్రదుక నితరుల మనుపన్.
10

గీ. ఇతనితమ్ముఁడు కేసన్న యిటకు రాక, యయ్యవనియంద నిలిచె; నాయయ్యసంతు
కడపమున్నగు సీమలఁ గానిపించు, సిరులకుం బ్రాపు కీర్తికి శరణ మగుచు. 11

క. టీకనతోడు మఱొక్కఁడు, శ్రీకాకుళమునకు వచ్చె సింగయ; కృష్ణా
ఖ్యాకమగుమండలమ్మున, రేకెత్తిన దితనికుదురు కృతమతు లెన్నన్. 12

గీ. సీమలను బట్టి వేర్వేఱునామములను, దనరుఁ దుమ్మలవారిగోత్రములు; గోత్ర
నామ మెదియైనఁ 'దుమ్మల' నాఁ దనర్చు, నింటివారెల్ల రొకసంతుపంటవారె.
13

గీ. మాది"నవనూళ్ల" గోత్రంబు;మాగృహాఖ్య,మెఱయుచౌదరులందు మామిళ్ల చెఱకు
నూళ్ల వల్లుట్ల మున్నగుపేళ్లఁ దనరు, గోత్రముల్ కనిపించుఁ దెల్గుంబొలాన. 14

ఆ. పెక్కు వంగడముల నిక్కరణిన్ గోత్ర, భేద మావహిల్లె; నాదిఋషుల
కుద్దివచ్చు వర్మ యొసఁగిన 'కూర్మరా,జీయ మిచట సాక్షియై యొసంగు. 15

*శ్రీ పాలడుగు శేషాచలవర్మ*

ఆ. ఇది చరిత్ర యగుట నింత ప్రశ్చితిఁ గాని, కులము గోత్ర మన్న గొడవపట్ల
మమత యుంటఁ గాదు మానవతావాద, లిప్స నాయెడంద లేక కాదు. 16

❖❖❖❖

క. టీకన్న తనయుఁ డొజ్జయ, నౌకావ్యాపారమునఁ దనర్చినసిరితో
లోకహిత మెంచి చెఱువు ల, నేకము త్రవ్వించె బావు లెన్నోనిలిపెన్. 17

క. వెలనాటన్ దన కీడగు, బలుమానిసి లేఁడటన్నప్రథ నార్జించెన్
బలుపున్నెమ్ముల పంటగఁ, గలిగె నితని కయ్యవారు కమనీయవిభన్. 18

ఆ. దొడ్డతనము వెన్నతోఁ బెట్టినది యౌట, నిరుగుపొరుగువారి హితము గనుచు
నూరికెల్ల నయ్యవారప్ప శిరసుగాఁ, బరఁగెఁ బాడి పాఁడిపంట లలర. 19

గీ. మొదటఁ దుమ్మలవారి తాంబూల మనుచు, వేఱుగాఁ బళ్లెరమ్మున వీడ్య మునిచి
యవల నితరుల కిచ్చువా రపుడు జనము, లుద్వహోత్సవములఁ జెఱకూరిసీమ.
20

ఆ. ఊరఁజెఱువుకట్ట నొకనాఁడు పలుదోము, కొనుచు నయ్యవారు కూరుచుండె
గణకుఁ డతనిచెంత గ్రామంపుగొడవ లే,వో వచింపఁ దొడఁగె రీవి దనర. 21

గీ. చెఱువునీటికి నేతెంచుచెలువ యతఁడు, తాల్చినట్టి బంగరు మొలత్రాడు సూచి
యెపుడు సేయించితయ్య ! త్రా, డింతసొరు, దీని కిచ్చినపనివాని తెలివి మెత్తు.
22

ఆ. అనుడుఁ గరణ మిట్టు లనె వెట్టిదాన ! యీ, త్రాటితాఁకు వదనితరుణు లూర
నెంతమందియుందు ? రింతకుము న్నిది, నిన్నుఁదాఁక దేని నేఁడు తాఁకు. 23

క. ఈ పల్కులతో దుర్భర, కోపాగ్నిజ్వాల లెగసి కొట్టె నధర్మం
బోపని తుమ్మలకులసం, దీపకుఁ డొకకొయ్యచెప్పు దీసి గణకునిన్. 24

ఆ. తగులరానిచోటఁ దగిలినదెబ్బతోఁ, గరణ మప్పుడపుడ కన్నుమూసె
సూరివారి కెలమి గూరెను గాని యీ,మృతికి నయ్యవారిమతి కలంగె. 25

ఆ. దేనికైన మంచిదే యని యతఁ డూర, నవతరిల్లఁజేసె నభవుగుడిని
కాశి కేగి భూరికనకదానమ్ముల, శివుని గొల్చెఁ దనిపె శిష్టజనుల. 26

ఆ. అదిర! పెద్దరోగ మనుమాన మగుట నే, గొడ్డు రొడ్డుపడిన బిడ్డ సెడిన
నణఁగలేదు పాప మని వెచ్చనూర్చుచు, నయ్యవారు నోవి కగ్గపడియె. 27

క. ఈయూరు కలసిరా దిఁక, నేయెడకే నరిగి శాంతి నెనయవలయు నం
చాయన కావూరికి రా, నే యార్తియు నతని కంట దీగ్రామమునన్. 28

క. కావూర దానిదరిఁ గల, గోవాడను బెరిఁగె నతనికోవ దయాధ
ర్మావసథ మాత్మగౌరవ, హేవాకశరణ్య మనుచు నెల్లరు వొగడన్. 29

గీ. అయ్యవారప్ప రామలక్ష్మాంబవలన, నన్నయం గనె ముత్తయ్య నతఁడు గాంచె
ముత్తనార్యుఁడు హర్షమ్ము మూరిఁబోవఁ, బడసె రమణయాభిఖ్యుఁ బాపమ్మనుండి.
30

క. రమణయ్యకు శేషయ యను, కుమారుఁ డుదయించె నతని కొడుకై నయవి
త్తముఁడాయెను వేంకటపతి, సమకుతె నారయ్య వాని సంతానముగన్. 31

క. నారయ్య కేను బుట్టితి, భారతి కర్చకుఁడ నైతి బ్రతికినబ్రతుకుం
దీరించుక వెలయింపఁగ, నీరచనకుఁ బూనుకొంటి నెద సాకిరిగన్. 32

27-8-1971

# అనృతఫలము

క. వేంకటపతి కలనైనను, బొంకెఱుఁగఁడు లోభలోలబుద్ధి యెఱుఁగఁ డే
వంకర యెఱుఁగఁడు నడతను, జంకు నితనినీడ సోఁక సకలాఘమ్ముల్. 1

క. వేన్నీళ్ళకుఁ జన్నీళ్ళుగ, మన్నాఁ డీగేస్తుఁ; డైన మన్నీ లితనిన్
గన్నంతన నతులౌదురు, తెన్నిత్తురు ప్రిదిలి గుణవిధేయత తఱుమన్. 2

క. ఇరుగూరికాఁపుకడ నితఁ, డిరువదివరహాల కొక్క యెకరము కొని చె
చ్చెర సంచకరు వొసంగెను, మురియుచు మఱునాఁడ సేద్యమున కట సనియెన్. 3

ఆ. ఇతనికంటెమున్న యింకొొకఁ డేగి నా, గేలు పన్నుచుండె నేల దున్న
నచ్చయా ! యిదేమి యన వాఁడు దీనిఁ గొ, న్నాఁడ ననియె విసపునవ్వుతోడ. 4

క. మంచిది ! యని వేంకటపతి, మంచన్నను గదిసి బైసిమాలినపని కా
వించితి వేమోయీ ! యన, వంచినతల యెత్తలేక వాఁడిటు లాడెన్. 6

గీ. ఏమిసెప్పెదనయ్య ! మామామ నాకుఁ, జెప్పకయ విక్రయించె నాచేను మొన్న
పెద్దవారల కెదురాడుబిగువు లేని, నన్ను మన్నింపు ! నీ బయానా గ్రహింపు ! 6

క. క్రాయకుఁడు నిక్కముంగని, మాయురె ! నరుఁడింతచెట్ట మరగునె ! సర్వ
శ్రేయమ్ములఁ దొలఁగించుఁగ, దా! యనృతం బని నలంగి యవహితమతియై. 7

గీ. మామపై దోస మిడఁబోకుమా ! దురాశ, కగ్గపడి దారితప్పితి వర్ధదాహ
దగ్ధసూనృత ! యపకీర్తి దాపరించె, నీకతమ్మున హాలికలోకమునకు. 8

గీ. ఈవు బొంకాడి యీజగ మేలలేవు, వంచితుఁడ నేను జెడిపోను మంచనా ! సు
మాళ మందకు నాల్గువరాలఁ జూచి, దేవుఁడున్నాఁడులే ! సరిదిద్దువాఁడు. 9

గీ. ఇమ్మెయి వచించి నాతాత యిల్లుసేరఁ, జేరె విక్రేత పితరులచెంత కపుడె;
కటకటా ! దొడ్డికిం జని గడ్డి దూయ, ముట్టె నీతనిఁ జెడుపుర్వు ముట్టెసాఁచి. 10

గీ. ఈయుదంత మజాకృపాణీయవిధికిఁ, జెందు ననువారు జగమున నుంద్రు గాని
పాపఫల మీవిపత్తని పలుకువారు, లేకపోలేదు ధార్మికాలోకచణులు.

ఆ. అప్పుడపుడయొుండె నావెనుకలయొుండెఁ, గూళ దురితఫలముఁ గుడుపు తప్ప
దగుటఁ బాపభీతి నధికారియైనను, భృత్యుఁడైన సంచరింపవలయు. 10-5-1967

# హరిభక్తి

గీ. ఆయనవయస్సు వింశతిహాయనముల, మించ, దాతఁడు చదివినమేటి కాఁడు,
పూర్వపుంబుణ్యమొకకొంత పొసఁగిసుజన, గోష్ఠికనిశము నుత్కంఠ గొను నతండు. 1

గీ. అతని కాలానఁ బరమేశ్వరానుకంప, వడయఁ బ్రజ లారటింతు రెయ్యెడను గన్న
భగవదనుభూతి నెఱుఁగని బ్రతుకు సకల, వేదనాకారణ మ్మని విశ్వసింత్రు. 2

ఆ. చెఱువుకట్టమీఁదిచెట్టుక్రిందనొ గుడి, చప్రముననొ యొుండె సత్రముననొ
సందెప్రొద్దు రామచరితమో భాగవ, తాదులో పఠింతు రపుడు బుధులు. 3

గీ. కరణమో కాcపొ పౌరాణికత్వ మూని, పాపపుణ్యములన్ దేటపఱుచుచుండ
సంతతశ్రవణమ్మున జనులు తేటి, దిద్దుకొనుచుంద్రు బ్రతుకు నాదినములందు. 4

గీ. ఊరిలో నుండినను బొరుగూర నున్న, మాపటc బురాణగోష్ఠిని మానc డతcడు;
శబరిచరిత, గజేంద్రమోక్షము, సురారి, సుతునికత లాలకించుచు సొగయు నతడు. 5

గీ. కర్మపద్ధతి జ్ఞానమార్గం బతండు, కా దనcడు గాని భక్తియోగమును మెచ్చు;
మాధవప్రేమ కిది ముఖ్యసాధనంబు, విరతి కిది మూల మని నిరంతరము నమ్ము. 6

గీ. రేపు మా పతండు శ్రీపతిభజనమ్ము, విడువcజాలc డెన్నియిడుమ లున్న;
విడుచునేని వీతవీర్యుcడై కొఱగాని మాసి యగు నశాంతిమగ్నుc డగును. 7

క. తనభగవన్నుతిలోc బో, తన గోపన కైతలవిరతమ్ముగc బాడున్;
విని విని నేర్చినచదువిది;, మనీషిమణు లతనిమ్రోల మ్రాన్పడవలయున్. 8

ఆ. కెరలికెరలి హరిని గీర్తించు చంతలో మౌని యగును, నవ్వు, మగిడి వగచు;
నతcడు పరమభాగవతలక్షణమ్ముల, నాcచికొనియె జవ్వనంబునంద. 9

## మంజీర ద్విపద

తనయూరి కామదదవ్వులో వెలయు, కర్లపాలెం బనుగ్రామ మాయన్న
కదిసె గిత్తను గొనcగా నొక్కనాcడు, పరికించె గోష్ఠముల్ పది పదునైదు. 10

తగునట్టి కంటికిc దగులమిన్ మిగుల, వేసారె నాకంటివెతcజిక్కె; నవల
శుచియై చలిదికూడు జుట్టc దలంచి, దాపునc గలవంకc దాన మొనర్చి. 11
వందలితో రమావల్లభు నతcడు, తీర్చి యస్పంద భక్తికి నిక్క యగుచుc
జిక్కినవిరులతో శ్రీనాథు నర్చ, గావించి పొగడి లోకమ్మును మఱచి. 12
నిభృతహరిధ్యాననిష్ఠితబుద్ధి, నున్నంత నొక మ్రోcత యొలసి సమాధి
కంతరాయము గూర్ప నాహరిభక్తుc, డక్షు లించుక విచ్చి హయముపై వచ్చు. 13
పురుషుని యువ నూర్ధ్వపుండ్రదీవ్య న్ని, టాలుని గని తన టకటొంకులేని
సేవలు మెచ్చి రాజీవలోచనుcడు, దర్శనమిచ్చె దుస్తరభవాంబుధిని. 14
దాcటc గాంచితి ధన్యతరుcడ నే ననుచు, నుప్పంగి యోప్రభూ ! యోదయారాశి!
వచ్చితే ప్రహ్లాదవరద! నన్ బ్రోవ, నగుcగదే ! యని వాజి కడ్డమై నిలువ. 15
రౌతుగాc గూర్చున్న రాజు వీc డెవcడొ, బ్రాగుcబో తని మదిం దలపోసితొలcగు
తొలcగుమటం చెంతతొందరించినను, గదలcడయ్యెనుయోగి, కర్ణంబులతని. 16

వాలింపవయ్యె నయ్యాశ్వికునుడులు, రా జే మెఱుంగును రైతుతత్త్వంబు
దొర కేమి తెలియు భక్తునిచొక్కు స్రుక్కు, కను లెఱ్ఱచేసె నాఘనుఁ డతివేల. 17
వైష్ణవభక్తిమై వఱలుహోలికుని, గొట్టె నిర్దయతోడఁ గొరడాను బఱపి
తిట్టె నజ్ఞానంబు తెట్టువల్గొనఁగ, యోగికాయమ్మున నురలె రక్తంబు. 18
సాగె రాహుత్తు మీసలు దీటుకొనుచు, నాతండ్రి నా తల్లి నన్నేలు వేల్పు
నాపాపముల నెల్ల నలిసేయుజెట్టి, కనికరించె నటంచుఁ గదలినాఁ డంచు. 19
నమ్మితి నక్కటా ! నాయాస లెల్ల, నడియాసలాయె మహాతపః క్లిశితు
లఖిలభూతప్రియులద్వయు లింద్రి, యానీకహూంకృతి నఁణచుహంవీరు 20
లఖిలకర్మఫలంబు నాసింపఁబోని, తెగుదార్లు సుస్థిరధీవిరాజితులు
నిర్మానమోహులై నెగడు సంయములు, కాక నావంటి మొక్కలులు మాధవుని 21
కరుణకుఁ బాత్రులా ? కానిమ్ము నన్ను, నా స్వామి యింకొకనాఁ డైన నుద్ధ
రింపఁడా ? నాభక్తి రేకెత్తినపుడు, నాయహంభావంబు నశియించినపుడు 22
చేయూఁత నిచ్చులే శ్రీపతి నాకు, నభయం బొసంగులే హరి నా కటంచు
నైరాశ్య మెఱుఁగ ని నారయ్యయతఁడు, మరలెనింటికి; నహో!మత్పితయతఁడు.
9-6-1967 23

# నారయ్యదివ్వె

గీ. నిండుజాబిల్లికైవడి రెండు మూఁడు, లాంతరులు వెల్గుచుండ రవంత ప్రమిద
నేటికి మినుక్కురను దీప మిడితి వనుచు, గేలిచేసితి నొకనాఁడు గేస్తు నొకని. 1

ఆ. ముదుకఁ డాగృహస్థు ముసిముసి నగవు కృ,తజ్ఞతయు వినమ్రతాభరమ్ము
మొగమునందు ముప్పిరిగొనంగ నయ్య! నా, రయ్యదివ్వె యిది వరాలదివ్వె. 2

క. మా దీపిక నిల్పిన పర, మోదారుఁడు నారయాఖ్యుఁ; డుర్వీస్థలి కే
తాదృశులు రారు పలుమా; ఆదర్శం బితనిచరిత మఖిలప్రజకున్. 3

ఆ. పేదవాని కితఁడు పెన్నిధి; ధర్మదే,వతకు ముద్దుగూర్చు సుతుఁ డితండు;
పరుల విత్త మగుటఁ బదివీసెల పసిండి, త్రోసినట్టి మేలిమాసి యితఁడు. 4

క. ఈ యుత్తమర్ణుఁ దర్థము, నీయఁగ నొకనంజ కొంటి నెన్మిదియొకరా;
లేయాకో తిని సేద్యపు, టాయము నిడుచుంటి నితుని కప్పు తొలంగన్. 5

గీ. రెండుమూఁడేండ్ల కీ వ్రేఁగునుండి బయటఁ,బడుదులే యని సంబరపడుచు నుండ
వచ్చె నార్థికమాంద్యము; వడ్లకంటెఁ, జౌకగాఁ జిక్కువస్తువు లేకపోయె. 6

గీ. ఎన్నిబస్తాల నమ్మిన నేమి శిస్తు, బెడఁదకే చాలదాయె వచ్చెడి ధనమ్ము;
పెరుఁగుచున్నది ఋణమన్న భీతి హెచ్చి దెందము, కలంగి నేఁ దలక్రిందు లైతి. 7

క. ఆనాఁడు లాఁతి వెరవుం, గానక "నేఁడున్న వెలకుఁ గట్టెదఁ బొలమున్
నానొవ్వుఁ బాపు" మని కరు, ణానిధి నర్థించినాఁడ నారయ; నంతన్ 8

క. వగవకు ముసలారెడ్డీ !, భగవంతుడు నేఁడు కాఁపుపట్లఁ గినియ నీ
యగచాట్లు వచ్చె; నీకుం, దగుసాయ మొనర్తు ధర్మతత్పరమతినై. 9

గీ. నేఁటివెలమీఁద నింకొక నూటిఁ జేర్చి, వదలుమీ కొంద్ర బాకీకి వచ్చినంత;
దిగులు సెందకు బెదరకు దీలుపడకు, రైతునకు మంచిరోజులు రాకపోవు. 10

క. అనవద్యుఁ డితం డిమ్మెయి, నన మూఁడెకరాల విడితి నప్పు వదల్పన్
ననుఁ గ్రుంగఁదీయుబరు వి, ట్లణఁగన్ దలయెత్తినాఁడ హాలికవీథిన్ 11

మం. రెండేండ్లు కడచె మూరిన పీడ సడలి, హెచ్చెను వరిపంట కించుక విలువ;
యొకనాఁడు నారయార్యుఁడు నన్నుఁ జూడ, నరుదెంచి కుశలాదు లడిగి నాతోడ 12
మెసఁగి రెడ్డీ ! నీదుమేలు భావించి, పల్కెద నొకపల్కు పాటింపు; మిపుడు
లేదునీకుఋణమ్ము; లేదు విచార, మెట్లఁ గొంటివి దున్న లెబ్బే యటంచు; 13
నింతికి నగలు సేయించితి; వింటి, కందాలు పెంచితి; వాదాయ మున్నఁ
బెరుఁగును ఖోగేచ్చ; పెరుఁగును వెచ్చ; మెల్ల ఖర్చులు మంచివే యని తోఁచు 14
నిటులైనచో మన కృషికలోకమున, కొదవదు పెం; పని యూహింతుఁగాన
నీవు నాకొసఁగిన నేల నీ కిదెద, నల్లన తీర్చుకొ మ్మప్పును దీని; 15
వలదు వడ్డీనాకు; వలదు నేఁడున్న, వెలయు; నీ విచ్చిన వెలకె నీకిత్తు
ఋణధారమెదను గారించుకాలమున, రిత్తవెచ్చెములు సైరింపఁడు హాలికుఁ 16
దధమర్ణతం ద్రోయ నారటం గుడుచు, ననవుడు నీ పల్కు నతఁడు మనుష్యుఁ
డా ? కాఁడుకాఁడు వేల్పగు; ననికరఁగి, నారయ్య యెంత తిన్నఁదనమ్ము నేర్చె 17
నారయ్య యెంత పుణ్యమును సాధించె, నద్దిరా ! పరులమే లాసించు కాఁపు
లయ్యరే ! సర్వోదయాసక్త చిత్తు, లిట్టివా రూరికి నిద్ద ఱుండినను 18
లోకాన శాంతికి లోపమేర్పడదు, ప్రజలలో నీర్ష్యాదిపాపంబు లుండ
వని మానసించి యొయ్యన యప్పు నీఁగి, ఋణదాతృ శేఖరు ఋషివంటి వాని 19

నితనిని బ్రతిదినం బీదివ్య నునిచి, యర్చింతు భక్తి; నారయ్య దివ్వె యిది; మ
దాత్మకు వెలుంగిచ్చునట్టి దీప మిది, యిది మత్కృతజ్ఞత నెఱింగించుదివియ;20
యిది పాపతిమిరంబు నెడలించు దిబ్బె, మిది జగాజ్జోతి నా, కిది దివ్యహేతి;
యనుడు నారయబిడ్డ నగుట కే నెట్టి, తపము సల్పితినొ బ్రాక్తనజనుర్వేళఁ 21
గారణజన్ముఁ డీ కాఁపుల బ్రాపు, గణనీయశీలుఁ డీకార్మికహితుఁడు
నాతండ్రి సుకృతంబ నాకు శ్రీరామ, రక్షగా ముంగిట రాజిల్లు కల్ప 22
తరువుగా నుంట నేతన్మాత్రచరిత, నార్జింపఁగంటి ధన్యత గంటి ననుచుఁ
దీయని తలఁపులం దేలుచు నింటి, దెసకు సాగితి రెడ్డిదీవనల్ పడసి. 23

2-5-1967

# నా చదువు

ఆ. అలఁతి వలఁతి చదువు లందించి నా కాంధ్ర, శారదాసపర్య సలుపు భాగ్య
మావహించినట్టి యాచార్యులకుఁ గృత, జ్ఞత వెలార్తు నతులు నుతు లొనర్తు. 1

ఆ. కఱపె మొదటిచదువు కావూరి శ్రీరామ, మంత్రి మధురశీలమాననీయుఁ
డమరకోశ మితనియాజ్ఞ వల్లించితి, నాంధ్రనామసంగ్రహమ్ము వెంట. 1906. 2

25-12-1901 నా జననము

క. భారత భాగవతమ్ముల, నేఱాకధ లపుడె కొన్ని నేర్చితి శతకా
లేరాళముగఁ బఠించితిఁ, బేరందితి నీడు జోడు పిన్నలయందున్. 3

గీ. తండ్రి కోర్కిని భాగవతమును రేలఁ, జదువుచుండెడివాఁడ నయ్యదని యందు
జనకుఁ దెఱిఁగించునర్థాదు లనయ మస్మ,దాత్మ నెలకొని ధీశక్తి నదరఁజేయ. 4

క. బడిమానితిఁ బెదవూఁడికి, నడిచితి బొౌరాణికునకు నా బావకు శి
ష్యుఁడనైతి జాస్తి సుబ్బయ, కుడుకువ గానక పఠింప నొగ్గితిఁ గృతులన్. (1912)5

క. మను వసు చరిత్రములఁ జది, వినాఁడ నపు డాంధ్ర కావ్య విభవాంకములన్
మనసునకు సాహితీ వా, సన తగిలి ప్రబంధ కవుల జాడలు తెలియన్. 6

ఆ. అంతరాయములకు నగపడి పెదపూఁడి, నెడసి యిల్లుసేరి మడఁకపనులు
సలుపవలసెఁ గాని చదువుమీఁది తలంపు, నుజ్జగింపలేక యుడికినాఁడ. 7

ఆ. ఊరిలోనఁ దగినయొజ్జ కన్పింపమిఁ, గాఁపుఁబనులు లేనిగడియ చూచి
నాకు నేన గురుఁడనై, కొన్ని కవితలు, వల్లెవేసినాఁడ మెల్ల మెల్ల. 8

ఆ. సంస్కృతమునఁ గొంత చాతురి లేనిచోఁ, దెనుఁగుగ్రైతమఱుఁగు తెలియదన్న
సత్య మెఱిఁగినాఁడ నడిసన్నకబ్బము, లరసినపుడు లోఁతు లొరసినపుడు. 9

గీ. అంగలూరను దుగ్గిరాలాన్వయుండు, కలఁడు పురుషోత్తముండు వేల్పుఁబలుకునేర్చి
వీనుమిగిలిన గురుఁడని వినుటఁజేసి, యింటఁ జెప్పక యయ్యూరి కేగినాఁడ.(1917) 10

ఆ. గురుఁడు నాకు విద్య గఱపెద నని కూర్మి, మెఱసెఁ గాని నోరు దెఱచి యేను
వారివీరి నడిగి వారాల్ పదయలేక, విత్త మిచ్చి తినఁగ వీలులేక. 11

గీ. పెక్కుపూఁటలు గురునింట మెక్క లేక, సిగ్గుపెంపునఁ గావూరు చేరినాఁడ
నవల నాతండ్రి దివికేగెనకట! గోరు, చుట్టుమీఁద రోకటిపోటు బిట్టు తాఁకె.(1917) 12

గీ. అనుదినము సేద్యపుంబను లందుకొనుట, తనకు నపు దనివార్య కర్తవ్య మాయె
రాపు లెట్లున్న విద్యానురక్తి నన్ను, వదలదాయె నావంతయుఁ బ్రిదులదాయె. 13

మధ్యాక్కర

ఈతీంద్ర సైరింపలేక నేఁ బగలెల్లఁ గర్షనపుఁ
జేఁతలు సాగించి ప్రొద్దుగ్రుంక భుజించి యొంటరిఁగ,
రాతిరి క్రోశద్వయమ్ము నడిచి సర్వజ్ఞు షట్కర్ము
శ్రీతాడెపల్లి సదన్వయోత్తంసు శిష్యమందారు- 14

క. చందవోల్పురవాస్తవ్యు సాధుకవన, ఖనిని రామకథామృత కావ్యకర్త
వేంకటప్పయశాస్త్రిని విమతశైల, వజ్రధారను దేశికవ్రజవరేణ్యు - 15

గీ. చేరి తచ్చరణమ్ముల చెంత నొదిఁగి, చదివినాఁడను గాళిదాసత్రయమ్ము
శాస్త్రి నానారహస్యముల్‌చాటుకతన, నమరభాషను గొంతధైర్యమును గంటి. 1917. 16

మధ్యాక్కర

పవలెల్ల నయ్యాయిపనులతో గాసిపడుట, రే యెల్ల
దవుదవ్వులకు నడచి నడచి చదువఁ దలకొంట నాకు
మివుల వ్రేఁగౌట నాసక్తి దెందాన మెండుగా నున్న
నవగమింపఁదగిన విద్య వారాశియంతగా నున్న - 17

క. మానితి గత్యంతరమున్, గానక చందోలు చదువు; గ్రంథాలయ మ
ప్డే నెలకొనె మాయూరను 1918, దానికి నా సేవ నిడితిఁ దాత్పర్యమునన్. 18

క. ఈ సేవకతనఁ జతురులు, వ్రాసిన గ్రంథములఁ బెక్కు వర్గంబులకున్
దాసినవానిం జదివితి, నా సాహితిమీఁదికామనలు చిగిరింపన్. 19

క. భాస్వద్రచనా నిచయ వి, కస్వరమై నాఁడు వెదలు గ్రంథాలయ స
ర్వస్వము మామకధిషణా, నిస్స్వత నణఁగించె నొకమనీషి విధానన్. 20

గీ. భువనగిర్యన్వయుండు సత్కవి మనీషి, వరుఁడు కోదండపాణి నాఁవ్రాసినట్టి
శతకముల సంస్కరించి నాచదురు కొంత, పెనిచె నయ్యెడ నోర్మిని బేర్మిఁ జూపి21

గీ. అవల జాతీయపారశా లాంధ్రగురుత, నాది యగుట నన్నయ తిక్కనాదిబుషుల
పలుకు వివరించుచుం గవిప్రభులమహిమ, నాకళించితి నందినయంతవట్టు.22
1924-29

క. అన్నన్న! నీతిచంద్రిక, నన్నుఁ గడున్ దనిపెఁ దెన్గునకు నిది వేదం
బన్నను దొసంగు కలదా ?, చిన్నయ మనపున్నెమునకుఁ జిహ్నము కాఁదా ?23

గీ. పరిమి నరసింహశాస్త్రి యత్తరుణమందు, నూర నైదాఱుమాసము లుంటఁజేసి
యాదికావ్యమ్ము నేర్చితి నమ్మనీషి, యొజ్జగా నిల్చి ఋషిభావ ముగ్గడింప. 192624

గీ. చదువ దొరఁకొంటి "నుభయభాషా ప్రవీణ"
పట్టమునకు నా యెఱుకయ ప్రాపుగాఁగ
నెంత త్రచ్చిన నేమి వ్యాకృతిరహస్య,
మంతుపట్టక తలక్రిందులైతి నపుడు 1925 25

ఆ. గురువులేనివిద్య గ్రుడ్డిది పొ మ్మని, బడికి సెలవు పెట్టి బందరునకుఁ
జేరుగడఁ దనర్చు చిట్టిగూడూరికి నరిగినాఁడ నాస లగ్గలింప. 1929-30 26

మం. విశ్రుతచరితుండు విద్యాపయోధి, యౌదార్యనిధి వరదాచార్యు లిచట
నఖిలాంగసంపన్న మైన సంస్కృత క, ళాశాల నిల్పి వలంతులౌ బుధుల
రావించి దేశికరాజ్యంబు లిచ్చి, తాఁ బ్రధానాచార్యతను దలఁదాల్చి
మతకుల భేదముల్ మఱచి విద్యార్థి, తతి నాదరించుచుఁ దనసరస్వతికి
నఖిలావనీస్తుతు లార్జించిపెట్టు 27
నపర చిన్నయసూరి యంచితాచార, విభవుండు దువ్వూరి వేంకటరమణ
శాస్త్రి యేతత్కళాసదనమ్మునందు, నాంధ్రశాఖాధ్యక్షుఁడై హవణిల్లు
నీ విద్వదగ్రణికృప కేను నోఁచి, యీ సాధుసత్తముప్పొది నేను దోఁచి
చదువంగఁ దొడఁగితి శబ్దశాస్త్రంబు, నేర్వంగఁ బూనితి నెఱవైన విద్య.
ముత్తులిత్తులు పీఁటముడు లెల్ల విప్పి, ప్రౌఢ ప్రయోగ మర్మములెల్లఁ జాటి
తొలఁగించె నా భీతి దువ్వూరిసూరి, రహి నేలె వేంకటరమణుండు నన్ను

నిపుడైన నా శంక లీయొజ్జ కనిపి, తగు నుత్తరము లంది తనివోవుచుందు
మనుఁగాక మా శాస్త్రి మహిని వేయేండ్లు, కనుఁగాక తచ్ఛాత్రగణ మా మహత్త. 28

గీ. విశ్వవిద్యాలయ పరీక్ష విజయమంది (1930),
భావపురి బోర్డు హైస్కూలు పండితుండ
నైనతతి వేల్పునుడితీర్పు నరసినాఁడ,
నినుపకుతిక శంకరశాస్త్రి కనికరమున. 1931-41. 29

గీ. ఎందఱో సజ్జనులు బుధు లింత యంత, నేర్ప లెక్కకు వచ్చితి నేను నేఁటి;
కైన నేమాయె నెఱిఁగిన దఱువు పాటి, యెఱుఁగనిది మిహికామహీధరము పాటి. 30

31-8-71

# గండము తప్పుట

క. శ్రీ చుక్కలతో శ్రీరా, మాచార్యుఁడు శిష్యవితతి నాకర్షింపం
జూచెను వేళకు; మున్నీ, యాచారము పల్లెకూటమందున్ నడుచున్. 1

గీ. వానయైనను జలియైన వచ్చుచుందు, బుడుతలందఱకంటె మున్నడిగ బడికి
నాకు శ్రీరానిపూఁట యేనాఁడునుండ, దుండుచోదానఁ దప్పక యొదవుఁ జుక్క 2

క. శ్రీచుక్కలు దక్కక గురు, చీచీలు భరింపలేనిచిఱుతలు మనమం
దేచినకిన్కకు లోపడి, చూచిరి యొజ్జకు దొసంగు చొప్పడఁ జేయన్. 3

క. వేకువ నేతెంచిరి బడి, పాకకు నిప్పిడిరి సాల పదటన్ గలిసెన్
వ్యాకులితచిత్తుఁడై గురుఁ, డీకట్టిఁడిచేతగుట్టు నెఱుఁగన్ గడఁగెన్. 4

ఆ. సాక్షినైతి నేను జంకక సత్యంబు, నుగ్గడించినాఁడ నోజయెదుట
గురుఁడు కనలి కనలి గొడ్లను బాఁదిన, కరణిఁ బాఁదె నేరగాంఁడ్రనెల్ల. 5

ఆ. దుండగీండ్రు నన్ను దోషిఁగా నెంచిరి, నాకుఁ బెద్దకీడు దొనర్పఁ దెగిరి
పద్మరావు వీరిపడవాలు వీఁడు నన్, మిగుల ముద్దుసేయ మెచ్చుఁ దొడఁగె. 6

క. కల్లయుఁ గపటము నెఱుఁగని, యుల్లము నా దగుట నీతఁ డుక్కివుఁ దేయే
బెల్లినుడు లాడినను నే, వల్లే ! యనుచుంటిఁ గొంతవడి యిట్లు చనెన్. 7

ఆ. ఆటవిడుపు వచ్చె నానాఁడు రావు నన్, గదిసి నెయ్యమారఁగా వయాళి
కేగివత్త మనుడు నే నియ్యకొంటి మా, తల్లిమాట వినక దారిదప్పి. 8

ఆ. పద్మరావుమూఁకఁ బదుగు రున్నా; రొక, యామ్రవనము గంటి మందఱమును
వెంటనున్న యుప్పు నంటించి తింటిమి, మావికాయ లామ్లమయము లపుడు. 9

ఆ. దండులోనివాఁ డొకండు పదంపడి, క్రన్న నఱకెఁ దాటికాయగెలలు
లేఁతముంజె జుఱ్ఱి లెస్స ! బలా ! యని, తృప్తి నందినార మెల్లరమును. 10

ఆ. అస్తగిరికిఁ జేరె నర్కుండు దిక్కుల, నోలి నలమె నాలినాలియిరులు
పద్మరావు నన్నుఁ బట్టెను దఱివేచి, యున్నపలువ నీతిచన్నతులువ. 11

క. కట్టిరి న న్నొకతాటికిఁ, గొట్టిరి బెత్తములఁ జెనఁటికుఱ్ఱలు మేనన్
బిట్టోడిగిల్లె నెత్తురు, కట్టిదుమం బడితి వెరవుగానక చెడితిన్. 12

ఆ. నీకతాన మున్ను మాకాయములు త్రెస్సి, యెంతవగచినార మెఱుఁగు దీవు
నిన్ను నింతమాత్రనే విసర్జింతుమా, కాచుకొ మ్మటంచు ఖలులు రెచ్చి- 13

క. మండెడి తాటాకులు నా, దండకుఁ గొనితెచ్చి ప్రల్లదమ్ములు పఱుపన్
గుండెదిట వేది వేఁడితిఁ, దండిరి సేవించురాముఁ దాత్పర్యమునన్. 14

ఆ. పాఱుతెంచుగిత్తఁ బట్టఁగా రొప్పుచు, దూఁకె నప్పు డటకు దొంతిరెడ్డి
బెదరి గుంపు చెల్లచెదరయ్యె రెడ్డి నా,కట్లు విప్పెఁ గరుణ కదలుకొనఁగ. 15

గీ. ఎవ్వరెట్లు తలంచిననేమి నేను, విశ్వసించెద నీ రెడ్డి వే ల్పటంచు
నేరమెఱుఁగని నాదుకైవారమునకుఁ, గరఁగి ప్రభుఁ దాపదపహర్తగాఁగ మాఱె. 16

14-4-72

## మొదటి పద్యము

ఆ. ఓనమాలు రావుగాని నాతండ్రికి, సాహితీబలమ్ము చాలఁ గలదు
రేల నిరుగుపొరుగుహాలికులకుఁ బురా,ణమ్ము వినుచు నితఁడు నాల్గుగడెలు. 1

క. పోతనభాగవతమ్మున, కీతఁడు కదు మురియు; దాని నేఁ జదువంగా
నోతప్రోతమ్ముగఁ దా, శ్రోతలకున్ వక్కణించు సుస్పష్టగతిన్. 2

ఆ. చదువుకైతఁ గఠినశబ్దంబు తగిలెనా, యపుడ దాని యర్థమడుగువాఁడ
నయ్యనుడువునర్థ మది చెఱుగనిముద్ర, కరణి నన్మదాత్మఁ గాఁపురించు. 3

క. మధుపం బనఁ దుమ్మెద యని, వధు వనఁగాఁ బెండ్ల మని జవం బన వేగం
బధరం బనఁ బెదవి కలా, నిధి యనఁ జంద్రుఁడని కంటి నే నవ్వేళన్. 4

ఆ. ఆంధ్రనామ సంగ్రహము, శేష, మమర మా, నాఁడ లోఁగియుండె నాకు; నలచ
రిత్ర వచ్చు దివిజరిపుబిడ్డ కథ వచ్చు, వామనావతారవార్త వచ్చు. 5

గీ. అప్పటికి నావయస్సునం దష్టసమలు, నిండె; శ్రీరామమంత్రిసన్నిధిని జదువు
బుదుత నేను; మాతరగతి బొట్టెలందు, నేర్మి గలవాఁడ నేను బండితుఁడ నేను. 6

మధ్యాక్కర

కలదు మాయూరు కావూరికిం దూర్పుగాఁ జిన్న వీటి
పొలుపునం దనరుచుఁ జెఱకుపల్లి యన్ ప్రోలు; సాహిత్య
మెఱిఁగినవారందుఁగలరు కొంద; ఱించించుక వ్రాయు
వెరవు నేర్చినవారుఁ గలరు;కల రట విత్తవంతులును. 7

క. తిరుపతి వేంకటకవు ల,బ్బురముగ నానావధానములు సల్పుచు నాం
ధ్రరసజ్ఞులకుం దను పిడు, తఱి యది మేధా కవిత్వధారా ప్రౌఢిన్. 1910 8

ఆ. చెఱకుపల్లివారు సేయించి రపు డవ,ధాన మఖిలరాజధానులందు
మంతుగన్న రాజమన్నారుచేత వి, ద్వత్కవీంద్రుచేతఁ దమపురాన. 9

క. కవితారహస్యవిదుఁ డా, యవధానము చూడఁ గదలె నస్మద్గురుఁ; డె
ట్టివినోదమొ యిది యనుచుఁ ద, దవలోకనవాంఛ వెరుఁగ నరిగితి నేనున్. 10

ఆ. తగినవారు పదురు తెగఁబడి యవధాని, నొత్తఁజూచి రెల్లయెత్తు లూని
వెన్న దున్న యనుచుఁ గొన్నిమాటలు నిచ్చి, చెప్పుఁ డనిరి నలువచెలువ పెండ్లి. 11

క. అవర్ణము రారా దని, యీ వర్ణము వర్జ్య మనియు నెంతయు బెడఁదం
గావించి; రెదిరి యెదియో, భావించుట చూచి చూచి పఱపిరి గంటల్. 12

ఆ. వనజలోచనుండు శునకమ్ముగా మాఱె, నను దురర్థ మొదవునట్టి నుడుల
నొకసమస్య నిచ్చి; రకట ! వధాని యె, ట్లిందునెగ్గు ననుచు నేను గుంద. 13

మధ్యాక్కర

పూరించె రాజమన్నారు దానిం ద్రిపురదైత్యకథకుఁ
గూరిచి సభ నున్నకవులు కోవిదుల్ కొనియాడునట్లు
నూఱారు లిడి నూత్న వస్త్రము లొసఁగి నుడిసొంపు వెలయ
శ్రీరాజమన్నారుచదురు మెచ్చిరి శిష్టు లాప్రొద్దు. 14

క. పదపడి కవితావేశము, పొదలుకొనన్ నెలవు సేరి పూరించితిఁ ద
త్కథ నాసమస్య; నిది నా, మొదలిటిపద్యమ్ము; దీన మురియుదు నేఁడున్. 15

మొదటి పద్యము

మ. మునుపున్ రాత్రిచరుల్ విమానములపై మోదమ్ముగా నెక్కి మా
ఘనమున్ జూడు మటంచు నాఘనముపైఁ గాసేపు పర్గెత్తి యా
వెనుకన్ నేలకు వ్రాలి యూళ్ల నణఁపన్ విల్లందుకొన్నట్టి యీ
శున కమ్మయ్యెను విష్ణుదేవుఁ డహహా ! చోద్యంబుగా నత్తతిన్. 16

ఇందలి నాల్గవ పాదమే సమస్య

ఆ. ఇట్లు వ్రాయవలయు నీ పద్య; మిది సాధు;, విది యసాధు; వన్న యెఱుక లేని
నాఁడు దీని వ్రాసినాఁడ; నిం దెన్నేని, కొదవ లున్న నాకు నిది ప్రియమ్ము. 17

22-6-67

## జాలి

ఆ. తొంగితొంగి చూచెఁ దొలుకరిజల్లులు, పల్లపుంబొలానఁ బదను కలసె
పల్లెకాఁ పెలర్చి చల్లె విత్తనముల, నద్దపచ్చ క్రమ్మె నాకుమళ్ళ. 1

ఆ. ఇచ్చవచ్చినట్టు లీమూల కామూల, కేగుపసికి నాజ్ఞ లీయవలసె
కాఁపుబిడ్డ గొడ్లకాపు పట్టెను జల్ది, మూటతోడ మొగము తేట తోడ. 2

గీ. ఈడుజోడైన బాలురతోడఁ గూడి, నాఁడు నే నదలించుచున్నాఁడ మంద;
బీటనొకబాట కల; దందుఁ బేఁట కేగు, ప్రజలు పయనించుచుందురు పగలురేయి. 3

ఆ. పిన్నతనపుఁ ద్రిక్క పెరిఁగి మావర్గ మీ, తెరువునందు నొక్కబొతియఁ ద్రవ్వి
దాన దీనఁ గప్పి దారి నెప్పటివలె, సవరచేసి వేచె శ్రమ ఫలింప. 4

ఆ. సంతకేగి వలయుసరకులతో వచ్చు, బిడు గొకండు గోతఁ బడియె నకట !
బుజము మీఁద వ్రేలుబుంగలు రెండును, వ్రక్కవాటి ముక్క చెక్క లెగయ. 5

క. తమపన్నిన గారడమున, కమరెఁగదా సార్థకత్వ మని కడుసంతో
సము నందిరి నానెయ్యురు, కమిసెను గొందలము పేదకాఁపు మొగానన్. 6

ఆ. అతఁ "డెంతచేసి రల్లు; లాకూర నీ, కూర నమ్మి యమ్మి కూర్చుకొన్న
రూక నిచ్చి కొన్ననాకుండ లిట్లాయె, నెట్లుపడతుఁ బనఁటు లేను మరల. 7

క. ఎన్నాళ్ళకుఁ జేపడు నొక, చిన్నము నాఁ కిన్ని నీరు చిలుకనిచో నా
రున్నే యెండలతాఁకున;, కన్నన్నా ! దైవ మెంతయాపద తెచ్చెన్ !" 8

ఆ. అనుచుఁ గుడుచునార్తి యస్మదీయాత్మకు, గాల మగుడు నతనిఁ గదిసి "తాత !
చేయరానిచేఁత చేసిరి మావారు, తెప్పితిల్లి వీరితప్పు సైఁపు. 9

ఆ. లేటికంటినీరు వేఁటకానికి ముద్దు, పిల్లి కెలుక పాలిపీడ పండు;
వన్నెనుడులు నిజము లాయెఁబో ! నేఁడు మా,గుం పొనర్చినట్టి తెంపుఁజేసి. 10

(తృతీయకు ద్వితీయ)

ఆ. చేతనైన మేలు సేయవలయుఁగాని, నరుఁ డొనర్పరాదు పరుల కెగ్గు
కుందువారిఁ జూచి కుల్కుమానవునకుఁ, గాసరమున కేమి వాసి కలదు. 11

గీ. నీయవస్థ నెఱింగితి నీకుఁ దగిన, సాయ మొనరింతు" నని యేను జాలిఁ జిక్కి
వెండిగొట్టాల మొలత్రాటి నుండి రెండు, బేడలను ద్రెంచి బిక్క కర్పింపఁబోవ-12

ఆ. వలదు వలదు పెద్దవారిచాటున నుండు, బిడ్డ వీ వటంచు బీద పల్కెఁ
గాదు కాదు నన్నుఁ గన్నవా రీయావి, నాదరింతు రింతు రంటి నేను. 13

ఆ. ముసలివానివదనమునఁ జిఱునవ్వున- తళుకు గూరెఁ దేఱెఁ దలఁపు నాది
గాజువాఱు చెలిమికాంద్ర నోదార్చి వా,రంటి మెసఁగఁ దింటి నన్న మపుడు. 14

15-6-67

## జ్ఞానస్నానము

ఆ. ఏఁబదేండ్లనాఁటి దీ కథ; యపుడు నా, పాలిచేఁత పొలముపనియ; కాని
తీఱినప్పుడెల్లఁ దెనుఁగు కావ్యమ్ములు, చదువుచుంటిఁ బల్కుచదురు వలచి. 1

క. సత్తెనపలి హనుమద్బుధు, పొత్తున దేశాభివృద్ధి పొసఁగుట కనువౌ
పొత్తములం జూచుచు నా, చిత్తమున కొకింత వెలుఁగు చేర్చుచునుంటిన్. 2

గీ. వచ్చెనొక పర్వమపుడు; మావాడవారు, తరలి రెందఱొ కడలిని దానమాడ
నటకు నామడదవ్వున నబ్ధి కలదు, పరఁగుఁ దత్తీరమున నిజామ్ పట్టణంబు. 3

క. ఆవేళ నిజామ్పట్నపు, రేవునఁ బదివేలమంది స్త్రీలుం బురుషుల్
ప్రోవై నవనవకౌతుక, సేవధులై మజ్జనమ్ము చేసిరి వార్ధిన్. 4

గీ. వారియం దేను నొకఁడనై మీఱిమీఱి, లోనికేగుచు నలలు రా లోఁకువగుచు
నీశ్వరమహత్త్వ కొక చిహ్న మీసముద్ర, మనుకొనుచు బ్రుంగినాఁడ నీరాకరమున. 5

గీ. లేచి యణఁగెడి తరఁగను జూచినపుడు, స్మృతిపథమ్మున మెఱసె సంసృతిసుఖమ్ము
"వనధివంటిది సంసార" మనిన పెద్ద, లెంతనేర్చి రహో ! యని వింతపడితి. 6

ఆ. అలపు వచ్చుదనుక నవగాహ మొనరించి, గట్టు, నా(శయించి బట్ట మార్చి
యుప్పుంగాల్వమీంది తెప్పపై గూర్చుండి, తిరుగు మొగముపట్టితిని బిఱాన. 7

ఆ. సాగి సాగి తెప్ప యాంగ నేలకు డిగ్గి, తోడుతోన కదలినాండం గాని
నడుచుశక్తి కలదె నా కష్టు వఱువట్టు, గొనుచు నుదిలపడుచుం గుక్షి యుండ. 8

ఆ. సంచినున్న రొట్టె చాలునా గొదచిచ్చు, నార్చి మేని కింత యల వొసంగ
నబ్ధి మున్గి నతని కాంకలి రేకెత్తు, ననుట తెల్లమాయె నపుడు నాకు. 9

క. చిట్టడవిం జని చని యొక, కొట్టిక గనుంగొంటి నదియ గోకర్ణమఠం;
బుట్టంకిత మా పీఠం, బిట్టలముగ శైవ మిమ్మహిన్ దనరుతతిన్. 10

క. గోకర్ణేశ్వర భవన, (ప్రాకారముం గడచి మండపముదరి బిల్వా
నోకహము నీడ నిల్చితి, శ్రీకంఠస్మరణసరణిం జిక్కిన యెడందన్. 11

క. కోవెల(క్రేవుల వెలసిన, శైవసమాధులను గాంచి సంతతమత సం
సేవాత్యక్త శరీరుల, పావనజీవనము దలంచి పడసితి సొలపున్. 12

గీ. ఎట్టి కీడుకొలమ్మునం బుట్టుంగాక, నరుండు శివభక్తి మరగిననాండు పూజ్యుం
డతనిదెస జాతికుల చర్చ లనుచితమ్ము, లనిన శైవగురు(శ్రేణి ఘనత గంటి. 13

క. జాతివినాశమ్మునకున్, హేతువు కుల మన్నసత్య మెఱింగినమత ము
ద్ధాతాఘ మమోఘం బవ, ధాతవ్యము భవ్య మనుంచు దలంచితిని మదిన్. 14

మధ్యాక్కర

పండినతమముమై మల్లికార్జునపండితారాధ్యు
నిండినకొల్వునం దెగడి తుద కమ్మనీషినే(త్రములు
రెండు దోడించిన చందవోల్ నృపు రిమ్మ నూహించి
గుండియ తుకతుక నుడుక మిగుల గగ్గోలుపాలైతి. 15

క. వాచంయమత్వమునం బర,మాచార్యుండు మల్లికార్జునార్యుండు గోక
ర్ణాచలజామాతకృపన్, లోచనములు పడయు టాత్మలోం గనుంగొంటిన్. 16

ఆ. ఏది యేది కన్న నేమి ? యాంకటిమంట, నణంచుదారి గాననైతి నపుడు;
(ప్రొద్దు నెత్తిమీంద నుద్దండుండై నిల్వ ,శాంతి యె ట్లటన్న చింతంబడితి. 17

క. టెంకాయ లభించినచో, సంకట మొకకొంత యైన సమయు నని మదిన్
శంకరుం బాయక కోమటి, వంకకు సాగితిని వేగ వాసిన నడకన్. 18

గీ. ఎన్నితావుల కేగిన నెంత పడినఁ, గానిపింపద కొబ్బెరకాయ నాఁడు
వేఁడివేఁడి నిట్టూర్పులు వెడలుచుండ, మరలినాఁడఁ బదంపడి మరము దెసకు. 19

గీ. అప్పటికి నన్నుఁ బట్టినయట్టి శని తొ, లంగెఁ గాఁబోలు నొక నవలా యి టేల
వచ్చితోయయ్య ! యేమిట్లు వాడితనుచు, నెదురుపడికూర్మి పేర్మియునెసఁగ బల్కె. 20

క. ఈపె యెవర్తుక ? నన్ను క్షు, ధాపన్నుం బలుకరించు; దైవము తోడ్రై
చూపట్టెనె యీచుట్టం, బీపల్లియ నీ వనాన నీ మార్మ్మలన్. 21

క. "పెట్టినదినములలోపల, నట్టడవుల కైన వచ్చు నానార్థము"ల
న్నట్టికవి యెంత నేర్చిన, దిట్టఁడొ యని యేను మగువదెస క్రమమునన్ - 22

మధ్యాక్కర

కనులు సారించుచుండ మదవస్థ గాంచి యవ్వెలఁది
నను బాబయా ! మఱచితివె కావూరె నా పుట్టినిల్లు
మునిగాఁడు మీ పనులందు నే ప్రొద్దు మునిఁగి వేసరుచు
మనుగడ సాగించువాఁడు నా తండ్రి, మాచి నా తల్లి ! 23

మధ్యాక్కర

అత్తవారి ల్లిది; యే నిటకు వచ్చి యైదేఁడు లాయె
బొత్తిగా నన్ను గుర్తింపవైతివి; ప్రోగులు చిమ్ము
తత్తఱలో నున్న నిన్ను నల్లతేల్ తతిమి కుట్టంగ
నత్త లేటెడినేను నీ కొక పసరునన్ శాంతినిడితి. 24

క. ఈకథ గుర్తున్నదె యన, నోకిచ్చీ ! నీవఁటే ! యహో ! సుఖముగ నుం
టే ? కూడునకున్ గుడ్డకు, నేకొఱఁతయు లేదుగద ! సరే ! యనినాఁడన్. 25

మధ్యాక్కర

అపు డాకె నాకథ నెల్ల నడిగి న న్నలయించు బాధ
నపనయింపఁ దలంచి పూఁటకూళ్ళమ్మ నర్థింప నాపె
విపరీతముగఁ బల్కె; నంతఁ గిచ్చమ్మ విడువక పట్టు
నుపమరి యై నాకు నొకసవర్ణుని యునికిని జూపి- 26

మధ్యాక్కర

ఈ యింటివారి నొప్పించుదాన; నీ విచట భోజనము
సేయుము నా నింతపన్ను గద యేల చెల్లెలా ! నీవ

నీయింట వండి వడ్డింపుము తినెద నిండువేడుకను
నాయుల్ల మిట్టిభేదములు మన్నించునది కాద యంటి. 27

క. ఆ మాదిగమగువ దొరా !, యే మిది ధర్మువును జెఱుతువే యని కంపం
బాముకొనఁ బల్కెఁ ధర్మము, నేమఱక వచింతు నంటి నే నయ్యమకున్. 28

క. ఎదురాడలేక కిచ్చమ, మది సవరించుకొని శౌచమంజుల యగుచున్
హృదయేశుఁడు తోడుపడన్, గుదిరినలీయమునఁ గూడుగూరలు తీర్చెన్. 29

క. అది మాఘమాస మగుటన్, గుదిగొని దడిమీఁద గుత్తుగుత్తులుగా నిం
పొదవించెడి పెనుమటికలఁ, బద నెటిఁగి రుచుల్ పొసంగుపగిదిని వండెన్. 30

ఆ. పేరునేయి ముంతపెరుఁగు చిక్కుడుగాయ, కూర యెల్లిగడ్డకార; - మింక
నేమి వలయుఁ దిండి ? కీసర్వమును మించు, నాదరమ్ముసైత మమరియుండ. 31

గీ. అపుడు మాతంగదంపతి కగ్గపడిన, తృప్తి యేమాత్ర నుండెనో యెఱుఁగఁ గాని
యేను గుడిచినతనుపున కెల్ల లేద, మఱవరానిదినం బది మనువునందు. 32

గీ. గాంధి నెఱుఁగను గాని తత్కాలమునకుఁ, గందుకూరి వీరేశలింగమును గందు
సంఘమునఁ గలక్రుళ్లను జక్కఁ గదుగ, నితఁడు సైఁచినవెతలు విస్మృతికి రావు. 33

క. ఇంటికిఁ జని కులభూతము, గెంటితి నని యేను దంద్రికిన్ గథ చెప్పన్
వింటివికదర ! శబరి ముని, పంటఁ గొఱికి యిడినపండ్లు ప్రభుఁ దాను టనెన్. 34

2-7-67

## తప్పెటబ్బాయి

ఆ. గాంధి యెపుడు నిల్చెఁ గాంగ్రెసునేతగాఁ, గన్ను దెఱచె నపుడె గ్రామసీమ
యేను గార్యదర్శి నైనాఁడఁ గాంగ్రెసు, సంఘమునకు నాఁడు జనపదాన. 1

(1920 ఆగష్టు)

క. శాసనసభా ప్రవేశం, బాసింపఁగరానిచేఁత యనియె మహాత్ముం
డాసేతుశీతశైలం, బీసందేశమును మెచ్చె నేలిక లదరన్. 2

గీ. పార్వతీశము శిష్టాన్వవాయమౌళి, తన వకీల్పని మాని నిస్తంద్రదీక్షఁ
గర్తపురమండలమ్మునఁ గాంగ్రెసునకు, బలముగూర్చుచు వచ్చె మా పల్లియకును. 3

నేబీలుకాయకు నెచ్చెలి యగు పెత్త, నము నిద్ద తెలవారినాటకమ్ము
హిందువుల్ ముస్లిము లితరేతరప్రేమ, కోరినప్పుడు సమకూరులగ్గ

గీ. లతఁడు వివరింప నావేశ మడరి యేను, వాని మెచ్చుచు సభ నాల్గువాక్కు లనుడుఁ
బార్వతీశ మెలర్చి నా పజ్జ నీవు, నుండవలయు నోయీ ! యని యొప్పఁ బలికె. 4

క. కా దనఁ జాలక యే నపు, డై దార్వల్లెలకుఁ జనితి నాతనితోడన్
పోఁదోలుఁడు బానిస మని, బోధించితి సభల గద్యమునఁ బద్యమునన్. 5

(చూ. మహాత్మకథ 31వ పారట)

గీ. ఎన్నికలు వచ్చె సమ్మతి నిడినవారు, పదురొ పన్నిద్దఱో కనంబడిరి నూట
నుత్తపెట్టెలఁ బంపె మాయూరు నాఁడు, బసవయాదులు పట్టినపట్టుకతన. 6

(30-11-1920)

ఆ. అఖిలభారతమ్మునందు స్వాధీనతా, దీక్ష పెరిఁగె గాంధి దేవుఁ డాయె
నవయుగమ్ము వచ్చె ననసె సాహాయ్య ని, రాకరణము నెత్తురాని రణము 7

ఆ. దొరతనమ్మువారు తోఁకత్రొక్కిన త్రాఁచు, లైరి ప్రజల ధీరతాదు లరసి
ముందు పెద్దవారి బందాలఁ జేసిరి, చిట్టివాంధ్ర నవలఁ బట్టుకొనిరి. 8

ఆ. సాగినది సమష్టి శాసనోల్లంఘన, మపుడు ఘూర్జరమున నాంధ్రముననను
శిస్తు నీ మటంచు సేద్యగాం డ్రెదిరించి, రేలువారి నెంతకేఁ దెగించి (1922) 9

మధ్యాక్కర

చదురైన పర్వతనేని వీరయ్య సర్దారు కాఁగ
బెదనందిపాడు కేంద్రముగ నాంధ్రుల పెనఁకువ సాగె
మదరాసుదొరలకే కాదు లండనుమన్నీ లకేని
బెదరు పుట్టించె నప్పోరు తెలరాచపీఁట నుఱ్ఱూఁపి. 10

గీ. ఆరణమ్మున నొకబంటనైన యేను, వలదు సర్కారుపన్ను లీవల దటంచుఁ
బగటుసేయంగఁ బూని మాదిగను బిల్వ, నాతఁ డేకీడు మూఁడునో యని తలంకె. 11

గీ. ఏను వాని నప్పు డించుకసొమ్ముతోఁ, దనిపి వడసినాఁడఁ దమ్మటంబు
చంకఁ దాల్చి దానిఁ జఱచి వాయించుచుఁ, జాటినాఁడ శిస్తు సమ్మె నూర. 12

మధ్యాక్కర
తప్పెట ప్రయోగించువాని ననుఁ బ్రభుత్వమువా రొసంగు
నుప్పుతోఁ బులుసుతో మను నధికారి యొకఁడు రప్పించి
తప్పుదారికి వచ్చి తీవు మరలుము తగ దిట్టిచేఁత
యొప్పమి నేల వరింతు వాలింపు మోయి! నా మాట. 13

చదువుకొంటి వనియుఁ జక్కని కైతలో, నేర్పుగంటి వనియు నిన్ను మిగుల
గారవింతు నేను గాంగ్రెసుదెస కేగ, వలదు వలదు పిన్నవాఁడ వీవు. 14

*(ఈయన నా సాహితీ వికాసమునకు సాయపడిన భువనగిరి కోదండపాణి (చెఱుకుపల్లి సబ్ రిజిస్ట్రారు) గారి సోదరుఁడు రివిన్యూ ఇన్‌స్పెక్టరు. కవి ముకుంద రామయ్యగారు.)*

క. అని పేర్మిఁ బల్కఁ గాంగ్రెసు, పని యిది నే విడువనొల్లఁ; బాపంబులకున్
గని యీ యేల్బడి; నానుడి, విని మీరున్ దీనికొల్పు విడువుఁడ ! యంటిన్. 15

గీ. ఆంధ్రపత్రిక కీవార్త నప్పుడపుడ, పంపినాఁడ; నుద్యోగియు జంపుసేయ
కెఱుక చేసెను నాచంద మేలువారి, కేను దప్పెట వాయింపు మాననైతి. 16

క. పూఁట కొకయూరికిం జని, చాటించితిఁ బన్ను కట్టఁ జన దను వార్తన్
పాటింపుఁడీ మహాత్ముని, మాట నిదే దేశదాస్యమారక మనితిన్. 17

గీ. వచ్చుచున్నాఁడు "తప్పెటబ్బాయి"యనుచు, నాఁడు పల్కిరి బాలకుల్ నన్నుఁజూచి
యెన్నిబిరుదమ్ము లబ్బిననేమి నాకు, నదియ మధురమ్ముగా నేఁటికైనఁ దోఁచు. 18

మధ్యా. ఇది సరే! కథకు వచ్చెదను గుంటూరి నేలు కలెక్ట,
రదయుండు రూథరుఫర్డు నన్ బిల్వనంపి యవ్వేళ
నదలించి నీవు క్షమాపణంబు సేయవలయు ననుదు,
నది చేయఁగారానిచేఁత యగు నస్మదాదుల కంటి. 19

ఆ. అంత నాఁత దల్గి యార్థికమైన శి, క్షను విధించె నాకుఁ జందవోలఁ
జాఁగు ! చాఁ! గటంచు సాగితిఁ గావూరి, కందుకొంటి మగుడ గాంధిపనులు. 20

7-9-72

## కూలివలదు

క. చెఱ నున్నమహాత్ముఁడు జా, రరమగు రోగమున నుత్కటవ్యథఁజిక్కన్
దొరతనమువారు సేయిం, చిరి శస్త్ర చికిత్స శాస్త్రి చెంగట నిలువన్. (శ్రీనివాసశాస్త్రి) 1

ఆ. గాంధి కీచికిత్సకతన రుజాపీడ, తొలఁగెఁ గాని హెచ్చె దుర్బలత్వ
మస్థిపంజరమ్మునటు లున్నయయ్యను, జూచి బెగ్గడిలిరి రాచవారు. 2

క. రేపెట్లు మాఱునో యని, బాపును బందాను విడిచి ప్రజకుం బ్రమదం
బాపాదించిరి; బొంబయి, దాపునకున్ దరలె గాంధి దార్ఢ్యము వదయన్. 3

గీ. అమ్మహాత్ముని యారోగ్య మాసచేసి, యన్నదానమ్ము సేయ దేవాలయముల
నర్చనలొనర్పనుద్యుక్తమయ్యె నెల్ల, పల్లియల పట్టణమ్ములపాలి జనము. (1924లో)4

గీ. అఖిలభారతభూమి కానాఁడు క్రొత్త, వెలుఁగు లేర్పడె దాస్య విచ్ఛిత్తి కొఱకు
సరిలేని యిడుమలు సైంచు కాంగ్రెసున, కావహిల్లె నపూర్వమైన చైతన్య

మం. మెల్ల రాష్ట్రమ్ముల నెల్లజిల్లాల, నెల్లతాలూకాల నెసఁగె నిర్మాణ
కార్యక్రమాసక్తిఁ గాంగ్రెసు సభలు, 'కనగాల'నాఁ బేరుగన్న గ్రామమున
వెలసెను గిరిరావు వేంకటేశ్వరులు, మున్నగు పిన్నలు మోపరు లగుచు
నాంధ్రరత్నము కృష్ణుఁ డధ్యక్షుఁ డగుచుఁ, దనర మా 'రేపల్లె' తాలుకా సదసు
పరిషత్పతిన్ మెచ్చుపద్యముల్ వ్రాయుఁ, దని కార్యకర్త న న్నర్థించె నొకఁడు
నాకునుం బ్రేష్ఠమైనది యొాటఁ జేసి, వ్రాసితి నీకైత వాగ్దేవికరుణఁ
గావూరినుండి మాకాణాచినుండి, దీని నచ్చొత్తింపఁ దెన్నాలి కేగి
వచ్చుచుం బొగబండివలనను భట్టి, బ్రోలిలో దిగి యెండపోటు లెక్కింప
కరుగుచుంటి సమజ్యా కావేశపడుచు, దారిలోనొక్కండు దంభపుంబ్రోవు
నాటువేసము వాని నను నిల్వరించి, యేమోయి! రెండణా లిత్తు నీ పెట్టె
కనగాలవఱకుఁ దేగలవె యం చనుడు, నణఁకువమైఁ 'జిత్త' మన్నాఁడ నేను
నాగరికునిమోపు నాతల కెక్కె, నీవ్రేఁగు నావ్రేఁగు నెట్టిటో యోర్చి
గమ్యంబు చేరితిఁ గ్రన్న నతండు, కూలిడ బ్బిదె తీసికొమ్మని పల్క
వలదు బాబూ ! కూలి వలదు మీకంటెఁ. బిన్నవాఁడను నేను బెద్దలసేవ
సేఁత కర్తముకదా చిఱుతల కెపుడు, నామడల్ మోసితినా మందసమ్ము
కరఁగినవా నాదుకండ లీమాత్ర. కని యల్లనల్లన యతని వారించి
సభ కేగుదెంచితి - సమయమ్ము చూచి (పోయితిని), నా సంతరించిన
నవపద్యములను
గోపాలకృష్ణుని గొనియాడి సభ్య, తతిమెప్పు గంటి నధ్వర్యు వొసంగు
దీవనల్ పడసితి దేశవికాస, కృత్యసంగములతో నెరవాదయోగి
నలరింపఁగల నిర్ణయములతో సభ స, మాప్త మయ్యెను మదీయశిరమ్మునందుఁ
దనపెట్టె పెట్టినతండు నాకడకు, విన్నని మొగముతో విచ్చినసిగ్గు
బరువుతో నత్తఱిఁ బఱతెంచి జడుని, నన్ను మన్నింపు మన్నా ! భవచ్చరిత
నాకు నేఁ డొజ్జయై నయనమ్ము దెఱచె, ననుచు నిరంతరమై జాఱునశ్రు
జలముతో నన్నుఁ గ్రచ్చుఱఁ గౌఁగిలించు, కొని వెక్కసాగె మద్గురుల నే నెదఁదఁ
గని చొక్కసాగితి గగురుపా టొదవ. 22-1-72

# జాతీయ విద్యాసేవ

ఆ. కదలెఁ గాకినాడ కాంగ్రెసునకు నవా, వేశమునఁ దెనుంగుదేశమెల్ల (1923 డి.)
నగు నటంచు బసవయాదులు నేను గా, వూరినుండి వెడలినార మపుడు. 1

ఆ. సకలభారతప్రశంసలు గన్న ప,టేలు గాసు మోతిలాలు వంటి
దంటలెల్ల రాసదానఁ దోఁచిరి చెఱ, నున్నగురుఁడు గాంధి యొకఁడు తక్క. 2

ఆ. అద్రివలె మహమ్మదాలి కూర్చుండె మ, హాసభాధిపత్య మవధరించి
యాంధ్రనేత వేంకటప్పార్యుఁ డాహ్వాన, సంఘమౌళి యగుచు సభను నిల్పె. 3

క. శాసనసభలం దీఁగుట, కీసభవా రియ్యచేసి రిది బాపున కు
ల్లాసము గూర్పని దైనను, వేసారినదేశ మిట్టివిధి కౌ ననియెన్. 4

క. హిందీ ప్రసంగములు సద, మం దెక్కువగా ధ్వనించె నవి యర్థముగా
మిం ద్రపకుం జిక్కితి మే, మందఱ; మల్లల్ల సభ సమాప్తంబాయెన్. 5

మధ్యా. ఇన్నాళ్ళనుండి మహాత్ముఁ దూరూర హిందీని నేర్వుఁ
దన్నలారా! యని యెంతయఱచిన నశ్రద్ధచేసి
కన్నార మిపుడు తత్ఫల మని మిగులఁ గలఁగుచుఁజేరు
కొన్నార మూరు తద్భాష సాధించుకొఱ కాత్రపడుచు. 6

గీ. అంతఁ దడవుసేయక యొజ్జ నానయించి, నేర్చితిమి రాష్ట్ర భాష మూన్నెలలపాటు
దినదినంబునుత్సాహమ్ము తీవరింపఁ, జదివితిమి మూఁడునాల్గువాచకము లందు. 7

గీ. అపుడు జాతీయవిద్యాలయంబు లచట, నచటఁ దలయెత్తెఁ గాంగ్రెసునంగములుగ
బానిసపుఁద్రాడు తెంచుట పరమధర్మ, మనెడిపాఠమ్ము లెగసి విద్యార్థు లలర. 8

గీ. మాతృభూమిస్వతంత్రత మట్టు పెట్టు, ఖలుల నెదిరించి ప్రాణంబు గడ్డిపరక
యట్లు సూచిన వీరసింహములకథలు, మ్రోసె జాతీయవిద్యా నివాసములను. 9

గీ. దేశభాషకుఁ దోడు హిందీని గఱపి, వడుకుటయు నేయుటయు నేర్పి వడ్లతీరు
మప్పి జాతీయభారతీమందిరమ్ము, లెసఁగె నేలువారలకుఁ గన్నెఱ్ఱ గాఁగ. 10

గీ. వల్లభుఁడు చిత్తరంజనుఁ దల్లనాఁడు, కూర్చి నడిపిన జాతీయగురుకులమ్ము
లపర విశ్వవిద్యానిలయమ్ము లగుచు, వెఱ పెఱుంగనిబంట్ల నుర్వికి నొసంగె. 11

మధ్యా.ఆనాఁడు మేము జాతీయవిద్యాలయం బూర నున్న,
నానావికాసముల్ పడయ నది సాధనం బగు నంచు
మానసించి తిలక్కు పేర నల లోకమాన్యునిపేర,
ధీనిధిపేరఁ గాపూర నెలకొల్పితిమి దాని నర్థి. 12

క. ఏ నొకనూటపదాఱులు, కానుకగా నిడితి బడికిఁ గలవా రెకరాల్
దానమొనర్చిరి ప్రజ లౌ, నౌ నని కొనియాడ బసవయాదులు హాలికుల్. 13

గీ. నాఁటికే కొంత సాహితీపాటవమ్ము, కలదు కైగట్టునలవాటు కలదు నాకు
కృతులు నాల్గైదు వ్రాసితి రెండు మూఁడు, వెలువరించితి వాగ్దేవిచలువకతన. 14

ఆ. పాఠశాల నేలు బసవయ్య ననుఁ గ్రొత్త, బడికిఁ బిల్చెఁ దెనుఁగుబాస నేర్ప
నేను సన్నకారుకృషికుఁడఁ గాన నా, కమత మెట్లు సాగఁగల దటంటి. 15

ఆ. జీతగానితోడ సేద్యము సేయింపు; బడి భరించు నతనిపాలికర్చు,
ననుడు నెదురుసెప్ప నల్కి యొజ్జనమున, కియ్యకొంటి మేఁడికొయ్య విడిచి. 16

గీ. నాకు ముట్టెడు పదునాఱురూక లపుడు, పొలము దున్ను లెంకకు సరిపోయెఁగాని
చిత్త మొల్లనిపని యయ్యె విత్తమునకు, బాస గఱపుట జాతీయపాఠశాల. 17

గీ. కావుటంజేసి కాంగ్రెసుఖదరు తెచ్చి, నెత్తి నిడుకొని గాంధేయనిష్ఠ యున్న
పల్లెపట్టుల నమ్మితి నెల్లలేని, నెమ్మి నందుచు సెలవుదినమ్ములందు. 18

క. రూకకు నొకవీసముగా, నా కబ్బెడిరుసు మొసంగినాఁడను బడి; కీ
పోకడ నాయెడఁదం గల, వ్రేఁకనలో మూఁడుపాళ్ళు విడివడఁజేసెన్. 19

క. దీపావళి వచ్చిన నా, యాపల్లెల కరిగి సాయ మడిగితి బడికిన్
రూపాయలు పదిపదు లీ, రూపునఁ జేపడియె నాబరువు పరువెత్తన్. 20

క. యాచన యిది బడి కగుటన్, జాఁచితి హస్తంబు నప్రసన్నులతెఱఁగున్
సైఁచితి నొచితి నెఱుఁగని, నీచులకటువాక్యముల గణింప కరిగితిన్. 21

ఆ. కవి నటన్నపేరు కాసంత యానాఁడె, నాకుఁగలదు కాన నన్ను మిగుల
నాదరించి రీప్రయాణమ్ముల నుదార, మతులు సాహితీప్రమాణవిదులు. 22

క. నా సంబళమున కెన యగు, కాసును బడి కిట్టు లిడుచు గ్రామమునందున్
నే సిరమెత్తి చరించుచుఁ, జేసితి జాతీయవాణిసేవ నలరుచున్. 23

గీ. ఒజ్జలకుఁ దలకట్టుగా నున్నవాని, రామచంద్రు నిటన్ మెత్తు నీమనీషి
నన్నుఁ బెద్దయు దిద్దె నావన్నె వాసి, తనవిగా నెంచె శౌచసుందరత మెఱసె. 24

4-8-71

# అవధానకళ

గీ. ఆశుకవి చక్రవర్తులై యాంధ్రభూమి, నల్గడ యశఃపతాకలు నాటినట్టి
కొప్పరపుసోదరుల్ తమ గొప్పతనము, పగటి రొకసారి మజ్జనపదము నందు. 1

క. సరసుండు కావూర్యన్వయ, నరసార్యుండు వారికిన్ వినమ్రత మెఱయన్
నెఱవిందు లిడుచు నది తన, పురాసుకృతఫల మటంచుఁ బొంగుచునుండన్ -2

గీ. కాఁపులున్గరణమ్ములున్ గలసి ధర్మ, వెతిఁగి విత్తమ్ము సమకూర్చి యిరుగుపొరుగు
పల్లియల నుండుకవులను బండితులను, బెద్దలను బిల్చి సభ కూర్చి రుద్దవిడిని. 3

ఆ. శ్రీసుభద్రపెండ్లి చిన్నారిపొన్నారి, పలుకుతో రవంత నిలుపు లేని
ధారతో సదస్యు లౌర మేల్ మే లని, పొగడఁగాఁ గవీంద్రయుగము నుడివె. 4

క. ఆనాఁడ వింటిఁ జొక్కుచు, నే నాశుకవిత్వ మింతహేవాకం బె
ట్లానమ్రమయ్యె వీరికి, వాణీకృప యింత యెట్లువచ్చె నటంచున్. 5

ఆ. మేటివలువ లిచ్చి నూటపదాఱు లొ, సంగి యూరివారు సత్కరించి
రాశుకవనవీరు లైనట్టి సుబ్బరా, ద్రమణకవుల భక్తిరమ్యు లగుచు. 28-6-1925 6

క. అవ్వలఁ గొప్రపువారల, నెవ్వడి నగ్గించెఁ గవి మనీషి నికాయం
బొవ్వనియంబేద యొకఁడు, అవ్వకు దిగె సంధి యొందు రారా దనుచున్. 7

క. మునులొద్ద ననుట దోసం, బనె నీతఁడు రాజులొద్ద నని నన్నయ ప
ల్కెనయా ! కూర్చుండు మిఁకన్, సణుగకు మని యేను నాల్గు సఱచితి వానిన్. 8

ఆ. కొప్పరంపువార లప్పుడు కరఁగి నన్, బెద్దమెచ్చి రైదుపద్దెములను
దక్కఁగలవు నీ కుదాత్తసమ్మానము, లెక్కఁగలవు చరిత నీ వటనిరి. 9

గీ. వారి కఱఁకువ చాటి జోహారు వొసఁగి, మూరిఁబోయెదు నుత్సాహమునకులోఁగి
నా యలంతితనమ్ము గానక నుతించి, నాఁడ నిట్లు కవీంద్రులనాణియంబు. 10

ఉ. శ్రీశివ సత్కృపాగరిమచే సుకవీశబుధేశు లౌననన్
దేశములన్నిటన్ దిరిగి దిగ్విజయంబుగడించి దుర్మతా
వేశులఁ గింకవీశులను విక్రమలీల నడంచినట్టి మా
యాశుకవీంద్రసింహముల కంజలిపట్టి నమస్కరించెదన్. 11

శా. మా కావూరికి నేగుదెంచి కదుసామర్థ్యంబుతోడన్ సుధ
ద్రాకల్యాణము నాశుధోరణి రసోత్కర్షమ్ముఁగాఁ జెప్పి య
స్తోకానందము గూర్చినారు కవిరాజుల్ వీరు సభ్యాళికిన్
శ్రీకాంతుం దనయమ్ము వీరి మనుచున్ శ్రేయమ్ములం గూర్చుచున్. 12

చ. గడియకు నూఱుపద్దెములఁ గల్పనచేసెను భట్టుమూర్తి యం
చెడఁదల నబ్బురంబు గననేటికిఁ గొప్పరపుంగవీశ్వరుల్
తొడిఁబడ కొంచిలీగతికి దూరముగాని పదాళిఁ గూర్చుచున్
గడియకు రెండువందల నఖండముగా వెడలించుచుండఁగన్. 13

ఉ. వేయి వచింపనేల పృథివీస్థలి నాశుకవిత్వసత్క ళా
ధ్యేయులు నేఁడు లేరని మదిం దలపోసి కొఱంతదీర్ప వా
గ్నాయకుఁ డెంచి కొప్పర మనన్ దగువీట సృజించె నౌర! సు
బ్రాయకవిప్రభున్ రమణరాయని వేంకటశబ్దపూర్వులన్. 14

సీ. సంస్కృతాంధ్రములందు సర్వతోముఖమైన, పాండితీసంపత్తి పడయఁ జాలి
యఖిలరాజాధిరా జాస్థానములయందు, వివిధావధాన వైభవము చాటి
శరవేగమునఁ బంచశతపద్యరత్నముల్, గంటలోన వచించి గణుతి కెక్కి
ఘనకవీంద్రులనెల్లఁ గదిసి హోరాటమైఁ దూలించి విజయదుందుభిని గొట్టి

గీ. యాశుకవిలోక చక్రవర్త్యాది సుప్ర, సిద్ధబిరుదాళితో విరాజిల్లుచున్న
మీకు సరివార లెవ్వారు వాకొనంగ, క్షితిని గొప్పరపుంగవిశ్రేష్ఠులార ! 15

సీ. తిక్కనార్యుఁడు పోయె దివి కంచుఁ దలవంచి,కందోయి నశ్రువుల్ కార్పనేల
కవిసార్వభౌముఁ డక్కట ! మహానటుఁ గూడె,నిం కేమిగతి యంచు నేడ్వనేల
పూతభాగవతప్రణేత పోతన రమా,నేతఁ జేరె నటంచు నెగు లదేల
ఘనుఁ డల్లసానిపెద్దనకవీంద్రుఁడు లేఁడు,నేఁ డిఁకేదిక్కంచు గోడదేల

గీ. తల్లి ! వారలులేనిలోటెల్లఁ దీర్చి, పొంకముగ నూత్నగతి ని న్నలంకరింపఁ
బ్రథితకొప్పరపుం గవీశ్వరులు లేరె, సకలగుణపేటి ! యాంధ్రభాషావధూటి !16

క. ఈ పద్యములన్ విని కవు, లాపోకం బడసి రస్మదభ్యుదయముపైఁ
జూ పిడి రవధానాదులు, రేపల్లెధరిత్రి నాచరించిరి పెక్కుల్. 17

ఆ. చెఱకుపల్లియందుఁ జేసి రష్టావధా,నమ్ము పూఁడివాడ నాఁ దనర్చు
గ్రామమందు నాశుకవితఁ జెప్పిరి శత్రు, తతియు మోఁకతించి నుతులొనర్ప. 18

క. ఏ నీసభలం జూచుచు, నానామర్మంబు లెఱింగినాండను గవితన్
బూనితి నాశువునం దవ, ధానమునం దగినచతురతన్ గడియింపన్. 19

ఆ. గర్తపురమునందుఁ గల కమ్మవిద్యార్థి, భవనమున నుగాదిపండువునను
జెలిమికాండ్రుకోరఁజేసితి మొదటి య,ష్టావధాన మీశ్వరానుకంప. (1926. అక్షయ)20

గీ. చిట్టిగూడూరఁ గోవిదపట్టభద్రు, లద్దిరా! యనఁ దొలుతొ ల్త నాశుకవిత
చెప్పితిని వెన్క నీరెంటి నప్పుడపుడు, పగటితిని సుహృత్తృప్తికై బడలుపడక 21

క. అవధానకార్య మిపు డె, ట్లవునో సెప్పంగఁజాల నాశుకవిత యే
యవరోధమ్మును గానక, నవనవమై వెడలు నందు నమ్రత మీఱన్. 22

22-5-72

# విధి నిర్వహణము

ఆ. ఆస్తిలేనిబడుగు హనుమయ్య యొకదాత, యిచ్చినట్టి పూరియింట నిల్చు
మొక్కవోని తెల్గుముక్కలు లెక్కలు, నేర్పి కాఁపురమ్ము దీర్చు నితఁడు. 1

క. పిల్లలకుఁ జదువు సెప్పును, పల్లీహాలికులకు వలయుపత్రాల్ వ్రాయున్
వల్లె యను నెంతయిచ్చిన, నెల్లర నలరించు నీతి నితఁడు వినీతిన్. 2

క. క్రాయకులకు విక్రేతల, కీయనయి లైపుడు గమ్య; మిం దుండు నహో !
రేయుం బవ లన్యులసిరి, వేయుం బదివేలు నాక వెగ్గల మగుచున్. 3

క. మాయింటికి నీయి ల్లెదు, రై యుండును గానఁ దెఱపి యబ్బినతఱి నే
దాయుదు నిచటికిఁ దగువా, రీయెడఁ గావించుచర్చ లిష్టములగుటన్. 4

గీ. ఇతరు లెవ్వరు లేకున్న నేమి యిచట, నొక్క హనుమయ్య యున్న నా కుత్సవంబె
కలదు నా కాదినంబులఁ బొడుముపిచ్చి, యుండుఁ జేఁబ్రోలినస్య మీ యొజ్జచెంత. 5

ఆ. కంటినొక్కనాఁడు కళదప్పి పీనుంగు, నట్లు పండియున్న హనుమయాఖ్యు
నిట్లు కూలఁబడితి వేమయా ! నిను జూచి, యేఁగుచున్న బాధ యేది ? యంటి. 6

గీ. తమ్ముఁడా ! కొంపమునిఁగెరా ! తాతగారి, యంకు లునిచినక్రయధన మైదువేలు
పోయెరా ! పెట్టెతాళము పొల్లువోదు, నగదు కన్పింప దే నెందు డిగెద నింకను. 7

క. పది గాదు వంద గా దిం, తధనమ్ము నొసంగు టెట్లు ? దైవ మిసీ ! యా
పద యిట్టిది కూర్చునె ! నా, బ్రదుకునఁ జరమక్షణమ్ము పాటిల్లె నయో ! 8

ఆ. ఆర్తిమూర్తి యగుచు హనుమార్యుఁ డప్పు డీ, పగిదిఁ బల్క నేను నగుమొగమ్ము
మెఱసి దీలుపడకుమీ వెత్తిబాఁపఁడా ! కలదు నీ ధనమ్ము కలదు కలదు. 9

మధ్యా. ఈనాఁటిరేపు పొడుముకొఱ కిటకే నేతెంచి నీవు,
కానిపింపమి విన్న ఁబడుచుఁ దిరుగుమొగముపట్టి యరుఁగు
పైనున్న చాఁప నొండుకడనుబ్బు కన్పడ నిదే మనుచు,
దాని నించుక యెత్త విత్తమియ్యది దర్శనమిచ్చె. 10

గీ. ఇంటికిం దాళమును బిగియించి పోయి, తెపుడు వచ్చెదవో కథ యిది సమస్త
మపుడు నీచెవికిం దేర నభిలషించి, యన్నయా ! తటికై వార్చుచున్నవాఁడ. 11

ఆ. తగునె యింతమఱపు ? ధనమును బ్రాణమ్ము, కరణిఁ జూడవలదె ? నరులయందు
లేరె పెక్కు తెగలవా ? రన హనుమయ్య, కరము వెల్లఁబాఱి శిరమువంచె. 12

8-6-67

# దేవయ్య

గీ. మజ్జనని చెంచమాంబ రామయ్యసేవ, కాయితంపడ భద్రాద్రి కామెవెంటఁ
గదలితిని నేను, గోపన్న కథలు కైత, లుద్దవిడిరేఁగి యెదఁదలో సద్దుసేయ. 1

ఆ. రైలునుండి యెఱ్ఱపాలెమునం దిగి, యద్దెబండి నెక్కి యరిగి యరిగి
తిండివేళయగుడుఁ దిరువూరి చూతవ, నమ్మునందు నాఁగినార మేము. 2

మం. అపుడు మాబండికి నతిసమీపమున, విడిచిన బండిలో వృద్ధ యొకర్త
కన్పించె, నొకయువ కన్పించె, నతఁడు, శ్రీరామచంద్రు నర్చింప నువ్విళ్ళు

గొనుతల్లితోవచ్చు కుఱ్ఱవాఁ డగుట, నా యీడువాఁడౌట నాకు నాతనికి
మైత్రి యేర్పడె నాల్గుమాటలలోన, మాయమ్మ కాతనిమాతకుసైత
మొక నిముసమ్ములో నొదవె బాంధవము, గుడివాడసీమలోఁ గోదూరియందు
గణనీయమైన లింగమనేనివంశ, మతనిది సుబ్బ రా వతఁడు, మా చెల్మి 3

(సుబ్రహ్మణ్యచౌదరి అనియు నితని పేరు)

పూఁటపూఁటకు మూరిఁబోవుచునుండ, సాగించితిమియాత్ర; జాహ్నా వీతుల్య
గౌతమీనదిని మున్కలొనర్చి ప్రభుని, గంటిమి ధన్యత గంటి మటంచుఁ
దనివిఁగొంటిమి రామదాసుమహత్త, వింటిమి దమ్మక్క విమలచరిత్ర
వింటిమి భక్తులు వివరించి పల్కఁ 4

బర్ణశాలకు నేగి పావిత్ర్యరాశి, సీతమ్మతల్లి సైఁచిన వెతల్ తలఁచి
యశ్రువుల్ విడిచితి, మంతరాఘవుని, మగుడ సందర్శించి మదిమదిం బడసి
వచ్చితి మిండ్లకు; వారవారమ్ము, కదలంగఁదొడఁగె లేఖమ్ములు మాకుఁ,
బొదలంగఁదొడఁగె నబ్బురమైన కూర్మి. 5

గీ. అయ్యెడన సుబ్బరావుగేహమున నిలిచి, యచలమగు దీక్ష నొక యొజ్జ నాశ్రయించి
దేవయ పఠించుచుండె జాతీయభాష, నడిచనిన యెడ్లపల్లి వంగడపుఁ గుఱ్ఱ 6

సీ. ఇతఁడు సుబ్రహ్మణ్యుఁ డెఱిఁగింప మత్కథ, నాలించి సంతసమంది నన్ను
మెచ్చుచు నా మైత్రి నిచ్చగించుచు నేను, మీ నెలవునకు సమీపమంద
పరఁగు పచ్చలతాడిపర్తి వాఁడ నటంచు, నొకలేఖ నాకంప నుచితరీతి
నితనికిఁ గమ్మ వ్రాసితిని; దేవయ రాష్ట్ర, భాషలో నైపుణి పడసి కొన్ని.

ఆ. నాళ్ల కిల్లు సేరి నాపాలి కపుడపు, దుత్తరంబు పనుప నుద్యమించె
నెసఁగ సాగె మాకు నెడఁదల నితరేత, రానురాగభోగ మనుదినమ్ము. 7

గీ. ఎపుడువత్తురు మీరు మాయింటి కనుచు, సరగ రావలె ననుచు నచ్చంపునెమ్మి
వెలువరించుచు భద్రాద్రి చెలిమికాఁడు, సుబ్బరావు జాబులు వ్రాయఁజొచ్చె నాకు. 8

గీ. మిత్రుముచ్చట దీర్పుట మేలిచేఁత, యగుట సెలవుదినాలు రా నరిగినాఁడ
నెయ్యపుంబాదు లింగమనేనికులుఁడు, సుబ్బరావుందుపల్లె కుత్సుకతమీఱ. 9

(1926 సెప్టెంబరులో)

గీ. రాకయయ్యెనెయ్యరికి నారాక, యితని, విందులకు విందులను మించుడెందమునకు
నుత్కటానంద మందుచునుంటి మధుర, గోష్ఠిఁ గోదూరఁ బ్రాజ్ఞత గులుకునూర. 10

ఆ. చాపరాలవంశజాతుఁ డాంధ్రమ్మున, సంస్కృతమునఁ గడిఁదిచదురుగన్న
వృద్ధు వేంకటాద్రి యిద్ధచరిత్రుఁ డీ, జనపదానఁ గలఁడు సైరికుండు. 11

క. ఈ యయ్య నా రచించిన, యాయాపద్యములు విని సమంచితకీర్తి
శ్రీ యోగము నీకున్నది, రా! యని యాశీఃపరంపరలు నాకొసఁగెన్. 12

క. కమ్మమహాజనసభ దు, ర్గమ్మపురిన్ మొన్న జరిగినప్పుడె భవదీ
యమ్మగు కవితన్ విని హ, ర్ష మ్మందితి ననె నుదారసరణి దనర్పన్. 13

*(బెజవాడలో 1926 ఆగష్టు 28, 29 జరిగిన తొమ్మిదవ కమ్మ మహాజన సభలో నేను*
*'కమ్మకుల ప్రబోధ' మను పేర వ్రాసిన పద్యములు చదివితిని)*

గీ. బహుపురాణమ్ములు చరిత్ర లహరహమ్ము, తచ్చితచ్చి మనీషు లద్ధా! యనంగ
సంతరించిన 'క్రమరాజము' నొసంగి, నన్నుఁ బెద్దయుఁదనిపె విద్వన్నుతుండు. 14

ఆ. రెండుమూఁడు ప్రొద్దులుండి కోదూర మా, యింటి కీవు క్రన్న నేగుదేర
వలయు ననుచుఁ జెలికిఁ బలికి కావూరికిఁ, జేరినాఁడ హర్షభారమునను. 15

ఆ. తిరిగె మాస; మేగు దెంచుచున్నా నని, చోపె నుత్తరమ్ము సుబ్బరావు
రావయా! యటంచు దేవయ్యకున్ గమ్ము, ననిపినాఁడ నేస్త మగ్గలింప. 16

ఆ. వచ్చె సుబ్బరావు వచ్చె దేవయ్య నా, కది యపూర్వ పర్వమై రహించె
తల్లి చెంచమాంబ తనిసి భద్రగిరీశు, కరుణ నీశుభమ్ము కదిసె ననియె. 17

24-10-26

గీ. ఓపిక లేకున్న నొకటికి రెండు, పాకముల్ సేయుచు బంధుల కెట్టి
కొదయు రాకుండఁ గన్గొనియె మాయమ్మ, గంటలు నిముసాలకైవడిం గడచె. 18

మధ్యా.కావూర జాతీయపాఠశాలను గని యింటనింట,
నేవేళనేని శబ్దించు రాట్నంపుటెలుఁగు లాలించి
వావిరిగాఁ బ్రజలు కదరువలువ వాడు టెఱింగి
తీవరపాటు లేనిబ్రతుకు ననుమతించుట యరసి 19

గీ. కాంగ్రెసున కిట్టిగ్రామమే కవచ మనుచు, బాపునకు నిట్టిగ్రామమే తీ పటంచుఁ
జందపరతంత్రతా తమస్సమితి కిట్టి, గ్రామమే విలయార్కసంకాశ మనుచు. 20

క. మాయూరు మెచ్చి రన్గులు, నాయొజ్జన మెంచి రిట్లు నాలుగుపూఁటల్
పోయెను దేవయ కోరుట, నాయనపల్లియకుఁ జనితి మందఱ మెలమిన్. 21

(27-10-26)

క. పలుబాస లెఱిఁగి ప్రన్నని, తెలుఁగున బుద్ధునిచరిత్రఁ దీర్చిన సుకృతిన్
బలరామకృష్ణచౌదరి, నలఘుమతిన్ దనవయస్యు లాహ్వానింపన్ 22

ఆ. వచ్చినట్టి "బౌద్ధవాఙ్మయబ్రహ్మ"ను, గంటి నచట మొదటికాన్పు గాఁగ
నమ్మనీషిమౌళి యస్మత్క విత్వము, నభినుతింప నతుఁడనైతి నేను. 23

ఆ. వేదపాఠశాల వెలయించి తులలేని, సంఘసేవ సల్పు సచ్చరిత్రుఁ
దపుడు మిత్రుఁ డాయె నాదెయాఖ్యుఁడు నాకుఁ, దాడిపర్తి పౌరతల్లజుండు. 24

మధ్యా.ఆనాఁడు నెయ్యూరు కోర నయ్యూర నష్టావధాన,
మేను గావించితి వాణిపై బరువెల్లను మోపి
ధీనిధి బలరామకృష్ణుఁ దొడయఁడై దిద్దెను సభను,
నానావిధప్రశంసనములు పఱపి నన్ను మన్నించె. 25

క. కరఁగి "సరసకవిశేఖర", బిరుదము నాకొసఁగె నూరిపెద్దలు నను సుం
దరతర దుకూలముల స, త్కరించి రూహింపనట్టికథ యిటు నడిచెన్. 26

క. దేవయను వీడి వచ్చితిఁ, గావూరికి సుబ్బరావు కదలె నునికికిన్
మూవురనెయ్యము తియ్యము, వావిరియగుచుండఁ గొన్ని వర్షము లేగెన్. 27

గీ. అంతలో మత్పురాపాప మారఁబండి, తనువు నుజ్జనచేసె నన్ దనుపురాణి
యపుడ చెలరేఁగె లవణసత్యాగ్రహమ్ము, సిద్ధపడి రెల్లనేస్తులు చెఱకు నడువ. 28

12-2-30

క. ఆయిత్తపడితి నేనును, బాయనిస్వాతంత్ర్యకాంక్షఁ బ్రభుత నెదుర్పన్
నాయత్నము గని మాతృక, 'భో' యని విలపింపఁదొడఁగె భోనము నుడిగెన్. 29

గీ. ఇంతదుర్దశ నున్న నీ వింటివాఁడ, వగుట తగుఁ గాని సన్యాసిపగిది బంది
కేగు టొప్పునె యచట నేసేగి పుట్టి, యేమియగుదువొ విధి మన కెదిరి యిపుడు. 30

ఆ. ఏను ముసలిదాన నేవేళ కే ముప్పు, పెల్లురేఁగి తల్లడిల్లవలెనొ
దిక్కునీవ నాకు నిక్కము, నీకొఱ, కేను బడ్డపాట్ల నీశుఁ డెఱుఁగు. 31

క. నావాకు వినక నాదగు, జీవితముం గనక నీవు చెఱకేగిన నే
బావిం జూచుకొనెదనో, దైవంబ యెఱుంగు ననియె దగ్గుత్తికతోన్. 32

ఆ. జననికంటె దేశజనని గరీయసి, యన్న సత్య మేను గన్నయదియ
యైన నేమి ప్రజ్ఞ యది ప్రతిష్ఠిత కామి, జాఱవిడిచినాఁడ సవనదీక్ష. 33

క. రాఁదొడఁగెన్ మనువులు నా, కేది తగిన దేది తగని దిం దని తేల్పం
గాఁ దలఁకించితి నవ్వల, నాదుశుభంబరయుమిత్రునకు దేవయకున్. 34

గీ. మేలి సంబంధమును జూడుమీ యటంచుఁ, గమ్మ నంపితి "నాదెయ్యగారితీరు
మీ రెఱుంగుదు రాయనమెలఁత శేష,మాంబయును మాననీయశీలానుషంగ. 35

ఆ. ఈమె చెల్లెలున్న దిపుడు పెండ్లికిఁ దగు, పరువమునను దోఁటపాలెమందు
మీకుఁ దగినకన్నె యాకొమ్మ నాపల్కు, నమ్ముఁ" డని యతండు కమ్మవ్రాసె. 36

ఆ. మంచి దంటి నేను మది నుబ్బి దేవయ్య, దౌత్యభారమెల్లఁ, దల ధరించె
నన్నపూర్ణ నాకు నర్ధాంగి యయ్యెను, రామినేనివంశ రత్నకలిక. 23-5-30 37

ఆ. ఓర్పు నేర్పు నెమ్మి యొరిమయుఁ గరుణయు, సూనృతాది సకలసుగుణకోటి,
తనధనమ్ము గాఁగ నెనలేనిమన్నన, సంతరించె నీమె సతులలోన. 38

ఆ. గంటకైదుసార్లు కస్సని బుస్సని, వాఁడి వేఁడి చూపువాఁడ నేను
నాప్రశంస లీపె నాఁచికొన్నది యిఁక, లాఁతిమెప్పు లీవెలంది కేల. 39

క. వినయాదుల నియ్యంగన, ననుఁదన్నినయప్పుడెల్ల నాకీసతిఁ గూ
ర్చినవాఁడు దేవయకదా, యని మదిఁ దలపోయుచుందు నచ్చెలికానిన్. 40

మం. ఈ పెండ్లితోడ మా కితరేతరాను, రాగమ్ము హెచ్చెను రాకలు పోక
లగ్గలించెను మిత్రుఁ దస్మద్యశమ్ము, దిలకించి మురిసి సాధించెను గవిత 41
దేశవికాసమ్ము దృష్టిలో నిల్పి, పలికెను 'సుదతీసుభాషితమ్ము'లను
కష్టజీవి యటంచుఁ గాశ్మీర మనుచు, విరిసజ్జ యని తెల్గువీణ యటంచుఁ
బల్లెటూ రనుచును బ్రన్న కబ్బంబు, లెన్నెన్నియో వ్రాసె, నేది వ్రాసినను
నాముద్ర పడచుయత్నము మానఁ దతఁడు, సవరించుచుందు వేసట నాక యతని
శిల్పంబు సాహితీసేవగా నెంచి, యిటఁ గృతజ్ఞత చాటనెంచి యయ్యనుఁగు
నా కిచ్చె ధూర్తచైనా యన్నరచనఁ, 'బంచశీల' విధానభంజకు లగుచు
జగ మెంతరోసిన సైఁచువా రగుచు, భరతోర్వి నాక్రమింపఁగ దూఁకుచున్న
చీనాసిపాయులఁ జించిచెండాడు, మనసైనికుల విక్రమము దెల్పురచనఁ
గూర్మిమైనది యందుకొను ముహూర్తమునఁ, బల్కినాఁడను నాల్గుపద్యంబు లిట్లు. 42
29-1-63

క. వ్రేఁకనపై వ్రేఁకనగా, నీకృతి దేవయ్య నాకు నిడి తప్పక మీ
రీకొనవలె నని హార్ద, శ్రీ కురిసెన్ స్వార్థదూరచిత్తము మెఱసెన్. 43

ఆ. ఇట్టిపనులు కొన్ని యేనును జెప్పక, చేసి పొంగినట్టి దోసి నగుట
మాఱుపల్క లేక మౌనమ్ము నూఁదితి, నెర్లపల్లివంశ హేళి యెదుట. 44

క. నారాయణునకు నవచైె, నారక్కసి నణఁచు యోధునకు, దంద్రినటం
చారసి 'ఆత్మావై' శ్రుతి, నేరిచి యీనెయ్యుఁ డొసఁగెనే యిదినాకున్. 45
(నా కొడుకు నారాయణ అపుడు చైనాతో పోరుచున్న సైనికుఁడు)

క. ఈమిత్రుఁడు పరమాయు ర, నామయ సంపదల నంది యాంధ్రీ రోచి
ర్ధామమ్ముల నవకవితా, రామమ్ముల సృష్టిచేసి రాణం గనుతన్ ! 46
1-11-71

# నా నాఁగలి నాకు లేదా

ఆ. నిన్న మొన్న గాదు నేఁటికి ముప్పదా, ఱేండ్లనాఁడు గాంధి కిర్వినునకు
సంధి జరిగి లవణసత్యాగ్రహం బాఁగె, దేశమంత గ్రుక్క త్రిప్పుకొనియె. 1

క. ఇర్వీను తోడ్తోఁ జన నీ, యుర్వికి విల్లింగ్డ నాఖ్యుఁ డొదయం డాయెన్
గర్వమునకు ని ర్వితఁడు వి, గుర్వించెను సంధిసూత్రకోటిన్ ద్రోయన్. 2

గీ. కల్లు పెఱవల్వ లమ్మునంగడుల చెంత, కరిగి పికెటింగుసేయు సత్యాగ్రహులను
దిట్టి కొట్టిరి బందికి నెట్టి కదు గ, రాసులై మిట్టి పడిరి పోలీసు లపుడు. 3

గీ. వెడలెఁ గాంగ్రెసుసంఘముల్ చెడగరముల, కూటువ లటన్న తీర్పులు; మేటివారి
కార్థికం బగుశిక్ష లత్యంతముగ వి, ధింపఁబడియె. సత్యమ్ము వధింపఁబడియె. 4

క. వేలకుఁ జాలినయాస్తులు, వేలమునన్ రువ్వకేని విడువంబడె న
వ్వేళ నొకచెట్ట కలదా, పాలకతతిచే నొనర్పఁబడనట్టి దిసీ ! 5

ఆ. చెన్నరాష్ట్రమంత్రిశేఖరుఁడై ముని, సామినాయఁ డున్న సమయ మద్ది
రాచకార్య మొందు రా గర్తపురిసీమ, కయ్యమాత్యమౌళి యరుగుదెంచె. 6

క. జిల్లాబోర్డున కత్తఱి, వల్లభుఁడై కుప్పుసామి వఱలును వాణీ
మల్లీ కాశ ఫణీశుల, వెల్లంబడఁజేయుకీర్తి విరియంబాఱన్. 7

మధ్యా. ఈతండ యొకపల్లెటూర నుండున న్నెఱిఁగి నాకూర్పు,
కైత నయ్యాయిపత్రికలఁ జదివి చక్కని దని తనిసి
రా! తెల్గుగద్దియ కని ననుం బిల్వ రాణకువచ్చి
చేత నైనంత యూడిగమును బలుకుఁజెలి కొనర్చితిని. 8

గీ. మనకథాకాలమం దేను మంతుగన్న, భావపురి బోర్డుహైస్కూలు పండితుండఁ
గుప్పుసామి యీబడిని గన్గొనఁగ సచివ,సత్తముని నాయనిం దేరఁ జిత్తగించె. 9

గీ. ఒజ్జలకుఁ దలకట్టుగా నున్న కొమర, వోలురాజయ్య ననుఁ బిల్చి మేలిమాట
వింటి మునిసామినాయఁ డీవీటి కేగు, దెంచునఁట మనబడిని వీక్షించుపొంటె. 10

క. కుప్పుసామిగారి కోరికపైఁ దల, పడిన కార్య మిది; సెబా సటంచుఁ
బదురు మెప్పుగురియుపగిది నీసదమును, నిర్వహింపవలయు నేఁడు మనము. 11

గీ. ప్రెగడపైఁ దెల్గుసౌరు పింపిళ్ళు గునియ, వ్రాయుమా నీవు సమ్మానపద్యములను
సంస్కృతమ్మున శంకరశాస్త్రి కూర్చు, నింగిలీసున రచియింప నేన కలను. 12

ఆ. కుప్పుసామిగారె చెప్పిరి నిన్న నీ, పేరు; తిక్కయజ్వభారతంబు
నను దినమ్ము చదువునలవాటు వారికిఁ, గలదు కాన నిన్నుఁ గనిరి వారు. 13

ఆ. ఎవ రెఱుంగ రాంధ్రకవితారసజ్ఞత, యున్నవారు నీ ప్రయోగచణత;
విలువలేని కైత వెరుఁగునీనాఁడు నీ, నుడి సరస్వతికి మనోజ్ఞభూష. 14

ఆ. అనుడుఁ గలఁగి తేటి యాచార్య ! మీకోర్కి కుప్పుసామిగారి కోర్కి తీర్చు
టస్మదీయధర్మమగుఁ గాని కావూరి, వాఁడ నెంతడిగ్గవడిన నేను. 16

ఆ. కాంగ్రెసునకుఁ గోట కావూరు; కాంగ్రెసుఁ, గూలఁద్రోయువార లేలువారు
రక్కసులకు వీరి కెక్కడ భేదమ్ము ? , ప్రజలపాల జమునిబంట్లు వీరు. 16

గీ. స్త్రీలు పూరుష లనక లాటీలతోఁడ, నాలరులు మోఁదినారు సత్యాగ్రహులను
దురితపంకిలమైన యీదొరతనమున, కండగద మునిసామినాయండు నేఁడు. 17

గీ. దోస మిది నాక మొన్న పోలీసుశాఖ, వెచ్చమును సమర్థించిన పెద్ద యితఁడు
కాంగ్రెసు బహిష్కరించిన కౌన్సిలును స,మాదరించిన పక్షమునధిపుఁ డితడు. 18

గీ. ఇతని మెచ్చుట నా గాంధినీసడించు, టితని మెచ్చుట నా ధర్మ వతకరింఖు
టితని మెచ్చుట నాఁ బాపగతికిఁ జనుట, చాల నీపని; కీనన్ను సైఁపరయ్య !19

క. వైయక్తికముగ బొల్లిని, నాయఁడు కడుమంచివాఁడు నాఁ దగు; నిపు డా
నాయనికిం గాదుకదా, యీయుత్సవ మీకవిత్వ మీతర్కంబున్. 20

మధ్యా.ఏ నిట్లు పలుక రాజయ్య నన్ బ్రేమ నీక్షించి చౌద,
రీ! నిన్ను మెచ్చెదఁ గాని యేల్బడిరీతి కి ట్లెరియు
మానిసికొల్వు నధికృతు లెన్నాళ్లు మన్నింపఁ గలరు,
నా నవ్వి భయ మేల నాకు లేదె నానాఁగలి యంటి. 21-6-67 21

# ప్రత్యేక శిక్షణము

క. బాపట్లపురమ్మున నేఁ, గాఁపుర మొనరించుచున్న కాలం బది; య
ధ్యాపకతకతన నలువది, రూపాయలు పడయుచున్న రో జది నెలకున్. 1

గీ. ఐదువందలవేతన మందుకొనెడి,
యధికృతుఁడు భావపురి నొక్కఁ డపుడు కలఁడు
తత్కుమారుండు నాశిష్యతతికి వచ్చె,
సాధువే కాని చదువులోఁ జవట వీఁడు. 2

గీ. తమిళపుంబొత్తు గలనేలఁ దరతరాల,
నుండి నిల్చినలంబిలో నొదవినట్టి
తెలుఁగువాఁ డితఁ డీతనిపలుకుబడియు,
వికృతముగ నుంట వినువారు వెక్కిరింత్రు. 3

క. ఒకనాఁ డితండు మాయిం, టికి వచ్చి తెనుగునం బటిమ చాలక నేఁ
దికమకలాడెద నీ లో, టకటా! కతమగునొ యేమొ యపజయమునకున్. 4

ఆ. తెలుఁగునందు నాకు వలయును బ్రత్యేక, శిక్షణమ్ము; మీరు దక్షు లిందుఁ
దెలుపుఁ డొక్కగంట దినదిన మాంధ్రంబు, మఱవ మీశ్రమమ్ము గురువరేణ్య! 5

క. నెలనెలకున్ బదిరూపా, యలు మీ కంపింతుననియె నస్మత్పిత; నా
యలజడి మాన్పుఁడు నాకుం, దెలుఁ గనినం బొడముజంకు తెరలింపుఁ డనెన్. 6

క. ఈ మాటలు నాకెంతయు, నామోదము గూర్చ నర్భకా! యెన్నఁడు న
న్నీమెయి నెవ్వరు నడుగరు, సామర్థ్యము లే దటంచు జంకరు బాసన్. 7

క. ఇది నా కపూర్వగౌరవ, మిది నాకు నవీనపర్వ మీవు భయమ్మున్
వదలు ముదయంబునం దెని, మిది కొట్టన్ జేరు మిటకు; మేలగు నీకున్. 8

గీ. వలదు కట్నము నాకు; నా తెలుఁగు నీవు, కోరి నేర్చుట నాపాల గొప్పకట్న;
మాంగ్లమో లెక్కలో నేర్పునయ్యగారి, కిమ్ము, కట్నము; వలదు నాకెన్నఁడేని. 9

మం. అని యేను బల్క వాఁడన్వహ మిటకు, నడిచి రాఁజాలను నలఁగంగఁజాల
నోయయ్య ! మీరె మాయున్కికి వచ్చి, పాఠంబు సెప్పుఁడీ! ప్రార్థింతు మిమ్ము 10
నిదియ మజ్జనకున కిష్టమౌచేఁత, యనుడుఁ జివ్వక్కురు మనియె నామనసు
గునిసె దుస్సహమైన కోపమ్ము దాన, ధనవ దహంతచందము నది యెటిఁగె 11
నెట్టెటో తేఱి యే నీ మీతలంపు, మన్నింపనొల్ల మన్మందిరంబునకు
నడచి రావల దీవు నలఁగవలాదు, బండిపై రావోయి ! బాడిగ సైఁతు 12
నాసొమ్ము చెల్లిన నాకు లే దులుకు, నాపల్కు చదువుటే నాకువేవేలు
నావుడు మొగము విన్ననపాలు కాఁగ, నరిగె వచ్చినదారి నధికారి కొడుకు. 13

23-6-67

## గురుఁడు శిష్యుఁ డాయె

క. తాను యవీయఃపదమున, నేను వరీయఃపదాన నిలిచి తెనుంగున్
గూనలకు నేర్పితిమి పదు, రౌ నన సంస్కృతిశరణ్యమగు బాపట్లన్. 1

ఆ. అతఁడు తెన్గునందు నంబేద యగుట నన్, గని వెలుంగు వెలయు ననుభవించు
నడిగి యడుగనట్టు లడుగుఁ బ్రౌఢప్రయో, గాళిగుట్టు నుదులయర్థగతులు. 2

క. ప్రేవక యెట్లగు ననఁగాఁ,
గావకవలె నందు నేను 'గలి'యే మనఁగా
భావార్థక మందు 'మఱా' (వినకలిలోనికలి),
కేవిధి నగు నన 'వలాదు' నెఱుఁగవె యందున్. 3

గీ. దిగిదిగి యతండు న న్నచ్చ తెనుఁగు నేర్పుఁ
దనియెఁ దిమ్మకవీంద్రురామాయణమ్ము
చదివె నాచెంతఁ జిన్నయశబ్దశాస్త్ర
మభ్యసించెఁ దిక్కనబాట లాకళించె. 4

ఆ. అతఁ డమరభాష నధికుండు నాకంటె, వైదుషీబలమ్ము వడసె నందు
నాతఁ డౌపనిషదచాతురియుం గలఁ, డెవనిప్రజ్ఞ వాని దేలచర్చ. 5

ఆ. దురభిమాన మెన్నఁ డెఱుఁగను గాన నే, నతనితోడ భాసకృతులు గంటిఁ
జదివినాఁడ నుపనిషత్తులు రెంటి నా, నడత మెచ్చరైరి కడమగురులు. 6

క. తరముం జూడక నీ వీ, కరణిం జిఱుపీఁటవానికడ నేర్చినచోఁ
బరువెల్ల వీటిఁబోవుట, యరుదగునా పొఱఁజూడు మని రుద్ధవిడిన్. 7

గీ. మొన్న వచ్చుటఁ బెదపీఁట ముట్టినాకు, నిన్న రాక నితని కబ్బెఁ జిన్న పీఁట
యన్నలార ! కనుండు సత్యమును; బీర, భేదమున రాదు పాండితీభేద మంటి. 8

గీ. ఎతఁడు ప్రజ్ఞావికాసంబు నిచ్చగించు,
నతఁ డహంకృతిదూరజీవితము వలచు
వాని కధికారము వయస్సు గానరాదు,
కానఁబడు నాత్మచందాన జ్ఞాన మొకఁడె. 9

12-9-71

# జాషువా

గీ. ప్రాజ్ఞుఁడగు నొక బాపట్ల పౌరునెదుట, జాషువాకవి నాకైతఁ జప్పరించె
వత్సరమ్మున కీవార్త వచ్చెఁ జెవికి, నెద చివుక్కురు మని పెద్దయెరిసె విరిసె. 1

గీ. అంత మొనగాఁడె జాషువా యనెడిబాటఁ,
బడితి నెఱజవ్వనంపు సందదులు రేఁగ
స్వప్నకథ యన్న గుఱ్ఱమువారికృతిని,
గంటి నొకమిత్రునింటఁ జేకొంటి దాని. 2

క. వ్యాకృతివిరుద్ధరూపము, లాకృతిఁ గన్పించెఁ బెక్కు లవి తగ వనుచున్
వాకొంటిఁ 'బ్రజామిత్ర'ను, ధీకుశలుల కింపునిడుగతిన్ జనుదానన్. 3

*బింబానికి, ఇనుంపగజ్జెలు, పదాంబుజంబులను వాయని... చెప్పులు, విధవరాలు, శంభురాణివోలె, (శంభురాణిని బోలిఅనుటకు) మాధుర్యములైన భావములతో, త్రాపిరి - మున్నగునవి. ప్రజామిత్ర 1935 మే 12 సంచిక.*

క. అనకాపలి హైస్కూలునఁ, దెనుఁగున కాచార్యుఁడైన ధీమన్మణికిన్
జనమంచివంశజునకున్, బనితమహాకావ్య భవ్యభావజ్ఞునకున్. 4

క. సీతారామస్వామికి, నా తెల్పినతెలుఁగు మిగుల నచ్చెను జాష్వా
యీతప్పులు దిద్దుకొనుం, గాతమనుచు వ్రాసెఁబత్రికఁబ్రజామిత్రన్. 26-5-35

క. మఱికొంద ఱిట్లు విద్యా, ధురంధరులు సెప్పియుందురు జాషువకున్
బెరిఁగినకోపము సత్యము, నరయంగానీదు గాన నతఁ దవ్వేళన్. 6

క. నన్నుఁ గటూక్తుల దూఱెను, గొన్నిదోసఁగు లొప్పుకొనియెఁ గొన్ని మఱపునం
బన్నితి ననెఁ దనవాడుటఁ, గొన్ని యిఁకన్ లక్షణమునకున్ వచ్చుననెన్. 7

ఆ. అదిర! 'రాణివోలి' యనుట దూష్యం బని, యేను బలుకరింప నితఁడు శాబ్ద
సరణి కనఁడు గాన 'జవ్వనివోలె' నం, చనఁడె నన్నెచోడఁ దని యెదిర్చె. 8

క. అన్నా ! నీ వాదంబును, మన్నింపదు జగము శాస్త్రమర్యాదలలో
నున్నపుడే కబ్బమునకు (23-6-35) విన్నాణము వచ్చు నంటి వెండి యతనికిన్. 9

క. మఱపున 'దయనీయంబు'ను, నెరసులలోఁ జేర్చినట్టినేరమికి మదిన్
గరము నలంగెద ననియున్, మెఱసితిఁ బత్రికను బ్రాజ్ఞమిత్రులు మెచ్చన్. 10

ఆ. కవితపై విమర్శగావించువార లౌ, చిత్య చర్చ సేయఁ జెల్లుఁ గాని
శబ్దశాస్త్రగత విచారమ్ము సాగింపఁ, గా దటంచు నపు డొకండు నుడివె. 11

క. ఏ నంత స్వప్నకథలో, నానానౌచిత్యములు కనంబడ వానిన్
ధీనిధుల యెదుటఁ బెట్టితి, నానాఁడిది ఝుంఝుయయ్యె నాంధ్రావనికిన్. 12

*చూ. ప్రజామిత్ర 1936 జనవరి 14, ఫిబ్రవరి 2, ఫిబ్రవరి 9 సంచికలు.*

నునులేఁత వెన్నెల తుపానులు, వృద్ధవిలాసిని, కమ్మని
యుచ్చైర్నాదము మొదలగునవి. నునులేఁతవెన్నెల
తుపానువలె భయంకరమా ? ముసలిదానికి విలాసినీ
పదము తగునా; ఉచ్చైర్నాదము కమ్మగానుండునా?

గీ. పద్యమున కొక్క తియ్యనిపల్కు చాల, దౌచితీ శౌచ ముఖదీప్తు లమరవలయు
శాకమున కొక్క తాలింపు చాల దరయ, భాండనైర్మల్యమును జతపడఁగవలయు. 13

గీ. చర్చముగిసెఁ గాలము కొంత జరిగె దుగ్గి,రాలసభ వచ్చె జాషువారాక యస్మ
దాగమమ్మును సంధిల్లె నాసమజ్య, కిరువురము నుంటి మచట నెయ్యురవిధాన 14

*(ఉపాధ్యాయ పండిత పరిషత్తు 24-12-41)*

గీ. అంత పోరాడుకొన్నవా రింత కలసి, మెలసి యెట్లుందు రని సదస్యులు వెఱఁగు
పడిరి గుసగుసల్ పోయి రయ్యెడ నుదాత్త, రీతి నెఱుఁగనిపిన్న లారెండు నాళ్ళు. 15

గీ. అవల నను సత్కరింపఁగా నప్పికట్ల, వారు సమకట్టి లేఖను వ్రాసినంతఁ (1942లో)
బద్యములఁబంపె జాషువా హృద్యములను, సంచికకు నూత్నశోభ నీఁజాలువాని. 16

ఇందొక పద్యము

క. "మెత్తని నీ హృదయమువలె, మెత్తని కవనమ్ము నీది మెత్తఁదనములోఁ
గత్తికివలెఁ బదనున్నది, సత్తాగలవాఁడ వన్న! చౌదరిమిన్నా! 17

క. పదపడి బెజవాడపురిన్, బెదసమ్మానమ్ము నీకవిగ్రామణికిన్,
గదియించె రసజ్ఞావళి (1947లో,) పదిసీమలతెల్గువారు బళిరా! యనఁగన్. 18

ఆ. మూఁడు నాల్గుపద్యముల జాషువాపల్కు, పసను మెచ్చువానిఁ బంపి సభకు
నస్మదీయమైన యామోద మానాఁడు, చాటినాఁడ వెదలుశక్తి లేక. 19

ఆ. వెనుకఁ దెన్గువారు కనకాభిషేకాది, సత్కృతుల ననుం బ్రశంసచేయఁ
గూర్చినట్టి సభకుఁ గూర్మిమై జాషువా, కవియు వచ్చె మెప్పుఁగైత లిచ్చె. 20

*29-1-49 నిడుబ్రోలు (ఈ నాటి జాషువా గారి పద్యములలో రెండు)*



'తెనుఁగులెంక'

శ్రీ తుమ్మల సీతారామమూర్తి

ఉ. "ముగ్గురుసత్కవుల్ కరఁగిపోసిన భారతకావ్యసృష్టిలో,
నిగ్గను ఘంటికాగ్రమున నిల్పిన చౌదరితిక్కయజ్వ! నీ
పగ్గియ యేన్గునెక్కి వలపాదమునందుఁ బసిండిజాళువా
గగ్గెర దాల్చు నన్నుసుడి గర్వముగూర్చెఁ గవీంద్రకోటికిన్." 21

మ. "మును ముత్యాలమహాళ్ళలోనఁ గనకంపుంబుగ్గలన్ దానమా
డిన శ్రీనాధకవిప్రభూత్తమునకంటెన్ దొడ్డమర్యాద లం
దిన దీవ్యత్కవితాకలానిధివి సందేహమ్ము లే దాంధ్రనం
దన ! దీర్ఘాయువునీకుఁ జౌదరికవీంద్రా! శారదావిగ్రహా!" 22

క. పొన్నూరిసమితివా రీ, యన్నను మన్నించుసభకు నరిగితి నవలన్
బ్రన్ననికైతల నీతని, విన్ననువున్ మెచ్చితిని గవివ్రజ మలరన్. 23

*(ఈ సభకు, బెజవాడ సభకు నావ్రాసిన పద్యములను 'సమదర్శి'లో చేర్చి ప్రచురించితిని. మచ్చునకు రెండు –)*

ఉ. వందలు వేలు పొత్తములు వాములు వాములు కూర్చినంతనే,
పందెము గెల్చునా కవికిఁ బారకలోకపుముద్ర లేనిచో
నందనవాటికాకుసుమ నవ్యమరందఝరీ తరంగముల్,
చిందఁగ నీవలెన్ గృతులు సెప్పక విందులు గుప్ప కున్నచో. 24

ఉ. తిక్కనపుట్టుగడ్డగ నుతింగను గుంటురిసీమ నియ్యెడన్,
లెక్కకు నెందఱోకవులు లేచిరి గాని రవీందుతారకల్
మిక్కిలుదాఁక నిల్వఁగలమేలిమి నల్గురకే లభించె నీ
వొక్కఁడ వందు నందు బెగడొందక నిక్కము వక్కణించెదన్. 25

ఆ. ఏండ్లు కడచుకొలఁది నెడఁదల నరమరల్, ప్రిదిలి ప్రిదిలి పేర్మి పెరిఁగి పెరిఁగి
యేము మెలఁగినార మేకోదరులరీతి, నేము కరఁగినార మెలమికలిమి. 26

*(జాషువాగారు తమ 'నాకథ' రెండవ భాగమున మా సాహితీవాదమును గూర్చి వ్రాసిన పద్యము లిటఁ జూడఁదగినవి.)*

## కనువిప్పు

గీ. విశ్వసందేశ మొసఁగిన 'వినయ' శబ్ద, చిహ్నితాశ్రమమును బ్రతిష్ఠించుకొన్న
పల్లెపట్టునఁ బుట్టిన ప్రాణి నగుటఁ, గలముపట్టితి బాపుజీకథను వ్రాయ (1932)1

ఆ. ముగిసె నాత్మకథను మొదటిపా; లంతలోఁ, గదిసె నన్నుఁ జెనఁటికడుపునొప్పి
యొజ్జనంపు ప్రేఁగు నోర్వన వెఱచునా, కలవిగానిచేఁత యయ్యెఁ గైత. 2

ఆ. అవల వ్రాసినట్టి దచ్చున కీనెంచి, విత్త మాఱునూర్లు వెచ్చపడుట
తప్ప దనియెఱింగి తలఁకితి రూపాయ, విలువ మింటికంటువేళ యగుట(1936)3

ఆ. అచ్చుకర్చు మరలదయ్యె నేని భరింప, నేర్తునా యటన్న నెవ్వఁ బడితి
నస్మదీయశిష్యుఁడై తగు వేంకటే, శ్వరుఁడు నాకలంక సకల మెఱిఁగి - 4

గీ. పోవుదము రండు మాయూరి కీవియందు,
గణనకెక్కినసా హుటం గలఁడు మాకుఁ
జుట్ట మతఁడు మీరాకకుఁ జొక్కు నతఁడు
గురువరా ! మీకు సంతుష్టి గూర్చు నతఁడు. 5

గీ. అనుడు నట్ల కానిమ్మని యాదివార, మొకటి సూచి మదీయ మభ్యుదయమునకు
నారటించు నంతేవాసి ననుసరించి, ధనికు చెంతకు నెఱసంజతఱికిఁ జనితి. 6

క. నాకేమివచ్చు యాచకు, వాకులు ? శిష్యుండ నన్ను వర్ణించి మదీ
యాకాంక్ష దెల్పె సాహున, కీకార్యము నీయశమ్ము నెసఁగించు ననెన్. 7

గీ. దాత యేతిక్క నుండెనో తగనిబిరుసు, చాటి "ముద్రణమునకుఁ జే సాఁపనేల
గట్టిదగునేని కబ్బమ్ము పెట్టుబడికి, నష్టి దెచ్చునె కవికి దైన్యంబు నిడునె. 8

గీ. తిక్కనాదిమహాకవుల్ తీర్చినట్టి, కృతులగౌరవములు సరే! యిపుడు వాసు
దాసువంటి కవీశ్వరుల్ వ్రాసినట్టి, కావ్యములఁ గొనువారు లోకమున లేరె ? 9

ఆ. మంచికైత నేల మన్నింపదు జగమ్ము, సాధువాణి కేల జయముపల్క
దేల కమ్మకవియు నిట్లు జాఱుట యిటు, లాత్మగౌరవంబు నణఁచుకొంట. 10

క. నావంగడమున - మానిసి, దేవురుగొ ట్టగుట కనుమతింపను నీతిన్
ద్రోవక పరువుం బాయక, యేవిధినే నతఁడు కల్మి నెనయుట యొప్పున్. 11

ఆ. ఈధరిత్రివార లెవరైన 'దేహి' నా, గాసిపడెద రిఁకను గమ్మవారి
గఱువతనము నుడువఁగానేల చౌదరి, యర్థదాత గాని యర్థి కాఁడు. 12

క. అని వెంకన పల్కుడు నా, కను విప్పిన నీకు శుభము కల్గుత మని యా
తని వీడి యిల్లుసేరితి, ననుంగుశిష్యుండు ఖిన్నుఁడై నను నెయిదన్. 13

గీ. ధార్మికావేశమునకు నాధారమైన, యింటఁ బుట్టితిఁ గాన నాయెడఁద నిశిత
కంటకములై కలంచె వెంకన్ననుడుగు, లగ్గలమ్ముగ నభిమాన మావహించె. 14

గీ. ఆఱువందలు వెచ్చించి యస్మదర్థ, మాత్మకథ వెల్వరించితి నందమెసఁగఁ (1936)
జదురుగలవార లీకృతింజదివి యేమి, పల్కనున్నారొ యని యాత్రపడితి; నంత-15

క. "తమపల్కిన కైతను గాం, ధిమహోన్నసకథను జదివితిని విస్మయ హ
ర్షములకుఁ జిక్కితి నీకా, వ్య మాంధ్రవాగ్దేవిసుకృతఫల మని తలఁతున్. 16

క. తమశైలి యించుమిం చాం, ధ్రమహాభారతమునకును బ్రతిబింబము సా
ధ్యము కా దింతకుమించు వి, ధమునన్ గొనియాట, చాలదా యిది సుకవీ! 17

ఆ. నన్నుఁ గదియుకృతుల నన్నింటిఁ జదువఁగా, వీలుగాదు నాకు మేలుగాదు
సత్య మిట్టులుండఁ జదివించి ననుఁ దన్పెఁ, దమకవిత్వ మది యుదాత్త మగుట. 18

ఆ. పూజనీయుఁడైన పురుషునిచరితమ్ము, తగినరీతి వ్రాసి తతయశస్సు
నందినారు ధన్యులైనారు మీ రని, యభినుతింతు మి మ్మయాచితముగ" 19

(2-4-37)

గీ. సాహితీకవితాజగచ్చక్రవర్తి, కట్టమంచి సుబ్రహ్మణ్యపట్టి రామ
లింగరెడ్డి పంపించిన లేఖ యిట్లు, వచ్చె నా కొక నూత్న సత్వంబు నిచ్చె 20

గీ. నల్లవో ! యని కొండాడెఁ జెళ్ళపిళ్ళ, యాంధ్రపత్రిక కృష్ణయు నభినుతించె
భారతి ప్రశంసచేసె నప్పట్లఁ గృతిని, మామకీనను బాపుజీమహితకథను. 21

గీ. విపణులకుఁ బంపుపొత్తముల్ వేఁడివేఁడి,
గారెలట్లు క్రీతము లాయె నౌర! మూఁడు
విశ్వవిద్యాలయము లీకవిత్వ మాద
రించి పాఠ్యముగా నిర్ణయించుకొనియె. 22

ఆ. వచ్చెఁబెట్టుబడియు వడ్డియు లబ్ధియు, హెచ్చె యశము తనివి యెసఁగె నాకు
నలువరాణి కరుణ నాపాలి దగుట న, న్నేఁచు సందియమ్ములెల్ల విచ్చె. 23

ఉ. తిక్కనపేర సింహపురధీనిధులిచ్చు నుపాయనమ్ముతో
నెక్కెను గోటపేఁటలకు నీమహనీయ కథాప్రబంధ; మీ
పెక్కున కాదిహేతువగు పెద్దకుఁ జాటెద మత్కృతజ్ఞతన్
దిక్కవరాన్వయాగ్రణి కతీవవితీర్ణికి రామిరెడ్డికిన్. 24

క. ఆనాఁటి రెడ్డిరాజుల, దానాసక్తియును భోగతత్పరతయుఁ గా
వ్యానందనిరతయుం బ్రజ, లీనాఁ డీక్షింతు రీమహిష్ఠునియందున్. 25

గీ. కావ్యపఠనమ్ము చిఱుదిండి కాఁగ సుకవి
పూజనము భోజనము గాఁగ బొలుచు నిరుగు
పొరుగువారలకున్ బంధ్లు పులియఁబాఱ,
దొరయెఱుంగనికీర్తి నందుచు నితండు. 26

గీ. కృతికిఁ దగువాఁడు సభ కధిపతిగ నుంట
యుచిత మని ధీమదగ్రణి యూహచేసి
రామిరెడ్డి పుంభావశారదను గట్ట,
మంచిరెడ్డిని దెచ్చె సమజ్య నడుప 27

**20-3-39**

ఆ. రచ్చ తనియుభంగి రామలింగారెడ్డి, యాత్మకథను మెచ్చునవసరమున
సరళ మనియె దీనిశైలి నిర్దుష్ట మీ, భవ్యరచనలోనిబాస యనియె. 28

గీ. తెలుఁగునం దిది నిచ్చలు నిలుచుకబ్బ,మని తలంచి మావిశ్వవిద్యాలయమునఁ
బాఠ్యమును జేసితిని దీనిఁ బ్రాజ్ఞులైన, పారిషదులతోడ్పాడు చేపడుట ననియె. 29

క. ఇతఁ డల తిక్కనయట్టులు, కృతి సెప్పును దెనుఁగుఁదనము క్రేళ్ళుఱుక ననూ
దితము స్వతంత్రము కైవడి, నతీవరమ్యముగ వెడల నని ననుఁ బల్కెన్. 30

క. దీవన యగు నీమె ప్పని, భావించితి నుతికిఁ దగినప్రజ్ఞ గడింపన్,
సేవించితిఁ గవిచంద్రులఁ, గోవిదకులశేఖరులను గొల్చితి భక్తిన్. 31

క. నావీనుల గింగురుమని, యేవేళను మొరయఁజాగె నీద్యమనీషా
సేవధి వెంకనపల్కులు, త్రోవంగారాని ధర్మదుందుభు లగుచున్. 32

క. కాసులకు నాసచేయక, వ్రాసిన కబ్బములనెల్ల వరణీయకథా
భాసురులకు నర్పించితి, నాసుకృతమ్ములు ఫలించినవిలే ! యనుచున్. 33



ఆ. ఆంధ్రరాష్ట్రసిద్ధి కశ్రాంతసేవతో, నీవితోఁ దపించు టెఱిఁగి యెఱిఁగి
చల్లపల్లిధరణివల్లభునకుఁ గాన్క, గాఁగ నిడితి రాష్ట్రగాన కవిత. (1938) 34

క. ఈయవనీపతి కృతిసభ, వేయాఱులు నాకొసంగ వెడలించె మతిన్
నాయుల్లపుఁబఱిగని వా, లాయముసేయక సరే! బలా! యని యాఁగెన్. (1942)35

గీ. అవలఁదనపుత్రు నక్షరాభ్యాసమహము, కదియుడున్ జల్లపల్లిభూకాంతుఁ దస్మ
దాగమమ్మును గోరుచు నంపెఁ గమ్మ, యది కఠోరతమసమస్య యయ్యె నాకు. 36

ఆ. నృపతిపిల్పు నాదరించుట నాధర్మ, మైననేమి నన్ను ననుపు వేళ
నొదయఁ దెంతవిత్త మొసఁగునో యిపుడెట్టు, లే నెఱుంగనేర్తు ఁనితలఁపు. 37

క. వచ్చినకవీంద్రులకు రా, జిచ్చినయట్లీక నాకు హెచ్చుగ నిడ నా,
పె చ్చుప్పికట్లసభకుం, దెచ్చినయది గాక యెవ్విధిన్ లాఁతి యగున్. 38

ఆ. వలదు వలదు నాకు వసు వింత యని మహీ,
భర్తమందిరమునఁ బలుకఁగలనె
పలుకలేక మూటబరువుతో వచ్చిన
ప్రజల కేను గడ్డిపరకఁ గానె. 39

క. ఇచట వల దన్నకట్నము,నచటికిఁ జని తెచ్చుకొనెఁగదా మూర్తి, సిరిన్
రుచి లేనివానికైవడి, వచించి, యితఁ డింతదనుక వచ్చెనె తుదకున్. 40

ఆ. చేయునది జపమ్మె వేయునట్టిది గాల, మన్నమాట నిక్కమయ్యె ననుచు
జగము నన్ను రేపు తెగడదా తెగడుట, నేర మగునె ధర్మదూర మగునె. 41

క. భూపాలుఁ డెట్లు తలఁచిన, నీపైనము మానవలయు నిదియె సముచితం
బౌ పని యని యపు డెంచితి, నాపైఁగల ప్రేఁగు వీఁగినది యనుకొంటిన్. 42

ఆ. మరల రెండుమూడుమార్లు రాయఁడు శుభ, లేఖ లంపెఁ గాని లేశమేని
దారిదప్పనైతి దమితలోభుండనై, యెల్లలేనిశాంతి నేలుకొంటి. 43

ఆ. అఱువదేండ్లు నిండె నవనీంద్రునకుఁ, బ్రజల్, పూనుకొనిరి షష్టిపూర్తి సభను
గఱువ లిద్ద ఱప్పికట్లకు వచ్చి నా, రాక వలచి రాదరంబు మెఱసి. 44

ఆ. ఇపుడు చల్లపల్లి కేగినఁ దప్పేమి, నృపుని మెచ్చు చేఁత నేమి దోస
మని తలంచి సభకు నరిగి యేలిక పెంపు, నుగ్గడించినాఁడ నుచితకవిత. (1966)45

ఆ. అస్మదాదికవుల నందఱ నాహూతి, సమితి సాహితీ ప్రశస్తి నిరతి
సత్కరించె మేలిసాలుతో నూటప, దార్లతో సదస్యు లౌ ననంగ. 46



క. నాతండ్రిరికథ 'ధర్మ, జ్యోతి' సమర్పించినాఁడ నొజ్జకు నెఱసం
గాతికి దానయ్యకుఁ బరి, పూతచరిత్రునకు వెలగపూఁడికులునకున్. (1942) 47

ఆ. సుప్రసిద్ధులైన సూరులు రసికవ, ర్యులు కవీంద్రు లున్న యోలగమున
నితని కిచ్చినాఁడఁ గృతి స్వర్ణపురిఁ బుష్ప, శరముతోడ వస్త్రభరముతోడ. 48



గీ. సొరుగల ఖండకావ్యము లేటియేటి, 'పఱిగపంట' నా మెఱయుచుఁ బ్రజలకొఱకుఁ
గరఁగికరఁగిజాలైన లక్ష్మయకుధర్మ,వీరునకుదాని నుపదఁ గావించినాఁడ. (1943)49

ఆ. ఇతనియావిచే నహీనయై నిడుఁద్రోలి, పారశాల ప్రాజ్ఞపఱిత యయ్యె
వసువు నొసఁగియొసఁగి కొసరాజులక్ష్మయ్య, పెఱలగొడ్లఁ గాయుపేద యయ్యె. 50

గీ. నాల్గువందలు వెచ్చించినాఁడ విత్త, మితనిసత్కృతి కమనీయగతిని సాగఁ
జిత్ర మితనిది నిర్మింపఁజేసి బడికి, నిచ్చినాఁడ జనుల్ చాఁగురే ! యనంగ. 51

గీ. పింగళిమనీషిసత్తము విశ్వనాథ, కవివరేణ్యు విమర్శకగణ్యుఁ బుణ్యు
నున్నవామాత్యుఁదెచ్చి కృత్యుత్సవమ్ము, రసమయం బొనరించితి రాముదయను. 52

క. ఈరసమంటల నెరిసెదు, వారికార్యక్రమమ్ము వారింప నధీ
కారుఁడనుకం జనియు మ, దారంభము ధర్మ్య మగుట నందిరి లజ్జన్. 53

గీ. కొండవలె నిల్చె నానాఁడు క్రొత్తపల్లి, కాశరామయ్య సకలవిఘ్నములు తూల
సజ్జనులపాలి మందారసాల మతఁడు, ప్రథితి నందిన దేశిక ప్రభు వతండు. 54

(నిడుద్రోలు హైస్కూలు హెడ్మాస్టరు)

క. ఈ కృతిపతికథఁ జాటెడి, నాకవితం జదివి తెనుఁగునాటం గల సు
శ్లోకులు కొందఱు వచ్చిరి, శ్రీకొసరాడ్వంశ్యు నీక్షచేసి యెలర్పన్. 55

క. నా కావించినపని యిది, లోకోత్తర మనుచు సుగుణలుబ్ధులు పనుపన్
దూఁకెను నాకడ కెన్నో, లేకలు సాహిత్యగంధలిప్తము లగుచున్. 56

క. ఫలకాంక్ష లేనిపను లి, ట్లలరించు నుదారమతుల నని నమ్మితి మ్రొ
క్కులు సెల్లించితి వాణికిఁ, దలఁచితి నవ్యాజమైన దైవము కరుణన్. 57



గీ. "ఆత్మకథ పూర్తియైననాఁ డది మహోత్సు, వెంట 'దండి'కి నడచిన వీరవర్యుఁ"
డాంధ్రుఁ డెర్నేనికులజుఁడై యలరువాని, కొసఁగినాఁడ సుబ్రహ్మణ్యయోగి కరసి. 58

ఆ. ఇంత గొప్పరచన యేధనికున కిడ్డ, నడ్డ మాఁక వొడమ దర్థమునకుఁ
జిన్నకాని లేని సన్నాసి కిడె దేమి, యనుచు నన్ను నవ్వి రలంతు లపుడు. 59

ఆ. పసిఁడి నిచ్చువాఁడు పాపియైనను వాని, మెచ్చవలయుఁ జేఁదు మ్రింగవలయు
నర్థవాంఛ లేనియప్పుడు కవి గొని, యాడవచ్చు సుకృతి నంటి నేను. 60

గీ. విత్తమిచ్చినఁ జిత్తము చిత్త మనెడి, కవులు కట్టిన మేడలు కలవె జగతి
వచ్చినది వెంటనే రిత్తవెచ్చపెట్టి, యకట ! యుస్సురు మనుచుందు రవల వీరు. 61

ఆ. అచ్చుకర్చు లొండె నాపైని సాల్వొగా, కెంతయిచ్చుఁ గబ్బ మేలు సాహు
మందమతులు కనక బొందలోఁ బడుదు రీ, పాటి యిడదె కైత ప్రాణ మున్న. 62

ఆ. కవికిఁ జాలినంతకలిమి లేకుండిన, నప్పు పుట్టు నీతి నాస్థ యున్న
నతనిచిక్కు లెల్ల నప్పుడు తీఱవా, యచ్చుపడినకబ్బ మిచ్చు సిరిని. 63

ఆ. లోభమోహములకు లోపడి మనుజుండు, జాతి దారితప్పి దూఱు వడయు
మంచివారి చెలిమి మరగిననాఁడు వాఁ, డఖిలగౌరవంబు లనుభవించు. 64

గీ. ఆత్మకథను సుబ్రహ్మణ్యు నర్చచేసి, యవలఁ గనకాభిషేక గౌరవము గంటి
నస్మదీయతపఃఫల మాసదస్సు, తెలుఁగునాడెల్ల నిడుఁబ్రోల దిగిన దపుడు. 65

*29-1-49 (చూ. కనకాభిషేక సంచిక, తపస్సిద్ధి.)*

గీ. ఆంధ్రకవితాసరస్వతీ హర్మ్యమునకుఁ ,గాంచన స్తంభములు నా నఖండయశము
నందినప్రబంధ్ధ లాసభామందిరమున, వేపు రున్నారు నన్ను దీవించువారు. 66

ఆ. రామలింగరెడ్డి ప్రతినిధియై పరి, షత్తు నేలె దేశికోత్తముండు
సుకవిమౌళి పింగళికులుండు కటమంచి, రానిలో టొకింత లేనియట్లు. 67

మం. అధ్యక్షుఁడగు రెడ్డి యానాఁడు సభకుఁ, బంపినపలుకు లబ్రము సంతరించె
"నమ్మేటి నాకైత నగ్గించుపట్ల", శ్రీమూర్తికవి రచించినయాత్మకథను
దొలుపాలు చదివి హద్దులు లేని యెలమి, నచ్చెరువును గంటి, నానాఁటినుండి
నాకు నీతనికవనముపట్ల నుండు, పేర్మి హెచ్చుఁదొడంగెఁ బేర్మోనఁదగిన
కవితకు నొకగుర్తుగా నగు నిద్ది, వేమాఱు చదివిన విసుగు రానీదు
కమనీయకవిత నిక్కంబగు కవిత 68
వాకు హృద్యం బౌట వస్తువు సకల, జగము మెచ్చిన దౌటఁ జౌదరికృతులఁ
గన్నాకుగా నాత్మకథ నిల్వఁగలదు 69
యతియుఁ బ్రాసమ్ము నెట్లమరు నటంచుఁ, దలగోఁకికొనఁడు సీతారామమూర్తి
తగునుడుల్ పఱపు నర్థమ్మునుబట్టి, భావంబు ఝురియట్లు ప్రవహింపఁజేయు

బొసఁగుఁ బ్రాసం బలవోక నీతనికి, యతి పదాదిన కాక యదిరా ! పదమ్ము
నడుమను దుదను దిన్నగవచ్చి వ్రాలు, నీవేర్పునన్ నులికెక్కెఁ దిక్కన్న
తిక్క యజ్వకు సజాతీయుఁ డితండు 70
సరళ సంస్కృతసమాసములు సంధించి, నన్నపార్యుఁ దలంపునకుఁ దెచ్చు నీతఁ
డీసమాసములు సంస్కృతసనాథంబు, లయ్యు నెల్లవిధాల నాంధ్రతం జాటు
నిది కవితాకళ నెంతేని తుష్టి, నొసఁగుసోయగముల నొకటియై చెల్లు
నన్నయ్య కలతిక్కనయు నెల్లకవియు, నుద్ది రానేర్తు రీయోగ్యతయందు
వరణీయశీలురు వా రెల్లవారి, కవగతమై వారి యాత్మలు కరఁగ
సత్కృతుల్ పల్కి రీసంప్రదాయంబు, నేఁ దుద్ధరించిన నేర్పరి మూర్తి 71
కష్టనష్టములతో గడియించుకొంటి, మిపుడు స్వరాజ్యంబు, నిది సుస్థిరమ్ము
కావలె నన్న నింక నుదాత్తరీతిఁ, జేయు టొప్పును దేశసేవను మనము
ముంగిట లోఁగటన్ మూఁగి విరోధు, లున్నారు మనకు వీ రుందురు నిచ్చ;
కులమతాది కఠోరకుడ్యముల్ కూల్చి, యితరేతర ప్రేమ మెడఁదలన్ నినిచి
బెగడక కుందక బెంబేలు పడక, యార్జించుకొన్న రాజ్యమును రక్షింప
మన మొగ్గఁదగు; నిట్టి మహనీయ కార్య, దీక్షకుం బ్రేచు నుదీర్ఘకావ్యముల
నాత్మకథన్ మించినట్టి దీవేళ, నీగడ్డలో నొక్కఁడేనియు లేద
చెల్లఁబో ! భారతీసేవతో పాటు, దేశసేవయును సాధించి యిమ్మడిగ
ధన్యత నందె సీతారామమూర్తి, యీతనిదెస మన కెనలేనిపేర్మి
కలదు కృతజ్ఞత కల దిది యుక్త; మాస్థానకవి యితఁ దమ్మహాత్మునకు
యుగయుగాలుండు నీయుత్తమపీఠ", మని పల్క నుల్కితి నలరె సదస్సు
కరతాళరవము లాకసమున కంటె. 72

ఆ. జాతిపెంపు వలచి సంతత నిస్స్వార్థ, సాహితీసపర్య సల్పువాని
కెదయరాని విందులే సర్వజను లన్న, పరమసత్య మెఱుకపడియె నపుడు.

క. సీతారామయ నాయకుఁ, డై తనరన్ నాగయాదు లలసియలసి నాఁ
డేతత్సభ గూర్చిరి కవి, తా తప ఉన్మిషితమతులు తనిసనురీతిన్. 73

గ. మేలిమాగాణి మూఁడెకరాల నమ్మి, యచ్చు వేయించినాఁడ నాఁ డాత్మకథను
వలచి పాఠకలోకమ్ము విలిచెఁ గాన, నార్థికంబగునష్టి న న్నంటదాయె. 74

గీ. మిత్రులకు బంధువులకు ధరిత్రిఁ బేరు,
వడసినకవీంద్రులకు వేఁడువారి కిడఁగఁ
బ్రతికృతిని మూఁడువందల ప్రతులు వలయుఁ
దక్కినవి చాలు నాకు రథమ్ము సాగ. 75

గీ. ముందుగాఁ దెల్పి కృతినిచ్చు చందమునకుఁ
దనకుఁ గడుదవ్వు గాన మత్కావ్యభర్త
కేను ముద్రించిపనిచిన కృతిని జూచి,
నపుడ తెలియు నా యొసఁగిన యాదరంబు. 76

ఆ. ఆలికైనఁ జెప్ప నచ్చుగుదనుక నా, వలచినట్టియల్లువాని పేరు
మీకు మీ కటంచు రూకల కేఁకారు, కవులకరణి నాకుఁ గానిసరణి. 77

ఆ. 'ఉదయగానము'నకు నుప్పలనాగయ్య, నాప్తమిత్రమౌళి నధిపుఁజేసి (1955)
యతనిచాయబొమ్మ నతిరహస్యముగ నేఁ, దేరఁ బడినపాట్లు దేవుఁ డెఱుఁగు. 78

క. సాహిత్యధాతృసేవా, దాహమ్మున నితనిఁ జెప్పఁదగు ముందఱగా
నీహిత సత్కవిగౌరవుఁ డీ హితుఁ డీకొన్న వెతల కెల్లలు గలవా ? 79

క. కవి గాయక నట నర్తక, భవిక ప్రవణతకు నగ్గపడి నిర్భయుఁడై
దవశిఖని బండు వెన్నెల, పవిదిన్ భావించె నితఁడు పగఱున్ బొగడన్. 80

గీ. క్రొత్తపల్లి వేంకటరత్న కోవిదుండు, తనతలంపులఁ గొండాడి దండ కాఁగ
నాంధ్రవాణి కపూర్వ హైమాభిషేక, గౌరవము దక్క నితఁడు పెన్‌గాసి గుడిచె. 81



ఆ. 'శబల' నిచ్చితిని యశఃక్షీరమును బిండ, నెరసుకంపు లేని నరసకవికి (1955)
నేల పెక్కుమాట లితఁ డాధునిక భీష్ముఁ, డార్తలోకమునకు నమరశాఖి. 82

గీ. ఇతఁడు మేనల్లుఁ డగుట నా కించుకంత, సొమ్ము ముద్రణవేళ నీఁజూచెఁ గాని
వలదురాపట్టు సాగిపోవలయునాది, నననిలుప హట్టమున్నది నాఁగ నాఁగె. 83

ఆ. బ్రహ్మచారి యితఁడు పదిరూకలు లభించు, దారి నుండె నితఁ డుదారుఁ డితఁ
డు
ఎట్టిఁ డైన నేమి కట్టుకడక నాది, దాని మాన్ప బ్రహ్మతరము గాదు. 84



గీ. అఖిలభారత సౌహార్ద మాహరింపఁ, గనిన వినయాశ్రమమ్మును గాచుసుకృతి
బసవయకుఁ గాన్క వెట్టితి మసృణమధు ని, ధానమైన 'సర్వోదయగాన' కవిత 85
(1961)

ఆ. పేదలెస్సకై తపించు వినోబామ, హర్షివాణి వేణియై తెనుంగుఁ
బుడమి సామ్య యోగభోగమ్ము పండింప, నొదవుకైత ప్రగతి కూఁత యిద్ది. 86

క. మనబాసను సర్వోదయ, ఘనతం బ్రకటించు మేలికబ్బం బిది యెం
దనుకc దెనుంగు మెరయునం, దనుకనిదియు మెఱయుననియెదన్వినతుండనై. 87

మధ్యా. జాతిపితపరమలక్ష్యమై తగు సర్వోదయంపు
రీతిని హృద్యానవద్యఫణితి వర్ణించినకైత
నాతంద్రికిం గూర్చుభక్తుండగు బసవయ్యకు నిడి పు
రాతనపుణ్యముల్ నావి పండె నౌరా ! యనుకొంటి. 88

ఆ. చెఱలcబడుట కాదు సేవ కా దంతంత, యీవి కాదు కలిమినెల్ల నిచ్చి
బసవయార్యుc దచ్చుబైరాగియై విన, యాశ్రమధ్వజమ్ము నవధరించె. 89

ఆ. గొల్లపూcడి శాస్త్రి గుణనిధి యెందఱ, కెన్నిమార్లు ధర్మ మెఱుకసేయc
దచటనచట బసవయంబోని తెగుదార్లc, బదురనే కరంచె నది జగాన. 90

ఆ. అలcత గననిసేవ వలచి బాపూమది, కొల్లగొన్నజోదు గొల్లపూcడి;
గణనకెక్కcజాలెc గావూరు మాయూరు, శాస్త్రి చలువ శాంతి సమరములను. 91

గీ. శాస్త్రి పఱపిన వెల్గు మా జనపదమున, గుదురుకొన్న తమస్సును జిదిమివైచె
నేను గాంధిమహాత్ము నాస్థానకవిని, గాకపోవచ్చు నీవెల్గు సోcకకున్న. 92

గీ. శాస్త్రి యెది యొనర్చిన నది శస్త్రధార, పైని బరువెత్తినట్ల యబ్రమును గూర్చు
నదిర ! తుదినాళ్ళ నితcడు జిహ్వాదిపొగరు, డింప నీకొన్న సరణి కడింది కరణి. 93

క. మూన్నాళ్ళకు నొక పూcటగc, దిన్నాc డితc డన్న; మదియుc దిక్తచ్ఛదమే
యన్నన్న ! యిట్లు తినుచున్, బన్నిద్దఱు చేసినంతపని యొనరించెన్. 94

క. ప్రాచీనులగు మహర్షులc, జూచితి మాశాస్త్రియందుc జూచితి దైవ
శ్రీ చెలువ మవల మోహము, రాచితి నౌచిత్య మెఱిcగి వ్రాసితిc గవితన్ 95

క. రుసి నీ సీతారామున్, బసవయచరితంబ చేర్చె నా పల్లియ; క్రీ
బసవయకున్ 'సర్వోదయ', మొసcగి సభాసదుల మ్రోల నొసపరినైతిన్. 96



గీ. భర్తృహరినీతిశతకంబు ప్రస్పందనము, చిందు తెల్గున వ్రాసి యిచ్చితిని దల్లి
కంచితాచారనిధికిc జెంచమకు లక్ష్మ, యార్యపట్టికి ఋణము కొంతైనc దీఱ. 97

*(నన్నపనేని లక్ష్మయ్య, నిడుబ్రోలు) (1961)*

క. ఇసుమంత యవగడము నా, దెసఁ దోఁచిన నీమె ప్రేమ దిగఁద్రావి ననుం
బసినింబలె గొట్టెను నా, పసితనముం గనక నీతిపస నెద నిడుచున్. 98

గీ. నిన్ను ఁజూచి యొడల్ వీడ నున్నదాన, వచ్చితివె తండ్రి ! నీవైభవమ్ము గంటి
గజమునెక్కి యూరేగుట గంటి ధన్య, నని ననున్ నిమిరిన యమ్మ కంజలింతు. 99



ఆ. ఎందఱెందఱో కవీశాను లీనాఁడు, జనులమనసు చూరగొనిరి గాని
నాకు మిగుల నచ్చినకవీంద్రుఁ డల వేంక, టేశ్వరుండ యితని కేటికోళ్ళు. 100

గీ. అంతనిర్దుష్ట మంతయొయూరి యైన, కైత నేర్చిన కాటూరి కవి యితండు
నిందుకుండ విధానఁ గన్పించు నదిర !, వినయ మీతనితోన యావిర్భవించె. 101

ఆ. ఇతని కితఁడ సాటి మితముగా హితముగాఁ, బలుకరించి ప్రజల నలరఁజేయ
నొరులపెంపు మెచ్చునుంకింపఁదనపెంపు, తగ్గునో యటంచుఁదలఁకఁ డితఁడు. 102

ఆ. ప్రౌఢకవిని జూచి పనవి యాతనికాలి, గోటి కీడుగాని చౌట నెత్తి
యేన్గుమీఁదఁ బెట్టు నే(బ్రాసి యేడఁ గా, టూరియేడ నమ్రతదూరబుద్ధి. 103

ఆ. నిజము చెప్పలేక ప్రజకు దవిష్ఠుఁడై, కుందుకవిని జూచి వందు నితఁడు
శంభుదాసు భవ్యచరితుఁ డెట్టనమంత్రి, వంగసమునఁ బుట్టు వడసె నితఁడు. 104

క. ఎట్టనవలెఁ దెలుఁగుంబస, వట్టలుగాఁ బఱవఁ గైత వ్రాయు నితండున్;
గుట్టము నిక్కవి తనచదు, విట్టింకఁగ బండివెనుక కీడ్వఁడు పూన్పన్. 105

క. పింగళికవిపంచాననుఁ, సంగతితో నితఁడు పల్కు 'సౌందరనందం'
బంగద నడంచె రసికున, కింగలమై వెట్టగూర్చె నీర్ష్యాళునకున్. 106

గీ. గౌతమునియందుగాంధినిగనియె నితఁడు, గాంధిలోగౌతముంబొడగాంచెనితఁడు
ప్రాంతక్రొత్త చక్కనలకుఁ బ్రాపు గాఁగ, వలచివలచి నెఱాకైత వ్రాసె నితఁడు. 107

క. యుగధర్మ మెఱిఁగి లోక, ప్రగతికి నాధారమైన పద్యము గద్యం
బగురా ! యని జగ మలరన్, నిగదించి యితండు కవులనేర్మిని జాటెన్. 108

గీ. హరిజనుఁడు తిర్మలేశుగర్భాలయమున, నర్చసేయంగ వలచి యుదారు లలరఁ
గావ్యమల్లినవిప్రుఁ డీకవి సమస్త, నరవికాసమ్ము వలచుమనస్వి యితఁడు. 109

క. కోవిదుఁడీకవి మానవ, తావాదము నాదరించుతమి గలఁ డగుటన్
మావర్ణమ గొప్పది యను, జీవన్మృతవాద మెపుడు సేయఁడు వినఁడున్. 110

ఆ. ఏది పొసంగకున్న నేమి టాగూరుకా, వ్యములు చదువుభాగ్య మబ్బె నాకు
నీఫలంబ చాలు నీజన్మమున కన్న, కవి యితండు తెల్గురవి యితండు. 111

గీ. రావణునివైరభక్తిపై వ్రాసినట్టి, కబ్బ మితనిది చిన్నదౌఁగాక యదియ
చాలు నపరవాల్మీకినా నేల నాల్గు, దిశల నితఁ డజరామరయశము నంద. 112

క. సరళస్వభావుఁ డగుటన్, బరమోదారమ్ము భువనపావనగంగా
ఝరసోదర మగుకవనము, కురిసెను గాటూరిపుణ్యకులుఁడు ఘనుండై. 113

ఆ. కవిగుణమ్ము లతనికవితన్ బయల్పడు, శైలి నంటి భావసరణిఁ బట్టి
పోతరాజు పుణ్యపురుషుండు కానఁ ద, ద్భాగవతము మనకుఁ బాసె మయ్యె. 114

గీ. పాకమునుమార్చి కవితనుప్రజలయందు, పాటునకుఁదెచ్చె వైదుషీ పేటిగురుఁడు
భావమునుమార్చికవనమ్ము ప్రజలమదికి, బింబమనిపించె శిష్యుఁడభిజ్ఞు లలర. 115

క. నామనుగడ నాపలు కే, నేమమ్ముల వెలయు నవియ 'నే' నను కృతి గా
నీమహితాత్మున కిచ్చితి, సోమించినతనివితోడఁ జొక్కుచు దానిన్. (1963)116



గీ. ఎవఁడు మూదల నా నొప్పు నీవి కెవఁడు, మాఱుపే రగు సేవ కమ్లానదీక్ష
నెవఁడు సర్వోదయోద్యమ మీధరిత్రి, నలముకొల్పు వేయికరాల నర్కువోలె. 117

క. భావేఋషిమె ప్పందిన, పావిత్ర్యనిధాన మెవఁడు భగవద్గీతా
హేవాక మెఱిఁగి చాటిన, కోవిదుఁ డెవఁ డెవఁడు దిట్ట గోవైద్యమునన్. 118

గీ. కంటివైద్యమునకుఁ దన్నుఁ గదియువాని, కెవఁడు పైవెల్గు లోవెల్గు నిచ్చిపంపు
నతని కొసఁగితి సూర్యనారాయణునకు, నా వచించినగీత శౌచావదాత. 119
(1963)



గీ. గమ్యమాశ్రయణీయమ్ము గ్రామ మనుచు, నడిపెఁ గాంగ్రెసురథము నేనాఁడు గాంధి
పూనె నానాఁడ 'వెలువోలు' పుణ్యవంశ, రత్న మరమర లేక స్వరాజ్యదీక్ష. 120

గీ. వాడవాడల బాపుజీవాణి వినిచి, నరకసఖమైన చెఱసాల నితికియిటికి
పురుగు లురలెడి "దేవతాపులుసు" త్రాగి, వేఁగె నివ్వీరుఁ డాగర్భభోగి యయ్యు. 121
(జైలుపులుసునకు 'దేవతాపులుసు' అని పేరు.)

ఆ. రాజకీయవర్గరణము దారుణముగా, సాగినపుడు 'శాంతి, శాంతి' యనుచు
దుండగీంద్రపోట్లతోఁ జచ్చి బ్రతికిన, పురుషుఁ డితఁడు పుణ్యచరితుఁ డితఁడు122

క. జాతీయత కేనాఁడో, హూతి యొసంగినది 'యమృతలూ'; రయ్యది యీ
సీతారామయ్యను గని, యాతతయశమున్ గడించె నాంధ్రధరిత్రిన్ 123

ఆ. ఇతనిదేశసేవ కితనివితీర్ణికి, వెలుఁగుదెచ్చె వీనివినయనిష్ఠ
కోరకున్న నితఁడు గుంటూరిసీమకు, నేత యయ్యె శుభవిధాత యయ్యె. 125

ఆ. చాలుఁజాలు నొక తెనాలికలాశాల, యితని లోకహితమనీష దెలుప
వెలయవచ్చు రేపు విశ్వకలాపరి, షత్తుగా నుదాత్తసరణి నిదియు. 125

ఆ. కవిత వ్రాసె నితఁడు గద్యపద్యముల; ను, ప్పొంగె నితఁడు సుకవిపూజ సల్పి
యేతదీయచరిత మెంచి ద్రవించి మత్, కృతిని 'బైరపంట' నితని కిడితి. 126

(1964)

ఆ. పైరపంట క్రొత్తబాటఁ జాగినకైత, నేర్మి యున్ననాఁడు నియతభాష
నందఱకును దెల్ల మగుచందమున వ్రాయ, వచ్చు నన్న తెలివి నిచ్చుకైత. 127

క. లోకజ్ఞత హెచ్చిననాఁ, డేకడ నేనుడి పొసంగు నిది కవి యెఱుఁగున్
వ్రేఁకన గల యుల్కన గల, వాకులు తద్రచనఁ జోటువడయఁగ వార్చున్. 128

గీ. ఎల్లరకు నర్థమగుటకై యేము నియతి, దూరమగు పల్కున రచింపఁదొడఁగినార
మజ్ఞులము కాముకా మనియాడువారు, కనవలయుఁబైరపంటసంక్రాంతి కవిత. 129

ఆ. నియతి లేనినాఁడు నిలువదు రాజ్యంబు, నియతి లేనినాఁడు నిలదు కైత
నియతి లేనినాఁడు నెగడదు లోకంబు, నియతి వలయు నశుభనికృతిపొంటె. 130



క. 'సమదర్శి' యనం దగుకృతి, రమణీయ కవిత్వఖండరంగము నిడితిన్
శమితాహంకృతి నాయని, కమితప్రేమమున గౌరవానద్ధమతిన్. (1967) 131

మధ్యా. బుచ్చినాయం డితఁ డజ్జరే ! నిడుఁద్రోల్ కలాశాల,
కిచ్చె నపారవిత్తంబు చిత్తంబు నిచ్చె; నీతనికి
నెచ్చెలుల్ షష్టిపూర్తిమహము నెఱపు నెత్తఱియందు,
మెచ్చుగాఁ గైత నిద్దాని నొసఁగి నెమ్మికి నిరవైతి. 132



ఆ. నియత చిత్తవృత్తి నిప్పునా బ్రదికి నల్, గడల వీనుమిగిలె లాల్ బహద్ద
రితఁడు వోయె నన్నకత వియద్వాణిలోఁ, గడల నుదరి సొమ్మగంటి నేను. 133

గీ. బాపుజీ లేని జవహరపండితుండు, కానిపింపని కొఱంత యెవ్వానిమదికిఁ
దోఁపనివిధాన లాల్‌బహదూరుశాస్త్రి, పరఁగె సాత్త్వికరాజసప్రభలు ప్రమ్మి. 134

గీ. ఆర్జవమ్మున కితనిఁ గొండాడవలయు, మితహితోక్తుల కీతని మెచ్చవలయుఁ
జిత్తవిభ్రాంతి గానక సృష్టిశీల, చేష్ట లొనరింప నితనిన చెప్పవలయు 135

గీ. ఇంట బయటవివాదమ్ము లెగసినపుడు, శాంతి సమకూర్ప శాస్త్రిజీ చతురుఁ డన్న
పే రితండు గడించె నీ నేరుపునకుఁ, గారణంబు లోకజ్ఞత గా కిఁకేది ? 136

క. భీరుత్వము కంటెను హిం, సారంభమ తగినచేఁత యని జనములకున్
వీరతను గఱపి మార్తుర, బారిసమరి నిల్చె నితఁడు భారతచరితన్. 137

క. రాహువు కేతువు ధర్మ, ద్రోహముతో నెగసి యెంతతొడరిన సమర
వ్యూహజ్ఞచంద్రుఁ డితఁడ, వ్యాహతుఁడై మెఱసె లోక మచ్చెరువడఁగన్. 138

క. ఓటాటినతటి నరుఁ డా, రాట పడు సంధి; కితఁ డరాతిబలమ్మున్
దూఁటాడియుఁ జెలికారము, పాటించె మహామతుల్ సెబా సని పల్కన్. 139

ఆ. భారతప్రధానపదమున కెనలేని, కీర్తి దెచ్చి నట్టి కృతి యితండు
దేశశాంతికై విదేశమం దలయుచుఁ, దనువు నూడ్చినట్టి ధన్యుఁ డితఁడు. 140

క. ఈతని సంస్మృతికిన్ గుఱు, తై తనరం జేసితిని మహాత్మక థేతి
ఖ్యాత బృహద్రచనమ్మును, నాతపమున- మేలిపంట నాఁ దగిన కృతిన్. (1968)141

గీ. బానిసపుమోపు త్రోపాడ బా పొనర్చె, నెన్నికోట్లల లాపద లెన్ని సైఁచె
నెట్లు జనతను మేల్కొల్పె నీ సమస్త, మరసి వర్ణించినాఁడ మహాత్మకథను. 142

ఆ. గాంధికృతికి సకలకలుషాపహాకుఁ దగ్గ, పతిని గంటి విట్టిపనికి నీవ
చాలు దనుచు నన్ను జనులు మెచ్చుచుఁ గమ్మ, లంప లంపటలఁ జలింపనైతి. 143

గీ. సాహితీమర్మవిన్మౌళి సాధుపురుష, భూషణము కవిసత్త మాభ్యుదయకామి
తిక్కవరవంశ కాసార దినకరుండు, రామిరెడ్డి నా కపు డిట్లు వ్రాసెఁ గమ్మ. 144

మం. "పూజనీయుండు బాపూ మనియున్న, కాలాన నీ వాత్మకథను దెనుంగుఁ
బద్యమ్మునకుఁ దెచ్చి ప్రఖ్యాత సాహి, తీవిమర్శకుఁడు నా దేశదేశాల
మంతు గాంచిన కట్టమంచిసత్కులుని, రామలింగారెడ్డి ప్రస్తుతి గొంటి
మా వర్ధమాన సమాజపక్షమున, సమ్మాన మంది తీ సత్కావ్యమునకు; 145
వెండియు బాపూజీ వెడలినవెన్క, నాత్మకథకు రాని యమ్మహాపురుషు
కథనెల్ల దినచర్యకరణి సమగ్ర, సుందరమ్ముగఁ బల్కి సుజనశేఖరుఁడు

రెండవగాంధి కీరితిగన్న బుధుండు, భారతీయామాత్యభాస్కరుఁ దహిత
గర్వనిర్వాపణ కరణప్రసిద్ధుఁ, దాత్మదేశాభ్యుదయార్థమై యొడలు
వదలిన వీరతావల్లు చరిత్రుఁ, దఖిలప్రజా హృదయస్థమై వెల్గు
లను జిమ్మెడిమహస్సు లాల్‌బహద్దరున, కర్పించి ధన్యత నందితి; నీదు 146
యశ మీ జగమ్మునం దమరమై నిల్చు, నాపట్ల నీకు మన్ననపేర్మి యున్న
కతనఁ జేసి మహాత్మకథను బంపితివి, కడముట్ట నాపుణ్యకథను బఠించి
తనియుభాగ్యము గంటి దైవమ్ముపట్ల, గాంధికిఁ గల నమ్మిక యపార మనుచు
సత్యంబునకు నహింసకు లోఁగి జాతి, పిత సహించిన వెతల్ పెక్కులటంచు
నెఱిగుల్కఁగాఁ బల్కి నేఁటివారలకు, రాఁబోవువారికి రాజమార్గంబు
నిర్మింపఁగంటివి నీకైత లాఁతి, కవుల కైతవిధానఁ గాక యెంతేని
వెలఁదిగానుదయించు; వెండియుఁబుట్టు, దురవస్థనీ వహో ! తొలఁగించుకొంటి 147
బాపూశతజయంతిపర్వమ్ము వచ్చి, సకలభూముల నేఁడు జరుగునుత్సవము
లిప్పట్ల మావీట నేఁటేఁట నేను, జరుపు కవిత్రయజన్మదినోత్స
వములందు నినుఁ గవిబ్రహ్మ తిక్కనఁగ, ననఘుఁడైన మహాత్మునాస్థానకవిఁగ
మఱియొక్క మాఱు సమ్మానింపఁ దలఁతు 148
నర్మిలి నాకోర్కి నంగీకరించి, మగుడ నిన్నుం గని మది నుల్లసిల్లు
భాగ్యంబు నాకు లోపడఁజేయు మయ్య!, నెల్లూరి కేతెంచునీవు నా కతిథి
వగుటయున్ వలె నని యర్థించుచుంటి” 149

16-12-68

గీ. ఈ యుదారత నేమందు నెంద ఉుందు, రిట్టికవిలోకబాంధవు లీజగానఁ
జాఁగురే ! మహాకవుల కర్చనలుసల్పి, నట్టికోవవాఁ దగుట నిట్లనియె రెడ్డి. 150

మం. అవ్వల నెల్లూరి కరిగి శ్రీ.శ్రీ.వి, భుండుగా రేబాలపురమందిరమున
నడచినసభఁ దిక్కనజయంతి సభను, మంజుసాహిత్య నిర్మాణ మానితుఁడు
మరుపూరుసద్వంశ్యమౌళి కోదండ, రామిరెడ్డి కవీశ్వర పదాంచితుండు
గురుకులాలంకృతి గుఱ్ఱము సుబ్బ, రామయాఖ్యుండు సారస్వతమూర్తు
లింకెందఱో రాక నెసలారుసభను, సాహితీసేవానుషక్త జీవనుఁడు
తిక్కవ రాన్వయోద్దీప్తి కారణుఁడు, రూఢికెక్కిన యుదారుఁడు రామిరెడ్డి
నాకృతిం గొనియాడి ననుఁ బ్రశంసించి, రెండునూఱాఱు లర్పింప శిరమ్ము
వంచి కృతజ్ఞత వలదుగాఁ జాటి, యెంచితి వాగ్దేవి నించితి మదిని. 151

16-2-69



ఆ. పిన్నతనమునందె నన్ను వీడినరాణి, రాఘవమ్మ కిడితి రమ్యకవన
ఖని నుదాత్తధర్మకలితము 'నాత్మార్ప, ణము'ను బ్రణయలక్ష్మణము నొనర్చి. 152
(1932)

క. కలిలేని బ్రహ్మచర్యం, బిరువదెనిమిదేండ్లు నే సహించిన పిదపన్
సరసకు వచ్చినయిది యొక, శరదన్ ననుఁబాసె విధివిశంకటతఁ గటా! 153

క. తానై యెదియుం గోరని, మానిని యిది దీని శమ దమ క్షాంతి ధృతి
జ్ఞానములు తత్త్వవిన్మణి, యై నెగడిన తండ్రి సుబ్బయన్ దలఁపించున్. 154

ఆ. నాకు మేనగోడ లీకొమ్మ, శేషమ్మ, కోరికోరి కన్న కూఁతు రీమె
మాతృదర్శ నేచ్ఛ మదిహెచ్చి తెగి యిది, పోయియుండుఁ బుణ్యభువనమునకు. 155

ఆ. వెడలుచుంటి సైఁపవే దోస మని పర, భూమి గాఢనిద్రఁ బొందియున్న
నన్ను వేఁడివేఁడి వెన్నెలచీరతో, నేగినట్టి వెలఁది నెట్లు మఱతు. 156
*(చంద్రికాధవళమగు చీరతో నాకు నిద్రలో గన్పించినది.)*



ఆ. జగమెలర్చుభంగిఁ దగువారి కిమ్మెయి, నఫలసంగయోగ మాశ్రయించి
యొసఁగినాఁడఁ గైత నుడుగరగా నల, వెంకనార్యు నుదులవంకఁ గనుచు. 157

ఆ. తెనుఁగువారు మంచిపనిఁ జూచి జేజేలు, పలుకునట్టివారు పల్లె పల్లె
కిద్దతైన నుంట నెక్కిన గుట్టము, డిగ్గనైతినేను స్రగ్గనైతి. 158

ఆ. సిగ్గు విడిచి నరుఁడు చేసాఁచినను వచ్చు, కలిమి చాల దుష్టుగంటికైన
వలసినంత యిచ్చువాఁ డీశ్వరుఁ డొకండ,యలఁతు లోప రీరహస్య మెఱుఁగ. 159

ఆ. బంధహేతువైన పని మాని ముక్తి ని, దానమైన చేఁతఁ దగిలి తగిలి
నిత్యతృప్తుఁడగు మనీషికి సంశిత, వ్రతపరాయణునకు వందనములు. 160
1967 మే, 69 మే

# తోఁటకూర బాకీ

క. వీసమునకు నంగడిలో, వీసెఁడు వంకాయ లబ్బువేళలఁ దెనుఁగుం
బాసను గఱపెడియొజ్జగ, వాసించితి భావపురిని వాసిం గనుచున్. 1

క. దినదినమును హట్టమునకుఁ, జని యపుడే కోసి తెచ్చుశాకము లర్థిం
గొని చేర్చువాఁడ నింటికి, వనజానన కూర వండ వార్చెడితతికిన్. 2

ఆ. తోఁటకూర గొంటిఁ దొలుతొల్త నొకనాఁడు, నెవ్వ కునికి యైన యవ్వచెంత
కానిపింపదాయెఁ గలనాణెములయందుఁ, గానిడబ్బు బేరగత్తె కిడఁగ. 3

ఆ. కూరగాయలెల్లఁ గొనిసాగునపుడు నీ, ఋణము నిత్తు నంటి వృద్ధతోడ
నెంతభాగ్య మిది సరే ! పొమ్ము నాయనా !, యనియె ముదుక సస్మితాస్య యగుచు. 4

క. కావలసినకూరలు కొని, యీ వెలసంగతిని మఱచి యింటికిఁ జనితిన్
నా వాడుకచొప్పున శా, కావళి కిడినర్థ మింత యని తెలిచితిన్ 5

గీ. లెక్కకును సంచిలో నున్న రొక్కమునకు, వచ్చినది వేర్మి యొక కాని హెచ్చియుంట
నెచటి దీమిగు లనుచు సమీక్షసేయ, గుర్తునకు వచ్చె నల తోఁటకూరబాకి. 6

గీ. మాయురే! ఐక్కదానినే మఱచినాఁడ, నేమి తలపోయుచున్నదో యిప్పు డామె
కనలి నన్నుఁ దిట్టదు గాని కానియైన, బీదవారలు రూపాయగాఁ దలంత్రు. 7

గీ. ఎల్లి కూరల కరిగి యే నిచ్చుకంటె, నిపుడ చని యవ్వ కీనిల్వ యిడుట లెస్స
యాకె విస్మృతి గనుఁగాక నా కవశ్య, కృత్యమిది యని విపణి కేగితిని మగుడ. 8

క. కదిసితి నవ్వను; గైకొను, మిదిగో నీ సొమ్ము రోసితే నను సంతన్ ?
మది మఱచి యిల్లు సేరితిఁ, బదపడి నీయ ప్పెఱింగి బాటం బడితిన్. 9

గీ. అనుడు నోతండ్రి ! నిన్నుఁ గన్నమ్మ యెన్ని, పున్నెము లొనర్చెరా! నరుఁ దన్న నీవ
మంచిదే కాని నాకాని మరల రేపు, వచ్చినపు డీక యింతలోఁ దెచ్చి తేమి. 10

గీ. ఎంత యలసితివో కదా ! యెండకూడ,మండుచున్నది వైశాఖమాస మగుట
బ్రదుకుమోయయ్య !వేయేండ్లుబ్రదుకుమెల్ల,సిరులతో నిల్వుమనికూర్మికురిసె నవ్వ11

క. ననుఁ గన్నంతన యీయమ, వినుచున్ నాకథను సాటివిక్రేతలకున్
ధనమునకుఁ గాదు దీనన్, గుణమునకే కలదు విలువ గొప్పగ ననుచున్. 12

ఆ. పిన్ననాఁటి నుండి పెఱలకు ఋణపడు, తీరు సైఁప దస్మదీయచిత్త;
మ ప్పనంగ నొడలియందు జెఱ్ఱులు పాఱు, కాడినట్లు రోఁత యగును నాకు. 13

క. ఈపట్టున్ దలదనుకన్, ద్రోపాడక నిలుపఁ గోరుదు నహర్నిశమున్
కాఁపురము దంబమునకున్, బ్రాపగుటకు నిష్టపడక పంతము గెల్తున్. 14

16-6-67

# రాష్ట్రగాన కృతి

ఆ. ఆంధ్రరాష్ట్రసిద్ధి నర్థించి యెనలేని, సేవ కీవి కానచేసెఁ గాన
నిడితి రాష్ట్రగానకృతి నాయకత్వంబు, చల్లపల్లి రాజ్య శాసకునకు. 1

ఆ. తెనుఁగుజాతియెడఁదకలరూపునకు రమ్య, దర్పణమ్ముగా నుదాత్తరీతి
నవతరించినట్టి దగుట నాంధ్రమున న, ల్గడను మొరసె రాష్ట్రగానవాణి. 2

గీ. మూఁడునాలుగుకూర్పులు ముగిసినంత, దీని కొకపండు వొనరింప మానసించి
సుహృదుఁడగు కుట్టి వేంకటసుబ్బరావు, ననుఁ గదిసి నిడుఁబ్రోల నిట్లని వచించె. 3

గీ. ఈవు ధన్యుఁడ వేనోట నెచట విన్న, రాష్ట్రగానప్రశంస కర్ణములఁ దాఁకు
నీ పలుకు సార్థకంబాయె నీతపమ్ము, పండె బ్రాహ్మీప్రసాదంబు పడసి తీవు. 4

మధ్యా.సంతుష్టి గంటి నీకృతి సమర్పణసభ గూర్చి ధరణి,
కాంతుని నిన్ను రావించి మన్నించి కవితాసపర్య
కొంత కావింప మాయప్పికట్లకుఁ గుతుకమ్ము వొడమె
సంతరించుకొనిన సాహితీప్రీతి సడలక యుంట. 5

ఆ. నారసింహగురుని కారుణ్యమునఁ గావ్య, రసము నభిలషించు ప్రజలు గలరు
కవులు నుందు రప్పికట్లలో నిది నీకుఁ,గ్రొత్త గాని దియ్యకొనవె ! సభకు 6

గీ. అనుడు నెన్నఁడో వెలువడినట్టి కావ్య, మిపుడు కృతిపతిచేతిలో నిడుట తగునె
యీవు నాతత్త్వ మెఱుఁగుదు వేల నాకు, సభలు మెప్పులు నే నొకసాధకుఁడను7

గీ. మఱియుఁగృతి నందుకొనవచ్చు మానవేంద్రుఁ,డింద మని కవికిం గట్న మీయకున్నె
యేనెటుల్ పుచ్చుకొందునాపూనినట్టి, నియతి నెచ్చెలీ ! యవిలంఘనీయముకద8

క. ఏ నిటు లనఁగా నీతెఱఁ, గా నరనాథునకుఁ దెల్పి యతఁ డనుకూలుం
డౌన ట్లొనరించెద నీ, వౌ నను మని వేఁడె మిత్రుఁ డారటపడుచున్. 9

క. మొగమోటకు లోపడి యే, 'నగు' నన నినగంటి వేంకటప్పయముఖ్యుల్
తగురీతిఁ గొమ్ముగావఁగ, బెగ డెఱుఁగక సిద్ధపఱిచెఁ బ్రియసఖుఁడు సభన్.10

క. ఛాత్రులతో సభ కేఁగిలి, ధాత్రీపతి వచ్చె, మూరుతము దాయుతఱిన్
మిత్రుఁడు నాబసకుం గడు, నాత్రముతో వచ్చి యిట్టు లభిభాషించెన్. 11

ఆ. ఏను జల్లపల్లి కేఁగిననాఁడు నీ, నియతిఁ దెచ్చినాఁడ నృపుని చెవికి
నెట్ట కేల కధిపుఁ డీకొన్న చంద మూ, హించి వచ్చినాఁడ నింటి దెసకు. 12

గీ. ఇపుఁడు ననుఁ బిల్చి తత్క్రపురీంద్రుమఱఁది, వేయినూటపదార్ల భూవిభుఁడు కవిని
గౌరవింపఁ దలంచెడి నీరు దీని, కేమిసెప్పెద రనుడు నే నిఱుకునఁబడి 13

మధ్యా.ఈ వేమియందువో యని హుటాహుటి నిట వచ్చినాఁడ
భూవల్లభుం డిచ్చుధనము వేయార్లు, పొటిపొటికాదు
చేవగలపొలము నాల్గుకుంటలు చేకూరు దీన
నావాక్కు లాలించి శిరమునూఁపు మన్నా ! పట్టువదలి. 14

ఆ. కవులు నూర్లు వేలు కా దగ్రహారముల్, గనరె నృపులవలనఁ గైత నిచ్చి
కలిమిబలిమి నీకుఁ గలదందువా యున్న, నాల్గుపదుల యొజ్జనం బదేల 15

ఆ. చనవుకొలఁది నిట్లు వినిచెద నాపల్కు , రిత్తచేసి తేనిచిత్తమునకు
నోవి గూర్పకయ్య !నావుడు నే నిటు, లంటిఁ బిసిడితనపుటంటు వడక. 16

ఆ. ఇంతదనుక వచ్చు టెఱిఁగియ ముందుగా, నెత్తిచెప్పినాఁడ విత్తవార్త
నూలుకొనద యాఱునూటైనఁ గృతినిచ్చి, యర్థ మాహరింప నస్మదాత్మ. 17

మం. ఏనాఁడు నానెత్తి కెక్కి లోభంబు
నాకట్టు నాపట్టు నలినలి చేసి
నను జార్చునో యని .నానియమంబు 18

క. కృతమెఱుక చాలు నస్మ,
న్మతి కింపద కబ్బమిచ్చి మణి గొంట జగ
ద్ధితశీలుం డొదవ నయా,
చితమ్ముగా నిడుదు నాసృజించినకవితన్. 19
నా నియమ మిది

మం. సేర్చితి మొన్న నీచెంతకు నంపు, రచనమ్మునందు ధర్మజ్యోతియందు
నాపద్యమును జూడవా చూచియుందు, వేల వెండియు నీకు నీ రిత్తగాసి 20

మం.నరుని గొప్పతనమ్ము నైకనైపుణులఁ
గా దయా! జీవనగతియంద కలదు
దేనినైనఁ ద్యజింపఁ దివురుదునేమొ
మనుగడచందంబు మార్చ నెప్పటికి 21

మం.నంతసంపద యున్న యట్టిభూమీశుఁ, దంతయౌచితి గన్నయట్టి ప్రాజ్ఞుండు
వేయార్లకంటెను వెలితియౌ కాన్క, నాకృతి కిచ్చునా నారాష్ట్రగాన

కవితకు నిచ్చునా కనవేమొగాని, నృపతి యీనాఁడు కనీస మీకొలఁది
మూట తెచ్చు నటంచు మొదటనే కందుఁ, బ్రతిలేని శౌచసంపద వలెఁ గాని
బ్రదుకుట కేపాటిబందారు వలయు ? 22

మం.నాతంబ్రినారయ్య నాదారుహలికుఁ, దంతబంగారంబు నవలికిం ద్రోఁత
యేటికయా నీతి నిచ్చించి కాదె, జతలేని ధార్మికాసక్తిచేఁ గాదె 23

మం.సుబ్బరాయా ! యేల శుష్కవాదంబు,
మానవేంద్రునకు నస్మన్నియమంబు
వివరింపు మతఁడు వివేకసంపన్నుఁ ,
డగుట సర్వమ్ము భవ్యమ్ముగా నడుచు. 24

ఆ. అనుడు మిత్రుఁ డేగె నవనీశ్వరుండు నా, యాదరించునియతి కనుమతించె
సాహితీప్రియ ప్రజాకదంబముతోడ, సాగె సదసు పెండ్లిసంబరముల. 12-7-4225

ఆ. అనుగుణోక్తు లాడి యంకితపద్యముల్, చదివి ఫల లతాంత చందనాదు
లొసఁగి రాష్ట్రగాన ముపదచేసితి శివ, రామునకును దూర్యరవము లెసఁగ 26

క. “ఇది నామనుగడలో నొక, సుదినము తుమ్మలకవీంద్రు సురుచిరవాణీ
గదితం బాంధ్రప్రియతా, స్పదమగుకృతి నందుకొన్న పర్వం బగుటన్. 27

ఆ. అదిర ! మూఁడుకోట్ల పెదవులపైఁ గుల్కు, కావ్యమునకు రాష్ట్రగానమునకు
నాంధ్రవైభవమ్ము నర్థించుకృతికి నే, విభుఁడనట్టె ! యెంత శుభము గంటి. 28

గీ. నాయెడ నయాచితమ్ముగ నీయభిజ్ఞుఁ, డెంత యౌదార్యమును జాటె!నెంతకరఁగె!
నిదెద నీకావ్యపుష్పమ్ము నెడఁదతోడ,నాంధ్రజననీ పవిత్రపాదాబ్జపీఠి. 29

క. ఇత్యాది సదుక్తులతోఁ, గృత్యధిపుఁడు నన్ను సభను గీర్తింప మహో
మత్యంచితు లాహో ! యని, రత్యంతవినీతి కే నుపాశ్రయ మైతిన్. 30

22-8-71

## అక్షరాస్యత

గీ. ఒజ్జగా నేను బాపట్ల నుండునాఁడు, విసరె నొకగాలివాన దిగ్విసర మదర
నిండ్లు తలక్రిందులై పసి యీల్గి పంట, పాడటి జనంబు గగ్గోలుపాలు కాఁగ. 1

క. భావపురంబున నపు డొక, సేవాసంఘమ్ము వెలయఁ జేరితి నందున్
జీవసెడి కుందు పేదల, కావంతశుభమ్ము గూర్ప నారటపడుచున్.(బాపట్ల) 2

క. మాసంఘము వస్త్రమ్ముల, వాసమ్ములఁ దండులముల వసువును సతతా
యాసమున సంతరించె ద, యాసంపన్నులు ధనాఢ్యు లనుకూలింపన్. 3

గీ. బడుగులకు వీనిఁ బంచుచుఁ బల్లెటూరి, జనులఁ గదుఁ గుంచుదయ్య మజ్ఞానమన్న
సత్య మెఱిఁగితి నక్షరాస్యత ఘటింప, నుద్యమించితి నొకచిన్నయూరిప్రజకు. 4

క. బడిపని ముగించినంతన, తడయక యప్పొలెమునకుఁ దరలి యనుదినం
బుడుగనిదీక్షం గఱపితి, బుడుతలకుం జదువు నిరులు పొలసెడిదనుకన్. 5

ఆ. చిల్లిగవ్వయేని చేతిలో లేని వా, రలకు నేన పలక బలప మిచ్చి
పొత్తమిచ్చి తృప్తిపొందితి నది పర, మేశ్వరున కొసంగునీవి యనుచు. 6

క. ఓ కున్నవంక లెఱుఁగని, మూఁక యలఁతియలఁతిపుస్తములను బఠించెన్
లోకజ్ఞత నార్జించెను, వాకొన్నది సరిగ వ్రాయు వలను గడించెన్. 7

ఆ. అర్ధ మనక శబ్ద మన కపు ద్దనక లె, గుండి యనక కాంత కూంతె యనక
శిష్టు లుచ్చరించుచెన్నున బాసాడ, నేర్చె నాలుగైదు నెలలలోన. 8

గీ. చిన్న చిన్న వ్యాసములు రచించె నాంధ్ర
పత్రికం గని దేశీయవార్త లెఱిఁగె
నాల్గుచందాలలెక్కల నలువు నందె
నవగత మొనర్చుకొనియె మానాళినెల్ల. 9

ఆ. తెనుఁగువత్సరాలు తిథులు మాసమ్ములు, ఋతువు లెఱిఁగె దెసలు రిక్క లెఱిఁగె
విజ్ఞతాశ్రయమ్ము వేమనశతకమ్ము, చదివె నర్థభావసరణి గనియె 10

గీ. అద్దిరా ! క్రొత్తపుట్టువు నందినట్లు, తోఁచె నిది; దీనివెల్గులు సూచి తాత
లవ్వలుం దల లూఁచి; రే నాప్రజాళి, పాలి కొకవేల్పుగాఁ గనంబడితి నపుడు. 11

మం. నాయూడిగంబు పంటకు రాకఁ గనుచు, దనివి నందుచుఁ బట్టుదల డిగ్గవిడక
బడి నొకయేఁడాదిపాటు సాగింప, నంతలో నిదుఁబ్రోలి కరుగంగవలసె 12
విడలేక పొలెమ్ము విడిచినవెన్క, నల్లనల్లన నాలుగయిదేండ్లు కడవ
నొకనాఁడు గురువుగారూ !, నమస్కార, మనుచు నాసన్నిధి కంజయ్య రాఁగ13
నేమోయి! కూర్చుండుమీ ! పొలెమెల్ల, సుఖముండెనా ? మన సుబ్బన్న యేసు

వీరన్న మున్నగు విద్యార్థులేమి, సేయుచున్నారు ? నా చెప్పిన చదువు 14
మఱవరుకద; జగామంచివాసనలు, ముసురుకొన్నవి నీదుమూటలో నేమి
కల దని నేఁ బల్కఁగా విప్పబాఱు, మొగముతో శిష్యుండు మూటను విప్పి
కన్నె గేదఁగి చెండ్లు కానుక సేయ, నలరి సంగతులేమి ? యంటి; నతండు 15
మీదయచే నాఁడు మేల్కొన్న నేను, జదువు మానక పారశాలకు నేగి
మతికొంత నేర్చితి; మాయూరిచెంతఁ, గలపల్లెలోఁ గ్రొత్తగా నెలకొన్న
బడికి నన్నొజుఁగా బనిచె సర్కారు, తమదీవనలు గన్న తరువాత నొజ్జ
తనమునం దీఁగెద దాసు ననుగ్ర, హింపరే న న్నని యేను వెన్కాడు
చున్నను నాయడ్గు లొయ్యన పట్టి, తలవంపఁగా బాష్పధారలతోడ
లేవనెత్తితి వాని; లెస్సపల్కులను 16

విన్నాఁడఁ గుఱ్ఱఁడా ! వేల్పు నీపాల, నున్నాఁడు తనిసె నాయుల్ల మీ వఖిల
భద్రమ్ము లందుము, పంతుల వైన, విద్యార్థి వగుచు జీవింపుము సతము
మానవసేవగా మది నెంచి గురుత, సాగింపు; మదె బావి స్నానమొనర్పు
మారగింతము వేళయైనది యంటి 17
నాబంతి నాతఁ దన్నము దిన్న వెన్క, రెండుదోవతు లుత్తరీయముల్ రెండు
నతని కొసంగి నీ వర్పించినట్టి, మొగలిపూవలె నచ్చమును మనోజ్ఞంబు
నగుకీర్తి నందుకొ మ్మంజయా ! యంటి. 18

**24-3-72**

## మానుషము

ఆ. "లేక లేక కల్గె లోకేశుకరుణ మా, సాహునకు సుతుండు సత్క వీంద్ర!
యెల్లి వచ్చు విదియ నీతని జన్మది, నోత్సవమ్ము జరుగు నొప్పిదముగ. 1

క. పాటకచేరీ లుందును, నాటకములు సాగు నృత్యనైపుణి మెఱయున్
నేఁటి యమాత్యుల రాకయుఁ, బాటిల్లును సకలవైభవము లిం దెసఁగున్. 2

ఆ. రాణగన్నకవుల రావించి నూఱార్ల, సత్కరించు దీన సాహుకారు
తాము పండువునకుఁ దప్పకవచ్చి యీ, గౌరవంబు నందఁ గోరువాఁడ." 3

క. అనుచు ననుజీవి యొక్కఁడు, పనిచినయుత్తరము వచ్చెఁ బజ్జకు; దానిన్
గనినంతన మన్ననమున, గన లేర్పడె మానుషమ్ముగలకవి నొటన్. 4

క. తనక్రింది వాని నిసిరో !, పనుచునె ధని నన్నుఁ బిలువ! భాగ్యము వెంటన్
వినయమ్ము నుంట వలదా, మనుజున కిమ్మెయిని దురభిమానము చనునా ?5

ఆ. పరువులేనిసొమ్ము పదిలక్ష లగుఁగాక, కవికి గడ్డిపరకకంటె లొచ్చు
కవితకంటె రూక గణనీయమా ? యది, యమరసృష్టి యిది పయస్తరంగ. 6

ఆ. నిధులు నిల్వలేదు నింగిని రాపాడు, మేడ లాఁగలేదు జోడులేని
రాజ్యవైభవము తిరంపడలే దొక్క, కవిత బ్రతికె యుగయుగాలు చన్న. 7

ఆ. క్రైత కపయశమ్ము కల్గించుజీవిత, మేల కవికి, సిరులజాలె లుంట
నాముకొన్న బిడ్డ నౌచిత్య మెఱుఁగని, మాసికతన వచ్చు కాసులేల ? 8

గీ. వలదు వల దని శిష్యుని బిలిచి నాదు, వేదన సమస్త మతనికి వినిచి తగిన
కమ్మ వ్రాయు మటంటిని గ్రన్న నతఁడు,జాబును ముగించి నాముందు చదివెనిట్లు.9

సీ. "మీ యేలికకు మాఱు మీరు మద్గురువులౌ,తుమ్మలవారికి నెమ్మిమీఱఁ
బనిచినలేఖ వచ్చెను గాని యయ్యది,సముచితం బగునట్టి సరణి రామి
నావంతతనువు నీదయ్యె మాయొజ్జల;కగుట మహాస్సున కరుగుదేర
నిచ్చగింపక వార లివ్వార్త సరగ మీ, కెఱిఁగింపఁ దత్సేవ కెదురుసూచు

గీ. నన్ను నియమించినారు, మీపన్నుసభల, కొఱపు చేకూరవలె నని చ్ఛిఱుత నూఱు
వత్సరాల్ మనవలె నని వానికుదురు, ననయవలె నని కోరుచున్నారు వారు."10

క. తగురీతి వ్రాసితివి నీ, కగుఁగాక శుభంబు లంటి నంతే వాసిన్;
జగ మెచ్చినమార్గమున మ, నుగడన్ సాగించుచుంటి నుడికొల్వరినై. 11

**15-4-72**

# ఆశుకవిత

గీ. ఏను ముక్త్యాలనరపాలు నింటిపెండ్లి, కరిగినప్పుడు చింతపల్ల్యవనివిభుఁడు
హరిహరప్రసాదబహద్ద రస్మదీయ, కవిత నగ్గించి పెద్దతికమ్ము పగటి- 1

మధ్యా.మావేల్పు రాజ్యలక్ష్మీవిభుఁ దమరమౌళి పొన్నూరి
భావనారాయణస్వామికల్యాణపర్వమ్ము తటిసె
రావలయును మీర లుత్సవమునకు రమణీయ సాహి
తీవైభవమ్మును మెఱసి ప్రజకు సంతృప్తి నీవలయు. 2

క. అని పిదపిదనం బల్కిన, (1947 మార్చి)జనపతికిన్ వాసిరెడ్డిసత్కులునకు నా
వినయమ్ము చాటి తన్మతి, కనుకూలము లైనమాట లాడితి; నవలన్ 3

ఆ. ఇల్లు సేరినాఁడ నల్లల్ల దినములు, కొన్ని గడచె నంత హొన్నుపల్లె
నిరవుకొన్న వెన్నుతిరునాళ్ళు కదిసెఁ ద, ద్ధర్మకర్తపిలుపు తనకు వచ్చె. 4

గీ. జనని శారద నర్చించి సాహితీప్ర, సంగ మొనరింప భావన్నసముఖమునకు
నరిగి దిగువదినమ్మునం దాశుకవిత, నొకఁడు తెగనాడె నని వింటి నుడుకుగంటి. 5

గీ. మానుకొంటి నుపన్యాస; మేను జవన, కవనమును జెప్పెద నటంటి నవనవ ప్ర
మోదమును గంటి సభ్యులముఖమునందు, నడిగితిన్ గథనీయ మెయ్యదియటంచు.
6

క. సీతారాఘవ పరిణయ, రీతిని వివరింపుఁ డనెఁ బరిషదధ్యక్షుం
డాతంక మెఱుంగక నేఁ, గైతకు దొరఁకొంటి నాశుగతి రవళింపన్. 7

ఉ. "అప్పుడు బట్టుమూర్తి మొదలైన కవీశ్వరు లాశుకావ్యముల్
చెప్పిరి కొప్పరంపుఁగవిశేఖరు లిప్పుడు వెల్వరింత్రు పు
ల్లప్పలు వెక్కిరింతురఁట యాశువు దుష్టమటంచుఁ, బండితుల్
సెప్పుఁడు మామకోక్తి పరిశీలన చేసి నిజంబు నియ్యెడన్. 8

ఆ. ఒక్క యలంతిదోస ముండిన నిఁకఁ గైత, వక్కణింప నొల్ల వ్రాయ నొల్లఁ
దప్పు గాని పల్కు తప్పనివాదాడు, మాసినాల్క కోఁత మాన నొల్ల" 9

క. ఇవి మొదటిపద్యములుగా, జవనకవిత్వంబు సెప్పఁజాగితి సీతా
ధవుకరుణ నమరతటినీ, ప్రవాహ మన వెడలె హృద్యపద్య వ్రజముల్. 10

గీ. గంట కిన్నూఱుగా నుడిసొంటు లేని, చక్కనల్ దుసికిల్లని, తిక్కయజ్వ
జాడ వీడనిపద్యముల్ మూఁడువంద,లాయెఁ గల్యాణకథయు సమాప్తమాయె. 11

గీ. సభను నడిపిన కోవిదసత్తముండు, శేషగిరిరావు సత్కవిశేఖరుండు
పిచ్చయార్యుఁడు నన్ గడు మెచ్చి రాశు, కవివతంసమ్ము తుమ్మలకవి యటంచు. 12

*(చింతలపూడి శేషగిరిరావుగారు, హైస్కూలు పండితుఁడు,*
*నిడుబ్రోలు చల్లా పిచ్చయ్య శాస్త్రిగారు)*

మధ్యా. ఆవెన్క నొకపెద్ద వచ్చి మెల్మెల్ల నధ్యక్షుచెవికి,
నేవియోపల్కు లందింప శ్రోత న స్నీక్ష యొనర్చి
భూల్లభుఁడు మిమ్ము సత్కృతుం జేయఁ బూనె నూఱార్ల,
నీవిధానంబు నంగీకరించెదరే ? యనె నల్ల. 13

గీ. అంత నే నేన్గు నెక్కి యన్నా ! మహీంద్రు, శంక యెనలేని యెలమి నొసంగెనాకుఁ
గృతిపతులసొమ్ము నంగీకరింపఁ గాని, యిట్టి సమ్మానములకు నే నెదురుసెప్ప. 14

ఆ. పిలిచి పీఁటవైచి పేర్మిమై జగ మిచ్చు, కాన్క నందు టెగ్గు గాదు కవికి
నతని పల్కు విశ్వహిత మయ్యె ననుటకుఁ, దారకాణ మిట్టి గౌరవంబు. 15

క. నావుడు నరపతి నను సం, భావితుఁ గావించె నతనిభాషాసేవన్
నే వినుతించితిఁ గవితా, ప్రావీణ్యము గన్నవారు బళిరా ! యనఁగన్. 16

5-5-1972

# పాకీపని

క. ఒకనాఁటిమాట; యాచా, ర్యకమును సాగించుచుంటి నపు డే నొకచో;
స్వకపారశాల జనథా, నికి నించుకదవ్వునందు నిర్మితమాయెన్. 1

క. రవి క్రుంకినపిమ్మట నట, నెవఁడుండుఁ దలారిజగ్గఁ డింటన పండున్
స్థవిరుం డతఁ; డిల్లాలో, జవరా; లిఁకఁ జెప్పనేల జగ్గనికాపున్. 2

ఆ. తెల్లవాఱుసరికిఁ బిల్లలో పెద్దలో, బడిమొగాన విష్ఠ విడువఁ దెగిరి
యిసి ! యిసీ ! యటంచు నేవతో నంగలు, సాఁచి రయ్యగార లాఁచి యాఁచి3

ఆ. అలఁతి యలఁతి యత్నములు రిత్తవోయె వి, ద్యాపదమ్ము నరకకూప మాయె
సిగ్గువడితి నింతయెగ్గున కె ట్లొడి, గట్టె జనత యనుచుఁ గలఁత పడితి. 4

క. బడిగంటకుమున్నే చని, తుడువం దొరఁకొంటిఁ బలుకుఁదొయ్యలికడపన్
చెడిన మల మెత్తి పూడ్చితి, మదుఁగుఁదనమ్మునకు లెస్స మల్లటపడితిన్. 5

క. కొందఱు ననుఁ గని నవ్విరి, కొందఱు వెఱఁగంది మెప్పు గురిసిరి నాపైఁ
గొందఱు విద్యార్థులు నా, దెందముఁ దన్పిరి శకృత్తుఁ దెరలించుపనిన్. 6

ఆ. నాలుగైదునాళ్ళు నడచె నీరీతి; నా, యోగమునకు సిద్ధి యొదవదాయె
నొక్క రేయి బడికి నొయ్యన చని యంద, నిలిచినాఁడ శౌచనిరతితోడ. 7

ఆ. కొసరి పైఁడికంటి కూసెడితటికి వి,చ్చేసి రిద్ద ఱటకుఁ జెంబు లూని
వారిఁ జూచి "తల్లులార ! ప్రసన్నలై, వినుఁడు నాయొనర్చు విన్నపంబు. 8

ఆ. ఇది పవిత్రతీర్థ మిది జ్ఞానపీఠంబు, చదువులిచ్చుతల్లి కిది సదస్సు
మనకుఁ బూజ్యమైనమందిర మిది దీనిఁ, జెఱుపరాదు కించపఱుపరాదు. 9

క. వీ లగుచో దినదిన మీ, యాలయమున కిడుఁడు ముగ్గు లందము చిందన్
బాలురు బాలిక లొజ్జలు, మీలో నేర్పడిన మార్పు మే లని పొగడన్. 10

క. అవ్వలన రెండుగుంటలు, త్రవ్వితి నట కేగి మీవెతం దీర్చుకొనుం
డవ్వెనుకఁ బురీషముపై, దువ్వను గుప్పింపుఁ డొక్క దోసెఁడు చాలున్. 11

క. మీ పెరడు పెద్దదగునే, నీపాకీదొడ్డి కట్టుఁడీ యొకమూలన్
బాపూ బ్రదుకుం గని విని, యీపారము సెప్పఁగంటి నియ్యెడ మీకున్." 12

క. అని యేను మృదుతరోక్తుల, ననుడున్ ద్రప మున్గి పిఱఁది కరిగిరి మగువల్
గణనీయ మగుశుచిత్వము, గనియెన్ బిడి నాఁటఁగోలె గ్రామము చలువన్. 13

క. సేవామయ మగుకార్యం, బేవాని యెదందజడ్డు నెడప దటంచున్
గేవలవక్తలు నను సం, భావనసేయం జలించి వంచితి శిరమున్. 14

6-5-1967

## అంకితము

ఆ. అస్మదీయరచన మచ్చగునందాఁక, నది యదంకితంబొ యన్య్ర తెలుఁగ;
రతని కాసుమీఁదిమతి నాకు లేకుంటఁ, గృతిపతియు నెఱుంగఁ డీ రహస్సు. 1

క. తప్పేమీ యని యతనికిఁ, జెప్పకయ వెలార్తుఁ గృతిని; జెలికాంద్రకు వి
ద్యాప్పతులకు నది పంపెదు, నప్పుడు కృతిపతికి సైత మంపెదఁ బేర్మిన్. 2

ఆ. అతఁడు దానిఁ జూచి కృతమెఱుకం జాటు, కమ్మ నాకు వ్రాయుఁగాక వ్రాయ
కుండుఁగాక రెంటి నొక్కమైఁ జూచెద, 'మాఫలే' షటన్న మాట నెంచి. 3

ఆ. దేశసేవ నతఁ డతీవశ్రమమ్ములు, సైఁచెఁ గాన వాని సరణి మెచ్చి
కృతిపతిత్వ మిచ్చి యతని సంభావన, సేఁత యొకఁడ నాకుఁ బ్రీతిగూర్చు. 4

ఆ. చిన్న చిన్న కృతులు కొన్నింటి నొకసారి, "పెద్దకా" పటన్న పేరు పెట్టి
వెలువరింపఁ బూని విభునిగా నెవ్వానిఁ, గూర్తు దీని కనుచుఁ గొంతతడవి- 5

గీ. దండియాత్రను బాపుజీదళమునందు, నిలుచు భాగ్యమ్మునకు నోఁచి తెలుఁగువారి
మదిని దోఁచిన యెర్నేని మహితవంశ, భవుని గంటి సుబ్రహ్మణ్యు భావవీథి. 6

గీ. ఒక్క సీసముతో వాని నొడయుఁ జేసి,వీలు పొసఁగినయంతఁ దెనాలి కేగి
కృతిని ముద్రించి తోడ్తోడఁ బ్రతి నొకంటి,ననిచినాఁడ నెర్నేనికి నంచెవలన. 7

క. తన సంగతి చూడక య, య్యనఘుఁడు కృతి నిరవుకొన్న యాయైకవితల్
గని వానిం బొగడుచు లే, ఖ నంప నవ్వుకొని పిదపఁగథను మఱచితిన్. 8

ఆ. మూఁడు నాల్గు మాసములు చన్న వెనుక నె, ర్నేని యిట్లు వ్రాసె నెగులు తఱుమ
'రాష్ట్రకవివరేణ్య ! రారాని పొరపాటు, వచ్చి నన్ను గ్రుడ్డివానిఁ జేసె. 9

క. మీ పంపించిన కృతిఁ బెద, కాపున నొకపొరట నపుడు కానక నాపై
మీ పఱపినకృప నెఱుఁగని, పాపముఁ జల్పితిని విధివిపర్యాసమునన్. 10

క. అలవోక నేఁడు కబ్బము, దిలకించుచు నంకితంపుఁ దీరుం గని నా
తొలిపున్నెముల ఫలం బా, పలు కని భావించి శిరమువంచితి మీకున్. 11

ఆ. నిక్క మరయ నాకు నీకున్న గాంధేయ, బాంధవంబ యింతపని నొనర్చె
నిది భవిష్యదవధి నిరువుర కెట్టి మో,దము ఘటింపఁగలదొ దైవ మెఱుఁగు. 12

క. మన పొత్తు విస్తరిలుతన్!, మన బాపూతపము విజయమంజుల మగుతన్ !
నను మన్నన చేసిన మీ, కనిదంపూర్వప్రశస్తి యగ్గంపడుతన్ !' 13

క. సుబ్రహ్మణ్యుని నుడులకు, నబ్రాశివిధానఁ బొంగె హర్షము నాలో;
నబ్రము లిట్టివి కోర్కుల, సెబ్రకు దవ్వయిననాఁడె చేకుఱుఁ గవికిన్. 14

20-8-71

## కవ్యర్చ

ఆ. వంగవసుధఁ జీల్ప నాంగిలేయులు కుట్ర, పన్నినంత నఖిలభారతమ్ము
నిద్రవిడిచి దాస్యనిగళవిచ్ఛేదనా, సక్తమయ్యె నుష్ణరక్తమయ్యె. 1

ఆ. దేశభక్తి సాహితీసరస్వతి కపు, దాత్మ యగుట బిరుదులైన కవులు
సంతరించి రేకజాతీయతా సము, త్పాదకము లపూర్వభవ్యకృతులు. 2

ఆ. చిలుకమర్తివారు చెన్నా ప్రెగడవారు, తెరువుసూపఁ గదలి తీయతీయ
వెచ్చ వెచ్చ కైత లిచ్చి రాంధ్రుల కాత్మ, దేశముక్తి నభిమతించు కవులు 3

ఆ. నాఁడు తెల్గునాట నవకవితా సృష్టి, కర్తలైన కవుల గణనపట్ల,
మంగిపూఁడికులజమౌళి వేంకటశర్మ, పేరు కొసకుఁ జెప్పువారు లేరు. 4

క. స్వాతంత్ర్యపిపాసా వశ, చేతసుఁ డీకైసరుఁడు సృజించిన గీత
వ్రాతమ్ము పల్లెపల్లెకుఁ, జైతన్యము నిడె యుగార్హ సందేశములన్. 5

గీ. సంఘసంస్కరణాసక్తి సందడింపఁ, బలికె నీసత్కవి నిరుద్ధభారతంబు
నంటరానితనమ్ము దూష్యం బటంచుఁ, జాటుకబ్బములన్ సడిసన్నదాని. 6

క. బాలవితంతు విలాపము, ఆలైనఁ గరంగుభంగి వ్రాసెను, బాపూ
మేలిగుణమ్ములు శత కం, దాలన్ గొనియాడె భక్తితత్పరమతియై. 7

ఆ. రామమోహనుండు రక్కొసనమ్మికల్, సమయఁ జూపినట్టి సాధుపథము
బ్రాహ్మధర్మమునకు బంటుగా బ్రదికిన, నరుఁడితండు ధన్యతరుఁ డితండు. 8

గీ. "మద్దుకత" నేర్పరించె నీమంగిపూఁడి, కవివతంసము తెనుఁగుఁజక్క నలు కులుక
భారతికి నూత్న శోభ రాన్ బయలు మెఱసి,యది రసజ్ఞప్రశంసల నందుకొనియె. 9

ఆ. గణ్యుఁడైనశర్మ కవితాతపమ్మునఁ,బండిపండి ముదిమిపాలఁ బడియె
ముదిమితోడ రోగములు క్రమ్మె రోగాల,వెంట నితనిఁ బెక్కు వెతలు తాఁకె. 10

మధ్యా. పత్రమో పుష్పమో ఫలమొ తోయంబొ భక్తిసంయుక్తిఁ
బాత్రుల కిడుట కర్తవ్య మని యెంచుపండితుఁ డాంధ్ర
పత్రికం బ్రకటించె శర్మ నొక్కసభన్ సూరి సుకవి
మిత్రులముంగడ సత్కరించుట మేలిచేఁత యని. 11

గీ. అమ్మనీషి దుర్గామల్లికార్జునాఖ్యుఁ, దనరి పామర్తిలో నొజ్జతనము నెఱపుఁ
దనతలంచినపని కియ్యకొనెడివాని, నైదురూపాయ లడిగెఁ గవ్వర్చ కతఁడు. 12
*(శ్రీ కోగంటి దుర్గా మల్లికార్జునరావు)*

క. మంచిది యని యపుడపుడే, పంచితి రూప్యమ్ములైదు పామర్తికి; నే
సంచున సభ సాగునొ యను, కొంచుండఁగ నెలలు ఋతులు కొన్ని గతించెన్13

గీ. ఎట్టికేలకు బెజవాడ పట్టణమున, జరుగు సన్మానసభ యన్నజాబు వచ్చె
నాత్మకథను మహాత్ముని యమరవాణి, నచ్చునకు నిచ్చి యే నపు డంద యుంటి. 14

ఆ. పక్షవాతరోగబాధితుఁడై బక్క, చిక్కియున్న శర్మదిక్కుఁ జూచి
పలుచఁబాఱియున్న ప్రజఁ జూచి నిట్టూర్చి, యుడికినాఁడ గోష్ఠి నడుగుమోపి. 15

ఆ. అఱువదేండ్లు నిండి నయ్యంకివేంకట, రమణుపట్ల నాదరమ్ము దెలుప
నేర్పడినసమజ్య కిది యనుబంధమై, నడచెఁ బెండ్లిలోన వడుగువోలె. (13-10-50)16

ఆ. కార్యకర్తలు కోరుటకతనఁ జేసి, మంగిపూఁడికవీంద్రుండు మాతృదేశ
గరిమ వలచి రచించినకైతసొంపు, మెచ్చుచు నుపన్యసించితి రచ్చయందు. 17

క. పొగడిక లన్నియు నొయ్యన, ముగిసెన్ గానుకలొసంగుమూర్తము దాసెన్
నిగనిగని కదరుటోపీ, సొగసునఁ గోగంటి నిల్చెఁ జూపఱయెదుటన్. 18

క. ఆపండితుఁ డొక దెబ్బది, రూపాయలు జాతికవివరున కిడి యెంతెం
తో పదితి నిది లభింపఁగ, సైఁపుఁడు పెనుకట్న మొసఁగఁజాలమి కనియెన్19

ఆ. ఈయలంతికాన్క నీమహనీయున, కీయవస్థవాని కిడుట తగునె
లోక మింతగ్రుడ్డిదా కటకట ! యని, కలఁగి పెలుచనొవ్వ గంటి నపుడు. 20

గీ. మది నెవో తీవ్రభావనల్ మల్లడింప, శారదాదీనమూర్తి సాక్షాత్కరింప
నద్దనూటపదా ర్లుపాయన మొసంగి, జాతివైతాళికున కర్ప సలిపినాఁడ. 21

గీ. అవల నయ్యంకివారు నెయ్యమునఁ బిలువ, రాయప్రోలు కాటూర్ కవిప్రభులతోడ
మెసవితినివిందు; నదియెంతమేలిదైన, నెద కలఁగియుంటఁదగుతృప్తినిదద నాకు.
22

జులై 27, 1971

# హరికరుణ

ఆ. వడ్డితీపి మరగి వారికి వీరికి, నప్పులిచ్చి వేళ కర్థ మంద
కలమటించి తుదకు నధమర్ణతం బడు, వెడఁగు జూచి జాలిపడుదు నేను. 1

క. తలఁపనివెచ్చ మొకటి నా, తలమీఁదికి వచ్చె నొక్కతఱి; గేహమునం
గలసొమ్ము రెండునూర్లే, వలయున్ మఱి నాలుగైదు వందలదనుకన్. 2

ఆ. మానరాని నిలుపరాని కార్యంబు, వ్యా, పారకోశమునకు భానువార,
మప్పుసేయఁ గూడ దనునేమ మేకమై, తర్ద ననుఁ గలంచె నద్దినమ్ము. 3

గీ. ఏమిరా ! పరమేశ్వరా ! యేల యింత, బెడఁద పెంచితి విపుడు, నాబింకమునుబ
రీక్షసేయఁ దలంతువా ? రిత్తచలము,పఱపనేటికి ననువంటి బడుగు దెసకు. 4

ఆ. వేల్పు నిట్లు తలఁచి వెడకూర్కు రా నొత్త, గిలితి నన్నపానములను మఱచి
తలుపు దెఱచినట్టి యలికిడితో నిద్ర, సడలె మిత్రుఁ గంటి సముఖమందు. 5

గీ. ఏలవచ్చితి వీయెండ బాలకృష్ణ, మూర్తి ! యంటిని "మొన్న మామూలచేని
నమ్మినన్ సంచకరువుగా నైదునూర్ల, విత్త మిడినాఁడు మడిఁగొన్న వెంకటయ్య. 6

గీ. ఇంటిదూడకు జంటగా నీ ధనమ్ము, నిచ్చి కొనవలె నొకనత్తి నెచటనేని
యెల్లి వల్లూరివైపున కేగువాఁడ, వచ్చునందాఁక దాఁపు మీవంద లైదు. 7

గీ. నమ్మరాని కాలము గాన సొమ్మునెల్ల, సంచి నిడుకొని పోవ శంకించుచుంటి
మంచిదూడ కన్పించిన సంచకరము, పా వొసఁగి బేరమును గట్టిపఱుచుకొందు. 8

గీ. అవల నిలుసేరి నాసొమ్ము నందుకొనెదఁ, బైన మియ్యది మూన్నాళ్ళలోనె ముగియుఁ
గాదనక పుచ్చుకొమ్ము రొక్కమును దీని, నిప్పు వంటి వాఁడవు నీవు నీకు నతులు."9

క. అని బాలకృష్ణుఁ డాడఁగ, ననూన విస్మయము హర్ష మలమె మదాత్మన్
ధన మిట్ల వచ్చెఁ ద్రొక్కట, యొనరిన తతినెల్ల నాకహో ! హరికరుణన్. 10

క. హరికరుణ ననుట నన్నుం, బరిహాస మొనర్చువారు పలువురు కల రం
చెఱిఁగియు నమ్మెయిఁ బల్కితి, నరులెవ్వరు మార్ప లేరు నానమ్మకమున్. 11

ఆ. తూర్పుదిక్కునందుఁ దోయజాప్తుం డుద, యించు నన్నమాట యెంత నిజమొ
యంతనిజ మటందు నస్మదీయంబగు, ప్రత్యయంబు; వేయిపల్కు లేల ? 12

8-8-71

## లెక్కవ్రాఁత

గీ. గంటగంటకుఁ జిల్లర యుంట యరిది, కానఁ జిఱుదిండిసాలఁ గాతాను బెట్ట
నీయకొంటిని, నెలనిండె, నోయి ! వీర,భద్రయా ! యెంతయయ్యె మాపద్దటంటి. 1

క. పదునాలుగురూకల యి, ర్వదిపైస లటంచు విపణివాఁడు వచించెన్;
పదపడి యింటికిఁ జని నా, యెదురుగడన్ గంటి బాపురే ! యనుకొంటిన్. 2

గీ. వీరభద్రయకుం బదునాఱురూక, లిచ్చి జమకట్టు మనుడు వాఁ డేలయింత
పె చ్చొసంగతి రనియె నీపిచ్చి లెక్క, కాదు నాలెక్క నాకుఁ దార్కాణ మనితి. 3

ఆ. బేరగాఁడు వెల్లఁబాటి మీవంటి మ, హాత్ము లెంద ఱుందు రవని ననియె
నీది నీ కొసంగుటే దొడ్డకార్యమా, చాలుఁజాలు మెప్పులేల యంటి. 4

ఆ. ఎవనిరూక వాని కిడుట కృత్యం బను, బుద్ధి యెల్లరకును బుట్టునేని,
జగమునందు నిన్ని జగడంబు లిన్ని భ, యంబు లావహిల్ల వనియె బేరి. 5

ఆ. వెచ్చపడదు నాదువిత్త మేనాఁడును, గలముపోటు దినక కానియేని
కలఁతలేనిబ్రతుకు వలచువాఁ డలసట, యనక లెక్కవ్రాయనగు సతమ్ము. 6

ఆ. లెక్క కొక్కరువ్వ యెక్కువ తక్కువ, లేనిసంచి నన్ను లెస్స తనుపు;
పద్దువ్రాయువాఁడు పరమలుబ్ధుం డను, బేలతెఱఁగు నాకు జాలిగూర్చు. 7

గీ. వేఱువోవకము న్నరవీసమేని, విడక మావచ్చుబడికిని వెచ్చమునకు,
వ్రాసితిని లెక్క నే ననివార్య మగుటఁ, బదియునాఱేండ్లు నిండనిప్రాయమందు. 8

మధ్యా. ఐదేఁడు లిప్పని చేసి భాగస్థు నలరించి యేను,
నాదటం బడసి యవ్వెనుక వేర్పడి "యర్థంపు లెక్క
యేదిరా ! తె "మ్మనునతఁడు లేకున్న నేమి; నా సొమ్ము
మీఁద నా కొదవినపెత్తన మపరిమిత మైన నేమి ? 9

గీ. మంచియలవాటు నిద్దాని మానలేక, సంతతమ్ముగ లెక్కను సంతరింతు
సిరిని సమకూర్చునపుడు వెచ్చించుపట్ల, నిది హితాగ్రణియై నన్ను హెచ్చరించు. 10

ఆ. అనృతదూరమైన మనుగడ నర్థించు, నరుని లెక్క చక్కఁబఱుచుఁ గాని
నిక్కమునకుఁ దోఁకచుక్కగా బ్రదికెడి, లేకివాని మందలింపలేదు. 11

18-6-67

# అమృతధార

ఆ. నన్ను గురునిసరణి మన్నించు పండితు, లేఁతవయసువాని లేమతోడ
నేదురువచ్చు వాని నీక్షించి నిల్పి య,య్యాయి కుశలవార్త లడిగి యడిగి 1

ఆ. ఏమి వేంకటేశ ! యీామె నీతో నొజ్జ, తనము నెఱపుచున్న వనిత యగునె ?
పలికితివికదా యుపాధ్యాయ మాబడి, నోర్తు కల దటంచు నొక్కనాఁడు. 2

క. అని యేను వచింప నతం, డెనలేని వెఱఁగు నంది యీచెలి యీశి
ష్యుని యిల్లాలెకదా యీ, యనుయోగము నవ్వులాటకై విసరితిరా ? 3

గీ. ఈపె వడ్డింప మీరెన్ని యేని తడవ, లారగింపరె యస్మదగారమునను
దేశికోత్తమ ! ఇం కేల దీనిదెసకుఁ, దేఱిచూడుఁడు కలరూపు తెలియు ననియె. 4

ఆ. అమృతధారవోలె నాతనిపల్కు నా, చెవిని బడినయంత నవధి లేని
ముదము గంటిఁ బాపముద్ర సైరింపని, యెడఁద నిడినవేల్పు నెంచుకొంటి. 5

ఆ. యువను జూచి యుష్మదుక్తి నిక్కము కాని, యిపుడె కన్నవాఁడ నీపె మొగము;
కూడు కూర పెట్టు కొమ్మపాదమ్ములు, చూతుఁ గాని మోము చూడ నంటి. 6

ఆ. నిత్యసత్యవస్తు నిష్ఠితబుద్ధిమై, బ్రదుకువారు, కలుచ నుదుకువారు
మెఱపువంటి యొఱపు మెచ్చరు దానికై, దృష్టిఁబఱప రనియె శిష్టుఁ డతఁడు. 7

23-4-67

# కవితావేశము

గీ. 'రాష్ట్రగానమ్ము' వ్రాసితి రాష్ట్రసిద్ధిఁ, జూచి సొగసితి నాంధ్రతారోచిరవధి
సాగిసాగి మహాంధ్రరాజ్యప్రతిష్ఠ, జరుగుననుకొంటి మాతృప్రశస్తి పండ. 1

మధ్యా.నాయాస లడియాస లయ్యెఁ బెద్దలు నానాఁటి కెగసి,
పాయని యధికారతృష్ణకుం జిక్కి ప్రతివీథియందు
మాయమాటలు సెప్పి కులపిశాచులమల్లాట గూర్చి,
మాయురే ! ప్రజల శ్రేయమ్ము న్యాయమ్ము మఱచి రాప్రొద్దు. 2

గీ. ప్రేమ యణఁగారెఁ బ్రాంతీయభేదములు జ, నించె రాజధాని సమస్య నిట్టవాడిచెఁ
దెలుఁగుసిగ్గిల్లె నింగ్లీషువెలుఁగు సూచి,కవిసె నాంధ్రోర్విఁ గాఱుఁజీఁకట్లునాఁడు. 3

ఆ. ఉదితమైన రాష్ట్ర ముస్సురు మనుచుంట, సైఁపలేక తెనుఁగుజాతి కనులు
తెఱచుపొంటెఁ గూర్చితిని దల్లిబాసచ, క్కనలు విరియ నుదయగానకృతిని. 4

ఆ. "తెలుఁగుతీపి" యన్న తలబంతితో నందు, మూఁడు నాల్గు పద్యములనువ్రాయు
నంతలోన మంగి యరుదెంచెఁ గ్రన్నన,గట్టిపెట్టినాఁడఁ గలముపనిని. 5

గీ. క్షౌరికుండు గడ్డంబున సగము గొఱిగె, నామదిన్ శతభావనల్ నాట్యమాడెఁ
గొంచెమాఁగుముమంగలీ! కొంచెమాఁగు,మనుచుఁగవితాగృహంబునందడుగు
మోపి- 6

ఆ. తెనుఁగుమఱుఁగు మెఱుఁగు తెన్నుహొరంగు వ, ర్ణింపఁ దొడఁగినాఁడ; నిక్కమైన
తెలుఁగు మాలవాని హలికుని గణకుని, నోట వెడలు నంటి నోట లేక. 7

గీ. ప్రెగ్గడలు తెల్గుబాసకు నగ్గలముగ, సేవచేసినవా రంటి, జీవమున్న
కవిత సెప్పినవారిలోఁ గల రమాత్యు, లెంచిచూచిన ముప్వుర కిరువు రంటి. 8

క. ధోరణి యిది ననుఁ దిక్కన, నేరుపుదెస కాహరింప నిర్భరభక్తిన్
గీరితిచేసితి యజ్వను, భారత మాతనిది తెన్గుబందరు వంటిన్. 9

క. కవితకురాక వగర్చెడి, సవరనితె ల్గతనికరుణఁ జావక కురుపాం
డవకథ నిల్పి సురోక్తికి, నవకము నెఱిఁగించు నంటి ననిచిన వేడ్కన్. 10

ఆ. ఊరి కొక్క లెంక యుండి చదువురాని, ప్రజలనోట వెడలఁబడు నొయారి
నుడుల నెత్తి బాస కుడుగరసేఁత సం, భావనార్హమైన సేవ యంటి. 11

క. ఇది తె ల్గని నూటికిఁ దొం, బది సంస్కృతపదము లునిచి పల్కిన కావ్యం
బది బాసకుఁ జే టంటిని, బెదరక బరిమీఁద బయటఁ బెట్టితి నిజమున్. 12

క. పదములు తలంపులు పదిం, బదిగా మదిఁ దోఁచి కవితఁ బల్కింపఁగ న
ల్వదిపద్యమ్ములు వ్రాసితి, నదిరా ! యొకగంటకాల మరిగెడి లోనన్. 13

క. తగ్గెను గవితావేశము, దిగ్గన మంఁగలిని జేరితిని ననుఁ బిల్వన్
బెగ్గిలునతండు చెచ్చెర, నొగ్గెను జిబుకంబు మిగిలియున్నది తుడువన్. 14

గీ. పావులా తగ దంచు రూపాయ నిచ్చి, తిండి పెట్టించి వానికిఁ దృప్తి గూర్చి
యాతఁడొకనాఁటి నాశిష్యుఁడగుటఁగవుల,యోజలెతిఁగించినాఁడ గాలోచితముగ.

క. ఆఁగినదా పదిప్రొద్దులు, వేఁగిన నొకపద్యమేని వెడలదు కవికిన్
సాగినదా కవనము పెను, వేగమ్మున నిర్గమించు వెల్లువవోలెన్. 16

**8-9-71**

## కృతిపతిబొమ్మ

క. నాగయ్యకుఁ గవిమండల, యోగక్షేమాభిలాషి కుప్పల వంశ
శ్రీగరిమాలంబునకు స, మాగత బహుభారతీమహః కమనునకున్. 1

గీ. పదవులకుఁ బోరుతెల్గులయెదలు తేఱ, నాంధ్రరాష్ట్రంబునకు యశం బావహిల్ల
నారచించిన 'యుదయగానంబు' నంకి,తమ్ముగావించి ముద్రించుతరుణమందు-2
(1954)

క. నా నీడబొమ్మతోపా, టీ నేస్తము బొమ్మకూడఁ గృతిఁ జేర్చుట మే
లౌ నని తలంచినాఁడను, గాని తదార్జనము కొంతకస్తి ఘటించెన్. 3

క. ఎతనిం గృతిపతి నొనరిం, చితి నతనికినైన నవ్విశేషము కృతి ము
ద్రిత మగుదనుకం జెప్పను, వ్యతిక్రమములేని నియతి యౌ నిది నాకున్. 4

గీ. ఇట్టినేను ఛాయాపట మి మ్మటంచు, నాగయను గోర నతఁడు కానఁడె రహస్య
మిపుడు కర్తవ్య మే మని యెంచ మిత్రుఁ, గోటయను జేరి పాములపాటి వంశ్యు-5

క. నాచిక్కు దెల్పి దానిం, ద్రోచువెరవు దెల్పి యతనితోఁ గోదురికిన్
వే చేరితి నాగయ్యను, జూచితి గురుమౌళిపీఠ శోభాకలితున్. 6

క. నెయ్యము తియ్యము విరియఁగ, నయ్యాసంభాషణమ్ము లయ్యెను సాపా
టయ్యెను మా; కే నంతటఁ, జయ్యనఁ బన్నుంటి సుప్తచందము వెలయన్. 7

క. కోటయ్య తన మనీషా, పాటవముం బఱపి పెక్కుభంగులఁ జెలితో
మాటాడెను జయదేవుని, పాటలు నాగయ్యకోర్కి పండఁగ వినిచెన్. 8

గీ. పదపడి యతండు గోడపైఁ గుదురుకొన్న, చిత్రముల నలవోక వీక్షించుపట్ల
నెపుడు తీయించినాఁడ వీ విన్ని తెగల, బొమ్మలను నాగయా ! చెలువమ్ముగుల్క. 9

గీ. మంచిపని చేసితివి నేను మనవయస్యు, లందఱను గోరి వారిఛాయాపటములు
పడయుచున్నాఁడ నొక్కచోఁ బదిలపఱుప, నెచ్చెలీ ! న న్నలర్పుమా నీవుకూడ. 10

గీ. అనుడు నాగయ నీకిష్టమైన బొమ్మఁ, దీసికొను మణుమాత్ర సందియము లేక
మిత్రమా ! యన నచ్చినచిత్ర మొకటి, సంచి నిడుకొనెఁ గోటయ్య సమ్మదమున. 11

గీ. ఏ నపుడ నిద్రసడలినవానివోలె, నటునిటుం బొర్లినాఁడఁ బర్యంకమునను
లెండు లెండని 'టీ'కి నన్ లేపె నొజ్జ, రండురం డనెఁ గోటయాఖ్యుండు నగుచు. 12

28-10-1971

# అచ్చుతప్పు కాదు

ఆ. చెదరిచెదరియున్న చినచిన కబ్బముల్, కొన్ని చేర్చి 'శబల' యన్నపేర
వెలువరించినాఁడ వేంకటనరసయ్య, కీర్తి వాడవాడఁ గెరలుకొఱకు. 1955 1

క. అచ్చుపని ముగిసినంతన, నెచ్చెలులగు కవులకున్ మనీషుల కెలమిన్
బుచ్చితిఁ గృతి నల్లల్లన, వచ్చెన్ గృత మెఱిఁగి సఖులు వ్రాసిన కమ్మల్. 2

గీ. సాహితీనిధి కవితావిశారదుండు, సుజనమౌళి వేంకటపురస్సుబ్బరావు
యార్లగడ్డ సదన్వవాయ ప్రసిద్ధుఁ, డపుడు పంపిన లేఖ నేమని నుతింతు ! 3

క. ఇతఁ డందఱవలె నను నా, కృతి నెన్నుటతోన యాఁగ కే నొక్క యెడన్
గతి దప్పుటయును మృదువా, క్షతిఁ దెల్పె హితుండు సూరితల్లజుఁ డగుటన్. 4

మం. అది 'యుపద్రష్టత్వ' మన్న ప్రయోగ, మది కర్ణుతోఁ గృష్ణుఁ డనిన పద్యమున
నిరవుకొన్న ప్రయోగ; మీడిత మతులు, నవ్వ ప్రయోగమన్నా! సుబ్బరావు
గణువతనం బెంతగణనీయ ! మాతఁ, డొరుల నొప్పించుట కొప్పఁడు గానఁ
దత్ ప్రయోగం బచ్చుతప్పని వ్రాసె, నింతప్రియంబుగా నెందఱు నిజము
నెఱిఁగింపఁగలరు సాహిత్యలోకమున ? 5

ఆ. సత్యనిష్ఠ నుంత సడలింప నొల్లని, వాఁడ నగుట, నిక్కువంబు సకల
శుభవిధాత యగుట సుహృదగ్రణికి నపు, డిట్లు వ్రాసినాఁడ నెదఁద విచ్చి. 6

ఆ. సుబ్బరాయ ! సుగుణసుందర ! నీవు నా, వాసి వలచి తెలియఁజేసినట్టి
నెరసు నొరులపైకి నెట్టి పాపము మూట, గట్టుకొనెడి కవిని గాను నేను. 7

క. నా యజ్ఞత హేతువుగా, నీ యపశబ్దంబు వొడమె, నిట్టి దొసఁగు లె
న్నో యుండవచ్చు మత్కృతి, నాయాసం బనక వెదకు మభినంద్యమతీ ! 8

ఆ. ఎంత నేర్చినాఁడ నే;నపారముగదా, చదువు; నిన్ను వంటి చదురు లండ
దండ యగుటకతన బండి దొర్లింపఁగా, సాహసింతు నే నశక్తిఁ గనుచు. 9

గీ. దురభిమానముచే సత్యదూరమైన, పలుకు వెదలించువారల బ్రదుకుఁ గందు
నేమిఫల మందె వారికి ? శేముషీ వి, భూషితులమ్రోల బన్న మబ్బుటయకాక. 10

క. ఎఱుఁగనిది బ్రదికినన్నా, ళ్ళెఱుఁగవలెన్, దనకు లోకహితబుద్ధి నొరుల్
నెఱపిన యుపకృతి సభలన్, మెఱయవలెన్ నరుఁడు బుధులు మేల్మే లనగన్. 11

25-10-71

# కఠోరనియతి

ఆ. "తరతరాల నుండి పరపాలనమ్ములో, నణఁగి మణఁగి యున్న మనకవీంద్రు
నుద్ధరించుపొంటె నుద్యుక్తమయ్యె స్వ, తంత్రభారతం బుదాత్తసరణి. 1

క. ఇది నెలకు నూఱు నూటేఁ, బదిరూకలదనుక నీకుఁ బంపఁగ వచ్చున్
బదివిడుతలతో నాఁపదు, బ్రదికిన యన్నాళ్ళు సొమ్ము పంపుచునుందున్. 2

ఆ. గాంధికవిగ రాష్ట్రకవిగ నీసల్పిన, సాహితీసపర్య జగమెఱుంగు,
తిక్కనాదికవులతీరునఁ దెల్గుమే, లెంచి సర్వదా శ్రమించె దీవు. 3

గీ. నీకు నుపకృతి సేఁత కనిష్ఠమైన, ధర్మువై చను నాకుఁ గేంద్ర ప్రభుత్వ
రథము గదలించువాని; కీరాచమేలు, పడయుటకు సోదరా ! యిష్టపడెదవేని-4

గీ. ప్రార్థనాపత్ర మీజాబుప్రక్కఁ గలదు, సరగఁ బూరించి పంపు మిచ్చుటికి దాని
నెదురు చూచెద నీ లేఖ కే" నటంచుఁ, గమ్మ నంపెను దనకు రంగా యొకప్డు5

క. రంగామహత్త నెవ్వ రె, ఱుంగరు ? కర్షకసమాజరోచిష్ణుతకై
యంగదలు సైచు నాయక, పుంగవుఁ డితఁ డఖిలవిశ్వపూజార్హుండున్. 6

ఆ. శస్త్రజీవనమ్ము సాగించి సాగించి, నేల నాల్గుచెఱఁగు లేలి యేలి
కాలగతికి లోఁగి కర్షకధర్మమ్ము, వలచి వలచుకోవవాఁ డితండు. 7

క. త్యాగమ్ము లోకసేవయు, భోగమునకుఁ గాదటన్న పూతాశయుఁ డీ
యోగి; ఫలసంగ మొల్లని, చేగ నితం డందుకొనె విశిష్టతపమునన్. 8

ఆ. ఇతనిగుండెబిగువు నేమందుఁ జేఁబ్రోలి, పాటిమట్టిగోడపసను గెల్చు
పుటకనుండి యెంతపొడుగు సాగిన వీని, నడత బుగ్గజాలు నా వెలంది. 9

ఆ. గఱువతనముకంటె నుఱవైన విభవమ్ము, కానరా దటంచు మానసించి
నిండుకుండవోలె నిగ్రహదీక్షలోఁ, బండె నితఁడు పగఱు పల్లటిల్ల. 10

గీ. ఆంగ్లభాషాప్రధానవిద్యాలయములఁ,జదువునేర్చినవాఁ డయ్యు నదిర !యితఁడు
కోవిదుఁడు మాతృభాషలోఁ, గొంకులేని,వక్త యితఁ, డెట్లు వడసె నీవైభవంబు!11

క. పలికిన వ్రాసినఁ దెనుఁగుం, గలితనమును జాటు నితఁడు, కవివర్యుల వే
ల్పులఁబోలెఁ గనుంగొను, నే, యిల కేగినఁ బల్కరించు నీయన్న ననున్. 12

గీ. ఇతనిపంపినపత్రమ్ము నీక్షసేయ, దొరతనమువారి సాయంబు జరకు లేమి
కగ్గపడి నిగ్గుసెడిన కళార్చకులకు, ముట్టు నని తేలె దరఖాస్తు పెట్టుకొన్న. 13

ఆ. అంత నరసి యొరసి యభిమాన మది మదిన్, బ్రేవ లోభమునకుఁ బీఁటయిడక
యపుడె వినయపూర్వకాభివందనముల, నిట్లు వ్రాసినాఁడఁ గృషికరవికి. 14

ఆ. "ఏను బేదవాఁడ నైన న న్నలయించు, బెడఁద లెన్ని యున్నఁ బెఱుల నడిగి
బ్రదుక నియ్యసేయ; నిది కఠోరం బగు, నియతి యౌనుగాక నిలుతు సైఁతు.15

గీ. నన్ను నాసాహితీసేవనమ్ము నెఱిఁగి, యేలుబడివారుగాని యింకెవరుగాని
పిలిచియిడుకొన్న నీకొండుఁబెఱులువ్రేలు, మడఁచుటకువీలులేనిమన్గడను గందు.16

ఆ. దంభమునకు దవ్వదవ్వుగా జీవింపఁ, దలఁచువాని కెంతకలిమి వలయు ?
బిగువుదప్పి నరుఁడు దిగజాఱెనా వాఁడు, దొరలి దొరలి యెంతవఱకుఁ జనునొ!17

గీ. ఈవు నాతత్త్వ మొకకొంత యెఱిఁగినట్టి,ప్రాజ్ఞుఁడవు కావుటన "యిష్టపడెదవేని"
యని లిఖించితి కమ్మలో; నది మదీయ,హృదయమును లెస్సగా నలర్చినదిసువ్వె!18

ఆ. లోభమునకు నేను లొంగి ఢిల్లీ రాజ్య, మేలువారి నాశ్రయింతునేని
నాకు, నన్ను మెచ్చునీకు నయ్యది పేర్మి, పెంపు నిడునె చిత్తగింపుమయ్య!" 19

క. వ్రాసితి నీపల్కులతుద, 'గ్రాసములే' కనెడి యేన్గుకవిపద్యంబున్
కోసితి నాశాలతలన్, దాసితి నిరవధిక సౌఖ్యదం బగుశాంతిన్. 20

ఉ. గ్రాసము లేక స్రుక్కిన, జరాకృశమైన విశీర్ణమైన సా
యాసమునైన నష్టరుచి, యైనను బ్రాణభయార్తమైన ని
స్త్రాసమదేభకుంభ పిశిత, గ్రహలాలసశీల సాగ్రహా
గ్రేసరభాసమానమగు, కేసరి జీర్ణతృణంబు మేయునే. 21

31-7-71

# కల్ల నిజమైనది

ఆ. అతఁడు గానవిద్య నందెవైచిన చేయి, యతఁడు నేర్చె నాలుగైదు బాస
లతఁడు కవిత పల్కు నందాలు కుల్కఁగా, నతఁడు గాంధిబ్రతుకు ననుసరించు. 1

గీ. అతఁడు వెలనాటి వైదికుఁ డతఁ డొసంగె, హరిజనునకున్ దనూభవ నాలు కాఁగ
నతఁడు సర్వోదయప్రియుఁ డగుటఁజేసి,పేదలను బిల్చి యెకరము లైదు పంచె. 2

గీ. అతఁడు మన్మిత్రుఁ డతఁడు నే నధివసించు, నప్పికట్లకుఁ జేరువయైనవీట
భావపురి నుండు సముదారభావకలిత, కతఁడు నాథుఁ డుమావతి కతఁడుసుకృతి. 3

గీ. అతఁడు శిష్టాన్వవాయ సుధాబ్ధి శుభ్ర, రశ్మి, సత్యనారాయణరాజశేఖ
రాఖ్యుఁ డతఁడు, మాకుఁ బరస్పరావలోక, కాంక్ష సెడదు దినదినమ్ము కలిసికొన్న. 4

ఆ. పైనమునకు సిద్ధపడునన్నుఁ జూచి నా, యువిద "యెచటి" కనియె నొక్కనాఁడు
భావపురికి నేగుపని యొండు కల దని, మెలఁతతోడ నంటి మెల్ల మెల్ల. 5

గీ. మొన్న వెడలితి వచటికి నిన్న వెడలి, తప్పటియు నేఁడు కదలితి వంతపెద్ద
పని యెదో యని యింతి నాపయనమునకు,విముఖతనుజూపెవినయమ్ము విడువ
కపుడు 6

గీ. చేసినప్రయాణములు నేఁడుచేయఁబోవు,పైనమును మిత్రుఁ గనుటకే యౌను గాని
నాదు "రసపిచ్చి" వివరింపఁగాఁ దలంకి,నీరునమలుచు నిట్లంటి నెలఁతతోడ. 7

మధ్యాక్కర

కడచినకథ కేమిగాని రాజశేఖరుపుత్రుఁ డొకఁడు
పొడమినప్రొద్దిది యౌట నీపందువున కేగవలసె
నుడుగక రమ్మనె నిన్న నెయ్యరి యొక్కచోఁ దోఁచి
యడుగుదూరమ్ములోనుండియుంబోమి యదియోగ్యమగునె? 8

గీ. అనుదుసతి 'మంచిదే' యనె నకట! నెపము,నిడి వచించితిఁగా యని యేను లజ్జ
కుదుచుచుం జని చెలికానికడప నడుగు,మోపుడు నతండు విచ్చినమోముతోడ-9

క. నా కెదురై పరమేశ్వరు, రాకయ మీరాక కవివరా ! యన, నేలా
వ్రేఁకని మన్నన లను నా, వాకులు విని బానసమ్ము వదలి బిఱానన్- 10

గీ. వచ్చి యుమ కేలుమోడ్చి మావాఁడు భరతుఁ,దుదితుఁడైన మహా స్సిది యుష్మదీయ
మాశిషం బమోఘము దీని నందుకొను న,దృష్ట మున్నది మాకు నేఁ డీశి కరుణ. 11

ఆ. ఈరు నిన్న వచ్చి యేగెడివేళ నీ, యుత్సవంపువార్త నుగ్గడింప
మఱచినార మేము, మాసుకృతం బెదో, తోడితెచ్చె మిమ్ము నేఁడు తఱికి. 12

ఆ. లెండు తానమాడ, లేదు వద్దనకు నా, లస్య మని మనోజ్ఞలపితధార
పఱపినంత నెంతబా గిది నాలజ్జ, తొలఁచె వే ల్పటంచుఁ దుష్టి గంటి. 13

ఆ. ఆరగించునప్పు దాలి కేఁ బల్కిన, నుడుల తెఱఁగు సెప్పఁ గడు నెలర్చి
రాజశేఖరుండు రా దనృతంబు మీ, నోట ననియె నుమయు మాటగలిపె. 14

గీ. ఏను దీనికి గర్వింపఁ గాని మత్పి, తామహుండు మజ్జనకుండు ధర్మువునకు
మూదలగనిల్చిమావంశమునకునిడిన, చరితముదలంచిపులకించిశిరమునూఁతు. 15

క. మాపెద్ద లనృతగంధము, నోపని సజ్జనులు ఋషికులోత్తంసు లఘ
క్షేపక్షము లక్షుద్రులు, చేపదుతన్ మాకు వీరి శీలమహస్సుల్. 16

3-9-1971

## సుందరవరదులు

గీ. బహుముఖప్రజ్ఞ సాహితీపాటవమ్ము, విద్వ దారాధనేచ్ఛయు వెల్లివిరియ
వఱలుఁ(1) బరుచూరిసుందరవరదులాంధ్ర, తమిళభాషావిపశ్చితుల్తనివి నంద. 1

(1) పరుచూరి వేంకట సుందర వరదులు M.A., L.LB. రామనగరము, తిరుత్తని తాలూకా.)

గీ. వరదు లలవోకగా నాకు వ్రాయుకమ్మఁ దెలుఁగుఁజెలువం బహో !, గుబ్బతిల్లుచుండుఁ
బదురు మాపాలి దని జబ్బచఱచువారు,మ్రానుదేతెద రితనిసామర్థ్య మరసి. 2

ఆ. ఎంతలాయరైన నితఁడు హాలికవృత్తి, నాదరించుచుండు నహరహమ్ము
శాంతి వలచు వంగసమువాఁడు కృషిక ధ, ర్మమునఁ గాక యెందు రక్తిఁజూపు?3

ఆ. విత్త మెంతయైన వెచ్చించి బిడ్డల, చదువుపెంపు వలచు జనకుఁ డితఁడు
కొడుకు నొకనిఁ జేర్చె (2) గుణదలఁ గల కళా, శాల నురుయశమ్ము నేలుదాన. 4

2. విజయవాడప్రక్క నున్న గుణదలలోని ఆంధ్రలయోలా కాలేజి

ఆ. ఇంటి కేగునప్పు డితఁ డప్పికట్లకు, వచ్చి కూర్మిపేర్మి యచ్చు పడఁగ
నన్నుఁ బల్కరించి నాసేమ మడిగి నా, బంతి నారగించి సంతసించి(1954) 5

మధ్యా.నాతోడ నిమ్మెయిం బలికె మనతెల్గు నాట నీనాఁడు
ఖ్యాతిగన్నకవివి పండితుండవు కద నీవు; నీదు
చాతురి లెస్స రాణింప నొకకళాశాల కావలయు
లేఁతబుల్లిలకు నెంతకఱపిన నిట లేదు లాభమ్ము. 6

గీ. విద్యలో నడవడికలో విశ్రుతమ్ము, నేఁడు గుణదలకాలేజి వాడవాడ;
నియ్యకొనుమందు నొజ్జన, మేను యుష్మ, దభ్యుదయము నర్థించెద నహరహమ్ము. 7

గీ. ఈకళాశాల వైభవ మిచ్చగించి, బదలు మనపెద్ద లందఱు పంప నిటకు
వచ్చినాఁడ మా కోరిక వమ్ముసేయ; కసము సిరి హెచ్చుతతి వచ్చె నన్న! నీకు. 8

నేను

గీ. చెళ్ళపిళ్ళ యంతటివాఁడు చెప్పెఁ దెనుఁగుఁ, జదువు హైస్కూలు విద్యార్థి సముదయమున
కది నిరోధించెనందువా యమ్మనీషి,వైదుషికి దక్కవలసిన వన్నె వాసి. 9

క. కాటూరి విశ్వనాథలు, వేటూరిప్రభాకరుండు పింగళి యెవ ర
మ్మేటికి శిష్యులు గారా, నేఁటికవీంద్రులకు మాననీయులు గారా 10

ఆ. ఎడఁద నున్న నేమి మృగమద మది తన, కమ్మతావి నెల్లకడల గుప్పు
నెత్తికెక్కఁగాక నేబీఱవిరి యది, యేనికేని వలపు నిడునె సెపుమ ! 11

మధురాక్కర

ఎంతజీతంబు చేకూరు నీనాఁడు నా కీబడి
నంతియ లభించుఁ గాలేజియందేని; పాడిదప్పి
సంతరించి రధికృతులు చట్టంబు నీ రీతి, ధీ
మంతుఁడ వగుట నీవు నామాట చర్చింపవయ్య ! 12

క. కొన్ని కళాశాలలు న, న్నెన్నఁడొ పిల్చినవి గాని యే నవుగాముల్
కన్నాఁడ నగుట నిచటన, యున్నాఁడఁ గరళ్ళు లేని యుదధివిధానన్. 13

క. అరయఁ గలాశాలలు గల, పురములఁ జెలరేఁగు వెచ్చమును సైఁచుటకే
సరిపడు నచ్చటి రాబడి, మఱి సంసారమున కేదిమార్గము సెపుమా ! 14

ఆ. ఇంతగాథ యుంట యెఱుఁగక ని న్నల, యుంచినాఁడఁగద కవీంద్ర! నన్ను
నన్యథా తలంప కనుకంపమై భవ, త్కవిత వినిచి తృప్తుఁగా నొనర్పు. 15

ఆ. అనిన వినిచి నాఁడ నచ్చుకూటముఁ జేర, వార్చుచున్న రాష్ట్రవాణి నుండి
యుదయగాన మను సముజ్జ్వలకృతినుండి, చుట్టమునకుఁ గొన్ని ఘట్టములను. 16

గీ. వరదు లీకైత యీరస నెరియుచున్న, తెల్గులకు బుద్ధిసెప్పు సందియము లేదు
కవివరా! సకలాంధ్రవికాస మెంచి, రుద్రతప మాచరించెడి రుసివి నీవు. 17

ఆ. తెనుఁగువారిగడ్డ తిరుతనిసీమపైఁ, గన్నువైచి యఱవ లెన్నియేని
తంత్రములను బఱుపఁ దలపడి రిది కూడ, దనియు వ్రాయవలయు నయ్య!నీవు. 18

క. మన పెద్దల యసమర్థతఁ, గని తమిళులు రెచ్చి రింతగా నియ్యదనన్
నను దైవము తెన్గుపతా, క నీడ నిలనీయదేమొ కదువెఱ పుట్టున్. 19

గీ. ఇచటఁ దమవారిఁ బదిమంది నీక్షచేసి, యింతతెగినట్టి తమిళుల కేల కానఁ
బదరొ సేలానఁ జెంగలపట్టునందు, నిలిచి లక్షలలో నున్న తెలుఁగువారు? 20

గీ. నావుడుం జేర్తు నుదయగానమున దీని, మంచిసూచన యిడితి వీ; వించుకంత
విశ్రమింపుము పయనంపువేసరమ్ము,బయలుపడునీ మొగమ్మునఁ బలుకునందు. 21

క. ఏ నిట్లు నుడివి నంతన, మేనుమఱచి నిద్రవోయె మిత్రుఁడు నేనో
మానేల తిరుత్తని యని, వాణీకృప నప్పుడపుడ వ్రాసితిఁ గవితన్ 22

మధ్యా. అది 'యెల్ల' లను తలబంతి నొదవె, నెయ్యరికి నద్దాని
నిదుర లేచినయంతన వినుచుడు నన్ను నెచ్చెలికాఁడు
మదితోడఁ గొనియాడె నపుడ తేనీరు మన్నారి తేర
నిదియేల వెచ్చనికైత వింటిఁగా యిపు డనె నే స్తి. 23

ఆ. ఒకటిరెండుపూఁట లుండి మమ్మలరించి, వరదు లేగెఁ దననివాసమునకు
నవల వ్రాయుకమ్మ నతఁడు ముద్రింపుమా, క్రన్న నుదయగానకావ్య మనియె. 24

క. వీలైనంతన ముద్రా, శాలకుఁ జనఁ జూచుచుంటి సఖుఁడా ! యనుచున్
నే లేఖ నంపితిని నా, 'వీలు'న కర్థం బతండు వేఱుగఁ దలఁచెన్. 25

ఆ. అగుట నచ్చువేళ కగువెచ్చ మంతయు, నిచ్చువాఁడ లెక్క పుచ్చు మనియె
జంకవలదు నేను జగదీశుకృప నాల్గు, కాసులున్న సేద్యగాఁడ ననియె. 26

గీ. ఏను బంపితి నత్తఱి "నితరు లిచ్చు, విత్తమున మత్కవిత్వంబు వెలయ దెపుడు
నెయ్యురీ ! తలఁదాల్చిన నియమ మిట్టి, దన్యథా నన్నుఁ జూడకు" మన్న లేఖ. 27

గీ. అతఁడు నొవ్వమికై నాదు కృతికి నీ స, మీక్ష వలయును రచియింపవే యటంటి
వరదు లుప్పొంగి పీఠిక వ్రాసె నుదయ, గానమునకు మనీషు లౌనౌ ననంగ. 28

మధ్యా. పదపడి కొన్నాళ్ళ కతఁడు దేహళీప్రభుత పేదర్కి
నుదిలపా లైనకవుల కొనర్చుమే లున్నది నీదు
మదికిది యించునేయనుడు నొల్ల నమ్మనువర్తి యనుచు
విదితంబొనర్చితి నాఁడు రంగాకు వినిచిన పల్కు. 29

గీ. మిత్రుఁ డపుడు నీ కెదియేని మేలుగూర్పఁ, జూచునన్ను నీకట్టడ లాఁచి యేఁచు
నైన నేమిలే నిస్స్వార్థమైన తలఁపు, రిత్తవో దనుచుం బంపె నుత్తరంబు. 30

క. బాపూస్మారకనిధిగా, రూపెత్తిన కోట్లకొలఁది రూపాయలకున్
బ్రాపై సేవావ్రతులకుఁ, దీపై మవులంక రుండె దిల్లీనగరిన్. 31

మం. వరదు లమ్మేటికి వ్రాసె మాబాస, వాసికెక్కిన కవివర్యుఁ డొకండు
కమ్మనిపద్యాన గాంధియాత్మకథ, రచియించి తెల్గుభారతికి నపూర్వ
రమణీయతం గూర్చెఁ బ్రాజ్ఞపుంగవుఁడు, రామలింగారెడ్డి రంజిల్లి దీని
కెనలేనిగౌరవ మిచ్చువాక్యములఁ, దిలకమ్ముదిద్దె నీదివ్యసాహిత్య 32
సృష్టి చేసినకవిశేఖరుం డొరుల
నడుగఁడు కర్మిలో నలఁతివాఁ డయ్యు
నెనిమిదివేలసొ మ్మితఁడు వెచ్చించి
తనకృతిన్ మెఱసె, నీధనమెల్లఁ జేతి
కేనాఁటి కందునో యాత్రేఁగు నెత్తి
నుండఁగా నితనికి నొండుకావ్యంబు
గూర్ప నుత్సాహమ్ము గూర దౌచిత్య
మెఱిఁగినవారు మీ రిట లెస్సతడవి
యాప్రబంధ్ధకు సాయమిం, దని దీని
ప్రతి నాకుఁ బంపె నప్పరుచూరివరదు
లితఁడు న న్నలరింప నింతయులంత
కొగ్గనే! యని యబ్రమొందితి నేను. 33

ఆ. అంత గాంధినిధికి నాంధ్రశాఖకుఁ గార్య, కర్తయైన సుకృతి గారవమున
నాత్మకథను బంపు మనుచు నారాయణ, రావు తనకు నుత్తరమ్ము వ్రాసె. 34
(మోతే నారాయణరావుగారు - ఏలూరు)

గీ. పంపితిన్ గృతి నాతండు ప్రతుల రెండు, వేలరూప్యములకు సరిపోలువానిఁ
గొని తెనుఁగునాట విఖ్యాతిగనిన గ్రంథ, నిలయముల కిచ్చె బాపుజీనేతి నెఱుంగ. 35

క. కృతమెఱుకం జాటితి స, న్మతికిన్ వరదులకు నన్ను మన్నింపకు నీ
కృతు లిచ్చినసొమ్మన కని, హితుఁడు మితోక్తుల వెలార్చె నీద్యుల తెలఁగున్. 36

క. అతఁ డిది యొకమేలా ? యను, వితర్కమునఁ బడి మదీయవిముఖత రాకుం
దుతెలుంగున నేదే నుప, కృతి యొం దొనరింప నుత్సహించెను నాకున్! 37

ఆ. చెన్నపురికిఁ బోయెఁ బిన్నలఁబెద్దలఁ, జేర్చి నాచరిత్ర సెప్పి నన్ను
నెన్నఁదగిన యుపద లిచ్చి సత్కృతిసేఁత, కార్యమనియె సభ్యగణ మెలర్ప. 38

గీ. అపుడె సమ్మానసంఘము నవతరించె, నతిరధులు చేరి రద్దాన, నాంధ్రపత్రి
కాదులం బ్రచురించె నెయ్యరి తదీయ, వార్త సకలాంధ్రమును వారెవా! యనంగ. 39
ఏప్రిల్ 1958

గీ. వరదులపుడ నా కొకకమ్మ వ్రాసి సభకు, నద్దుసెప్పకు మని కోర నడుగనట్టి
గౌరవం బది యగుట నుదారమధుర, ఫణితి నతని కస్తుంకృతి పంపినాఁడ. 40

క. ఏ రాహుకేతువులు మొన, దీరి నిరోధించిరో తదీయ సమజ్ఞా
ప్రారంభ మణఁగె మెల్లన, తీఱనివెత నందె నివ్విధిం గని వరదుల్. 41

గీ. జగము నను సత్కరించిన సత్కరింప, కున్న నొకరీతి నుంట నాయోజ యగుట
నీకు వగపేల నెచ్చెలీ ! నీ కవిప్రి, యత్వ మెఱుఁగనా యని యపు దంటి నేను. 42

క. నీయెడ నీ కిప్పనిలో, సాయంపడనేర్తు మన్న సరసులయెడ నా,
నేయంబు నాప్రసన్నత, పాయద శాంతింపు మనితిఁ బరుచూర్ కృతికిన్. 43
13-9-71

## ఖద్దరు దుస్తులు

గీ. ఒక్కనాఁ డే నెఱింగినయువ యొకండు, నన్నుఁ గదిసి ప్రియోక్తులు నడిపినడిపి
చిన్నపనిమీఁదనిటకు వచ్చితిఁ గవీంద్ర!, వాంఛితము నాది చెల్లింపవలయు మీరు. 1

గీ. ఏను దాలుకాకాంగ్రెసునెన్నికలకు, నిలువఁదలఁచితి దరఖాస్తు నేఁడ చేయ
వలయు బాపట్లకేగి; యిప్పట్ల నాకు, వచ్చె నొకపెద్దచి క్కనివార్య మగుచు. 2

ఆ. కట్టియెఱుఁగ నేను ఖద్ద రేనాఁడును, గట్టకున్న నెన్నికలకుఁ దగను
ఎట్లుకొందు రూక లిర్వది యిడి ఖాది, బట్ట లొక్కపూఁటభాగ్యమునకు. 3

క. నిచ్చలు ఖద్దరుకట్టెడి, సచ్చరితులు మీరు గాంధిసరణిన్ నడువన్
ముచ్చటపడుపెద్దలు మా, యుచ్చదశన్ గోరునట్టియెజ్జలు కానన్. 4

గీ. నన్ను వేఱుగాఁ జూడక నాకు నేఁడు, వలయువల్వ లొసంగిన వాని రేప
మీకుఁ జేర్పఁగలాఁడ మీమేలు మఱవ, గురువరా! యాదరింపుఁ డీ కొలఁదికోర్కి. 5

ఆ. అనుడు వానినుడుల కబ్బురపడి తెచ్చి, కోలునగు మొగానఁ గొంత మెఱసి
యింతత్రవ్వవలయునే దీని కని వానిఁ, బనిచినాఁడ ఖదరుబట్ట లిచ్చి. 6

గీ. అతఁడు మఱునాఁడు నాలుగై దనఁటిపండ్ల,తోడ నాయిడినట్టిదుస్తులను దేర
వాని కింపని వగుఁగాక యేను నాల్గు, మాట లిట్లంటి నపుడు మోమోట లేక. 7

ఆ. మగుడఁ బుచ్చుకొనెడిమదితోడ నీకు నీ, వలువ లిచ్చినట్టివాఁడఁ గాను
నీవ వీనిఁ దాల్పఁగావలె రెండవ, జతయు నందుకొమ్ము శంకవిడిచి. 8

ఆ. పేదవాని కండగా దేశభక్తికి, నానవాలుగా మహాత్ముచలువ,
నవతరించె ఖద్ద; రద్ది వేషమునకే, యుపకరించుచుండె నోయి! నేఁడు. 9

క. జాతీయతకును సేవా, ప్రీతికి నిది చిహ్నమగుచు వెలసెను మును; పా
రీతికి విపరీతమ్ముగ, నీతతిఁ గన్పించు నింక నేమందు నిసీ ! 10

గీ. ఖద్దరుధరించువాఁడు దొంగలకు దొంగ, యనెడిసడి పుట్టె దేశమం దక్కటకట!
చీము నెత్తురు గలవానిచెవికి నిట్టి, వాకు బల్లెముపోటుగాఁ దాఁకి నొంచు. 11

గీ. పదవి సిరి నీచభోగముల్ పడయ నరుఁడు, పరుగులెత్తుచునున్నాఁడు పగలురేయి
ఊరనూరను గద్దెలపోరు హెచ్చి, తాఱుమా ఱగుచున్నది ధర్మమెల్ల. 12

ఆ. మతము కులము ధనము మంత్రంబు తంత్రంబు,తోడుగాఁగ నీతి బీడుగాఁగఁ
బాత్రులైనవారిఁ బదత్రొక్కి తెగనిక్కి, పీఠమునకు వచ్చుఁ బిదపవాఁడు. 13

గీ. విద్యలో ననవద్య జీవితములో వ, యస్సులో నారఁబండినయట్టి వార
లెచటనవమతులైయుండురచట సకల,పాపములు హెచ్చి శాంతి నిప్పచ్చరమగు. 14

ఆ. ఈవు చిన్నవాఁడ వీనాఁటిభోగంబ, కాక నాఁటిత్యాగగరిమ మెఱుఁగ;
వేను దాని దీని నెఱుఁగుదుఁ గాన నా, కుందు వెళ్ళఁ బోసికొందు నిట్లు. 15

ఆ. పదవికొఱకుఁ గాక బ్రదికినయన్నాళ్ళు, కట్టవలయు నీవు కదరుబట్ట
పెక్కు మాట లేల పెనఁగుము త్రికరణ, శుద్ధి కొఱకు ధర్మబుద్ధికొఱకు. 16

2-4-72

# ఈవి

ఆ. విజయవాడయందు వేదాంతకవి నొక, పెద్దసభను గౌరవించి, రాంధ్రు;
లేను దత్సమజ్య కేగితి నమవంటి, కవులు పెక్కు రందుఁ గానఁబడిరి. 1

క. అందఱుకవు లాసాధుక, వీందునకున్ గైతపోఁగు లీఁగా ధనవత్
బృందము వంద లొసంగెను, సందడితో సాగిసాగి సభ కదముట్టెన్. 2

క. బసకేగిన కవిపండిత, రసికాగ్రణు లారగించి రమణీయకథా
విసరశ్రవణ శ్రావణ, విస్మృతప్రమదమ్ము నమభవించిరి సంజన్. 3

క. ఆగోష్ఠిని బెక్కురుకవు, లూఁగించిరి నిజనిరర్గళోదారవచః
ప్రాగల్భ్యము చాటి కళా, యోగీంద్రత మెఱసి పగటి యుగలక్షణముల్. 4

గీ. చదివెఁ దనకైత నొకకవీశానుఁ; దతని, పలుకులోఁ గొంతసత్తువ కలదుగాని
లేదు తత్కాయమునఁ జేవ లేశమేని, పాదు తన్ముఖ మతిదీనభావమునకు. 5

క. తనసిగ్గుదీయు లేమిని, వినిచెం బద్యముల నతఁడు వేదికచెంతన్
జినిఁగినదోవతితో మా, సినసాలువుతో సదస్యచిత్తము లుడుకన్. 6

ఆ. అతనియూరు పేరు నారసి యింటికిఁ, జేరి యంచెవలనఁ జేర్చినాఁడ
నిరువదైదురూక లేను దత్కవి కార్తిఁ, గ్రుంగుకవికి జాలిపొంగుతోడ. 7

ఆ. గడ్డ మెత్తఁబడినకైవడి యయ్యొ నా, కీవు పంపినట్టి యీవికతన
నేమి సెప్పువాఁడ నాముప్పుఁదెఱఁ గని, కమ్మ వ్రాసి నన్నుఁ గరఁచె నతఁడు. 8

ఆ. మరలఁ బంపినాఁడ నరమరలేక యా, బక్కకవికి మున్ను పంపినంత
గడ్డ చితికెఁ గాని గాయము మానలే, దని యతండు లేఖ మంపెనపుడు. 9

ఆ. దాతనోవి నెఱుఁగు చాతురి లేని య, ర్థాతురుండు వెఱ్ఱి యని తలంచి,
మఱియు నతని కీవి మానితి నాపాల, లేదుగద కొఱంతలేని మూట. 10

గీ. ఇచ్చినట్టిదియేని సాహిత్యమర్మ, విత్తము లుదాత్త భావనాయత్తు లైన
జను లొసంగిన సమ్మానధనమ యనుచు, వక్కణించెద సత్యసేవకుఁడ నగుచు. 11

ఆ. నలువదేండ్లనుండి ననుఁబిల్చి జగ మిద్ద, యొదమి కొన్ని వేల కుందుఁ గాని
దీనికంటెఁ దగ్గ దేను నాకంటెను, బక్కవారి కిడినరొక్క మరయ. 12

ఆ. ఇచట నాకు లాభ మేమందురా నాది, గానిసొమ్ము లేని వాని కిచ్చి
యొరులదృష్టి కేను నొకదాతగాఁ గనం, బడుట యనెద వినయభరముతోడ.

18-6-67

## సహనము

క. కవిగారూ ! నతులనుచున్, యువ యొక్కఁడు నన్నుఁ గదిసె నొకనాఁ డతనిన్
దవురీతి నాదరించిన, యవల విశేషమ్ములేమి యని యే నంటిన్. 1

మధ్యా.మాపల్లె నున్నతపాఠశాల శ్రీమంతుల యీవి
రూపెత్తె నాల్గేండ్లనాఁడు; నేఁటికి రుచిరమౌ భవన
మాపాదితంబాయె నిబ్బడికి; దీని నావిష్కరింప
నోపెను మనమంత్రిమౌళి; జరుగు నీయుత్సవ మెల్లి. 2

మధ్యా.ఈసభన్ దెన్గుబాసకు సవతులేనియేపు చేకూర్ప
గాసిల్లుమిమ్ము నర్చించి మేలైన కాన్కలు పెట్ట
నాసక్తిచూపుచున్నారు మాపెద్ద; లనుకంప నింపి
మాసదస్సునకు రండని యతండు నమ్రతమైవచించె. 3

క. ఆరోగ్యము చెడిచెడి నేఁ, గాఱియపడుచున్న చెనఁటికాలం బది నా
తీరు గని బంధుమిత్రులు, దారసుతుల్ బెగడుచున్నతఱి యది యగుటన్. -19614

ఆ. అన్న ! నన్నుఁ జూచుచున్న వాఁడవు కదా, యెట్టులుంటిఁ జెప్పు, మిపుడు సభకు
వచ్చు నలవులేని వక్కినైతిని నొప్పి,గుంటి నేను స్రుక్కుచుంటి నేను.

గీ. నాదెస నపారహార్ద మున్నది జనాళి, కైన నేమాయె విధికి నీ సగ్గలంబు
మరలమరల నెవోరిత్తమాట లనకు, మోయి! పెఱవారలం గను ముదుగునన్ను.5

గీ. అనుచు నపు దేను వాక్రువ్వ నతఁడు విన్నఁ,దనమునం బడి కొండొకతతికిఁ దేటి
వక్కణింపుఁడు మీర వేఱొక్కకవిని,దెప్పునం జని యతని నర్థింతు ననియె. 6

గీ. మంచిదని యొక పేరు సూచించి వ్రేఁగు, డించుకొంటిని దరుణుఁ దేతెంచె నంత
శిష్యుఁ దపు డిట్టు లనియె నాచెంత నిల్చి,నాకు వలసినసేవ లొనర్చువాఁడు. 7

గీ. అతనిపే రేలసెప్పితిరయ్య ! మీ గ, రిష్ఠతను సైఁపఁజాలని క్రిం చతండు
నిక్కమెఱుఁగని లేకిమానిసియతండు, తక్కిడియతండు పరమకృతఘ్నుఁ డతఁడు.8

గీ. అనినఁ జట్టున కే నిటులంటి నీవు, కన్నువిప్పనిపిన్నవు కాన నిది య
కార్య మిది కార్య మని కనంగల మనీష, లేక వేగిరపడెద వీలీల నిందు. 9

గీ. ఎగ్గుచేసినవానికి లగ్గుసేఁత, నిక్కమగునీతి యగుఁజుమీ!; నేరఁబోతు
సిగ్గునం దోఁగి మంచికి నొగ్గు దీనఁ, బాపముల కెడదవ్వుగా బ్రదుకు దీన. 10

ఆ. ఒరుని పెంపుగోరు నరుఁ డిందు నందును, శాంతివలచు నరుఁడు సాధువృత్త
మాసచేయునరుఁడు దోసికి మేలు గా, వింపవలయు సహన మింపవలయు.11

ఆ. ఓర్మి నియ్యకొంట యొంటమిదెసకుఁ బో, కుంట లాఁతియొప్పు నుగ్గడించి
తప్పు మఱచిపోక ధన్యజీవనమున, కారటించు వారి కర్తవిధులు. 12

గీ. అక్షమునిపేర్మి గర్వితు నర్థపుష్టి, పాడిదప్పినతేని యేల్బడియుఁ జెడిన
కడవనింపినసలిలమ్ము కరఁటిఁజిరము, నిలువ దందురు ధర్మజ్ఞు లలఘుమతులు.13

13-9-72

## అప్పికట్ల నిలుపు

గీ. ఏను వినయాశ్రమశ్రీ నిదానమైన, జనపదమ్మునఁ గావూర జననమంది
పెరిఁగి సాహిత్యమర్మంబు లెఱిఁగి కాఁ, యాచి విడిచితి నొజ్జన మవధరించి.1

ఆ. మొదట దుగ్గిరాలఁ బిదప బాపట్ల నా, చార్యకమ్ము నెఱపి జన్మభూమి
కతిసమీప మగుట నవ్వల నిడుఁబ్రోలు, చేరినాఁడ మిత్రు లార నలర. 2

గీ. అచట నైదాఋవత్సరా లరుగ నప్పి, కట్లవారు నన్ గదిసి మా గ్రామమునకుఁ
దెచ్చితిమి నేఁడు హైస్కూలు; దీనఁ దనరు, తెలుఁగుగద్దెకు మీరు రావలతు మనిరి. 3

గీ. మున్ను నన్ను సదాస్థానమున గణించి, గారవించిన యూ రప్పికట్ల యగుట
వారి కెదురాడ నొల్లక వచ్చినాఁడఁ, బున్న యాదికవుల్ నెలకొన్న యెడకు. 1947

ఆ. నే నటన్ వసించి నిడుఁబ్రోలిసభఁ గన, కాభిషేకముఖ మహాదరంబు
లందుకొంటిఁ గంటి నఖిలావనీ పరి, వ్యాప్త మజర మమర మైనయశము. 5

క. సరిగా నిందుఁ బదేఁడులు, గురుతను సాగించి విరతిగొంటిని బిదపన్
దిరపడుటకుఁ గావూరా, పెఱయూరా తగిన దన్న పెనఁకువఁ బడితిన్. 6

ఆ. అప్పికట్ల వీడ నాత్మ యొప్పదు పుట్టు, గడ్డమీఁదితీపిఁ గడవ నేర,
దెదియు సేయలేక యేను సందిగ్ధతఁ, జిక్కినాఁడ మిగుల స్రుక్కినాఁడ. 7

గీ. నన్నుఁ దమయూర నిల్ప నానాఁడపేక్ష, గనిరి సాహిత్యరతు లప్పికట్లవారు
నిర్ణయించిరి నా కొక నెలవు గూర్చి, యుత్తమ ముహూర్తమందు బహూకరింప. 8

ఆ. సదన మిది ఘటింపఁ బదునైదు వేలు కా, వలయు నని తలంచి రలఘు మతులు
కాఁపులంద ఱొక్కగడియలోఁ గాన్క పట్టీని బూర్తిచేసి రౌ నటంచు. 9

గీ. ఎపుడు నా చెవికిందాఁకె నీ యుదాత్త, వార్త యపు డూరి పెద్దలవలని కేగి
నతుఁడనై యన్నలార ! మీ వితరణమ్ము, మెత్తు మీకూర్మిపేర్మికి మెప్పులిత్తు. 10

క. నాకై మీ రిపు డూనిన, ప్రేఁక మసామాన్య మింతప్రేఁగు మదీయం
బీకొనదు మానసము నా, వాకులు నిక్కములు నమ్మవలయును వీనిన్. 11

గీ. అపుడు మద్రాష్ట్రగానసమర్పణోత్స,వంబు సుకవిస్తుతంబు కావలయు ననుచు
వెచ్చ మేపాటియైనను వెఱవ కీరు, నన్నుఁ దనిపితి రావదాన్యతయ చాలు. 12

క. మీ పాఠశాల నే న, ధ్యాపకతన్ మోసిమోసి తలఁగుట నొక పూ
వో పండో సభ నిచ్చిన, సైఁపంగల నన్య మోర్వఁజాలనుఖుండీ ! 13

ఆ. ఇంద యేను నిల్చు టింతదనుకనిశ్చి, తమ్ముగాద యైనతటిని నాకు
వలయునిల్లు నాదువసువుతోన యమర్తు, వలదు మీరు నలఁగవలదు దీన. 14

ఆ. శక్తిలేనినాఁడు సనసన్న వెదురుతో, గడ్డితో గృహమ్ము కట్టుకొందు
మిద్దెలేల యేలమేడలు నా; కింత, గుడిసె నొదిఁగియున్నఁ గోడికూయు. 15

గీ. ఏ నిటుల్ పల్క నెట్టకునేని వారు, శిరమునూఁపిరి గాని చేసినప్రయత్న
మీటువోయెంగదా యింక నేది కృత్య, మని తలంచి రుదారభావాత్తమతులు. 16

ఆ. అంతదనుకఁ బోవ నవరుద్ధతం గన, వలసె నిపుడు కవికి వక్కలాకు
లిడినఁ జాలు ననుచు నెంచరు తమపెంపు, మఱవ రప్పికట్లగఱువ లదిర !17

గీ. పద్దుపద్దున నాలవపాలిసొమ్ము, జమకుఁ దెచ్చిరి విరమణోత్సవము కూర్చి
యఖిలభారత కర్షకోద్యమ విధాత, నధిపుఁ జేసిరి సభకు రంగాభిధేయు. 18

ఆ. ప్రసన్నప్రసన్నుదుల నన్నుఁ గొండాడిరి, మూఁడువేల కాన్కమూట నిచ్చి
రప్పికట్లవారి యౌదార్య మది నన్న, కాదు కరఁచె నోలగంబునెల్ల. 19

మధ్యా.కానుక సర్వస్వతంత్రమైనది కావుటంజేసి,
యేను దీనింగొన నియ్యకొంటి సౌహిత్యముగంటి
నానావిధమ్ముల నన్ను మన్నించు నాగరికులకు
నానెమ్మి దెల్పితి నప్పికట్లమానవులకు నతుల. 20

మధ్యా.ఆవెన్క వీరికి దవ్వుల నిలుచు టది నచ్చకుంటఁ
*గోవిదమణి జగన్నాథుఁ డనఘుఁ డీకొట్టిక నుంట
వేవేగఁ బయనమునల్పు రైలుంట విందులు నుంటఁ
గావూరు నాబిడ్డ లెవ్వ రెఱుఁగనిగ్రామమై యుంట. 21

*శ్రీమాన్ మహావిద్వాన్ పణ్డిత వేదాన్తమ్ జగన్నాథాచార్య స్వామిగారు. ఆస్థాన విద్వాంసులు తిరుమల - తిరుపతి దేవస్థానము.

ఆ. అప్పికట్లనిల్పు నంగీకరించితి, నిల్లుకొంటిఁ దగినయెడను జూచి
బాగుపఱిచి దీన నీఁగునాఁటికిఁ బదు, నాల్గువేలసొమ్ము నలఁగిపోయె. 22

గీ. ఆలుబిడ్డలకోర్కుల కద్దుసెప్పఁ, జాల కింత వెచ్చించితి సదనమునకు
నలఁతిగా నున్న చేనికి విలువదెచ్చి, సమయమునకు దైవమ్మును సాయపడియె. 23

క. ఇది నాయి ల్లని యలరుచు, మదిమదిమై నుంటి మేలిమనికిని జగద
భ్యుదయాపాదక శౌచా, స్పద క్రమకవిత్వసృష్టి పనిగా మునిగా. 24

19-6-67

# కుప్పుసామి యీావి

ఆ. కుప్పుసామి యనిన గుంటూరికే కాదు, తెలుఁగుసీమకెల్లఁ బలకరింపు;
సాధుశీలుఁ డితఁడు సడిసన్నదాతగా, నేతగా యశమ్ము నింపె దిశల. 1

క. పెక్కేండ్లు గర్తపురమహి, చక్కఁగఁ బాలించె, మద్రశాసనసభకున్
బెక్కువగూర్చె, విరోధి, స్ఫ్రుక్కెఁగక మనె, వినీతశేఖరుఁ డయ్యేన్. 2

గీ. ఒజ్జనమునుండి విడుమర నొందినపుడు, నన్ను మన్నింపఁజూచినయన్న లప్పి
కట్లవా రిమ్మనీషిని గదిసి తమ త, లంపు వివరించి "సభను బాలింప మీరు -3

క. రావలయును, మా ప్రార్థన, కీవలయును బేర్మి; లోక మెఱిఁగినకవికిన్
గావించుగౌరవం బిది, కోవిదకవు లేగుదెంచుకొలు విది" యనుడున్. 4

గీ. "మంచిపనికి నొగ్గితిరి తుమ్మలకవీంద్రుఁ, దర్శనీయుఁడు రాష్ట్రగానాదికృతుల
నాంధ్రజాతిని దిద్దినయతఁడు, నుడికి, మనుగడకు మచ్చరానీనిమానవుండు. 5

ఆ. అగును గాని వేంకటప్పయా ! నాగయా !, కదలు నోర్వలేని ముదుక నైతి
సభకు వచ్చి తనియఁజాలుభాగ్యంబు నా, పాల లేదు నాదుపలుకునమ్మి- 6

క. తగువారిన్ దేరుఁడు మై, బిగువుండినవారిఁ గావ్యపీయూషముపైఁ
దగులుకలవారి జాతి, ప్రగతిని వాంఛించువారిఁ, బసగలవారిన్. 7

ఆ. మఱియు నొక్కమాట; మనకవి సిరులున్న, వాఁడు కాఁడు పేదవాఁడ యయ్యు
వేఁడునట్టివాఁడుకాఁడు సంపన్నుల, వీఁడునట్టివాఁడుకాఁడు పరువు. 8

గీ. ఎందఱెందఱకో ధనమిడితిఁ గాని, యితని కీలేకపోయితి నిది మదాత్మఁ
గలఁచుచున్నది కాన నీకాన్క నితని, కిందు మీ సభ నావ్యథయెల్లఁ దెల్పి. 9

క. అడిగినకవి కెవ్వనికే, నిడలేదు శతమ్ముకంటె హెచ్చుగ; నీతం
డడుగనికవి గఱువతనం, బుడుగనికవి కాన వేయి యొసఁగితి వేడ్కన్". 10

క. అని కుప్పుసామి సజ్జన, పనితచరిత్రుండు పలుక "బాపు ! సెబా ! సె
వ్వనియందుఁ జూతు మీపటి!, ధనవంతులకేమి కలరు ధర నూరూరన్. 11

క. ఒకనాఁటిసుగుణమా యిది, ప్రకటవదాన్యులు నిరస్తపాపులు ప్రజ్ఞా
ధికు లుదయించిన వంగడ, ము కదా యీాహలికమణి; దమూదృక్షులకున్-12

క. నెఱదాతలకున్ గనియై, వఱలెడిజాగర్లమూడివంశము జగదా
భరణమ్ముగ నావిధుభా, స్కరమ్ముగా విస్తరిల్లుఁగాక !" యటంచున్ 13

ఆ. అప్పికట్లపెద్ద లానందపారవ, శ్యమ్ముతోడవచ్చి సదసునందుఁ
గుప్పుసామికథను జెప్ప జయధ్వనుల్, మిన్నుముట్టె వెఱఁగు నన్నుఁ జుట్టె. 14

క. కలదే యిట్టియుదారత!, వలదేలోకమున కిట్టివారలగెలుపుల్
తులలేనిగౌరవం బిది తొలునోములు పండి పదయుదురు కవు లంటిన్. 15

క. తనపేర్మి కొరులపేరిమి, తనతన్నున కొరుల తనువు తావల మని న
మ్మిన కుప్పుసామిచౌదరి, మనుగడ సాహులకు నొజ్జమాద్రిది యంటిన్. 16

20-6-67

# సత్తురూపాయ

క. ఒకతతి సాహిత్యవిమ, ర్శకమౌళి గురుప్రసాదరావున్ గన ను
త్సుకతన్ 'గుణదల' కేగితిఁ, బ్రకటకలాశాల యున్న పల్లీస్థలికిన్. 1

ఆ. వలయుకావ్యములను విలువ నిమ్మిత్రుతో, వెదలినాఁడ నపుడు విజయవాడ
కచటనచట బేర మైనయంతన చెలి, కానితోడ బసకుఁ గదలినాఁడ. 2

గీ. జేబునందు నేబులు లేమిఁజేసి యేను, బస్సువానికి నిడితి రూపాయబిళ్ళ
నటునిటుం ద్రిప్పి నాణెము నతఁడు నన్ను, నెల్లిదమ్మునఁ జూచుచు నిట్లు వల్కె. 3

ఆ. "ఎవనికొంప దీయ నిచ్చితి వీసత్తు, ముక్క నాకు దొంగముద్ర వైచి
వెదకివెదకి ముదుగుకదరు సంపాదించి, వేసితివి పిపాళివేసమెల్ల. 4

ఆ. బాగు ! బాగు ! పాడి పాడయ్యె నీవంటి, వేసగాండ్రకతన మోస మెచ్చి
దేశ మెంతదుర్గతికిఁ బోవునో మిమ్ము, నసుగమించి ధర్మ మతకరించి" 5

క. వాకు లివి నాయెదందకు, బాఁకులుగా మాఱ ఖదరుబట్టపరువు నేఁ
డీకొలఁదికి వచ్చినదా ? లోకము లోభాదిరొంపిలోఁ జిక్కినదా ? 6

ఆ. నమ్మఁజాల గాంధినాయంకరమ్మున, బ్రదుకు దిద్దుకొన్న ప్రజల కింత
మఱపు వచ్చె ననిన, మాడపైఁ గూడని, ప్రేమ మింతవఱకుఁ బెరిఁగె ననిన. 7

క. పెరిఁగినచో రవిసోములు, తెరువుం దప్పరె ? పయోనిధిన్ బడబాగ్ని
స్ఫురణ మెసరేఁగ కుండునె ?, హరి! హరి ! రాకుండుఁ గాక యపకృతి మహికిన్. 8

గీ. ఎఱిఁగియేని యెఱుంగకయేని సత్తు, రూక నంగడివాఁ డిచ్చె నాకు నేఁడు
దీని రక్షింపనేల రేపైన బుద్ధి, గడ్డిఁదిననచో ధర్మువున్ గడతునేమొ. 9

క. నాచెంత నిలుపరాని పి, శాచం బిది" యని ప్రసా దసా ! దన వెలికిన్
వైచితి రూక, నశాంతిని, ద్రోచితి సుంకీఁడు లజ్జఁ దోఁగన్ వీఁగన్. 10

గీ. ఎంతతెగువలే యిది యని యెవ్వఁడైనఁ, జప్పరింపవచ్చును గాని సన్నసన్న
చాగములె సాగిసాగి విశ్వప్రశంస, కర్హమగు నీవి నరునకు నలవరించు. 11

23-5-67

# మాటతప్పరాదు

క. కనకస్నాన పురస్సర (1949లో), ఘనసన్మానముల నన్నుఁ గరఁగించిన స
జ్జను లస్మదీయమిత్రుల, యనురాగం బాఁగదాయె నాజన్మముతోన్. 1

గీ. ఏలతొందర యనుచు నే నెంతయడ్డ,పాటు సెప్పినఁ జెలులు నామాట వినక
పూని రనువత్సరంబు నాపుట్టుపండు, వట నటన్ నిర్వహింప నేకాశయమున. 2

ఆ. జరిగె మామకీన జన్మదినోత్సవ, మప్పికట్లయందు నాదిమమ్ము
మంగళప్రవనంగ మాధుర్యముల నుడు, గరల నద నుదాత్తగతిఁ
జెలంగె. (25-12-1952) 3

గీ. మిత్రు లయ్యాయిచోటుల మెలఁగువార,లర్థిమైఁ గూర్చ నీసభ లాఁకలేక,
సాగఁగా నవపంచాశ జన్మదిన మ (59వ), హస్సు దాపునకున్ వచ్చె నల్లనల్ల. 4

గీ. అపుడు నే వేఁటపాలెమునందు సొంత, సేద్యమునఁ జిక్కి వేసటచెందుచుంటి
పుట్టుపండువునాఁటికిఁ బొలము పండి, కోఁతకో కుప్పకో వచ్చురీతిఁ గంటి. 5

గీ. కావునజయంతి కయ్యయితావులందుఁ, గలయనుంగులు పిలువ వీల్గాద యనుచుఁ
గమ్మలంపుచు రేపవల్ కమ్మతనము, త్రొక్కటలతోడఁ గాలముం ద్రోయుచుంటి. 6

గీ. + రాజశేఖరుఁ డపుడు చీరాలపురిని, గుదురుకొనియుండెఁ బిడ్డలచదువుకొఱకు
వేఁటపాలెంవుఁబయనాలమాటిమాటి, కతనిఁగనుచుందుఁదినుచుందు
నతనియింట. 7

(శిష్యా, సత్యనారాయణరాజశేఖరము)

గీ. ఎచటసాగు జయంతి యీయేఁ డటంచు,నడిగె నమ్మిత్రుఁ డొక్క నాఁ, డది పొసంగ
దీతడవ యని కలరూపు నే వచింపఁ, గాదుకా దని రాజశేఖర మనీషి- 8

క. చీరాలకు మృగయాపురి, చేరువలోఁ గలదు కానఁ జేసెద నే నీ
భారత్యుత్సవ మస్మద, గారమునం దనియెఁ బేర్మి కదలుకొనంగన్. 9

మధ్యా.ఆనాఁడు పొలమునం దేను నిల్చుట యనివార్యమైన,
ధీనిధీ ! మీ యింటి కెట్లు రానేర్తుఁ దెల్పవే యంటి
మానంగన్నొల్లను సభను మీ చిక్కు మరలెడి వీలు
లేనిచో వేఁటపాలెమున సాగింతులే ! యనె నేస్తి. 10

ఆ. పగలు మీకుఁ దీఱుబడి యుండదేని రే, ప్రొద్దు కూర్తు సదము; నుద్దిలేని
గ్రంథనిలయమచటఁ గలదుసభారంగ, మదియ యనియుఁ బల్కె నయ్యనుంగు. 11

గీ. అతని కోరిక కెదురాడ ననువు లేక, వల్లె యంటి నెయ్యరి మొగ ముల్లసిల్ల
నా పురాపుణ్యమున దక్కినా రయారె !, రాజశేఖరువంటి మిత్రములు తనకు. 12

మధ్యా.కత యిట్టులుండ సంగాతి విద్వ దగ్రణి నన్ను నొజ్జ
వితమున భావించి తనివిసెందెడి వేంకటేశ్వరుఁడు!
కృతనిశ్చయుఁడనైతి మీజయంతి నీ యేఁడు సాగింప
జతపడెఁ బెద్దలతోడుపాటు మీచందముం దెలుప. 13

*(1. తోటకూర వేంకటేశ్వరరావు యం.ఎ)*

ఆ. ఈయకోలు చూపవే యస్మదిచ్ఛకు, ననుచు విన్నపంబు నంపె నరస
రావుపేఁటనుండి; రాజశేఖరుఁడు న, న్నగ్గపఱుచుకొనియె నంటి నేను. 14

మం.పదవడి వేంకటేశ్వరుఁ డెంతయేని, కలఁగి "సుహృన్మణీ! గాంధిమహాత్ము
నాస్థానకవికి మహాంధ్రావతరణ, కారణ కమనీయకవితావిధాత
కెడపక బాసపెం పెద నెంచి బదలు, తెనుఁగు లెంకకు సాహితీ వరివస్య
నిచ్చించు మాదృశు లిచట నీయేఁడు, జన్మదినోత్సవ సభ నిర్వహించి
భూరి సత్కారముల్ పొనరించి తనియ, నుద్యుక్తులైరి మా యూఁపు రేపటికి 15

మం.నిలుచునో నిలువదో నీ వీమహస్సు, సాగింపఁ గవివర్యుసమ్మతి గన్న
కథ నేఁడు వింటి నౌగాము లెఱింగి, యంగీకరింపు మన్నా ! మాతంలపు
మా నిరోధమ్మును మన్నింపు" మనుచు, రాజశేఖరునకు వ్రాసె నుత్తరము 16

క. అది రాజశేఖరుఁడు కని, వదలకుఁ డీవైభవమ్ము వదలకుఁ డని నన్
బదిఁబదిగ వేఁడ, నిది నా, మది కించుకనొవ్వి నిదని మార్పని యాడన్ 17

గీ. రాజశేఖర ! నీవు నా యోజఁ గనని, క్రొత్త చుట్టమవా ? నీదు చిత్తమునకు
నిష్ట మగుఁగాక పేఁటవా రెన్నివేల, విత్త మిత్తురుగాక నే విడువ నియతి. 18

గీ. నిర్వహింపుము నీయింటనే జయంతి, నీ వొసఁగు పుష్పమే నాకు హేమనగము
మానవుండు ప్రలోభముల్ మానఁడేని, రెంటికిం జెడ్డవాఁ డగు నంటి నపుడు. 19

గీ. మిత్రమా ! మీ యుదారత మెత్తుఁగాని, మాట నిచ్చినపిదప నే మరలఁ జాల
వత్తు మీపురి కాగామి వత్సరమున, నని యనిచినాఁడ వేంకటేశునకు లేఖ. 20

ఆ. రాజశేఖరుండు రమణీయముగ నన్ను, దుత్సవమ్ము నెఱపె నూరిలోని
కవులబుధులఁబిల్చిగాయకులనుజేర్చి,మిత్రసమితి నెల్ల మేళవించి. (25-12-1959)

మధ్యా. నరసరాట్పురివేంకటేశ్వరుండును నాఁ దరుదెంచి
దొరలేని సంతృప్తి నావహించె మిత్రులకు "రానున్న
శరద మా వీట నీపూజనమ్మును సాగింతు మీరు
కరుణించి రావలె నని యతం దనఁగా గోష్ఠి యలరె. 22

26-10-71

# తెనుఁగు లెంక

మం. శతకముల్ హరికథల్ జంగమకథలు, నాటకాదులు వ్రాయు నవయౌవనమునఁ
గన్నాఁడ నే 'బాలకవి' యన్నబిరుదు, నవధానము లొనర్చునపు 'డవధాన
పండిత' ఖ్యాతిని బడసితి, 'సరస, కవిశేఖర' ప్రథ గంటిఁ, జేకొంటిఁ
బొన్నూరిభావన్న పొలమేరయందు, గంట కిన్నూరు చక్కని పద్యములను
సకల లక్షణవిధా సంపన్నములను, బల్కి 'యాశుకవీంద్ర' పట్ట, ముదాత్త
సభను 'విద్వత్కవిసమ్రా' ట్టనైతి, వెనుక 'జాతీయకవిబ్రహ్మ' నైతి
నవల 'రాష్ట్రీయకవ్యగ్రణి' నైతిఁ, బిదప జయాంకముల్ పెక్కు లందితిని

గాని యస్మద్గాంధికథ నుబ్బినపుడు, విశ్వవిద్వల్లోక వినుతిపాత్రుండు
రామలింగారెడ్డి రమణీయముద్ర, నందిన బిరుదున 'కళినవతిక్క'
నాఖ్యమ్మునకు నాత్మ నలరితి నేను;, అలరుట నిందనీయము కాదు గాని,
కవితన్ మదీయను గ్రంథరూపమునఁ, బ్రకటించుతతి నట్టపై దీని నిల్పి
పెద్దనేరమిని గావించితి నకట !
కొన్నేండ్ల కీతప్పుగుట్టు గుర్తించి, నా చందమున కెంత నవ్వెనో జగము
నా యహంతకు నెంత నవ్విరో ప్రజలు, బిరుదము ల్గలకవుల్ పెక్కు రీతెల్గు
నాట లేరా నేఁడు ? నా తప్పువంటి, తప్పు గావింపనిధన్యు లుదాత్తు
లీ కవిశ్రేణిలో నెందఱు లేరు ?

వారిపోకడ నేల వాటింపనైతి, వారినిబ్బర మేల వాంఛింప నైతి
నే నేర్పరించిన కృతిని దిక్కన్న, పలుకుసౌ రున్నచోఁ బఠిత లెటింగి
నను మెచ్చరా ? సూరనను ప్రశంసింప, కుండిరా సాహితీయోగ్యతా నిధులు
చెల్లఁబో ! మతిమాలి చెడ్డ చేసితిని.
దోస మియ్యది యెట్లు తొలఁగునం చేను, వగచుచుండ వయస్యవర్గమ్ము నరస
రావుపేఁటం బ్రజారంజకమైన, సభగూర్చి కాటూరి సత్కు లోదితుని
వేంకటేశ్వరుని గవిప్రపంచార్కు, నధ్యక్షుఁ గావించి యస్మదీయమ్ము
పుట్టుపండు వొనర్చి భూరిసత్కృతుల, ననుఁ దన్పి; రపు డభినవతిక్కనాఖ్య
(25-12-60)
కర్హుఁ డీకైసరుఁ దని సభాసదులు, తత వాగ్విభూతిమైఁ దన్నుఁ గొండాడ
నే నేడఁ దిక్కన్న యేడఁ దెనుంగు, బాసకు నుసుతైన పరమర్షి యతఁడు
ప్రజలార ! కవులార ! పండితులార !, 'యభినవతిక్కన్న' యనుపట్టమునకుఁ
జాల నే, నిది నాకు సైరింపరాని, బ్రేఁ గాయె మీముందు విడిచెదన్ దీని
నిఁక నన్నుఁ బిలువకుఁ డీ పవాదమున, మన్నింపుఁడీ నాదుమనవి నం చనితిఁ
దెలవాఱుసరికి నా తెల్పిన పల్కు, లివి పత్రికల కెక్కి యిళ్లిల్లు తట్టె
బాపురే ! కడుమంచిపని చేసి తనుచు, నయ్యరే ! నీ చంద మభినంద్య మనుచు
గఱువలు వ్రాసిన కమ్మలు వేన, వేలుగా వచ్చి రావించె నా కెలమి
సత్యంబు నీకొన్న జనుఁ డింతశాంతి, కుదుచునే ! యని మేలుకొంటి నానాఁడు
పదపడి నాయాము పరువులు దీయఁ, దెనుఁగులెంకగ మాటితిని గ్రన్న నేను
బిరుదమ్ము కాదిది ప్రేమించుసేవ, తెఱఁగు దెల్పు నహంకృతివిదూర చిహ్న;
మీ కథ నొక్కనాఁ డే నొకయొజ్జ, కడఁ జెప్ప నతఁడు 'లంకా' శబ్దమునకు
వికృతి కాదా లెంక, ద్వీపార్థ మిచ్చు, పదము కాదా లెంక; బళిరా ! తెనుంగు
దీవి యన్నర్థంబు, తెనుఁగు భారతికిఁ, బీర మన్నర్థంబు వినుచు నీ తెనుఁగు
లెంక యన్ నుడి వెడలింపదా భవ ద, హంకృతి నిపుడేని యని నన్ను నెదిరె;
నపు దేను వికృతి కాదయ్య ! యీలెంక, సేవకార్థంబు నిచ్చెడి దేశ్యపదము
కను నందిమల్లయ్యగారి పద్యమ్ము, చను చేమకూర భాషాపేటి కడకు;
నాగేశ్వరుని కాశినాథుని యల్లు, శంభుప్రసాదు సజ్జను నీ వెఱుంగు
దమ్మేటి శివలెంక యను నింటిపేర, నొప్పుటయు నెఱుంగు దుద్దండుఁ డైన
శివకవి శివులెంక శివలెంకఁజేసె, నతఁడు వైరిపదమ్ము నంగీకరించె
నిక్క మారయుము మన్న నెయ్యుఁ డయ్యొజ
వెల్వెల్లఁబాటి నీ వివరింపు నాదు, కను విచ్చినది; తెన్గుఁగదలి నెవ్వాఁడు

త్రచ్చె నీచందాన రారాపు లోర్చి, యిచ్చె నెవ్వఁడు బాస కెనలేనిబల్మి;
ననుదు నన్ బెద్దసేయకు మనా! యంటిఁ, దెనుఁగులెంకగ మన్వు దిద్దుకొంచుంటి
నుడివోని దగుఁగాక యోగమ్ము నాది, చరితార్థ మగుఁగాక జన్మంబు నాది
నాతిమానిత ప్రభ్వి ననుఁ దేర్చుఁగాక !, నా తెన్గుతల్లిమన్నన హెచ్చుఁగాక ! 8

16-3-72

# ఉపకృతి

ఆ. కవులతోడిచెల్మి కావించి కావించి, సాధుసరళకృతులు చదివి చదివి
కొంతకొంత బాసగుట్టుమ ట్టెఱిఁగి నా, మిత్రుఁ డొకఁ డుపక్రమించె రచన. 1

ఆ. ఇతఁడు వ్రాసినట్టికృతి యెదియైన నా, మెచ్చు వదయుదనుక నచ్చు గాదు
లాక్షణికబలం బలంతి కావున వీని, కెల్లతెగలనెరసు లెఱుకపడవు. 2

ఆ. గ్రుడ్డివానివోలెఁ గొందగుర్తులతోడ, నేగుచుంద్రు బాట నిట్టికవులు
క్రొత్తమలపు తగులఁ దత్తరపడి మ్రొగ్గ, తిల్లి దుల్లి పల్లటిల్లుచుంద్రు. 3

గీ. లక్ష్యమె శరణ్యముగ బండి లాగఁజాల, రెంత చదివినకవులైనఁ గ్రంతఁబడక;
నేఁడకాదు నాఁడైనఁ గన్పింతు రిట్టి, దుర్బలులు శాస్త్రవైదుషీదూరమతులు. 4

గీ. ఏనుసైతము శాస్త్రిని గాను గాని, 'గ్రుడ్డిలోమెల్ల' యనఁదగ్గకోవవాఁడ;
నేన మొనగాఁడ నని నమ్మి యేగుదెంచు, కవులశంకలు దీర్తు నాకన్నవఱకు. 5

గీ. అధులకుఁ జిక్కి వ్యాధుల కగ్గపడి కృ, శించి యేనున్న వేళ నా చెలిమికాఁడు
వచ్చి ననుఁ జూచి పెద్దయు వగచి సాను,భూతి వాక్కులఁ దనకు సంప్రీతిగూర్చి. 6

క. మాపల్లియకథ యొక్కటి, నాపలుకుం దఱమఁ దెచ్చినాఁడఁ గవితకున్;
మీ పొత్తుకతనఁ బద్యమ, తీపియగున్ నాకు నెద్ది తెలుపుటకైనన్. 7

ఆ. మీరు తెగులు నొగులు గూరి నలంగుట, యెఱిఁగి దీని దిద్ది మెఱుఁగువెట్టు
పనికి మిమ్ము వేఁడ మనసొప్ప కావ్రేఁగు, మోపినాఁడ నొరులమూఁపునందు. 8

ఆ. వారు సవరసేయ వ్రాసినప్రతి యిది; దీనిఁ జూచి యెదఁద తేటినపుడు
తీటినపుడు కూర్పుఁ దీరు పీఠిక; నది, నాల్గుముక్క లైన నాకుఁ జాలు. 9

ఆ. అని యితండు పొత్త మందింప గబగబ, జదివినాఁడ దానిఁ జాలవఱకుఁ;
దప్పు లందుఁ గుప్పతెప్పలుగా నుండె, మొదటిపద్యమునన మూఁడు విడిసె. 10

గీ. ఏను వెఱఁగంది యపు డహో!యెవరు దిద్ది,రీకవిత్వము నా నెయ్యుఁ డెల్ల వినిచె;
నలవరించినయట్టివాం డ్రలంతియలంతి; నేర్మిగలవారు కారు పాండిత్యనిధులె. 11

ఆ. ఐననేమి పరుల కావంత యుపకృతి, సలుపవలయు నన్నతలఁపులేని
సత్యదృష్టిలేని చదురు లాసంస్కర్త; లట్టివారు మహికి వట్టివారు. 12

గీ. సాయ మడిగినకవికైత సంస్కరింప,
కది సమీచీన మని బొంకులాడి యాడి
యన్యు లద్దానఁ బసలేమి కవల నవ్వఁ,
గులుకుటకు వార్చు విబుధులు కొంద ఱుంద్రు. 13

మధ్యా.అఖిలధర్మంబుల మిక్కిలి యనుట కర్హమ్ము నిజము;
నిఖలపాపములఁ బెద్ద యనఁ దగిన దనృతవచనంబు;
సుఖ మిందు నందును గుడుచువారలు సూనృతవ్రతులె;
మఖము లెన్నే నొక్క నిక్కమునకు సమానమ్ము కావు. 14

గీ. అని వగచి నెయ్యరీ ! తప్పు లగ్గలముగ, నుండె నీకైత; నోపిక యున్ననాఁడు
దీని సవరించి పీఠికతో నొసంగు,వాఁడఁ; దమకింప కందాఁక వార్వు మనిన. 15

ఆ. ఇంతకంటెభాగ్య మేమికావలయు నా; కెంతకాలమైన నేను సైఁతు;
వేగపడకుఁ డీరు; మీ గొప్పతనమున, కెల్ల లేమి కంటి నిపుడు సుకవి! 16

ఆ. మీకుఁ దిమ్మఁదనము చేకూర్పవలె నని,మ్రొక్కు వాఁడ దైవమునకు సతము;
సెలవొసంగుఁ డనియెఁ జెలికాఁడు; పిదప నా,మేని కొదవెఁ జేవ మెల్ల మెల్ల. 17

ఆ. నేస్తగానికైత నిర్ణిద్రతం గని, తెలిసినంతమేర దిద్దినాఁడ;
నన్వయప్రమాద మడుగడుగునకు న, న్నడ్డగించె సంధు లవి నలంచె. 18

గీ. చెల్లరే ! పెద్ద వడిలి విశేష్యముల వి, శేషణమ్ముల సవరింతసేయుపట్ల;
శాంతికినిశాంతమునకును శౌచమునకు,శుచికిఁగలవాసిటగాననిసుహృదుఁడితఁడు.

గీ. ఉన్నదానిని వగడెంచు తెన్నుగాన, కేన పదములు పాదములెన్ని యేని
వ్రాయుచుందు నీదృక్షుల వ్రాఁతలందుఁ,బ్రాజ్ఞులెఱుఁగక పోరు నాపలుకుముద్ర. 20

ఆ. బడలి బడలి మిత్రునుడుగున కెనలేని,మదుఁగు గూర్చి వీనియెడఁద కించు
లీలఁ బరిచయోక్తి లిఖియించి తలమీఁది,బరువు డించుకొంటి బ్రాహ్మికరుణ. 21

ఆ. కల్లలాడువాఁడఁ గామిని, సుపవిత్ర, వాణికై తపించువాఁడ నగుట,
నాశ్రితప్రసిద్ధి నర్థించుటన్ గడు, గాసి గందు నిట్టికర్జములను. 22

క. ఉపకృతి నందనివారీ, విపులన్ గలరా ? యెవండు విశ్వమనీషా
నిపుణుఁడు ? కృతజ్ఞుఁ డొకఁడే, యపరాజితుఁడగు నలంతి యయ్యును సభలన్. 23

క. అవంత శంక దీర్చిన, కోవిదుఁ గొండంత మెచ్చి కొల్తును గురుఁగా
నా వడువున్ నిచ్చలు సం, భావింతురుగాక బాగుపడఁగోరు కవుల్. 24

25-6-67

## మందలింపు

ఆ. కదలఁ దగినబల్మి కఱవాయెఁ గాని నా, రాక వలచు సభ లనేక ముందు
వచ్చె నొకనాఁడు వాసికెక్కిన కలా,శాల పాలి మేలిసదసు పిల్పు. 1

గీ. అనిపె విద్యార్థిసంఘ నాయకుఁడు రామ,కోటి యనుకుఱ్ఱఁ డాకమ్మ సాటిలేని
యొద్దికన్ మెఱయించుచు యుష్మదీయ,సాహితీసృష్టి శిష్టప్రశస్త మనుచు. 2

క. మీవాణి సదస్సునకున్, జీవమునిడు ననుచు గురులు శిష్యులు పౌరుల్
కోవిదులు కవీంద్రులు మీ, కై వార్తు రటంచుఁ గరుణఁగల్గుఁ డటంచున్. 3

ఆ. అతని లేఖఁ జూచి యారోగ్యలోపమ్ము, దలఁచి వెడలవలయుఁతావు దూర
మగు టెఱింగి చేవ దిగుట రాఁజాల న, న్నా! యటంచు వ్రాసినాఁడ నపుడ. 4

ఆ. అతఁడు మీకుఁ బొసఁగు నన్ని సౌకర్యము, లేర్పరింతు మిచట, నితవుసేయు
కూడు కూర కూర్తు మోడక మొదటి త, రాన రం దటంచు వ్రాసె మరల. 5

గీ. రామకోటి యీ లేఖలో రామకోటి, చొదరిగ మాఱె మామకీనాదరమ్ము
వదయ నిమ్మార్పు తోడ్పడవచ్చు నని త, లంచె నాతెన్ను గనని బాలకుఁ డతండు. 6

క. పైనమునకు నిపుడు నా, మే నొప్పదు శూలకతన మిగుల నలఁగితిన్
మాను మింక నన్ను; శక్యము, గానిది సమకూర దంటిఁ గ్రన్న నతనికిన్. 7

ఆ. పాప మతఁడు నన్ను వదలునా ! మీకు నూ,ఱా ర్లొసంగి రాంకవాదు లిచ్చి
సత్కరింప నేము సర్వసన్నద్ధుల, మైతి మాదరింపుఁ డనియె మగుడ. 8

ఆ. విత్తమునకు లొంగి వేయి తెఱంగుల, మాఱువారి బ్రతుకుఁదీరు గాంచి
యిట్టివ్రాఁత కొగ్గె నీకుఱ్ఱఁడని యేను, నొవ్వుపాలుగాక నవ్వుకొనుచు- 9

గీ. పట్టికను బంపినాఁడవా ! బాగు ! బాగు !, సోదరా !ప్రలోభనములు చూపి నన్ను
లోఁచుకొనఁజూచితే వెఱ్ఱియేచె నీకు, నాకు రెండుమాటలు లేమి లోక మెఱుఁగు.

ఆ. ఈవు పిన్న వగుట నెఱుఁగ వీనియతి; చా, లింపుమా నిరర్థలేఖనమ్ము
తనకు జాబువ్రాయు చన విట నీకు లే, దంచు నతని మందలించినాఁడ. 11

13-7-71

# పొలము బువ్వ

ఆ. ముప్పదేండ్లు సేద్యమున మున్గితేలిన, బ్రతుకు నాది యగుటకతనఁజేసి
కవిగనున్న నొజ్జగానున్న నను దిగఁ, ద్రావదాయె హాలికజీవనేచ్ఛ. 1

ఆ. ఒడలు పులకరింపఁదొడఁగు నాకుఁ బొలమ్ము, దున్నువాని బండిదోలువానిఁ
గోఁతకోయువానిఁ గుప్పనూర్చెడివానిఁ,జూచినప్పు డెడఁద సొగసిసొగసి. 2

ఆ. బంతిదోలు మాల గొంతెత్తి పాలిగానిఁ, బిలుచునప్పు డిరులు పొలుచునప్పు
దేను గుడుచునెలమి కెల్లలే; దపుడు నా, దుర్బలత్వమెల్లఁ దొలఁగఁబాఱు. 3

ఆ. అప్పికట్ల నొజ్జనై యుంటి; నది ధను,ర్మాస మరకవాంద్రగాసి పండి
చెవికి వచ్చుచుండెఁ జిన్నారివలిపాట; తోఁచెనపుడు నాకుఁ దొంటి బ్రతుకు. 4

ఆ. బడికి సెలవుపెట్టి వడివడిఁ గుప్పలు, నుఱుచుచున్న దెసకుఁ బఱచునన్ను
గట్టుమీఁద నిల్పి కాఫీని ద్రాగెడి, చుట్ట మొక్కరుండు సూచి పిలిచి- 5

గీ. వలయు మర్యాద లొనరించి పొలముమీఁది,కేలవచ్చితి రనుడు నేఁ డెచటనేని
కాఁపుఁబని సల్పి కళ్ళముకడ భుజింప,రహి జనించిన దంటి నారైతుతోడ. 6

ఆ. అతఁడు మంచిమాట యంటి; రట్టైన మా, తోడనే శ్రమింప వేఁడుకొందు;
నైన నీ వయస్సునందు మీ రీ పని, యెట్లుసైంతు రన నొకింత నవ్వి- 7

ఆ. పేనుకొంటిఁ ద్రాడు, పిడికట్టగొట్టఁగాఁ, బూనుకొంటి; నదిర ! నేను వైచు
దెబ్బతాఁకి బల్ల తబ్బిబ్బులాయె నా, వడ్లరాశి మించె నొడ్లకువను. 8

క. కళ్ళము నలఁగినదా యని, చెల్లాచెదరైన గడ్డిఁ జేర్చితి వామిన్;
ఎల్లం దాఁటినవాదర, నల్లన సవరించి కలని కందం బిడితిన్. 9

గీ. వెంటిగట్టితి సవరనల్ వెల్లివిరియ, బంతిదోలితి నెద్దుల బాఁదకుండఁ
బెండ ఖలమునఁ బడనీక పెల్లు విసరి, పాఱవైచితి జనుము కన్పడనిచోట. 10

ఆ. పారములకుఁగాక పంతు లీ నుటిపిడి, కెట్లుచాలు వెత్తియెక్కె నితని
కనుచు నన్నుఁ దొలుత నలవోకఁ జూచిన, కమ్మతీలంద్రమొగము కందెనపుడు. 11

గీ. వచ్చుచున్నది మనబువ్వ వచ్చుచున్న, దిఁక మొగాల్ కదుగుం దనె నెల్లమంద;
కుప్పనీడను గూర్చున్న కూలివాండ్ర, బంతిలో నేనుఁ జేరితి సంతసమున. 12

ఆ. ఒకఁడు విస్తరాకు లొగి నెల్లవారికిఁ, బఱిచి కూడు కూర పప్పు బజ్జి
యెద్దెదిద్దముగను వడ్డించి నే యిడి, తినుఁడు పులుసు నున్నదని వచించె. 13

క. నా కల్క రేఁగి మన కీ, యాకులలోఁ దినుట చెల్లునందువె యీ నా
జాకుఁదన మెపుడు వచ్చె న, హో! కూటికి నిన్ని రుచులు నుంట వలయునా? 14

మధ్యా. ఔనులే; కాఫీనిఁద్రాగి రవితోడ నరుదెంచి కుప్ప
పై నెక్కువానికి, మేనఁ జెమ్మటపట్టుట యోర్వ
లేనివానికి నిన్ని చవులతోఁ బొత్తులేని బోనంబు
లోనికిన్ దిగునోటు ? సేద్యగాఁ దెంతలో నెంతమాట! 15

గీ. ఇన్నిపాకముల్ మరగిన కృషికుఁ డెట్లు, బాగుపడు ? నాయమెల్ల నీ భోగమునకుఁ
గర్చుపెట్టినవాఁడు సర్కారుపన్ను,నిచ్చుటకుఁగూడ నధమర్ణుఁ డేలకాఁడు ? 16

ఆ. రుచికి లొంగి యొకఁడు ప్రచురకేదారము,లమ్మియమ్మి తిరిసె నకట ! తుదకు;
రుచికి లొంగ కొక్కరుఁ దయారె ! లేమిని,జెండిచెండి కొసకు సిరుల నేలె. 17

ఆ. పాడుపొట్ట యెంతపనిసేయ; దియ్యది, కనకనగమునైనఁ గరఁచి మ్రింగు
దీనిఁ బంపుసేయుదిటవు మానిసి కున్న, నిలను విప్లవంబు లేలపుట్టు ? 18

ఆ. ఇన్ని రుచులతోడ నీ విస్తరాకులో, నారగింప నిటకుఁ జేర నేను
పెట్టవయ్య కూడు పట్టెద నంజలి, నుద్దిలేనిబజ్జి ముద్దచేసి. 19

గీ. దోసిటఁ బొలానఁ దినునక్క దోసబజ్జి -,ముద్దరుచి విన్నచో వేల్పుమూఁక సుధను
విడిచి రాకుండునా మన విశ్వమునకుఁ,గుడిచి యగ్గింపదా మనకూటి మేల్మి? 20

క. అని దోయిటఁ బొడిబువ్వం, దిని మజ్జిగబువ్వ ద్రాగి తృప్తికి నెలవై
చిననాఁటి బ్రదుకు సొగసులు, వినిపించితిఁ జుట్టమునకు విస్మయ మొదవన్. 21

# బస్సులో

గీ. బస్సులో వచ్చుచున్నాఁడ; బాప ! మొక్కతరుణి నిలఁబడియున్నది తావులేక
మది చివుక్కురుమనుట నీమగువబెదఁద,పాయు టెట్లనుచింతలోఁ బడితి నేను. 1

క. యువ లిద్దఱు నాకెలఁకుల, సవరనివేసములఁ గలరు చదివినవారల్;
నవకము చిందెడునుడి న, య్యవసరమం దొకని కిట్టు లంటి జడియుచున్. 2

ఆ. ఇంచుకంత యలఁత కీ వోర్చి నిల్చుట, కిష్టపడెదవేని యీ కుమారి
యిచటఁ గూరుచుండు నిందఱు మగవాంధ్ర, నడుమ నీమె నిల్చు నాయ మగునె?3

గీ. నావుడు నతండు రుసరుస నన్నుఁ జూచి, యొరులకై నీతినేర్చిన యొజ్జ వీవు
నెలఁత కూర్చుండదా నీవు నిలువఁబడిన?, నయ్య నీక్రొత్తపారము లాఁపు మనియె.4

ఆ. అతఁడెంత తూలనాడినన్ దొనఁకక, యోయి; నేను సుఖము నుడుగలేక
నిలుచుశక్తి లేక నిన్ను లెమ్మనను; నా, పల్కు వినుము వేగపాటు విడిచి. 5

గీ. అకెయీతాతదరి నుండ ననుమతించుఁ,గాని యొడఁబడునా నిన్నుఁ గదిసి యుంట?
కీవు నేర్వనివాఁడవు కావుగద యిఁ,కేమి చెప్పెదవో సెప్పుమీ యటంటి. 6

క. వెలవెలపాటునఁ గుఱ్ఱఁడు,నిలఁబడె; నమ్మాయి రమ్ము నీ విట కని నేఁ
బిలుచుడు నాబిడ్డ వంచిన,తలతో నరుదెంచి నాదుదాపున నొదిఁగెన్. 7

క. సరిగాఁ గూర్చుండుము నీ, వఱమరపాల్ గాకు బాలికా! నీ చదు వే
తరగతి నున్నది ? యని నే, నతిముతితన మఱఁచుపల్కు లాడఁదొడంగన్ 8

ఆ. పదఁతి తెప్పితిల్లి భావపురీ కలా, శాలలో బి.యస్.సి. చదువుచుంటి
నప్పుడపుడు పార్యమగుట మీకవితను, గ్రోల్చిక్రోల్చి తనివిగొంటి నేను. 9

ఆ. మఱవఁజాల మీరు మకరసంక్రాంతి విం,దులనుగూర్చి,యందములను జేర్చి
పలికినట్టి మధురపద్యచయంబు; మీ,సొత్తు లాయెఁ దెలుఁగుసొగసులెల్ల. 10

ఆ. కబ్బములను బత్రికలయందు మిము మున్ను, గంటి నవల బీఱకాయ లమ్ము
విపణిచెంత నుండ వేమాఱు బాపట్ల, హట్టమందుఁ గంటి ననె వినీతి. 11

గీ. అంతలో వచ్చె మాఘట్ట; మమ్మ ! వత్తు, ననుచు లేచితి జోహారు వనియె నువిద;
మున్ను నను ధిక్కరించిన పిన్నవాఁడు,కూడ నతిసెప్పె; శుభ మనినాఁడ నలరి.12

7-9-71

# దంభముల్ మానుఁడు

మంజరి ద్విపద

ఒక మహాపారశా లోత్సవంబునకు, నధ్యక్షత వహింపుఁడని నన్నుఁ గోర
నొజ్జ లిద్దఱుఁవచ్చి రొకనాడుఁ వారిఁ, యభిలాష మీకొంటి నాయయ్య లంతఁ
గొంతరొక్కంబు నాకు నొసంగఁ బూని, యూసొమ్ము గైకొనుఁ డీరు పైనమున
రా పోర్వఁజాలరు రైలులో మొదటి,తరమునఁ బన్నుండి దయసేయుఁ డనుడు 1

నిపుడు వలాదు సా, మ్మే నుత్సవమున, కేతెంచినప్పుడ యీ వచ్చు ననితిఁ
గాదుకా దని వారు కారింపఁదగదు, న న్నని యే , నిట్లు నాల్గైదునిముస
ములు బీఱువాఱుదున్ మొగమోట వీడి, యించుక పరుసని యెలుఁగుతో మీరు
నారాక వలచిన నా చెప్పినట్లు, వినుట తప్ప దటంటి వెఱచిరి వారు
తేఱుకొంటిని నేను దేశికు లపుడు 2

మాశిష్యుఁ డొకఁడు సమజ్యనాఁ డిటకు, వచ్చు నయ్యా ! మీరు వానితో రండు
నావుడు నంతడేల నావెంట, రిత్త, వెచ్చ మేలా యని వెండియుం బలుకుఁ
దీండ్ర యించుక చూపితిని గాని వారు, మన్నింపరైరి నామాట; నే నపుడు
వినుఁ డన్నలార ! మీ విద్యార్థి యిటకు, వచ్చెనా సభకు నా వచ్చుట పొసఁగ
దేల యీమరియాద లెవఁడు వచ్చినను, నాపైనపుంగాసి నా కెట్లు తప్పు ?
మానుఁడు దంభముల్ మానుఁడీ యనిన, నల్కుదు మేము మీ కడ్డు సెప్పుటకుఁ
దప్పకరండు మీదర్శనంబునకు, వార్చుచున్నారు మావా; రని యొజ్జ 3

లేగిరి సుమూహూర్త మేతెంచె నొయ్యఁ, దరలితి మూఁడవతరగతి పెట్టెఁ
జేరితి ఘట్టంబు చేసంచితోడ, ననుఁ జూచి యొజ్జలు నాపెట్టెఁ జూచి
విస్మయం పడి యింతవేసట కోర్చి, యీ వయస్సున వత్తురే ! మీ రటంచు
నన్నుఁ బెద్దయు మెచ్చి నాల్గైదు జతల, యెద్లఁ బూన్చిన రథ మెక్కుఁడీ ! యనఁగ
నవ్వుచు నీ తేరు నాకేల నేను, నడిచివచ్చెద నిందు నాసరస్వతిని
నామహాత్మునికైత నాతపఃఫలము, నునిచెద నని యెట్టెటో వారి నియ్యా
కొలిపితి; నంత దిక్కులు పిక్కటిల్ల, మొరసె నానావాద్యములు, జయధ్వనులు
ముమ్మరించెను, గ్రామమున వాడవాడఁ, దిరిగి రథమ్ము పందిలిచేరె, సదసు
ప్రారబ్ధమాయె, నా పల్కులన్ మొదట, సవినయమ్ముగఁ గృతజ్ఞత వెల్వరించి
యవల విద్యార్థుల కాచార్యభక్తి,, సత్యశౌచాదుల సమకూడు భద్ర
ములు వించి యన్నలు !మూఁడుబాసలను 4

బడలుచుందురు మీరు పరభాషమీఁది, తమి పెంచుకొని మనతల్లి కాంధ్రమున
కపకృతిసేయకుఁ దకట ! యిప్పటికె, మనము తెన్గున సాము మఱచిపోయితిమి.
మేలు కీ డూడ్చుట మేఁగూలి యుప్పు, రేపాదులన్ వివరింప జంకుదుము
జ్వరమున కర్థంబు చక్కఁ జెప్పెదము, వేఁకి నా నేమన్న వెలవెలఁబోదు 5

మల నన్నభట్టు దాయాదుఁడే కాని. సోమయాజులు మన చుట్టమా నేఁడు ?
కొమ్మనామాత్యునికొమరుం దయారె ! , చేసిన నెపమేమి చిన్నారి తెనుఁగుఁ 6

గవిత కెక్కక తద్ద కలఁగి నిట్టూర్చు, తెనుఁగు నూరూర శోధించి సాధించి
భారతమ్మున యందుఁ బఱపుట తక్క, మనకృతిన్ మననుడిన్ మలఁచుట తక్క
మనపల్కు పరువును మనుచుట తక్కఁ, దెనుఁగుఁదనమ్ము నర్థించుట తక్క ? 7

నౌచిత్యము నెఱింగి యపమార్గమునకుఁ, జనక బాలకులార! చవులూరఁ దెనుఁగుఁ
జదువుఁడీ! యని మత్ ప్రసంగంబు నాఁగి, చదివితి బాపుజీచరితమ్ము కొంత
పదపడి వార్వీరు పల్కి రొక్కింత 8

సభ సమాప్తంబాయె 'జనగణ' మొరసె, నపు డేను బసకేగి యచట నట్టొడు
నొజ్జ నొక్కని బిల్చి యోయన్న ! మీకు, నించుక వేసట నిత్తు మన్నించి
యీబియ్యమును వండుఁ డివి దంచినట్టి, ముడిబియ్య, మవనిలో ముక్కినవడ్ల
బియ్య, మనారోగ్యపీడకు వెఱచి, దినదినంబును వీనిఁ దిందుఁ, బైనమున
నావెంట నొకమందు నా నివి యుండు, నని పొట్ల మీఁబోవ నతఁ డబ్రమంది
మీ బియ్యమును వండి మీకు వడ్డించి, యే మెట్లుతనియుదు మీ చిక్కుతొలఁగ
మార్గ మెయ్యది యని మల్లడిసెంద 9

వలదు మీ రెరియంగ వలదు బియ్యంపు, వెల యిచ్చిన సమస్య విచ్చు నన్నాఁడ
నొజ్జ సొ మ్మీలేక యొం దనలేక, తడఁబడుచుండ నాతని జేబునందుఁ
కే యిడి పావులా ! చేకొంటి నేన 10

యౌగాము లెఱుఁగని యయ్యలముందు, మోమోటపడి ధర్మమును మానుకొంట
నాకు సాధ్యముగాదు నా కింబుగాదు. 11

24-1-1972

# వాణీ వాత్సల్యము

క. ఓగేటివారి పశుపతి, వాగీశ్వరికరుణ నాత్మవైభవ పిశున
శ్రీ గలకైత నపార, ప్రాగల్భ్యము నందె గాంధిభక్తియు మరగెన్. 1

క. ఈకవిశేఖరుఁ గాంచుట, నా కొకపర్వంబుగాఁ దనర్చు; నగుట శి
ష్టాకులజు రాజశేఖరు, ధీకుశలుని గీతసాహితీనిధి నాప్తున్- 2

గీ. తోడుగాఁ జేసికొని యొకనాఁడు సుకవిఁ,బశుపతిని గంటి యాజలిపల్లెయందు
మాకు నెనలేని కొనలేని మధురగోష్ఠి,జరిగె గంటలుగంటలు తరలిపోవ. 3

ఆ. అనఁటిపండు నొలిచి యఱచేత నిడిన చం,దాన గూఢమైన తత్త్వవిద్యఁ
జిన్న చిన్న కథలఁ జెప్పెఁగదా రామ, కృష్ణుఁ డఖిలలోకహితము కోరి. 4

క. ఆపరమహంసకథలన్, శ్రీపశుపతి తేనెలూరఁ జిన్నరినుడికిన్,
బ్రాపగు తెల్గునఁ బల్కె దు, రాపం బానేర్మి పెఱల కని సెప్పఁదగున్. 5

క. మా కోరికపైఁ బశుపతి, యాకవితం జదువ వింటి మాత్మవికాస
వ్యాకీర్ణమోహమున ది, వ్యాకల్పము దక్కె నాంధ్రి కంటిమి నెమ్మిన్. 6

గీ. సతికి నీడగు పశుపతిసతి యపర్ణ, యవల వడ్డించె మాకు మేలైన తిండి
చిత్తము తదీయ మందు నిక్షిప్త మగుటఁ, బ్రతిపదార్థము జిహ్వా కింపితమ యయ్యె. 7

ఆ. మరలి వచ్చునపుడు మాబండి కీలూడి, యడవివంటిచోట నాఁగిపోయె
బండి బాగుపడదు నిండెను జీఁకట్లు, లేశమేని శాంతి లేదు మాకు. 8

గీ. ఎదురువచ్చిన బస్సులో నొదిఁగి యున్న, +రామశరణుఁడు బుద్ధాముగ్రామశరణుఁ
డెఱిఁగె మాకష్టి జాలిమైఁ గరఁగె నింటి, కరిగె యాత్రుపకారతత్పరత వెరుఁగ. 9

*(+ కుందుర్తి వేంకటనరసయ్య గారి దీక్షా నామము)*

ఆ. అతనిచాన కెన్నిహస్తము లుండెనో, యావెలంది యెంత యలఁతపడెనో
బిట్టు వచ్చి వ్రాలె రొట్టెలవ్రేఁగుతో, రామశరణుఁ డౌనురా ! మహాత్మ! 10

గీ. బాటసారుల కాఁకంటిబాధ సడలెఁ, జక్కఁబడె బండి సారథిశ్రమము పండి
రాజశేఖరుతోడ నారాత్రి యతని, భవనమున నిల్చినాఁడ బాపట్లపురిని. 11

ఆ. కడచెఁ గొన్ని యేండ్లు కమ్మవచ్చెను రామ, శరణు షష్టిమహము సాగు ననుచు
భక్తమౌళి నతనిఁ బద్యాలతో నిట్లు, మెచ్చినాఁడ నప్పు డిచ్చదీర 12

19-4-65.

క. కుందుర్తి నరసయాహ్వాయుఁ, దందఱలో రాముఁ జూచు నార్తులఁ దేర్పన్
గుం దెంతయైన సైఁచును,ముందుగఁ దోఁచును ఐలే ! ముముక్షులసభలన్. 13

గీ. బస్సు చెడి చీఁకటి నెదారి నుస్సురనెడి, పథికులయవస్థ తనకంటఁ బడినయంత
నదిర! గంపెడు రొట్టెల నటకు వచ్చి, మంటలార్పిన యీ భక్తు మఱవఁజాల. 14

ఆ. గ్రీష్మబాధ కదలి క్రిందు మీఁదై పడి, మూల్గు మాలవాని మోసితెచ్చి
మనిచె నితఁడు పిన్నతనమందె యర్మిలి, యితని సొమ్ము సేవ యితని కిమ్ము. 15

ఆ. ప్రేమ కరుణ గాక రాముఁ డెవం, డార్తు, నాదుకొనుట గాక యేది భక్తి
రామశరణుఁ డెఱిఁగెరా రహస్యం బిది, మేలు ! మేలు! రాముఁ డేలు నితని. 16

గీ. ఎఱుక యెంత గడించిన నేమి వంగి, వంగియే పోవు నావంతు పొంగు లేక
శిష్యునైన సభన్ పెద్దచేసి తనియు, నమ్రతామూర్తి కుందుర్తి నరసదాసు. 17

మం. ఈ పద్యముల రచియించెడివేళ, మొదటి పద్యమ్మున మూఁడుపాదములు
వ్రాసి నాల్గవ దాని వ్రాయ నెన్నేని, గడియలో దస్సితిఁ గ్రాఁగితిఁ గాని
సాగదయ్యెను బండి సడలె నాబిగువు 18
భారతీ ! న న్నేల బాధించె దిట్టు , లే నొనర్చిన నేర మెయ్యది తల్లి !
నాదోస మున్నచో నన్ను మన్నించి, పాలింపవే బిడ్డపగిది నోయమ్మ !
యెంతనేర్చిన వార లేని నీకరుణ, లేనిచో నోర్విప్ప లే రిది నిక్క
మిఁక నలంతికి నాకు నేటి కహంత 19
యీవ నాదిక్కు నీవే నాకు రక్ష, యీవు పల్కించిన నేఁ బల్క నేర్తు
నీ వల్గుచో మూఁగ నేను మూర్ఖుఁడను, దీవింపవే ! సవిత్రీ ! నన్ను, నెడఁద
భావింపవే ! లెంకపగిది నటంచు, వాణి కంజలి పట్టి వాల్చితి మేను 20
నిదురలో ఘల్ఘలా నినదంబు రేఁగె, దేదీప్యమానమౌ తేజమ్ము విరిసె
భాసిల్లె నాల్గవపాద మాజిగిని, బెదరి కన్విచ్చితిఁ బిదపఁ దేర్కొంటిఁ
దర్కించి తర్కించి తత్త్వమ్ము గంటిఁ, జూఁగిల్లితిని సరస్వతిపీఠమునకు
రాగిల్లితిని బ్రజారంజక క్రియల. 21

16-4-72

## నూఱార్లుకాదు

గీ. భారతీదేవికరుణ నాపాలి దగుట, నంధ్రవిశ్వవిద్యానిలయంబువారు
ననుఁ 'గళాప్రపూర్ణ' నొనర్చినారు బుధవ, తంసమైన బుల్లయ్యయాధ్వర్యవమున. 1

గీ. అవలఁ గేంద్రసాహిత్యమహాసదస్సు, నప్పనము వచ్చె నస్మన్మహాత్మకథకు;
సాహితీవైభవము కోరు సరసులకు న, పారమగు తృప్తి గూరె నీగౌరవములు. 2

మధ్యా. ఉన్నతపాఠశాలలు కళాశాల లుత్తమాశయము,
లున్న సారస్వతసంఘముల్ ప్రేమ ముబ్బులిల్లంగ
నన్ను సమ్మానింపఁదొడఁగె నానాఁట నవనార్హ ధిషణ
గన్న పెద్దలమ్రోల విత్త వసన రాంకవము లొసంగి. 3

ఆ. తిమ్మఁదనము లేని దేహము, పేరాస, లేనియెడఁద, విరతిలేనివిధులు
నావి యగుటఁజేసి నాల్గింటి కొకటిగా, నియ్యకొన్నవాఁడ నిట్టిసభల. 4

మం. బుచ్చినాయనిసేవఁ బొదలుచు సార, సారస్వతవిధాతృ సన్మాననమ్ము
నిచ్చ లాసించుచు నిడుఁబ్రోలియందు, నెసలారుచున్న సాహిత్యపీఠమున. 5

నరసరాట్పురి రంగనాయకుల్ మధుర, సాహితీస్రష్ట యాచార్యవతంస
మేలుకాలేజిని, హిల్‌కాలనీ-క, ళారాధకసదస్సునం, దౌచితీస
నాథుండు మేదూరి నాగేశ్వరుండు, పాలించు గుంటూరి పరిషత్తునందు,
సాధుశీలుఁడు కుప్పుసామినామమున, బహువాఙ్మయసముద్ర పారగుఁడైన
యెలవర్తి రోశయ్య యేల్బడిన్ రూఢ, మగు గర్తనగరవిద్యాశాలయందు,
విజ్ఞానమూర్తి నా విశ్రుతిగన్న, జగదీశ్వరుమహత్త చాటుచుఁ గదు నె
లర్చు చీరాలకలావేదియందుఁ, గలపాల సూర్యప్రకాశరాయాఖ్యు
పరిశీలనమ్మున భాసిల్లు సభ్యా, జావనీ గ్రంథాలయసమాజమందు 6
మన్ననలంది ధీమన్మౌళి మిత్ర, సత్తముండు గురుప్రసాదరావునకు
నునికియై యలరు గుంటూరికివచ్చి 10-3-70

యతనికి విందనై యభిమతాలాప, ధూతాస్రవుండనై 'దుర్గి' సన్మాన
సభ కేగనుండ నా సన్నిధి కప్పు, డలయుచు సొలయుచు నసురుసు రనుచుఁ
దల్లడంబందుచుఁ దరుణుఁ డొకండు, వచ్చి కేల్మోడ్చ నెవ్వర వీవు పెద్ద
దస్సియున్నావు బెడంద లేరీతి, వేఁచెడిన్ ని న్న ని యేను వాక్రువ్వఁ

బరుచూరి హైస్కూలు పరిపాలకుండు, జాగర్లమూడివంశ ప్రశస్తుండు
రమ్యశీలుఁడు శివరామప్రసాదు, తన పాఠశాల కుదాత్తమార్గమున
రజతోత్సవం బొనర్పఁగ నుత్సహించి, తన్మహస్సునఁ గవితల్లజు నిన్ను
సత్కరించుట ప్రశంసకుఁ దగ్గపనిగ, నిర్ణయించి బిఁటాన నీయొప్పుకోలు

పడసి రమ్మని నన్నుఁ బంప నే మొన్న, నప్పికట్లకు వెళ్ళి యయ్యాయిసభల
కేగితి వీ వని యెఱిఁగి మా నేత, కివ్వార్త వినుప నెయ్యడనున్న నేమి
యెంతవెచ్చం బైన నేమి యలంత, యెంతమూఁడిన నేమి యీ వోహటిలక
గాంధికవిం జూచి కర్ణంబు సఫల, మగునట్లు యత్నింపు మని నన్ను మగుడఁ

బనుప బందరు వోయి పామఱ్ఱు వచ్చి, విజయవాడకుఁ జేరి విశ్రాంతి కొఱకు
నేఁ డెల్లి యివ్వీట నిలుతు వటన్న, వార్త నెఱింగితి వచ్చితి నిన్నుఁ
గనుఁగొంటి నాపద్దగాసి యీడేఱె, మా కోర్కి మన్నింపుమా ! యని యతఁడు
దొరలేని యణఁకువతో నన్ను వేఁడ 7

నెన్నితావుల కేగి తెంతవేసారి, తన్న ! మీపిల్పున కగు నందు, నెన్ని
పనులున్న వత్తు మీ పబ్బమ్మునకు మ, దీయకర్తవ్య మేతెంచుట యనుడు
విచ్చిన మోముతో వెడలె నాయొజ్జ. 8

ఆ. ఏగినాఁడ దుర్గి కే; నటం గల మహా, పారశాల నేలు భవ్యశీల
కవచవాహి కాట్రగడవారి సూర్యనా,రాయణుండు రాచరమణ మెఱయ. 12-3-70

గీ. ఎదురుకోలుమన్నన లిచ్చెనితఁడుతోఁడి,యొజలు కెలంకులన్ నిల్చి యొరిమఁజూట
నితనిగేహంబ విడిదిగా నిష్టగోష్ఠి,నుచితసేవల నుల్లాస మొందుచుంటి. 10

ఆ. సంజగడియ వచ్చె సాగె వాగీశ్వరీ, భవనమున - మహస్సు, ప్రథితిగన్న
గురుఁడు గువ్వరాజు కూర్చుండె నగ్రపీ, ఠమ్మునందు సభ్యు లిమ్ము నంద. 11

ఆ. గౌరవించె నన్ను నూఱార్ల సూర్యనా, రాయణుండు, బుచ్చిరాజు మేలి
కైతతో నుతించెఁ, గవి కృష్ణమూర్తి మ,ద్రచన మెచ్చెఁ దత్సదస్సునందు. 12

ఆ. కన్నెకంటిభద్రకవి మఱునాఁ డవ, ధాన మాచరించి తనిపె సభను
బొరకోటి కవికి బహుమతి లర్పించె, నేన నడిపినాఁడ నీసమజ్య. 13

మధ్యా.మఱునాఁడు గువ్వరా జడుగుటం జేసి మాచెర్లపురికి
నరిగి విద్యానిధి యతఁడు పాలించుహైస్కూలునందు
జరిగినపరిషత్తులో మనోజ్ఞ ప్రశంసలన్ మేలి
మెఱుఁగువల్వల నూఱార్ల నంది బ్రాహ్మికి జోత లిడితి. 14

గీ. మధురకవి యుల్లిసత్కుల మండనుండు, రామసుబ్బయ్య నా కెట్టిరాపు రాని
యోరెమును గూర్చెనపుడు తన్నారియిడిన, యుసిరిపచ్చడి కీనాము లొసగవచ్చు 15

ఆ. బ్రహ్మపురి నెసంగు ఆపాడిమరవారు,మఱుసప్రొద్దు వచ్చి మాయొసంగు
నప్పనమ్ము లందుఁడా ! నేఁ దటంచుఁ బ,ల్మాఱు నన్ను వేఁడినారు గాని 16
బ్రహ్మపురి – మాచెర్ల (బ్రహ్మనాయని పట్టణము) ఆపాడి మర – సిమెంటు మిల్లు

ఆ. ఏను నలఁగినలఁగి యిలుసేర నారటం, పదుచు నుంట నికను దడయ నిచట
నన్నలార ! నన్ను మన్నింపుఁడని వారి,కంజలించి మనికి కరుగుదెంచి. 17
15–3–72

ఆ. విరతి నందుచుండఁ బరుచూరి మన్నన,మూరుతమ్ము కదిసెఁ గారు వచ్చె
నవుర ! యెంతగఱువ శివరామ చౌదరి,యని యెలర్చి దాన నధివసించి. 18
17–3–72

మధ్యా.రామన్న పేరఁ దత్సుతుఁ డుదారుండు రంగనాయకులు
శ్రీమించు నేర్లగడ్డాన్వయమ్మునఁ జెలఁగు ప్రాజ్ఞుండు
సామాజిక శ్రేయ మెంచి నిల్పిన శారదారమ్య
ధామమ్ముఁ జేరితి నున్నమత్కీర్తిఁ దనరెడిదాని. 19

ఆ. రంగనాయకులు ధరన్ వీడినంతఁ ద, న్నందనుండు రామనాథబాబు
కార్యకర్తయై జగాజిగి గూర్చె రా, మన్నబడికి లోక మభినుతింప. 20

క. తమలగ్గుపొంటె నేలో, కమువారో మనవులంపఁ గాదనలే కీ
కమనీయచరితుఁ దేఁబది, సమ లారకమున్నె మేనిజడ్డు దొలఁగెన్. 21

ఆ. రామనాథబాబురాణి సౌజన్య సౌ, శీల్యవేణి యార్తజీవకోటి
కభయపాణి తమ్ముఁ దగు శివరామప్ర, సాదు నిలిపెఁ బారశాల మనుప. 22

మం.అన్నపూర్ణాంబ కీ యబలామతల్లి, కెనలేని సంతృప్తి యేర్పడురీతి,
మాతామహుండు ధర్మపరాయణుండు, రంగనాయకు లుదారత వెల్లివిరియ
వైచినమార్గముల్ వదలక, మేన, మామ ధీమన్మణి మానితాశయుఁడు
నమ్రతాఖని రామనాథ బా బెల్ల, ప్రొద్దు విద్యాశాల పొలుపు నర్థించి
సల్పినసేవలజాడ లేమఱక 23
తాతకు దాతకున్ దక్కినకీర్తి, మామకు బావకుం బాల్పడ్డవాసి
నెందాఁక రవిసోము లెందాఁకఁ జుక్క, లెందాఁకఁ జలనిధు లెందాఁక నగము
లెందాఁక దెల్గువాఁ డెసఁగు నందాఁక, నిలుపఁగాఁ బెనఁగు నిర్నిద్రచిత్తుండు
శివరాముఁ డీనాఁడు శిష్టు లుప్పొంగ; 24

నిది కృత్య మనుచు నూహించెనా మిన్ను, వితిగి పైఁబడుఁగాక విడువఁ దాచేఁత
యితఁడు మాన్యుం డని యెంచెనా వానిఁ, దనుపునందాఁక నిద్రకు నియ్యకొనఁడు
తాను జెప్పఁడు సరే తనపెంపు నొరులు, వినుతించుచున్నను వినఁబోఁడితండు
పట్టభద్రత యున్న ప్రాజ్ఞుండ యయ్యు, వర్తించు నేరనివానిచందాన
వర్ణింపఁదగినంత వైభవమున్న, నౌద్ధత్యజంబాల మంట దీతనికిఁ
దొలిపున్నెములతావితోఁ బుట్టి యిట్టి, జీవితంబును మెచ్చు శివరామశౌరి. 25

ఆ. ఎదురువచ్చి నన్ను నితఁ డాదరించి పండితులు కవులు గురులు నేఁటి నాఁటి
శిష్యు లాప్తజనులు చెలికాండ్రు గల మహా,సభకుఁ జేర్చె సుజనసత్తముండు. 26

గీ. నాఁటిసభ నేలుటకు నొకనాఁడు నన్ను, గురునిగాఁ గొల్చి యీనాఁడు గుంటవీటి
మండలమునవిద్యాశాఖమాన్యతమప, దమ్మునఁదనర్చువెలఁది యుదాత్తచరిత-27

క. గురుశిష్య జనవికాస, స్ఫురణాహితచిత్తవృత్త సుబ్రహ్మణ్యే
శ్వరి వచ్చి నిలిచె నిది నా, యరుసమ్మును బెనిచె నుత్తమాన్వయ మగుటన్. 28

క. నావైదుష్యము శీలము, నీవిదుషీమణి సదస్యహితవైఖరిమై
నావిష్కరించె భాషా, కోవిదు లయ్యారె ! యనుచుఁ గొనియాడంగన్ 29

క. రసవత్కవితాచుంచువు,కొసరాజు మదీయకావ్యగుణముల మెచ్చెన్
వసు వొల్ల కేను మాన్యుల,కొసఁగుదుఁ గృతి నంచు మంజులోక్తులఁ దెలిపెన్. 30

మం.సమ్మానపత్రంబు చక్క లిఖించి, చదివె విద్వన్మౌళి సత్కవీంద్రుండు
బృందావనకులుండు ప్రియతాపయోధి, యస్మదాప్తుండు రంగాచార్యు లదిర !
యది రెండు బాసల యందాల వెల్లి, యది యొక సత్కావ్య మనఁదగ్గసృష్టి
యదియాసులేని తియ్యనిడెందమందుఁ, బుట్టి పొంగులువాఱు పూతామృతమ్ము. 31

ఆ. బరువుమీఁది బరువుపగిదిని మఱికొంద, ఱాంధ్రసాహితీ రహస్య వేత్త
లస్మదీయవాణియందుఁ దెన్గుఁదనమ్ము, గునియు నని యనుంగు గురిసి రంత-

ఆ. గంద మలఁది యందచందాలు విరఁజిమ్ము, సేలు గప్పి మేలిమాల వైచి
ద్రవిణకవచమైన కవరిచ్చి జాగర్ల, మూడిసత్కులుండు మ్రొక్కె నాకు. 32

గీ. ఇతని సౌజన్యమునకు నద్భుతము గనుచు, నుచితరీతిఁ గృతజ్ఞత నుగ్గడించి
వెండిపండువు నెడఁదభావించి యేను, సంతరించుపద్దెము లిట్లు చదివినాఁడ. 33

ఆ. రామనాథబాబురా! మనా గనయమున్, లేని దాతృకోటిలోని వాఁడు
వాడు నల్పబుద్ధివదన మీ యౌదార్య, రతుని ముందు లోకహితుని ముందు. 34

గీ. వేలొసఁగి లక్షలను గుంజు నాలిముచ్చు, దాతలు దరిద్రతాపరాభూతు లగుచు
మహి కపారభరమ్ముగా మరల మరలఁ, బుట్టుటయ కాక సాధించు పుణ్యమెద్ది? 35

క. అపునర్భవు లమృతప దా, నపాయ వైభవులు రామనాధాదిక దా
నపరాయణు; లేతద్యశ, మపరాజిత మాసుధాకరార్కము జగతిన్. 36

గీ. తాత రామన్న పేర నీ దాతృమౌళి, పాలనమ్మున నెసఁగెడి పారశాల
నఖిల విజ్ఞానలక్ష్మి సమర్త లాస్య, కింకిణీ ఝుళంఝుళలు క్రిక్కిఱియు సతము.37

గీ. ఇరువదైదేండ్లనాఁడు రూపెత్తినట్టి, శారదా పీఠ మిది యజస్రముగ మనుత!
దేశమును జీల్చి చీల్చి గద్దెలు గడింప, నొల్లనట్టి సం తీతల్లి కొదవుఁగాక! 38

గీ. ఇది కళాశాల కావలె; నింతసేయ, కూరకుండునె శివరాముఁ దూర్జితుండు
బావకున్ దగ్గమఱఁది యీ పాలకుండు, సాగు నితని తలంపు లశ్రాంత సరణి.39

ఆ. సదసు ముగిసె, నపుడు సభవారు విందున, కరిగి రేను రేయి నారగించు
వాఁడఁగామి నచట వయ్యాళితిరుగుచుఁ, గవరు విచ్చి యందుఁ గల ధనమ్ము-40

క. నూఱూర్లని భావించితి, నారాత్రిని లక్ష్మయార్య నవసథమందున్
గారంచేదునఁ గడపితిఁ, జేరితి రేపాడి నావసించెడి యూరిన్. 41

ఆ. అవల నాల్గునాళ్ళ కడితిబొక్కసమున,కరిగి కవరు విచ్చి యరయ నదిర !
పదులుగాఁ దలంచుపత్రముల్ నూర్లుగాఁ,దోఁచె నెన్నిసార్లు చూచుకొనిన. 42

క. "వేయాఱుల నిచ్చితివా !,యోయీ! శివరామ ! యింత యొసఁగియు మౌనం
బేయెడ వీడవు దాతల,కీయది పరమోపదేశమే యనవలదా ! 43

చ. తనిసితి నీయుదాత్తతకు,ధాత్రి నిమం బురుడించుమానవుల్
కనఁబడ రెల్లతావులనుగాంచు మజస్రసహస్రభద్రముల్
మనుము తెనుంగునన్ శతసమల్,కవితాదికళాభిమానివై
కొనుము పురందరద్విరద కుందవిభా పరిభావికీర్తులన్". 44

చ. అని శివరామచౌదరికి నప్పుడ కమ్మను బంచి భారతీ
జననికి నేటికోళ్లిడి ప్రజల్ నను ని ట్లలరింత నాకు సో
మున కెడగల్గుపొంటె నని బుద్ధిఁ దలంచి తెనుంగుబాస పెం
పునకుఁ గఠోరయోగమును బూనితి మానితమార్గవర్తినై. 45

24-5-72

# ధర్మనిధి వలదు

గీ. బాపూజీపదసన్నిధి బహుదినాలు -,కాదు - బహువత్సరమ్ములు కడపి కడపి
మనుగడను దిద్దుకొన్న సజ్జనుని వేంక,టేశ్వరుని దెల్గువారెల్ల రెఱఁగియుండ్రు. 1

క. దక్షిణభారత హిందీ, శిక్షకమూర్ధన్యుఁ డైన శిష్టుఁడు సేవా
దక్షుఁ డెలమంచిలికులా, ధ్యక్షణదావిభుఁ డితం దదృష్టాగ్రణియున్. 2

గీ. పొట్టకూటిచదువు నేర్పునట్టిబడులు, కలవు మన కూరనూరను గలవు గాని
భుక్తికిని ముక్తికిని సరిపోవు తెలివి, నితనివిద్యావనమె శిష్యతతికిఁ గఱపు. 3
(విద్యావనము కృష్ణామండలమున పామఱ్ఱు చెంత కలదు)

ఆ. తోఁకలేనిక్రోఁతు లీకలాశాలకు, వచ్చి యచ్చమైన బ్రతుకు నేర్చి
కన్నవారియెడఁదఁ గలవ్రేఁగు డించెద, రెన్న రానిచిత్ర మిట్టిమార్పు. 4

క. నైతికసంపద మానవ, జాతికి రక్షక మటంచుఁ జట్టుల జనకున్-
రీతి సవరించుఁ బగలున్, రాతిరియును వేంకటేశ్వరగురుం డోర్మిన్. 5

క. పోకిరులచెల్మి మరగిన, నాకొడు కొక్కండు తిన్ననకు రా నీతం
డీకొన్న యలంత యసదా, చేకుఱునా యిట్టి సహనశీల మొరులకున్. 6

ఆ. ఇతఁడు పేదయయ్యు ధృతి చిత్తశుద్ధి లో, కజ్ఞతయును గార్యకరణచతుర
మతియు సేవనాభిరతియుఁ బూన్కియు నుంట, వెలితిలేని ధర్మవీరుఁ డాయె. 7

గీ. తెనుఁగునాటన కాదు గాంధేయదీప్తి, సోఁకినధరిత్రినెల్ల నీసుకృతి కెంద
తెందఱో మహారథు లుందు రిష్టు లగుచు, నల్లవో ! కానరానిమానవుఁ డితండు. 8

గీ. ఇతఁడు నాపుట్టుపండువు నీడులేని, నెఱికి మూదలఁగా మొన్న నిర్వహించెఁ
గోవిదకులాగ్రగణ్యు మద్దుగు దువూరి, పావనకులోదితుని సభాపతిని జేసి.

25-12-71

మం. ననుఁ బెద్దసేయు చానాఁ డీమనస్వి, వేంకటేశ్వరరావు వెడలించునొడులఁ
"దుమ్మలవారు సాధుకవిత్వచణులు, యుగధర్మము నెఱింగి యుత్తమభావ
కలితకృతుల్ శౌచగణ్యకావ్యములు, కమనీయమై కందగల తెల్గుబాస
రచియించినారు, సారస్వతసేవ, బదలిబదలి యేడుపదులవయస్సు
పండించుకొన్నారు, పలుకంగఁదగిన, కలిమి వీరికి లేదు, కబ్బమ్ము వీరి
దొకఁడేని విపణిలో నునుప లే దిపుడు, కృతులను మగుడ ముద్రించుట కేను

జాల నీనాఁడు నాశక్తు లన్నియును, సడలె నందురు వీరు, సత్యంబ యిదియు
మనధర్మ మిచ్చట మఱవక లోక, హిత మెంచి పది పదియేన్ వేలసొమ్ము
చేకూర్చి యీకవిశేఖరుకవిత, వెలువరింతము, చౌకవెలకుఁ బొత్తముల
నిత్తము కొనువారి, కేను వేయార్ల, నిడెద నీచేఁతకు, నిడెద నాశ్రమయు
సభ్యులారా ! దీనిఁ జర్చింప మిమ్ము, వేఁడెద" ననునుడుల్ వెలువడ సభికు
లగు నగు నని మెచ్చి రాప్రసంగమ్ము, నపు డేను బెద్దలారా ! యస్మదీయ
సాహితియెడల మీచాటిన ప్రేమ, నౌదార్యమును గొనియాడెద నాదు
విన్నప మొక్కండు వినుఁడ ! యిప్పట్ల, నాసొమ్ముతోడన నాకృతుల్ మెఱయ
వలె నని యీనాఁటివఱ కొక్క నియతి, తలఁదాల్చి పెనఁగు ఛాందసుఁడను నేను
సర్కారువారిపోషణమునఁ బెరుఁగు, సాహిత్యపరిషత్తుసాయ మీకొంట (అకాడమీ)
కట్టడకున్ దవ్వు గాకపోవచ్చుఁ, గాని మీ రూహించుగతి నొప్పుకొనుట
యుచిత మందురె ? యైన నోపికలేని, నాకు మీతలఁపు మన్ననసేఁత కృత్య
మనుటయున్ జనదొకో ! యంటి నెట్లెట్లొ, కవిగారు సంశయగ్రస్తత వీడి
తమకృతుల్ ప్రకటించితనియుభాగ్యమ్ము,నందింపవలయు మా కనిసదాశయుదు
భాస్కరరా వొప్పఁ బల్కె నవ్వేళ
(అక్కినేని భాస్కరరావు గారు, M.L.A.)
సభసమాప్తం బాయె జనగణమన ని, నాదముల్ విద్యావనమ్మున మ్రోసె
మఱునాఁడు మన్నిత్రమణులతో నిల్లు, సేరితి సుతులతోఁ జెలికాంద్రతోడఁ
దడవితి గ్రంథముద్రావ్యవహార, మెడఁదకు నెమ్మి రా నిమ్మెయిన్ జాబు
వ్రాసితి వేంకటేశ్వరరావునకును. 9

గీ. "ధర్మనిధి నేర్పరించి మత్కావ్యములను,వెండి వెండి వెలువరించి విలుచువారి
కందుబడి నుంపఁ బూనినయట్టి నీయు,దారతను మెత్తు లోకసేవానుషక్త ! 10

ఆ. బన నొక్కమాట; యస్మదాత్మజులు "మీ,కృతుల వెలువరింప నింత యేల
యేమ నిర్వహింతు మిప్పని, మాధర్మ,విది" యటంచు నన్ను నెదురుకొనిరి. 11

క. ఈ పిన్నలకోర్కి ప్రశం,సాపాత్రమ యనుచుఁ దోఁచె సఖులకు నాకున్
నాపల్కుల మన్నింపుము,నీపూనినయుద్యమంబు నిల్పుము నేస్తీ !" 12



మధ్యా.ఈకమ్మ కల యెలమంచిలిబుధుఁడు తృప్తుండు గాక
నీకుమారుఁడు శ్రీనివాసునన్నగా నిలిచెడిచనవు
నాకు లేదా యని వెండి వ్రాయ నన్నా ! నాయెడంద
నీ కోర్కి కీకోలుచూపకున్నది నేఁడేని యంటి. 13



గీ. ఎంతమునుపడివచ్చిన నేమి యొరుల
మూఁపుపై నిడఁజాల నామోయుబరువు
కడిమి యిది నెగ్గుచున్న దీగడియవఱకు
నెల్లియును నెగ్గుఁగాక సర్వేశుకరుణ. 14

గీ. ఎదురుసెప్పిన నను వేంకటేశ్వరుండు,వేఱుగాఁ జూడఁ డెంత యుదారమతియొ
విశ్వకల్యాణ మాత్మ భావించి యితఁడు,పూనుపనులెల్ల సఫలమ్ము లౌనుగాక !15

31-5-72

## సిగ్గుపాటు

మం. అలరు 'దొప్పలపూఁడి' యనుపల్లెటూర, నంచితాచారమౌ హాలికవర్గమున
వట్టికూటిసమాఖ్య వఱలువంశమున, సంతతసేవనాసక్తజీవనుఁడు
సాధుసాహిత్యప్రచారదీక్షితుఁడు, నాకైత చదివి తిన్నని బాట పట్టి
తనియుచున్నట్లు సదస్సులం బలికి, నను విస్మితాత్ము నొనర్చుసజ్జనుఁడు
ముల్లె యుండిననేమి మోఁకాలుదిగని, కదరుదోవతి గట్టి గావంచ దాల్చి
చట్ట పూనుట మాని చలి కెండ కోర్చి, పలుగుతోఁ బాఱతోఁ బవలెల్ల నలఁగి
వీథిగుంటలు పూడ్చి విష్ఠను దొలఁచి, యాల్గినకుక్కల నెలుకలన్ బాఁతి
వాడవాడల నూడ్చి వర్థింపఁదగిన, గ్రామసేవకుఁడైన కర్మశీలుండు
బదనికజాతికిం బ్రాణగొడ్డమ్ము, వదరుఁబోతులపాలి వాకట్టువేరు
వేంకటసుబ్బయ్య వెలలేనిమనిషి 1



క. ఈయన్న నాకుఁ గమ్మను,వ్రాయుచు మీగాంధికవిత పఠియించి వినో
బాయతిచక్కట్లను గని,చేయుదు వశపడినలోకసేవ కవీంద్రా ! 2

ఆ. తాడిపర్తి కేగుదారి కదుంగదు, నొఱకటముగ నుంట నోర్వలేక
దిద్దుచుంటి దాని నుద్దిలేనిసుఖమ్ము, నందుకొనుచు శాంతిపొందు గనుచు. 3

ఆ. ఎంతచెమట పట్టు నీయూడిగమ్మున, నంతతనివి కదియు నయ్య! నన్ను
సొంతపనుల నింతసుఖము రాదేమి మీ, రే వచింపవలయు నిచటిగుట్టు. 4

క. త్వరలో మీ రిట కొక మా, అరుదెంచి మదీయసేవ నరయుఁడు నాముం
దఱ మీరు నిలువఁబడినన్, గరుడినగుదు నేను జనుదు గగనమ్మునకున్. 5

ఆ. అనుదు సంతసించి యైదాఱునాళ్ళలో, వచ్చి చూతు నిన్ను వట్టికూటి!
సాటి గానరానిశ్రమదాన మొనరించు, నిన్నుఁ గనుట నాకు వెన్నుఁ గనుట. 6

క. అని యుత్తరమ్ము నంపుచుఁ, దనువున కొక్కింతశక్తి దక్కంగనె క్ర
న్ననఁ బయనించితి సుకృతిం, గనితిన్ సుబ్బయను సంజ కవిసిన వేళన్. 29-1-72

ఆ. అతఁడు నన్నుఁ గాంచినంతన పొంగి యా, లస్య మైన మంచిలగ్నమునకె
వచ్చినా; రదృష్టవంతుల మే; మని, పలుకరింప నేను వెలుకఁబాతి. 8

ఆ. మంచిలగ్న మన్నమాట నాకర్థము, గాని దని వచింపఁగా మహాత్మ
మనుగడన్ స్మరించుదినముకదా రేపు, తా మెఱుంగనట్టి దేమి కలదు ? 9

క. అని సుబ్బయ పల్కుదు నే, ననూనమగు సిగ్గుపాటు నందుచు నశ్రుల్
కనుదోయి నురలి జడిగొనఁ, దనువునఁ గంపమ్ము చెమరు దండడికాఁగన్ 10

గీ. గాంధి వర్ధంతి రే పన్నగాథ నీదు, మది మెఱసెఁగాని సుబ్బయా! మామకీన
బుద్ధికిం దోఁపదాయె నబద్ధమాడు, మానిసిని గామి నీకు నిమ్మాడ్కి వినుతు. 11

ఆ. బాపుజీకి నీవె భక్తుండ వనుదినం,బనునిమేష మమ్మహాత్మ నాత్మఁ
జూచుచుందు వతనిసూక్తులు పాటించి,బ్రదుకుచుందు వీవు భవ్యమతివి 12

క. నీయోగము నా కందదు, వ్రాయసమున కేమి నాల్గువందలవాక్కుల్
చేయలఁతి యైనఁ బదిరా, మాయణములు వ్రాయవచ్చు నయ్యా ! కవికిన్. 13

ఆ. బాపుజీచరిత్ర బండ్ల కెత్తించిన, మేటి ననుచు నన్ను మెత్తు వీవు
వ్రాఁత యేల చేఁత వలయుఁగాని వటారి, పలుకదేల బ్రదుకు వలయుఁగాని. 14

ఆ. ఎంతమఱపు వచ్చె నిస్సీ ! మహాత్మునా, స్థానకవికి నిట్టిజడత చనునె
యెవ్వరో హసింపనేల నేనే నన్ను, రోసికొందు నఘముఁ బాసికొందు. 15

ఆ. ఇట్లు నాదులజ్జనెల్ల నావేదన, నెల్ల వట్టికూటి యెదుట నిడితి
నతఁడుమఱపుసైత మపరాధమని కుందు,నరుఁడుసంఘమునకుగురుఁడటనియె.16

క. మెచ్చుకు నను మెచ్చుకు మని, నెచ్చెలితో నింత మెసవి నిద్రకుఁబడితిన్
వచ్చెం దమ్మికొలంకులు, విచ్చెడితతి మసకమబ్బు విరియంబాఱన్. 17

గీ. సెజ్జ వీడితి శుచినైతిఁ జెలిమికాని, తోడ నాతనియిల్లాలితోడ నిలిచి
వేల్పు నర్చించితిని సర్వవేదసార, మనఁ దనర్చు నీశావాస్యమును జదివితి. 18



మం. ఉపనిషత్తిది సృష్టి కొకయీశ్వరుండె, యజమానుఁ డని చాటె నతనికి నరుఁడు
సకలార్థ మర్పించి జగదీశుఁ డొసఁగు, దానితోఁ దనియుట తగుచేఁత యనియె19

ఒరులయున్నతి కీర్ష్య నొందరా దనియె, పరులకల్మికి నాసపడు టొప్ప దనియె
మనుజుండు కర్మముల్ మానరా దనియె, సోమరిబ్రదుకులో సుఖము లేదనియె20

పాపంబులకునెల్లఁ బ్రథమకారణము, పనికి దొంగవ్వగా బ్రదుకుట యనియె
ఈశ్వరున్ మఱచి యథేప్సితమ్ముగను, భోగముల్ కుడిచెడిపురుషులు, కర్మ
నిష్ఠ మానినజడుల్ నీల్గినపిదప, నజ్ఞతాతమస భయంకరమైన
యసురలోకమ్ముల కరిగెద రనియె, నరుఁ డిటన్ నడచిననడతకుఁ దగిన
తా వటన్ బడయుట తప్ప దం చనియె 21

ఏకైక మగునాత్మ; యిది సుంత కదల, దటులయ్యు మదికంటె నాశువై పఱచు
నన్నింటిలోపల నది విరాజిల్లు, నన్నింటి వెలుపల నది నిండియుండు
నదియుంటచేఁ బ్రాణి యటునిటున్ దిరుగు, నది యలౌకికము తర్కాతీత మనియె22

తనయందు నఖిలభూతమ్ములఁ గనుచు, నఖిలభూతమ్ములయందుఁ దన్ గనుచు
స్వపరభేదమ్ములజడ్డు లేనట్టి, మనుజుఁ డెల్లరపట్ల మక్కువన్ గురియు
బ్రజ్ఞయై జగమెల్ల బ్రహ్మస్వరూప, మని విశ్వసించినయతని కానంద
మయజీవితము దక్కి మడఁగు మోహమ్ము, సమయు శోకం బని చక్క వాక్రుచ్చె23

ఆత్మజ్ఞుఁ డగువాని కంటదు పాప, మతని రోగము లంట వతఁడు తేజస్వి
యతఁడు సాధించు నిత్యములైన సిరుల, నతఁ డలిప్తుఁడు కవి యతఁడు మనీషి
సర్వస్వతంత్రతాసంపన్ను ఁడనియె 25

అంతులేనిది విద్య; యం దొకపాలె, వలయు నొండొకపాలు వలదు మానవున
కక్కఱగల విద్యయందుఁ బాండితియు, నక్కఱలేని విద్యను మూఢతయును
గలవాఁడు సద్గతిఁ గాంచువాఁ డనియె 26

చన దనావశ్యకజ్ఞానార్జనంబు, కారించు బ్రదుకు నక్కఱలేని తెల్వి
యది చీఁకటికిఁ ద్రోయు నని హెచ్చరించె, అక్కఱ యగుతెల్వి నందనివాఁడు
కర్తవ్యములఁ దీర్పఁ గాఁడని చెప్పె 27

రవికి నెవ్విధిఁ బగల్ రాత్రియు నుండ, దాత్మ కవ్విధి జ్ఞాన మజ్ఞాన ముండ
దెవఁడాత్మతత్త్వంబు నెఱుఁగునతండు, మృత్యువున్గెలిచి యమృతమందు ననియె28

మనుజునిహృదయాన మంచిగుణాలు, చెడ్డగుణా లుంట సిద్ధంబు కాన
నాత్మవికాసార్థి యైనమానిసికి, సద్గుణమ్ములఁ బెంచుజతనమ్ము వలయు
నవగుణమ్ముల నొంచుయత్నమ్ము వలయు

తనయొనరించుచేఁతలు ఫలించినను, సకలప్రజాప్రశంసల గడించినను
జిత్తశుద్ధికి గుణశ్రీవికాసమున, కావంత యైన సాయంపడవేని
యవినింద్యకార్యము లనియెంచునరుఁడు, ధన్యుఁడతండమృతమునందు ననియె28
మోహం బను పసిండిమూఁతచే నకట!, సత్యంపువదనమ్ము సంఛన్న మాయె
నోప్రభూ ! నేను సత్యోపాసకుఁడను, సత్యమున్ దరిసింప సంతాపపడుదుఁ
ద్రోయవే మూఁతను ద్రోయవే యనుచు, రవిమండలమ్మున రాజిల్లుపురుషు
నర్థింపవలె భక్తుఁ డని ప్రబోధించె 29

ఓజగత్పోషకా! యోమిత్ర! మిహిర !, తిలకింపవలతు నీదివ్యరూపంబు
దుర్నిరీక్షంబులై తోఁచునీవెల్గు, లుడిగించి నీతేజ మొక్కచోఁ జేర్చి
సుప్రసన్నాకృతిఁ జూపవే తండ్రి!, యత్యంతశోభన మైన నీరూపు
గని దానిలో నన్నె కని సాటిలేని, తనివి నందుదు నంచుఁ దరణి నర్థింప
వలయు నరుం డని వక్కణచేసె 30

గాలిలో నొకనాఁడు కలియుఁ బ్రాణమ్ము, పదడుగా దేహ మేర్పడు నొక్కనాఁడు
జీవుఁడా! నీవు చేసినకర్మములను, దలఁచి నేఁడే ప్రభున్ దలపోయు మనియె
అగ్నిదేవ! మరుత్సఖా! నీవు సకల, మెఱిఁగిన ప్రాజ్ఞుండ వీశ్వరుదెసకు
మముఁ జేర్పవే! మంచిమార్గమ్ము చూపి, పెడదారినుండి తప్పింపవే మమ్ముఁ
దొలఁగింపవయ్య! మాదురితపంకమ్ము, మలఁగింపవయ్య! మామదినున్న జిడ్డు
జోహారు నీ కిదే జోహారు వనుచు, శుచిరూపరమ్యు నీశుని వేఁడువాఁడు
చైతన్యము గడింపఁ జాలువాఁ డనియె. 31



అధ్యాత్మవిద్యకు నాదరువైన, బ్రాఁబల్యుఁదలఁ దీనిఁ బరియించి తేటి
యితర సూక్తుల నెంచి యేకాదశవ్ర, తమ్ములఁ బల్కి ప్రాతఃప్రార్థనమ్ము
నిలిపి సుబ్బయరాణి నెలఁతల మిన్న, యలుకక పతివెంట నడుగిడుసాధ్వి
బ్రతుకుమేల్మికి గాసిపడు రామతులసి, పేర్మిమైఁ జిఱుదిండి పెట్టఁగా మెసవి
రవిఁ జూచి పల్లు పాఱ బుజానఁ బూని, నడుచునెయ్యుని వెంట నడిచి యతండు
తీర్చిన దొంకను దిలకించినాఁడ, నోర్చినవేసట నూహించినాఁడ 32

బళిర ! మిట్టలు త్రవ్వి పల్లాలు పూడ్చి, కేరెడితుమ్మపీఁకెలఁ ద్రుంచివైచి
ప్రజలయజ్ఞానమ్ముపగిదిని మింటి, కెగయుపుట్టలఁ ద్రవ్వి యిటునటుం ద్రోసి
బుసకొట్టుపాములపొగరు క్రేణించి, వంకలు మలఁచి కాల్వలకు ఱాచూరు
తూములు తొడిగి యెద్దులకును బండి, కాటంక మెదియు రానట్లు నిర్భీతిఁ
దెరువరు లేగురీతిని బాట దిద్ది, యెంతచక్కనిచేఁత యెంత లోకోప
కృతి సల్పె సుబ్బయ్య! యితఁ డెన్నఁదగిన, మనుజుం డుదారతామహితుండు లోక
సేవకుం డని పొంగి చెలికాని బిగ్గఁ, గౌఁగిటఁ జేర్చి వేంకటసుబ్బయాఖ్య !
చరితార్థమోయి ! నీజననంబు నీకు, నీడగు గాంధేయు లెందఱో లేరు
మాయురే ! యెంత చెమ్మట కార్చి యింత, చెలువమ్ము గుల్కు సృష్టి యొనర్చితయ్య !
కూలివాం డ్రొకనూఱుగురు -కాదు - వేగు, రలసిన నిట్లగునా యీపథమ్ము ? 33

ఫలసంగ మొల్లని పనివాఁడ వగుట, నింతచక్కనిశిల్ప మేర్పరించితివి
మాటలు పాటలు మంత్రాలు గాక, చేఁతలు పూజగాఁ జేసి యీశ్వరుని
దర్శింతు వీవు, నీతపము దుర్ధరము, నిష్కామ కర్మాభినిరతి నీసొమ్ము
గర్వంబులేని మన్నన నీదుసొమ్ము, గాదిలి నీ సొమ్ము కరుణ నీ సొమ్ము
సత్యంబు నీ సొమ్ము శమము నీ సొమ్ము, అవిర తానర్ఘ పరార్థ నిర్మితిని
సంతతసేవలో స్రగ్గునీవంటి, యోగికిఁ గా కేని కొదవు నాపోక;
యాలుబిడ్డలకునై యలయువారలకు, శోకంబుగాక వచ్చునటయ్య తృప్తి ?
పరమసత్యము గన్న ప్రాజ్ఞుండ వీవు 34

కమనీయ జీవితకళ నేలె దీవు, పదవుల కారాటపడుచున్నవారు
గద్దె లెక్కినవారు కల్గింపలేని, యభ్యుదయమ్ము నీ వందింతు ప్రజకు
నీ దంభదూర మానితవర్తనమ్ము, పల్లెపల్లెకు మేలుబంతి యౌఁ గాక
యింటికింటికి వెల్గునిచ్చుఁగా కనుచు, నగ్గించినాఁడ నోరార నెచ్చెలిని
గొండాడినాఁడ మక్కువదీఱ హితుని 35

సత్కవీ ! నన్ను మెచ్చుకుమా ! కనిష్ఠ, కర్తవ్య మయ్యె నాకావించినట్టి
పని యని నమ్రతం బలికెడివాని, వేంకటాఖ్యుని గూడి వెనుకకు మరలి
యూరిలోనికి వచ్చి యొజ్జగా నతని, వీక్షించు చూచ్చితి వీథులు రెండు 36

పసిండి మూలుగుచున్న భవనముల్ - ప్రక్క, నెగచూపుఁ జూచు బీ.యే.లిండ్లప్రక్క
ముసరి యేవముగూర్చు ముతికినెత్తుచు ని, సీ! యేలవచ్చె నీచెన్నఁటి నేల
కీ వివేకములేనియిలకు స్వరాజ్య, మని పల్లటిల్లితి, నకటా ! బజాఋ
కసుమాలముల కెల్లఁ గాణాచి యగుట, కేర్పరించిన దని యెంచుజంతువులు
మాఋ టెప్పటి కని మదిని బల్మాఋ, నావేశమందితి నవలఁ గేశవుని 37
గుడిమంటపమ్మునఁ గూడినసభకుఁ, జని గాంధి నొకమూర్ఖు చంపిననాఁడు
ముజ్జగమ్ములు వెతన్ మునిఁగిననాఁడు, నాగుండెనుండి నానాలుకనుండి
సాగిన వెచ్చవెచ్చనిభావములను, రేఁగిన చిచ్చులూరెడిపద్యములను
వినిపించి ప్రజలకు వివరించి సొగసి, తేఱి పేర్కొంటి గాంధికిని జేజేలు. 38

18-3-1972

# అలఁతివాఁడ నేను

ఆ. మచ్చు మసక లేని మనుగడ నర్థించి, మలఁగినాఁడ వెతల నలఁగినాఁడఁ
బ్రజకు నింపు నింపు ప్రన్ననికబ్బముల్, వ్రాసినాఁడఁ గీర్తి మోసినాఁడ. 1

ఆ. సైఁచితిని గృతఘ్ను, సైరించితిని దారి, దప్పినట్టిశిష్యు,నప్పు దీర్చ
కదియు నిదియు ననుగు నల్పుని బొమ్మంటిఁ, దెలిసి తెలిసి మ్రింగితిని విషంబు. 2

గీ. ఈసునకుఁ జిక్కి పౌండ్రకవాసుదేవ, భూమిక ధరించు నంబేదపోక లెఱిఁగి
నవ్వుకొంటినిభావిజన్మమున వీని, కొఱంత లణఁగింపు మని వేఁడుకొంటి బ్రభుని. 3

ఆ. ఏను దనియఁజాల నీమేల్మి కీతాల్మి, కేను గునియఁజాల నీమనీష
కెల్లయెఱుకలందు నెది యగ్రగణ్య మ, ద్దాని నెఱుఁగనైతిఁ దత్త్వవిద్య. 4

ఆ. అరణియందు వహ్ని పెరుఁగునందు ఘృతంబు,తిలలయందు నూనె కలవిధాన
దాఁగియుండె నాత్మ తనయం దనెడి తెల్వి,వడయుదనుక నలఁతివాఁడ నేను. 5

ఆ. అఖిలభూతకోటియం దాత్మ నీక్షించి,యఖిలజగము నాత్మయందుఁ జూచి
యద్వితీయమైన యానందమునఁ జొక్కు,వడయుదనుక నలఁతివాఁడ నేను. 6

ఆ. అవ్యయుండ సచ్చిదానందమయుఁడను,త్రిగుణములకు నవల నెగడువాఁడ
నిష్కలుండ శివుఁడ నే నను వైదగ్ధి,వదయుదనుక నలఁతివాఁడ నేను. 7

ఆ. నిక్కమైనచదువు నేర్చి కోహ మ్మను,చింతకొగ్గి సాధుసేవ మరగి
మోహమును దొలంచి సోహ మ్మనెడిప్రజ్ఞ, వదయుదనుక నలఁతివాడ నేను. 8

10-5-72

# లఘుటీక

అంచె = టపా
అడితిబొక్కసము = బ్యాంకి
అధమర్ణుఁడు = ఋణపడినవాఁడు
అనుయోగము = ప్రశ్న
అనుంగు = ప్రేమ
అప్పటియు = మరల
అరిది = అశక్యము
అరుసము = హర్షము
అఱిముఱితనము = కలఁత
అసదు = అల్పము
అసాదు = బలీ
అస్తుంకృతి = సమ్మతి
ఆనయించి = రావించి
ఆరన్ = నిండుగా
ఆస్రవుండనై = బాధగలవాడనై
ఇంచు = రుచించు, సంతసించు, కోరు
ఇంబు = ఇష్టము
ఇమ్ము = ఇష్టము
ఇర్వు = స్థానము
ఈఁగు = చొచ్చు
ఉత్తమర్ణుఁడు = అప్పిచ్చువాఁడు
ఉదరి = అదరి
ఉద్దవిడిన్ = త్వరగా
ఉదిల = పరితాపము
ఉన్నమత్ = ఎగయుచున్న
ఉపద = కానుక
ఉప్పు = ఉడికించు
ఊడ్పుట = నాటుట
ఎదురుగడ = పోటీలెక్క
ఎయిదన్ = వెంబడింపఁగా

ఏకాదశవ్రతములు = సత్యము, అహింస, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము, శరీరశ్రమ, రుచులుకోరమి, అభయము, సర్వమతాదరము, స్వదేశవస్తునిష్ఠ, అంటరానితనము వొల్లమి.
ఒండెన్ = కాని, కానిచో
ఒడ్లకువ = ఇతరులరాశి
ఒప్పన్ = తగునట్లుగా
ఒఱపు = శోభ
ఒవ్వని = గిట్టని
ఓజ = ఒజ్జ
ఓట = భయము
కడిఁది = మిక్కిలి
కమతము = సేద్యము
కమ్మతము = సేద్యము
కమ్మతనము = సేద్యము
కమ్మతీండ్రు = రైతులు
కరఁచు = కరఁగించు
కరుణఁగల్గుడు = దయనుపొందుఁడు
కఱ = మచ్చ
కలనికి = కళ్ళమునకు
కలితనము = నేర్పు
కలుచ = కలుషము
కవితాచుంచువు = కవితచేప్రసిద్ధుఁడు
కాఁడు = తగఁడు
క్రించు = నీచుఁడు
కీడు = అధమము
క్రేణించి = అనాదరించి
కైగట్టు = కవితవ్రాయు
కొట్టిక = ఊరు
గావంచ = తుండుగుడ్డ

| | |
|---|---|
| గునియు | = నర్తించు |
| గోవైద్యము | = నేత్రచికిత్స |
| చట్ట | = చొక్కా |
| చదురు | = నేర్పు, నేర్పరి |
| చనవు | = హక్కు |
| చిత్తగించి | = తలంచి |
| చెడగరము | = దుష్టుఁడు |
| చేకొని | = గెలిచి |
| చేయలంతిన్ | = సమీపమున, వశమున |
| చోపెను | = తఱిమెను |
| జాలు | = వాఁగు |
| డొంక | = విశాలమైనబాట |
| తనకు | = నాకు |
| తనయందు | = నాయందు |
| తన్ను | = నన్ను |
| తరము | = తరగతి |
| తిమ్మదనము | = ఆరోగ్యము, శాంతి |
| తెగు | = సాహసించు |
| దొర | = సాటి |
| ననయు | = వికసించు |
| ననిచిన | = హెచ్చిన |
| నలువు | = నేర్పు |
| నవకము | = మృదుత |
| నవనార్వ | = పొగడ్తకుందగిన |
| నాతిమానిత | = నమ్రత |
| నిచ్చ | = సదా |
| నిల్పు | = నిలుచుట (పిల్పువంటిది) |
| నుడితీర్పు | = వ్యాకరణము |
| నెపము | = తప్పు, మిష |
| నెవ్వ | = ఆపద, దిగులు |
| నేబులు | = చిల్లరడబ్బులు |
| నేయము | = నెయ్యము |
| నొవ్వి | = వేదన |
| నొవ్వు | = వేదన |
| నోవి | = వేదన |
| పంపుసేయు | = ఆజ్ఞాపించు |
| పగటు | = ప్రకటించు, ప్రకటన |
| పడితిని | = శ్రమించితిని |
| పణిత | = పొగడఁబడిన |
| పదటన్ | = బూదిలో |
| పదడు | = బూది |
| పనిత | = పొగడఁబడిన |
| పఱి | = రీతి |
| పలుకరించు | = మాటాడు, మాటాడించు |
| పవాడము | = బిరుదు |
| పిదపిదనన్ | = మృదుతతో |
| పిదపవాఁడు | = అల్పుఁడు |
| పిశున | = వెల్లడించునట్టి |
| పెండ | = పేఁడ |
| పెనుమటికలు | = పెద్దచిక్కుళ్ళు |
| పెలుచ | = మిక్కిలి |
| పొటిపొటి | = అల్పము |
| ప్రన్న | = మనోజ్ఞమైన |
| ప్రన్నని | = మనోజ్ఞమైన |
| ప్రబంద్ధ | = కావ్యకర్త |
| ప్రమ్మి | = చుట్టకొని |
| ప్రాఁబల్కుఁదల | = శ్రుతిశిరస్సు, ఉపనిషత్తు |
| ప్రేచు | = ప్రేరేపించు |
| ప్రేవన్ | = ప్రేరేపఁగా |
| ప్రేష్ఠము | = మిగులఁబ్రియము |
| బందా | = బంధితుఁడు |
| బదనిక | = పరాన్నభుక్కు, సోమరి |
| బారిసమరి | = హింసించి |
| బీఱువాఱు | = వ్యర్థమగు |
| మటికలు | = చిక్కుళ్ళు |

మడుఁగు = శుద్ధి
మనాగనయమున్ = ఇంచుక అవినీతియు (మనాక్+అనయమున్)
మన్నీలు = దొరలు
మనువు = బ్రతుకు
మన్కి = బ్రతుకు
మబ్బు = చీకటి, అజ్ఞత
మహము = ఉత్సవము
మహస్సు = ఉత్సవము
మూదల = నిదర్శనము
మూరిఁబోవు = అతిశయించు
మెఱసి = బయల్పడి, బయల్పఱిచి
మేఁగూలి = పండించినవానికూలికై పంటలో నతని కొక మేర నిర్ణయించు పద్ధతి
మేలు = ఉపరి, మీఁద
యవీయఃపదము = కనిష్ఠస్థానము
యాత్రుపకారతత్పరత= బాటసారుల మేలు నందలి యిచ్ఛ
రేపాడి = ప్రాతఃకాలము
రేపు = ప్రాతఃకాలము
రొడ్డు = రోగము
లాచూరు = సిమెంటు, లాతిచూర్ణము
లంబి = కుటుంబము
లెంక = సేవకుఁడు
వటూరి = ప్రౌఢము
వడ్ల = వడ్రంగము
వడువు = విధము
వరీయఃపదాన = మిక్కిలి శ్రేష్ఠమయిన స్థానము
వలచు = పరిమళించు, కోరు
వలదు = అధికము
వల్లు = చక్కని
వాదర = కళ్ళపుటంచు
వార్చు = నిరీక్షించు
వాలాయము = నిర్బంధము
వావిరి = అధికము
విగుర్వించు = యత్నించు
వినీతి = వినయము
విభ = కాంతి
విష్ఠ = మలము
వెడ = అల్పము
వేఁకి = జ్వరము
వేర్మి = భేదము
వ్రేఁకన = బరువు
వ్రేఁకము = బరువు
వ్రేఁగు = బరువు
శకృత్తు = మలము
శరద = ఏఁడు
సంచకరువు = బయానా
సంచకరము = బయానా
సంచు = రీతి
సంబళము = జీతము
సంహననము = మేను
సమ = ఏఁడు
సవతు = సాటి
సహ్యజ = కృష్ణ
సాము = సగము
సుబ్బిన = బయల్పడిన
సుమాళము = ఆవేశము
సొగయు = చొక్కు
సోమించు = అతిశయించు
సోము = సోమరితనము
హట్టము = అంగడివీధి, మార్కెట్టు

# మొగమాట

'ఎక్కటి'కి బహువచనము ఎక్కటులు, ఎక్కట్లు. 'ఎక్కటి యనగా అసహాయము, పరాపేక్షలేనిది, ప్రత్యేకమైనది, రెండవదానితోఁ గలియనిది. ముక్తక మని తాత్పర్యార్థము. ఎఱ్ఱనగారి ఎక్కటిగఁ బోల్ప నుపమాన మెందుఁ గలదు' అను ప్రయోగ మిచటఁ జూడఁ దగినది. (హరి. ఉ. 7-164)

ఒక్కఁడు, అసహాయుఁడు మున్నగు మహదర్థముల యందును 'ఎక్కటి' ప్రయోజ్యమగును. ఎక్కటిబవరము, ఎక్కటెక్కటిపెనఁగిన - మొదలగు తిక్కనార్యప్రయోగము లిచట మూదల.

శక్తి యుడిగినను రక్తి సడలమింజేసి నాలుగైదేండ్ల నుండి అపుడపు డీపద్యములు వ్రాసితిని. ఇది తగు నని, అది తగ దని కఱదలు పల్కితిని. ఎదుట నున్నసమాజమును సమీక్షించితిని. పెద్దలసూక్తుల నటనట ననుకరించితిని. మొత్తముమీఁద నధికారములేని పనియ కావించితిని. లోకము మన్నించుఁగాక!

సామ్యయోగము, స్రవంతి, ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి మున్నగుపత్రికలలో ఈపద్యములు పెక్కింటిని మెఱసితిని. ఇందులకుఁ దోడ్పడిన ఆయాసంపాదకులకు నా కృతమెఱుక చాటుదును.

తూరుపాఱఁబట్టుటలో నేఁ డీపద్యములు కొన్ని తొలఁగె. నిల్చిన వీరూపము దాల్చె. ఇవి సహృదయుల నలరించునేని 'ధన్యోస్మి' యనుకొందును.

తెనాలి - సర్వోదయ ముద్రణశాలా పర్యవేక్షకులు శ్రీ వీరబ్రహ్మముగారు ఈయచ్చుపని పట్ల ఎక్కటిపరామరిక పాటించి నన్ను మిగులఁ దనిపిరి. ఈయన, నేను సరసం (సర్వోదయ రచయితల సంఘం) వారము. కాన నాకై శ్రమించుట తమధర్మ మని వీరు తలంచిరి. నాపాలి చుట్టములఁ గావించినవారు తెనుఁగువినోబా డాక్టరు వెంపటి సూర్యనారాయణగారు. వీరికిని ఈసందర్భమున నాయభినందనములు.

మఱియు వృద్ధులయ్యు నుదారతాసమృద్ధులగుటంజేసి కోరినంతన నాసందియములు తొలఁగించిన వైదుషీమూర్తులు వెంపరాల సూర్యనారాయణశాస్త్రులుగారికి నమ్రతాపూర్వక వందనములు చెల్లింతు.

తెనుఁగులెంక

**తుమ్మల సీతారామమూర్తి**

# వక్కణము

ఇందలి ప్రయోగములకుఁ గొన్నింటికి వ్యాఖ్యాన ముచిత మని తలంచితి.

29వ పద్యమున "క్రీవాఁడు" అని కలదు "క్రిందివాఁడు" అని దీని కర్థము. ఇది క్రీనీడ, క్రీవాడ వంటిది అయినను సర్వనామముతో సమసించుట యిందలి విశేషము.

106వ పద్యమున "ఎందతో చావు మూడెడిది" అని కలదు. ఈ "చావు" నకు "చచ్చుట" అని యర్థము ఇది "చచ్చు" ధాతువునకు వచ్చిన భావార్థక కృదంతరూపము. తిక్కనగారి "కాన్పు" వంటిది. ఈకాన్పున కర్థము "కనుట" యనియ. ఉ॥ చిత్తము మెచ్చి ... తా నత్తఱిఁ గ్రొత్తకా న్పగుట నడ్డముసొచ్చెనొ సిగ్గుపెంపు........ విరాట 2-84 (వావిళ్ల) చూ.బా.వ్యా.కృ. 17

147వ పద్యమున "పంద్రి" కలదు. "మాదిరి" మాద్రి యైనట్లు "పందిరి" పంద్రి యైనది.

212వ పద్యమున "కార్మికుఁడు"అనుదానికి "నిర్మాణేయది మార్మికోఽసి నితరామ్" అను పండితరాయల ప్రయోగ మాధారము కర్మ, మర్మ శబ్దములు నకారాంతములే కావున తాచ్ఛీల్యార్థమున "ఇక" ప్రత్యయము చేరి మార్మికుఁడువలె కార్మికుఁడు కావచ్చును మఱియు చర్మికుఁడువలె (చర్మన్+ఇక) కర్మికుఁ డేర్పడి కర్మికుఁడే స్వార్థమునఁ గార్మికుఁడు కావచ్చు నని విద్వన్మణులు సన్నిధానమువారి నిర్ణయము.

264వ పద్యమున "లేదగున్మతి" అను ప్రయోగము కలదు. ఇందలి "లేదు" అస్త్యర్థకమగు "కలుగు" ధాతువునకు వ్యతిరేకార్థకరూపము. దీనిపై స్వార్థమున అగు, ధాతు తద్ధర్మార్థక రూపము "అగును" అన్నది అనుప్రయుక్త మాయెను. ఇంతియకాని "లేదు'. అనునది విశేషణము కాదు, అయినను "లేదగును" అనుదానికి "లేనిదగును" అని తాత్పర్యార్థము చెప్పవచ్చును. ఇచట "చ. అవని యరాజకం బయినయప్పుడ భూప్రజలందు సర్వధర్మువులు దొలంగు ..... .. . ..... వృష్టి లేదవును .... .... ...." అను నన్నయగారి ప్రయోగము (ఆది 4-250 వావిళ్ల) "చ. ధన మది యేల భోగమును దానము లేదగునేని . .. ... ..." అను తిక్కనగారి ప్రయోగము (శాంతి 6-243 వావిళ్ల) చూడఁదగినవి.

-రచయిత

# బహూకృతి

ఉ. పిన్నవు నీవు ప్రాయమునఁ బెద్దను నే; నటులయ్యు సర్వదా
న న్నలరించుభావములు నా నుడికారముతీరుతెన్నులున్
ని న్నలరించుఁ గానఁ దన నిక్కపుశిష్యుఁడ వైతి వీ; వని
చ్ఛిన్నముఁ జేఁతకై జతన చేసెద నీ రుచిరానుబంధమున్. 1

ఉ. కాఁకరపర్తి నిమ్మయకు గాదిలిబిడ్డఁడ వైన నీకు మా
ధ్వీ కమనీయశీల సము పేతము జీవిత మబ్బె నద్దిరా!
నీకవితాప్రియత్వమును నీసరసత్వము నీ వినీతియున్
నీకృతబుద్ధియున్ దనుపు నిచ్చలు నామది వేంకటేశ్వరా! 2

మ. అటుగానన్ బహుమానమై తనర నీ కస్మత్కృతిన్ దీని "నె
క్కటులన్" మక్కువమై నొసంగెదను నాకా! యింతవ్రేఁ గంచు నో
హటిలన్‌బోకుము, తెల్గులెంక కొకలెంకై, వాసిగన్నట్టి నీ
విట జంకం బనియేమి? సాధుతర సాహిత్యార్చన ప్రీణధీ! 3

చ. విరివిగ నీకు నే నొఱఁగఁ బెట్టిన దెద్దియు లేదు; కొంటి వీ
చిఱుకిఱుపద్దెముల్ గుణవిశిష్ట మణుల్ వెలవోసి; గిట్టుపా
టరయఁగ నిందు నాకె వలదైనది; కోమటివైన నేమి; నీ
గురుఁడు గురుండె బేరమునఁగూడఁ గనుంగొను మీరహస్యమున్. 4

ఉ. "చెప్పక వీని కింతపని చేసితిరా" యనఁబోకు మేను మున్
చెప్పి యొసంగినట్టికృతి చిన్నది పెద్దది యొండు లేద, నా
చొ ప్పిది నీకునున్ దెలియుఁజువ్వె! నలంగినబాట నెవ్విధిన్
దప్పుదు నేఁడు వార్ధకము తార్కొని దందడివెట్టుచుండఁగన్. 5



'ఎక్కట్లు' కృతిస్వీకర్త

శ్రీ కాకరపర్తి వేంకటేశ్వర్లు

# ఎక్కట్లు

ఆ. ఎవనికరుణ నఖిలభువనంబులకు వెల్గు, పనుచు రవియు శశియుఁ బగలు రేయి
యతనిఁ గొల్తు నతుఁడనై పురుషోత్తము, నాద్యు నభవు శుభము లావహిల్ల. 1

గీ. భావమైనను బలుకైనఁ బలుకులోని, చేవ యైనను జెలువైనఁ దావి యైనఁ
గవికి నీ కృప చేతన కలుగుఁ గాన, నిడెద వాగీశ్వరీ! నీకు నేటికోళ్ళు. 2

గీ. తలఁచెద మదీయదేశికుఁ జుఱుకితాళి, లాంధ్ర లక్షణ జలరాశి ననఘచరితు
రచితరమణీయు వేంకటరమణశాస్త్రి, నపరచిన్నయసూరి నేకాగ్రమతిని. 3

ఆ. తెనుఁగుబాసపెంపు దెలుపఁ దిక్కన చాలు, నన్నమయ్యచాలు హొసు దెలుపఁ
దిన్నఁదనము తీరు దెలుప వేమన చాలుఁ, గేలుమోడ్తు వీరి మేలుములకు. 4

ఆ. వస్తు వొకటియైన వర్ణించుకవుల వా, తీరు సొరు వేఱువేఱు గాన
నోర్మితోడ వీరినేర్మి పరీక్షింప, నిచ్చగింత్రు సరసు లిద్ధమతులు. 5

ఆ. సిద్ధివఱకు నరుఁడు చేయవలయుఁ గాని, మానరాదు నడుమ మంచి పనిని;
అతఁడు నిద్రనైన నాత్మవిశ్వాసంబు, వదలఁడేని గెల్పు వడసితీరు. 6

క. కర్తవ్యపరాయణతా, మూర్తిని వారింపలేదు ముదుకతనం, బే
యార్తియు నంటదు వానికి, వర్తించు నతండు నిత్యవర్ధిష్ణువుగన్. 7

గీ. వసువు పోవచ్చు మరల రావచ్చుఁ గాని, చన్నకాలంబు తిరిగి రా దెన్నఁటికిని
జనుఁ డిది యెఱింగి యొకనిమేషంబునైన, రిత్తపుచ్చక శుభము లార్జింపవలయు. 8

ఆ. ఎన్నఁదగిన నడత యేర్పడునందాఁక, జనుఁడు నేర్చుకొన్నచదువు రిత్త;
యెన్నఁదగిననడత యెట్లుండు? నమ్రతా, మందిరముగ సత్యసుందరముగ. 9

క. వినయము సత్య మహింసా, ప్రణయము లేనప్పు డెన్ని భాగ్యము లున్నన్
మనుజుఁడు మన్నన లందఁడు, దనుజున కాతం దనుంగుఁదమ్ముఁడు కానన్. 10

ఆ. గొప్పతనము హెచ్చుకొలఁది నణంకువ, హెచ్చు నరునియందు; నిది దురాత్ము
నొజ్జవోలె దిద్దు సజ్జను నమృతంపు, జల్లుకరణి సుప్రసన్నుఁ జేయు. 11

గీ. పేర్మి తొలఁకాదునుదులతోఁ బేద కిడుట, యీవిగలకల్మి, తాల్మిమై నెసఁగుబీర
ముద్ధతికి దవ్వుదవ్వుల నుండు తెలివి, యరిది యందురు లోకజ్ఞు లైనబుధులు. 12

ఆ. ఏను మానవాళి కెల్లను శిష్యుండ, నవని నాకు శిష్యుఁ డెవఁడు లేఁడు
నిక్క మిది యటంచు నిఖిలంబు నేర్చిన, బుధుఁడు పల్కి ప్రజకు బుద్ధిఁ గఱపు. 13

ఆ. సాధుచరితలేని చదువు, పాపభయంబు, లేనిబేర, మీవిలేనిపూజ,
సేవలేనిపదవి శిష్టప్రశంసన, మొందలేవు శాంతి నందనీవు. 14

గీ. పొళ్లలో వాసియున్నను బ్రతిమనుష్యు, నందుఁ గలవు గుణమ్ములు నవగుణములు
నొరులయొప్పులు తనతప్పు లుగ్గడించు, నతనికే కైవసంబగు నాత్మశక్తి. 15

ఆ. చెడ్డవాని నతనిచెడ్డతనమునుండి, వింగడించి చూచువెరవు వెరవు
గాంధిపుట్టినట్టి గడ్డ యీనేరుపు, లేనినాఁడు వన్నెలేని బీడు. 16

గీ. సత్యమునకు నహింసకు జయము రాక, తప్పు; దొకనాఁడు తప్పెనా తత్ప్రయోక్త
శిక్షితుఁడు గానివా ఁడని చెప్పవలయు, నైపుణము లేనివాఁ డని నమ్మవలయు. 17

గీ. కామరోషాది శత్రువర్గమున కోడి, చేయఁగారాని దోసముల్ చేసిచేసి
యఘములను దాఁచువాఁ డంధుఁ డగును గాని, కనులులేనివాఁ డంధుఁడు కాఁడు కాఁడు.

ఆ. మఱచి నరుఁడు కొన్ని నెరసులు గావింప, వచ్చుఁ గాని వాని వారి వీరి
చెవికిఁ దెచ్చునేని సిగ్గిల్లునేని గా, సిల్లునేని కసటునెల్లఁ బాయు. 19

ఆ. తాత చెప్పఁగాక తండ్రి వాకొనఁగాక, ప్రగతి కడ్డువచ్చుపలుకు వలదు
నరుఁడు కొయ్య కాఁడు నవనవచేతనల్, పొసఁగ మరలమరలఁ బుట్టు ప్రాణి. 20

ఆ. పాపిపల్కు ధర్మబద్ధ మయ్యు రవంత, మంతు గనదు కల్లుముంత నిడిన
యమృత మెవని కిష్టమగు? నుడికిన్ దగ్గ, నడత నేర్చినపుడె నరుఁడు గెల్చు. 21

ఆ. పొగడి పొగడి రెండు పొడిమెప్పు లందుట, తిరిసితిరిసి యింత తిండి తినుట
యేనికేని చెల్లు; నిది బ్రదుకా? మాన, భరితమైన బ్రదుకు బ్రదుకు గాని. 22

ఆ. విత్త మీయరాదు విశ్వంబు నలరించు, వృత్త మీయవలయు బిడ్డ కయ్య;
దయ్యకుండ వచ్చు డబ్బుచే నరునకు, నాము రేఁగు నెల్ల బాము లొదవు. 23

ఆ. కదలలేక మూల్గు ముదివానికైనను, వేచియుండు నెపుడు వేయిపనులు
మదిని గుదురుకొన్న మమకారపుం బాడె, యొండు దనుకఁ దొలఁగ దీ భరంబు. 24

ఆ. కంటిచూపు తగ్గెఁ, గాలుసేతులలోని, దిట్టతనము జాఱె, జుట్టు నరసె
నెంతముసలి యైననేమి మానిసి? వాని, యాస జవ్వనంపు టాసు విడదు. 25

ఆ. అలమియుండు నెడఁద నజ్ఞత మెందుగా, మోవి నుపనిషత్తు మ్రోఁత లెగయు
నింటిలోనియిరుల గెంటునా మిద్దెపై, నిడినయట్టిదీప మిచ్చు వెలుఁగు? 26

గీ. తొలుత నొకఁ డావగింజంత దోసఁ గొనర్చు, నవల నది నిల్వ సల్పుఁ గొండంత తప్పు
చీము నెత్తురు సచ్చిన చెనఁటి యగుట, జంకఁ దతఁ డెన్ని వెడవెడబొంకులకును. 27

ఆ. ధర్మబద్ధమైన దారిఁ జూపెడివారి, బ్రదుకు నోర్వలేరు పరమమూర్ఖు;
లేసుచావు గాంధిమృతి కెన్నడీపోక, చాలు నిచట నితర సాక్ష్యమేల? 28

క. పైవానితప్పు లివి యని, క్రీవాఁ దెవి చూపు నవియ కెరలుచు నతఁడే
కావించను దశ మాఱిన, నేవాఁడు కృతాపరాధుఁ డీయిర్వురలోన్? 29

ఆ. ఎఱిఁగియొండె నొండె నెఱుఁగక మంటలో, నిడినకేలు కాల కెట్టులుండు?
పాడినైన నిట్లె పాటింపకున్నచో, రాకమాన దోర్వరాని కీడు. 30

క. నైతికశక్తిని ధర్మ, ప్రీతిని బేరందుకొన్న పెద్దలు శౌచ
శ్రీ తొనఁకెడి సాధిష్ఠులు, త్రాతలుగా నున్ననాఁడె తనరును సంస్థల్. 31

ఆ. పాపభీతి పోయెఁ బ్రజల కీనాఁ డని, వాడ వాడ నఱచువారిలోన
సగముమందియైన సజ్జను లున్నచో, లోకమునకు నింతలోటు రాదు. 32

ఆ. మౌనముద్ర మిగుల మంచిది, నోర్విప్పు, తప్పదేని పరిమిత ప్రసంగ
మనుమతింపవలయు, నాదరా దొకమాట, చాలుచోట నుదులు నాలుగైదు. 33

క. శ్రుతి గలియనిసతి నేలుట, మతిహీనున కొజ్జ యగుట, మత్తునిసేవన్
బ్రతుకుట యనివార్యం బగు, నెతనికి నరకార్తి యతని కేలా కలుగున్? 34

ఆ. ఎవఁడు జనకపాదు లెఱిఁగిన సద్విద్య, వలచినట్టి సాధువర్తనమ్ము
నభ్యసించి కొల్చు నాతనితండ్రి మే, నూడ్చుఁగాక బ్రదికియున్నయట్లె. 35

ఆ. చేవలేనినాఁడు చెడు నహంకారంబు, డబ్బులేనినాఁడు డంబ మడఁగు,
వయసులేనినాఁడు వలతిక్క తొలఁగు, నీ, మాఱుదలకు బుద్ధిమంతుఁ డలరు. 36

ఆ. మతినిబట్టియుండు ధృతి; యొదల్ దీనికిఁ, గారణమ్ము కాదు; కందలున్న
పాఱుఁబోతు లూఁచపడినట్టి దిట్ట లీ, మనుజకోటి నెంతమంది లేరు? 37

క. పెఱవానిగుణము లాతఁడు, మరణించినపిదపఁ గాదు మనియున్నపుడే
నరుఁడు కొనియాడవలయును, బరమప్రియ మిట్టిచేఁత ప్రాజ్ఞావలికిన్. 38

ఆ. వనధి వీడి మహికి వచ్చినవాఃకణం, బకట! యొకట నింకె నది పయోధి
నున్ననాఁడు సైఁచె నుత్తాలనౌక; న, సానవాస మెంతకైనఁ దెచ్చు. 39

ఆ. షష్టిపూర్తి యయ్యె నిష్టపూర్తిగను జీ, వితము సాగె ననుట వెఱ్ఱిమాట;
ముదిమి నిర్విచారముగ సాగినపుడె 'ధ, న్యోస్మి' యని గృహస్థుఁ దలరవలయు. 40

ఆ. షష్టిపూర్తి సభల సందడి దండడి, పెట్టసాగెఁ దెలుఁగు పేఁటలందుఁ
బ్రాయమునకుఁ దోడు బ్రదుకునకును విల్వ, కట్టవలయుఁ గార్యకర్త లిచట. 41

క. బ్రదుకుటకై తినవలయును, బదుగురకున్ మేలుగూర్ప బ్రదుకఁగవలయున్;
పెదపెద్దయోగములతో, నొదవనిసుఖ మిట్టినడత నొదవు నరునకున్. 42

గీ. చొక్కమైనతలంపుతో నిక్కమైన, మాటతో వినయమ్ముతో మమతతోడ
నొసఁగునుపదేశ మొదల నునుచునెంత, దిట్టయైనను బెడసరకట్టెయైన. 43

గీ. పత్రమో పుష్పమో తనపాలి నిడుట, పరమపుణ్యప్రదం బని ప్రజ దలంప
సత్యశౌచాది సుగుణప్రశస్తుఁ డగుచు, నిలుచువాఁడు జగమ్ముల గెలుచువాఁడు. 44

ఆ. తల్లిదండ్రు లెంతచెల్లనివారైన, వదలరాదు కొడుకు వారిసేవ;
ఉత్తమర్ణుఁ డెంతయొప్పనివాఁడైనఁ, దెచ్చుకొన్నయప్పు దీర్పవలయు. 45

గీ. మంచితనమునకున్ దోడు మగఁటిమియును, మగఁటిమికిఁ దోడు సడిసన్నమతియు వలయు
చాలు నీమేలిమెఱుఁగులు చాలు నరుని, పుట్టువునకున్ గృతార్థత పొసఁగు పొంటె.

క. ధృతిగల పురుషునకున్ మృతి, బ్రతుకున నొకమాఱు వచ్చుఁ బందకు నకటా!
ప్రతి వాసరమ్ము వచ్చును, మతిమంతులు మెచ్చ రిట్టిమానిసి మనికిన్. 47

ఆ. శాంతి శాంతి యని నిరంతర మల్లాడు, మానవుండు కుట్ర మాన వలయు
నొరులమేలు గోరి యుచితప్రయత్నముల్, పూనవలయు సమతఁ గానవలయు. 48

క. అది చేఁత యనన్ దగ్గది, యెది జన్మజరాదిదుఃఖహేతువు కాదో!
అది తెల్వి యనన్ దగ్గది, యెది నిశ్రేయసపదంబు నీయంగలదో! 49

ఆ. నరునిశక్తి యెంత? నలుసంత; యీసత్య, మెఱుఁగలేక లోకమెల్ల నాకు
లొంగవలయు ననెడి వెంగలి దైవోప, హతుఁడు కాకమానఁ డల్లనల్ల. 50

ఆ. జన్న మనినఁ బసులఁజంపుట కా దహిం, సా పరీతమైన సరణి నొరుల
కుపకరింప నలఁగుయోగము, కష్టించి, తిండిదినెడి హక్కు తెచ్చుకొనుట. 51

ఆ. ముదుకబట్ట గట్టి ముగిసెఁ గృత్యం బని, విశ్వసించువాఁడు వెఱ్ఱివాఁడు
దీనబాంధవుండ నే నని మనుజుండు, చెప్పుకొనుట కదరు నొప్పుకొనుట. 52

గీ. చెడెదు న న్నంటుచో నని పొడుము నరుని, మొదటనే హెచ్చరించుఁ దుమ్ములను రేఁపి
తగనికుతులెల్ల నిట్టులే తఱుముఁ గాని, యెదఁదబిగి లేనివాఁడు కీడ్పడును వీన. 53

గీ. ఎంతయున్నతి యుండిననేమి మనుజుఁ, దదుగువాఁ దగు నదుగువాఁ దయ్యెనేని
విష్ణునంతటివాఁడొరు వేఁడఁబోయి, కుఱుచపడె నింకఁ బెఱవారిగొడవ లేల. 54

ఆ. ఒకఁడు పేద యయ్యు నుఱఁదు భూమీశ్వరు, నొకఁడు తిరియుఁ గల్మి యుండికూడ
గఱువతనము తత్త్వగతము గాని ధనాది, నాశ్రయించి యుండ దనుట యొప్పు. 55

ఆ. వలదు వలదు నాకు వరశుల్క మనువాని, త్యాగ మగ్గడింపఁ దగును గాని
క్రిందికులముకన్నె కేలు పట్టినవాని, యావిముందు దాని కెంతవిలువ? 56

ఆ. పేదవాఁడు కాఁపు బేహారి దళవాయి, తేఁడు చక్రవర్తి రేపు మాపు
తన్ను మించువాఁడు తనవర్గమున రామి, కంగవించు నీర్ష్య కంజలించి. 57

ఆ. ఇరుగుపొరుగువారి నెడఁదతో నెనరుతోఁ, బలుకరించినంతఁ బందు వగును
లో టదేమి కలదు మాటకు? సముచిత, సరణిఁ బల్కవయ్య! సతము హితము. 58

ఆ. బాసపొత్తు చాలునా సౌహృదమునకు, వలయు భావబాంధవమ్ము కూడ
నన్నదమ్ములేకదా కురుపాండవుల్, జగడమాడి రేల జగము నవ్వ. 59

గీ. ఇంట నింట దీపావళి యెసఁగుచుంటఁ, దుంటరి యమాసమసకన తొలఁగెఁ గాని
కోఁతకూలికి వార్చుచుఁ గుములుపేద, యెదఁదఁ గార్కొన్నచీఁకటి యెదయదాయె.

ఆ. రంగుగుడ్డ ముతికిసంగతిఁ జెప్పదు, తెల్లగుడ్డ మాపుఁ దెలుపు నపుడ
జగము రంగుగుడ్డ కెగఁబడుఁ దుద కహో!, కల్లకరణి నింపుగాదు నిజము. 61

ఆ. చెడుగు మంచి వానియెడఁ గడుమంచిగాఁ, బరిణమించు, మొగులు శరధిఁ గ్రోలు
నుప్పు నీరు తీపి నొప్పిదమై నంజ, పుంజ పెనిచి ప్రజకు బువ్వపెట్టు. 62

ఆ. నన్ను మఱచినారె నాకన్ను దెఱచిన, గురులు మీ రటంచు గొప్పపదవి
నున్నవాఁడు మ్రొక్క నొజ్జ బెదండల, నెల్ల విస్మరించి యేన్గునెక్కు. 63

గీ. పూర్వసంస్కార మొకకొంత ప్రాదిచేసి, నపుడె మానవుఁ డున్నతి నందనేర్చు
నెండయు శవంబుఁ జూడ రా యందఱును వి, రాగు లైరె యశోధరారమణుభంగి.

ఆ. ఇంటిలోనిపోరు ఋణబాధ ధనవత్త, పడసినట్టిమెప్పు పడినతిట్టు
మంత్రతంత్రదానమర్మముల్ పెఱవాని, కెఱుకసేయ నొల్ల రిద్ధమతులు. 65

గీ. పామునకుఁ బాలు వోసినపగిదిఁ గుటిల, చిత్తునెదఁ బూను సైరణ చేటుదెచ్చు
నితరు లెట్లుండినన్ బ్రజ నేలువారు, కనుగలిగి యుండవలె నిట్టిఘట్టములను. 66

గీ. మంచిచెడ్డలతీరు గుర్తించు తెలివి, యన్యుఁడొనరించునెగ్గున కలుగకునికి
యుచితమగు హాస్యవైఖరి యుండునేని, కదలు ననిరుద్ధమై నరుబ్రదుకుబండి. 67

ఆ. ఎగసియెగసి తోఁకతెగిన గాలిపటమ్ము, కరణి దారిదప్పి పఱచు వాని
కెవఁడు సెప్పనేర్చు నేకొమ్మకో చిక్కి, స్రుక్కునప్పు డతఁడె చక్క నణఁగు. 68

క. నళ్ళులు చెడినన్ బొలమున, గొళ్ళాడదు ముసలియెద్ల కోల్తలకతనన్
కుళ్ళులు చెడినన్ దేశపు, బిళ్ళాఁగదు తాత లెంత పెనఁగంబడినన్. 69

గీ. నాలుకకు బుద్ధిసెప్పఁగాఁ జాలినట్టి, మనసుతోఁగాక పురుషుండు మందుచేత,
మంత్రమునఁ ద్రోయనేరఁ దామయపిశాచి, నెద్దెతిండికి గారాలబిడ్డ తెగులు. 70

ఆ. రుచులు మరగిమరగి రోగాల దాసులై, బెగ్గలించువారు సిగ్గు పడఁగ
నుప్పులేనికూర కువ్విళులూరుచు, బాపు వేయిమందిపని యొనర్చె. 71

గీ. ఎన్ని చదువులు నేర్చిననేమి పురుషుఁ, డెన్నిఘనకార్యము లొనర్పఁగన్ననేమి
సభల రాణింపఁ దొరుతప్పు సైఁపలేక, వెక్కసమ్ముగఁ జిందులుత్రొక్కునేని. 72

ఆ. గంట కైదుమార్లు కస్సని బుస్సని, యెగురువానికినుక కేమివిలువ?
అఁగి యాఁగి సాధువావిష్కరించెడి, కాఁకకే జగమ్ము కళవళించు 73

ఆ. వలఁతివారిపట్ల వచ్చునల్కను దిగ, మ్రింగునట్టివాని మెచ్చనేల
మెచ్చవలయుఁ దన్ను మించనివారిపై, రేఁగుకిన్క నిల్వరించువాని. 74

క. మంచితన మెసఁగుతావున, నించుకదోసంబు నుండునేమో వలపుల్
నించుగులాబిని ముండ్లు క, ళాంచితుఁ డగు చంద్రునందు నంకమువోలెన్. 75

క. మనుగడ నాఁ డను మేడకుఁ, బునాదియై దేహమునకు బుద్ధికిఁ బటుతా
జనక మగు బ్రహ్మచర్యం; బనవద్యత గనుఁడు దీని కొననికుఱ్ఱల్! 76

ఆ. అన్ని యేండ్లు బ్రదికె నంతవయస్సులోఁ, గలస విక్రమించె నిల వదంక
గంగకొమరుఁ డెట్లుగడియించె నీశక్తి, బ్రహ్మచర్యనిష్ఠఁ బండికాక? 77

ఆ. త్యాగమున కెవండు తార్కాణ లోకసే, వా సహిష్ణుతకు నెవండు రుజువు
తేజమున కెవండు దృష్టాంత మతఁడపో, తెనుఁగువాఁడు నేర్మి కనుఁగువాఁడు. 78

ఆ. తెలుఁగువాని కేమి దేశదేశమ్మునఁ, గలదు కీర్తియుగయుగాలనుండి
యైన నోర్వరానియావేశ మొక్కటే, తెరలితెరలి క్రుంగఁదీయు నితని. 79

ఆ. తెనుఁగువారు తుల్యధీసంపదల నుంట, నీరసంపుబెడఁద నెడయలేరు
తేరితేరి యొరునిదెసఁ జేర్మిఁ జూపిరా, పుడమికెల్లఁ బండ్లుపులియు నపుడు. 80

క. వీలైనపు దండఱు నిల, నేలినవా రగుటఁ డెల్గు లెఱుఁగరు దైన్యం
బాలోచింపరు ప్రకృతము, చాలింపరు మేరలేని సన్నహనంబుల్. 81

ఆ. ఎడుగుడిగుడుగాక యీవిశ్వమండెల్ల, నొక్కరీతి నడుచు మొక్కవోని
ధర్మ మెదియొ దానిఁ దలఁదాల్చువారు స, ర్వేశ్వరునియెడంద కించువారు. 82

గీ. సకలభూత హృదంతరస్థాయి యగుచు, నీశ్వరుఁడు వెల్గఁగా నన్యు లెఱుఁగకుండఁ
దప్పు గావింప నెవ్వానితరము? తులువ, కొసరికొసరి చంకలుకొట్టుకొనును గాని.

గీ. ఒడలు నా నీశ్వరుఁడు నిల్చుగుడి; తదీయ, బాహిరాంతర శౌచసంపత్తిపట్లఁ
గనుగలిగి యుంట మానిసికర్జ; మతఁడు, సముచితాహారమున దాని సాఁకవలయు. 84

గీ. కుంటిగా గ్రుడ్డిగా ఘోరకుష్ఠరోగ, హతుఁడుగాఁ బరమేశ్వరుం డవనిఁ దోఁచు
గుట్టిది యెఱింగి యార్తులకొలువు రాము, సేవగా నమ్మి ధన్యతఁజెందు నరుఁడు. 85

క. తలమీఁదివెంద్రుకలు తిరు, మలనాథునికిచ్చినంతమాత్రన పొంగా
తలలోనిపొగరు పొచ్చెము, బలిగా నిడవోయి! బాగుపడఁగా వెడఁగా! 86

ఆ. పద్య మల్లుఁగాక పాడుఁగాక ప్రభుత్వ, మూనుఁగాక వీధు లూడ్చుఁగాక
మనుజుఁ డెల్ల కృత్యమును హరిసేవఁగాఁ, దలఁచునేని ధన్యతను గడించు. 87

ఆ. నరునిజీవితంబు విరిసెజ్జ కాదు గం, గా తరంగడోలికయును గాదు
కలఁడు దీని నొక్కకంటఁ గనుంగొను, గూఢచారి; మఱవఁగూడ దతని. 88

ఆ. నీట నలలఁబోలె నిఖిలజీవులఁ దన, యందుఁ జూడఁగన్న యలఘుమతికి
నెవఁ డరాతి, మిత్రుఁ డెవఁ డతఁ డఖిలమ్ము, మానసించు బ్రహ్మమయ మటంచు. 89

ఆ. ఇంతి యెదురువచ్చి నంతన యొౌదల, వంచి తొలఁగఁబాఱువాఁడు నరుఁడు
నవల తన్నుఁ గడచినను మోర పైకెత్తి, మలఁగి చూచువాఁడు మకురుదున్న. 90

క. వారిని వీరి నణంచుట, కారాటంపడక యింద్రియమ్ముల గెలువన్
గోరవలె నరుఁడు, లోకం, బౌరా! యనఁ దగినవిజయ మది నాఁ జెల్లున్. 91

గీ. ఇంద్రియమ్ముల కాదేశ మిచ్చి నట్టి, బ్రదుకుతో మానవత్వంబు పదసినట్లు;
మనుజుఁ డంతకుమున్ను తా మన్న బ్రతుకు, మఱచిపోవచ్చు; నది యొక మడ్డిబ్రతుకు.92

గీ. ఛత్రపతిశివాజీకీర్తి ధాత్రికెల్ల, వెల్లయిడెఁ గాని పరసతీవిముఖమైన
వలపుచే నందు ముక్కాలు వడసె నతఁడు, తీవ్రతరతప మేకపత్నీక నిష్ఠ. 93

ఆ. పెద్దవారిబుద్ధి పెడవోయి యీనేల, నాల్గుముక్క లయ్యె నరసమాజ
మెవఁడు దీని మరల నేకముచేయునో, చేయకున్నఁ గడిఁది చెట్ట పుట్టు. 94

గీ. మనుజు నొక్కని దేవతామౌళిఁ జేసి, యొకని నస్పృశ్యతాదోష నికృతుఁ జేసి
నారి నవమానభారావనతను జేసి, దారిదప్పెను హిందూమతప్రవక్త. 95

ఆ. ప్రాంతలైనఁ దాల్చి పసలేనికూడైన, మెసవి నేలనైన మేనుమోపి
ప్రాణికోటికెల్ల బంధువై సమతమైఁ, బరఁగు నెవ్వఁ డతఁడె బ్రాహ్మణుండు. 96

ఆ. అతిథిసేవఁ దగిలి యధ్యాత్మవిద్యలోఁ, బండి యార్జవమ్ము పడసి నిష్ప
రిగ్రహమ్ము నవధరించి తపస్వియై, పరఁగు నెవ్వఁ డతఁడె బ్రాహ్మణుండు. 97

ఆ. ఎఱుక పండినంత నేగు నహంత స, మత్వదృష్టి యొదవు మానవునకు
శంకరుండు మున్ను చండాలునిన్ ద్విజు, నొక్కరీతిఁ జూచె ని క్కతాన. 98

ఆ. సత్యదర్శనమ్ము సమకూడినంత రా, మానుజుండు గోపురాన నిల్చి
కులమతాదిభేదములఁ ద్రోసి తిరుమంత్ర, ముచ్చరించె నింగి యుదరఁ బ్రజకు. 99

గీ. ఏసుకథలెల్ల మన కేల దోసిగాని, తన్ను దయమాలి చిత్రవధంబొనర్చు
నజ్ఞులను సైఁపు మోతండ్రి! యన్నసుద్ది, చాలుఁజాలు సహస్రయుగాల వఱకు. 100

ఆ. దైవభక్తి కతఁడు తార్కాణ, నమ్రతా, మూర్తి యతఁడు; సంతతా ర్తసేవఁ
దనివిసెందు నతఁడు, దంభమ్మునకు నతఁ, డాసపడఁ డహో! మహాత్మ్మ దతఁడె.101

గీ. సాంస్కృతిక పారతంత్ర్యమ్ము సైఁపరాని, కీడు నిడు జాతి; కిది రాజకీయమైన
బానిసముకంటెఁ జెడు; గని దీనిఁ ద్రోయ, నడుముగట్టినయతి దయానందసుకృతి.102

ఆ. క్రిందినుండి మీఁదికిన్ గొల్లగొట్టుటే, పాటి యయ్యెఁ బారుపత్తె మొదవ
మంచివాఁడు వందమందిలో నొకఁ డున్న, నెంతలగ్గు వొదము నితనికతన. 155

క. కట్టినమఱునాఁడే మన, కట్టడములు కొన్ని కూలెఁ గాలువలోనన్
దట్టెఁదుమ న్నెత్తింపని, దిట్టలకున్ బిల్లు ముట్టె దిగఁబడకుండన్. 156

క. కొంచెపను లెన్ని చేసిన, లంచము రక్షించుఁ దుల్వలను నేఁ డకటా!
క్రించులముంగడ నొదల, వంచిరి సజ్జనులు డిల్లవడి రెల్లెడలన్. 157

ఆ. చిల్లిగవ్వలేని సిరిమీఁద రుచిలేని, మనుజుఁ డెక్కువలయు మంత్రిపీర
మతఁడు తోఁటకూరమెతుకుతో బ్రతికెనా, ప్రజయుఁ గన్నువిచ్చుఁ బ్రగతివచ్చు. 158

ఆ. త్యాగమునకుఁ గాక భోగంబునకు బరా, బరులు సెప్ప నిష్టపడరు జనులు
మున్ను బుద్ధువెంట నిన్న బాపూవెంట, నేలపరువులెత్తె నీజగత్తు? 159

గీ. మంత్రిగా మంత్రిమౌళిగా మన్న శాస్త్రి, యస్తమించినతతి నాలిపుస్తె తక్క
నన్య మొకరువ్వ లేదట్టె యతని కాస్తి, బాపునకుఁ దగ్గశిష్యుఁ డీ బహద రదిర! 160

ఆ. తూఁట్లు కుట్లు లేనిదుస్తులు కఱవౌట, సచివుఁ డయ్యు రాచసొరుగుల్కు
విందుదెసకు శాస్త్రి వెడలఁడు లోకాన, కెంతనీతి నేర్పె నీతపస్వి! 161

ఆ. అడుగరేమి నన్ను నధికృతుల్ రాబడి, పన్నటంచుఁ దానె పద్దులరసి
పంపె నర్థ మేలుబడివారి కల ‘టాండ’’, నెంతధర్మదీక్ష నితఁడు సైఁచె! 162

ఆ. నీకుఁ జెట్టునీడ నాకు బంగరుమేడ, నీకుగోఁచిపాఁత నాకువలువ
నీకుఁ గటికిపస్తు నాకువిం దనుదొర, యెన్నినాళ్లు ప్రజల నేలఁగలఁడు? 163

క. తక్కెడవలె నల్పుని బై, కెక్కించి గరిష్ఠుఁ గ్రింది కీడ్చెడిదొర లే
దిక్కునఁ జూచినఁ గల రీ, తక్కిడిపని దురభిమానదాసుల కించున్. 164

ఆ. కత్తితోడఁ గాదు కరుణతోఁ బ్రేమతోఁ, బ్రజల నేలవలయుఁ బార్థివుండు
సేవకొఱకుఁగాని కావరమునఁ దుళ్ళి, పదుటకొఱకుఁ గాదు ప్రాభవంబు. 165

ఆ. వంకలేనిబ్రదుకు వలచువానికి నైన, బొంకకున్న నేఁడు బువ్వలేదు
ప్రజలమేలు కోరి పరిపాలనము సేయు, దొరలు దీనిహేతు వరయవలయు. 166

క. సత్యమునకు ధర్మువునకు, నత్యయ మేనేలఁ బొదమ దానేలను దౌ
ర్గత్యము లెవ్వియుఁ బుట్టవు, నిత్యము దైవంబు దానినెతి నాదుకొనున్. 167

గీ. ఎన్నియనలాస్త్రములు సృజియించుకొన్న, నెన్ని రాజ్యాలతో మైత్రి పన్నుకొన్న
నిక్కమగు శాంతి పడయఁ దేనేతయైన, మిట్టిపడుదురాశల నరికట్టకున్న. 168

ఆ. అంతభాగ్య మున్న నమెరికాదొరలు ని, ద్రింపలేరు మాత్ర మ్రింగకున్న
నీయశాంతి కెద్ది హేతువు? జగమెల్ల, నేలవలయు నన్న తృష్ణ కాక. 169

ఆ. నరులయంద కాదు సురలయందే నధి, కారకాంక్ష కంతు కానరాదు
హరినిగొల్చు నింద్రుఁ దచ్చరలను బెంచుఁ, బదవి నిలువ నెల్లబదవ లోర్చు. 170

క. ఏవిప్లవమున కైనను, జీవ మహింసావ్రతంబె చిరతర మగు నీ
త్రోవం బడసినవిజయము, రా విందు విజేతపట్ల రవరవ లెపుడున్. 171

క. సర్వోదయమార్గమ్మున, నుర్వికిఁ దేవలయు శాంతి; నొండొకబాటన్
బర్విడి సాధించిన నది, నిర్విఘ్నం బగుచు నిలువనేరదు నిచ్చల్. 172

క. పదుగురలో నార్వురకున్, ముద మిడురాజ్యమ్ము కాదు మొత్తముప్రజ కిం
పొదవించు ప్రభుత కావలె, నిదె సర్వోదయవిధాన మిదె కామ్య మగున్. 173

క. విధులు నెఱవేర్చువానికి, నధికారము లావహిల్లు నలవోకఁ; గరో
ర ధరిత్రి దున్ని నానా, వ్యధ లోర్చు కృషీవలునకు నబ్బవె పంటల్. 174

క. దేశమునకున్ స్వతంత్రత, యాశాస్యమ కాని సంయమాంచిత చరిత
ప్రాశస్త్యంబును వలయును, నాశిలు నీశక్తి లేనినా దుద్దవిడిన్. 175

ఆ. నాకు దక్కదేని నాకోవ నెవనికి, దక్కరాదు గొప్పతన మటంచు
నీసు పెంచుకొన్నమాసికిఁ బెఱవాని, పాదుకలను దుడుచుపాట్లె దక్కు. 176

గీ. పంచవర్ష ప్రణాళికల్ పది పదాఱు, నడిచినను మనదేశ మున్నతికి రాదు
కండగలవార లందఱు కయ్యి కేగి, హలము పట్టిననాఁడె నా దండు గెలుపు. 177

ఆ. సామ్యవాదమో ప్రజాస్వామ్యమో నియం, తృత్వమో మ తేప్రభుత్వమేని
కూడు గుడ్డలేని గూఁడులేని బికారి, మెప్పు లందవలయు ముప్పు లణఁచి. 178

క. హరిజనులకు గిరిజనులకు, నురవగుమే లాచరించి యుద్దీప్తి నిడన్
దొరఁకొనె దొరతన; మదిగో!, భరతోర్విన్ నవయుగప్రభాతము తోఁచెన్. 179

గీ. బాపుజీ కన్నకలలు దబ్బఱలు గావు, పుణ్యమూర్తులతలఁపులు పొల్లువడవు
సమతకున్ నెఱగద్దెయై జగతికెల్ల, హితము సెప్పకపోదు భారతధరిత్రి. 180

గీ. చట్టమును బట్టి సిరి తగ్గునట్టివారు, దాతలవిధానఁ దనియుట తగినచేఁత
కలిమిఁ బడయపేదలు కృతజ్ఞతను జాటు, టుచితవిధిఁ యుర్వి కిదె శాంతి నొసఁగు సతము.

క. ఒకఁడు పునాస ననా దనె, నొకఁ డౌననెఁ బైరపంట నొండొండ భయా
నక రణ మేర్పడె నిర్వుర; కకృత్యములు సాగు నిట్టు లజ్ఞులనడుమన్. 182

గీ. పనికిమాలినవాఁగుడు పట్టులేని, తర్కమును సందడించు రథ్యలను నేఁడు
పల్లవగ్రాహి పాండితీప్రౌఢు లెగసి, వచ్చె నీవావదూకతా వైభవంబు. 183

క. తూర్పును బడమర యనుటే, నేర్పని భావించువారు నిండిరి మహి; వీ
రేర్పఱుచు సమాజమునకు, నార్పులు పెడబొబ్బలేకదా నిత్యవిధుల్. 184

ఆ. శక్తుఁ డైనవా డశక్తుల హింసించి, కుట్రగాఁ దమాయికులను ముంచి
నిక్కిపడుట తక్క నేఁటిసమాజమం, దెన్నఁదగినమేల్మి యేమికలదు? 185

ఆ. బదుగువారిఁ జెండి పదవైచి మీసముల్, దీఁటువారిపొంగు తిరము గాదు
వారితోడ వారె పోరి కొన్నాళ్ళకుఁ, బొలియఁగలరు యాదవులవిధాన. 186

ఆ. పల్లెపట్టు శాంతికిల్లని యొకనాఁడు, చెప్పుకొంటి మిపుడు నిప్పులేక
మండఁదొడఁగె నూరు మదమత్సరక్రోధ, నిలయ మగుచు విలయవలయ మగుచు.

క. మగవార లెంతచెడినను, మగువలు రక్షించుచుంద్రు మనధర్మంబున్
జగ మెఱిఁగినసత్యం బిది, మిగులన్ గొనియాడఁదగినమే లిది ప్రజకున్. 188

గీ. సాధుతకు నాశ్రయం బాత్మశక్తి కిరవు, కరుణకున్ బ్రేమమునకును గాణయాచి
కన్నవారలకే కాదు కస్తి నున్న, ప్రాణులకునెల్లఁ దల్లిగాఁ బరఁగు మగువ. 189

క. అనుకూలశీల యగుసతి, తన కబ్బిననాఁడె గేస్తు ధన్యతనందున్
మును కూర్చుకొన్న పుణ్యము, వనితారూపమున వచ్చి వరు నలరించున్. 190

ఆ. ఎదఁద విప్పి మగఁడు వెదలించుమెప్పున, కలివ తనియుఁ గాని యతఁ డొసంగు
తొడవులకును సొగసు తొలఁకాదుసరిగంచు, వలువలకును దృష్టి వదదు వదదు. 191

ఆ. అతఁడు సార్వభౌముఁ డగుఁగాక విద్వాంసుఁ, డగునుగాక యోద్ధ యగునుగాక
వెలఁదినెయ్యమునకు వెలియయ్యెనా వాని, బ్రతుకు మోయరానిభార మగును. 192

ఆ. మగనికన్ను కన్నె మొగముమీఁదికి దూఁక, బాలచూపు విభునిపదము పట్టె
నెంతనేర్చె వినయ మీగడ్డ నొదవిన, యాఁదుబిడ్డ పరిణయంపు వేళ. 193

క. అతిమృదులం బతికర్కశ, మతిసుఖ మతికష్టమై మహాద్భుత మగు సం
గతికద పాణౌకరణము; కృతమతులగు నాలుమగలు గెల్తురు దీనన్. 194

గీ. వలపు ధర్మువు కూడి వివాహరూప, మందుకొనె భారతీయ గేహమ్మునందు
ధర్మమున కవిరుద్ధమై తనరువలపు, నాదరించుట వాదర నడుగునిడుట. 195

ఆ. కాఁడికలియవలయుఁ గదుపుపంటకు మన, పొలముపంట కింతవెలితిలేక
కలియదేని బండి తలక్రిందులై కూలు, నదలుచెందు డిందు నపుడు కాఁపు. 196

ఆ. బువ్వలేనినాఁడు భుజబల ముండదు, తిండిలేనినాఁడు తెలివి సున్న
మెతుకులేనినాఁడు బ్రతుకే హుళిక్కిరా!, కూడు వలయుఁ బ్రాణిగొడవ లడఁగ. 197

గీ. కరుణగల ధనధాన్యముల్గల గృహస్థు, లెవ్వరో కనలేక యింటింటి కేగి
జోగి యపరాహ్ణమైనను జోలె నిండ, కలమటించెడి నీగడ్డ నహరహంబు. 198

ఆ. వచ్చునర్థికెల్ల బిచ్చంబు నిడలేక, పొమ్ముపొ మ్మనంగ బుద్ధి రాక
నలఁగుచుండె నేఁడు నాదారుసంసారి, కలఁగుచుండె బిచ్చగానితిట్ల. 199

గీ. నేఁటికి ననుగ్రహించి నామాట నమ్మి, రేపు రమ్మని కొంకుచున్ గాఁపు నుడువ
నమ్మపెట్టునులే యని యర్థి గెల్చు, వీనుమిగిలె మనస్తత్త్వ విద్య నితఁడు. 200

క. పనిచూపెదఁ బేద కతం, డొనరించినఁ దిండి నిడెద నొండైన నిడన్
తనువు నలంపని వానికిఁ, దినుచన వుండ దని గాంధి తెగఁబడిచెప్పెన్. 201

క. దొరదైనను బంటైనను, బరిశ్రమమొనర్చి తినుట పాడి; నరుం డీ
తెఱఁ గొప్పిన భువి దివిగా, వఱలు ననెన్ గాంధి ధర్మవత్సలుఁ డగుచున్. 202

గీ. అన్నసత్రాలు మనజాతి నధమగతికిఁ, దెచ్చె, నలసత దంబము హెచ్చె వీన
నాకు నధికారమున్న నేనాఁడొవీని, మూసియుందు ననెన్ దయామూర్తి గాంధి. 203

గీ. శక్తి యుండియుఁ జెమరోడ్చురక్తి లేని, నరునకున్ జాలిచూపదు నాయహింస;
పేదయెడ నున్ననెయ్యమే నాదుమదిని, ఆతిఁగాఁ జేసెని ట్లనె జాతిగురుఁడు. 204

ఆ. కాలు చేయి లేక గాసిల్లుబీదకు, ముసలితనపుబరువు మోయుననద
కేలువారు తిండినిడుట కృత్యంబని, వక్కణించె గాంధి నిక్కమరసి, 205

గీ. పండి క్షేత్రాలె బంగారుపంట యనుచు, రైతు మది నుబ్బెనో లేదొ రీతిదప్పి
కురిసెఁ గుత్తుకబంటిగాఁ గుంభవృష్టి, కనఁడు దొర వేయిగండాల కాఁపుబ్రదుకు. 206

గీ. మతములను బేరుకొన్నట్టి మైల నుదికి, బ్రదుకు పండించుకొనె వేమపండితుండు
వెఱ మెఱుంగని సాహితీవీరుఁ డితఁడు, విమతులయెడందలకు బాఁకు వీనివాకు. 103

గీ. కల్ల తగ దాస్తి నార్జింపఁగాదు వర్ణ, భేద మనుచిత మెదఁబాయరాదు కృపను
జడమునకు నాత్మ కల దని చాటి వర్ధ, మానుఁ డారాధ్యుఁడై జైనమతము నిల్పె 104

ఆ. వెతకు నిల్లు జగము, వెతకున్ గతము కోర్కి, కోర్కి సమసినపుడు కూలు వెతయు;
మంచిచూపు తెలివి మాట మున్నగునవి, మఱఁచు, గోర్కి ననియె మారజిత్తు. 105

గీ. బుద్ధుఁ డీభారతమ్మునఁ బుట్టఁడేని, మేఁకలావులమందలు గాక నరులు
నెందఱో చావుమూడెడి దింద్రలోక, సుఖము నర్థించువెడఁగుల సురియచేత. 106

గీ. మొఱకునమ్మకములకుఁ గైమోడ్పు లిచ్చి, తడిపి రీనేలఁ బ్రజలరక్తమ్ముతోడ
నడిపి రొయ్యన వెన్కకు నరునిపెంపు, చెఱిపి రనవద్యమైన సంస్కృతిని జడులు. 107

గీ. ఎదఁద నీశుఁ బ్రతిష్ఠించి మృత్యువునకు, నాసనమువైచి మూఢవిశ్వాస వికృత
దేశమును వేయిచేతుల దిద్దినట్టి, కందుకూరిని దొరయువా రెంద ఱుంద్రు? 108

గీ. ఏ మతమ్మునఁ దోఁచిననేమి నిత్య, సత్యమున్ దలఁ దాల్చును సజ్జనుండు
నామతంబె సేవ్యం బనునరుఁడు తెలివి, పండని యహంత యెండని పండితుండు. 109

ఆ. కరుణ కంకితమ్ముగాని సూనృతమున, కగ్గపడని ప్రేమ నాస్థలేని
మతము లేదు కాని మనుజుఁ డహంకృతిన్, ద్రోయలేక ధర్మదూరుఁ డయ్యె. 110

ఆ. మతము లెన్నియున్న మానవతతియెల్ల, నొక్కజాతి యనుట నిక్క మగుటఁ
బొరపు లుజ్జగించి నరు లితరేతర, శ్రీ సహించి లగ్గుఁ జెందవలయు. 111

ఆ. మతము మార్చుకొనియె మాధవరా వేసు, నాశ్రయించె ధామ సయ్యెఁ గాని
కూఁతుపెండ్లినాఁడు కులమునకే లొంగెఁ, ద్రోయరాని దయ్య మాయెఁ గులము. 112

క. ఒకదారమునం గల మౌ, క్తికములవలె మతము లెనసి దేశమునకు నొ
ద్దిక నేర్పవలయు విశ్వము, సకలము హరిమయ మటంచుఁ జాటఁగవలయున్. 113

ఆ. తెలుఁగుకవుల కాదృతి నొసంగి తెలుఁగురా, మయ్యవైభవంబు నాసచేసి
తతయశమ్ము గన్న తాన్షామతం బేది?, ప్రేమమతమె శాంతిధామమతమె. 114

క. కొందఱ కిచటన్ గోవెల, కొందఱకు మసీదు, చర్చి కొందఱ కున్నన్
సుందర భారతదేశం, బందఱకున్ గుడియగున్ మహాతీర్థ మగున్. 115

గీ. రేపటికి మేఁత యె ట్లనుచూపు లేని, దగుటచే నాటపాటల నలరుఁ బులుఁగు;
ముందువచ్చు మూఁడుతరాల మందిబ్రతుకు, లరయుఁ గాన సదా వ్యథ నందు నరుఁడు.

ఆ. కలిమి గూర్పవచ్చుఁ గాని దానికి నరుఁ, డంధదాసుఁ డగుట యనుచితంబు
మేరమీఱినట్టి కోరిక లిహపర, శ్రేయములను జెఱుచు దాయ లగుచు. 117

క. అక్కఱలేని ధనాదులు, పిక్కుటకై పగలు రేయి పెనఁగెడి లుబ్ధుం
డిక్కడ నక్కడఁ జెల్లఁడు, కుక్కలుఁ బడ వానరుండు కుడుచు నవస్థల్. 118

ఆ. ఒక్కచోట నునికి యొప్పదు సంపత్తి, కదలవలయు గడపగడపదెసకుఁ
గదలదేని క్రుల్లి కంపెత్తి కూలారుఁ, గానవలయు సాహు లీనిజంబు. 119

ఆ. చపల యంద్రు లక్ష్మి నపనిందగా కిది, నిక్క మగునె యెవఁడు నీచసుఖము
లాసచేసి రూక వీసముగాఁ జూచు, నతని సిరి త్యజించు నది దోసంగె? 120

గీ. తాతకూర్చిన సిరివిల్వ తండ్రి కొంత, యెఱుఁగు నెఱుఁగదు మనుమఁ డొక్కింతయైనఁ
గాన మూఁడవతరములోఁ గలిమి నిల్వ, దనిరి పెద్దలు లోకంబు నరసియరసి. 121

ఆ. వ్రాయవలయు లెక్క వచ్చిన పోయిన, రూకకును సదా పరాకులేక
పాపపుణ్యములను బ్రకటించు నది యథ, మర్ణతావిపత్తి మాన్పనేర్చు. 122

ఆ. ఉత్తమర్ణు ముంచు నెత్తేమి యని సందు, లరయువారిసంఖ్య పెరిఁగెఁ గాన
నప్పు లేనివాని హర్షముకంటె నేఁ, డప్పులీనివాని హర్ష మెచ్చు. 123

ఆ. పాడిదప్పి నరుఁడు పడసినసిరి కొంత, గుడికి బడి కొసంగఁ జెడదు కలుచ;
సెలగగొంతు గోసి చెప్పులదాన మొ, నర్చినంతఁ దూలునా యఘమ్ము. 124

ఆ. నిక్కమైనయీవి నేర్చినపురుషుండు, పేదవాని నరసి పిలిచి యిచ్చు
నతనికరుణ కవధి యన్నది లేదు రే, పనెడుచింత వొడమ దతనిమదిని. 125

ఆ. ఈవి బట్టబయలు కావలెనా యది, యెంతగుప్త మైన నంతమేలు
సర్వసాక్షియైన జగదీశ్వరుఁడు దాని, నెఱుఁగలఁడు దాత నేలఁ గలఁడు. 126

ఆ. మధురభాషణంబు మక్కువ దయ పాత్రు, నెఱుఁగునేర్పు గర్వ మింత లేమి
వలయు దాత; కిట్టివాఁ డర్థి నూరక, పంపుఁగాక దూఱుపడఁడు చెడఁడు. 127

ఆ. చెట్టు పుట్టి పెరిఁగి చిన్నారి పొన్నారి, పూలు పూచి కాచి మేలిరుచుల
పండ్లనిచ్చి యెండి పద దగుఁ బ్రొయ్యిలో, నెంతయీవి నేర్చె నిది బలారె! 128

ఆ. రవిని శశిని జూచి రత్నాకరుని జూచి, గాలిఁ జూచి మేఘమాలఁ జూచి
తరువుఁ జూచి నదిని ధాత్రిని జూచి ప, రోపకృతికి మనుజుఁ డొగ్గవలయు. 129

ఆ. పసిఁడి మెండుకొన్నపాఁతఱ లున్నను, ప్రేమలేనివాఁడు పేదవాఁడె
రువ్వకాదు గ్రుడ్డిగవ్వ లేకుండిన, నార్తుఁజూచి కరఁగునతఁడు ధనియె. 130

ఆ. దారపుత్రపరిధి దాఁటి యూరికినెల్ల, విరియఁబాఱవలయు నరునిప్రేమ
యింతమాత్ర నాఁగ కిది మందలాడులఁ, గడచి జగతికెల్లఁ గ్రమ్మవలయు. 131

ఆ. కూలి కొరులగొంతు కోయుబెట్టిదుఁ డైన, బిడ్డ నెత్తి ముద్దుపెట్టుకొనును
ప్రేమ విడువరానిపెన్నిధి, యానంద, మనఁగ నదియె దైవ మనఁగ నదియె. 132

ఆ. ప్రేమ లేనివాఁడు పెట్టులడ్డునకంటెఁ, దృష్టి నొసఁగు నాప్తుఁ డిచ్చు రొట్టె
శౌరి సంధికేగి రారాజువిందును, ద్రోసి విదురుగంజి కాసపడఁడె! 133

ఆ. కల్ల కవుడు లేని గర్వగంధము లేని, పరుసఁదనము లేని బ్రదుకు నిచ్చి
కరుణ నోర్మి నిచ్చి నరు నీశ్వరు నొనర్చు, ప్రేమ కుద్దిసేయ నేమి కలదు? 134

క. ఎదఁద నెపు దూఁచముట్టుగ, నడఁగును గామంబు నరున కవుడు రిపుఁడు క
న్పడఁ డొక్కండును మహి నె, య్యెడ కేగిన హార్ద మతని కెదురై తనుపున్. 135

క. చేఁతలు విడి వనికిం జను, నాతఁడు మోక్షమ్ము వదయు నను టొప్పునె యా
నీతి యధార్థం బగుచో, ఱాతికి అప్పకును ముక్తి రావలయుఁగదా! 136

గీ. వలయు సాంఘికసేవ కావలయు నాత్మ, చింతనము పురుషార్థ మాసించువాని
కివి పరస్పరప్రాణము లిందు నెదియు, గణ్యత గడింపఁజాల దెక్కటిగ నున్న. 137

ఆ. జగతినున్నకల్మి సకల మీశ్వరునిదే!, యెసఁగు సంఘమూర్తి నీశ్వరుండు,
మనుజుఁ డితనిసొత్తు దినుటతప్పదు, ఋణం, బిది సమాజసేవనే తొలంగు. 138

ఆ. త్రోవలోనిముండ్లు తొలఁగించినం జాలు, గొప్పగొప్పసేవ లొప్పకున్న
నిస్సిరో! సమాజహితమునఁ దనహితం, బిమిడియుంట కానఁడేమి జదుఁడు. 139

గీ. పదుగురకు మేలు చేకూర్చుపని కుదారుఁ, డట్టె సమకట్టుఁ దన కెంతచెట్ట యైనఁ
గడలిఁ బుట్టి సెగల్‌పొగల్ క్రక్కువిసము, నీశ్వరుఁడు మ్రింగఁడే లోకహితము వలచి.

ఆ. వెతలు కొఱఁత లెన్ని వెంపరలాడినఁ, దోడివారు తన్ను వీడి చనినఁ
బితికి గాక ప్రజల మఱవక సేవించు, నరుఁడు ధన్యజీవి నాఁ జెలంగు. 141

ఆ. తనసుఖమ్ముకొఱకుఁ దరలింపక పరార్థ, హేతువైన పనికి నింద్రియముల
నెవఁడు పనుచు నతఁడు కృతబుద్ధి, సంయమ,మూర్తి యతఁడు, విగళితార్తి యతఁడు.

గీ. ఎన్నిచదురు లెఱింగిననేమి మర్త్యుఁ, డొదలు వీడుట యనివార్య మొకదినాన
నిట్టి తను వార్తసేవలో నెడయుకంటె, నెన్నఁదగినట్టి చేఁత వేఱొద్ది కలదు. 143

గీ. సంతుఁ గనుచును బెంచుచు సంఘమునకు, సేవచేయుట పొసఁగనిచేఁత యనుచు
నలువదేండ్లు నిండనినాఁడె నగుచు బ్రహ్మ, చర్య మూనిన యమి నెంతు జాతిపితను.

గీ. రమ్ము రమ్ము స్వతంత్రభారతము నేల, రమ్ము బాపుజీ! యని మహారథులు వేఁడ
వలదు వల దని దుఃఖితావన చికీర్ష, నౌఖలికిఁ జన్న గాంధి కేనరుఁడు జోడు? 145

ఆ. పరుల నొంప నూఱుగురుదొరల్ సచ్చిన, చావుకంటె నొరుల సౌఖ్యపెట్ట
నొకమహాత్ముఁ డసువు లూడ్చుట యెనలేని, విలువ నందు విశ్వవీథులందు. 146

ఆ. విందువేళ వేవు రుందురు చుట్టాలు, బొందువేళ నేవు రుందురేమొ
తెలుఁగువారి పెండ్లి తెఱఁ గిది దీనికై, కవిత లేల పంద్రిగడలకొఱక? 147

గీ. తెల్ల వెంద్రుక నొకనాఁడు తీసివైచె, నల్ల వెంద్రుక నొకప్రొద్దు దుల్లఁజేసె
మీసములవానికే యింతచేసె నతఁడు, వయసు నేర్పెడిపొరముల్ వదలలేక. 148

ఆ. దిగినచానసొగసు తిలకించుచుండఁగా, బస్సు బుయ్యి మనుచుఁ బరుగులెత్తెఁ
దెల్లమొగమువైచెఁ దెరువరి వాయిదా, నేఁ దటంచు జడ్జి ని ప్పటంచు. 149

గీ. బస్సులో నొక్కఁడును లేఁడు బాటసారి, యెక్కఁ జూచెదు తెరువరు లేవు రార్వు
రైననేమి రారాపిళ్లు మానలేక, చించుకొన్నారు చొక్కాలు చెనఁటు లగుట. 150

ఆ. వాఁడు మ్రొక్కి కుశలవార్తలకున్ దిగె, వీఁడు మిమ్ము మఱచినాఁడ ననియె
నతఁడు మీమఱందియత్త మా పొరుగూరి, పెద్దకాఁపుగారిబిడ్డ యనియె. 151

ఆ. చేతఁగానివాని కోఁతల కొక యంతు, కానరాదు కస్తి లేనినాఁడు
బెట్టిదంపువెతలు చుట్టినతఱి వాఁడు, పరుగుదీయు నఱవపప్పువోలె. 152

ఆ. అజ్ఞుఁ దలసిసొలసి యరగంట ముందు రా, జాము తడసి వచ్చు సభకు విజ్ఞుఁ
డవల గంట గడవ నధ్యక్షుఁ డేతెంచు, సాగు నిట్లు నేఁటి సమయనిష్ఠ. 153

ఆ. తెల్లవాఁడు పోయె దేశంబునకు నిఁక, నవత వచ్చు నని జనమ్ము పొంగ
నదియ వచ్చెఁగాని యరసున్నతో వచ్చి, కన్నకలల నిండుసున్నచేసె. 154

ఆ. ఏది యెట్టులున్న నీనాఁటి యువలలోఁ, గదలుకొనఁ దొడంగెఁ గైతవలపు
చాలుఁజాలు బుధులసంతుష్టి కీమేల్మి, చక్కఁబడరె వీరు చదివి చదివి. 259

క. నేఁటి కవిభావనలలోఁ, బూఁటకుఁబూఁటకును మార్పు పుట్టుచునుండన్
నాఁటికవితలఁపులన్ దెగ, నాట విమర్శకున కుచితమా యివ్వేళన్? 260

గీ. బోయవాఁడు సృజించె రామాయణంబు, పల్లెబిడ్డ రచించెను భారతంబు
మాల పెనిచెను దమిళవాఙ్మయమహత్త, నేల కులచర్చ కైసరు నెన్నుపట్ల. 261

క. అప్పకవి కెవరు తగు నని, చెప్పిరొ కులవాడ మొందు చేర్చెను గృతి; నీ
యప్పనుడిఁబట్టి బాఁపని, చప్పనికృతియున్ బుధప్రశంసలు కనునా? 262

ఆ. కాకునూరిసూరివాకునకున్ బోక, కదుకదేమి నేస్త; మంతమంది
కవుల-ధరణిసురులుకానివారల పల్కు, లెట్లు రుజువులయ్యె నితని కదిర! 263

గీ. దురభిమానంపురొంపిలోఁ దోఁగినట్టి, మనుజునకు లేదగున్ మతి; మతి నశించి
నపుడు కులములఁ దెచ్చి హాస్యాస్పదంబు, లనవలంబము లగుతీర్పు లాడు నతఁడు.

క. తననేర్చిన నేర్పులచేఁ, దనయోర్చిన తపముచే సుదాత్తపదంబున్
గనుఁగాని కులముచే నరుఁ, డెనయఁడు పెద్దరిక మెన్ని యెత్తులఁ బడినన్. 265

గీ. కృతిపతిత్వము మంచిదే, పతియశస్సు, బ్రతుకు నాలుగుకాలాలపాటు దీన
నెడఁదచక్కన మేనిసొం పిరవుకొన్న, కృతియపో! తగు నిచట నాదృతియొనర్ప. 266

గీ. ఎందఱు చళుక్య లీనేల నేల, రందు, నన్నపార్య మహాకావ్య నాథుఁ దగుట
రాజరా జొకఁడేకదా బ్రదికె నజర, మమరమైన యశమ్ము త న్నలముకొనఁగ. 267

ఆ. మనుమసిద్ధి యెంతమహి నేలె? నల కవి, బ్రహ్మ కనికరమ్ము పడసెఁ గానఁ
జక్రవర్తి పొందఁజాలని కీర్తి కా, చంద్రభాస్కరముగ నింద్రుఁ డయ్యె. 268

గీ. ఎంతపెనఁగిన ధీశక్తి యెంతయున్న, నెవఁడు కవి యౌను గురు నాశ్రయింపకున్న
గురుఁ డవిద్యాతమఃప్రభాకరుఁడు సేవ్య, తరుఁడు సాక్షాద్విధాత మాధవుఁడు శివుఁడు

క. ఆఁకటి నణఁచుచు నెఱుఁగమి, చీఁకటిఁ దొలఁగించుగురుని జేరనిపుణ్యం
బీకొనునె నేల నాలన్, రూకల నర్థులకు నిడునరున్ జేరుటకున్. 270

క. నేర్చినకళ భగవత్ కృపఁ, గూర్చినకళ నర్థి నొరులకున్ బంచినవాఁ
డర్చనలు పడయు, నిహపర, వర్చస్సులు పడయు జగము వలగొని మ్రొక్కన్. 271

గీ. ఎవరు తిరుపతివేంకటకవులతోడఁ, దొడరి గురుభక్తిలో సరితూఁగఁగలరు
చర్లబ్రహ్మయశాస్త్రియశం బశేష, జగమునకుఁ బ్రాఁకె నీశిష్యయుగముకతన. 272

గీ. చెళ్లపిళ్ల మహాకవియుల్ల మలరు, బాటలో గురుభక్తిని జాటినట్టి
సరసుఁ గాటూరి వేంకటేశ్వరుఁ దలంచి, మేలు మే లని కవికోటి మేను మఱచు. 273

ఆ. గొప్పవాని నెదురుకొని యోడినను గొంత, యశము దక్కు ననుదురాశ పొదమి
యొప్పు తప్పు గననిమొప్పె మహాకవి, కృతిసమీక్ష కొగ్గి గేలివడయు. 274

గీ. వ్యాసునకు లేదు పాండితి, భాసున కౌచిత్య మెఱుకపడనట్టిది, సో
మాసితెలుఁ గొప్పదను స, న్యాసులు సాహిత్యశీలనమున కనర్హుల్. 275

గీ. పంచెఁ దనయెత్తుబంగారు పాత్రములకు, వాసిరెడ్డి మహీశుఁ; డీవార్త కెరిసి
పుచ్చువంకాయలను బంచెఁ బొలఁతి యొకతి, కలరు నేఁ డీకె తమ్ములు కవికులాన. 276

ఆ. వారు వీరు నొకని వంకరటింకర, కైత దిద్దిదిద్ది కరుణచాటి;
రవల మొదటిపద్యమైన నా కృతికర్త, సరిగఁ జదువలేక సభల ముడిఁగె. 277

క. పిఱుఁదులతో మైచేవను, బిరుదులతో ధీబలమ్ముఁ బెద్దలు గుర్తిం
పరు నమ్ము; రిది యెఱుంగక, తిరియుం బట్టముల కలఁతి దేవురు వదుచున్. 278

గీ. సభలు సమకూర్చి పొగడికల్ చాటి తన్ను, గౌరవింపమి కొకజబ్బు దూఱు నొరుల
నొకవికారి నిజాస్యమం దొఱపు మెఱుపు, వెలువరింపమి కద్దమున్ విసరికొట్టు. 279

గీ. ఎంతచదివినఁ బట్టంబు లెన్నియున్న, మనుజుఁడు వినమ్రుఁడై యోనమాలురాని
వృద్ధుకడ నేర్వఁదగువిద్య పెద్ద యుండుఁ, బ్రజ్ఞ యన్నది యొకనిసంపత్తి గాదు. 280

ఆ. తల్లిబాసపట్ల నెల్లర కనురక్తి, కలదు గాని తొట్టతొలుత నిచటఁ
జెప్పవలయుఁ దమిళుఁ జిట్టచివర కాంధ్రు, నుగ్గడింపవలయు సిగ్గుపడక. 281

క. మూఁడేండ్లకుఱ్ఱఁ డే.బీ., సీ.డీ.లను దిద్దుఁ దెల్గుసీమ నయారే!
వీఁడు తననేలనే పెఱ, వాఁడగుటన్ జాతి కెంత వల్లడి యగునో! 282

ఆ. చనదు లాఁతిపల్కు మనబిడ్డకుఁ బదేండ్ల, యీాడు వచ్చుదనుక నింపుకేని
పిదప నన్యభాష బిఱబిఱ నగ్గమౌ, మాతృవాణిమీఁది మమత హెచ్చు. 283

క. సురభాష సర్వభాషల, నెఱవణిగలబాస యనుట నిక్కమ; యైనన్
బెఱబాసలెల్ల దీనన్, దొరలినవే యనుట సత్యదూరంబుకదా! 284

ఆ. ఎల్ల తెల్గునుడికిఁ దల్లి సంస్కృత మని, చూపఁ బెనఁగువారిఁ జూచి వగతు
'రెండు' 'ద్వంద' పదమునుండి పుట్టెనె? మోహ, మెంతయున్నఁ దెగువ యింతచన్నె? 285

గీ. ఎన్నఁదగులింగములు మన కెన్ని వేలు, లేవు? తత్కోటిలో మూఁడులింగములన
లెక్కకుం దెచ్చి యొకఁడు 'త్రిలింగ'శబ్ద, సృష్టి గావించెఁ దాంత్రికపుష్టికొఱకు. 286

ఆ. తెనుఁగునుండి తెలుఁగు, తెలుఁగునుండి త్రిలింగ, ముద్భవించె ననుట యొ ప్పటంచు
నుగ్గడించినట్టి ప్రెగ్గడ లక్ష్మణ, రావు నెంత్రు సత్యరతులు కృతులు. 287

క. నఱకెడి కురారమునకున్, బరిమళ మిడుచందనమ్ము, బంధించెడి కా
పరికిన్ బా లిడు సురభియు, గుఱుతునకున్ వచ్చు నేసు కురిసిన యోర్మిన్. 288

క. కొట్టినవానిం గొట్టక, పట్టుము తచ్చరణయుగము, పండినప్రేమన్
బెట్టుము దానికిముద్దని, నట్టి ఫరీ దేసుతమ్ముఁ దని పల్కఁదగున్. 289

ఆ. మతముపేర సాటిమానవుతల ద్రుంచి, మతముపేర మాతృమహిని జీల్చి
శాంతి నెవఁడు పడయు?, సమతాదవీయమౌ, మతము నిలువఁగలదె మస్తమెత్తి. 290

గీ. తెనుఁగు నధికారభాషఁగాఁ దెచ్చుతలఁపు, తగినదే కాని "శ్రీరామనగర" సంజ్ఞ
మన విధానసభా ఖండమునకునైన, నిర్ణయింపుఁడు మంత్రితానియతులార! 291

గీ. ఆంధ్రసవనాగ్నికి హవిష్యమైన ధీరుఁ, దెనుఁగునేలకు వాసిదెచ్చిన యుదారు
మఱవకుఁడు పొట్టి వీరు నమాత్యులార!, పెట్టుఁ డీమేటిపే రొక్కపేఁట కేని. 292

గీ. పేఁటకా వీటికా కాదు పెద్దసీమ, కే ప్రకాశమునామంబు గీలుకొల్పి
త్యాగిదెసఁ గృతజ్ఞత చాటినట్టి నాఁటి, తెలుఁగుసచివుల యౌచిత్య మలఘుతరము. 293

గీ. రమ్మనినవారు వెండియు రమ్మటంచుఁ, బిలుచుకైవడి వర్తింపవలయు నరుఁడు
పిలువకున్నను గేస్తుల బెరసి వారి, కధికమాసంపుఁదద్దిన మగుట రోఁత. 294

ఆ. అతనిఁ జూచి నీచుఁ దక్కస్సునం బడుఁ, బెనఁగులాడు నతనిపేరు డింప
నింత కతఁడు దోస మెయ్యది కావించె?, బొంకుసెప్పఁ దధముఁ బొగడలేఁడు. 295

ఆ. కమ్మవ్రాయ నుత్తరమ్ము పంపఁ డొకండు, మగుడ వ్రాయ జడత మానుఁ గాని
మొదటిలేఖ నాకు ముట్టలే దను, నొండె, నూర లేమి జంపు మూరె నను. 296

ఆ. క్రుళ్లి పురుగులురలు కుణపంబు లెన్నివే, లైన మోయఁగలదు గాని ధరణి
లేశమేని నిజములేనట్టి నడపీన్గు, నొక్కదానినైన నోర్వలేదు. 297

క. జీవిత మొక మంజులకళ, కావలయును శాంతిసౌఖ్యఖని కావలయున్
కోవల కులముల మతముల, తావులతగు లూద్చువాఁడ దానిన్ బడయున్. 298

ఆ. పాపపుణ్యములను బాటింపనొల్లని, రాజనీతితో; సమాజ కష్ట
సుఖసమీక్ష కిచ్చసూపని మతముతో; నరుఁడు దారి దప్పినాఁడు నేఁడు. 299

ఆ. పొగరు హెచ్చిహెచ్చి పూజ్యుల కవమతి, గూర్చువాఁడు చెట్ట కుడిచితీఱు
నహుషుఁ డేమియయ్యె మహనీయులకుఁ దన, పల్లకీ వహింపఁ బనుపు పెట్టి. 300

ఆ. మేరదాఁటి వచ్చువైరితోడఁ బెనంగు, కంటెమున్ను ప్రజల గాసిపెట్టు
లేమితోడ నెఱుకలేమితోడఁ బెనంగి, పడయవలయు గెలుపు ప్రభుతవారు. 301

ఆ. తెనుఁగువానిబ్రదుకు తేలిపోయిన దని, తెల్లసేయునా సుధీర్ కిశోర్ ము
ఖాఖ్య? లక్కటా! యజంతము తెనుఁ గన్న, మాట మఱవఁదగునె మనజనమ్ము?302

గీ. వలదువల దనుతెరువరివంతుపైస, లిచ్చె నౌకరుండు బస్సులో నిరువదైదు
నసుగుచు నితండు కదిసె మర్నాఁడువాని, నైదురూపాయ లప్పిత్తురా యటంచు.303

గీ. బస్సు గీపెట్టినను నడిబాటనుండి, కదలఁడే వాఁడు వదలెనా బ్రదుకుఁ దీపి
యీప్రజారాజ్యమందు న న్నెవఁడు త్రోయు, నని మొరాయించెనా త్రాగెనా సెబాసు!304

గీ. నరునిశేముషి పండిననాఁడు పుట్టె, నుపనిషత్తులు సత్యప్రయోక్తిఖనులు
వెఱ్ఱితలవైచినంతన వెడలినవి పు, రాణములు వర్ణవైరకారణము లగుచు. 305

క. కృతయుగ మిఁక రాదు మను, స్మృతి రాజ్యముసేయ దేటి కెదురీఁదునరుల్
పతితులు పరిహాస్యు లను, ద్ఛృతు లౌదురు జగము వికృతిశీలమ్ము చుఁడీ! 306

ఆ. సంతుకతన రాదు సంపత్తి చే రాదు, రాదు యజ్ఞకర్మరక్తిఁ జేసి
కాన నుంట రాదు కావితోడను రాదు, వలపు లుడిగినపుడె వచ్చు ముక్తి. 307

ఆ. గుడ్డరంగు మార్చుకొన్నంత నేమాయె, మనసురంగు మార్చుకొనుట వలయు
మార్చుకొనఁగ నోడుమస్కరి యొకతుకన్, గట్టుకొనుట మేలు జుట్టుపెంచి. 308

క. చందా లని గ్రంథా లని, మందిర మని సత్ర మనియు మఠ మని సిరికిన్
బందాలగు సన్నాసులు, పొందుదురా ముక్తిసుఖము పొందించెదరా? 309

క. సచరాచరమగు జగమున, కచలంబగు తేజ మొకటి యాదరు వని న
మ్మి చరింతు రిచటివారలు, శుచితాసౌందర్యజనితసుషమామహితుల్. 310

క. వేన్నీళ్లకుఁ జన్నీళ్లుగ, మన్నపుడే సేద్యగాఁడు మన్నన వదయున్
మన్నీఁద నేను నా కెవఁ, డున్నాఁ డెదు రన్నపూఁట నోటమికుదుచున్. 207

క. మితిమీఱిన వెచ్చముతో, నతుకులబొంతగ నిరంతరార్తికరముగా
మతిలేని కాఁపుబిడ్డల, బ్రతుకు కనంబడెడి నేఁడు పరిహాస్యముగన్. 208

క. ఇడ్డెనలు దోసె లతిసెలు, లడ్డులు తెగమెక్కి మెయి నలంపనికాఁపా?
గడ్డిదిని బండి సీడ్చెడి, గొడ్డా? తగుజంతు వెద్ది కొనియాట కిటన్. 209

ఆ. కమ్మతంపుబరువు కార్మికుతల మోపి, చెలువుగుల్కు మదుఁగువలువ లూని
రచ్చబండకెక్కి రగడలు సాగించు, కాఁపు బాగుపడుట కల్లకల్ల. 210

ఆ. ఒకట రెంటఁ గాదు సకలదురభ్యాస, ముల నపేక్షచూపు హాలికుఁ డిపుడు
చిన్నచిన్న పదవి కెన్ని యుద్ధము లైనఁ, జేయ నోర్చు నౌరు ఠిసీ! యనంగ. 211

క. రైతుసరే! కార్మికుఁడును, బ్రాతఃకాలమున నాల్గుపావులు కాఫీ
దాత కిడు, నింత నాఁగక, నీతివిరుద్ధవ్యయంబు నేర్చెను మిగులన్. 212

గీ. మద్యము దురోదరాదులు మరగి పతితుఁ, డాయె నీనాఁడు కూలివాఁ; డాయ మెంత
వచ్చినను దారపుత్రుల కిచ్చు పైస, లస్తుబిస్తగు గంజికినైన నకట! 213

క. మదిరాపానమునన్ నరుఁ, గడియనికీ దెద్దికలదు? కావ్యుని దయచేఁ
బ్రిదిలినతగులము మరలన్, బెదపెద్దలదనుక వచ్చి పేర్చెడి నకటా! 214

ఆ. త్రాగువాఁడు మున్ను తప్పుచేసితి నని, పెద్దవారిఁ జూడ బిడియపడియె
నేఁడు మద్యపాయి నిర్భీకుఁడై నిల్చి, నడిబజారునందు నాట్యమాడు. 215

ఆ. మదిర త్రాగిత్రాగి మనుజుండు దనుజుఁడై, పరితపించు రక్తపానమునకు
దిక్కులేనివారు దేశాలుపట్టి రీ, మోహమునకు దాహమునకు వెఱచి. 216

గీ. తగదు తగదు మద్యంబని తాటిగెలల, నఱకె నపుడు సత్యాగ్రహనాయకుండు
తగును దగు నని ప్రజ కల్లుత్రాగు నిపుడు, దేశ మెంతలో నెంతదుస్థితికి వచ్చె! 217

గీ. పరుల నిష్కారణమ్ముగాఁ బరిభవింపఁ, గడఁగువానికి విధి బుద్ధిగఱపితీఱు
పాండవుల వనాశ్రితులను బఱుపఁ బూని, కురువిభుం డెంతచెడఁ డిసీ! ఘోషయాత్ర?

గీ. తన్ను మించినబల్లిదుఁ గన్నయంత, నరునహంత యడంగు, వానరముతోఁక
లేశమైనను గదలింపలేక శీరము, వంచెఁగద భీమునంతటివాఁడు మున్ను. 219

గీ. బాలుఁ డభిమన్యుమీఁదికి వేలకొలఁది, బంట్ల నంపినకురురాజు పాప! మేగు
రొక్కతూకుగ ననుఁ దాఁకు టొప్పు దనియె, ముప్పుమూడిఁనతతిఁ బాడి సెప్పు నరుఁడు.

ఆ. వెలఁది కెగ్గుసేఁత కొలఁది కందనికీడు, గూర్పుఁ బాండవులకుఁ గురువిభుండు
చెట్ట లెన్నినూర్లు చేసినఁ బాంచాలి, పరువు చెఱుపఁదేని బ్రదుకువాఁడె. 221

ఆ. దానమునకు విత్తమానముచే విల్వ, రాదు ధర్మతత్పరతను గాక
యింతజొన్నపిండి నిడినపేదకు సరి, గాకపోయె రాజు కనకమిడియు. 222

ఆ. ఘోరదుఃఖమునకుఁ గారణంబగు ధర్మ, దూర మైనతృష్ణ యేరికేని
నీతిమాలి రాజమాత కాఁగోరిన, కైకబ్రదు కదెంత గణ్యమాయె. 223

గీ. వలచివచ్చినరాజ్యంబు వల దటంచుఁ, ద్రోసివైచెను, రాముపాదుకలమ్రోల
దాసుఁడుగ నిల్చె భరతుఁ; డీత్యాగమునకు, ముజ్జగమ్మునురోమాంచమున మునుంగు.

గీ. అందెలివి జానకమ్మవే యనెద వదినె, పదములకు మ్రొక్కునియతి నాపాలి దగుట
నన్నయా! కమ్మ లెవరివో! యనుసుమిత్ర, కొడుకు మనసంస్కృతికి వన్నెలిడు పతాక. 225

ఆ. రామదర్శనాగతామోదమునఁ జొక్క, వార్చె శబరి వేయివత్సరములు
వేయి కాదు వేయివేలేండ్లయిన వార్చు, నుచిత యోగనిష్ఠ నుండుప్రాణి. 226

గీ. కలుషితములైన విషయవాంఛలను రేఁపి, ప్రజలఁ బశువులఁ గావించుప్రజ్ఞ కాదు
రాగవైరాదులను ద్రోసి రాముదెసకు, నడుపు కౌశలమే కళ నాఁ జెలంగు. 227

గీ. మచ్చరమ్ముల మంటల రెచ్చఁగొట్టి, నరుని దయ్యముఁగా మార్చు వెరవు కాదు
ప్రేమ నెసఁగించి కృపను అంపిల్లఁజేసి, త్యాగిఁగాఁ దీర్చు నేఱవాదితనమె కైత. 228

ఆ. కవులకేమి నేఁడు గ్రామాన కొక నూఱు, మంది కలరు గాని మాటదారి
బ్రతుకుదారి వేఱుపడకుండ నిల్పువా, రెంతమంది యుందు రీ శతాన? 229

క. అంతంతలతోడన్ గవి, మంతున కెక్కఁడు మనస్విమైత్రిని మోహ
భ్రాంతుల కెడయై మునియై, యంతర్ముఖుఁ డైననాఁడె యతఁడు రహించున్. 230

ఆ. కాసు లున్నవానిఁ గన్నెత్తి చూడక, పదవి నున్నవానిపంచ నిలక
గంజితోడఁ దనియు కవులకే లోకంబు, మోఁకతించు వినయముగ్ధ మగుచు. 231

గీ. మురళియై విశ్వమోహనసరణి మ్రోయఁ, దలఁచినప్పుడు వెదురు కోఁతలను గంట్ల
నోర్వవలయు సభాశ్లాఘ నొందఁగోరు, కవియు సైరింపవలయు నిక్కట్లు పెక్కు. 232

క. కోరని యూహింపని స, త్కారము కైవార మందుకవి పలవాంఛా
దూరమగు కర్మయోగము, నేరిచి సైరించినట్టి నెఱజోడు సుఁడీ! 233

క. ధరణీపతిచట్టమునకు, నరుఁడు కడున్ వెగడువడుచు నమ్రత చూపున్
నరసకవి శాసనమునకు, గరఁగి బలా! యనుచు మస్తకమ్మును వంచున్. 234

గీ. రసమయ ప్రౌఢ భారతరచన వినిచి, చక్రవర్తిని గదలించి సన్నవడిన
మనుమవిభుపేర్మి నిలిపెఁ గొమ్మనసుతుండు, కథయిది వెలార్చు నుత్తమకవితబల్మి. 235

గీ. వెంటనే తినవలసిన వేఁడిరొట్టె, వంటిదా ప్రజ్ఞ కలవాఁడు వ్రాయుకవిత?
దీనిరుచి దీనివేఁడిమి దివియు భువియు, నిలుచునందాఁక సడలక పిలుచుఁ బ్రజల. 236

గీ. గణయతిప్రాసవిధులు కారణము గాఁగఁ, గవి తలంపని పెక్కు చక్కనలు వచ్చి
పద్య మలరించు సాహితీప్రౌఢమతుల, ధారణకు నిల్చు హృద్య ముదాత్త మగుట. 237

ఆ. వ్రాయవచ్చుఁ గైత వ్రాసిన ప్రతిపద్య, మచ్చువేయరాదు పిచ్చరేఁగి
చూచిచూచి సాధుసుందరకావ్య మా, విష్కరింపవలయు విజ్ఞు లలర. 238

ఆ. తప్పు లెన్ని యున్నఁ దనరచనంబు న, గ్గించువాఁడు కవికి మంచివాఁడు
నిజము సెప్పువాఁడు నింద్యుఁ డిఁకన్ మన, బాస యెట్లు బాగుపడు నయారె! 239

క. సవరింపఁ దగినమాటలు, కవిచెవి కలవోక వచ్చుఁ గావునఁ గవితన్
బలుకునపు డతఁడు పెద్దయు, మెలఁకువతో నుండవలెఁ జుమీ! బుధుఁ డయ్యున్. 240

క. అలివేలుమంగమం గన, వెలలెద మీబహుళచవితి వేఁటోక ననన్
గల విందు నాల్గుతప్పులు, తెలియుఁ గృతశ్రముఁడు బాసతెలుఁగుల్ మఱుఁగుల్. 241

గీ. మనుచరిత్రము నాకు నేర్పినది బావ, రామకవి సమయానికి రాకపోయె
సరళ కనుపించినది కలాశాల ననఁగ, సూరులొప్పని నుడులిందుఁజొచ్చె మూఁడు. 242

గీ. గురువునాధ్వర్యమున గోష్ఠి జరగుచుండెఁ, దలవనితలంపుగా వచ్చెఁ జెలిమికాఁడు
దళము నిల్చె సమర్థవంతముగ ననికి, నాఁగ నెరసులు మూఁ డిందు దాఁగి యుండె. 243

గీ. పాఠశాలకు నిఁకఁ బొందు బాలులార!, శిష్యులు! గణింతు మీవైదుషీబలంబు
సభలు జరపెను సంస్కృతీసమితు లనిన, దోసములు నాల్గు బుధులకున్ దోఁచు నిచట.

గీ. గాంధి మనబానిసత్వంబు ద్రక్కదల్చె, సోమవర్మ భవానిని స్తుతినిజేసె
రాజు దండింపవలయు నేరస్థు ననిన, దిద్దఁదగుతావు లున్నవి దీన మూఁడు. 245

గీ. వాఁడు కవితాకళన్ యశోవంతుఁ డాయె, వంటవానితో గారెలు వండ మంటి
నితని యాధిక్యతను సైఁపఁ దతఁ దనంగ, నడుగడునందు నొకతప్పు విడిసె నిందు. 246

గీ. ఎవనియధ్యక్షతన సాగు నీసదస్సు?, చొరెను బసిపాప తమ్మిమొగ్గరమునందు
వీని తేజోన్నతికి రిపుల్ విచ్చి రనినఁ, బదపదమ్మున నొకతప్పు కుదురుఁ గొనియె. 247

గీ. ఏను మత్కావ్యదోషములెల్ల నెఱుఁగ, నితరుఁడున్ దనతప్పులనెల్లఁ గానఁ
దగుట నన్యోన్య కృతిసమీక్షానురక్త, చిత్తులై కవు లుద్దీప్తి చెందవలయు. 248

ఆ. మంచినడత కతన మగువ, చుక్కలతేని, కతన రేయి, బుధులకతన గోష్ఠి,
యంచజంటకతన నబ్జాకరము, నియ, తోక్తికతనఁ గృతియు నొందు నొఱపు. 249

క. ఒక్కొక్కమహాకవి కృతి, నొక్కయెడన్ గట్టుదప్పియును డిందఁడు, తా
దృక్కులతప్పులు వేయిటి, నొక్కకృతిం గూర్చుకవియు నుత్తముఁ డగునా? 250

గీ. కవి నిరంకుశుఁ డనుటచేఁ గట్టుదప్పి, విఱ్ఱవీఁగు నటంచు భావింపరాదు
లాఁతు లేమందురో యన్నభీతి లేక, ధర్మువును జాటువాఁ డని తలఁపవలయు. 251

గీ. కవన మొక రసావేశ; మీతవులు సాగి, రేఁగినప్పుడు కవి పవల్ రేయి మఱచు,
మఱచు నన్నము, నిద్దుర మఱచుఁ, దుదకు, మఱచుఁ దన్ను నపూర్వసమాధి మున్గి. 252

ఆ. నరత దుర్లభంబు, నరతలో విద్య దె, ప్పరము, విద్య యున్న నరిది కైత,
కైత నంద మూంట కడిఁది; కోటి కొకండు, పదయు నిటఁ దపమ్ము పండి గెలుపు. 253

గీ. మాననీయుఁ డొక్కమాటతో మెచ్చినఁ, జాలు, విలువలేని తాలుగింజ
లెన్నితప్పకైత లిడి కొనియాడిన, నరున కెంతపరువుబరువు వచ్చు? 254

ఆ. ఎంద ఱెంత విత్తమిచ్చిన యతమతి, గానికవికిఁ దిండికఱవు తప్ప;
దన్నికాన్క లందుకొన్న శ్రీనాథుండు, కడకుఁ బడ్డపాట్లు నుడువనేల? 255

ఆ. నేర్మిలేనివారు నేఁటిపొరకు లని, దారిదప్పి కవులు జాఱరాదు
వ్రాదు చాల దన్నతలఁపుతో బావిని, బూడ్చువారు లగ్గు పొందలేరు. 256

ఆ. చదువులేనివారిమది కందవలెనన్న, యూహతోడ మేర లుత్తరించి
వ్రాయుచుండు మనెడివారికైత నిరక్ష, రాస్య మైనజనత కర్థమగునె? 257

ఆ. బాసలోఁతు లంతుపట్టిన ప్రాజ్ఞుఁడే, పాత్రభేద మెఱిఁగి పల్కఁగలఁడు
కఠిన మృదుల వాఙ్నికాయమెల్లను వాని, యిచ్చ ననుసరించి యొదఁదఁ గదలు. 258

క. అది సత్యం బది జ్ఞానం, బది షట్టువు చావు లేని దది యానందం
బది శాంతము శివ మద్వయ, మదె బ్రహ్మం బది యుపాస్య మమృతార్థులకున్. 311

క. ఏ నింద్రియసందోహము, గాను మనసు గాను నే నఖండాత్మను నా
బానిస యీమానస మని, ధ్యానస్థితిలో నరుండు తలపోయవలెన్. 312

క. దేహాభిమాన మను పెను, మోహము గలవాఁడు బ్రహ్మమును సగుణముఁగా
నూహించి కొలుచు, బోధ, వ్యాహతమోహుండు నిర్గుణాఖ్యము వలచున్. 313

క. నామదికిన్ బల మొసఁగుము, నీమార్గమునందు నడుచునే శ్వాసఁగుము న
న్నే మఱకుము నీ లెంకను, స్వామీ! యని నరుఁడు ప్రభు నుపాసింపవలెన్. 314

క. పాపుల నను నిందించిన, కాపురుషుల నామసమ్ము కలఁచిన జడులన్
సైఁపఁగల తాల్మి నిమ్మని, యాపోవక వేఁడవలయు నభవు నుపాస్తిన్. 315

క. వెల్లువవలె భక్తిరసం, బుల్లములోఁ బొంగి పొరలకుండిన నేలా
పల్లవిపాటలు గజ్జెలు, ఘల్లురనన్ బుడమి వడఁక గంతులువేఁతల్. 316

క. తలబిరుసు వీడి యే నొక, యలంతి రవవంటివాఁడ నని నరుఁ డాత్మన్
దలపోసినపుడె కరుణా, కలితమతిన్ వేలు పతని కడగం ద్లడఁచున్. 317

క. కామాది భయదశత్రు, స్తోమము నరుపెంపు డింపఁ జూచును సతమున్
ధీమంతుఁ డీశ్వరుని వ్యాత్, సీమను గాపుంచి దానిచేవ నణంచున్. 318

ఆ. కొండనుండి జాఱి ఘోరాటవులఁ దూఱి, వెడలి పరుగువెట్టి బడలిబడలి
నురువుగ్రక్కి యేఱు శరనిధిలోఁజొచ్చు, పగిది నీశుఁ జేరఁదగును బ్రాణి. 319

ఆ. ఎంతవిద్యయున్న నేర్పడియున్న నం, దాలదీవియైన తరుణియున్న
నాత్మదర్శనమ్ము నందనివానికి, దక్కుసౌఖ్య మెంత? తనివి యెంత? 320

ఆ. దప్పి రేఁగినపుడు చప్పునఁ జను జీవి, తేటనీటి నొసఁగు నేటిదరికి
నాత్మదర్శనేచ్ఛ యదరినతఁడఁ బరు, వెత్తు నరుఁడు తత్త్వవేత్తకడకు. 321

ఆ. పూఁట కొక్కగురుని బూజింపఁ దొడఁగిన, వెఱ్ఱి కబ్బునా వివేకదీప్తి
చెడు నతండు రెండుపడవలపైఁ గాళ్లు, మోపి నదిని బోవు మూర్ఖునట్లు. 322

క. స్త్రీశూద్రులకును శ్రుత్యుప, దేశము తగు నని జగమ్ము దిద్దిన సమతా
కోశ మసంగానంద య, తీశుఁడు తొలుబంతి యొజ్జ యిక్కాలమునన్. 323

గీ. ప్రాఁబలుకుకంటె నుపనిషద్భాషకంటె, గీతనుడికంటె సాబర్మతీతపస్వి
మాట జవదాఁటరాని ప్రమాణ మెతని, కతని కర్పింతు మలయాళయతికి నతులు. 324

ఆ. నేఁడు గాంధి పుట్టినాఁడుకదా! యిది, పర్వదిన మటన్న భవ్యభావ
మెంతమందియెదఁద నేర్పదెఁ గృష్ణజ, యంతికంటె నీజయంతి యసదె? 325

ఆ. గాంధితో నడంగెఁ గర్తవ్యనిష్ఠ మ, హాత్మతో వివేక మస్తమించె
భారతోర్వి నిపుడు పదవులకాట్లాట, తక్క నేమికలదు నిక్క మరయ? 326

క. త్యాగమును మఱచి రన్నలు, భోగమ్ములకై రణాల బ్రుంగిరి తగ దీ
యాగం; బిది సాగినచో, రాఁగల మే లెద్ది యిహపరచ్యుతి దక్కన్. 327

క. మిత్తికి జంకక పదవుల, గత్తరలోఁ బడక బ్రదుకు కడచనుదనుకన్
జిత్తము దేహము సేవా, యత్తము గావించి గాంధి యమరత నందెన్. 328

గీ. చిన్నచిన్న తెగింపులచేత రాదు, రాజ్య మాత్మార్పణముతోన రాక పొసఁగుఁ
గదలుఁ దన్న! లటంచు నల్లగ వదంక, దండు నడిపినగాంధి కెవ్వండు సాటి? 329

క. గుట్టెఱుఁగఁడు తనదోసము, బట్టబయల్ సేయ సిగ్గుపడఁ డొరుతప్పున్
నెట్టన తనతల నిడుకొని, నిట్టులు సాగించె గాంధి నిశ్చింతమునన్. 330

ఆ. తరతరాల మబ్బు తెరలు విచ్ఛేదించి, వన్నెదెచ్చె గాంధి వనిత కిచట
నతనికేలు సోఁకినంతన రమణీయ, మణిశలాక యయ్యె మట్టిగడ్డ. 331

ఆ. అతనిముందు కల్ల యనదయై దురపిల్లెఁ, దల్లడిల్లి పిఱికితనము పఱచె
ముచ్చుముడిఁగెఁ బొగరు చచ్చెఁ గామాదులు, గాంధి దురితతిమిరఖరకరుండు. 332

ఆ. విశ్వమెల్లఁ దనకు వినతమై కైమోడ్పు, నవనికెల్ల లెంకయయ్యె గాంధి
యతఁడు తనదుబట్ట నుతుకుట యబ్రమా, పరపురీష మెత్తు పని వరింప. 333

గీ. బాపుగాఁ గర్మయోగంబు రూపుదాల్చె, భక్తి విడరానిచుట్టమై పరఁగె దాని
కెఱుక చెలియయ్యె నయ్యోగి నరసి మనుట, ధరణిఁగల సర్వపుణ్యతీర్థములఁ గనుట. 334

ఆ. చేసిచెప్పెఁగాని చేయక యొరుల కే, మంచిపనియు గాంధి మప్పలేదు
మలమునెత్తెఁ గలిమివలదనెఁ జెఱకేగె, నుపవసించె జాతి కుసుఱులిచ్చె. 335

క. వేసట గానక జాతి, శ్రీ సంపాదనము కొఱకుఁ జిరతరతపమున్
జేసినగాంధిని మఱచిన, దోసం బీదేశమునకు దూరంబగుతన్! 336

గీ. కల్ల కపట మెఱుంగనికన్నె యగుట, బాల యొక్కతె మందారమాల వైచి
వినత యయ్యె బాపూశిలావిగ్రహమున, కాయురారోగ్యములు దీని కబ్బుఁ గాక! 337



క. ఎక్కట్లు నరుని దిద్దెదు, చక్కట్లు తెనుంగులెంక శారదజడలోఁ
జెక్కినవిరు లివి కమ్మన, మిక్కిల నాచంద్రకమలమిత్రం బలరున్! 338

# మనవి

భగవంతునియెడఁ గల ప్రేమమే భక్తి యని పెద్దలందురు. రామభక్తి సంపన్నులలో హనుమంతుఁ డగ్రగణ్యుఁడు ఆయన మనుగడ భక్తియోగమున కుదాహృది. అనేక మతముల వారు హనుమ నాదరింతురు, సేవింతురు.

నేఁడాంధ్రదేశమున భక్తిప్రచారమునకై పెక్కు సమాజములేర్పడి సభలు సాగించుచున్నవి. అవి నిర్వహించు ప్రార్ధనాసమావేశములలో 'హనుమాన్ చాలీసా' గానము విడువరాని కృత్యము ఇట్లుండ "హరేరామ జపయజ్ఞ సమాజము" (కారంచేడు) వారి వార్షికోత్సవ సభలలోఁ బలుమాఱు పాల్గొన్న నాకు 'ఈ చాలీసా తెలుఁగునకు వచ్చుచోఁ దెలుఁగువారికి మిగుల నుపకరించునుగదా యన్నతలం పొకసభలోఁ గల్గినది. వెంటనే 1975 ఆగష్టులో శ్రీ తులసీదాసుగారి యీ రచనను నా శక్తికిఁ దగినట్లు పద్యములలో వ్రాసితిని.

తరువాత ఈ తెనిఁగింపు పాట కనువుగా నుంట లెస్స యని తోఁచి 1976 జూన్‌లో చాలీసా నడకలో గేయములు కూర్చితిని.

పద్యములలో అటనట సందర్భానుకూల భావములు కొన్ని చేర్చితిని. ఎల్లగేయములను సర్వపద్యములను మధ్యమపురుషమునకుఁ దెచ్చితిని. మూలమునం దీనియమము కన్పింపదు (చూ 25, 26, 28, 34, 35, 36, 38, 39, 40).

మఱియు 5, 27, 33, 34, 40 చౌపాయిలలోఁ గల అన్వయ క్లిష్టతను సడలించితిని.

ఈ చేతంలో సుప్రసిద్ధ హిందీపండితులు సజ్జనచూడామణులు శ్రీ వద్దిపర్తి చలపతిరావు గారు, శ్రీ చర్ల జనార్దనస్వామిగారు, శ్రీ చాపరాల సీతారామదాసుగారును నా కొనరించిన మేలు మఱవఁజాలను.

గ్రంథాదిని గల 'శ్రీగురుచరణ' అను 'దోహ' చాలీసాలోనిది కాదు. అది తులసీ రామాయణమున అయోధ్యాకాండము మొదట నున్న ప్రార్థన పద్యము. హనుమంతునకు రాముఁ డారాధ్యుడు. కాన ఆ రామస్తుతి నెవరో యీ చాలీసాముందు చేర్చిరి ఈ చేర్పును హనుమద్భక్తు లెల్లరు తలఁదాల్చిరి. మంచిపనికి సేగి రాదుకదా!

తుమ్మల సీతారామమూర్తి

1-3-1978

# కానుక

తిక్కయజ్వ జనించిన యిక్క యనుచు, దేశభక్తుఁడు నెలకొన్న తిన్నె యనుచు
శారదాదేవి కొలువుండు సౌధ మనుచు, గారవించితి నిన్నాళ్ళు గర్తపురిని.

ప్రాయ మరుగ నరుగ రామనామక్షేత్ర, మెసఁగు పుణ్యభూమి యిది యటంచు
గొప్పతనము నిత్తు గుంటూరి కీనాఁడు, తేటితేటి బస్సు దిగినయంత.

ఎదఁద నలఁచువ్రేఁగు సదలుఁ, బొరింబొరి, ముసరి కలఁచు తమము ముడుఁగఁబాఱ
రాపులెల్లఁ దొలఁగు రామనామక్షేత్ర, దర్శనమున భవవిమర్శనమున.

నవభక్తిమార్గముల జగ, దవనప్రియు రాము నభవు నచ్యుతు రేయుం
బవ లిటఁ గొల్చుటఁ గాంచిన, నెవనికి నంతర్ముఖత్వ మేర్పడకుండున్?

అంగనా గాఢతరపరిష్వంగ జనిత, సౌఖ్యమె పుమర్థ మనువారు, చావె ముక్తి
యనెడువారు, దేహమె యాత్మ యనెడివారు, మూఁగవోవరె యీక్షేత్రమునకు వచ్చి.

అఖిలభారతోర్వి కారాధ్యమై జగ, ద్గురులమెప్పు లందుకొన్న తీర్థ
మిది రచించుఁ దిరుమలేంద్రుండు, మల్లన్న, తెలుఁగుభారతంబు నిలుచుదనుక.

సుజనులెందఱెందఱొ దీనిస్పృజనకై క, ఠోరమగు తప మొనరించినారు గాని
యెన్నవలె మున్ను వీరిలో శ్రీశభక్తి, హత సమస్తాఘ సముదాయ నాంజనేయు.

ఏ దెనిమిదేండ్ల వయసునందే యితండు, వలచెనటె! రామభక్తిని; వలచుఁగాక
విడువ కెట్లుండెఁ దనకుడియెడమలందు, గుబ్బవెట్టెడిజగముఁ గన్గొనుచు వినుచు.

తనువుతో నెవండు తనరామకోటి న, ర్పించె భద్రగిరి వసించుదొరకుఁ
బిచ్చియాఖ్యఁ దతఁడు పిత యొౌట నితఁ డిట్టి, బ్రదుకు వడసె మోహపటలినెడసె.

ఆర్తసేవలేని హరిసేవ రిత్త, ని, ష్కామయోగనిష్ఠ కరఁచు వేల్పు,
నాదరింపవలయు నపరిగ్రహం; బన్న, సత్య మెఱిఁగినట్టి సాధు వితఁడు.

మచ్చు మసర లేనిమానిసి యగుట నీ, యన్న తలఁపు లప్పుడపుడె పండు
వేఁడివేఁడి ప్రజలు వేలువే లంపఁగా, నితఁడు తీర్చిదిద్దు నీ యయోధ్య.

రామసేవ నితఁడు సామీరి; కాన నీ, యాంజనేయునకు మ దాంజనేయ
కవిత నిదెదఁ గాన్కఁగా; రాగమన్వయుఁ, డీ కృతిన్ బరిగ్రహించుఁగాక!



'హనుమాన్ చాలీసా' కృతిస్వీకర్త

**శ్రీ రాగం ఆంజనేయులు**

# హనుమాన్ చాలీసా

## గురుస్తుతి

శ్రీగురుచరణాంబుజ రజమున నా, చిత్తపుటద్దము దుడిచి
బాగులెల్లనిడు రామునియశమును, బాడెద నన్యము విడిచి.

## కృత్యాది

తెలివిలేమి నీ తను వచ్చినదని, తెలిసి మారుతిన్ దలంతున్
వెలగల బుద్ధిని విద్య నితం డిడ, వికార బాధల గెలుతున్.

## హనుమాన్ చాలీసా

జయ! జయ! హనుమా! జ్ఞాన గుణాకర!, జయ! కపిప్రభూ! లోక విభాకర!
రామదూత! నిర్భర బలధామా!, సామీరీ! జనరంజకనామా!
వజ్రకాయ! విక్రమ వీరస్తుత!, వైరినాశనా! సాధు లోకహిత!
కుసుంభ రుచి భాసుర శుభరూపా!, కుందలి కుంచితకేశ కలాపా!
పవికేతన రేఖాంచిత హస్తా!, బ్రహ్మసూత్రయుత భుజతలశస్తా!
హర వీర్యోదిత! కేసరిపుత్రా!, గురు తేజోనిధి! బుధనుతి పాత్రా!
ధీమన్మణి! గుణి! చతురవతంసా!, రామకార్య నిర్వహణాశంసా!
హృద్యరఘూత్తమ గాథా శ్రవణా!, హృద్గత సీతారామలక్ష్మణా!
కంటివి సీతాసతి నలంతివై, కాల్చితివా లంకను వలంతివై
భీమ రూపమున నసురులఁ జెఱచితి, రాముని పనిలో నిడుములు మఱచితి
సౌమిత్రిని మందున బ్రదికించితి, రాముఁడు కౌఁగిట నిడఁ బులకించితి
భరతున కెన యగు తమ్ముఁడ వీవని, ప్రశంసించె నిను రాముఁడు పావని!
గాటముగా నీ కీర్తిని మెచ్చుచుఁ, గౌఁగిలించె రాముఁడు నినుఁ గ్రుచ్చుచు
నలువ సరస్వతి ఫణిపతి మౌనులు, నారద ఋషి సనకాది జ్ఞానులు
శమనముఖ్య దిక్పతులు కవీంద్రులు, చాలరు నిను మెచ్చఁగ బుధచంద్రులు
నీ సాయముచే రాముని చెలియై, నేత యయ్యె సుగ్రీవుఁడు బలియై
విశ్వమెఱుఁగు నీ యుపదేశము విని, విభీషణుఁడు లంక నేలినాఁ డని
రవి నొక పండని నీవు పట్టఁగా భువనము లదరెను భీతి పుట్టఁగా

నోట నుంగ్ర మిడుకొని హనుమంతా!, దాఁటితి వంబుధి నిదియొక వింతా!
అలవిగానిపని యైనను నీ దయ, సులభం బగును గదా! మహితోదయ!
నీవు రాము వాకిలి గాతువు, నిను, నేవాఁ డెదిరిచి లోపలికిం జను
సుఖము లెల్ల నీ యా్శ్రితులకు నగు, స్రుక్కు లెల్ల నీ ప్రాపున నెడతెగు
నీ తేజఃపఁగ నీకే చెల్లును, నీ కేకకు జగములు కంపిల్లును
మహావీర! నీ పేరు చెప్పఁగా, మైల దయ్యు మది కూలుఁకుప్పగా
వీరవర్య! నీ జపమునఁ దొలఁగును, వెతలు; సర్వరోగంబులు మలఁగును
త్రికరణ శుద్ధిగ నినుఁ గొల్చెడి యెడ, దీనత్వమునకుఁ గలదా! నిలుకడ
నృపమౌళి మహాతపస్వి రఘుపతి, నీ వా దొరవని దీర్చెద వళిరతి
పాత్రుఁడు ని న్నెది కోరిన నిత్తువు, భక్తుని బ్రదుకును పంటకుఁ దెత్తువు
కలదు నీ కడిమి నాల్గు యుగంబుల, నలముకొన్న దది యెల్ల జగంబుల
సాధు రక్షకుఁడ వని పేర్గాంటివి, దుష్టులఁ దునిమి ప్రభువు కృపఁ గంటివి
సీత వరముచే భవదాసక్తుల, సిద్ధులు నిధు లిడి తనిపెదు భక్తుల
నీ కడ రామరసాయనమున్నది, శ్రీ కౌసల్యాసుతు దయఁ గన్నది
నీ భజనము శ్రీరామున కించును, నిఖిల భవార్తుల నది మఱపించును
అరిగి రామనగరికి నీ భక్తుఁడు, హరి భక్తుఁడునై యగునట ముక్తుఁడు
ఇతర దేవతల విడి నిను నిచ్చలు, నుతించువారల కిచ్చెద విచ్చలు
నిన్నుఁ దలంచిన వారికి బెడఁదలు, నిలువవు, కలఁగవు వారల యెదఁదలు
నా గురుండవు జితేంద్రియ! నీవే, నను దయతోఁ గని జ్ఞానము నీవే
శతవారము లిది చదివిన వారికి, సమయు బంధములు తీరును కోరికి
ఎవఁడీ నలువది యెంచి పఠించును, శివు సాక్షిగ వాఁ డెలమి గడించును
నిత్యము నే నీ రాముని గొల్చెద, నిల్వు మీవు రామునితో నా యెద

## మంగళాచరణము

శ్రీమదాంజనేయా! సంకటహార, శ్రేయో మంజుల రూప!
రామలక్ష్మణులతో సీతమతో, నామది నిలు సుర భూపా!

# పద్యము

సంస్తుతి గురుపదాబ్జరజము గుప్పి మన్మానస, దర్పణమ్ము దుడిచి ధర్మ విత్త
కామ మోక్షములను గరుణించు రాఘవు, నిగ్గుదేఱుకీర్తి నుగ్గడింతు.

కృత్యాది ఏను బుద్ధిలేమి నీమేనఁ బడియుంట, యెఱిఁగినాఁడ హనుమ నెంతు నిఁకను
బుద్ధి బలము విద్య పొసఁగించి యితఁడు న, న్నలఁచు వికృతి బాధ లణఁచుగాఁక

క. జయ జయ హనుమద్దేవా!, జయ జయ జ్ఞానాది సుగుణసంపజ్జలధీ!
జయ జయ త్రిజగద్దీపక!, జయ జయ కపిలోకనాథ! జయ జయ సుకృతీ! 1

గీ. అంజనాపుత్ర! పవనాత్మజా! జగాన, లేఁదు నీవంటి బలశాలి లేఁదు లేఁదు
నిరుపమంబగు నోజస్సు నీది కాన, ఖ్యాతి గంటివి శ్రీరామదూత వగుచు 2

ఆ. వీరమౌళి వీవు విక్రమనిధి వీవు, వజ్రకాయ మున్న వలఁతి వీవు
దుష్టమతిని ద్రోయుదువు నీవు, సద్బుద్ధి, నొప్పువారిఁ గూడి యుందు వీవు 3

గీ. జాళువావన్నెగల మేను శ్రవణయుగళి, గునిసియాడెడి రత్నాల కుండలములు
బద్ధకేశకలాప మబ్రంబుగూర్చు, వేషము కదయ్య! నీది పవిత్ర చరిత! 4

ఆ. తనరు వజ్రరేఖ ధ్వజరేఖ నీమహా, పురుషతన్ వెలార్పఁ గరమునందు;
తళుకు లీను ముంజదర్భజందెము భుజా, స్థలిని బ్రహ్మతేజ మొలసి బలియ. 5

గీ. శంకరాంశమ వీవు కేసరికిఁ గూర్చు, తనయుఁడవు నీవు తేజః ప్రతాపములకు
నిక్క వీవు నీ ముందఱ నెల్ల జగతి, మస్తకమువంచు భక్తి సమగ్ర మగుచు. 6

ఆ. సూరి వీవు సకలసుగుణాల గని వీవు, నేర్పులెల్ల లెస్స నేర్చి తీవు
రామ సేవకై విరామమ్ము గోరక, యెదురుచూచువాఁడ వీవు హనుమ! 7

గీ. రామకథలోని రుచి గన్న రసికలోక, చక్రవర్తివి నీవు కౌసల్యకొడుకు
మిథిలరాజుకొమార్త, సుమిత్ర పట్టి, నీమదిన్ గాఁపురింతురు నిచ్చ హనుమ! 8

ఆ. అమ్మ జానకమ్మ కత్యల్పరూపానఁ, గానఁబడితి వీవు, దానవేంద్రు
మనికిపట్టు లంక మసిచేసి తీవు వ, క్రాకృతిన్ ధరించి యగ్గలించి 9

గీ. భీకరాకృతివై సాధులోకమునకుఁ, జేటుగూర్చు రాకాసులఁ జెండి తీవు
స్వామికార్యము సాధించి రాముకరుణ, పడయఁగల్గితి వీవు ధన్యుఁడవు హనుమ! 10

గీ. తివిరి సంజీవనౌషధి దెచ్చి మూర్ఛఁ, బడిన లక్ష్మణు బ్రదికింపఁ బ్రభుఁడు నిన్నుఁ
గౌఁగిలించెఁగదయ్య వక్షమున నొత్తి, యెందఱకు దక్కె నీభాగ్య మిద్ధచరిత! 11

గీ. పావనీ! నాకు నీవు మా భరతువంటి, సోదరుఁడ వని రాముఁ డత్యాదరమున
నిన్నుఁ గొనియాడెనట్టె! నీపున్నెమునకు, మేర లేదు కదా మహావీరతిలక! 12

క. వేనోళ్ళ నీయశమ్మును, గానంబొనరించె నిన్నుఁ గౌఁగిటఁ జేర్చెన్
జానకినాథుఁ డయారే!, తా నెంతగ నలరెనో కదా! నీ సేవన్ 13

గీ. సనక ముఖ్య దేవర్షులు జలజభవ ము, ఖామరులు మునిమూర్ధన్యు లజునిరాణి
నారదుఁడు ఫణిరాజు నీ పేరు పెంపు, వినుతిసేయంగ నసమర్థు లనుట నిజము 14

ఆ. రాము మెప్పు గన్న నీ మహిమన్ దెల్ప, నింద్ర యమ కుబేరు లెంతవారు?
కవులకేని గుండె కలదా? మనీషుల, నేర్మియైన నిందు నిలువఁగలదె? 15

క. నీ వుపకార ప్రియుఁడవు, కావున సుగ్రీవు రాముగాదిలిమిత్రుం
గావించి కీశరాజ్య, శ్రీవిభుఁ జేసితివి నీకు జేజేల్ హనుమా! 16

ఆ. లోకమెల్ల నెఱుఁగు నీ కనుకూలుఁడై, నీహితోక్తిపట్ల నెమ్మి చూపి
రాము నాశ్రయించి రాజై విభీషణుఁ, డసురరాజ్య మేలె నన్నమాట. 17

గీ. పం డని తలంచి పసినాఁడె రెండువేల, యామడలదవ్వునం గల యరుణకిరణు
లీలగాఁ బట్టితివి మేల్! బళీ! యటంచు, సురలు దైత్యులు నరులు నబ్బురపడంగ. 18

గీ. రామనామాక్షరంబుల రమ్యమైన, యుంగరము నోట నిడి శతయోజనముల
మేరగల వారినిధిని సమీరపుత్ర!, యావు దాఁటుటలో వింత యేమికలదు? 19

క. లోకమున దుర్లభం బగు, నేకార్యంబైన సులభమే యగునుగదా
నీ కొలువున రాణించిన, నీ కరుణం గనిన భక్తనికరంబునకున్. 20

క. శ్రీరామప్రభు భవన, ద్వారమ్మును గాచుహక్కు దక్కెను నీకున్,
ఏరేని లోనికిం జన, లేరుకదా నీ యనుజ్ఞ లేక కపీంద్రా! 21

ఆ. నిన్ను శరణువేఁడ నిఖిలసుఖంబులు, దక్కఁగలవు నీవు త్రాత వైన
నొరులవలన భీతి యుండదు ప్రాణికి, నంజనాకుమార! యఘవిదూర! 22

ఆ. నీవుగా కెవండు నీ తేజము నణంపఁ, గలఁడు హనుమ! ముజ్జగమ్ము నీదు
కేక విన్న మాత్ర నాకులమై వడ, వడ వడంకు డిల్లవడును జెడును. 23

క. భూత ప్రేత పిశాచ, వ్రాతము నీ పేరు చెవికి వచ్చిన యంతన్
భీతంబై పరుగెత్తును, జోతలు వీరాగ్రగణ్య! జోతలు నీకున్. 24

ఆ. నిను సదా జపించు మనుజుల రోగంబు, లెల్ల నడఁగుఁ బీడలెల్లఁ దొలఁగు
నగ్గపడును వీరహనుమంత! నీభక్త, కోటికెడఁదఁ బుట్టుకోర్కులెల్ల. 25

గీ. మానసముతోడ నుడితోడ మేనితోడ, నిన్నుఁ దలపోయువానికి నీవు సుప్ర
సన్నుఁడయ్యెద వాతని సంకటములఁ, దూల్తు వాశ్రితకల్పకద్రుమమ వీవు. 26

ఆ. రాముఁ డఖిలరాజరత్నము తాపసా, గ్రణి యనం బ్రసిద్ధిగన్న సుకృతి
సంతతంబు నీవు సాగింతు వమ్మహా, పురుషపనులు పరమపుణ్యదములు. 27

ఆ. నమ్మి నిన్నుఁ గొల్చునరునకుఁగల తలం, పేది యైనఁ దీర్తు వీవు కరఁగి
పవనతనయ! నీదు భక్తునిబ్రదు కెందుఁ, గనిన సార్థకమ్ముగాఁ దనర్చు. 28

ఆ. నిన్న నేఁడు గాదు నీదుప్రతాపంబు, కలదయా చతుర్యుగాలయందు
జగము దీనికతన జం కెఱుంగనిదై స, ముజ్జ్వలించె వెతల నుత్తరించె. 29

ఆ. ఈవు సాధుమానవావనదీక్షలో, నవధిలేని కీర్తి నందఁగంటి
వసురసమితి బింక మణఁచి రాముని ప్రేమ, నాహరించుకొంటి వాంజనేయ! 30

ఆ. సీత నిన్ను మెచ్చి సిద్ధు లెన్మిదియును, నిధులు తొమ్మిదియును నీవు భక్త
వరుల కొసఁగఁ జాలు వర మిచ్చెనట! ధన్యతరము నీదు జీవితము హరీశ! 31

క. నీయొద్దఁ గలదు రామర, సాయన మమృతంబు నిచ్చునౌషధ మనఘా!
పాయని శ్రద్ధను సీతా, నాయకు సేవించి పడసినాఁడవు దీనిన్. 32

గీ. ఏము నీ సేవసల్పుట రామునకు న, పారమగుతుష్టి గూర్చు, మా బహుభవార్తి
భరము నది మఱపించుఁ, బాపములు మమ్ముఁ!, దఱియఁగా బెగ్గడిల్లు నద్దాన హనుమ!

ఆ. నిను భజించునాతనికి రామభక్తున, కీఱతాఱ యించుకేని లేదు:
చేరు నతఁడు తుదికి శ్రీరామపురి, హరి, భక్తుఁడై ప్రసిద్ధి పడయు నచట. 34

ఆ. నియత బుద్ధితోడ నిన్నే మనమ్మున, నిలిపి కొలుచువారు నిఖిలసుఖము
లనుభవింత్రు యుష్మదనుకంపకతన; నీ, యాశ్రయంబు దుర్దశాపహంబు. 35

క. బలమునఁ దేజమునన్ దయ, నలఘుండవు నీవు, నిన్ను నర్థిన్ దలఁపన్
దొలఁగును సంకటపాటులు, మలఁగును గ్లేశంబులెల్ల మారుతపుత్రా! 36

ఆ. నాగురుండ వీవు నను దయం జూచి నా, కెఱుక నీఁగదే జితేంద్రియా! న
మస్కరింతు నీకు మరుదాత్మజా! జయ!, జయ! కపీశ! రామచంద్రదాస! 37

ఆ. నిష్కళంకశీల! నిన్నుఁ గీర్తించిన, పద్యములను నాల్గుపదుల నెవఁడు
నూఱుమార్లు చదువునో వానిబంధముల్, తెగును, వాని కబ్బు దివ్య సుఖము. 38

క. హనుమాన్ చాలీసా యనఁ, జనునీకైవార మర్థిఁ జదివినవారల్
కనెద రుమాపతి సాక్షిగ, ననవద్యం బైనసిద్ధి నాశ్రితవరదా! 39

గీ. నాథ! యీతులసీదా సనారతముగ, రాముని భజించుఁ; బ్రాణ మాస్వామి నీకు;
నగుట రామునితో మదీయాంతరంగ, భవనమున నిల్పుమా నీవు పవలు రేయి. 40

## మంగళాచరణము

క. పవనతనయ! దుఃఖభంజన! మంగళా, కార! నీవు జానకమ్మతోడ
రామచంద్రుతోడ సౌమిత్రితో సక, లామరాళితో మదాత్మ నిలుమ!



'సందేశసప్తశతి' కృతిస్వీకర్త

శ్రీ వట్టికూటి వేంకట సుబ్బయ్య



'తెనుఁగులెంక'

శ్రీ తుమ్మల సీతారామమూర్తి

# మొగమాట

పద్యాంతర నిరపేక్షములు ముక్తకములు. వీనికి నాయిడిన తెనుఁగుపేరు "ఎక్కట్లు".

1976లో 338 ఎక్కట్లను ఈపేరనే వెలువరించితిని. పదంపడి వ్రాసిన వీయెక్కట్లు. స్రవంతి మున్నగు పత్రికలవా రీపద్యములు పెక్కింటిని ప్రకటించిరి. వీరి సౌజన్యము మఱవరానిది.

ఆయామహాత్ముల సూక్తుల ననుకరించియు, అనువదించియు సంతరించిన పద్యము లీ సప్తశతిలో కొన్ని కలవు. ఆ యయ్యలకు నా యేటికోళ్లు. ఇందలి హరి హర శివ రామ నారాయణాదిపదములు పరమేశ్వరార్థముననే ప్రయుక్తములు. పెక్కు సంస్కృతశబ్దములకుం బలె "సందేశ" శబ్దమునకును అర్థపరిణామ మేర్పడినది. కాన "హితవాక్కు" అను నర్థమున దీని నీరచనలో వాడితిని.

ముద్రణవ్యయము దుర్భరముగా నున్న యీకాలమునం దీకృతిని వెలువరించుట కెనలేని సాయముగా నాకు రెండువేల రూపాయలొసఁగిన "ఆంధ్ర ప్రదేశ సాహిత్య అకాడమీ" వారికి నా కృతజ్ఞతాపూర్వక నమస్కారములు చెల్లింతును. సర్వోదయప్రింటర్సు కార్యకర్త శ్రీ ఎ. వీరబ్రహ్మముగారు నాపాలి వేసట యెంతో సయిఁచి గ్రంథమున కందచందములు చేకూర్చిరి. వీరి విజయము సర్వదా వలతు.

తుమ్మల సీతారామమూర్తి

15-7-1981

# మన్నన

ఉ. ఏ నతఁ డెవ్వఁడో యెఱుఁగ నిద్దఱ మేపనులో కదల్చుటన్
బైనమొనర్చుచుంటి మొకబస్సున; నాకెలనన్ దనర్చు న
మ్మానిసి యెండవానలకు మాల్గని కేవలహాలికుండుగాఁ
గానఁబడున్ గడున్ బెదరు గారవ మార నతండు నన్గనున్. 1

ఉ. వచ్చినరాష్ట్ర మన్నలు! వివాదములన్బడ కేలుకొందు, యు
ష్మచ్చరితంబు నన్యులు మజా! యన దిద్దుకొనుం, దటంచు వా
క్రుచ్చినవాఁడ నేనపుడు క్రొందెలుఁగు న్నుడికారపు న్నెఱా
గచ్చులకొల్వుగా నుదయగానము ధర్మరమానిధానమున్. 2

చ. తన కకపాలనుండి తనదగ్గఱనిల్చిన పాంథుఁ డాతఁ డొ
య్యన వెడలించి దీని నదియా యిదియా యని కొన్నిపత్రముల్
కనికని మీకవిత్వ మిది కమ్మని తెల్గులు సందడింప సా
గినది "యలంతి" యన్ననుడికిన్ గలయర్థ మెఱుంగఁజెప్పరే! 3

చ. అనవుడు నేమియే మలంతియన్నది యొక్కఁడు తక్క నీకుఁ ద
క్కిననుడులెల్లఁ దెల్లములె! క్లేశములోర్చి యెటన్ గడించి తీ
పెనుపు, భవద్విదగ్ధతను బెద్దయుమెచ్చెద నూఱుకాలముల్
మను మని చల్లనల్ గురియుమాటల నాతని కెగ్గచేసితిన్. 4

చ. అలుగక నమ్రతన్ విడువ కాతఁ డభంగపయోధికైవడిన్
నిలిచి మహాకవీ! చదువునేర్చినవాఁడనుగాను రే పగల్
నలఁగెడి సేద్యకాఁడఁ బ్రజలన్ సవరింపఁగ మిమ్ముబోంటి పె
ద్దలు రచియించు మేలికవితల్ పఠియింతు గ్రహింతు సారమున్. 5

ఉ. కట్టిఁడిమాసి జాతిపిత గాంధిని జంపిననాఁడు పల్లియల్
పట్టణముల్ విషాదమున పట్టుగ దీల్పడునాఁడు మీరు మీ
వెట్టనుజాటఁ బల్కిన కవిత్వము నన్నొకమంచిబాటకున్
బిట్టు మరల్చె నిట్లు పెదపిన్నల నెందఱఁ జక్కదిద్దెనో! 6

మధ్యాక్కర
అది "అమరజ్యోతి" నా వెలువడిన యమలకావ్యంబు
ప్రిదిలినయట్టలన్ నలఁగివన్నెదప్పిన పత్త్రములను
మొదవులచావడిముందు మెల్మెల్ల మొనయుగాద్దునకుఁ
గదలుచు నొకరేపు తోఁచె నాకు దుగ్ధముదీయఁబోవ. 7

గీ. లేదులేదు ననుం గదలింపనట్టి, పద్య మొకఁడేని నయ్యనవద్యసృష్టి
నదిర! "క్రుళ్లినయెముకకై" యనెడిసీస, మన్నిటను మిన్నయనెద నాయనుభవమున. 8

సీ. "క్రుళ్లినయెముకకై కుక్కగుంపులుపోలె, నధికారమునకుఁ గొరాడువారి
లంచాలగడ్డి కాసించి సేవాధర్మ, నియమముల్ బలి సేయనేర్చువారి
కుహనావటీజ్యోపగూహనోద్రిక్తులై, సుధఁబోలెఁ బ్రజనెత్తు జుఱ్ఱువారి
పరమతద్వేషాగ్ని మరగి నారీవృద్ధ, శిశుమండలిని జీల్చిచెండువారి
గీ. దేశహితకృత్యముల పేరఁ దెచ్చునర్థ, మాత్మబంధువులకుఁ బంచునట్టివారి
బ్రతుకుఁ గనలేక కన్నుమూసితివి గాని, కలఁదె నీగుండెపైఁ బ్రేల్పఁ గలమగండు". 9

ఉ. మోహవలాహకప్రతతి మూఁగినదెందముతో రజోగుణ
స్నేహముతో నహంకృతివిశీలచరిత్రముతో దయార్ద్ర వా
ద్రోహసమీహలేక యకుతోభయతన్ దిరుగాడునన్ను మీ
వ్యాహృతి లెస్సదిద్దెనని వంచెద నౌదల మీ మొగమ్మునన్. 10

ఉ. కర్మఫలేచ్ఛలేని గుణగణ్యుఁడు *వెంపటియింటిపంట సా
ధర్మతియోగిసత్తమునిభక్తుఁడు యుక్తవినోపధప్రియుం
దర్మిలి నాచరించుపను లందఱ మేలువరించుకార్యముల్
నేర్మికి సూత్రపద్ధసరణిన్ బచరించెదనేఁడు మీకృపన్. 11

ఉ. దొప్పలపూఁడియందు నిలుతున్ నను వేంకటసుబ్బయాఖ్యతోఁ
జెప్పుజనమ్ము నా కెదురుసెప్పుటకొల్లని యాలుబిడ్డలన్
జొప్పడినారు లేమివెత సోఁకనిగేస్తుఁడ వట్టికూటి నా
నొప్పుగృహాఖ్య నాది తమ రొజ్జలు శిష్యుఁడ నేను సత్కవీ! 12

ఉ. సుబ్బయపల్కు లిట్లు చెవిసోఁకినయంతన మన్మనమ్మునం
దబ్బురపాటు పైకొనె నహంతకు నిల్కడపోయె గాటమై
సుబ్బెనులజ్జ యశ్రువులు సోనలుగా వెడలెన్ క్షమింపు మీ
గబ్బి నటంచు వాని సముఖమ్మున వేదన వెల్వరించితిన్. 13

* డాక్టరు వెంపటి సూర్యనారాయణగారు.

చ. తలఁపిడి యేను నేర్చుకొనఁదగ్గ గుణమ్ములు పెక్కు నీకడన్
గలవు మదాప్తమిత్రుఁడవుగా ననుమోదమొనర్పు మెన్నియో
పలికితి నీతు లొక్కటియుఁ బట్టదు నాకుఁ; గవిత్వమందువా
చిలుకవెదల్చుపల్కు నుతిసేయకు న న్నని వక్కణించితిన్. 14

ఉ. ఆపయనం బిటుల్ మధురమై నను సుబ్బయ మిత్రుఁ జేయుటన్,
నాపనులాఁపి యాతనిఁగనన్ బయనించెద నప్పుడప్పు; డీ
కాఁపునుగంట యోగివరుఁగంట విపన్నసమాజసేవకై
బాపుతలంచినట్టి గుణభద్రునిగంట యగున్ మదాత్మకున్. 15

సీ. ఒకనాఁడు నడివీధి నూడ్చుచున్ గనిపించు, మునుకొన్నదుమ్ములో మునిఁగి మునిఁగి
ఒకనాఁడు గుంటదీయుచుఁ గనిపించు గు, టుక్కని క్రుళ్లినకుక్కఁ బూడ్చ
ఒకనాఁడు గొడ్డటినొడ్డుచున్ గనిపించుఁ, ద్రోవఁ గ్రమ్మిన రేఁగు దుడు కడంప
ఒకనాఁడు చిఱుపాఱ నుఱుకుచున్ గనిపించు, గుడిచెంతఁగల పెంటకుప్ప లెత్త
గీ. మోయలేని ఖాదీవల్వమూటతోడ, నూరువిడుచుచుఁ గనిపించు నొక్కనాఁడు
పదుగురకు లగ్గుచేకూర్చుపనికిఁ దక్క, సుబ్బయ కడంగఁ డీనాఁడు సొంతపనికి. 16

చ. బ్రతుకిటు చక్కదిద్దుకొను ప్రాజ్ఞుఁడు సుబ్బయతేరుసాగ నం
చితగుణధామ రామతులసీశుభనామ గణేయహేతు; వీ
యతివ మగండొనర్చుపను లౌననిమెచ్చు నితాంతదీక్షమై
నతిథులఁగొల్చుఁ బెన్మిటికినబ్బినమిక్కిలికల్మి నాఁ దగున్. 17

చ. తన వినయాదిసద్గుణవితానము భర్త వితీర్ణి సేవన
ప్రణిహితబుద్ధి సంతతిని బంధుచయమ్మునయందుఁ గాంచుచున్
దనిసెడిభాగ్య మీసతికిఁదక్కెను నన్నపనేనివంశ మీ
పణఁతికి మత్పవిత్రికిని బాదుగనుంటఁ గడున్ దలిర్చెదన్. 18

ఆ. వట్టికూటి నాప్తవరుఁ జూచి యైదాఱు, నెలలు కడచె నాకు నెగసె బెంగ
క్రన్న నరిగి యితనిఁగని యొకనాఁడు నే, నదియు నిదియు నుడువునవసరమున. 19

ఉ. రాఁదగువేళకున్ గనికరంబునవచ్చితి రుత్తమాశయుం
బేదియు రిత్తవోవదని యాతఁడు పొంగుచుఁబల్కె దానిగు
ట్టేఁ దెలియంగలేక కథయేమన సుబ్బయ గాంధిపర్వమౌఁ
గాదెకవీంద్ర! యెల్లియనఁగందితి నేనది విస్మరించుటన్. 20

మధ్యాక్కర :
కర్తవ్యనిష్ఠయం దితని మున్ముందుగాఁ జెప్పవలయు
స్మర్తవ్యులన్ దేశముక్తికై స్రుక్కిచన్న యన్నలను
గుర్తుంచుకొని వారిగుణములవలపు కొంతయంటినను
హర్తయౌ నది పాపరాశి కని సుబ్బయాఖ్యుఁ దూహించు. 21

శా. తానై విత్తము లెస్సగానొసఁగి విద్యాశాలలన్ నిల్పె మి
త్రానీకంబున బంధుబృందమున దానాసక్తి గల్గించి వి
జ్ఞాన శ్రీపరిపుష్టికృద్విధులు విజ్ఞంజేసి యభ్యాగమ
క్షోణిన్ దిద్దెను వట్టికూటి సుజనస్తోమంబు సేబాసనన్. 22

క. కోరినవారికి వండిన, కూరంతయుఁ బెట్టి వట్టికూటిని మును తి
న్నారఁట సుబ్బయపెద్ద; లు, దారత యది యితనిబ్రదుకునం దిటు విరిసెన్. 23

ఉ. సత్య మహింస నిర్భయత చాగము యోగము నేర్పఁజాలు సా
హిత్యము దెచ్చితెచ్చి యితఁ డెందుచు నానుచు విక్రయించి సౌ
హిత్యముగూర్చుఁ గర్తలకు, నీదృశుఁ దూరికినొక్కఁడున్న దౌ
ర్గత్యపుఁదాఁకులేక మనఁగల్గుఁగదా సుకవీంద్రబృందముల్. 24

ఉ. పైనపువెచ్చమున్ గొనక ప్రాజ్ఞులు వీని సమాజసేవ న
క్షీణహర మ్మెతింగిన విశిష్టులు రమ్మని పెట్టు తిండితో
జానపదమ్ములన్ ముదుకసైకిలుపైఁ దిరుగాడి బాపుజీఁ
బోని మహాత్ములన్ మెఱయుపాత్తములుత్తముఁ డీతఁ డమ్మెడిన్. 25

చ. ఒకసభకో వివాహమునకో పొరుగూరికి నేగుచున్నఁ బు
స్తకములసంచి వీడఁడు బజాఱుల దిద్దుటకైన సాధన
ప్రకరము విస్మరింపఁడు నిరంతరసేవయ మేటివిందుగా
సుకములమిన్నగాఁ దలఁచు సుబ్బయ సాధుపథానుయాయియై. 26

ఉ. ఆర్యసమాజధర్మ మిపుడౌనను సుబ్బయ, గోపదేవు నా
చార్యకులావతంసము నచంచల భక్తి భజించు, నాత్మసౌం
దర్యనిదాన వైదికవిధానసుఖమ్ము గడించు, నింద్రియా
నార్యత నార్చు నోర్చును మహత్ర్పణుతాశ్రమమున్ దృతీయమున్. 27

చ. మత మెదియైన సుబ్బయకు మానవసేవ ప్రధానధర్మ, మీ
కృతమతి దీని నించుఁ బరమేశ్వర సేవగఁనెంచు, నార్తునం
దితనికిఁ దోఁచు రాముఁడు రహీము నెహోవయు; నిక్కతమ్మునన్
జతపడె మాకు నెయ్యు; మిది సాగు నిరంతరనూతనద్యుతిన్. 28

ఉ. మన్ననసేఁతకున్ దగినమానిసి వేంకటసుబ్బయాఖ్యుఁ; డీ
మన్నన పెందెరంబిడినమాన్యము లిచ్చినఁ బట్టమిచ్చినన్
బ్రన్నని సేలుగప్పిన సెబా సనిపించుకొనంగఁ జాల; దీ
యన్నయశంబు నిల్పుటకు నంచితమైన కవిత్వమే తగున్. 29

చ. కవిత నొసంగె భక్త హితకారిణి శారద నాకు; లోకగౌ
రవమున కర్హుఁజేయని హిరణ్యము నా మదికిన్ రుచింపమిన్
దవిన చరిత్రమై నలరుధన్యులు మత్కృతిభర్తలైరి యీ
నివహమునందు సుబ్బయను నిల్పెద మేవడిచేఁత సల్పెదన్. 30

చ. మానవతామహాఃపదము మార్టినులూథరుకింగు, శౌచసం
స్థానము లాల్బహద్దరు, వదాన్య శిరోమణి లక్ష్మయార్యుఁ, డె
ర్నేనితపస్వి, వెంపటిమనీషి ముఖ ప్రకట ప్రవృత్తు లౌ
నౌనన వట్టికూటి జననాంచితుఁ జేర్చెద వారికోవకున్. 31

క. రావయ్యా! సర్వోదయ, సేవావ్రతలోల మధురశీల! మదీయం
బీ వాణి నందుకొనుమా!, శ్రీవేంకటసుబ్బయా! వశీకృతహృదయా! 32

ఆ. జంకెదేల యెవఁడు సంపూర్ణమానవుం?, డెవనియందుఁ జూతు వెల్ల గుణము?
లీశ్వరుం డొకండె యిల్లు మేల్మలకెల్ల, నీయకొమ్ము నిక్క మెతిఁగి కృతికి. 33

చ. ఇది సకలార్థ సంకలిత మెల్లమతమ్ములనిగ్గు బాపుజీ
బ్రదిమికిదర్పణం బిహపరప్రమదమ్ములఁగూర్చునొజ్జ కో
విదకవిమాననీయ పదవీ నదవీయసి యైనభాషకున్
సదనము నీవు మానిసికిసల్పిన సేవ కుపాయనం బగున్. 34

మధ్యాక్కర :

ఎందాఁక నర్కేందు లుందు రెందాఁక నెసఁగు సంద్రమ్ము
లందాఁక నంద్రవాగ్దేవికంధర నందాలుచిందు
మందారమాలగా సూక్తులన్ గ్రోల్చు మహతిగా నిల్చి
"సందేశసప్తశతి" యిది సుబ్బయా! జయము నీ కిడుత! 35

* * * * *

# సందేశ సప్తశతి

క. నీవాఁడ నేను నా కిది, కావలె నని నిన్నుఁ గోరఁ గరుణింపుము భ
ద్రావహ మెదియో తన కది, యీ విచ్చినదానఁ *బడతు నీశ్వర! తనివిన్. 1

గీ. ఇచ్చితివి నాకు నరజన్మ, మింతొ యంతొ, యెఱుక నొసఁగితి, నినుఁ గొల్చునిచ్చ నిడితి
వోప్రభూ! యివి చాలవా యొందు కోరు, నేర్పు కలదందువా నీవ నిర్ణయింపు! 2

క. నీవే నేనఁట నేనే, నీవఁట బుధు లిట్లు వక్కణింపఁగ మనలో
నీవియుఁ గైకో లేటికి, దేవా! సంద్రమున కలకుఁ దిరుగుదు కలదా? 3

క. తల్లీ! దయసేయుము నా, యుల్లము నీగద్దె నీకు నుడిగ మొనర్పన్
బె ల్లాసగొన్న లెంకను, జల్లుము నాయెడ భవత్ ప్రసన్నత వాణీ! 4

గీ. గొప్పగొప్పవరమ్ముల కోర నిన్ను, నాయొనర్చినవరివస్య నలిక మగుట
భావతార్చకులందు నన్ బంతిచివర, వానిఁగా నుంచినను దృప్తివడెద నంబ! 5

ఆ. నీవెలందితనము నిల్పెద భారతీ!, యస్మదుక్తి నెఱిఁగినంతవఱకు
మంతుగన్న కవులు మన్నించు త్రోవలు, చూచిచూచి యలఁత లాఁచియాఁచి. 6

క. ఎంతెంత వారలో తమ, యంతస్తులు డిగ్గిడిగ్గి యచ్చపునెనరున్
నింతురు కవిదెస; నీ కృప, యింతకుమూలం బటంచు నెఱుఁగుదు బ్రాహ్మీ! 7

గీ. నేర్చినదిచాలు నీకేల నెగులు దిగులు, వాసిగందువు నీ వాంధ్రవాఙ్మయమున,
విశ్వసింపుము నన్నని •వేంకటప్ప, గురుఁడు పల్కుట నా చెవిన్ మొరయు నెపుడు. 8

ఆ. ఆఁపఁ డెపుడు జపము నంతేవసత్వార, వివరణమ్ము విడఁడు కవిత మానఁ
డింటనున్న దారినేగుచున్నను వేంక, టప్పగురుఁ డనుత్తమావధాని. 9

ఆ. గురునినేర్మి యోర్మి కరుణ కవిత్వమ, హత్త ఋషిత రూపునందె ననఁగ
రాణకెక్కె సుతుఁడు రాఘవనారాయ, ణాహ్వయుఁడు లోక మబ్రపడఁగ. 10

ఆ. సత్యనిష్ఠ శబ్దశాస్త్రమర్మజ్ఞత, కరుణ కల్గి నన్నుఁ గలఁచునిరులఁ
దొలఁగఁద్రోసినట్టి దువ్వూరి వేంకట, రమణరవికి వందనము లొనర్తు. 11

---

* పడచు ధాతువు

• తాడేపల్లి వేంకటప్పయ్యశాస్త్రిగారు

గీ. కాలఘాటికిఁ జెదరని తాలమీఁద, నందచందాల విరఁజిమ్ము నాంధ్రకవిత
నెన్నఁడో నన్నయకుముందె పన్నినట్టి, వలఁతు లజ్ఞాతకవుల కంజలి ఘటింతు. 12

క. నన్నయమదియున్ మాటయు, వెన్నయకద, శైలి సాంధ్యవేళానటదీ
శోన్నత శిరస్సుర ద్ధివి, షన్నదికద మెత్తు నితనిసాధీయస్తన్. 13

ఆ. అతఁడు నితఁడుఁ గాఁదు హరిహరనాథుఁడే, కరముసాఁచె నీదుకైత కలరి,
తెనుఁగుబాస కెంత దీప్తిదెచ్చితి వయా!, తిక్కనార్య! నీకిదే జోహారు. 14

క. జోతలు వెట్టెద ముద్గల, గౌతమగోత్రజులనదుమఁ గదలనికవితా,
సేతువు గట్టిన ధిషణా, జ్యోతికి శ్రీవత్స గోత్రజునకు వినీతిన్. 15

గీ. రాజవై కవిరాజవై రసికు లలర, దేశికవితాపతాకనెత్తితివి; కాశ
భవకథన్ బ్రథమాంధ్రప్రబంధముగ నొ, నర్చి జయలక్ష్మి గంటివి నన్నెచోడ! 16

ఆ. బుద్ధనృపతి ధన్యపూరుషుఁ; డితని రా, మాయణంబుతక్క నన్యకావ్య
మెద్దికలదు విద్యలెఱిఁగిన యెఱుఁగని, తెలుఁగువారి నామతించి తనుప? 17

ఆ. చక్రవర్తి వయ్యు సామాన్యమానవు, బ్రదుకుఁదీరు నెట్లు పలుకఁగంటి!
పలుకునపుడు ప్రౌఢభాషా ప్రయోగంబు, నెట్లుసేయఁగంటి! కృష్ణరాయ! 18

ఆ. అడిగి యడిగి దొరల నర్థమత్తుల సేవ, నడఁగియడఁగి నిష్ఫలార్తి సైచి
కన్నువిచ్చి శివునికడ శాంతికొఱ కార, టించినట్టి ధూర్జటిన్ గణింతు. 19

గీ. జాతి వార్తా చమత్కార సముచితార్థ, గౌరవమ్ముల కిమ్ముగాఁ గవిత పల్కి
పలుకుఁజెలిచెల్వమునకుఁ గ్రొందళుకు లిడిన, చేమకూరకవీ! చిరజీవి వీవు. 20

గీ. మొక్కలులకల్మి నల్లన మెక్కి త్రేఁచు, బదనికల గారడము బదాబదలు సేయ
మెత్తని తెనుఁగు కరకసాకత్తిఁ జేసి, ప్రజలఁ గాచిన వేమన్న ప్రజ్ఞ మెత్తు. 21

ఆ. సత్తు చిత్తటంచుఁ జదువు నేర్వని ప్రజ, నదరఁ గొట్టు మాట లవలఁ బెట్టి
పల్లెపల్కుతోడఁ బరతత్త్వమును జాటి, విశ్వకవిగ నిల్చె వేమయోగి. 22

ఆ. తనకెలంకులందు మనువారి మేల్ గీడు, త్రచ్చి దారిచూపు తాత్త్వికుండు
దీనుపాలి పెద్దదిక్కు వేమన; పేద, పెంపు వీనికృతికి బీజ మదిర! 23

ఆ. దుక్కిదున్నువాని దుబ్బుచెక్కెడివాని, యనుభవమ్ము నుండి యవతరించు
సాటువలకుఁ బెద్దపీఁటవైచి యొయారి, కైతగూర్చె వేమకవివరుండు. 24

ఆ. గడ్డివేయఁ బోట్లగొడ్డు కొమ్మాడించు, నేటివంక దీర్ప నెవరితరము?
పసులవన్నె వేఱు పాలెల్ల నొక్కటి, యన్న కాఁపుకవికి నంజలింతు. 25

క. వేమన్న కరణిఁ దిట్టిన, ధీమాన్యులు కలరె తిట్టుదిన్న తులువయున్
వేమాఱు నవ్వు దీనికి, సామాన్యుల కందరానిచదు రిట్లుండున్. 26

గీ. సాదులకు భుక్తిముక్తు లీఁజాలునుదులఁ, దత్త్వకవిత సృజించి మతంబు కులము
నవ్వలికినెట్టి బ్రహ్మమైనట్టి వీర, గురుని మానవతావాదపరుని మెత్తు. 27

ఆ. మూల్గుచున్నకృతుల ముద్రించె నిర్భర, క్లేశ మోర్చి సల్పెఁ గోశరచన
తెలుఁగువానికంటె వలదుగా నాంధ్రిని, గొలిచెఁ బుణ్యరాశి విలిచె బ్రౌను. 28

ఆ. ఆంధ్రపఠినసూను వగుటయకాక ర, సప్రలబ్ధ హర్ష సంవిధాతృ
క్రమనీతికావ్యకర్తయునై సదా, తనత గన్న చిన్నయను భజింతు. 29

గీ. ప్రాచ్యపాశ్చాత్యసభ్యతా భవ్యమూర్తి, సాహితీపరిశీలకాచార్యమౌళి
వీరతానిధి విద్యాప్రవీణుఁ డెవ్వఁ, డతని రామలింగారెడ్డి నాత్మఁ దలఁతు. 30

ఆ. రాజధానియంద రాణించుకవనమ్ము, పల్లెటూర మెప్పుపడయ దిద్ది;
రుద్దిలేని సేవ కొగ్గి తిర్పతి వేంక, టేశకవులు చవుల నిడిరి నుడికి. 31

క. ఋషి యగుటఁ జేసి వేలురి, ధిషణా వైభవము తత్త్వదీప్తియుఁ బడసెన్
విషయప్రవణ జనాంత, ర్మషీహరణచణ కవిత్వమహముం గురిసెన్. 32

గీ. త్రిపురనేనికవీంద్రు నుతింతుఁ బలుకుఁ, బరువు డింపని భావవిప్లవవిధాత
నితనిసూత పురాణాదు లెసఁగె నార్య, జాతితంత్రచ్ఛటాస్ఫోటహేతు లగుచు. 33

ఆ. నాతెనుంగుజాతి నడతలోఁ బలుకులోఁ, గడిమిలోఁ గడిందిగారవమ్ము
సంతరించుకొన్న జాతిరా యనుకొంటి, రాయప్రోలువారి రచన లరసి. 34

ఆ. విశ్వనాథవారు విశ్రుతులైనారు, పాండితీబలానఁ బ్రతిభయందు
గణుతికెక్కినారు కవితలో; ఋతుకావ్య, మొకటి చాలు దీనియొఱపు దెలుప. 35

గీ. లేదు పాషాణపాకంబు రాదు లక్ష్య, జాతిగవచస్సు కాదు దూరాన్వయంబు
తోఁచు సమకాలిక సమాజ మేచు సమత, వీచుఁ బయ్యెర కాటూరి వినుచు కృతుల. 36

ఆ. పరమగుహ్యమైన బ్రహ్మవిద్యను గద్య, పద్యఁ గాదు పద్యపదవియందు
మెఱసె మిన్నికంటె గురునాథ కవిమౌళి, బెరసె నుద్దిలేని పేర్మి సభల. 37

ఆ. కాలగతి నెఱింగి కమనీయభావనా, వైభవమునఁ దేనెవాఁకవంటి
కైతఁ బఱపి తెల్గుజాతిన్ గరంచిన, జాషువాయశమ్ము శాశ్వతమ్ము. 38

గీ. కపట మెఱుఁగని విద్వదాఖండలుండు, పండితకవీంద్రుఁ డౌదార్యమండితుండు
సరససాహితీ వ్యాఖ్యాతృ చక్రవర్తి, మేలి నుడితీరుపరి వెంపరాలశాస్త్రి. 39

గీ. ఇంతదనుకఁ దెనుంగుల కెఱుకపడని, తనదు హరిహరనాథతత్త్వమ్ము గుట్టు
నిజపురమ్మున గుంటూర నీలకంఠ, శాస్త్రిరూపునఁ దిక్కన్న చక్కఁ దెలిపె. 40

క. ఎదలోఁ గదలినరవమే, మృదువాక్కుల వెలువరింపుమీ సత్యముపై
మది నిల్పుట పేదలకున్, బదికంద్రిక లిడుటకంటెఁ బరిగణ్య మగున్. 41

క. వ్యాపారము వ్యవసాయము, భూపాలన కావ్యరచన బోద్ధృత సంఘో
ద్దీపనమున కంకితమై, యేపుదమిన్ సాగు నమ్మహిన్ సుఖ మెసఁగున్. 42

ఆ. భావదృష్టిలేని పరిత కావృత్తిచే, రొప్పుదప్పఁ దెల్వి యుప్పతిలదు
నమలి తినని మెతుకునన్ జాఠరవ్యథ, గాక భోక్త కెట్లుకలుగు బలిమి? 43

గీ. ముందు నిల్చిన కర్తవ్యమును ముగించి, యూర్పు సారించునతఁడు నరోత్తముండు
నేఁటిపని యేఁటికేనియు నిర్వహింప, కజగరముపోలె బ్రదుకువాఁ డధమజీవి. 44

క. అనవద్యముగా నెవ్వఁడు, తనధర్మము నిర్వహింపఁ దలకొను నతఁడె
వ్యసనికిన్ దగ్గఁడు పదవికి, మనీష కిట నీయరాదు మన్నన లవమున్. 45

ఆ. కార్యకర్మనిష్ఠ గల గృహస్థునికంటె, గొప్పవాఁడు కాఁడు గోఁచికట్టు
మఱుఁగుదొడ్డి నూడ్చు మనెడి పాకీకంటె, మణికిరీటధర్త ఘనుఁడు గాఁడు. 46

గీ. శ్రుతులచేఁ గాదు క్రతువులకతనఁ గాదు, కన్నవారల వేల్పులుగా భజించి
యెఱుకపడసితి ధర్మంపుమఱువు గంటి, నన్నవ్యాధుఁడు గేస్తుల కాదిగురువు. 47

గీ. ఱాలురువ్వినవానిపైఁ బూలుచల్లి, ముండ్లుగ్రుచ్చినచేతిలోఁ బండ్లుపెట్టి
రిపునిలో నిష్టసఖుని దర్శింపనేర్చి, యపహతక్రోధుఁడై నిల్చునతఁడు సుకృతి. 48

ఆ. కూలిపనికి గంటకొలత యుండును గాని, కోరిసేయుపనికి మేరలేదు
తల్లి కెంతతెఱపి దక్కును? గవితా త, పస్వి కెంత తీఱుబడి లభించు? 49

ఆ. ఆలుబిడ్డల కన్నవస్త్రాదు లొసఁగి, ప్రతిఫలంబును గోరనిపగిది గేస్తు
దేశమున కొనరించు సత్క్రియలకేని, మాఱుమే లాసచేయక మనుట లెస్స. 50

ఆ. ఒకఁడు జందెముంట నొకఁడు జందెములేమి, నొకఁడు కులము వర్గ మొప్పుకునికి
నొకఁడు చీమునెత్తు రుండినకతన నే, ర్పాంతయున్న గద్దె కెక్కలేఁడు. 51

ఆ. పీఁటవైచి పేర్మిఁ బిలిచినయప్పుడే, యర్హుఁ డేగుదెంచు నర్హలంద
దేవురింతకతనఁ ద్రిభువనసామ్రాజ్య, మబ్బుఁగాక దాని నాతఁ డుఱఁడు. 52

క. ఒకఁ డొకరు నేఁచుతఱి నది, యకృత్యమని యెఱిఁగి దిట్టయై యుండి యుపే
క్షకుండైనవాఁడు చను హిం, సకుఁజొచ్చిన పాపబుద్ధి చనుదుర్గతికిన్. 53

గీ. ఒరులఁ జంపుటయేకాదు పరులకీడు, కోరుటయు లాఁతివారల దూఱుటయును
హింసయగు; నహింసానిష్ఠుఁ డిది యెఱింగి, బ్రతికినప్పుడె సత్యదేవతను గాంచు. 54

ఆ. చెడ్డతనము నెదిరి చెఱుచుఁగాని యహింస, చెడ్డవాని కెగ్గుసేయఁబోదు
రవినిగన్న తమముపవిది నంతంతన, చెడు నహింసవెల్గు పడినహింస. 55

ఆ. చంపిచచ్చువాఁడు సమరవీరుఁడు, చంపు, నొప్పుకొనక మిత్తి కోహటిలక
వలచి యసువులిచ్చువాఁ డహింసావీరుఁ, డితనిమ్రోల నాతఁ డెంతబిరుదు? 56

ఆ. నరుఁడు నరుని మెక్కినాఁ డొకతఱిఁ, బదం, పడి మృగమ్ము ఖగముఁ బట్టితినియె,
నవల రొట్టెనమలె నతఁడు చంపును రోసి, యింతచేసె నిది యహింసగెలుపె. 57

గీ. కన్నుమనరాదు కదచినకాల మరసి, దీలుపడరాదు రాఁగలకాల మెంచి
యేమఱక వర్తమానంబు నీక్షచేసి, వాంఛితార్థ ముపార్జింపవలయు నరుఁడు. 58

గీ. వచ్చినసుఖమ్ము కష్టమ్ము నిచ్చ నిలవు, గాన నవిముట్టినప్పుడు వేడ్కకును వెతకు
నెతఁడు దవుదవ్వుగా నుండు నతఁడు పదయు, నిక్కమగుశాంతి వాఁడు మనీషిమౌళి. 59

క. యజనాదు లెట్టులున్నను, నిజదారప్రియత శౌచనిరతియు నలుకన్
దృజియించుట కీడెంచమి, నిజమాడుట యెల్లవారు నేర్వనవలయున్. 60

ఆ. సత్యనిష్ఠ బ్రహ్మచర్య వ్రతంబు పం, డ్రెండువత్సరము లెవండు సైఁచు
నతనిప ల్కమోఘమగు నాశిషంబైన, శాపమైన రిత్త చనదు చనదు. 61

గీ. బాలుఁ డబ్దులుఖాదరు పల్కునిజము, కఱకుమ్రుచ్చుల యెదఁదలకసటుఁ గడిగె
నెంతసేయదు సత్య, మీసృష్టి దీని, వలన వర్ధిల్లు నిది యోటువడదు చెదదు. 62

ఆ. ప్రాజ్ఞుఁడైన నతఁడు పామరుఁడైనను, ముక్తినందు సత్యరక్తి యున్న
సత్యమునకు బానిసలు సర్వసుగుణముల్, వేల్పునంగ నదియ వేఱుకాదు. 63

గీ. ఎతఁడు మొగమోటలేక సూనృతము పల్కు, నతని కూరూరఁ బగఱుందు; రతని మేన
జురదగొట్టెడివార లర్బుదము లుందు, రైన నెడపెట్టఁ డతఁడు ధర్మానుచరత. 64

ఆ. దిక్కులేనివారిదెస దయగలవారు, పగటినిద్ర కిష్టపడనివారు
నిక్కమాడువారు నెమ్మది కీశ్వరున్, జేర్చువారు సిరికిఁ గూర్చువారు. 65

గీ. కల్లరిని మించుకల్లరి కలఁడు గాన, నోట తప్పదు దబ్బఱనోటివాని
కపటజయం బెట్లువచ్చు సత్యాశ్రయునకు, హెచ్చుతగ్గులు కలవె సూనృతమునందు? 66

క. వాఁచినసత్య మడంగక, యేఁచున్ బలువగల దోషి నెన్నఁటి కేనిన్
శోచిష్కేశుఁడు కాల్పక, సైఁచునె త న్నొడిని ముడుచుజడు శీతలుఁడై. 67

క. తన కెన్నినేర్పు లున్నను, మనుజుఁడు నేనలఁతి నన్నమది నున్నపుడే
కను గౌరవంబు ముక్తిం, గను వినయ మ్మొసఁగలేనికల్మలు కలవా! 68

ఆ. అతని కూర వీస మప్పిచ్చువాఁడు లేఁ, డెంతనంజయున్న నేమివిలువ?
తొడవు కుదువఁబెట్టి పడయు వాఁడు ఋణమ్ము, బాసతప్పువానిబ్రదు కిటుండు. 69

గీ. తలుపునకుఁ దాళముబిగింపు, తస్కరత్వ, మనృతమాడుట, సోమరితనము లేని
పుడమి యని మున్ను పెఱవారిపొగడు గన్న, భారతం బెంతచెడియె నిప్పటికి నదిర! 70

ఆ. కొన్నచేనిలోనఁ గన్నబంగారమ్ము, నమ్మినట్టివాని కప్పగింపఁ
బెనఁగినట్టికాఁపు పెరిఁగినగడ్డలో, హంత! హంత! పాప మెంతరెచ్చె. 71

క. తన ధర్మక్షేత్రమునన్, బెనఁగుచు మరణించుఁగాని పీడల కతనన్
దనువుం బాయఁడు వీరుఁడు, మును జీససు నేఁడు గాంధి మొదల యిచటన్. 72

గీ. పుట్టుదురుగాని చావరు పుణ్యపురుషు, లార్తబంధులు దానధర్మాభిరతులు
రాముఁ డీల్గెనా కృష్ణుఁడు రాలెనా త, థాగతుఁడు వోయెనా గాంధి తగ్గువడెన? 73

క. భోగముల నుజ్జగించుట, నాగరికత కానవాలు నాఁ జను, సుఖ మీ
త్యాగమ్మునంద కల, దీ, యోగముఁ గృతమతులబ్రతుకు లుపదేశించున్. 74

ఆ. పగలు మొగ్గ కంట బడనీదు గుమగుమల్, గులుకు విరులజల్లు కురియు రేయి
గుప్తదానపరత గుణరాజ మనుమేలి, చదువు నేర్పఁ బారిజాత మొదవె. 75

ఆ. ఎన్నఁడగినదెంద మెది విపన్నుని గన్న, యంత జాలువాఱునదియ కాక
నరున కిదియ గుర్తు నాఁ జెల్లు రెండుకా, ళ్లుంట కాదు బువ్వఁదింట కాదు. 76

ఆ. మనసు నిస్తరంగవసతిఁగైపడి నుంట, మేలు నరుఁడు తిండి మెసవునపుడు
కోపతాపములకు లోపడి రుసరుసల్, గ్రక్కు వేళఁ దినుట కస్తి దెచ్చు. 77

గీ. ఎతఁడు జనసేవలోఁ బండు నతని కెట్టి, వెలితి రానీఁడు వేల్పు; కోడలికి నెలలు
నిండినంతన యత్త కూర్చుండఁబెట్టి, యాపె నలరింపదా పనులన్ని సైఁచి. 78

ఆ. రాముఁ డున్నచోటఁ గాముఁడు నిలలేఁడు, తనివి యున్నచోటఁ దఱుఁగు లేదు
సమత యున్నచోట శాంతి పింపిసలాదు, నోర్మియున్నచోట నోట కల్ల. 79

ఆ. ఒకఁడు గుడికిఁబోయి సకలాంతరమ్ముల, వెదకి చూడలేని వేల్పు వెల్గు
మొదటిముద్ద కుక్కముందు పెట్టు బికారి, కనులఁ గాంచి మస్తకమ్ము వాంచె. 80

గీ. భరతభూమిని బుట్టుటే భాగ్య, మందు, నరుఁడుగా నుద్భవించుట పరమభాగ్య,
ముత్తమోత్తమ భక్తుల యోగివరుల, పాద మంటనిచో టిందు లేదుగాన. 81

గీ. నన్నుఁ దాఁకిన సైరింప నిన్నుఁ దాఁకు, తలఁపు నాకెన్నఁడునులేదు చెలిమి నాదు
జీవ మని పెఱవానితోఁ జెప్పు నింత, యుర్విలో నొక్కభారతీయునకె చెల్లు. 82

ఆ. తరతరాలనుండి మఱవరానివిపత్తు, లెన్నివచ్చి ముట్టుకొన్ననేమి
వంకలేని ప్రేమవైరాగ్యములఁజేసి, భరతజాతి యోర్చి బ్రదుకఁగల్గె. 83

క. కుడిచేతి కెడమచేతికి, నిడు సరిగాఁ బూవు తావి, నిమ్మెయి సుజనుం
డొడఁబాటుచూపు గఱువకు, వెడమాసికి వేర్మిలేని పేర్మి నొసంగన్. 84

గీ. బుడుతతో వచ్చుచున్నది పడఁతి బాట, నాపె కెదురయ్యె నుగ్రపంచాననమ్ము
తల్లి తద్వక్త్రమునఁ దూఱి తనయు మనిచె, నెంతచాగమునైనఁ జేయించుఁ బ్రేమ. 85

ఆ. ప్రాజ్ఞుఁడైనవాఁడు పరమసుఖమ్ములఁ, గడిఁది వెతల నొక్కగతిన యుండు
నర్కుఁ డుదయవేళ నస్తమయావధి, నెఱ్ఱదాలుతోడనె వెలుంగు. 86

ఆ. పల్లెటూరిబ్రదుకు పైపొరవెనుక నా, ధ్యాత్మికావలోకనార్చి యుండు
నీవెలుంగు నిల్చు నెందాఁక నందాఁక, జాతిసంస్కృతియును జక్క నిల్చు. 87

గీ. చిట్టిపాపను మరియమ్మ సీత కిచ్చి, బీగపుంజెవి నుమ చాందుబీ కొసంగి
ప్రత్తి విఱువంగ నేగి రీపల్లెటూరి, మగువ లేజాతివా? రేమిమతమువారు? 88

గీ. మాన్యముంగడ నొందె సామాన్యునెదుట, నప్రియంబైనను హితోక్తి నాడవలయు
రుచ్యమని కీడుమాట వాక్రుచ్చునాతఁ, డిష్టమని రోగికిన్ జున్ను నిడుజడుండు. 89

ఆ. పేరుఁ దనఁగ నెవఁడు మారుఁడే యొకనన, ముక్కుతోడ మూఁడు మొనలవాలు
నుక్కడంచె నితఁడు దిక్కులుసూచు నీ, మగని పేరు విన్నమాత్ర జగము. 90

క. నరు నంతర్ముఖు దీకొని, తరుణీమండలము దెసకుఁ దఱుమును విద్యుల్
మఱపించు మరుఁడు విషయు, స్ఫురణవశంవదు నొనర్చి పొరిఁబొరి చెఱుచున్. 91

ఆ. మరునికంటె యముఁడు మంచివాఁ డితఁడు శి, క్షించి ఖలుని సవరచేయఁ జూచు
మంచివానినైన మదనుండు మోహజం, బాలపటలి కీడ్చి పతితుఁ జేయు. 92

ఆ. బ్రదుకుమీఁదితీపి బండెఁదున్నది గాని, వాని కింద్రియార్థవాంఛ తొలఁగ,
దెండవానలోర్చి యేరు సాగింపని, కమ్మతీని కెట్లు గరిసె నిండు? 93

క. తనకాళ్ళమీఁద నిల్చుట, మనుజుఁడు నేర్వంగవలయు మాన్యులబ్రదుకుల్
కనవలయు నొరుల కింపగు, పనులైనను బూనరాదు పదియింటిఁ దలన్. 94

ఆ. సుతునిచేత మొదటఁ జుట్టలు తెప్పించెఁ, బిదప వానినడిగె బీడిముక్క
తండ్రిచంద మిట్లు తలక్రిందులైనచో, జాతి నెవఁడు దిద్ది చక్కఁబఱుచు? 95

ఆ. గొఱ్ఱెపాలము నమ్మి గోవిందు చనిచని, నాలుగైదురెట్లనంజ కొనియె
నెండి తడిసి పుట్లు పండించెనేకాని, భ్రష్టుఁడయ్యెఁ దుదకు బ్రాంది మరగి. 96

ఆ. కాసులెవరి వన్నఁ గంటెయు నెరవని, పెండ్లికొడుకొకండు పండ్లుదెఱచె
ప్రశ్నమునకుఁ దగిన ప్రత్యుక్తి నెఱుఁగని, జజ్జుతెఱఁగు సూచి జగమునవ్వు. 97

ఆ. లేమ మగనికంటె లేఁతదిగా నుంట, వలయు నన్నవారితెలివి మెత్తు
నిరువు రొక్కనాఁడె వృద్ధతపాలైన, లేవనెత్తువారు లేక చెడరె? 98

గీ. ఓసి! మనపిల్లి నెట్టెటో మూసినాఁడ, నీవు ముంగిలిదాఁటి నాకెదురురమ్ము
పయనమిది చాలదొడ్డది, బండిగంట, మొరసె నను నింతితో నొక్క మొఱకుమగఁడు.

క. గుడిగాదు నేఁడు నరునకు, బడిగావలె మూఢమైన ప్రత్యయముల పో,
బడి గావలె యుగయుగములఁ, గడల్కొనిన తమముతీఱుగడ కావలయున్. 100

ఆ. పూలచెండుతోడఁ బొలఁతి పతిన్ గొట్ట, నతఁడు దుడ్డుఁగోల నతివ నడిచెఁ
గలిమిచూచి కన్యకల నవివేకుల, కిచ్చువార లింత తెచ్చువారు. 101

ఆ. నిన్న నాల్గువడలు తిన్నాఁడ నని వృద్ధు, నేఁడుకూడఁ దినుట నేర్మిగాదు
వడిగవడిగఁ బెరుఁగు వార్ధకజాడ్యంబు, సరగసరగ ముదుఁగు జఠరాగ్ని. 102

క. అది మేలిపల్కు నాఁ దగు, నెది తనకున్ వినెడివాని కింపితమగునో
చదురిది నేర్వనిమానిసి, పదుగురలో రట్టుపడి త్రపంబడి కుములున్. 103

ఆ. మొగమునెదుట నిక్క మగపడుచున్నను, గుచ్చితుండు పాత్రు మెచ్చలేఁడు
కులముగీఁత గోత్రకుద్యము మతమన్న, కాట్రగదము వీనికన్ను మూయు. 104

ఆ. గ్రుడ్లగూబ భాస్కరునిమహస్సును సైఁప, లేనిరీతి బుద్ధిలేనివాఁడు
గొప్పవానికీర్తి నొప్పలేక యకార, ణాపవాదసృష్టి కంగవించు. 105

గీ. వట్టినిందలతో గొప్పవాని నణఁపఁ, బూనుద్రాబలు పొలిమేరలోనె యుంద్రు
దివియ నరికట్టునీడ బెత్తెండు వఱకె, యవలఁ దత్తేజ మలము నిరంకుశముగ. 106

గీ. మడుఁగుత్రవ్వించె నొకఁడు తూమెఁడువరాల, కవల గొద్దటితూముతో నవి యొసంగె
నొద్దె లల్గిరి మడుఁగునీ రుప్పుగ్రక్కఁ, బేదశాపము వీసరపోదు పోదు. 107

క. గోపన్న ఋణమ్మును సీ, తాపతి చెల్లించె ననుట దబ్బఱ; కరణా
లాపని చేసిరి సిరిగల, కాఁపులు బేరులు కరంగి కాసు లొసంగన్. 108

ఆ. ఎంతనేర్చె నఱవ? యింతికిఁ దనపీఁట, నిచ్చు బస్సునందు నిడుమగదుర
నిలిచినలఁగు మగువనెమ్మోము నొకజాతి, సోదరుండు కప్పఁజుట్టపొగను. 109

క. ఈపె యెవ రన్ననేస్తికి, నాపెండ్ల మనెన్ మగండు, నవలా కోపో
ద్దీపితయై 'వై' ఫనలే, వా పరువుంగానవా దొరా! యని పదరెన్. 110

గీ. ఎంతపుణ్య మొనర్చెనో యింగిలీసు, పుడమినెల్లను మొదటితాంబూల మందు
నెవ్వ రెట్లున్నఁ దెలుఁగువా రీవచస్సు, నమ్మకడుపుననే నేర్చి యవతరింత్రు. 111

గీ. నేర్పులేనివారియార్పులు పెడబొబ్బ, లడఁగినపుడె పల్కఁదొడఁగు బుధుఁడు
కటువులైన గోండ్రుగప్పల బెకబెకల్, తొలఁగినపుడె పికము గళమువిప్పు. 112

క. నిప్పునకున్ జెదలంటుట, చొప్పడదని కనక మొఱ కసూయావశుఁడై
చెప్పును బొం కనఘునిదెసఁ, దప్పిది యని నరులునవ్వఁ దరులకుఁ జెప్పున్. 113

ఆ. కాల్వకట్ట చాటుగాఁ జేసికొని దిస్స, మొల నభాగ్యురాలు ముడిఁగె నకట
యేమిసేయనేర్చు నెండెడియరచీర, తక్క నామె కొండుముక్క లేదు. 114

ఆ. పంతగించి క్రొత్తప్రాతలసందు బి, కారికడుపుఁజిచ్చు మూరిమూరి
చిత్తయెండ కింతగత్తర దెచ్చెనా, యోర్వలేనివెట్ట నుడుకు జీవి. 115

ఆ. మేలుతోడఁ గీడు మెలివైచికొని యుంట, కానిపించు లెస్సగాఁ దలంప
వనధిచెంతఁ జల్లఁదనము దక్కునుగాని, మూఁడుఁ బెనుతుఫానుముప్పుకూడ. 116

గీ. లే దయోగమున సుఖంబు లేదు యోగ, సిద్ధియందును సుఖము రాసిక్యవేది;
కుద్దిలేనిసుఖమ్ము వియోగమధుర, వేదనల నారటించెడువేళ నొదవు. 117

ఆ. పడఁతి యొకతి, రెండుకుడుపులు, ముప్పూఁట, వేల్పు నెడఁదతోడ వేఁడికోలు,
నాలుగాశ్రమముల నర్మిలి గలవాని, కిహపరానుభూతు లింపునింపు. 118

గీ. వాఁడు గెలుపందఁ డెవ్వఁ డీశ్వరునిద్రోసి, ప్రకృతినర్థించి సౌఖ్యముల్ పదయఁజూచు;
రాము రాకొట్టి జానకీరామఁ గోరి, యెంతచెడఁ డంతచదివి దైత్యేశ్వరుండు. 119

గీ. ఆస్తికుం డగు నరుఁడు సత్యానురాగ, మార్తజనసేవ వలచి కామాది నొడిచి
గుడికిఁబోవుటతోఁ గాదు, మెడను దులసి, మాలఁ గై సేసికొన్నంతమాత్రఁ గాఁడు.

గీ. ఏనికైనను వినిపింపరాని తలఁపు, మదికిరానీఁడు మహనీయమానవుండు
పాడిదప్పక పెఱవానిబాగు వలచి, ప్రగ్గ నతఁడు సదా తనలగ్గు మఱచి. 121

ఆ. పేదయైన నేమి లే దనలేఁడు స, దన్వయమునఁ బుట్టినట్టివాఁడు
బట్టు వేఁడినంత బటువిచ్చి భాస్కర, మంత్రి పేరు నిల్పె మనుమఁ డదిర! 122

క. తమ తేజమును బయస్సును, సమతం బాటించి రవియు జలదముఁ బంచున్
క్షమలేనివారు "మా, మీ", సమరమ్మున నలఁగుచుంద్రు జగ మాలిగొనన్. 123

క. మృదుమధురవాణి, పేదల, గొద దీర్చుతలంపు, గట్టిగుండియ, యిది మే
లది కీ దనఁదగు తెల్వియుఁ, జదువులతో రావురావు జనితో వచ్చున్. 124

గీ. తనమెయిన్ గాటికిం జేర్చుతతిని గప్పు, వలదు చేతుల ననె రాజు ప్రగడతోడ
దేశములఁ గొల్లలాడినదిట్టయైన, శూన్యహస్తాలఁ జను నన్నసూక్తి దెలుప. 125

గీ. గడ్డిదిని లక్షలార్జించి బిడ్డలేక, యెవనినో పెంచుకొనువాని కేదిశిక్ష?
దత్తుఁ దున్మత్తుఁడై దురోదర దురాగ, ఉత్సుకత నిల్లు గుల్లసేయుటయ చాలు. 126

ఆ. మెక్కి మెక్కి వెడలఁగ్రక్కిన కూటినే, కుక్క మగుడ గతుకఁ గోరుకరణి
సేవపడ్డసుఖమునే వివేకములేని, మనుజుఁడాసచేయు మరలమరల. 127

ఆ. తాను మానవుండు తనశక్తి పరిమితం, బైననేమి వీని కాసమెండు
గజ్జెకట్టఁజూచు ముజ్జగమ్ముల వీఁడు, సోలిసోలి దిక్కుమాలి మడఁగు. 128

ఆ. సైఁచిసైఁచి యెప్పుడో చుఱ్ఱుమనక సా, డాఁగలేఁదతండు రేఁగునేని
కదలి పొంగిపొరలుఁ బిడుగులురాలు డి, క్కరులు గిరులు క్రుంగి కళవళించు 129

క. తగు నని చేయన్ జేయన్, దగు లేర్పడు దుష్టచేష్టితమ్ములపట్లన్,
తగ వని త్రోయన్ ద్రోయన్, వెగ టేర్పడు ధర్మబద్ధవిధులం బ్రజకున్. 130

గీ. ఆస కొకమేర వలె నింగిలీసువార, లేడుదీవుల బేరులై తృప్తిపడక
యేలువారైరి పాలితుల్ మేలుకొనుదుఁ, దేలవైచిరి గ్రుడ్లు గగ్గోలుపడిరి. 131

గీ. అఖినూత్నైన జగమెల్ల నహితమైన, మోయరానివిపత్తులు ముసరుకొన్నఁ
దనువుపడుదాఁక నౌదలఁ దాల్చినట్టి, నైతికంబగునియతి మానఁడు వివేకి. 132

గీ. కడచె నూఱేండ్లు నామనుగడ నటంచుఁ, గులుకుటకుమున్న మహనీయగుణగరిష్ఠ
లెందఱు వయస్సు లబ్బిరో యెంచుకొమ్ము, తమ్ముఁడా! చిల్వకును శతాబ్దములు కలవు.

క. కొందఱు తినుటకు మందురు, మందులకున్ బ్రాఁకులకు నమస్యల నిడుచున్;
గొందఱు బ్రదుకుటకొఱకే, తిందురు; కొనియాడఁదగినదిట్టలు వీరల్. 134

గీ. నెయ్యురకడించుకొని వారిఁ దియ్యతియ్య, కమ్మల నలర్చుచున్ వారినెమ్మి గనుచుఁ
దనియుభాగ్యము లుబ్ధతాతాడితునకు, రసికతాదరిద్రునకును రాదు రాదు. 135

ఆ. మనుజుఁ డొగ్గవలయు మంచిపనికి, నింత, మేలిచేఁత కుద్యమించునదను,
మరల రా దటన్న మదితోడ నిర్భర, శ్రద్ధతోడ దానిఁ జలుపవలయు. 136

ఆ. ఇంట నున్న రొక్కమే యక్కఱకువచ్చు, నిడుమలందుఁ బాలువడయువాఁడె
నిక్కమైననేస్తి, నిర్దుష్టవైదుషీ, వైభవంబె మెప్పువడయుసొగసు. 137

గీ. పొదుపుగా సొమ్మువాడుట పొసఁగుఁ గాని, వాక్కు నింకనుబొదుపుగా వాడవలయు
సత్యమగుట హితంబౌట చాల దుక్తి, మేర నుంటయు వలయుఁబో! మేలుగూర్ప.

క. ఎక్కడనో యూరేగుట, పెక్కురకున్ దక్కుఁ గాని పెరిఁగినయూరన్,
బెక్కువ నందుట వందకు, నొక్కనికే దక్కుఁ బరమయోగ్యతకతనన్. 139

గీ. కూడుగుడ్డల కావంతకొఱఁత లేని, సచ్చరిత్రకు నిసుమంతలొచ్చు లేని
సంతతిని జూచి తనివోవుజనకుఁ డిష్ట, పడఁడు నవఖండమండల ప్రభుతనైన. 140

ఆ. మంచినీరులేదు మడిలేదు బడిలేదు, తగినతెరువులేదు తరువులేదు
వానిపల్లె కెన్నివంద లున్నను దివిన్, గ్రిందుపఱచు దానిముం దతండు. 141

గీ. వ్యాసఋషి మూఁగయౌఁగాక వాసవాత్మ, జునకు నన్నయ్య వేంగినిజూపి తనిసె
తిరుమలంజూపి తిమ్మక్క తృప్తినందె, పోదు ప్రాణికిఁ దనగడ్డమీఁదివలపు. 142

ఆ. అలవియైనసాయ మందఁకుకున్ జేఁత, పరులరూక కాసపడక యుంట
నేర్చినట్టివాఁడు నిఖిలతపమ్ముల, నోర్చినట్లె కలుచ నార్చినట్లె. 143

గీ. ఎవనినుడి సూనృతపుఁదావి నివతళించు, నెవనిమది సర్వదా జగద్ధితము కోరు
నెవనిబ్రదు కోజబంతిగా నెసఁగుఁ బ్రజకు, నతనిదీవన సార్థకం బగును దగును.

క. పురుషార్థమునకు నొదవని, నిరర్థకాలాపముల గణింపరు ప్రాజ్ఞుల్
నరుఁ డబ్బినంత మౌనము, ధరించి పరమాయు వందఁదగును వయస్యా! 145

ఆ. అలుబిడ్డలమే ల్మానియైన నూరి, మేలు గనవలె నరుఁ దూరిమేలు విస్మ
రించియైన విలాతిమే లెంచవలయు, నది వదలియైన జగతి మే లరయవలయు.

క. సడిసన్న పొగడ్తలు కుడి, యెదమలఁ జేపడునుగాక కృతమతి గర్వం
పడఁ దెన్నినడులు సొచ్చినఁ, గడలి నిజావధిని దాఁటకయ నిల్చుగతిన్. 147

గీ. కదలె వలిగాలి, విరికన్నె కన్నువిప్పెఁ, గాకలీనాదములు నించెఁ గోకిలమ్ము
జగము నవనవచైతన్యశాలి యయ్యెఁ, నింతకున్ హేతువయ్యెఁ ద్రు శ్శైఋఁగఁ దినుఁడు.

గీ. ఏల మందలఁగాచె గుఱ్ఱాలకొడలు, తోమె గుగ్గిళ్ళు పెట్టె యదుప్రభుండు?
నిఖిలజగమునకుం గర్మనిష్ఠ నేర్ప, నఖిలకార్యముల్ మాన్యము లని వచింప. 149

గీ. బోటికి వరాలమూట కారాటపడెడి, పండితునితెల్వి కేపాటిపరువు దక్కు?
క్రిందిపీన్గుల వెదకు రాబందు నింగి, నొరయుచుం బోవుఁగా కెంతగరిమ నందు?

క. తీయనిప ల్కుంటఁగదా, కోయిల పగయయ్యెఁ గాకిగుంపున కిట్లే
ధీయుతుఁ డజ్ఞానతమ, చ్ఛాయా పిహిత ప్రజాభిశాపార్హుఁ డగున్. 151

గీ. చిత్తశుద్ధి కరుణ సేవాసమాసక్తి, వలయు వైద్యవృత్తి వలచువారి;
కర్థవాంఛమాట యందురా సిరి వీరిఁ, జేర నారటించుఁ గోరకున్న 152

ఆ. రుగ్ణనందు నీశ్వరుని జూడఁజాలిన, తెలివి గన్నవెజ్జు గెలుపునందు
నతఁ డెఱుంగు రోగివెతలు పాపుట జగ, న్నేత కూడిగంబు సేఁత యనుచు. 153

క. తగుయత్న మొనర్చినచోఁ, బ్రెగడ యగున్ నరుఁడు సింహపీఠస్థుఁ డగున్
జగదీశ్వరుఁ డగు, సోమరి, దిగజాఱున్ దీనతావిధేయతఁ గూరున్. 154

క. ఒకనాఁ డీరవి శశిపా, వక పవనాదికు లలంతివా రయ్యు జగత్
ప్రకటతపమ్మునఁ బరమా, ధికారముల నంది రనవధీరితు లగుచున్. 155

క. క్రూరం బక్రూరం బన, నోరెం బిరుతెగల నుండు, నుల్లంబునకున్
జేరుఁ దదీయగుణంబులు, కోరు సభిజ్ఞుండు తగినకూ డిక్కతనన్. 156

ఆ. మదియు నుడియుఁ గలసి కుదిరిన నెయ్యంబు, పొలుచు మేన నుసుఱు నిలుచుదనుక
నేకగర్భజననహేతుకమగు పొందు, తీసికట్టు దీనివాసిముందు. 157

ఆ. సంపదలకు మాని సంతతికే హద్దు, పెట్టఁజూతు రిపుడు పెక్కుమంది
మేర లునుపవలయు నీరెంటికిని గేస్తు, కుందులేనిశాంతి నందు నపుడె. 158

క. పైపైసంస్కృతి వెడవెడ, రూపాయలవలనఁ జేకుఱున్ మనుజునకున్
లోపలిసంస్కృతి దైవ, శ్రీపరభావమ్ముకతన సిద్ధించుఁ జుఁడీ! 159

క. పలువురచెవులం బడినను, ఫలింప వెల్లెడల సాదు పల్కినపల్కుల్
పొలమునఁ బడు విత్తుంబలె, శిలాదులం బడినవిత్తు చెట్టుగ నగునా! 160

ఆ. మెత్తఁదనముకంటె మేలగు నాయుధం, బేదికలదు? మృదుత నిది జయించుఁ
బరుసఁదనము నల్ల నుఱుమాడు నజ్ఞుఁ డీ, గుట్టు గనక బిగిసి చెట్టగుదుచు. 161

గీ. సుగుణసంపద నిజబలం బగుటఁజేసి, లోకమును గెల్చె బుద్ధుఁ డేకాకి యయ్యు
శస్త్రముల నస్త్రముల జగజ్జయము రాదు, వచ్చుఁగా కది మూన్నాళ్ళముచ్చ టగును.

గీ. ఆర్తి నెఱుఁగనిబ్రదుకు సౌఖ్యమ్ము నిడదు, రాణకెక్కును మనికి గోరాలకతనఁ
గష్టగాథలు లేని రాఘవునికథకు, సీతచరితకు నేపాటిజీవ ముందు? 163

గీ. ఆటసాగినచో నెంతమేటి నైనఁ, బరిభవించెడు చెడుగు తప్పక యదంగుఁ
బిన్నకైనను బొన్నారిపీఁటవెట్టు, సరసుఁ డతివేలగౌరవాస్థాని యగును. 164

ఆ. ధనము పెత్తనమ్ము తారుణ్యము శరీర, మెల్లకాల ముంట కల్లమాట
పాడి కెడవుగాని బ్రదుకులోఁ బడసిన, యశ మొకండె నిత్యమై రహించు. 165

ఆ. చిలుక బయలుదేఱుఁ జిన్నారిమావికి, సజ్జనుండు పోవు సాదుకడకుఁ
గాకి వెడలు వల్లకాటిమిట్టకు నిసీ!, యల్పబుద్ధి చేరు నధముదరికి. 166

గీ. మంచిచెడ్డలు కానని మందునకును, సకలమెఱిఁగిన పండితునకును సుఖము
లభ్యమగుఁ గాని వానకాలంపుఁజదువు, నేర్చినతనికిఁ దప్పదు నెగులుతాఁకు. 167

గీ. కాశిలోఁ జచ్చుఁగాక మేల్కట్టు లెక్కి, స్రుక్కి శ్రీశైలశిఖరంబు చూచుఁగాక
యనుభవింపకతప్పు దయా! నరుండు, ప్రాంత క్రొత్తపాపమ్ముల ఫలమునెల్ల. 168

గీ. కాకి నెంగిలిచేతితోఁ గసర నెచట, రాలునో మెదు కని సంశయాళువైన
పిసిడివిత్తము నిప్పుకల్ పిండునెండ, నరుగువానికిఁ దననీడయట్లు రిత్త. 169

క. తనమేలుకోరి పగతుం, దనుఁగుంజెలి యగునుగాక యాతని నమ్మం
జన; దబ్ధి నగ్నిబలె మా, ర్తుని చల్లనినుడి నడంగి క్రోధం బుండున్. 170

ఆ. రవిమహస్సుకతన బాయి తేజస్వంత, మగువిధాన మంజులాశయమ్ము
కతన మది శుచిత్వకలితమౌ, నది పర, మౌషధంబుగా రుజార్తి నణఁచు. 171

ఆ. దోషియైనవానిఁ ద్రోసిన రోసిన, కరుణ కెంతవిలువ కలుగనేర్చుఁ?
పేద కోగిరంబు పెట్టుట మేల్గాని, యున్నవాని కిడుట పున్నెమగునె? 172

ఆ. కనులుమూసి నడిచి గాతమ్మునం బడి, దొసఁగు నేలపైకిఁ ద్రోసినట్లు
గోళ్లుగిల్లుకొనుచుఁ గూర్చుండి జడుఁడు త, న్నలఁచువెతల విధికి నంటఁగట్టు. 173

గీ. నిష్కలంకచరిత్రుపై నిందమోపు, నతఁడు వాలాయముగ నధోగతికిఁ బోవుఁ
జంద్రుపై నుమ్మివైచినజడుఁడు దానిఁ, దనమొగమ్మునకే తెచ్చుకొనువిధాన. 174

ఆ. సూదివోలె బ్రదుకరాదు దారమునట్లు, మనుట నేర్వవలయు మానవుండు
సూది తూఁట్లువేయుచుం బోవు, దార మా, రంధ్రములను గప్పి రాణచెందు. 175

ఆ. ఎగ్గుసేయకున్ననేమి పండితుపట్లఁ, బామరుండు, గణువపట్లఁ గ్రించుఁ
దందగానిపట్ల నధమాకృతియు నీర్ష్య, పడెద రెడఁద నగ్గి సుడివడంగ. 176

ఆ. పేకముక్క నణఁచిపెట్టుచందమ్మునఁ, దనయొనర్చు నఘము దాఁచి వైచి
కుజనుఁ దొరులతప్పు గోరంత కొండంత, చేసి దెసలఁ జాటు బైసిమాలి. 177

ఆ. పంద యున్నచోట భయపెట్టుబం టుండు, భయములేనిచోట బంటు లేఁడు
ఎవనియెదఁద విడియు నీశ్వరవిశ్వాస, మతనిఁ గదియఁగా భయంబ వెఱచు. 178

ఆ. బాల్యమందె ఖలులఁ బరిమార్చె రఘురాముఁ, దడవికేగి తపసి యయ్యె ధ్రువుఁడు
తగనిచెలిమిమీఁది తగులమ్ము విడె గాంధి, మొగ్గనాఁడె కదలు మొల్లతావి. 179

ఆ. నరుఁడు మొట్టమొదట నాల్కను లోఁగొంట, కంగవింపవలయు, నన్నృతమునకుఁ
బరుషశబ్దమునకు భయపడున ట్లది, కుడువరానితిండి కోరనట్లు. 180

గీ. రడ్డిరాజులు కన్నదరాయ లెంత, పసిండి నీలేదు శ్రీనాథభట్టకవికిఁ?
దుట్టతుద కేల పేదర్కిఁ జోఁగె నితఁడు, చెనఁటిజిహ్వాది కుడిగమ్ముచేఁతఁగాక? 181

ఆ. జూద మెంతకైనఁ జోపును బలరాముఁ, డిందు డింది కలఁగి యెదిరినింద
తాఁకు నోర్వలేక తదయక యొకనిపం, ద్దూడఁగొట్టె నొకనియుసుఱు దీసె. 182

ఆ. ఎవనిచూపు వాని, దెల్లర కొకరీతిఁ, గానఁబడదు సత్య, మేన కంటి
మేలిబాట నిదె సమీచీన మనువాఁడు, పచ్చికాయవంటి పండితుండు. 183

ఆ. ఉండవచ్చు నొకని కున్నతవైదుష్య, ముత్తమాధికార మూర్జితార్థ
మాతఁ డీమహాత్త కనుగుణమగు లోక, సేవ లేక ధన్యజీవి గాఁడు 184

గీ. ప్రీతిమై శిష్యునెంగిలిచేతిఁ గడిగి, తనిసె యతి వివేకానందుఁ దనఘచరితుఁ,
దేసు కడిగె శిష్యునిపాద, మేల వింత, ప్రాజ్ఞులకు లోక మంతయు బ్రహ్మమయమె.

గీ. ధనికుఁడై యింద్రియార్థంబు లనుభవించు, తఱిఁ దిరమ్ముగ నిల్వ దీదశ యటంచు
నెఱిఁగినతఁ డెట్టిదురవస్థ లెదురుకొన్న, నుదిలపడక సుఖింబలె నుండఁగలఁడు. 186

ఆ. అడవికుక్కవోలెఁ దొడరుఁ గామాదిక, శత్రువర్గ మాత్మశక్తిహీను
దీనిసేయునెగ్గు దెప్పర మగుట ధీ, రతఁ బరిత్యజింపరాదు నరుఁడు. 187

క. వెత లెన్ని చుట్టుకొన్నను, ధృతివీడనిపురుషుఁ దుత్తరించును వానిన్
ప్రతిలేనియశ మనామయ, మతీవసంపదయు ధీరతాసాధ్యంబుల్. 188

ఆ. పుట్టి పుట్టి జీవి పుణ్యబలమ్మునఁ, గట్టకడకు నరుఁడుగా జనించె
నరతఁ జూచి యిదియ పరమభాగ్యం బని, తనియ కీశ్వరత్వ మెనయవలయు. 189

గీ. ఇమ్ముగా నారికేళాదు లెదుగుచుండఁ, బ్రాఁబడినమట్ట లల్లల్ల రాలుకరణి
నాత్మ వికసించుకొలఁది వర్ణాదికృతక, వైపరీత్యంబు లణఁగుట వాస్తవమ్ము. 190

గీ. పగతు కరచరణమ్ములు పగ్గమున బి, గించి యేపాటిగెలుపు సాధించు నరుఁడు
నెమ్మితో రిపునెదఁద బంధించినపుడె, యతఁడు గడియించు నప్రతిహతజయంబు.

గీ. పెక్కునిప్పచ్చు లున్నను బేర్మిలేమి, మనకుఁ దగ దన్నలార! ప్రేమను సమస్త
దుర్గతు లడంగు నీసున దుర్భరాప, కర్షములు పుట్టు నంద్రు లోకజ్ఞమణులు. 192

గీ. ప్రజలలో నెయ్యతియ్యముల్ బలిసినపుడె, ధీరతా ధర్మనిష్ఠలు మూరినపుడె
సైనికబలంబు పరిపంథిశ క్తి నణఁచుఁ, గవచమై నిజదేశరక్షణ మొనర్చు. 193

గీ. ఉండెద రకారణమ్ముగా నొరులమీఁద, నాఱడులు పన్నువా రసూయావిధేయు;
ఉత్తములు వీరికి నొసంగ రుత్తరంబు, మూఁగతన మిది చాలు నమ్మూఁక ముడుఁగ.

గీ. మానవుండు శతాయువన్మాట నిజమ, కాని పరదారగమనాది కలుషములకు
దవ్వగ సమంచితాచారతత్పరుఁడుగ, మెలఁగఁజాలిననాఁడ యిమ్మేలు పడయు. 195

ఆ. ప్రాణిలోకదుఃఖభరపరిహర్తయౌ, బొంకు తప్పుగాదు, భూతహితము
గానిసత్య మొప్పుగాదు కదున్ దాళి, యెఱుఁగవలయు ధర్మ విట్టియెడల. 196

ఆ. నేర్చినట్టివృద్ధు నిలువరించినచిక్కు, నట్టెవిప్పు నొక్కొకపుడు బుడుత,
పసితనానఁ దిమ్మరుసు చిన్న గీఁతను, బెద్దగీఁతఁ జేసె దిద్దకుండ. 197

క. చేసినదోసము దెల్ప సె, బాసని సవరించుకొనును బ్రాజ్ఞుఁడు, దుర్వా
దాసారము పఱపి కదున్, దోసి యగున్ దురభిమానధూర్వహుఁ డిస్సీ! 198

క. అడఁగున్ జదువులు పదవులు, మడఁగున్ జవ్వనపు టెగపు మయితో నరుఁడా!
కుడియెడమల నీకు జయం, బిడునది ధర్మంబ నిచ్చ లిది మఱవకుమా! 199

గీ. గడ్డి గాదము తన్ మూయ నడ్డులేని, పుడమిచందాన బావి కన్పడువిధాన
నెఱుకలోఁతు లెఱుంగనినరున కొక్క, తఱి నధర్మంబు ధర్మంబుకరణిఁ దోఁచు. 200

గీ. నరకమన్నది స్వర్గమన్నదియు నెచట, నెచటనో లే వసూయతో నీర్ష్యతోడఁ
గ్రుళ్లుదెందమె నరకంబు, క్రేళ్లువాఱు, శౌచమునఁ దేఱునుల్లంబె స్వర్గసీమ. 201

గీ. తల్లిదండ్రులు చుట్టాలు తనియువేళ, మనుజుఁ డుమ్మలికించుచు మహికి వచ్చు
నాప్తు లావురుమనువేళ నతఁడు నగుచుఁ, బాయవలె మేను కొలలేనిబ్రదుకు నేర్చి.

గీ. అది యొకసదస్సె పెద్దలు కదియరేని, వారు పెద్దలె న్యాయమ్ము వలుకరేని
యదియు న్యాయంబె నిక్కంబు కొదవపడిన, నదియు నిక్కంబె కైతవ మంటియున్న.

ఆ. పాయసమ్మునందుఁ బలుమాఱు త్రిప్పిన, గరిఁటెముక్క రుచులఁ గానలేదు
శాస్త్రములు మథించి చదు రెంత నేర్చినఁ, గుదుపులేక చక్కఁబడఁడు నరుఁడు. 204

క. ఓరంత ప్రొద్దు నితరుల, నేరములన్ వెదకువాఁడు నిజదోషము లె
ప్డారయు, నాత్మోద్ధరణం, బేరీతి లభించు వీని కేనఃఖనికిన్? 205

ఆ. ఎంతనమ్రమయ్యె నెలమావి మాయురే!, బండి కోపునన్ని పండ్లు గాచి;
తులువ మిన్నుదాఁకు నలుసంతసిరిఁ జూచి, తరున కంటఁగట్టుఁ దనదుజడత. 206

గీ. ఓడమల్లన్న పెన్నేటియొద్దఁ జేర్చ, జోడిమల్లన్న యగుట యబ్బురము గాదు
చదువులున్నను సిరులున్నఁ బదవులున్న, నరుఁడు కృతము నెఱుంగనినాఁడు పశువె.

గీ. సుంతమధు విచ్చి రాలినసుమముఁ జూచి, భ్రమరివాఱుచు నళి జాలిపాట పాడు
వేలువే లిచ్చిన యుదారు విస్మరించు, నరున కిది బుద్ధిసెప్పుచున్నది బలారె! 208

క. దొరయైన నొజ్జయైనను, నెఱచుట్టం బైనఁ గడిఁదినెయ్యురియైనన్
నెతిదక్కి పొట్టనింపుట, కరుదెంచిననాఁడు లేఁతయగు లాఁతియగున్. 209

ఆ. గంగ నొడలురుద్ది గట్టెక్కి యొకనీచు, మునుఁగుచున్న వానిమూట దోఁచె
మొదవుపాలతోడఁ బదిమార్లు కడిగినఁ, గల్లుముంత విడదు కసటుకంపు. 210

ఆ. సెగలు గ్రక్కువిసము శివుఁడు మ్రింగుట కేమి?, వనధి నుత్తరింప వానరంబు
ధర్మదీక్ష మది నదభ్రముగా నున్నఁ, జీమయైన మేరుశిఖరి నెత్తు. 211

ఆ. ఈవు మిత్రసుఖము నిచ్చగించెదవేని, పాలుపంచుకొమ్ము పరులవెతల
శత్రుబాధ నాకు సమ్మత మందువా, యచటనచట నాలుగప్పు లిమ్ము. 212

క. రేపటిపని యీ ప్రొద్దున, మాపటిపని రేపునందు మనుజుఁడు సేయన్
జూపు తగు, నితనియాయు వ, కూపార తరంగచల మగుం గాన సఖా! 213

గీ. సాంస్కృతికమైన దాస్యంబు స్రగ్గదనుక, రాజకీయవిభూతికి రాణలేదు
కంచమున గూఁడుగట్టినకసటు తొలఁగు, దనుక మృష్టాన్నమునకు నాదరము రాదు.

గీ. ఒరుని హింసించు వెలితప్పు లుజ్జగించి, నంతమాత్రాన నరుఁడు కృతార్థుఁ డగునె
తన్ను హింసించుకొను దొంగతప్పు లుడుగ, వలయు నతఁ డపుడే వాని వలచు ముక్తి.

గీ. మరలఁ దలయెత్తు నని కాఁపు మానుకొనఁడు, కయ్య నెదిగినకలుపు మొక్కలను దీఁత
వ్యసనము లడంగి మఱి లేచునని కడంక, విడఁడు సాధకుఁ డామూఁక నొడుచుదనుక.

ఆ. పండిపండి పొలము పసిఁడిదీవిగ మాఱె, నెండియెండి సార మెడసె దుబ్బు
బ్రదుకుపంటయైన మది వట్టినప్పుడే, పొసఁగు సాధకునకు నొసఁగు శాంతి. 217

ఆ. మనుజుఁ డెంతమంచిమది గలవాఁడైన, నిఖిలజనులఁ దనుపు నేస్తి కాఁడు
జగతికెల్లఁ దనుపు సమకూర్చునెయ్యుండు, హార్దమూర్తియైన హరి యొకండె. 218

ఆ. పాత్రుఁడైనవానిఁ బది గాదు వేయి మా, ర్లభినుతింపవచ్చు సభలుగూర్చి
మెచ్చరా దపాత్రు, మెచ్చితిమా చెడు, నతఁడు వెన్నుఁజూడ నద్ద మడుగు. 219

గీ. చాయ మాఱెనుగాని మీసాల కెదుగుc, బొదుcగు నణcగారలే దెంతముదిమి యున్న
రుచియ వేఱయ్యెc గాని కోర్కులకు ననలుc, గొనలు దీల్పదలేదు మర్త్యున కయారె!

గీ. సుకృతమూర్తి కకారణక్షోభ గూర్చి, యెదుగు దుర్జనుగూర్చి మీ కేలవింత?
నుడువరానివిపత్తుల నడcగునతనిc, గానcగల రన్నలార! మీకనులముందె. 221

ఆ. అరటిపండువెంట నారగించినద్రాక్ష, చప్పచప్పగా రసజ్ఞ నేcచు
సుఖము వెంట వచ్చు సుఖమైన నిట్లయో, నడుమ నించుకేని యిడుమ వలయు.

ఆ. నరకబాధ గూర్చు దురితమ్ము, దురితమ్ము, లేమికతన మూcడు లేమి కీమి
కారణంబు కానc గలవారు దీనుల, కిదుట నేర్చి శాంతి పదయవలయు. 223

క. నాగతి నీకుం బట్టమి, చాగమునం గలుగుc; బూర్వజన్మమునందున్
ద్యాగివి నీ; వని భిక్షువు, శ్రీ గలగేస్తునకు బుద్ధిసెప్పుట మెత్తున్. 224

క. పెట్టక వినయాదులు చే, పట్టక దక్కదు యశమ్ము బ్రహ్మకునైనన్
గుట్టిది యెఱింగి బ్రదికెడి, దిట్టలచుట్టములు వసుమతీ ప్రజలెల్లన్. 225

క. ఇచ్చుట యెఱుcగని పాcతఱ, గ్రొచ్చుట కీకొనని పిసినిగొట్టులు పసుపుల్
పుచ్చిరి పదినా; ళ్ళైనను, జచ్చిరి చరితన్ నిరర్థజంతువు లగుచున్. 226

గీ. లోకసేవకుc దనసొమ్ము నైకలక్ష, లప్పనమొనర్చి జేజేల నందుకొన్న
దాతయైనను జక్కటిcదక్కి యొరుల, కలిమి నొకరూకనే నంటcగాదు కాదు. 227

క. మగువన్ దలcచుట చూచుట, పొగడుట కోరుట రహస్యభువిc బలికింపం
దెగcబడుట కలసితిరుగుట, తగదు సుండీ బ్రహ్మచర్యధర్మాశ్రయికిన్. 228

గీ. ఇంటి నూడ్చుట యలుకుట వంటచేత, వలువ లుదుకుట మున్నగు నలcతి పనుల
నాదరించినవాcడె విద్యలకుc జాలుc, దపమునకుc జాలుc దత్త్వజ్ఞతకును జాలు.

గీ. చాకలిని జంపె రాణి, యాచానమగcడు, వినె జహంగీరు నేర, మావెనుక నతcడు
చాకితకు బాcకు నిచ్చి నన్ జంపు మనియె, రాణిని క్షమింతు ననె నహో! రజకరమణి. 230

గీ. అతcడు గణనీయ ధర్మపీఠాధికారి, యతcడు రెనడేమహాశయుc దతcడు వంగి
ముసలిదానికిc గట్టెలమోపు నెత్తె, నుత్తములc జేర వెఱచు నుద్వృత్తికంపు. 231

క. తనతేనికుదురు నిలుపన్, దనయుని బలియిచ్చినట్టిదాదికిc బన్నా
కెన యెవరు? రాణి దాసియు, ననువేఱిమి లేదు తెగువ నౌదార్యమునన్. 232

ఆ. నరుఁడు తెలివిలేనినాఁడు తెక్కలి యెడి, సెప్పినన్ శిరమ్ము ద్రిప్పుఁగాని
మబ్బువిచ్చినపుడు మానునా సత్యమ్ము, దెసకుఁ జనక ధర్మదీప్తి గనక. 233

క. వెదకుము సత్యము నది నీ, హృదియందే కలదు దాని కింపగుజాటన్
గదలు మహాంత నశించిన, పిదపనె సత్యమ్ము కానిపించు వయస్యా! 234

ఆ. తనకు దిటవులేనితతి, సహాయులు గాన, రానియెడ నహింస పూనుఁ బితికి
పగతు నుక్కడంపఁ దగుచేవ యుండియుఁ, దాల్మి నూఁదు నెన్నఁదగినజోదు. 235

ఆ. ఎంతపెద్దగద్దె కెక్కెదవో యంత, దాబులేనిమన్గడన్ వరింపు!
తెలఁగుదప్పి పగటిదివటీల నూరేగఁ, జూతువేని పడెదు గోతిలోన. 236

ఆ. సెంటుపొలము లేదు చిన్నప్పు కైనను, వాఁడు వగవఁ దెక్కివచ్చినట్టి
కొడుకు లిద్ద ఱుంటఁ గూలికి ముందుంట;, స్రుక్కులెల్ల నొక్క సోమరులకె. 237

ఆ. పడఁతి మగనిపట్లఁ బసివానిదెసఁ దండ్రి, యెంతహుంకరింతు రెంతతెగుదు
రంతమెత్తఁబడుదు రంతనీరయ్యెద, రుఱిమి యుఱిమి మబ్బు కరఁగునట్లు. 238

ఆ. విద్యవలని పొగరు విత్తగర్వం బధి, కారమదము వర్ణగత మహాంత
సాగినప్పు డాత్మసౌందర్య మణఁగారి, వ్రేఁకమగు నరుండు లోకమునకు. 239

గీ. కాఁపు గర్వించె సంపదల్ కందపట్టు, దొర కరిన్ బంపె నతనికిఁ ద్రుళ్ళదంగ
మెక్కె సిరినెల్ల రాచయే న్గొక్క యేఁట, నిక్కరాదు నరుం డెంతరొక్క మున్న. 240

ఆ. పేదవానినెత్రు పీల్చి పైకొన్నసా, హెగిరియెగిరి కల్మి యిగిరియిగిరి
కూలిమూటమోయు కొడుకులఁ గని కుంది, కుమిలి చచ్చెఁ; గట్టికుడుపు నఘము.

ఆ. మూఁకగట్టి గ్రామములు కొల్లలాడఁడు, కొసరు కసరు లంచగొండి కాఁడు
చెమట నోడ్చియోడ్చి జీవించు నతఁడు; త, దన్యుఁ డున్నె వరవదన్యుఁ దనఁగ. 242

గీ. తండ్రి యోరంత ప్రొద్దు జూదరిగఁ దిరుఁగఁ, గొడుకు గొడ్డేతీ పండించి కొట్లునింపఁ
దమ్మ రక్కసియై ప్రల్లదమ్ములాడఁ, గూఁతురు మృదూక్తులకు నియ్యకొనదు కొనదు.

క. చెడిబ్రతికినమానిసి కీ, పుడమిం గలవారలెల్లఁ బురుగులు, బూతుల్
నుడువుపొగడ్తలు దబ్బఱ, పొద సోఁకనినిజము లన్నబుద్ధి జనించున్. 244

క. నడుమంత్రపుసిరి నిల్వక, వెడలంబడవచ్చు వెంటవెంటన; దానన్
బొడమినపొగరు పిసాళిని, విడువదు వాఁ డీజగమ్ము విడిచెడుదనుకన్. 245

క. కదుబెడిదము ధర్మం, బిది, సుడివడ కెదిరించు నెట్టిచుట్టమునైనన్
గొడుకైన విశ్వనాథుని, యడిదము పోనేల నాగమార్యునిదెసకున్? 246

ఆ. తులువ యేకతమునఁ జలిపినపాపంబు, నొరునిచెవికిఁ దేరకున్న నేమి
కానవచ్చుఁ దాటికాయంత వ్రాలతోఁ, బగలు రేయి వానిమొగమునందు. 247

గీ. నీరు చల్లనిదయ్యును నిప్పుసోఁక, నుష్ణమగుభంగిఁ దుంటరియుదుటు చూడ
నలుగు సజ్జనుఁ డైన నయ్యలుక యొక్క, దండమునఁ దూలుఁ గరుణ తత్ప్రకృతి యగుట.

క. ఇరుప్రొద్దు గుడుపు మే లని, కఱపిరి ప్రాక్తనులు; గంటగంటకుఁ జెడుగుం
జిఱుఁదిండ్లు మెక్కువా రీ, కఱదను బాటింపవలయుఁ గదమ యెటున్నన్. 249

ఆ. కల్ల పచ్చినిజముగాఁ బల్కి వేవుర, కాళ్లుపట్టి పనవి కలిమిపడసి
నిక్కువానికేల నీతికై లేమిడి, నియ్యకొన్నవాని కిమ్ము నుతులు. 250

క. వినువాని విసుగుపాలకువ, గని ప్రాజ్ఞుఁడు పల్కులుడుగుఁ గాని మొఱకు "ఛీ"
యనెడినుడి ముట్టుదనుకన్, దనవాగుడు నుజ్జగింపఁ దలపోయఁ డెదన్. 251

గీ. పొగడు తెగడు గణింపక జగతినెల్లఁ, దన్నుఁ జూచుచు నచ్చినదాని నర్థిఁ
దినుచుఁ దాల్చుచు సుఖవాంఛ నణఁచువాఁడు, బ్రాహ్మణుం డని ధార్మికప్రవరు లంద్రు.

క. ఈగంజికూడు పాయస, మీగుడిసె కదానిమేడ యీతెక్కలు క
ల్పాగమశాఖలు నా కని, యే గుజగుజ పడనివాని కింద్రుఁడు నడఁగున్. 253

గీ. మృగదశన్ మానవుఁడు నెమ్మి నెఱుఁగలేఁడు, మానవత వచ్చినపు డాప్త మమతఁ జూచు
దేవతాత్వమునం బ్రతిజీవిఁ దనుపు, శిలల ప్రాఁకులఁ బ్రేమించు శివత నంది. 254

గీ. కదురు జడమని నవ్వునుగాని నరుఁడు, వెలుఁగఁబెట్టిన దెది వీఁడు తెలివియుండి
కదురు వెంద్రుకపాటివంకర సహింప, దితఁడు విల్లంతసైఁచు జీవితమునందు. 255

గీ. కదలుకొని కాననమ్ములఁ గాల్చువహ్ని, కండగా నున్నవాయు వాయగ్గి తగ్గి
దివ్వెగా నుండ నణఁగించు! దేజు సెడిన, వానిమే లెంచుచుట్ట మెందేని లేఁడు. 256

క. చీలుట చీల్చుట వెడవెడ, ప్రేలుట దబ్బఱకుఁ బీఁటపెట్టుట తృష్ణా
జాలమునం జిక్కి విప, జ్జాలమునం బడుట, నేఁటిసభ్యతయయ్యెన్. 257

గీ. రూపరేఖలతీరు నెఱుఁగుపొంటె, మానిసికిఁ జక్షు వాధారమైనయట్లు
పాప మిది పుణ్య మిది యనుపాడి నెఱుఁగ, నందయగు సాధుమూర్ధన్యుఁ డన్నపల్కు.

ఆ. గొప్ప వారిపుట్టు కుండతో బండతో, నిష్ఠుతోడ గొంద్రుగప్పతోడ,
బిగిచి సత్యవాణిమొగమునఁ బేదక, లాఁపి కొట్టినారు పాపమతులు. 259

క. అందఱవలె జన్మించిన, గాంధికి రే పెన్నికథలు కల్పించెదరో
మందులు హృషీకదాసుల, కందని మేల్తరముచేఁత లరయనిక్రించుల్. 260

గీ. కరుణయో సత్యమో యొండు కడవరాని, గుణముగా నరునెడఁ గుదుర్కొన్ననాఁడు
దైవసంపద లన్యముల్ తమకుఁదామ, వచ్చినిల్చును దాని యిర్వంకలందు. 261

గీ. మగతనంబన దారుణాశుగ మురానఁ, గాఁడినపు దార్తి సైఁచుట కాదు కాదు
సంపదలు పోయినను జావు సంఘటిలిన, ధర్మమార్గము నావంత తప్పకుంట. 262

గీ. సహజసద్గుణ సంపన్నుసరణి సుంత, మాఱదు చెనంటి తన్ జుట్టువాఱియున్నఁ
జందనద్రుమ మాభీలసర్పబంధ, వేష్టితంబయ్యు గుమగుమల్ వీడునోటు? 263

క. మిత హిత సూనృత వాణీ, వ్రత మాయుర్వృద్ధి కాత్మవైభవమునకున్
గత; మిది కానక మూర్ఖుఁడు, బ్రతుకు వితాసేయు జల్పపరతంత్రమతిన్. 264

ఆ. సీతవంటి పరమపూతచరిత్రకే, చెప్పరానినింద తప్పదాయె
నొరుల కెట్లుతప్పు? మొఱకు లీర్ష్యాళువుల్, వేచియుంద్రు జగము నేఁచుపనికి. 265

ఆ. పాయఁగలఁడు నరుఁడు పాచితమునఁ దల్లి, గొంతుగోసి తెచ్చుకొన్నయఘము
నొరులవలన మేలు మఱచి గడించిన, దురితమున లవంబుఁ ద్రోయలేఁడు. 266

గీ. అక్కడక్కడ నాలుగుముక్క లంట, నజ్ఞుఁడు మనీషి నెదిరి యవజ్ఞ గుడుచు
సెట్టియెంగిళ్ళతోఁ గ్రొవ్వి చెనఁటికాకి, యంచ నోడింపఁ బఱచి యేమయ్యెఁ జెపుఁడి!

గీ. ఒరుని జంప భయంకరాయుధము వలయుఁ, దన్నుఁ జంపుకొనం జాలుఁ జిన్నత్రాడు
జగమునకుఁ జెప్పఁ గొండంతచదువు వలయు, నొకమహావాక్కు చాలుఁ దా నొద్దుపట్ట.

ఆ. మంచివాఁడు నుడువు మధురోక్తు; లొకనాఁడు, కఱకుమాట లాడుఁగాక యవియు
నెగ్గుసేయ; వబ్ధి మెపుడేని వడగండ్ల, జార్చుఁగాక శిశిరజలమ యవియు. 269

ఆ. పని యొనర్పరాదు భావించినంతన, వెనుక ముందు గనమి వెతల ముంచు,
నరసియరసి చేయునతనిఁ దామై వచ్చి, వలచు సిరులు; నేర్మి వాని కించు. 270

గీ. చిన్నతనముననే సడిసన్ననడత, యబ్బవలయును మానిసి, కబ్బదేని
పరువపుఁబిశాచి వాని నప్పడముఁబోలెఁ, జప్పరించు నధోగతి కప్పగించు. 271

ఆ. ఒరు లణంపలేరు నరునిపాపము వాని, యెదఁదఁ బుట్టి పెరుఁగు నెఱుకగాక
ప్రజలనెత్తు త్రాగిత్రాగి సిగ్గిలి కదా, ప్రభుఁ దశోకుఁ డార్తబంధు వాయె. 272

ఆ. వారఫలము చూచి వచ్చు లాభంబని, జూదమునకు దిగెను సోమినీఁడు
విత్తమెల్లఁబోయె నుత్తరీయము పోయె, నతని కల్లనల్ల మతియుఁ బోయె. 273

ఆ. చెట్టుగొట్టి యిల్లు కట్టరాదన్నారు, పెద్దవారు బుద్ధిపెంపు వదసి
చెట్టునంద కాదు గట్టు నంద్రైనను, వాసుదేవుఁ గన్నవారు వారు. 274

ఆ. బిచ్చగాని కిదుట మెచ్చునిపిసినారి, వీథితలుపువోలె వేవెలుంగు
మింటినదుమ విక్రమించుచున్న నొకింత, విప్పువాఱ దలసువీక్షణమ్ము. 275

గీ. గాలివానకు మామిడి కూలెఁ గాని, తృప్తి నొదవించె ఫలము లందించి ప్రజకు
సజ్జనుఁడు కష్టదశనేని సాజమైన, వితరణమ్మును జాటి ధన్యత గడించు. 276

ఆ. మన్ను హొన్ను నొక్కమైఁ జూచువా రిపు, డైనఁ గలరు మనకు నచటనచటఁ
బట్టుపట్టి జోలెకట్టినచో వీరు, పదయఁగలరు కోట్లు ప్రజలకొఱకు. 277

క. నా కొక పైసా నిందన, లేకియగున్ మనుజుఁ దొరుల లేమిడిబెడఁదల్
పోకార్పఁ జేయిసాఁచిన, లోకస్తుతుఁ డగును నరులలో దివ్యుఁడగున్. 278

ఆ. ముదుకఁడైన నేమి మది కార్తిగూర్చె న, య్యంకి రమణమంత్రి యవని వీడి
తెలుఁగువానినిద్ర తొలఁచినపదురలో, నొక్కఁ డితఁడు జాతిపక్క మితఁడు. 279

ఆ. ఈసుపెరిఁగి తెల్గు లిరుప్రొయ్యికై సెగల్, పొగలు క్రక్కునాఁడు పొత్తునేర్పి
జాతి కాప్తుఁడైన సచివుని రఘురాము, నొదలు పోవుఁగాక చెడదు వాసి. 280

క. అపన్న సేవలోఁ గొన, యూపిరి వదలితివె లోక మోహారీ! యనన్
బాపూవియోగవేదన, రాపాడితివా ప్రభాకరా! యోగివరా! 281

గీ. గుళ్ళపల్లి పున్నయశాస్త్రి కూడ దివికిఁ, గదలెనా పట్టువిడువని గాంధిబంటు
నవకమునఁదోఁగు కూఁకట్లనాఁడె యితఁడు, ముందదుగువైచెఁ దెలవానిఁ గ్రిందు సేయ.

గీ. మంచిపని చేసితివి మహామతి! జయప్ర, కాశనారాయణా! క్రుళ్ళి గౌలుగొట్టు
నీతి కిరవైనదేశాన నిన్నువంటి, యోగి నిల్చి ఘటించునభ్యుదయ మెద్ది? 283

గీ. ముసలితల లెన్నియున్నను ముగిసినది జ, యప్రకాశ! నీతోద మహాత్మయుగము
మరల నతిమానుష త్యాగమయచరిత్రుఁ, డెప్పటికి నిన్నుబోఁటివాఁ డిచటఁ బుట్టు?

క. నీకొమ్మ కోరుటయు నీ, వీకొంటయు బ్రహ్మచర్య మిల కబ్బురమున్
జేకూర్చుఁ గాని యీనెఱి, లేకున్న జయమ్ము నీకు లేదు ప్రకాశా! 285

గీ. కలుపుచున్నారు నీబూది నలసి సొలసి, బహుసరిత్తుల భారతప్రజలు నేఁడు
నీర మిది క్రోలి జన మధీకారదాహ, దూర మగుఁగాక లోకబంధూ! ప్రకాశ! 286

క. తెన్నేటి విశ్వనాధుఁడు, మిన్నేటి నదల్చె మేలిమేలి యశానన్
కన్నీటివఱద నాంధ్రము, మున్నీటిన్ దొరసె నాకమున కితఁ దేగన్. 287

క. ఏనరుఁ దీవికి శుచితా, స్థానంబగు బ్రదుకునకు నిదర్శన మఖిల
క్ష్మానుతికిన్ జాలినవాఁ, డానరుఁ దని విశ్వనాథునయనము చాటెన్. 288

గీ. తొమ్మిదవపదినుండి పందొమ్మిదేండ్ల, యువలకైనను దెన్నేటి యొజ్జయయ్యె
నౌచితి నెఱింగినట్టి నాయంకునకును, గవికిని వయస్సు తెచ్చు నిక్కట్టులేదు. 289

ఆ. పలుకువిలువ గన్న పంతడికవిరాజు, భోగిరీతిఁ దోఁదు యోగిమౌళి
మనసుపండినట్టి మానవతావాది, యిఁకను మనకు లేఁడె! కృష్ణశాస్త్రి. 290

ఆ. లిఖ్ఖికొఱకు వ్రాయలేదు కైత, చెనంటి, కట్టికొఱకుఁ బదము కట్టలేదు
పలికెఁ గృష్ణశాస్త్రి పరమేశ్వరప్రీతి, కొఱకు, సత్య ధర్మ గుప్తికొఱకు. 291

ఆ. భక్తుఁడై నిజార్తి పలుకు నీశ్వరుముందు, ప్రేయసీత్వ మూని ప్రియుని వెదకు
బంటుగా నొనర్చుఁ బ్రభున కూడిగ, మెల్ల, జగ మెఱుంగు శాస్త్రిసగుణసేవ. 292

ఆ. శాస్త్రికూర్చు మేఘసందేశమున్ విని, కాళిదాసుఁ డెంత కరఁగి నాఁడొ
యితనిగీత మఱవ దీజాతి పయ్యెర, వీచుదనుక మల్లె పూచుదనుక. 293

ఆ. యువజనాత్మశక్తి నొకదెసకుం దెచ్చి, తల్లికీర్తిలతకు నల్లువెట్టి
సంజయుండు ప్రజల రంజించు ననుకొంటి, మెవని కంతుపట్టు నీశ్వరేచ్ఛ. 294

ఆ. గిరియు నొఱఁగె మిత్తి కఱకరియై త్రోయఁ, బేద కండయైన పెద్దజోదు
సాటిలేని రాచపీఁటను జిటిచాఁప, నొక్కరీతిఁ గన్న యోగివరుఁడు. 295

* * *

ఆ. చిత్తమాఁచికొన్న చిన్నారికొమ్మతో, మధురభోగయోగ మానవీయ
రాజ్యమేలు మేలురాకతోఁ దనియుట, పూర్వపుణ్యఫలము పూరుషునకు. 296

గీ. కలఁతనిద్రలలో రేఁగి గాసివెట్టు, వలపుఁగల లెల్లఁ బంటకువచ్చు గడియ,
తీయతలఁపుల కమ్మనల్ తెరలితెరలి, బ్రదుకునకు హాయినిదుప్రొద్దు పరిణయమ్ము.

గీ. లజ్జకుసు బుద్ధికలదు కల్యాణ వేళ, వధువు నది ముట్టి చలపట్టి వంచెఁగాని
పడలెఁ దలఁబ్రాలతతి; నంత వరుని గెలువఁ, బెండ్లికూఁతురు తలయెత్తి పెనఁగి తనిసె.

ఆ. నాఁడు నేఁడు నోఁచినవి సైఁచినవి మొగ్గ, విచ్చి యాలుమగలు పచ్చవడిరి
చెలువ లెగసియెగసి సేసలఘుట్టమ్ము, చూచిచూచి మిగులఁ జొక్కగనిరి. 299

క. తొలఁగని వసంతఋతువై, నెలకున్ నెలనాళ్లు విరియు నెఱవెన్నెలయై
వల పుండునేని జంటకు, నిల నందనమై కదించు నిష్టసుఖమ్ముల్. 300

ఆ. ఎన్నివైభవమ్ము లున్నను గవితాప్ర, సక్తిలేని పెండ్లి రక్తికట్ట;
దేలవచ్చెఁ గవిత కింతగౌరవము? ని, ర్ణిద్రమైన నియమనిష్ఠఁ గాక? 301

గీ. ఇచ్చవచ్చినగతిఁ బద్య మేగునా క, ఠోరధర్మానుషక్తమౌ దారి విడిచి?
ఒక్కలఘువైన బెడియుట కొప్పుకొనని, ఛంద మందించె దీని కస్పందగరిమ. 302

ఆ. పద్యమును వివాహబంధము నొకజాతి, లోని వగుటఁ బెండ్లిలో రసజ్ఞు
లాసచేయుచుందు రాశిషములఁ బద్య, సరణిఁ బల్కువారికరుణ వదయ. 303

గీ. అర్థ మందనిబాసతో నమలహాస, రుచులతో డాయుబుడుత నూరువునఁ జేర్చి
ముద్దుగొనుచుఁ దదీయాంగమున-రజస్సు-, తాఁకునన్ మైలవడుగేస్తు ధన్యతరుఁడు.

క. తననైతికబల మంతము, జననీజనక ప్రవృత్తిసారమ యనె మో
హనగాంధి; తల్లిదండ్రులు, మనవలయున్ దీని నెఱిఁగి మధురాశయులై. 305

ఆ. మగఁడు కినిసినపుడు మగువయు, సతి యాగ్ర, హించినపుడు పతియు నెడఁద నోర్చి
మందహాసరుచులు చిందింపవలె నీ ర, హస్య మెఱుఁగుజంట కగు సుఖమ్ము. 306

గీ. భోగమునకంటె నురవుగాఁ ద్యాగ మబ్బఁ, దగు గృహస్థాశ్రమంబున దంపతికి, ను
దారతా చారుతరచరిత్రమును గఱపు, పారశాలకదా గార్హపత్యనియతి 307

ఆ. అతఁడు పేదవాఁడె యాలు తన్నెదిరిన, వేళ వేలకొలఁదివిత్త మున్న
నతఁడు సాహుకారె సతి వెంబడించిన, పూఁట రూక లేకపోవుఁగాక. 308

గీ. సంయమమ్మున కాకృతి, చాగమునకు, మూదల, యహింసకున్ నెఱాపాదు వెలఁది;
అబల యనుపేరితో నారి నపహసించు, నాత్మబలమున కెడయెడ యైనవాఁడు. 309

గీ. శిశువు పుట్టఁగనే తొమ్ముచేపుఁదల్లి, పిల్లకై జాగరము సేయు నిల్లి సైఁచు
బిడ్డమే లెంచి ప్రాణములొడ్డి నిల్చు, నమ్మలో నీశ్వరుఁడు కరుణాబ్ధి కలఁడు. 310

ఆ. లేమినైనఁ దెల్పలేమ భిక్షాందేహి, యన్న దీనువాణి విన్నఁ గరఁగు
వారణాసి నేలవదలి వేదవ్యాసుఁ, దా[శమమ్ము గట్టె నాంధ్రమహిని? 311

ఆ. అచట నుంద్రు వేల్పు లెచట నారీసము, దాయ మలరు నర్చనీయ మగుచు
నాతిపరువు చెఱచుజాతి చుల్కనకదా, గోఁచికంటె గడ్డిపోఁచకంటె. 312

ఆ. సంస్కృతాంధ్ర శబ్ద సాధుత్వ మెఱిఁగిన, తెలుఁగువానికూర్చు పలుకువోలె
నాఁటినేఁటివారి నడతలమే ల్గన్న, జంటబ్రదుకు సుప్రశస్తి నందు. 313

* * *

ఆ. ఒండుచోట నాటకుండినచోఁ దల్లి, బ్రాఁకునీడ నున్నమోక పెరుఁగ!
దర్పుఁడైన యొజ్జ కర్పింపకున్నచో, వెలయఁ దయ్యుచెంత నిలుచకొడుకు. 314

గీ. తాలుతప్పల నవలికిం దోలితోలి, గట్టిగింజలఁ జేట చేపట్టుకరణి
ద్రాబలను మెల్ల వెడలించి తగినవారి, దిద్దితీర్చు వివేకియౌ దేశికుండు. 315

ఆ. నిప్పుపుల్ల కెంతనెఱి యున్న నయ్యది, వెలుఁగ దొకఁడు చేయి వేయువఱకుఁ
జిఱుతతెల్వి కెంతచుఱు కున్న నయ్యది, వెలయ దొజ్జ మేలుకొలుపుదనుక. 316

ఆ. ధాత్రి నెల్లవారు తన కగ్గపడుటకై, నరుఁడు సన్నహన మొనర్చుఁగాని
గురుఁడు శిష్యునకును గొమరునకును లొంగ, మానసించు నిరభిమానుఁ డగుచు.

ఆ. అనల చంద్ర భాస్కరాదులు వెలినున్న, కప్పు నుక్కడంపఁగలరు గాని
చాల రెడఁదనున్న సంతమసముఁ ద్రోయఁ, బ్రాజ్ఞుఁడైన గురుఁడె పాపు దాని. 318

క. ఒకదెస నాచార్యుఁడుగా, నొకదెస శిష్యుఁడుగ మెలఁగు నొజ్జకు సత్యా
ర్థి కహంతాదూర, ప్రకృతికిఁ దలవంచు నెంతపండితుఁ డైనన్. 319

ఆ. పరుసవేదికతనఁ బసిఁడియగుం గాని, పరుసవేది యగుట యరిది యినుము
గురునికతన సాధుచరితుఁడౌ శిష్యుండు, గురునివంటివాఁ డగున్ గ్రమాన. 320

ఆ. దిగులువొదము నేఁడు దేశాన వీచెడి, తీంద్రమైన గాడ్పుతీరు చూడ;
ప్రాఁతవిలువ చచ్చుపడెఁ గాని సరిక్రొత్త, విలువ పుట్టదయ్యె వేంద్ర మడఁప. 321

గీ. ఉత్తమాచార్యుఁడే ప్రజ నుద్ధరింపఁ, గలఁడు నెయ్యాలతియ్యాల కాణయాచి
నడవడి నెడంద నుత్తుంగనగముతలకుఁ, జేర్చి యితఁ డజ్ఞజగతి నీక్షించి తేర్చు. 322

ఆ. బుద్ధువంటియతులు, పుట్టపుట్టువువంటి, కవులు, గాంధివంటి కర్మయోగు
లెన్నఁదగిన యొజ్జ లితరేతరప్రేమ, నేర్పువారు మంట లార్పువారు. 323

* * *

ఆ. కన్నవారు చీమగతిఁ గూర్చుసొమ్ముతో, సాదమునకురాని చదువు నేర్చి
వెఱ్ఱియయ్యె నేఁడు కుఱ్ఱఁ డీదుర్దశ, నిక్కువారిబుఱ్ఱ కెక్కవలయు. 324

ఆ. కుఱ్ఱవాండ్ర కెంతకొసవెఱ్ఱి యున్నను, దేశమునకు తేపు దిక్కు వారె
పట్టు విడుపు లెఱిఁగి పాడికి లెంకలై, దిద్దవలయు వీరిఁ బెద్దవారు. 325

ఆ. వయసు చూచి వైభవము చూచి గంగాప్ర, వాహకల్పమైన వాక్కు చూచి
చిన్నవాండ్రు నేఁడు జేజేలుకొట్టరు, త్యాగమునకె వారు తలలువంత్రు. 326

క. ఒప్పునివేసము లుడుగుట, తప్పొప్పుల నెన్నుపట్లఁ దాఁకుట, నుదులన్
గప్పురమును గుప్పించుట, గొప్పతనం బియ్యసేయుకుఱ్ఱకు వలయున్. 327

ఆ. జాతిగౌరవమును సంస్కృతి నలరింప, మానవతను బెనిచి మనుప వేల్పు
నన్ను నరు నొనర్చినాఁ డని పిన్నవాఁ, డెవఁడు నమ్ము వాని దవును విద్య. 328

గీ. వాఁడు విద్యార్థి యెవఁడు జిహ్వను జయించు, నువిదల నెవండు తల్లులపవిదిఁ గాంచు
నోనమాలను గఱపిన యొజ్జ నైన, విడువక యెవండు వినయ మావిష్కరించు. 329

ఆ. తెలివి కదలుకొన్న కొలఁది బోధితుఁ డుప, శాంతుఁ డగుచు వినయచారు వగుచు
నాదరించు నొజ్జ నపుడకదా సదా, తనజయమ్ము వానిదరికి వచ్చు. 330

గీ. ఎపుడొ తన కోనమాలు నేరిపినగురుని, గాంచె మన్ననమెఱవడిన్ గదలునేత
క్రన్న నరదంబు డిగి యొజ్జకాళ్ళ కెరగె, నతనిఁ గని కన్నుదెఱచె గర్వాంధజనము.

ఆ. అభ్యసింపవలయు నాచార్యునడతలో, గోచరించు సుగుణకోటినెల్ల
దుర్గుణం బొకండు తోఁచిన నద్దాని, ఛాత్రుఁ డాదరింపఁజనదు చనదు. 332

గీ. శేముషీనిధియైన దేశికునిపల్కు, మొదట నీకొమ్ము శాస్త్ర మాపిదప నమ్ము
మవ్వలన్ భవదీయాంతరాత్మమాట, పాటిసేయుము శ్రేయముం బడయు మన్న!

ఆ. ఆతపార్తి గూర్చునట్టి వసంతుఁడే, మావిపండ్ల నిచ్చు మల్లె లిచ్చు
నాదియం దలంచునాచార్యుఁడే పోవఁ, బోవఁ జిఱుత కిష్టదైవ మగును. 334

ఆ. శర్మకొడుకు మున్ను చదివె జాన్సనుచెంత, నతఁడు గురున కిపుడు నంజలించు
నతనిపితయుఁ జాటు నాదర; మిది చూచి, పరు లెఱుంగవలయుఁ బాడితెఱఁగు.

క. ఎకరాల్ కలవని నెలఱా, మొకరాల్ గల వనియు వినయమును మఱచు కలా
ర్థికి నచ్చినపట్టము గా, ద్దకు దక్కిన మలయజమువిధన్ వృథపోవున్. 336

ఆ. మన్ను మిన్ను గాలి మున్నగుభూతముల్, దారిడప్పినపుడు తలఁకునట్లు
జగము వీటతాటమగుఁ జూడీ గురుశిష్యు, లాత్మధర్మపతితు లైననాఁడు. 337

* * *

ఆ. శాసనమ్ము లెన్నిచేసిన నవి శుల్క, పీడ నెదిరి మట్టుపెట్టలేవు
మావిచెట్టు మొదట మడిచీర గట్టిన, నది పిసాళి నెట్టు లాఁపఁగలదు? 338

గీ. వేయి తెచ్చునతం డిరువేయి తెచ్చు, బోటి నొల్లఁడు కట్నాలమూట లేక
యాఁడుఁదనమున కిది శిక్షయా కఠోర, ఘోర జాతీయదురిత మీ కుటిలకాంక్ష. 339

ఆ. వెఱ్ఱినమ్మకముల వెడలించి వర్ణాది, భిత్తికల పునాది పెల్లగించి
శుల్కపీడ లడఁచి క్షుధలార్చి దేశము, నుద్ధరించుఁగాక యువచయమ్ము. 340

ఆ. ఏటి నడ్డగించి యిఱుకుబాటను బంప, నీటిబల్మి హెచ్చి మీటు గిరిని
యువజనాత్మశక్తియును నియంత్రితమైన, నిలకు మేలుసేయు నెదిగియెదిగి. 341

* * *

గీ. నేను శూద్రునకున్ విద్యనేర్ప నన్న, పరశురామునిదా తప్పు? బ్రాహ్మణుండ
నే ననిన సూతసూతిదా? యాకులవ్య, వస్థయే జాతికిన్ దురవస్థ దెచ్చె. 342

ఆ. రాజు లండగాఁగ రక్కసకొలములు, బ్రదికె నిన్నినాళ్లు భారతమున
నేఁడు రాజెవండు నీవు నే నాతఁడు; కులము లిప్పు డెట్లు నిలువఁగలవు? 343

ఆ. వాఁడు నాకులమ్మువాఁడు గాఁ డతని రా, పెంపు నే సహింప నింప నన్న
భిన్నబుద్ధికతనఁ బెఱవానికి సలాము, చేసిచేసి జాతి చిదికిపోయె. 344

ఆ. చొంగకార్చునాఁటి చొక్కాయ కుట్టుకు, నడకనేర్చినపుడు తొడుగఁ జిరుఁగు
తాతనాఁటి సంఘనీతి మన్ననివేళ, నడుపఁ జూతురేని బెడిసికొట్టు. 345

ఆ. కలదె క్రిందుమీఁదుగాని వర్ణము, కుల;? మేల రిత్తవాద మేల జంకు
మంకుపట్టు వీడి మానవతావాద, మౌదలన్ ధరింపుఁ డన్నలార! 346

ఆ. వర్ణధర్మకోటి వల్లినవారిలో, నెంతమంది దాని నిడిరి తలను
చెప్పినట్లుచేయు గొప్పవా రున్నచో, నింతచెడదు జాతి చింతపడదు. 347

గీ. మొదట నెల్లమతమ్ములు ముక్తి కొఱకుఁ, బుట్టినవి గాని రాన్‌రాను భుక్తికయ్యె
బల్లికిని బిల్లికిని భయంపడుట నేర్చి, జలగలుంబలె నివి ప్రజాస్రమును బీల్చె. 348

క. క్రీస్తు మొహమ్మదు నానకు, నేస్తులుగా నుందు రనుట నిక్కము సుగతిన్;
కుస్తీ లవివేక తమో, గ్రస్తులకే దురభిమానగంధాక్తులకే. 349

గీ. ప్రాఁతవడె మతమ్ములు రాజనీతి క్రుళ్లె, వలదువల దిఁక వీనితో వాదులాట
నరుఁడు విజ్ఞానమునకు జ్ఞానంబునకును, జెలిమి సమకూర్చి శాంతి నార్జింపవలయు.

ఆ. మతము మాఱినంతమాత్రాన నొఱగెడి, దేమికలదు, నీతి ప్రేమ కరుణ
వితరణమ్ము లేని బ్రతుకు మాఱిననాఁడె, దక్కు నరున కాత్మదర్శనంబు. 351

* * *

ఆ. గోవులేని మహికి లే వన్న పానముల్, సురభి స్రుక్కుచోట నరత కల్ల
మొదట మొదవు నెంచి పదపడి బ్రహ్మజ్ఞుఁ, బేరుకొన్నవారు పెద్దవారు. 352

ఆ. ఆవుగొంతు గోఁత యమ్మకుత్తుక ద్రుంచు, కంటె బెడిదమైన కటికచేఁత
అయ్యె పనుచుఁగాక పెయ్యను దునుమాడఁ, బరశు వెత్తఁగలఁడె భార్గవుండు? 353

ఆ. కూలిపనికిఁ బోవఁ జాలని తల్లికిఁ, బేదవాఁడు కూడు పెట్టుచుండ
నేలమేపవలయుఁ బాలీని ముదిగోవు, నన్నధనికుఁ డెంత కన్నవాఁడొ! 354

క. ఆవును వలగొనుమానిసి, భూవలయముఁ జుట్టి పదయుపుణ్యము నందున్
గోవులకాపరియై వసు, దేవసుతుం డీమహత్త తెల్ల మొనర్చెన్. 355

* * *

ఆ. ఓదె నెమ్మదీయలే దింతలోఁ గొంటె, వాన తొంగిచూచె వరిపొలాన
రైతుగుండెలోన రైళ్లుపర్వెత్తె నీ, యార్తి యెంతమంది కర్థమగును? 356

గీ. గాలికో వానకో మూషికాలికో తె, గుళ్లకో పంటలర్పించి కుసులువిఱిగి
కళవళంపడుకాఁ పెట్లు కాఁడిగట్టు?, నూబిలోఁబడ్డ యేనుఁ గెట్లొడ్డుపట్టు? 357

ఆ. పసపుఁగొమ్ము గట్టి భార్యసూత్రము దీసి, నాలిరైతు విత్తనాలు దెచ్చె
మరల దేనిఁ దీయు నెరువునకున్ గూలి, క్రందునకును బురుగుమందునకును? 358

ఆ. అన్నదాత రైతు విన్ననపాలైన, నెట్లునిల్చు శాంతి యాజగాన
పదవమున్గె నన్న బాటసారుల బ్రతు, కదుగనేల యెంతబెడఁద వచ్చె! 359

గీ. ఉప్పువెల పప్పువెలనూటి కొక్కపిసరు, హెచ్చైనా పెంచు నుద్యోగి కిచ్చుబత్తె;
మెంత క్రుంగికూలారిన హితుని హలికు, నాదుకొన దేమి దొరతనం బాధు లడఁగ.

గీ. హాలికుల నొక్కి జీవచ్ఛవాలఁ జేసి, యేలువా రేమిసాధింప నెంచినారొ
కాఁ పణంగిన నేమొనగాఁడు నిల్చు, రైతుమూల్గిన నేవృత్తి రాణకెక్కు. 361

గీ. ఎవ్వరో కారు కాఁపులయిదుమపాట్లు, కాఁపుబిడ్డలె కదముట్టఁ గానరైరి
తినియుఁదినక పాండవబీళ్లు దునినపితలు, సిరుల నిడి వీరి దొరలఁ జేసినకతాన.

గీ. తెక్క లిచ్చి పోవలెఁ గాని రొక్కమిచ్చి, పోవు టొప్పదు పితరులు పుత్రకులకు
మనసమాజమునం దీమమత్వ మెపుడు, సమయునో సర్వభద్రమ్ము లమరునపుడు.

ఆ. ఓయిరైతులార! యొకమాట, యొకబాట, లేదు మీకుఁ జెలిమిలేదు మీకు
నెంతబలఁగ మున్న నేమిలాభమ్ము? మీ, రాచవిలువ గడ్డిపోఁచపాటి. 364

క. ఏకముకందు కృషీవలు!, లీకొనుఁ దౌదార్యమునకు నెల్లరకొఱఁతల్
మీకొఱఁతలుగా నమ్ముఁడు, చేకుఱు మీ కపుడు లెస్సచేవయు గెలుపున్. 365

గీ. నిన్ను నొకకూలివానిఁగా నెన్ని చెమరు, కురిసినప్పుడె తలయెత్తుకొందు వీవు
దున్నిరా! దోఁకిరా! యని దొడ్డివిడువ, కందువా క్రిందివాఁ డౌదువయ్య హలిక! 366

ఆ. రేయిపగలువంటివృత్తులు కార్మిక, హలికజీవనమ్ము లరసిచూడ
వెత్తిముదిరి వీరి విడఁదీసి పాలింపఁ, గడఁగువారు గెల్పుగనరు కనరు. 367

ఆ. కాఁపు వేఱు కర్మకరుఁడు వే ఱనువారు, గ్రుడ్డివారు తెలివిసెడ్డవారు
కాఁపు జాతి కర్మకరుఁడుగా నగుఁ గర్మ, కరుఁడు పెరిఁగి కాఁపుగా నెసంగు. 368

ఆ. తరతరాన సంతు పెరిఁగినదే కాని, పెరుఁగలేదు పొలము బెత్తెఁడైన
దొరల మన్నమాట మఱచి ఖామందులు, మేఁడి పట్టకున్న మెతుకు సున్న. 369

ఆ. వడపపెళ్ళఁ జిమ్మి వసివాడియును దూడ, మేఁత గిల్లఁదొడఁగె రైతునెలఁత
యాలుమగలు సేద్య మందుకొన్నప్పుడే, యంగిటికిని జేరు నైదువ్రేళ్లు. 370

గీ. కోటికోటి యుగమ్ములనాఁటి పుణ్య, సంస్కృతి తొలంకు నిచటికర్షకునియెడఁద
నతనివెలిరూపు నాగరికతకు దవ్వు, దవ్వుగా నుండుఁగాక తత్త్వజ్ఞుఁ డతఁడు. 371

ఆ. సూత్రపట్టినట్లు సూటిగా నాఁగటి, చాలు వైచె వృద్ధసైరికుండు,
హేతువేమి దీని కీతని వంకర, లేనినడతయా చిరానుభవమ? 372

క. ఏను స్వతంత్రుఁడ ననఁగల, మానిసి తలయెత్తఁదగినమగఁ డొక రైతే
వీనిశ్రమ వీనికరుణ ని, దానముగా నొరులజీవితమ్ములు నడుచున్. 373

* * *

గీ. రాజుల నణంచి బాఁపనరాముఁ డేమి, బావుకొననఁగల్గె? బ్రాహ్మణబాధ లణఁచి
రాచరాముఁడు త్రిభువనారాధ్యుఁ డయ్యె, హింస జోహారు వనియె నహింసమ్రోల.

ఆ. మిథిల నడుగుమోపి మేఁడపైగల సీత, చక్కఁదనము చూచి చొక్కి రాముఁ
డీమె పెండ్లికాని దిది నిక్క మెరునాలి, నస్మదాత్మ వలవదనె బలారె! 375

క. పట్టాభిషేకవార్తను, బట్టణమును విడువు మన్నపనుపును వినినాఁ
డట్టె రఘురాముఁ డొకమై;, దిట్టతనం బక్షయము ప్రతిష్ఠితమతికిన్. 376

గీ. గౌతమీతీరములఁ బంపగట్లమీఁదఁ, దిరిగితిరిగి రాముఁడు తెల్గుదేవుఁ డయ్యె
నితఁడు నేర్పినవే మనబ్రతుకులోని, సత్యనిష్ఠయు శూరతాస్ఫారతయును. 377

ఆ. ఆపె శబరవృద్ధ, యామె యెంగిలిచేసి, యిడిన రేఁగుబండ్ల నిచ్చరేఁగ
మెక్కినట్టివాఁడు మొక్కలీఁ డందురా, తనువుఁ దాల్చి నట్టి దయ యతండు. 378

ఆ. నాథు నడిగె సీత నాముద్దుఁజిల్క పే, రెదియొ నిర్ణయింపవే యటంచు;
అస్మదాత్మ కైక యామెపే రిదు మనె, రాఘవుం డుదారతాఘనుండు. 379

గీ. వదినె కన్నకు నే రేయి వగలు వేయి, కనులఁ గాపుండవలెఁ గాన ననుఁ దొలంగి
యుండు మూర్మిళతో నిచ్చ లోసి! నిద్ర!, నతులు నీ కన్నసౌమిత్రి కెతఁడు సాటి! 380

ఆ. నోరుజాఱరాదు నేరము తెల్లమై, వచ్చుదనుక లాఁతివానిపట్ల
మచ్చులేని మఱఁదిమదిఁ జిచ్చుపెట్టిన, సీత పడ్డపాట్లు చెప్పవలెనె? 381

ఆ. మంచివిందు గూర్చె మర్కటపతి లక్ష్మ, ణునకు, నైన ముట్టుకొనఁ డతండు
తాను దెచ్చుపండ్లఁ దనయన్న సాపడ, మిగులునవియ తిను సుమిత్రకొడుకు. 382

ఆ. హనుమ కడలిదాఁటె నవనీసుతం జూచె, నేర్చె లంక వీని నెంతుఁగాని
కంటి జానకమ్మఁ గంటి నే నని రఘు, స్వామిఁ గనుచు నంట చాలమెత్తు. 383

గీ. లంకను విభీషణున కిచ్చి తింక నితని, యన్న శరణార్థియైన నెయ్యది యొసంగె
దనిన రవిపుత్రునకు రాముఁడపు డయోధ్య, నిత్తు ననియె నుదారత యిట్టులుండు.

ఆ. జూదమందు ధర్మసుతుఁ దోడి సౌబలుఁ, డిం దజయ్యుఁ దగుట యెఱిఁగెఁగాని
యక్ష మేలపట్టె నతఁడు వెండియు? నని, వార్యమైన ప్రకృతి వంపలేక. 385

గీ. ఎంతసిరి యున్నఁ జెలికాని కెగ్గుసేఁత, హేతువగు దుర్భరాపత్తి నీఁగి వగవ
ద్రోణుని సతీర్థ్యు భంగించి ద్రుపదుఁ డెంత, పరిభవము నందఁ దక్కటా పదురయెదుర.

గీ. కరముసూక్ష్మము ధర్మ, మగ్రజుని గ్రీడి, తిట్టి పాచితముగఁ దల ద్రెంచుకొనఁగఁ
బూనుదు మురారి వలదు నిన్ బొగడుకొంట, చాలు నియ్యది చావుతో సాటి యనియె.

ఆ. ఓటుగాక యేమియొఱగు నీసున? జగ, దేకవీరు లెందఱెంద ఱంద
దండలైనఁ గలన ధార్తరాష్ట్రుఁడు భంగ, పాటుగనఁడె రాజకోటి నవ్వ. 388

గీ. ఆశ్రయించినవాఁ డెంతయలఁతి యైన, వదలఁ డతని సుదారుఁ దేహదనియందు
దివికిఁ బయనించునాఁడు యుధిష్ఠిరుండు, విడిచెనా తనకుక్కను వెంటఁగొనక? 389

ఆ. దుస్ససేను వ్రేళ్ళతోడితాఁకున మైల, పడ్డకురుల నతనిపచ్చి నెత్రు
ముంపుతోడఁ గడిగి ముడిచినద్రోవది, యాంధ్రమహిళ యయ్యె యజ్ఞకరుణ. 390

ఆ. చాలు నొక్క మేటిసాయంబు ముక్కడి, బలఁగ మెంతయున్న ఫలము సున్న
కృష్ణు నొకనిఁ గోరి క్రీడ గెల్చెను, మూఁక, కుబ్బి ధార్తరాష్ట్రుఁ డోటువడియె. 391

ఆ. వెతలఁబడ్డదొడ్డ లితరుల దుఃఖంబు, సైఁపలేరు; పరమశత్రువైన
ద్రౌణి నోమె ద్రుపదతనయ తజ్జననికిఁ, దనకుబలె సుతార్తి తగ దటంచు. 392

క. కట్టిఁడితన మని నుడువం, బట్టు గదా శల్యుతీరు, బవరమునందున్
నెట్టన వర్ధాహంకృతి, బట్టబయల్చేసి కర్ణుఁ బలుచట గన్నన్. 393

ఆ. కోరికోరి సల్పె శౌరి యుధిష్ఠిర, సవనవేళ నతిథిచరణసేవ,
యెల్ల వానికాళ్ల నితఁడు కడిగి యొత్తె, నిక్కు నింద్య మన్ననీతి నేర్పె. 394

గీ. వెరవుమైఁ గల్ల నిజముగా వినుచుఁగాక, దవ్వు గాలేఁడు మనుజుండు దండ్యదశకు
ధర్మజుం దేన్గునెపమునఁ దప్పువల్కి, ఘోరనరకమ్ము గని క్రుయ్యబాఱఁడోటు? 395

ఆ. కష్టపడనివానికడ కెన్నఁడును సిరి, రాదు రాదు మందరమును మోసి
గాసిపడినకతనఁగద లక్ష్మి దక్కె నా, రాయణునకు జగ మహో! యనంగ. 396

ఆ. కోపియయ్యు మగఁడు లోపదు నిల్లాలి, కాపె సాధుశీల యైననాఁడు
శివుఁడు లొంగఁడేమి సెగకంటివాఁ డయ్యు, మగువ కార్య కొదలు సగ మొసంగి. 3

గీ. వహ్నిశిఖ నాఁ దగున్ బతివ్రత; తదీయ, మహిమమున కద్దిలేదు; బ్రాహ్మణుఁడు కినిసి
యెఱ్ఱసెరలఁ గొంగను బొరియించెఁ గాని, క్రొత్తదిని గెల్చెనా కిన్మకుప్ప యయ్యు.

ఆ. సాధుశీలయైన చానకు దుస్సాధ, మైనవిజయ మెద్దియేని కలదె
విగతజీవుఁడైన విభుని సావిత్రి స, ప్రాణుఁ జేసె నొండు పలుకనేల? 399

ఆ. సుతుఁడు దిట్టయైనఁ బితరులవెత లెట్లు, చూడఁగలఁడు దాస్యపీడఁ బడిన
జనని నుద్ధరింప జగజెట్టి గరుడుండు, సురల నెదిరి గెలిచి సుధను దేఁడె? 400

ఆ. బ్రతుకలేరు మరల మృతు లనె ముదిగ్రద్ద, బ్రతుకవచ్చు ననియె బదుగునక్క
స్వప్రయోజనంబు సాధింపఁగా వల, పన్నువార లిట్లు పలుకుచుంద్రు. 401

గీ. పెండ్లిగానిబాల జబాల, పేదరాలు, దారిదప్పినబ్రదుకులోఁ దనయుఁ గనియె
సత్యరతిచేత నాతఁ డాచార్యుఁ దనిపి, బ్రాహ్మణుం డయ్యె ధన్యతాభాగి యయ్యె. 402

ఆ. విలుచునప్పు డమ్మువేళ మోసము నొల్ల, వలతు నుచితలబ్ధి, వదల దయను,
బొంకుపలుక, నన్నుఁ బొగడుకో; నను తులా, ధారు మెత్తు నఘవిదూరచిత్తు. 403

* * *

ఆ. బానిసమున మనము పడసినసుఖముతో, నేఁడు పడయుసౌఖ్య మీడు గాదు
కాదుగాని స్వేచ్ఛగలవేళఁ దార్కొన్న, గ్రుక్కు మేలు నాఁటిసుఖముకంటె. 404

క. వైయక్తిక స్వతంత్రత, పోయినమహి వెండిగిండ్లు పొంబళ్లెరముల్
తీయనిబోనము లున్నను, ధీయుతు లా మూఁగబ్రదుకుఁ దీ రొప్పుదురా? 405

గీ. సకలభారత మొక రాజశాసనమున, కెపుడు లోపడె నిపుడుగా, కిది యుదీర్ణ
శక్తి నిడుఁగదాజాతికి, సన్నసన్న, దొసఁగులకునేమి మెలమెల్లఁ దొలఁగఁబాఱు. 406

గీ. ఊరి కొకతేఁడుగా మనయుర్వి యకట!, నిన్న మొన్నటిదనుక నెన్నెన్ని వెతల
స్రగ్గెనో దైవమ యెఱుంగు, సాటిలేని, యోధుఁడు పటేలుకద దీని నుద్ధరించె. 407

గీ. దేశమునఁ బదిమంది గద్దియలమీఁది, కెక్కినంతన కాదు వా రేలుతీరు
తగని దగునేని యెదురించుతెగువ ప్రజకు, వచ్చినపుడే స్వరాజ్యంబు వచ్చినట్లు. 408

గీ. దారిదప్పిన గొప్పసర్దారులైన, దేశ మాక్రోశి యైనచోఁ దిన్నఁబడుదు
రభయమును నేర్చి జనము సత్యమును బయలు, పెట్టవలెఁ గుండబ్రద్దలుకొట్టినట్లు.

క. వాకులతో వర్షముతో, రూకలతో నోట్లు వచ్చురోజులు కడచెన్
లోకమిది రాజనైతిక, ధీకిన్ వెలకట్టు, దీనిఁ దెలియుఁడు దిట్టల్! 410

ఆ. ఓటుకొఱకుఁ గాదు సాటిమానవుఁ డని, యాదరింపవయ్య! పేదవాని
నచ్చమైనకూర్మి కలవాటుపడి శాంతి, నిధివి కమ్ము తేఱి నిద్రపొమ్ము. 411

ఆ. అడుగలేఁడు లంచ మధికారి సజ్జను, నీయలేఁడు లంచ మిద్ధచరితుఁ
డిచ్చునతఁడె దాఁటు నిక్కట్ల, నక్కటా!, మంచివాఁడు బ్రదుకుమార్గ మెదియొ! 412

ఆ. పనికివచ్చు నేఁడు సెనగలు మెక్కుచు, జొన్నలని వచించి చూపు మనిన
నులవలను వెలార్చి యొసఁగుమీ యన నాము, దాలు రాల్చువాఁడు తంత్రమునకు.

ఆ. "దేనికైనమంచి దే నెట్టిజెందాను, గారవింతు, నీవు కదరుగట్టు"
మనుజుతోడఁ బల్కు నన్న యీమాట, లీ, గతికిఁ దెచ్చె నతని గద్దెవలపు. 414

గీ. ఐదుబారలఱాబాట కలఁతినూతి, కేలుబడివారికరుణ రా నెదురుసూచు
ప్రజలకు స్వరాజ్యమున్నను బ్రగతి సున్న, దేశ ముద్దీప్తి గన దిట్టిదేవు రున్న. 415

ఆ. ఏలువారిమీఁద నెన్నో విమర్శలు, సాగుచుండుఁ జిత్తజల్లులట్లు
బెదురులేక దొరలు పదర కాత్మపరీక్ష, కొగ్గవలయు నిజము నొప్పవలయు. 416

ఆ. గాంధి తిరుగఁబాటు కఱపెఁ గాన నశాంతి, కగ్గపడియె దేశ మనెడివారు
జాఱవిడుతురేమి సత్య మహింసయుఁ, బాయరాని వన్న బాపుమాట? 417

ఆ. మతకులాసుహృత్సమాజ మేర్పడినచోఁ, బ్రజ గణించు నరునిబ్రదుకు నపుడు
మంచిబ్రదుకువాఁడు మంత్రిగా వచ్చెనా, భువిని సుఖము శాంతి పొంగఁగలవు.418

గీ. మండలాదివిభేదముల్ మఱచి రాష్ట్ర, దీప్తి నర్థించు తమిళులతీరు మెత్తు
నెన్నితెగ లెన్నివేర్పాటు లున్ననేమి, మాతృమహిఁ బెంపుదెస వీరిమాట యొకటె. 419

క. ఈ కాల్వను బొడిగించిన, నాకులమునవారిపుంజ నంజగ నగునా
కాకున్న మానుటొ ప్పని, వాకొనువాఁ దుర్వి నేల వల్లడి వచ్చున్. 420

ఆ. పేదవానికంటెఁ బేదగా నలయుచు, నార్తసేవయందె యసువు లూద్వ
నెవ్వఁ డియ్యసేయు నీనేల నేలఁగా, నతఁడె పాత్రుఁ డతనిబ్రతుకె బ్రతుకు. 421

ఆ. పదవిలేదు నేఁడు పరిచరశ్రేణి లే, దైననేమి వాని కసము కలదు
ధర్మదూరమైన ధన మాసచేయని, దిట్ట యగుట నాతఁ డిట్టు నిలిచె. 422

ఆ. కల్ల నాశ్రయించి గ్రామాల దేశాల, నేలువారిభోగ మెన్నినాళ్లు?
సంత కేగివచ్చు నంతలో నది నివ, ర్తిల్లు నని జగచ్చరిత్ర చాటు. 423

గీ. ప్రజలకష్టాలలోఁ గష్టపడుట కోర్చి, ప్రజలసుఖములలో సుఖంపడుట నేర్చి
యదఁకువకు దవ్వుగాని ప్రెగ్గడల మెదల, జగము వేమాఱు విరజాదిసరులు నింపు.

గీ. చేవగలవారి నందఱఁ జెండిచెండి, దుక్కికిన్ గోఁతకున్ బంపు దొరతనమ్ము
రావలయు మూఁడుపూవు లార్కాయ లగుచు, దేశమునఁ గల్మి చెల్మి నర్తింపవలయు.

క. ఓ రాజకీయనాయకు, లారా! పోరాట కాదయా! నెయ్యమ్మున్
నేరుపుఁ దపరిగ్రహమున్, నేరుపుఁడీ లోకమున కనింద్యచరిత్రన్. 426

ఆ. రాజకీయ సంగరక్షోణికిం దెచ్చి, చిన్నవాంధ్ర నేలచెఱుతు రయ్య!
నేతలార! మీకు జోతలుచెల్లింతు, జదువనిందు వారి నెదుగనిందు. 427

ఆ. వానిజీత మైదువంద, లాతనికుక్క, లారగించుకంద కాఱువంద;
లెట్లుసాగుచున్న దీభోగ, మెందఱు, నొవ్వ లతనిపాల నవ్వులగునొ! 428

ఆ. రాముఁ దడిగె భరతు “నేమోయి! మేధావి, నింద్రియార్థవిముఖు నీవు మంత్రిఁ
జేసితే” యటంచు; నీసూక్తి రేపవల్, మఱవకుంట ప్రెగదమనువుపంట. 429

ఆ. మాఱువేస మూని మంత్రి వినందగుఁ, బ్రజలు తన్నుఁగూర్చి పలుకుపల్కు
తనయనుగ్రహాన మనువారి మెఱమెచ్చు, నమ్మెనా యుపద్రవమ్ము వచ్చు. 430

గీ. ఆనకట్టల విశ్వవిద్యాలయముల, మాట కొన్నాళ్లు మంత్రులు! మఱచిపొండు
కఱటిమద్యపిశాచి నీగద్దనుండి, పాఱఁదోలుఁడు పదఁతులపరువు నిల్వ. 431

క. బడికేగిన-గుడికేగిన-, మడికేగినచాన మానమర్యాదల వ
చ్చెడిప్రొద్దులు శంకంబడి, కదుఁ గుందు గృహస్థు నేఁడు కనుఁ దధికారుల్! 432

ఆ. పండిపండి నరుఁడు తిండికి వల్వకు, మించుకల్మి కేవగించినపుడు
దొంగ లేఁడు నిందితుఁడు లేఁడు పగ లేఁడు, ఱేఁడు లేఁడు మంతిరియును లేఁడు.

గీ. పదవి మఖ వచ్చి పుబ్బలోఁ బరువుడీయు, సంపదలు చంచలములు నశ్వరము కాయ
మేలయడియాస లన్నలు! పోల బ్రదికి, నిత్యమగు గద్దెకెక్కి శాంతిని గనుండు. 434

ఆ. నాది నీది యన్నభేద మున్నన్నాళ్లు, తొలఁగ దొకని నొకఁడు దోఁచుకొనుట
సంశయమ్ము లుడిగి సర్వ మీశావాస్య, మన్నదెసకు మరలుఁ దన్నలార! 435

గీ. ధరణి కంపించుతఱిఁ బర్వతంబులును జ, లించుకైవడిఁ బ్రజలఁ బాలించువాఁడు
పాడిదప్పిననాఁడు కన్పడదు నీతి, పల్లెపట్టుల నగరాలఁ బట్టణముల. 436

ఆ. రాణివంటిచాన ఱాల్ మోయుచున్నది, కరుణలేని మంటగాడ్పునందు
తట్టరాపుకతనఁ దల బోడియయ్యె నీ, చెట్టు దేశమునకుఁ బిట్టపిడుగు. 437

ఆ. ఎల్లి పాలలోని కిల్లె చక్కెర యని, యార్చువానిమాట నవలఁబెట్టి
గంజిలోని కుప్పుగల్లులే డిష్ట దని, కుందువాని నాదుకొందు దొరలు! 438

క. ఒకయింట సిరులుమూల్గుట, యొకయింటన్ బ్రేవు లఱచుచుంటయుఁ గల నే
లకు శాంతియుఁ బాషాణము, నకు సంతానంబు నొక్కనాఁడే కలుగున్. 439

ఆ. అర్థరాశినెల్ల నఱిగించుకొనలేక, దొంగదారిఁబట్టి క్రుంగి కుములు
నరుఁడు కన్నువిప్పి కరుణకు దాసుఁడై, కరఁగవలయు విడుపు మరగవలయు. 440

ఆ. దాఁపరాదు నరుఁడు తనయక్కఱకొలంది, కెక్కు డైనకల్మి నెఱకమాలి
దాఁచునేని హింసయైచెల్లు నదియు నె, న్నేనివెతలు మూఁడు దానికతన. 441

ఆ. మిద్దెవాఁడు నాల్గుమేడలవాఁ డాయె, గుడిసెవాఁడు పోయె గుట్టనీడ
కేల తెల్లవారి నెదిరించి వెతలోర్చి, పడసె నేలుబడిని భారతమ్ము? 442

గీ. గాడిదకు గుఱ్ఱమునకును గడచె వార, బూడిదకు సిమెంటునకును బోయె వేర్మి
పాపమునకుఁ బుణ్యమునకుఁ బాసె వాసి, కటకటా! కల్పవేళ దగ్గఱిన దేమొ! 443

ఆ. కలిమి హెచ్చునేని కష్టంపడుట హెచ్చు, నిరుగుపొరుగువారి యీసు హెచ్చు
దొరలరాపు హెచ్చు దొంగలగిలి హెచ్చు, వలదు కొలఁదిలేనివలపు సిరుల. 444

ఆ. పడగవిప్పి తోఁకపైనిల్చి పూత్కృతి, ధ్వనులుగ్రక్కు కోడెత్రాఁచు కాదు
కూడులేనివాని కుక్షిలో నెగసిన, చిచ్చు కడిఁదిముప్పు దెచ్చు మహికి. 445

ఆ. అంతుపొంతులేని యాస్తుల నార్జింపఁ, గడఁగువారిపప్పు లుడుక వీఁకను
జడత వీడినారు కడగొట్టుతమ్ములు, కదలినారు నొసటికన్నువిప్పి. 446

ఆ. చట్టమునకు లొంగి సరకారువారికి, హేమ మప్పగించు టేమిగొప్ప?
కోరికోరి పేదగోడు మాన్పుట యశః, కారణంబు విజయతోరణంబు. 447

ఆ. నిక్కమైనశాంతి నిరుపద్రవంబగు, జీవనంబు నాసచేయువాఁడు
కలిమికతన సిద్ధి గనలేఁడు లోభాది, నెట్టివైచి యీవి నేర్వకున్న. 448

క. అందఱలోఁ దన్నుం గని, యందఱఁ దనయందుఁ గన్నయతఁడే ధనవద్
బృందమునన్ దలమానిక, మెందును గగ్గోలుపుట్ట దీసాహునకున్. 449

గీ. ఉపనిషత్తులగుట్టు కా దుదరబాధ, తొలఁగుమార్గము వివరింపవలయుఁ బేద;
కచ్చుతేనె కీడగుపాట యగునుగాక, తేలుకుట్టినవాని కేలీల నించు. 450

గీ. కుమ్మరికిఁ గమ్మరికిఁ దిండి కొఱఁతవడిన, గ్రామసీమల దైన్యమ్ము క్రమ్మినట్లు
పల్లెపట్టుల వెలుఁగు రూపఱిననాఁడు, భారతసవిత్రి మంచముపట్టినట్లు. 451

ఆ. పల్లెటూరఁ గాదు పట్టణమునఁ గాదు, వసుధ నెచటఁ బోరు వచ్చుఁగాక
లేమితప్ప హేతు వేమికన్పడు? సుఖ, స్థిరుఁ డెవండు కోరు దురము సేఁత. 452

గీ. గాలికిన్ బరువెత్తెడి పేలపిండి, కేశవార్పణ మనువాఁడు క్రిందివాఁడు
వసువు గోల్పడి ధన మలవంటి దనెడి, ముసుఁగుబేరియు నగుఁబాట్ల మునుఁగువాఁడె.

క. గృహమేధికైన ముక్తి, స్పృహ రేఁగినవానికైనఁ గృత్యము త్యాగం;
బిహపరసుఖమ్ముల కిదే, మహిష్ఠసాధనము లోకమాన్యంబు సుఁడీ! 454

క. భూపతికో సాహునకో, లోపడి జీవించువాఁడు లోభాదిదురా
శాపటలికి లోనై శిర, మూఁపెడి వెడమాసికంటె నుత్తముఁడు సుఁడీ! 455

గీ. సామ్యవాదము తగు నంట చాల దిందు, మనుజులందఱు నొకరీతిఁ గనుట వలయు
నుత్తమాధమనిర్ణయం బుడుగవలయుఁ, దలకుఁ దగ్గదు కా లని తలఁపవలయు.

గీ. సంఘమున హెచ్చుతగ్గులు సమయుదనుక, నెల్లరకుఁ గూడు గుడ్డ సంధిల్లుదనుక
రాదు నవసమాజము కళారంగ మెంత, నిండుకొన్నను నదులెన్ని నిలువఁబడిన. 457

ఆ. రిత్తవెచ్చములు పరిత్యజించిననాఁడు, పేద లుండ రిలను బెక్కుమంది,
కలిమిలేక కాదు తెలివిలేక నరుండు, మోయుచున్నవాఁడు ముతికిబ్రదుకు. 458

ఆ. అత్తగారి కాలమ్మై పోయెఁ గోడలి, కాల మేగుదెంచెఁ గాఁపురమునఁ
బెత్తనాలకొఱకుఁ బెనఁగెడిపెద్ద లీ, గుట్టెఱింగి తేఱుకొనుట లెస్స. 459

ఆ. పదవికతన నొకఁడు పడయును గరిమంబు, పదవి యొకనికతనఁ బడయు గరిమ
మొదటిబంతివాఁడు ముకుటంబు దాల్చెనా, పట్టపగలు చుక్క లుట్టిపడును. 460

* * *

గీ. గాంధి పుట్టినప్రొద్దిది కలుషతిమిర, భాస్కరుం డుదయించిన పరమపుణ్య
వేళ యిది యన్నలార! కన్విప్పుఁ డనుచుఁ, బలుకు నక్టోబరుమహః ప్రభాతభేరి. 461

గీ. యుగయుగమ్ములు చరితలో నుజ్జ్వలించు, పోరు నడిపిన బాపుజీవీరగాథఁ
దలఁచి పులకింపుఁ డీముహూర్తమున ననుచుఁ, బలుకు నక్టోబరుమహః ప్రభాతభేరి.

గీ. అసి ధరింపక జగ మహో! యనఁగ లాఁతి, రాచఱికమును ద్రోసి భారతసవిత్రి
గరిమ నిల్పిననెఱజోదు గాంధి యనుచుఁ, బలుకు నక్టోబరుమహః ప్రభాతభేరి. 463

గీ. ఆత్మశక్తి నణంపలే దసురశక్తి, పదవి నొల్లఁడు లోకసేవకుఁ డటన్న
సత్యము బయల్పఱిచె జాతిజనకుఁ డనుచుఁ, బలుకు నక్టోబరుమహః ప్రభాతభేరి.

గీ. కపట మెఱుఁగని, యపజయాక్రాంతి కదరి, ధృతి దొఱంగని రాజనీతిజ్ఞుఁ డనఁగ
నొకమహాత్ముఁడె తగినవాఁ డుర్వి ననుచుఁ, బలుకు నక్టోబరుమహః ప్రభాతభేరి.

గీ. ఒరులతప్పులు వేనవే లోర్చుఁ గాని, యోర్వఁ డయ్యెను దనదోస మొక్కఁడేని
మోహనుఁడు శౌచరమణీయమూర్తి యనుచుఁ, బలుకు నక్టోబరుమహః ప్రభాతభేరి.

గీ. బాపుజీ మర్త్యుఁ డనుమాట రేపు వచ్చు, నరులు నమ్మరు కాని పుణ్యములు పండి
చూచి రీనాఁడు కొంద ఱాసుకృతి ననుచుఁ, బలుకు నక్టోబరుమహః ప్రభాతభేరి.

గీ. గ్రాస వాసో నివేశదుఃఖములఁ జిక్కి, తేటదప్పిన యనదకన్నీటిఁ దుడువ
దీక్షితులు గండు నేఁడు గాంధేయు లనుచుఁ, బలుకు నక్టోబరుమహః ప్రభాతభేరి.

గీ. భగవదవతార మన గాంధి భారతమునఁ, బుట్టి తనజాతినాడిని బట్టుకొనియె
నడిదములులేని బవరంబు నడిపి సకల, ధరణి కబ్రమ్ముగూర్చె సోదర్యులార! 469

ఆ. బ్రదుకునం దహింస పాటించి గెల్చిన, ఘనులు కొంద ఱవనిఁ గలరు గాని
గాంధితక్క నెవఁడుకలఁ డహింసను రాజ, నీతితో బిగించి నెగ్గినతఁడు? 470

ఆ. నిక్క ముండుచోట నెమ్మియు నుండు; నీ, రెండు నుండుచోట నుండు బ్రదుకు;
లేనిచోట మృత్యువే నిల్చు ననుగుట్టు, గన్నవాఁడు నేఁడు గాంధి యొకఁడె. 471

గీ. నన్ను రక్షించినది ప్రార్థనంబ యనెద, వెడఁగనై యుండు నిది లేనియెడల నేను
నిలువ దొడ లోగిరములేక, నెగడ దాత్మ, ప్రార్థనములేక యని లెస్సపలికె గాంధి!

ఆ. మొరపనేలఁ బండె మూఁడవతరగతి, రైలుపెట్టె నెక్కి రాపు లోర్చుఁ
బచ్చి పేదకరణి బ్రదికె సత్యాన్వేషి, యగుటఁజేసి కృత్య మరసె గాంధి. 473

ఆ. భారతోర్వి యెంత భ్రష్టమైనను దాని, యాత్మ రూపుమాయ దనుట నిక్క
మప్పుడపుడు దీని కభ్యున్నతిం గూర్ప, వచ్చుచుంద్రు గాంధివంటి ఋషులు. 474

ఆ. నియతిలేని రాజనీతి; వేసటలేని, కలిమి, నడతలేని తెలివి, పాడి
లేని బేర, మీవిలేని పూజావిధి, చెనఁటితప్పు లని వచించె గాంధి. 475

ఆ. నూలుదీఁత నా కనుత్తమవిధి, విడ, రానిచేఁత; యిందు దీనుఁజూతు
నతనియందుఁ జూతు హరి నన్నబాపున, కుద్ది యెవఁడు పరమయోగి యతఁడు.

క. కవితా గీతాది కలా, ప్రవణులలోఁ బెక్కుమంది, బ్రదుకున శౌచ
చ్ఛవిలేనివార, లీవెలుఁ, గవు సత్కళ యన్నబాపు నభినందింతున్, 477

గీ. ఎవ్వనికి నొవ్విమూఁడిన నేను దాని, కగ్గపడినట్లు భావింతు నార్తుఁ డెంత
వగచు నే నంతవగతు నీశ్వరుఁడు నన్ను, నిట్లు పుట్టించె ననుగాంధి కేటికోళ్లు. 478

గీ. ఏ నెఱుంగుదు సంపన్ను లెందఱేని, దురితమంటని మనుగడతోడ నుంట
ధనముగలవారిలో మంచితనము సున్న, యనుట వర్తింప దెల్లర కనియె గాంధి.

గీ. హెచ్చుతగ్గులతో జాతి కెగ్గుసేయు, నేఁటివర్ణవ్యవస్థ మన్నింపఁజాల
శూద్రుఁ దల్లుఁడు కావచ్చు శూద్రకన్య, యాలు గావచ్చు బాఁపని కనియె గాంధి.

గీ. నన్ను బ్రదికింప నెంతురే నన్నలార!, చంపుఁ దస్పృశ్యతను; దీని సాఁక నిచ్చ
గింతురేని ననుం జంపుఁడీ యటన్న, గాంధి కెనవచ్చు నౌదార్యఖని కలండె! 481

గీ. తప్పుసేయుట నరునకుఁ దప్ప, దతఁడు, తప్పు నంగీకరించుట గొప్పగెలుపు,
తప్పు నిఁకఁ జేయఁబోనని తా నొనర్చు, నియతి యొకతపం బనియె మనీషిగాంధి.

ఆ. మలమునెత్తఁగా సమాజమం దొకవర్గ, ముంట వలయునంట యొప్పఁజాల,
నెవనిముఱికి వాఁడె సవరింత చను, నెల్ల, పనియు మాననీయ మనియె గాంధి. 483

క. తల్లులవలెఁ గూఁతులవలెఁ, జెల్లెంద్రవలెన్ సమస్తసీమంతినులన్
మల్లీమంజరి కెనయగు, నుల్లముతోఁ జూచి గాంధి యొకఋషి యయ్యెన్. 484

ఆ. బాపుజీతపఃప్రభావమ్ము భారత, భూతధాత్రి ముక్తిహేతు వనుట
చాల, దస్వతంత్రజగమెల్ల నిద్దానఁ, గన్నుదెఱచి పడసె గౌరవంబు. 485

ఆ. భారతీయుఁ దన్న బాపుజీ కెక్కటి, గారవమ్ము కలదు, కాని వీని
నాదరించుపట్ల నతఁ డొండుమానిసి, కెగ్గు దాపరింప నియ్యకొనఁడు. 486

ఆ. చిన్నతప్పు నొరునిచెవికిఁ దెచ్చినగాంధి, పెద్దతప్పు దాఁచిపెట్టలేదు
బ్రదుకునెల్ల బట్టబయలు సేయంగల, గుండెబలిమి నేలుకొనె నితండు. 487

గీ. చట్టమునుబట్టి నాసల్పినట్టి పనులు, నింద్యములు కానఁ దగుశిక్ష నిర్ణయింపుఁ
డల్పదండము నర్థింప నన్ను! యనుచుఁ, దీర్పరికిఁ బల్కుగాంధికి దీటెవండు? 488

క. ఏ నుపవసించినప్పుడు, నానోటన్ బలిమి నోదనము నెట్టిన లా
లానీరము వెలువడ దనఁ, గా నోపినగాంధి తపసిగా కెవ్వఁడయా? 489

ఆ. మానె నుప్పు, పప్పు మహనీయ కస్తూరి, ముసురుకొన్న రోగముల జయింప;
బాపురే! త్యజించె బాపుజీయును వాని, నింతిమీఁది ప్రేమ కెల్ల లేమి. 490

గీ. బందిగమునొచ్చి గుదియదెబ్బలు భరించి, లేమి నీకొని మృత్యువు నామతించి
బాపుజీబంటు జగదేకపౌరుషంబు, చాటె మాతృధరిత్రిదాస్యము నడంప. 491

గీ. ఎండక న్నెఱుఁగనిలేమ యిల్లు వీడి, వీరతా ధీరతా రుచిస్ఫార యగుచుఁ
దెల్ల దొరశాసనమ్మును ధిక్కరించె, గాంధిపల్కులు వేదవాక్యములు కాఁగ. 492

గీ. ప్రొద్దుక్రుంకని పుడమికి నుద్దిలేని, తేఁడుగా నున్నయెదిరి నిర్వీర్యుఁడాయె
సత్యమునకు నహింసకు జయము వచ్చె, గాంధి నవభారతస్రష్టగా వెలింగె. 493

ఆ. అతఁ డజాతశత్రువఁట తండ్రినే చంపి, యవని కానలిచ్చె నాఘనుండు
రాజ్యలోభ మింతరక్కెస యగుటనే, గాంధి దాని కెడవుగాఁ జరించె. 494

ఆ. గుడుల కేగలేదు గుహలకుఁ బోలేదు, ప్రజలనడుమఁ గడపె బ్రదుకునెల్ల;
ఒడలు దేశసేవ కెడఁద రామునిసేవ, కప్పగించి ముక్తి నందె గాంధి. 495

గీ. మీవిభూతి నపేక్షించి తా విభూతి, యయ్యె దేశీయులార! మహర్షి గాంధి;
ఆతనికలలను బండింపఁ బ్రతిన పూనుఁ, డింటనింటను శాంతిసౌహిత్య మెసఁగ.

ఆ. కత్తివిడుతు మేము నెత్తురు గన మేము, కరుణ ప్రేమ జీవగఱ్ఱ మాకు
మఱవనొల్ల మఖిలమానవ శ్రీ నని, బాసచేయరయ్య! భ్రాతలార! 497

గీ. మానుఁడు దురాశ, కులవర్గమత వివాద, మఱవుఁ డన్నలు! నెయ్యంబు మరగి మనుఁడు
మేలుకోరెడివాఁ డొరు మేలు కోర, వలయు ననుసూక్తి మర్మంబు తెలిసికొనుఁడు.

గీ. ఎల్లలం గలరిపుల జయించుకంటె, మున్ను మీమీకెలంకుల మోహరించు
పగఱ లోఁగొని నవశక్తి పడయుఁ డన్న!, లెల్లదిక్కుల మీకీర్తి వెల్లివిరియ. 499

గీ. భారతోర్వికిఁ బ్రాణంబు పల్లెటూరు, సాగుఁడీ సోదరులు! దీని సంస్కరింప
బాపుజీజన్మదిన మహాపర్వ మిద్ది, కట్టుఁ డీలగ్నమున ధర్మకంకణంబు. 500

* * *

క. అగపడదే నని యూ, రేగెదరా ప్రజలు నింగి కెగసిన ధరలన్
గ్రాఁగుచు వెడవెడ తిండికి, లోఁగుచు నడపీన్గులై యలుగులంపడుచున్. 501

క. అగపడదే నని యూ, రేగెదరా ప్రజలు గద్దెకెక్కినపిదపన్
వీఁగుచుఁ దగువారల పెం, పొఁగుచు నడయాడుదొరల నతిముతిఁ గనుచున్. 502

క. అగపడదే నని యూ, రేగెదరా ప్రజలు సిగ్గు నెడపెట్టి యుద
గ్రాగః ప్రియజీవనులై, నాగువులై పెద్ద లెగసి నాటకమాడన్. 503

క. అగపడదే నని యూ, రేగెదరా ప్రజలు వాత్య యెసరేఁగు తతిన్
సాగరమునఁబోయెడి తరి, లాగున భరతోర్వి యుత్తలంపడుచుండన్. 504

క. అగపడదే నని యూ, రేగెదరా ప్రజలు గాంధి నీశ్వరు నిస్స్వన్
ద్యాగమును మఱచి నిందిత, భోగములన్ మరగు శాస్త్రృపురుషులఁ గనుచున్. 505

క. అగపడదే నని యూ, రేగుదురు ప్రజల్ విపన్నహితకర సమతా
యోగం బఖండరాగం, బీగడ్డకుఁ గ్రొత్తవెల్గు లిచ్చెడి వేళన్. 506

క. అగపడదే నని యూ, రేగుదు రపరిగ్రహవ్రతేచ్ఛను బ్రదుకుల్
సాగించు నధికారుల, నీ గడ్డన్ వీట వీట నీక్షించి ప్రజల్. 507

* * *

గీ. ఎట్టిసడినైనఁ బ్రకటింప నేఁబదాఱు, వ్రాలు చెలువంపునెలవులై వఱలఁగా న
జంతమై గానలక్ష్మిశుద్ధాంత మైన, తెలుఁగునకు సాటిరా నొండుపలుకు గలదె. 508

క. విరిసినయలరామనిలోఁ, గురిసినక్రొందేనె మెండుకొని పున్నమరే
మెఱసినవెన్నెల తెలుఁగై, మొరసెన్ బెఱనుడుల కిట్టిమురు వరుదుగదా! 509

ఆ. తెనుఁగుమాటతీరు తెలిసికోవలె నన్న, కోర్కి వెడలినపుడు కొమల నడుగుఁ
దరకదున్నువారి నడుఁగుడు కవులారా!, చాల దిచటఁ గోశసముదయంబు. 510

క. ఎన్నితరమ్ములు కడచిన, నన్నిపదమ్ములును వాఙ్మయమునకు రా వీ
పెన్నిధి పల్లెలపాలిది, యన్నది కవు లెఱుఁగవలయు నభ్యుదయార్థుల్. 511

ఆ. చాన లూర నూర సాహితీసృష్టికి, నూలుకొంట బాసనోముపంట
వెలఁదిపల్కు నేను దెలివినే ననికదా, చెప్పెఁ గేశవుండు గొప్పమాట. 512

ఆ. కలదు చెలువనోటఁ గమ్మనినుడికార, మలరువంటితలఁపు లామెసొత్తు
తాల్మి కరుణ చెలికిఁ దఱుఁగనిచక్కనల్, జాతిభాగ్య మనెద నాతిరచన. 513

ఆ. నిక్కమైనకైత దక్కె గీర్వాణంబు, ముదురకుంట నీకు మృదుల మగుచు
నోసిపల్లెటూరి సోదరీ! నీపల్కు, సాజమైన తెనుఁగుసొరు గుల్కు. 514

క. శృంగారమునకుఁ గరుణకు, బంగారుబవంతి జానపద సాహిత్యం
బెంగిలిసోఁకని తేనెలు, పొంగు నిటన్ రసికలోకభోగ్యము లగుచున్. 515

ఆ. చేత వెన్న యుండఁ జెనఁటియొక్కఁడు నేతి, కంగలార్చు వార్చు నన్నయట్లు
చెంతఁ బల్లె యుండఁ జిన్నారితెల్గున, కగ్రహారమునకు నరుగు నొకఁడు. 516

ఆ. తరణికరణి నిరుల దౌదవ్వులకుఁ దోలు, యోగి నాఁగ సమత నూఁది నడుచు
నార్తగాథ విన్నయంతన వెన్నయౌ, నెవ్వఁ డతఁడు? సత్కవీశ్వరుండు. 517

ఆ. ఆర్తివెంట ధార్మికావేశ మొదవు నీ, పొంగు పొరలినపుడు పుట్టుఁ గవిత
పులుఁగువెతకుఁ గరఁగి పలుకఁడా కౌసల్య, పట్టిపుణ్యచరిత పుట్టచూలు. 518

ఆ. కవితచక్కఁదనము గరితచక్కఁదనమ్ము, కోటికోటిగతులఁ గుల్కుఁ గాన
నిలకుఁ గాళిదాసుఁడే మహాకవి కాఁడు, రతియె సోయగంపురాశి కాదు. 519

క. ఆనందము లెన్నో కల, వైనను గలలేనినిద్ర యందెక్కుడు, బ్ర
హ్మానంద మీదృశము, కా, వ్యానందము దీని కుద్ది యన నర్హమగున్. 520

గీ. విశ్వమున కీశ్వరునకును వేర్మి లేమి, కన్నవాఁ దనుకంపతోఁ గరఁగువాఁడు
తేపు కల దన్నసత్య మెఱింగినతఁడు, సంతరించినకావ్యమ్ము శాశ్వతమ్ము. 521

ఆ. మెప్పుగోరి మేడమిద్దెలాసించి స, త్కవి కృతుల్ సృజింపఁ గడఁగఁ దెపుడు
తనతపమ్ము కైత తనముక్తి కైతగా, సాగిపోవు కర్మయోగి యతఁడు. 522

క. ఏసోయగమైన ననా, యాసముగా వచ్చి యదికినట్లుండుఁ జూఁడీ
కైసరుల కబ్బములె! నీ, హా సొప్పదు కృతక మగుట నలఁతులకృతులన్. 523

ఆ. గాలిపాట గూర్చుఁగాక నేర్చినవాఁడు, రసముగుల్కు వానిరచనయందు
కనులుమూసి గీయుఁగాక కలావేత్త, పొలుచు నతనిగీఁత బొమ్మకట్టు. 524

ఆ. తెనుఁగునోరు వలయుఁ దిన్ననివాక్యంబు, గూర్పునేర్పు వలయు గుణవిధేయ
మానసంబు వలయు మనకవికి సమాజ, దృష్టి వలయు యోగపుష్టి వలయు. 525

క. కవికి సొంతముద్ర కావలయు నొకింత, యలంత చాల దీమహత్త వదయఁ
దపము సేయఁజేయ దక్కు నీపెక్కువ, తిక్కనాదు లారితేతి రిందు. 526

క. రవిలేని ప్రొద్దు తిక్కన, కవి లేనితెనుం; గితందు కారణజన్ముం
దవితథ కవితాశిల్ప, ప్రవణులు పాటింతు రితనిపదమున్ బథమున్. 527

ఆ. మంచివాఁడు గాన మత్యమరాధిపా, చార్యుఁ డయ్యు శబ్దశాస్త్ర యయ్యు
నన్నభట్టు చాటె నారాయణుని మేలు, పాయరానిపాడి పల్కెఁ గవికి. 528

గీ. మంచితలఁపులతోపాటు మంచినుడులు, నేర్పవలయును గవి జనానీకమునకు
నాత్మయును దేహమును రమ్యమైననాఁడె, కవితకున్ వనితకు హెచ్చు గౌరవమ్ము.

క. వేగేశ్న మార్ని - యయ్యేను, వేఁగీశుని, మారినేని-విరిసినవికృతిన్;
చేగగల చరిత మెంతో, దాఁగిన మనయింటిపేర్లు తరువుఁడు పెద్దల్! 530

ఆ. తిరగమాత కాదు తిరగమోతయుఁ గాదు, తిరుగఁబోఁత యిట్లు పరిణమించె
చెవికివచ్చినంత నవుదల నిడకుఁడీ, తమ్ములార! పలుకుఁ ద్రచ్చి కనుఁడు. 531

ఆ. రాజసభను జూచి రచయిత యలవోక, భూపసభ యటన్న బుధుఁడు నవ్వు
భాషకున్న విధులు బహుముఖమ్ములు వీని, గుట్టెఱుంగవలయు గురులఁ గొలిచి.

గీ. హిందువుఁడు వేదధర్మము నిచ్చగించు, మాన్యులు తలంపుదురు పదిమందిమేలు
వలఁతు లొప్పనినుడు లిందుఁ గలవు రెండు, సాధురచనమ్ము కత్తిపైసలుపుసాము.

గీ. కవిత లల్లినవారలే ఘనులు గాదు, కఱవులకు దాసులైనారు కమ్మతీంద్రు
వాఁ డనుత్తమ ధీశక్తివంతుఁ డనిన, బంతిబంతికి నెర సొందు పాదుకొనియె. 534

ఆ. అమ్మయైనఁ బెట్ట దడుగనిదే కూడు, పూవు నేఁ దొకండుఁ బూయలేదు
కాల్వవలయు గర్వగహనమ్ము బుధుఁడు నా, నొదిఁగెఁ బదపదాన నొకదొసంగు.

క. కృతి మహదానంద మిడెన్, క్షితి నెందుం గనము తాదృశీపరిషత్తున్
నతి దీనబంధు! నీ; కన, గతిచెడ్డ ప్రయోగ మొందు కల దెల్లజ్ఞన్. 536

క. ధనసేకరణము కృత్యము, మనసోత్సాహమునుబట్టి మాటాడె జనుల్
మును మీరు వచ్చిరనఁగా, ననుజా! యిం ద్రైదుతప్పు లణఁగెన్ గనుమా! 537

ఆ. వినఁగనైతి మున్ను విజ్ఞుల మాటలు, త్యాగబలముచే స్వతంత్ర మబ్బె
నరున కుండవలయు నైతికవిలువ, నా, నెరసు లిందు మూఁడు నెలవుకొనియె. 538

గీ. రామకథ వేమఱు పఠించు రసపిపాసి, మాసికిన్ సత్యనిష్ఠ కనీసధర్మ
మతనిపైన రవంతలే దరితి నీకు, నాఁగ నెగ్గులు మూఁడిందు దాఁగియుండె. 539

ఆ. వదలు మిఁక వితండవాదము సోదరా!, పలికె వాఁడు గొప్పపండితునిగ
తనను దాను మెచ్చుకొనరాదు నాఁ దప్పు, లేనిపాద మిందుఁ గానరాదు. 540

క. మావయ్య చూచె సీతా, రావమ్మ త్తయును జూచె రాత్రి సినీమా!
నీవే నయ్యా! చూదవు, నా వెదనుదు లిందు మూఁ దనా! నెలకొనియెన్. 541

ఆ. "సాని" యన్నమాట చానకు నొకనాఁడు, పరువు సంతరించు బిరుదుమాట
నుడివె లక్కసానికొడుక నే నని పోత, రాజు భాగవతపురాణమందు. 542

గీ. "అమ్మ" సాని పైఁజేరి సానమ్మ కాఁగ, "సాన"పై నమ్మ యది యని శాస్త్రి తలఁచె
నల్లసానమ్మ నల్లశాణమ్మ యయ్యె, నవల నాతల్లి నీలశాణాంబ యయ్యె. 543

గీ. *నల్లసానమ్మ నర్చించినాఁడు నాఁడు, మనమహాకవి కొమ్మనమంత్రిపట్టి;
యితనియింటి కుఱంగటనే రహించు, గర్తపురి నేతదాశ్రితకల్పవల్లి. 544

గీ. అతఁడు నిల్పినపద్యంబు లైదువేలు, పాఱవైచిన వన్ననో యాఱువేలు
గుణపరాయణుఁ డగుట నీకొఱఁత వాని, లెక్క కెక్కదు కవి కిట్టిదృక్కు వలయు. 545

గీ. కవితనే కాదు తనవ్రాయుకమ్మనైన, వెండి పరికింపవలయు నుద్దండకవియు
వేగిరంపడ వచ్చిన యోగు తొలఁగి, నవనవౌచిత్యములు దీన నవతరించు. 546

క. ఏ నన్నము దినలేదా, యీనాఁ దని యింతి నొక కవీంద్రుం డడిగెన్;
ఔనౌను! యోగమగ్న, జ్ఞాని యతం, డతని నెట్లుకదియు క్షుధాదుల్? 547

క. వేకువకద యిది వేలుపు, నాకారణ సేయవేమి యనుసతి కోసీ!
నా కవితాయోగమునకు, నీ కఱదకు వేర్మిలే దనెన్ బతి నగుచున్. 548

క. జనతాహిత కవితావ్రత, ఘనతాప సహిష్ణుతా విఖండితమోహాల్
కనరా ముక్తిని? భక్తి, ప్రణిధాన జ్ఞానయోగ భావితశక్తిన్? 549

---

* "నల్లసానమ్మ" గుంటూరిలో తిక్కనగారియింటి కెదురుగా నుండి తిక్కనసేవ లందిన గ్రామదేవత సహగమనాదు లొనర్చిన య్యాంధ్ర పేర విగ్రహముల నిల్పి పూజించుట మన యాచారము.

"నల్ల" అనఁగా మంచి. నల్లవో, నల్లయ్య, నల్లమ్మ, నల్లూరు, నల్లపాడు – ఈయర్థమునకుఁ జెందినవియ ఇది ద్రావిడపదము. నల్లతంబి – మంచి తమ్ముడు.

పెమ్మసాని, అప్పసాని, చెలసాని, పోసాని, మేడసాని, గోపసాని–బైసాని, అల్లసాని మున్నగు నింటి పేరులు మాతృప్రాధాన్యము కలవి. గౌతమీపుత్ర శాతకర్ణి, వాశిష్ఠీపుత్రపులమావి – కోవలోనివి.

క. కవి ముదియుచున్న కొలఁదిన్, గవిత కదుందేతి సరళ గంభీరగతిన్
నవదీప్తుల శరదాపగ, పవిదిన్ గదలున్ రసజ్ఞపర్వోదయమై. 550

ఆ. ఛాత్రుఁ డొక్కఁడేని సత్కవి యైనచో, నొజ్జపేరు నిల్చు నిజ్జగాన
అకట! యెందఱెంద ఱణఁగిరో వైదుషీ, మూర్తు లిట్టికల్మి ముట్టకునికి. 551

ఆ. కృతి రచించు లోకహిత మెంచి కవిమౌళి, త్రచ్చి బుధుఁడు చాటు దానిసొగసు
మ్రాను విరిని గాంచు మారుత మద్దాని-, వలపు నెల్ల దెసల నలముకొల్పు. 552

క. వద్దించిన విస్తరిగా, దొడ్డకవిత్వమ్ము త్రచ్చి దోషజ్ఞు లిడన్
లడ్డువలె ననుభవింతురు, జడ్డు సమస్తము తొలంగ సాహిత్యరతుల్. 553

ఆ. కలరు సుప్రసిద్ధకవుల కౌగాముల, గుట్టు దెలుపఁదగిన దిట్టకవులు
బయలుపడరు వారు బాజాబజంత్రీల, రొదలు సైఁపలేని రుసులు కాన. 554

ఆ. మణికి గాజుపూసకును గలవాసి గు, ర్తింపలేనిమాసి తిక్కనార్యు
పద్యసంఖ్య కేను బదిరెట్లు మిక్కిలి, నాఁడ నని గడించు నాఁడె మెదియొ. 555

ఆ. కరుణకొగ్గి పేరుగలకవు లెందఱో, మెచ్చినారు జజ్జుపిచ్చికైత
నేమియొఱగు దీన నేత్రాసికన్నె నే, రసికుఁ డిచ్చగించు రంభ యనిన? 556

ఆ. సత్యనిష్ఠనుండి జాతినకవి కూర్చు, కృతి సమాజమునకు నిడదు తృప్తి
యుప్పులేని కూర యుసుఱులేని శరీర, మది కృపీటశూన్యమైన తటిని. 557

క. ఏవాణికై శ్రమంపడె, యౌవనమున నరుఁడు, దాన నబ్బినదార్ఢ్యం
బావల నేర్చినభారతి, లో వశపడ దతని కెంతలోలత యున్నన్. 558

క. సొగసున్ గోరదు క్రొత్తడి, జగమెఱిఁగిన కర్మయోగి జమ నొల్లఁడు, మే
లగుకైతకుఁ జాలినకవి, పొగడిక నాసింపఁ దల్పబుద్ధివిధానన్. 559

క. నీకవితాగురు వెవ రన, నీకోయిల యాలతాంత మీ వలిగా డ్పీ
మాకంద మీకొలం కీ, లోకం బని కవనదోహలుండు వచించున్. 560

ఆ. కవుల కేల సొలుకప్పుటయును వారి, గొప్పతనము చాట రొప్పుటయును
ఊరి కొక్కఁడైన నుత్తమకావ్యంబు, కొనుట చాలు మేలుకొనుట చాలు. 561

గీ. యువకవీ! నీకెలంకుల నుద్దిలేని, కవులు కలరు వినమ్రతం గనుము వారిఁ
జదువకుము తత్కవిత్వమ్ము సారెసారె, కఱచివైచును నీముద్ర నది పరాకు! 562

గీ. నీగుణమ్మును మెఱయు, నీనింద్యచరిత, బయలుపఱచును సుకవి; తత్పద్యమునకు
నబ్జయోనికి నున్నంతయాయు వుండు; యశము నర్థింతువా సాధు వగుము నరుఁడ!

ఆ. కావ్యశిల్ప పారగత గంటి నేనని, పిన్ననాఁడు పల్కి పెరిఁగిపెరిఁగి
నేర్చినట్లు వక్కణించెద నన్న తి, క్కన్న వయసుపోవుగతులు చాటె. 564

ఆ. ప్రతిభ యున్ననాఁడు పాండితీలోపమ్ము, సన్నగిల్లుఁ గాని కన్నులుండి
కాలు సేయి లేనిగతి యగు నది; రెండు, చేవ లబ్బువారె శిష్టకవులు. 565

ఆ. వినుటతోన పాట తనివోక నిడుఁగాని, కవన మీదృశమ్ము కాదు కాదు
చదురు లరయ నరయ నిది తుష్టి గూర్చు నీ, రుచిరకళలు వాణికుచము లంద్రు.

ఆ. బాట లెన్ని లేవు పద్యమున్ నడిపింప, వాసిగన్న కంద సీసముఖము;
లలఁతి యలఁతి నుడుల నలరు తెలుంగున, కాటవెలఁది మిగుల నందగించు. 567

ఆ. భూమి లిచ్చినంత భూపతు లీయలే; రెద్దుపుండు కాకి కేమిముద్దు?
పాఁడిలేనియిల్లు బీడువంటి దటన్న, తెలుఁగునోటి కాటవెలఁది బోటి. 568

ఆ. పుచ్చినట్టివిత్తు చచ్చిన మొలవదు, పైరగాలి తగులఁ బంట హెచ్చు,
దున్నవలె శ్రమించి దొరవలెఁ దిను మన్న, తెలుఁగునోటి కాటవెలఁది బోటి. 569

ఆ. కొన్నవానికంటెఁ దిన్నవాఁడే మేలు, నవ్వలేనివాని నమ్మరాదు,
బత్తిలేనిపూజ పత్తిరిచే టన్న, తెలుఁగునోటి కాటవెలఁది బోటి. 570

ఆ. కోడిగుడ్డుఁ గొట్ట గుండ్రాయి దేనికి?, ఊరకున్నవాని కూహ లెచ్చు,
కడుపునిండినపుడు గారెలుచేఁ దన్న, తెలుఁగునోటి కాటవెలఁది బోటి. 571

ఆ. అంచుదాబె కాని పంచెదాబు హుళిక్కి, అఱచునట్టికుక్క కఱవఁబోదు,
అత్తగారిపనుల కాఱుళ్లులే వన్న, తెలుఁగునోటి కాటవెలఁది బోటి. 572

ఆ. సరసమునకునైన సమయము కావలె, గజ్జిరేఁగినపుడు లజ్జలేదు,
ఎనుముగొప్పదైన నేనుఁగౌనా యన్న, తెలుఁగునోటి కాటవెలఁది బోటి. 573

ఆ. అప్పులేనిగంజి దొప్పెఁడైనను జాలు, నోరుమంచిదైన నూరుమంచి
దత్తలేనికోడ లుత్తమురా లన్న, తెలుఁగునోటి కాటవెలఁది బోటి. 574

ఆ. రైతు దున్నినపుడె రాజుల కన్నంబు, కోటివిద్యలైనఁ గొండ్ర కావు
కలుపు దీయకున్నఁ గసవే మిగులు నన్న, తెలుఁగునోటి కాటవెలఁది బోటి. 575

ఆ. పాఱఁబోయుకంటె నోరపోయుట మేలు, తప్పువెదకువాఁడు తండ్రి యొకఁడె
యెవనివెఱ్ఱివాని కింపగు నన్నట్టి, తెలుఁగునోటి కాటవెలఁది బోటి. 576

ఆ. తిప్పరాజుకైత తిరునాళ్ల మజ్జిగ, రెండిటికిని జెడిన రేవఁ డయ్యె,
తావిలేనిపూవు తళుకులో మిగు లన్న, తెలుఁగునోటి కాటవెలఁది బోటి. 577

ఆ. ఆలివంకవార లతికినచుట్టాలు, త్రాగువాఁడె కట్టుఁ దాళ్లపన్ను
తెలివిలేనివాఁడు తిండికిముం దన్న, తెలుఁగునోటి కాటవెలఁది బోటి. 578

ఆ. గాలివాన వచ్చి కథ మాసిపోయెను, గొంతుకోయువాని గొఱ్ఱెనమ్ము
సిగ్గులేనిదాని సింగారమే లన్న, తెలుఁగునోటి కాటవెలఁది బోటి. 579

ఆ. నీరు పల్ల మెఱుఁగు నిజము దేవుఁడెఱుంగు, మెతుకులేనివాఁడు బ్రతుకులేదు
మెఱసినట్టి దెల్ల మేలిమికా దన్న, తెలుఁగునోటి కాటవెలఁది బోటి. 580

ఆ. ముష్టిపెట్టఁగానె ముగిసె దాసరిపాట, బఱ్ఱె చావఁగానె పాఁడి తెలిసె
పెదవిదాఁటఁగానె పెన్నదాఁటె నటన్న, తెలుఁగునోటి కాటవెలఁది బోటి. 581

ఆ. వచ్చునంతవఱకు వల్లింపవలయును, చచ్చునంతవఱకుఁ జదువవలయు,
నోరు మాటలాడ నొసలు నవ్వు నటన్న, తెలుఁగునోటి కాటవెలఁది బోటి. 582

ఆ. పోరులేనికూడు బొక్కెఁడై నను జాలు, చాఁప చిరిఁగిచిరిఁగి చదర యయ్యె
నాత్మలేనిపూజ కారతియే లన్న, తెలుఁగునోటి కాటవెలఁది బోటి. 583

ఆ. తెలివిలేనిభామ తీనెపేరంటాలు, చూపు గ్రుడ్డిదైన సొమ్ము జాస్తి
గంజి లేదుగాని గారెకావలె నన్న, తెలుఁగునోటి కాటవెలఁది బోటి. 584

ఆ. కాఁడి మేఁడి లేనికాఁపేమి పండించు, తెక్క లాడినపుడె డొక్క నిండు
భాగ్యమునకు ముందు పరువు చూడు మటన్న, తెలుఁగునోటి కాటవెలఁది బోటి.

ఆ. బెండ్లు మునిఁగిపోయి గుండ్లు తేలిన వయా!, పప్పులేని పులుసు బంతి కలుసు
అత్తలేనియింటి కల్లుఁడు బరు వన్న, తెలుఁగునోటి కాటవెలది బోటి. 586

ఆ. పిట్టపిట్టపోరు పిల్లి తీర్చిన దయా, యెఱ్ఱిదానిఁ జూడ వెఱ్ఱి పుట్టె
కూరలేనితిండి కుక్కతిండి యటన్న, తెలుఁగునోటి కాటవెలఁది బోటి. 587

* * *

గీ. వేళ వచ్చినయంతన విరులు పండ్లు, బ్రాఁకులం దెట్టితోఁచుఁ గర్మముల నట్లు
పుట్టు సుఖదుఃఖములు, వీని గుట్టెఱింగి, నరుఁడు మేలిల్లుచేఁత లొనర్పవలయు.

గీ. మున్నుచేసిన దుష్కర్మముల నరుండు, రాయవలె నేఁడు పుణ్యకార్యము లొనర్చి
ముక్కు సైరింపఁజాలని మురికికంపు, నగరువత్తులు వెలిఁగించి యణఁచునట్లు.

గీ. రేపురా మాపురా యని త్రిప్పిత్రిప్పి, మునుపు నిఱుపేద నురక పంపినధనాఢ్యుఁ
డెన్నిదారులు త్రొక్కిన సున్నపాకు, తొడిమయును గిట్ట కిపుడు వందురునరుండు. 590

గీ. కదవరానిది కర్మంబు, కర్మమునన, పుట్టుఁ బుట్టుకయుం జావు, భోగమునకు
నార్తికిని గర్మమే హేతు, వంటరాని, కంటిదొరకైనఁ దప్పదు కర్మఫలము. 591

గీ. నిలిచినాఁడు చరిత్రలో నేఁటి నాఁటి, కర్మములు తెచ్చువెతల జంకనివటారి
కదలితరఁగలతాఁకున గట్టువోలెఁ, దొనఁకఁ డింతయు విన్నాణి దుఃఖహతుల. 592

గీ. ఎఱుకలేమికి గారాలచిఱుతగాఁ ద, మోగుణం బుదయించె, సోమునకు నిదుర
కలుకకు ననాగరికతకు నవమభుక్తి, కగ్గపడువాఁడు దీనికి ననుఁగునేస్తి. 593

క. తియ్యనివిషము రజః; స్సీ, దయ్యమునకు యతులు కృతులు ధరణిపతుల్ లో
నయ్యెద; రదఁచినపిసరుం, గొయ్యిని బురుడించు వీరికొంచెపుబ్రదుకుల్. 594

గీ. రుచులు కోరఁడు సాత్త్వికుఁ డుచితకార్య, నిష్ఠమై నిల్చు, నీశ్వరునెమ్మి వలచు,
గుట్టుగా నర్థికి నొసఁగుఁ, గొఱంతలేని, ముదము నందును జైతన్యమున వెలుంగు. 595

ఆ. శివు నొకండు చూచు సెలయేటిపరుగులో, మత్తివిత్తునందు, మల్లెవిరిని;
చూచు నొకఁడు శిలను; లోచనంబులు కావు, బుద్ధి హేతు విట నిబద్ధి నెఱుఁగ. 596

గీ. దేహ మన నొకదుప్పటి, దీని సురలు, నరులు దైత్యులు కప్పుకొన్నారు గాని
మైలపఱిచిరి పెక్కురు మాయనీక, వాడుకొన్నారు బాపుజీవంటిఋషులు. 597

గీ. ఈశుఁ డాత్మస్వతంత్రత నిచ్చె నరున, కీతఁ డొనరించుచేష్టిత మెట్టిదైన
నాతఁ డొగాములు వచింప నఖిలషింపఁ, దనుభవించును గర్త కర్మార్థఫలము. 598

ఆ. చేఁతపుట్టువునకుఁ జేఁతకుఁ గామంబు, కామమున కవిద్య కారణంబు
జనుఁ దవిద్యకతన సంసారమునఁ జిక్కు, విద్యవలన లంబివెతలు త్రోయు. 599

గీ. సంస్కృతిన్ నీవు నిల్చుట చనును గాని, చనదు సంస్కృతి నీయందు సందుకొనుట
ఓడ సలిలమ్మునం దుంట యొప్పుఁ గాని, యోడలో సలిలం బుంట కీడుదెచ్చు. 600

గీ. ఆలుబిడ్డలు చుట్టమ్ము లనుఁగుఁజెలులు, కలరు, పదవులు భాగ్యముల్ కలవు వాని,
కెన్నియున్నను దత్త్వంబు నెఱుఁగుతెలివి, లేమి పెనులేమియై బెగ్గలికము నింపె. 601

గీ. పాణి వాణి పిచండ ముపస్థ మనఁగఁ, బరఁగువాకిళ్ళను మనీషి పసిఁడిముట్ట
కన్పృతమాడక పెద్దయుందినక లాఁతి, మగువనొల్లక మూయు బ్రాహ్మణుఁ డతండె. 602

గీ. ఎండమావులు జలమని పిండినీరు, పాలని తలంచెఁ దలకాయ పండుదనుక
నరుఁడు నేఁటికిఁ గనువిచ్చినాఁడు గాని, చుట్టినతమస్సు క్రౌంజాఁపచుట్ట యయ్యె. 603

ఆ. తన్ను మున్ను గెల్చి తరువాత నితరుల, గెల్వఁ గోరువాఁడు విల్వనందు
తన్ను గెల్చు టన్నఁ దగుమేరలో నింద్రి, యముల నిల్వరింత యంద్రు బుధులు. 604

ఆ. కట్టినపుడె వాఁగు కయ్యలఁ బండించు, చెక్కినపుడె కొయ్య చెలువుఁ జూపు
వంచినపుడె వెదురు వఱలు ధనుస్సుగా, నొడిచినపుడె చిత్త మొసఁగుశాంతి. 605

గీ. ఇనుపముక్కను బంగారుతునుక నొక్క, వడువునన్ గౌరవించు తక్కెడయుఁబోలెఁ
బేదవానిని సిరుల ఱంపిల్లువాని, సమతమైఁ జూచు నాసలు సమసినతఁడు. 606

గీ. నిలవు భోగము లొకనాఁడు తొలఁగితీరు, తొలఁగినపు డివి చేకూర్చు దుర్భరార్తి
తాన వీనిని దొలఁగించునేని నరుఁడు, తనియు నిర్భరశాంతి కాస్థాన మగుచు. 607

ఆ. నేల సెజ్జ, కేలు నెఱదిండు, నింగిమే, ల్కట్టు, గాలి విసనకఱ్ఱ, చంద
మామ దివ్వె గాఁగ మౌని ముక్తి వధూటిఁ, గలసి తనిసి రాజుకరణిఁ గుల్కు. 608

గీ. తరిచినన్ గాక గొడ్డంట నతికినంత, నగపడునె బ్రమాన మానిసి కగ్గిరవ్వ
యెఱుక నేర్చినఁగాక మే నెండఁజేతఁ, గానిపించునె తత్త్వ మక్షరము పరము? 609

ఆ. నేఁటిసుఖము రేపు నిర్భరపీడయై, కలఁచునేని యది సుఖమ్ము గాదు
వహ్నియందు వేఁడివలె నిచ్చ నిల్చిన, సుఖమె సుఖము ముక్తిసుఖమ యద్ది. 610

ఆ. కలిమిగాదు బలిమిగాదు రాచఱికంపు, సొగపుగాదు కోరఁదగిన పెంపు
జననమరణముఖ్య సంసార దురిత సం, హతికిఁ జిక్కకుంట యనిరి బుధులు. 611

గీ. కిల్బిషభరమ్ముతోడఁ గ్రుంగెడినరుండు, కదియలేఁ డీశ్వరుని శాంతి గానలేఁడు
పిట్టకాళ్ళకుఁ బెనుఱాలు కట్టినప్పు, డెగురలేదు కదా యది యెఱుక లార్చి. 612

ఆ. విషయములఁ దలంపు విడువక వేదాంత, మెన్నినాళ్లు విన్న నెఱుక గనఁడు
నోట నుప్పుఁగల్లు మాటి లడ్డుం దినఁ, దీయఁదనము నరుఁడు తెలియునోటు? 613

ఆ. అతని కెఱుక యబ్బె ననవచ్చు నువిదకె, మ్మోవి, మట్టిగడ్డ, పురము, వనము
చెలిమికాఁడు, వైరి, కలిమి, నిప్పచ్చర, మెతని కొక్కరీతి మతికిఁ దోఁచు. 614

గీ. ఓడ యెటుపోవుచుండిన నుత్తరంపు, వలనికే చూచు దిక్సూచి, తెలివిపెంపు
గన్నవాఁ డెన్ని చిక్కుల నున్ననేమి, యతనిమది పర్వులిడుఁ బరమాత్మదెసకె. 615

గీ. నరునకున్ బూర్ణభావ మెన్నఁటికి రాదు, వచ్చినట్లు తలంచినవాఁడు మడఁగు
పూర్ణత లభించుట యహంత పొలిసినపుడె, దేహ మున్నంతవఱకును దెగ దహంత. 616

గీ. మేను రథ మాత్మ రథికుండు, ధీ నియంత, యింద్రియములు తురంగము, లెడఁద పగ్గ;
మెవ్వఁ డిద్దాని వీలు వా లెఱిఁగి పట్టు, నతఁడు దవ్వగు సంసరణార్తి హతికి. 617

ఆ. కలదు గొఱ్ఱెపిల్ల కాఁపరిమూఁపుపై, వెఱ్ఱిముదిరి దాని వెదకు నతఁడు
చదురులేనిమాసి యెదలోనిశివుని గ, న్గొనక పరుగులెత్తు గుడికి గుహకు. 618

గీ. శ్రోత్రియుఁడు బ్రహ్మనిష్ఠుండు సూనృతవ్ర, తాంచితుఁడు సత్త్వసంపన్నుఁ డనఘుఁ డింద్రి
యార్థవిముఖుఁడు గురువుగా నాశ్రయింప, నర్హుఁడు ముముక్షువునకు దయాపయోధి.

గీ. ఇచట బంగారు కల దిందు నినుపఱాయి, కల దనం జాలు విజ్ఞానికరణి నొరుల
యెడఁద నీక్షింపఁగల గురుం బడసినపుడె, శిష్యుఁడు గడింపనేర్చు నిశ్రేయసంబు. 620

గీ. గురుఁడు నాముందఁ గలఁడు శ్రీహరియుఁ గలఁడు, ముందుగా నెవ్వనికి నేను మ్రొక్కవలయు?
హరిని జూపినగురునకే యాద్యమగు జొ, హారు చెల్లింతు నన్నకబీరు మెత్తు. 621

గీ. కోర్కు లుడిగినవానిని గురుఁడు చుల్క, దిద్దఁగలఁ డమ్మొయి సకాముఁ దేర్పఁజాలఁ
డెందుకట్టెను మండింప నిడుమరాదు, పచ్చికొయ్యను దరికొల్ప బడలు హెచ్చు. 622

ఆ. పసదనమ్ము గాదు ప్రాణము గాదు మ, నస్సు గాదు శాస్త్రనదుల నీఁది
కన్నకలితనమ్ము గాదు చిదానంద, మొకఁడె బ్రహ్మ మన్న యొజ్జ యొజ్జ. 623

ఆ. కదలినీరు దప్పి నడప, దబ్ధమునుండి, వెదలినప్డు దదియ కడపు దగను
సొంతచదువు దారిచూపదునరున కా, చార్యబోధనమున శంక లెదయు. 624

ఆ. జ్ఞానశిఖిని భస్మసాత్కృత మగుఁ జేఁత, చేఁత చెడినఁ బుట్టుచెట్టు యడఁగు
పుట్టు వోవ మేనిపొడ లేదు, మేను లే, నపుడు ముక్తితక్క నార్తి లేదు. 625

ఆ. అది యనాత్మ యాత్మ యిది యనుతెలివితోఁ, దెగు నుదగ్ర సంసృతిప్రబంధ;
మెఱుక యిది గడింపఁ డెవఁడు వాఁ డెన్నేని, యుగము లుండు లంబియుచ్చునందు. 626

గీ. నాకు మరణము లేదు జన్మమ్ము లేదు, తల్లిదండ్రులు లేరు బాంధవులు లేరు
సందియము లేదు సచ్చిదానందరూప, శివుఁడ నని కోవిదుం డూహసేయఁగలఁడు. 627

గీ. ఏను మనసను గా నహంకృతిని గాను, చెవిని గాను నాలుకయు నాసికయుఁ గాను
నయనమును గాను సచ్చిదానందరూప, శివుఁడ నని కోవిదుం డూహసేయఁగలఁడు.

గీ. ఏ నసంగుఁడఁ గర్తను గాను భోక్తఁ, గాను సర్వాశ్రయుంబ నకల్మషుఁడ స
నాతనుండను సచ్చిదానందరూప, శివుఁడ నని కోవిదుం డూహసేయఁగలఁడు. 629

క. ఎతఁడు సమతానురక్తిన్, బ్రతుకునొ తృష్ణాప్రవాహ పతితుఁడు గాఁడో
సతతక్షమకున్ నెలవో, యతఁడే మానవుఁడు ముక్తి నతఁడే పడయున్. 630

గీ. దాతగా నలెగ్జాండరు దతిసి యోగి, నర్థి నొనరింపఁ జూచి హతాశుఁ డాయె
నతఁడు నాముందునిల్వకు మనుడు ముడిఁగె, నైహికవిభూతి లెక్కింపఁ డాత్మవేత్త. 631

గీ. ఏమియిచ్చు మహీవిభుఁ డిభతురంగ, రాంకవము లిచ్చు నగ్రహారమ్ము లిచ్చు
జ్ఞాని కీబరువేల దుగ్ధమును ద్రోసి, యమృతమునకై తపించు ననావిలునకు. 632

ఆ. పట్టువలువ లూని పసిఁడియుయ్యేల నూఁగు, భోగి కాఁడు చింపిబొంత దాల్చి
కటికిఱాలమీఁదఁ గదలక పవళించు, యోగి నిత్యశాంతిభాగి సుమ్ము. 633

ఆ. ఆత్మ జగదతీత, మజ్ఞాని శుక్తిని, వెండిఁబోలె నమ్మువిధిని దాని
విశ్వమందు మోపి వికటవాదమ్ములు, చేసిచేసి రిత్తగాసిఁ జిక్కు. 634

ఆ. ఇంద్రియముల గెల్పు టెప్పుడో కాదు జ, వ్వనమునంద గెల్వవలయు నరుఁడు
గెలువఁడేని యమృతకలశము కాఁదగ్గ, మనుగడన్ విషాబ్ధి మునిచినట్లె. 635

ఆ. ఎవరు లేనిచోట సువిద కన్పడ నది, తల్లి యని తలంచి దాని కెడఁద
మ్రొక్కి తొలఁగువాఁడు వక్కణింపందగు, చాగి; యతఁడు గెల్పు జగమునెల్ల. 636

ఆ. మూఁగతనముతోడ ముని గాఁడు మానవుం, డాత్మతత్త్వవేది యగుటఁ గాక
వెల్లనెఱులతోడ వృద్ధు కాఁడు, ఫలాశఁ, జెండి పనులు చేఁతచేతఁ గాక. 637

గీ. ఎపుడు నరుఁడు సమాధియం దీఁగి సకల, భూతములఁ బరమాత్మునుంబోలెఁ జూచు
నపు డతఁడు కేవలుం డగు నఖిలబంధ, ముక్తుఁ డగు నద్వయానందమున వెలుంగు. 638

గీ. ఇంద్రియమ్ములు మానసం బెపుడు గాలి, తాఁకు సోఁకని దివ్యచందమున నిల్చు
నెపుడు బుద్ధియుఁ బనిమాను నపుడు నరుఁడు, పరమగతి నందుకొను శాంతిశరణ మగుచు.

గీ. ఇనుఁడు నడిమింట నున్నపు డెండలోన, నిలుచువానికి నీడ కన్పింపనట్లు
నిశ్చలసమాధి మగ్నుఁడై నెగడువాని, కెడఁదలో నేను గన్పింప దడఁగిమడఁగి. 640

ఆ. విశ్వమునకునెల్ల వెలుఁగిచ్చురవి నొక్క, పీఁచుమబ్బు కప్పి వైచుకరణిఁ
గాననీదు మాయ కదుఁజిన్నమునుఁ గయ్యు, నిందు నందు నెందు నెసఁగుహరిని.641

ఆ. పసిఁడికంటెఁ బట్టి, పట్టికంటెను మేను, మేనికంటె విషయి, దానికంటె
నుసుఱు ప్రాణి కించు, నుసుఱునకంటె రు, చించు నాత్మ యెఱుక చిక్కినపుడు. 642

క. ఇతరు లొనర్చినతప్పులు, శతములు తా నెఱుఁగుఁ గాని చాటఁడు వానిన్
నుతిసేయఁడు దూఱఁ దొరున్, యతేంద్రియుఁడు; బ్రహ్మవేత్త కతనికి జోతల్. 643

ఆ. స్థూల మగుట తగదు సూక్ష్మము కావలె, బుద్ధి బ్రహ్మతత్వభూతి గనఁగ
వలువ కుట్టఁగలమె పలుగుతోడుత, సూది, కతనఁగాక; గుట్టు కనుఁడు నరులు!644

గీ. అమ్మయమ్ములు గంగాపగాదికములు, తీర్థములు గావు, ఱాలతోఁ దీర్చినట్టి
బొమలు వేల్పులు కావు, తత్త్వమును గన్న, సాదులే తీర్థములు శంకరాదు లన్న!645

ఆ. జ్ఞాని యుండుచోటు గణనీయతీర్థంబు, వానిపల్కు మఱవరాని సత్య
మతని కాచరించునతులు నుతుల్ పర, మాత్మ కాచరించునట్ల చెల్లు. 646

గీ. ఆశ్రమమ్ములు నాల్గింట నాదరింప, రాని దొకటియు లేదు శౌచానుబంధి
బుద్ధిమై దేనిఁ గొల్చినఁ బురుషుఁ దుత్త, రింపగలఁ దతివేలసంసృతిపయోధి. 647

ఆ. తల్లికడుపునందుఁ దంద్రలో వఱపులో, వఱదలో నుదగ్రవాతహతుల
నెతఁడు తన్ను మనిచె నతని నీశ్వరు విస్మ, రింపరాదు నరుఁడు రేపు మాపు. 648

ఆ. నరుఁడు మేలెఱింగి పరమేశ్వరునికృపన్, వలచినపుడె యతఁడు వానిఁ దేర్పు
తలుపు దెఱవకున్న వెలుఁగీఁ దహర్పతి, యడుగకున్నఁ బెట్ట దమ్మయేని. 649

ఆ. ప్రేమ కలదు మనకుఁ బెనువెల్లిగా నది, సాగు రిత్తలంబి సంద్రమునకు
వేల్పుదెసకు దాని వెడలింపవలయు ను, త్కటవిరాగ మానకట్ట గాఁగ. 650

క. ఇచ్చునపు డీశరీరము, నచ్చముఁగా నిచ్చె నీశుఁ డాగరగరికన్
హెచ్చించి మరల నాతని, కిచ్చునతం దనుభవించు నిహపరసుఖముల్. 651

ఆ. హరిని గాంచువానితెఱఁ గెట్టి దాతఁడు, పలుకరింపఁ దొరుని బలుకఁ దొరున
కేడ్చు నవ్వుఁ గుఱ్ఱ లెసరేఁగి మేనిపై, దుమ్ముచల్ల మెల్ల దులుపుకొనును. 652

క. శ్రీ యున్నను లేకున్నను, గాయముతో నార్తు లుండుఁ గావున మగుడన్
మే యంటుకొనమికిన్ నరుఁ, డాయత్తంపడుట లెస్స హరి కాశ్రితుఁడై. 653

గీ. తెగులు చనుఁగాక లేమిడి తీఱుఁగాక, దుఃఖ మణఁగార దజ్ఞత తొలఁగుదాఁక
మంత్రములతోడఁ జీఁకటి మట్టుపడదు, దివ్వె ముట్టించినపుడె దౌదవ్వులగును. 654

క. పరమేశ్వరునున్కి, జరా, మరణంబుల మఱవరాదు మనుజుఁడు, తనకున్
బరు లాచరించునొప్పమి, యొరులకుఁ దాఁ గూర్చులెస్సయున్ మఱవఁదగున్. 655

ఆ. రకరకాలనగల నొకహిరణ్యమె, శతా, కృతులకుండలందు మృత్తొకండె
యుండురీతి బ్రహ్మ మొండె నిల్చును బెక్కు, వగలఁ గానిపించు వస్తుతతిని. 656

క. కోరరు సౌఖ్యము లవి చే, కూరిన ముట్టరు తితిక్షకున్ దొలఁగ రహం
కార మెఱుంగరు మెచ్చిన, దూఱిన నొకమైఁ జరింపుదురు యతివర్యుల్. 657

ఆ. మఱవరాదు ప్రజల మస్కరి కేవల, తత్త్వనిష్ఠ నుంట తగదు యతికి
నార్తజనులఁ గొలువ నజ్ఞుల సవరింప, నొగ్గవలయు బోడ స్రగ్గవలయు. 658

గీ. ఏను భరతోర్వి కననేల యెల్లమహికి, నాప్తుఁడను నాకు గిఱిగీయుహక్కు గన్న
దేశ మెద్దియు లేదు నాతెఱఁ గెఱుంగుఁ, దన్నయతి వివేకానందు నభినుతింతు. 659

గీ. ఎల్లరకు నెల్లవిద్యల నీఁగుచనవు, లేమి నఖిలార్థసంపన్నభూమి యయ్యు
భారతము దాస్యమున కగ్గపడియె నన్న, యన్న నర్చింతు మలయాళ యతివరేణ్యు. 660

గీ. తగనికోరిక రేఁగినతఱి నరుండు, తలను జెరలాడుతేలును దులిపినట్లు
వైళ మద్దాని వెదలింపవలయు నన్న, యనఘు నగ్గింతు మలయాళ యతివరేణ్యు. 661

ఆ. ఎంతచెడిన నొకని కెత్తు మారతి యని, యెంతతగిన నొకని గెంతు మనియు
వక్కణించుమతము వైదికమా యన్న, యతి కసంగమౌని కంజలింతు. 662

ఆ. కులము నతకరించి గుణకర్మముల మెచ్చె, నతివ నుద్ధరించె శ్రుతియు నేర్పి
బ్రహ్మచర్యమునకుఁ బ్రాభవ మిడె దయా, నందయతి సమాజబంధుమౌళి. 663

ఆ. జగము తన కొనర్చు సత్కృతు లల్లల్ల, నాత్మహానిహేతు లని యెఱింగి
లోకవాసనలకు నైకయోజనముల, దవ్వునం దపింపఁదగును బోడి. 664

గీ. అతఁ డజిహ్వుఁడు తీపి చేఁ దరయఁడేని, చెవిటి యతఁ డెట్టినుడి విన్నఁ జెదరఁడేని
ముగ్ధుఁ డతఁ డింద్రియార్థముల్ ముట్టఁడేని, ముక్తుఁ డతఁడు యతిస్తోమముఖ్యుఁ డతఁడు.

గీ. చేఁదుసొరకాయకూర మార్చినమెలంత, మిగులుదిని కుందమికి దాని మగుడ మగుడ
నడిగి సకలంబుఁ దిన్న మొహమ్మదునకు, నీడువచ్చు సహిష్ణువు లెంద ఱుంద్రు! 666

ఆ. ఒడలికతనఁ బెక్కుబెడఁద లున్నవిగాని, యిది పరోపకృతికి నొదవునేని
వేయితనువులైన మోయుదు నను రామ, కృష్ణ పరమహంస కృపను మెత్తు. 667

ఆ. మలము నెత్తువాని మఱుఁగుదొడ్డికిఁ జీఁపు, రయ్యనట్టె! పరమహంసజడలు
జగతి నెంతమందిజటులు లే రందఱు, జడలు జడలె కుట్రపొదలు గాక. 668

ఆ. జాయ నఖిలభువనజననిఁగా భావించె, నిదురనై నఁ బసిఁడి కదియ నుల్కె
పరమహంస యెంతపండెనో కామినీ, కాంచనేచ్ఛ నిట్లు కత్తిరింప. 669

గీ. భగవదనురాగ మార్తులపాల నుండు, నార్తసేవయ హరిసేవ యనుట నిక్క
మనదలన్ దేర్ప నీశ్వరుం దవతరించు, నన్నయతి వివేకానందు నభినుతింతు. 670

గీ. కరుడుగట్టిన నాగరికతను ద్రోసి, దీనమానవ సేవకై దీక్షపూనుఁ
దన్నలార! వేదాంతము నవలఁ దలఁపుఁ, దన్నయతి వివేకానందు నభినుతింతు. 671

క. నానాత్వమునం దేకతఁ, గానంగల చదువు చదువుగా నెన్నఁదగున్;
ఈనేర్మి గన్నవానికి, రానేరా వొరులవలనిరాపులు ద్రోపుల్. 672

ఆ. పోఁగు లుంగరాలు భుజకీర్తులు పసిండి, కంటె వేఱు గానికరణి ఖగము
నగము తరువు పురువు నరుఁడు బ్రహ్మముకంటె, వేఱుగామి గన్నవిద్య విద్య. 673

గీ. కారణంబైన బ్రహ్మ మక్షరము గాని, కార్యమైన జగమ్ము నిక్కమ్ము గాదు
మన్ను నిచ్చ లుండునుగాని మల్ల ముంత, యెల్లకాలము నిల్చునా పొల్లవోక. 674

గీ. అతఁడు పరమాత్మ చిద్రూపుఁ దతనిశక్తి, యవధిలేనిది వానికిం జెవులు కనులు
లేవుగాని సమస్త మాలింపఁగలఁడు, కనుఁగొనంగలఁ దతఁ దెఱుంగనిది సున్న. 675

ఆ. నెలవులోనిదివ్వె పిలువదు ద్రుమ్మచ్చును, వలదు వల దటంచు నిలువరింప
దాత్మచందమైన నట్టిద యదిసాక్షి, మాడ్కి నుండ మనసు మతిని ద్రేచు. 676

గీ. కల్పిత మసత్య మగు నీజగత్తువెనుక, నిరవుకొన్నది యాత్మ, రవీందుతార
కా తటిత్తులు దానిముంగడ వెలుంగ, విఁక వచింపఁగ నేల వహ్నిని గుఱించి. 677

గీ. కలలో నురగాదులఁ గని, యలుకందినవాఁడు శాంతుఁడగు మేల్కొని యి
ట్లలఘుజ్ఞానము వడసిన, వలఁతి జనుర్మరణభీతి వాసి సుఖించున్. 678

ఆ. ఒడలు సెజ్జ నొదిఁగి యుండ నింద్రియములు, మణఁగి యుండఁ గదలి మది సుఖమ్ము
లనుభవించు నిదుర, నమ్మోయి ముక్తుండు, మోదమందు విగ్రహాది లేక. 679

క. పరమాత్మయ జీవాత్మగఁ, బరఁగున్ స్త్రీ పురుష పక్షి పశు తరు సుర భూ
సురభేదమ్ములు దానిం, బొరయ వయా! వెల్గుముద్దపో! యది నేస్తీ! 680

గీ. ఎన్నఁజాలిన పురుషార్థ మీశ్వరునకు, జీవునకు వేర్మిలే దన్న త్రోవ గనుట;
యిదియె లక్ష్యమ్ము నరున; కీయెఱుక దక్కి, నతఁడు వెన్కకు రాఁడు జన్మాదు లంద. 681

గీ. కర్మయోగము భక్తియోగమును మరగి, చిత్తశుద్ధి నేకాగ్రతన్ జీవి పడయు,
నితని కవలీలగా లభియించు నెఱుక, యెఱుక కైవల్యసుఖసిద్ధి హేతు వగును. 682

గీ. భరతుఁ దన్నకు దవ్వుగా బ్రదుకఁగలఁడు, గాని తద్రామపాదుకల్ మానలేఁడు
సగుణమగు భక్తితోడ సంసక్తిలేక, నిర్గుణోపాసకుఁడు పొందనేరఁ డెలమి. 683

ఆ. ఏమియిచ్చె శబరి? యెంగిలి పండ్లనే, యేమిమోసె నుడుత? యిసుకకల్లె
యేలయుద్ధరించె నిద్దాని నద్దాని, రాఘవుండు? భక్తిరక్తి గనియె. 684

గీ. నాల్గుసంచుల రతనాలనగలతోడ, భామ నెఱవేర్పఁజాలనిపని యొనర్చె
నమ్మ రుక్మిణి తులసీదళమ్ముతోడ; తుఱఁగలించిన భక్తి దీదొడ్డతనము. 685

గీ. బృందలో నొకతృణముగా నుందునేని, గోపికాపాదరజ మంటుకొనుటఁజేసి
ధన్యుఁ డగువాఁడ నన్న యుద్ధవునిపల్కు, చాలు భక్తిప్రభావ ముద్వేల మనఁగ. 686

గీ. ప్రార్థనపరాయణుండ నై నపుడు సలుపుఁ, దస్మదీయ శస్త్రచికిత్స నన్నయోగి-
భక్తి ముక్తిద మగుఁ గాని రక్తిలేని, జడుని కేకలు చిందులు శాంతి నిడవు. 687

గీ. ఏకనాథుఁడు వడకు నోరెండి పడిన, గాడిదను జూచి కరఁగి శంకరుని మునుపఁ
దెచ్చుతీర్థముతో దాని కిచ్చె బ్రదుకు, భక్తునకుఁ దోఁచు శివుఁ డెల్ల ప్రాణులందు. 688

ఆ. ఏ నొనర్చుసేవ యీశ్వరసేవ యం, చెవఁడు శత్రుసేవ కిచ్చగించు
నతఁడు మది నెదిర్చి యతిదుష్కరం బైన, జయము గన్న భక్తసత్తముండు. 689

గీ. భక్తునెద శాంతిశౌచముల్ పైకొనంగ, వచ్చికూర్చుండు నచట నీశ్వరుఁడు పరుఁడు
దర్పణమ్మున నిర్మలత్వము దొలంకఁ, దేటపడు బింబ మావంత లోటులేక. 690

గీ. భక్తిరసపానమత్తుఁ డీశ్వరుని దక్క, లెక్కసేయఁడు లాఁతిని, దిక్కులెల్ల
వణఁకునట్లు వెలింగినజనకు హేమ, కశిపుఁ బ్రహ్లాదుఁ దేపాటిగా గణించె? 691

ఆ. భక్తి నెంచుఁ గాని పరమేశ్వరుండు నై, వేద్యమునకుఁ గీసవిలువ నీఁడు
కొఱికితిన్న పొలసు కొసముక్కఁ దన కిడ్డ, బోయ నుద్ధరింపఁడే యతండు? 692

క. జాతివయస్సులు భక్తికి, హేతువు లనరాదు నందుఁ దెవ్వఁడు బాఁడా?
లోఁతెంత ధ్రువునియాదున, కాతఁడు హరిఁ గానఁ గాన కరిగెడివేళన్? 693

ఆ. పడఁతి చెఱువునీటికడవ నౌదలఁ దాల్చి, వచ్చువేళ నెదురుపడిన చెలిని
బలుకరించుఁ గులుకుఁ బనఁటిని మఱవ; ది, క్కరణి భక్తుఁ డుండు హరిని విడక. 694

ఆ. మల్లెపూవుఁ గాదు మానసకమలంబు, నీయవలయు భక్తుఁ డీశ్వరునకు
అగరువర్తి గాదు భగవానుకడ నహం, కార ఘోరఫణిని గాల్పవలయు. 695

ఆ. లోకమెల్ల నీశ్వరాకృతి యని నమ్ము, వగచు నార్తమైన జగముఁ జూచి
విశ్వసేవనంబు వేల్పునూడిగముగా, భక్తుఁ డాచరించి ముక్తిగాంచు. 696

గీ. ధారుణీపతి ముత్యాలదండ నిచ్చె, బిచ్చగాఁ డశ్రుమాల నర్పించె హరికి
వేల్పు కరఁగె బికారికై వెన్నవోలె, భక్తిని గణించు నతఁడు దంబమ్ము నుఱఁడు. 697

గీ. చిత్త మొకక్రోఁతివంటిది చెంగుచెంగు, మనుచు సంసారవాంఛా వనాంతరమున
గంతులిడుచుండు నిలువదు గడియయైనఁ, గట్టవలె దీని భక్తి పగ్గమున బిగిచి. 698

క. దైవమును వేఁడునప్పుడు, భావశుచిత్వమ్ము లేని పల్కునకంటెన్
వావిప్పు లేని నిర్మల, భావము ఫలదం బటంచుఁ బ్రాజ్ఞుఁడు నుడువున్. 699

క. మదియందు డిందెఁ గోర్కులు, కదలెన్ జవ్వనము, మెచ్చుఁగలపజ లేమిన్
జదువులు నెడె, నరసెం దల, పద మిపుడే నభవుఁ గొల్చుపనికిన్ నరుఁడా! 700

గీ. మానసధనుస్సునకు భక్తి మౌర్విఁజేసి, యీశ్వర స్మరణాశుగాహీనశక్తి
నఘరిపుల నుక్కడంచినయట్టి దిట్ట, వదయు నపరస్పరానందవైభవంబు. 701

ఆ. అలఁతులందు నలఁతి యయ్యు సీతారామ, మూర్తి నారయాఖ్యు ముద్దుపట్టి
పెద్దవోలెఁ బల్కె సుద్దులు "సందేశ సప్తశతి" యటన్న సంజ్ఞ పెట్టి. 702

ఆ. చెప్పినట్లు చేయుచేవ వీనికి లేమి, నిక్క మైనఁ బరితదిక్కు సూచి
కొంతబ్రదుకు దిద్దుకొన్న మేలే యని, దయ్యు నితఁడు ముదుకఁ దయ్యు నిట్లు. 703

క. మది చపలము, దీనితలన్, బదుగురుమన్నించు చేఁతబరు వుంపఁదగున్
ముదుకలు కుఱ్ఱలు నిచ్చలు, నిది మఱవక పదయవలయు నీధ్యజయంబుల్. 704

క. ఇక్కట్లురాని మనుగడ, మొక్కట్లుగఁ "దెనుఁగులెంక" మొనయించిన యీ
చక్కట్లు పేరుపెంపుల, నెక్కట్లై బుధులహృదుల కించి రహించున్. 705

* * *

# అర్థములు

గచ్చు = కాంతి
తనదగ్గఱ = నాదగ్గఱ
యుక్తుఁడు = యోగి
మేవడి = యోగ్యము
వెలందితనము = పవిత్రత
కరకసా = కఱకైన
వలదుగా = హెచ్చుగా
కాదు = ఏర్పరచు
నుడితీరుపరి = వైయాకరణుఁడు
అవధి = వేళ
కమ్మతీనికి = సేద్యగానికి
కాట్రగడము = కంపకోట
మేల్తరము = మంచిరకము
మన్నన మెఱవడి = సమ్మానపు టూరేగింపు
వడపపెళ్ల = రొంపిదుక్కిలో లేచినమట్టి
క్రొత్తడి = పతివ్రత
మనువు = బ్రదుకు
ఎల్లజ్జన్ = ప్రతిపాదముననను
అరితి = ప్రేమ
ప్రణిధానము = కర్మఫలత్యాగము
భావిత = పొందఁబడిన
మేలిల్లుచేఁతలు = తగుపనులు (ధాతువు - మేలిల్లు)
మార్చిన = వడ్డించిన
ఎక్కట్లై = సాటిలేనివై

## వివరణము

తిమ్మక్క తన సుభద్రాపరిణయమున తీర్థయాత్రసేయుచున్న అర్జునుఁడు తిరుమలకు వచ్చినట్లును వ్రాసె.
సేకరణము - ఇందు "ణ" లేదు. సేకర మనవలె.

# విషయసూచిక

# మొగమాట

దేశాభిమానమో దేహాత్మవిచారమో ధార్మికావేశమో నైతిక ప్రేరణమో పెద్దలయెడం బొడమినపేర్మియో పిన్నలదెసం దోఁచిన కూర్మియో కారణ ముగా నపుడపుడీకైతలు వ్రాసితిని. రచనాకాలము ననుసరించి వీని నీకదంబమునఁ జేర్చితిని.

ఇందలి బాపూగురుభక్తి, గాంధిశతతమజయంతి, ఉగాదినెగులు, అంతర్వీక్ష, బాలాబ్దము, ఉగాదితలఁపులు, దీపావళి, ఆగస్టుపదేను - అను ఖండములు ఆకాశవాణి - విజయవాడవారి సౌజన్యముతో నీకృతికి వచ్చి నవి. వీరి కణంకువమ్మైఁ గృతమెఱుకఁ జెల్లింతును.

ఏదే నొకముక్క మిగిసినపొరటం గొంతతావు మిగిలెనేని దానవెక్కట్లు చేర్చితిని. ఎక్క ట్లనఁగా ముక్తకములు. ఇవి యైదా ఱేండ్లనుండి నానాఁడు వెడలినవి.

ముద్రణవ్యయ మీనాఁడు సైఁపరానిమోపుగా నున్నను ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీవారు రెండువేలరూపాయల కాసు బాసట నందించుటం జేసి యీసంపుటమును మెఱయంగంటిని. వీరి యుదారత విస్మరింపరానిది. వీనుమిగిలిన మన్ననంబోనిది.

తెనుఁగులెంక

**తుమ్మల సీతారామమూర్తి**

# ఉడుగర

క. ధీమంచ "దమూల్యశ్రీ", నామాఁ సముదాత్తభావనామయకవితా
సామర్థ్య ప్రాప్తయశః, స్తోమా! గుణధామ! నీకు శుభమ స్తనెదన్. 1
(అమూల్యశ్రీ అనునది అమ్ములయ్యగారి కలముపేరు)

గీ. పద్యమును గద్యమును హృద్యపద్య నదుపు, నొడుపు నీపాలి దని లోక ముగ్గడించు
సాముచేసిన నబ్బ దీచదురు, సహజ, వైదుషీదీప్తిగా లొంగవలయుఁగాని. 2

ఆ. కులము మతము లేదు గుణమెన్నుతతి నీకు, నార్తుఁ గన్న వెన్నయగుదు వీవు
వినయ మార్దవమ్ము నిను వీడ: వింకేమి, వలయుఁ గవికిఁ దమము వాపురవికి. 3

ఆ. ఇంటితావి జీవి కంటితీఋ నటన్న, సూక్తి నూఁది నిన్ను సుతుఁగఁ బడసి
చొక్కుగన్నగేస్తు జూపూఁడివీరయ్య, జగమలర్చుసాధుచరితుఁ డనెద. 4

ఉ. ఇమ్మహి నర్థకామముల కెంతయు లోఁగి జనాళి ధర్మమో
క్షమ్ముల విస్మరించి దనుజత్వము నందుట సైఁపలేక నీ
వమ్ములవంటిపల్కుల నుదాత్తకవిత్వము పల్కి నామధే
యమ్మును యుష్మదీయమును సార్థకమున్ బొనరించితే కృతీ! 5

ఉ. ఎందఋ కృష్ణవేణిపెను పెన్నరు? సహ్యనగంబు మున్నుగా
బందరుదన్క నీతటినిప్రావుఁ బండిన దక్షిణాపథా
స్పందమహత్త నీవలె విచారణచేసి వెలార్చినట్టివా
రుందురెపెక్కు; రౌర! చరితోదధిఁ ద్రచ్చితివోయి! నెచ్చెలీ! 6

ఆ. త్రౌను కృష్ణనీరు త్రాగి వేమనయోగి, నెతి నెతింగె నన్ననీదుతలఁపు,
నీతెనుంగువలపు నిఖిలాంధ్రకవికోటి, కావహించుఁ దృప్తి నమ్ములయ్య! 7

క. కవిఁగా నినుఁ జూచితి, మా, నవుఁగా గనుఁగొంటిఁ, గంటి నామిత్రునిగా,
నవు ననుకొంటిని; గృతి యిది, తవునుడుగరగా నొసంగఁ దలఁచితి నీకున్. 8

ఉ. అచ్చపుదెందమం దుదితమైనతలం పిది; నన్నువంటికిన్
నిచ్చలు తృప్తిగూర్చుపని నీవు వరింతువు; కాన నేఁడు నా
యిచ్చునుపాయనమ్ము గొని యిర్వుర సాహితిబాంధవంబు దీ
వ్యచ్చరితమ్ముగా నిలుపు మాశశిభాస్కరమున్ సుహృన్మణీ! 9

చ. మనుజునహంకృతిన్ దులుచుమంత్రము, దీనజనావనక్రియా
ప్రణయము నేర్పునొజ్జ, హరిభక్తికి దర్పణమై సబర్మతీ
మునిమహనీయజీవిత సముద్గత ధర్మనికేతనమ్ము నాఁ
దనరు "కదంబకైత" యిది తత్పరతన్ గొను మమ్ములాహ్వయా! 10

# కృతజ్ఞత

క. శ్రీ కారమ్మున శుభ మని, నాకవితాక్షతలు చల్లి నల్వురు మెచ్చన్
నీకు కృతజ్ఞత తెల్పెదఁ, గైకొనుమా ప్రేమతోడ కవికులచంద్రా! 1

గీ. సిరులు పొంగెడి గుంటూరుసీమలోన, గాంధి మెచ్చిన కావూరుగ్రామమందు
రైతుబిడ్డగ జన్మించి కైత లల్లి, కీర్తి గంటె! సీతారామమూర్తిసుకవి! 2

గీ. తల్లి చెంచమ్మ - నారయ్య తండ్రి నీకు, నీకలమ్మున పితృధర్మనియమనిరతి
దివ్యమైన 'ధర్మజ్యోతి' కావ్య మయ్యె, పుణికి పుచ్చుకొంటివి తండ్రిగుణములెల్ల. 3

గీ. భర్తబాగోగులే తప్ప పర మెఱుఁగక, యిల్లె లోకమ్ముగా నెంచు చల్లనమ్మ
అన్నపూర్ణమ్మ నీపత్ని అతివమిన్న, సకల సద్గుణధన్య సౌజన్యమాన్య. 4

సీ. "రాష్ట్రగానము"న నిద్రాణమైయున్నట్టి, తెలుఁగుజాతిని మేలుకొలిపినావు
"ఉదయగానము" సల్పి నిదురలేచిన తెల్గు, వారి సముత్తేజపఱచినావు
క్రమ "సర్వోదయగాన" మొనర్చి భా, వేపథము ప్రజకు చూపినావు
అంచితమైన "ఆత్మార్పణము" ను జాటి పరమ "ధర్మజ్యోతి" పట్టినావు
దీ. దివ్య "సమదర్శి" మార్గంబు దీర్చినావు, అచ్చమైన "గీతాదర్శ" మిచ్చినావు
"తెలుఁగునీతి" దెలుఁగుతీపి దెలిపినావు, తెలుఁగుటొజ్జగ శిష్యుల దిద్దినావు. 5

ఆ. "పైరపంట"కోసి "పతిగపంట" నేతి, చక్కనైన "సంక్రాంతిముచ్చట్లు" చెప్పి
ఆంధ్రసాహితీక్షేత్రమునందు క్షేత్ర, జీవిగా తపస్సిద్ధిని జెందినావు. 6

గీ. గాంధిఆస్థానకవి వీవు, గాంధిఆత్మ, కథను మధురాంధ్రమున వ్రాసి గణుతిగన్న
ధన్యుఁడవు నీవు, గాంధితత్త్వమును చాటు, పెద్ద వీవు, మనస్వి! నీ కుద్ది యెవరు? 7

సీ. నీకవిత్వమ్ములో నిగనిగల్తళుకొత్తు, తెలుఁగునాటివెలుంగు తేజరిల్లు
నీకవిత్వమ్ములో నిండుగా పండిన, జాతీయభావమ్ము జాలువాఱు
నీకవిత్వమ్ములో నిష్కల్మషంబైన, గాంధేయవాదమ్ము క్రాలుచుండు
నీకవిత్వమ్ములో నిక్కువంబైనట్టి, పల్లెపట్టులతీరు పరిఢవిల్లు
గీ. తేటతేనియ లూరించు తెనుఁగులెంక!, దేశిపల్కులఅభినవతిక్కనార్య
శుద్ధఖద్దరుధారి! సద్బుద్ధిశాలి!, అన్నిట కళాప్రపూర్ణుఁడ వైతి వీవు. 8

గీ. గండపెండేరమున్ దాల్పఁగల్గినావు, భద్రగజ సమారోహముం బడసినావు
పూర్ణకనకాభిషేకమ్ము పొందినావు, తెలుఁగులెంక వౌట నుదాత్తఫలము లబ్బె. 9

గీ. ఏడుకొండల శ్రీ వేంకటేశుకరుణ, భద్రగిరి రామచంద్రునిప్రాపు గల్గి
మంచికవిత నీ వింకc బండించవలయు, నిందునూతేండ్లు నీజన్మ పండవలయు. 10

గీ. నీకు నాకును సాహితీలోకమందు, హస్తిమశకాంతరము కల; దైననేమి
నాకు బహుమతిచేసితి నీకవిత్వ; మీ మహోదాత్తసద్గుణ మేమిచెప్ప! 11

గీ. లాల్‌బహద్దరుశాస్త్రి, చల్లపలితేcడు, అమెరికాగాంధి, వెంపటియంతవారు
నీదు కృతిపతులై రహో! నేను నైతి, నెంతధన్యత నాది! సాహిత్యవీథి. 12

గీ. ఊహచేయనిసత్కార మొదవె నాకు; దెంద ముప్పొంగి పొరలు నానందబాష్ప
తతిని తడిపెద నీదుపాదద్వయమ్ము, అంజలిఘటింతు సత్కవీ! అమితభక్తి 13

గీ. నీ కదంబకైతను నన్ను నెమ్మిc బిల్చి, యుడుగరగ నిచ్చినావు నే నడుగకుండ:
దమ్మిడీకాసుకోరని దాత వీవు: ఏమియిదెద నీ కంజలియిడుటకంటె. 14

గీ. కలయొ వైష్ణవమాయయో కాదుకాదు, మనము గుంటూరుమండలజనుల మగుటొ
జాతిపిత కిష్టcదగు హరిజనుcద నగుటొ, హేతువై యుండు నీవు న న్నిట్లు తనుప. 15

క. మనమైత్రికి మూలం బ, య్యెను కాcకరపర్తి వేంకటేశ్వరు: లీ స
జ్జను మెచ్చెద నిది సుముచిత, మని నమ్మెద నేcడు తుమ్మలాన్వయదీపా! 16

ఉ. ఎందఱొ బంధుమిత్రులు మఱెందఱొ మేటిబుధుల్ కవీంద్రు లిం
కెందఱొ ఆప్తముఖ్యులు మఱెందఱొ మాన్యగుణాఢ్యు లుండcగా
నందఱిలోన "అర్భకుcడ"నౌ నను మెచ్చితి విచ్చి కావ్యమున్
గాంధికవీ! అపూర్వమగుగణ్యత గంటి నివే కృతజ్ఞతల్. 17

—అమూల్యశ్రీ

# కదంబకైత

## మనవి

ఆ. కామరోషముఖ వికారదూరమ్ముగా, శౌచవికసన ప్రశంసితముగ
యుష్మదీయనివస నోచితవేదిగా, దిద్దు మీశ్వరా! మదీయహృదిని. 1

గీ. నామదిన్ నీ వెలుంగులు ననయువేళ, మధురతరభావనకు సుధీమానితోక్తి
కందచందమ్ములకు నెలవైన కవిత, వెడలనోయి! ప్రభూ! ప్రసన్నుఁడవు గమ్ము. 2

గీ. మున్ను వాల్మీకి మొన్న కొమ్మన్నకొడుకు, వ్రాసిరా చుల్క నంతంతలేసికృతులు?
వీనివెనుకల నీ భక్తివిభవి వారి, కెంతదిట విచ్చెనో జగం బెఱుఁగు నభవ: 3

ఆ. నీ కృపామృతమ్ము నాకంఠముగఁ ద్రావి, లక్కసానికొమరుఁ దక్కజముగఁ
బలికె భాగవతము పరమేశ! సంసార, శోకభారభుగ్న లోకహితము. 4

ఆ. కాసుకొఱకు నేను గైతపల్కను బ్రజా, సేవ కర్థినై వచింతుఁగాని
సాగనిమ్ము దీని సైఁపుము నాపంత: మీవు హార్దనిధివి గావె దేవ! 5

---

## ఆశ్రమ కన్యల పెండ్లి

మంజరీద్విపద :

మా ప్రభావతికిని మా శకుంతలకు, మాకూర్మినీడలో మనిన బిడ్డలకుఁ
బెండ్లిసేయుదుమయా! పెద్దల యెదుట, మీరు రావలయు మీ మేలిదీవనలు
వలయు నీ చిన్నారివధువుల కనుచు, బసవయ్య దుర్గాంబ పంపిన లేఖ
ప్రేమసౌరభముతో బెరసిన లేఖ, కల్యాణవృత్తాంతకలితమౌ లేఖ
చూచి వేంచేసిన సుచరిత్రులార!, పెండ్లిపందిట నున్న పెనువిందులార!
యెవరిబిడ్డలొ వీర లేదిక్కులేని, యేనిగ్రహములేని యేదయలేని
తల్లులు కన్నట్టితనయలో వీరు, ఏ జాతివారొ వీ రేకోవవారొ
యేమతమ్ములవారొ యెవరైన నేమి, మానవతాధర్మ మర్మజ్ఞులైన
సముదారులైన విశ్వకుటుంబు లైన, యనురాగమయులైన "ఆత్మవత్సర్వ
భూతాని" కాదర్శభూమిక లైన, తుమ్మలజంటకు దుహితలైనారు

దుర్గమ్మకుఋవునం దులకించినారు, బసవయ్యబుజమునం బవళించినారు
దుర్గమ్మచీరపై దోసెఁడు మలము, బసవయ్యబోరపై బానెఁడుచొంగ
వడ్డించివడ్డించి వచ్చి యీనాఁడు, పెండ్లిపీఁటలమీఁదఁ బేరోలగమునఁ
జెలువుతో జతకట్టి కులుకుచున్నారు, ఇది విశ్వకల్యాణ మిది కృపాభ్యుదయ
మిది ప్రేమకున్ రూప మిది సేవచేవ; యీ వినయాశ్రమక్ష్మావీథి గొల్ల
పూఁడిఋషితపమ్ము పొదలినకతన, బాపుజీచరణసంస్పర్శచే నిచటి
యణువణువును ధన్య మైనది కానఁ, బరులసుఖమ్ములో భగవానుఁ జూచు
యోగులు త్యాగు లీయుర్విలో నుంట, నార్తులకన్నీటి నణఁగించువారు
దీనులకడగండ్లు తీఱుచువార, లనదలకూయి సైఁపనిగుండెవారు
పోలిచన నిల్చిన పాల మిది యగుట, బసవయ్య దుర్గమ్మ యసదృశప్రేమ
రసరమ్యమూర్తులై వసుధావికాస, దీక్షమై పూనిన రూక్షాతిరూక్ష
సేవకు మొదలగా వైభవమ్ము, నిట్టిదానిని గంటి మీనాఁడు మనము
ఇది యపూర్వము గణ్య మిది పుణ్యమయము, ఇదియె సర్వోదయ మిదియపో! శాంతి;
ఈ యజ్ఞవాటిలో నెదిగినబిడ్డ, లీకర్మభూమిలో నెదిగినబిడ్డ
లీమన్నె పిచ్చయ్య శ్రీ మందిరమునఁ, గపిలావయస్సుతో నుపతాపలేశ
మెఱుఁగక హాయిగా నెదిగినబిడ్డ, లీప్రభావతియును నీశకుంతలయు
నీభాస్కరయ్యకు నీయంకమకును, బాపుజీ సత్యప్రభావమ్ము దెలిపి
భావేగురు ప్రేమపాండితి దెలిపి, స్వామిజీ నిస్స్వార్థసరణిని దెలిపి
వెంపటి సూర్యుని వెలుఁగెల్లఁ దెలిపి, శరణురామస్వామి శౌర్యమ్ము దెలిపి
తల్లాప్రగడవారి తత్త్వమ్ము దెలిపి, మద్దిరంగయసాధుమార్గమ్ము దెలిపి
బసవయ్య పరులకై బడలుట దెలిపి, దుర్గమ్మ యోర్మిలోఁతులనెల్ల దెలిపి
క్రాంతిని భర్తృలక్ష్యమ్ము గావించి, శాంతిని భర్తృలక్ష్యమ్ము గావించి
పెంచి యొకయ్య కర్పించినవారి, నీమంగళాశీస్సు లిచ్చినవారి
నీ పెండ్లి పెద్దలై దీపించువారి, నీమహిళాకోటి నీ పుణ్యపేటి
నీ పిన్నవాండ్ర నీ యెల్లభూతముల, నలరింత్రుగాక దీర్ఘాయురారోగ్య
కలితలై శుభములఁ గాంతురుగాక, భారతనారీప్రపంచసమ్మాన
పావన జీవనప్రభ నుంద్రుగాక; క్రొత్త దంపతులార! గుణనిధులార!
నవనవ గార్హస్థ్యసవ నార్థులార!, మీకాఁపురము చూచి మీపెంపు చూచి
పసిఁడిబొమ్మలవంటి పాపలఁ జూచి, పాయని సుఖపరంపరలను జూచి
చిరత రాయుష్య ప్రసిద్ధిని జూచి, జన మహో! యని మిమ్ముఁ గొనియాడవలయు
అర్థార్జనం బర్హమైనదే కాని, పాడిదప్పక రూక పడయుట వలయు
కామంబు సేవ్యమే కాని యయ్యదియు, ధర్మానుకూలమై తనరుట వలయు

అర్థకామములు ధర్మాశ్రితమ్ములుగ, సాధించునదియపో! సాధ్వీమతల్లి
వేయేల మీ రెందు విహరించుచున్న, మిముఁ జూచి లోకంబు మెఱుఁగెక్కవలయు
మిముఁ జూచి ప్రజలు పారము నేర్వవలయు
శ్రీరస్తు! మీకు సుస్థిర కీర్తిరస్తు!, ధీరస్తు! మీకు నత్యారోగ్యమస్తు!

6-2-63

---

## బాపూ గురుభక్తి

క. ఆగాఖాన్ భవనమ్మున, రోగహతిన్ గాంధి నలఁగురోజు లవి ప్రజా
సాగరము దుఃఖవీచీ, వేగవ్యాలోలతా నివిష్టము కాఁగన్. 1

ఆ. దొరతనమ్మువారు త్రొక్కిసలాడి యా, కొనిరి గురుని విడువఁ గొట్టకొసకు:
కదియవచ్చె విడుచుగడియ; మనూకన్య, పాఱఁజూచె నయ్యపాదుకలను. 2

గీ. అవి కడున్ ద్రెస్సినట్టివి యగుట కతన, వాని సవరింప గొడగరవాని కిచ్చె:
అవల నాచెప్పు లెందుండె నని మహాత్ముఁ, దడుగ జరిగినసంగతి నబల చెప్పె. 3

ఆ. ఎంతవెఱ్ఱిపిల్ల; వెళ్ళనియేగాని, లేనిమనము కూలి వాని కేమి
ముట్టఁజెప్పఁగలము? కుట్టకమున్నె చె, ప్పులను దె మ్మటంచుఁ బలికె గాంధి. 4

ఆ. మెలఁత మిన్ను విఱిగి మీఁదఁ బడ్డట్టులై, సరగ వీధి కేగి సవరచేయ
కీఁగదయ్య! చెప్పు లిచ్చిన విచ్చిన, కరణి ననుచుఁ జర్మకారు నడిగె. 5

ఆ. వాఁడు మిఱ్ఱిచూచి నేఁడు బోణీబేర, మిదియ నాకు; దీని నెట్లు విడుతు?
మొదట నిచ్చి యెట్లు పిదపఁ దెమ్మనె; దేమి, పెద్దతిక మటంచు బిఱ్ఱబిగిసె. 6

గీ. అప్పుడాలేమ యిట్లను; నన్న! యివి మ, హాత్ముఁడు ధరించునట్టి; వాయయ్యచెంత
నీకొసంగుట కొక్కకానియును లేదు; నిక్క మిది యాట నీదారి త్రొక్కవలసె. 7

ఆ. అనినయంత సంభ్రమాశ్చర్యములు మదిన్, సుడులువాఱి భక్తి కడలుకొనఁగ
నేమితల్లి! చెప్పు; వీ చెప్పులు మహాత్ము, నడుగు లంటి ధన్యమైన వటవె! 8

క. నాపాపము చన్నదిలే! యీపూఁట మదీయభాగ్య మెసకొన్నదిలే!
బాపూపనికి నిసీ! పై, సా పట్టుదునా యటంచు సంతసపడుచున్ 9

క. గొడగరి చెప్పులు తలపై, నిడికొని సవరింప కీయ నివి యంచుఁ గడుం
గడు భీష్మించినఁ గళవళ, పడుచు మనూగాంధి యిట్లు పలికె నతనికిన్. 10

గీ. ఓరినాతండ్రి! నాపల్కు గారవింప, నియ్యకొనవేని మఱొక "క్విట్టిండియా"స
మస్య యగు నిది; యంతంతమాత్ర దీని, బాపుజీ త్రోసిపుచ్చెడివాఁడు కాఁడు. 11

క. నావెంట వచ్చి యిట భా, పేవిధమునఁ బల్కు దాని కీ వొడఁబడుమా
నావుడు గొడారి పొంగుచు, నావెలఁదుక వెనుకఁ జనె మహాత్ముని కడకున్ 12

గీ. అట గవర్నరుతోడ మాటాడుచున్న, గాంధికిన్ సనసన్నగాఁ గథ సమస్త
మెఱుకచేసె మనూకన్య; గురుఁడు నగుమొ, గమ్ముతో లోపలికి గొడగరిని బిలిచి -13

క. అన్నా! నీతెఱఁ గంతయు, విన్నాఁడను గాని కూలివెట్టక నీచేఁ
జిన్నపనియుఁ జేయించుట, కున్నాదగు నుల్ల మొప్పుకొన దించుకయున్. 14

గీ. అని చివాలున లేచి తా నంతదనుకఁ, గూరుచుండిన పఱుపుపై గొడగరిని మ
హీమసుని దీను నాలిపేలికలవాని, నొదుఁగఁబాఱెడువానిఁ గూర్చుండఁబెట్టి - 15

ఆ. వానియెట్టయెదుటఁ దా నిలమీఁద నా, సీనుఁ డగుచు నేను శిష్యుఁడను, గు
రుండ వీవు; నా కెఱుకసేయు మిపుడు చె, ప్పులను గుట్టుకొనఁగ వలయువెరవు. 16

ఆ. అనుచు నారె కత్తి యందుకొని వినీతిఁ, గఱచె గాంధి చర్మకారవృత్తి;
ప్రక్కనున్న రాజ్యపాలకుతో పాటు, వారు వీరు ఱిచ్చవాటు సెంద. 17

క. ప్రాతస్స్మరణీయ గుణో, పేతము నీకథ నెఱింగి విద్యార్థిజన
వ్రాతము వినయ వివేక, ఖ్యాత మగుంగాత! జాతిగౌరవ మెసఁగన్. 18

8-1-68

## గాంధిశతతమజయంతి

ఎవరు బాబూ! నీవు
ఇంత డస్సి యున్నావు

నడచి నడచి అసురుసురై - తడిచెమటల వచ్చితివి
బస్సులేని రైలులేని పయనము సాగించితివా! (ఎవరు బాబూ! నీవు)

నాటుచెప్పులు మోటుగుడ్డలు నాగరికతలేని వేషము
బూటుచూచి సూటుచూచి పూజసేయు నీదేశము
తాను దూఱc గ్రంత లేదు తల కొకడో లన్నట్లు
ఎముకలగూc దగునీతో ఏకులరాట్నము కూడనా?
తాతా! తాతా! బలే! బలే! రిస్టువాచికి పోటీగా వేస్టువాచి! (WAIST వేయ్‌స్టు(మొల))

సర్వము సమీచీనమే కాని సమయానకు వచ్చితివా?, ఔను గాని స్వామీ అసలు నీ వెవ్వరవు?
కొందఱు చెప్పcగా వింటిమి గాంధిజీ యిట్లే యుండు నని
నిజముచెప్పు! కొంపదీసి నీవాతండ్రివి కావుగదా?
మౌనముద్ర విడిచి మాతో మాటలాడు మొకకొంచెము
అది గదిగో? ఆ కన్నుల నమృతము చిప్పిలుచున్నది
బడుగుమేని నతకరించి బయలుమెఱయు నెదో వెల్గు (అదిగదిగో ...)

అవిగవిగో యెదుతొమ్మున అగపడుచున్నవి మచ్చలు
లోకశాంతికై పశుపతి లోcగొని మ్రింగినచిచ్చులు (అవిగవిగో ...)

ఆత్మగృహ ప్రాంగణమున అలంకరించుకొన్న ముగ్గులు
ఎఱసంజ సరోవరమున అరవిచ్చిన కలువమొగ్గలు (అవిగవిగో....)

సకలమతసామరస్య సముద్దీప్తకేతనములు! శాంతినికేతనములు
రామరహీమ్‌భేదవాద తమశ్ఛటావిపాటనచణ
తరుణ ప్రద్యోతనములు (అవిగవిగో...)
అచ్చముగా నీవు మహాత్ముcడవే, అనుమానము లేదు లేదు
మచ్చరముల - యీర్ష్యాసూయల - మంటలలోనికి జంకక
వచ్చితివా మరల నిచటికి (వచ్చితివా)
అచ్చముగా నీవు మహాత్ముcడవే, అనుమానము లేదు లేదు
నిచ్చలు నిప్పచ్చరాల ముచ్చముడుcగుజనుల నోదార్పcగా
వచ్చితివా మరల నిచటికి (వచ్చితివా)
అచ్చముగా నీవు మహాత్ముcడవే, అనుమానము లేదు లేదు
చిచ్చుఅపిడుగులు కురిసినవారిశిరసున విచ్చినపూలు చల్లcగా
వచ్చితివా మరల నిచటికి (వచ్చితివా)
అచ్చముగా నీవు మహాత్ముcడవే, అనుమానము లేదు లేదు
మానవసేవా ప్రవణుని మనుగడయే సందేశమా?
కానిచో నీవేల మాటాడవు?

రమ్ము! రమ్ము! నమ్రతాశరణ్య పుణ్యభావనా!
రమ్ము! ర! మ్మసంగయోగరాజ దమలజీవనా
మట్టిని బంగారముఁ జేసితివఁట, వట్టిపనికిమాలినవానిని పైకెక్కించి
యుగయుగాలకుఁ బుట్టు నెప్పుడో యొక్కఁడు
జగత్తులో నీవంటి మహామానవుఁడు, పరాధీనమైన జాతికే కాదు
పరతంత్రమైన ఆత్మకుసైతము, స్వతంత్రతను ప్రసాదించిన
అతిమానుషప్రజ్ఞ నీది
రమ్ము! రమ్ము! స్వామి! మాగృహమ్ము పావనమ్ముసేయ
రమ్ము! రమ్ము మాకృపణత రాచి రాచి తొలఁగఁద్రోయ
బిక్కుబిక్కు మనుకొంచు నీ వొక్కఁడవే వచ్చితి వనుకొంటిమి

ఎక్కడి కెక్కడ!
ఎంత బలఁగము!
ఎట్టిబలఁగము!
ఓహోహో!
పొట్టిశ్రీరాములు
స్వామీసీతారామ్
రాబర్టు కెన్నడీ
మార్టిన్ లూథర్ కింగ్
లాల్‌బహద్దర్‌శాస్త్రి
ఓహోహో!
ఎంత బలఁగము!
ఎట్టిబలఁగము!

రమ్ము! రమ్ము! గాఢనిద్ర క్రమ్మిచెడిన మమ్ముఁ దెలుప
రమ్ము! రమ్ము! మామదిన్ సరాళత్వము పాదుకొలుప
అధికారముల కీచులాటతోనే మా ఆయువు దిగజాఱుచున్నది

తీఱని కోరికలు పెరిఁగిపెరిఁగి మేము, ఆఱనివేదన కుదుచుచున్నాము
నిజ మాడినవాని కీదేశములో నేఁడు, నిత్యోపాసములు తప్పుటలేదు
తగినవేళకే దర్శనమిచ్చితివి బాపూ!, "తమసో మాజ్యోతిర్గమయ!"
ఉండుముండుము స్వామీ! యీఖద్దరునూలు, దండను నీమెడలో వేయనీ!
వెదకివెదకి పొరుగిండ్ల యవ్వల నడిగి యడిగి, వేసారి తెచ్చితిమి దీనిని
మదిలో నేదో గుంజాటనపడుచున్న ట్లున్నావు, అదేమిలేదు బాబూ! అదేమిలేదు

నీరాక తెలిసి యింతకుముందే యీ పరిసరములయందు
నీరానాటక మంతయు బందు.
ఈపూఁటకు మాత్రము మే మందఱము నీశిష్యులమే
నీపారము నీ కప్పగింపఁగలము
ఓపికతో నేఁడు ని న్ననుసరింపనేర్తుము గాని
రేపటిమాట మ మ్మడుగకు
ఎంతో జాగరూకతతోఁ దెచ్చితిమి స్వీకరింపుము
ఈకల్తీలేని మేఁకపాలు స్వామీ!
జాతిపిత మహాత్ముఁడు విజయంచేసినప్పుడు
ఆతిథ్య మీపాటిది గొప్పదా యేమి
దిక్కు మ్రొక్కులేని కుగ్రామము లివి - నీవు
ఇక్కడికే విచ్చేసెద వనుకొనలేదు
కాకున్న నింతకంటె ఘనమైన స్వాగతసత్కారమే
చేకూరియుండెడిది నీకు
భక్తి కావలసినంత కలదు గాని - భవ దుపదిష్ట ధర్మాచరణము పట్ల
రక్తియే కొఱవడినది మాకు బాబూ!
రాను రా నీలోకము ని న్నొక ఊతిబొమ్మను జేసి
గుడి కట్టించి కూర్చుండఁ బెట్టదుగదా?
పరాస్తమగుఁగాక పాపము! నిరస్తమగుఁగాక తంత్రము!
ఉన్నగుళ్లు గోపురాలు చాలు ఊరికి నాలుగైదు!
నీ వుండఁదగినది గుడి కాదు - ఎడఁద
నీకర్పింపఁదగినది నీరాజనము కాదు - జీవనము
జయము! జయము! నీ జయంతికి సంస్మృత సకలాహంకృతికి
జయము! జయము! నీజయంతికి సత్యాహింసా క్రాంతికి.

14-9-68



గీ. క్షీరసంసక్తమగు పంచదారకరణిఁ, దన్ను నణఁగించుకొని గాంధి తనబలమ్ముఁ
దియ్యఁదనమును బ్రజకిచ్చి తృప్తినందె, నీవిలోఁ గూర్మిలో వీని కెవరుసాటి? 1

క. బహిరంత రింద్రియమ్ముల, యహంత నదలించి వీరుఁడై కర్మఫల
స్పృహలేని యోగియై జగ, మహో! యనం దనరె గాంధి యంచితచరితన్. 2

# ఉగాది నెగులు

క. ఒకదేశం బొకదేశము, నొకరాష్ట్రము నొక్కరాష్ట్ర మొకఁడును మతి వే
ఱొకఁడుఁ గలసి మన నొల్లని, నికృష్టకాలంబు వచ్చె నేఁటికి మనకున్. 1

చ. కడుకటు వౌట మ్రింగుటకుఁ గానిది యైనది నేఁ డుగాదిప
చ్చడి; భువనావనత్వర విసమ్మును మున్ గబళించినట్టి రు
ద్రుండు నిది సైంపజాలఁ దని తోఁచెడి; నేచెడి రాచరాపిడిన్
బుడమి దురంతవేదనల బ్రుంగి కలంగి నలంగు నల్గడన్. 2

సీ. అమృతమ్ముపిదికెడి యనురాగకామధే, నువుగొంతు నుగ్గుగా నులిమినులిమి
చటులాంధతమసమ్ము విటతాటన మొనర్చు, సత్యదేవత కెగ్గు సలిపిసలిపి
అల్లారుముద్దుగా నలరు నహింసన, శిశువును దునియలు చేసిచేసి
సంతతసంతుష్టిజనక క్షమామాతృ, మూర్తిని నట్టేట ముంచిముంచి

గీ. కటకటా! మనకూర్చిన కలుషరాశి, యంతయని యింతయని చెప్ప నలవి గాదు
ఱంపకోఁతగ నెడఁదను ఱాచుదీని, కెన్నఁటికినేని నిష్కృతి యున్నదొక్కొ! 3

ఉ. కొంపకు నిప్పుపెట్ట నొకకుఱ్ఱఁడు చాలును గాని దానిక
ర్వింపులు పెంపు లార్చునెడఁ బెద్దలు వేలకువేలకేనియున్
దుంపతెగున్; గడున్ దగనిదోసము చేసితి మెగ్గు లగ్గు గు
ర్తింపని వెఱ్ఱివాంధ్ర మయి దీనతనందితి మేమిసెప్పెదన్. 4

గీ. ఇన్నినాళ్ల దేశవికాస మీనఁగాచి, నక్కలకుఁ బెట్టిన ట్లాయె నక్కటకట!
నతికిపైచిన యందాలనందనమ్ము, కడలుకొనుటకు నిఁక నెంతకాల మగునొ! 5

క. ఊరూరఁ గలాశాలలు, తీరిన వని పొంగిపోయితిమి గాని కలా
దూర మవిధేయతా సం, చారము నై యవని దుర్దశావశ యయ్యెన్. 6

ఉ. గత్తరలేపి కూటువలుగట్టి కటారులుదూసి దేశమున్
నెత్తుటివఱ్ఱిసేయుదుము; నెయ్యముతియ్యము నూఁచముట్టుగాఁ
దుత్తునుకల్ పొనర్తు; మకుతోభయతన్ వికటాట్టహాసదుర్
వృత్తముసైఁతు; మియ్యదియు వీరతయౌనని చెప్పుకొందమా! 7

ఉ. వీరతయన్నఁ దెల్గునుడి విజ్ఞనదేశము సర్వ మేకమై
తీరఁ దృణమ్మునట్లు నిజదేహము నుగ్రతపోఽగ్ని వేల్వఁగా
నోరిచినట్టి పొట్టిఋషి దొక్కనిదే యనుటొప్పు; వీని క్రై
వార మొనర్చి మోహములు వాయుద మీ నవవత్సరాగతిన్. 8

చ. మతకులవర్గభేదరత మానసవృత్తివిరుద్ధశీల దీ
ధితిసముపాత్త సర్వజగతీహిత నిర్మల కర్మయోగ ధూ
ర్నతబహువర్ష జీవన వినాకృతకైతవ మోహనాస్య ని
ర్గత మగుబోసినవ్వు మనకల్మషమున్ గదలించఁగావుతన్! 9

ఉ. నిత్య మపార ధైర్యరమణీయము దుర్దమరోషమత్సరో
ద్ధత్యనిబర్హణక్షమ ముదాత్తజయ ప్రతిపాదక క్రియా
స్తుత్యము శాంతిదాంతి పరిశోభితమై తనరారుబాపుజీ
సత్యపరాక్రమమ్ము మనజాతికి నాశ్రయమౌత! నిచ్చలున్. 10

5-3-69

---

# స్వామిసీతారామ్

గీతమాలిక

ఆంధ్రభాషావిధేయమౌ నవనియెల్లఁ, దెలుఁగుసంస్కృతి కిరవైన దేశమెల్ల
నేకరాష్ట్రముగా నుదయించుకొఱకు, నేకలక్ష్యముగా బల్మి నెనయుకొఱకు
దుర్భరోపవాసమ్ములఁదూలి తూలి, సమధికాంధ్రాభిమానమ్ము చాటి చాటి
సోదరులకన్ను విప్పి సంస్తుతులుగొన్న, జాతికర్తవ్య మెఱిఁగించి ఖ్యాతిగన్న
స్వామిజీ! తీవ్రసంతాప సాగరమున, మునిఁగియుందువు నేఁడు నీ వణఁగియుందు;
వెచట నేదోసమున్నదో యెవనితంత్ర, మెవనివాకు పరాకు హేతువుగఁ బ్రజలు
రేఁగిరో సైఁపఁజాలని యాగడములు, సలువుచున్నారు తెలుఁగురాజ్యమున నిపుడు;
ముక్కలైతీరవలె దేశ మొక్కగడియ, కాదు-త్రుటియైన నుమ్మడికాఁపురంబు
వలదువల దన్న పరుసనిపలుకు లాక, సమ్ము నగలింపఁదొడఁగె: నిస్స్వార్థపరులు
శాంతికాములు సర్వప్రజావికాస, కాంక్షితులు నేఁడు దుస్సహగ్లానిఁ జిక్కి;
రీవు పొట్టిరామయ్య నాగేశ్వరుండు, సురవరమురెడ్డి శౌచసుందరుఁడు ధర్మ
వీరుఁ డాంధ్రోద్యమవిధాత వేంకటప్ప, యార్యుఁడును వేగ నీగడ్డ కవతరించి
యిచట మైత్రీసుఖంబు రూపెత్తునట్లు, నిచటసోదరతాగంధ మెసఁగునట్లు
నిచట నీర్ష్యాదిజంబాల మిగురునట్లు, బదలరేఁ కొంతకాల; మీపుడమిమీఁది
కడుగు పెట్టుట మీ కసాధ్యంబయేని, యనభిమతమేని యీమంట లాఱునట్లు
దీవనలు పంపరయ్య! మీతెనుఁగుజాతి, నావరించినయపకీర్తి నణఁపరయ్య!
తిక్కనకును బోతన్నకు మ్రొక్కినపుడె, యిహపరశ్రేయ మని యెలుఁగెత్తరయ్య!

14-9-68

---

ఆ. శీతనగమునుండి సేతువుదనుక నా, మాతృభూమి యనుట మఱచిపొమ్ము
పుడమియెల్ల నాదుపురుటిగడ్డయటంచు, సోదరా! తలంపు మీ దినాన. 1

ఆ. భక్తి పెరిఁగి కాదు పాపిష్ఠపథములఁ, బసిఁడికూర్చువారి భయము పెరిఁగి
పెరిఁగె మింటిదనుకఁ దిరుమలవెంకన్న, బొక్కసంబు లనుట నిక్కువమ్ము. 2

---

# వఱద

(అప్పికట్ల నలమిన జలప్రళయమును గనుచు)

క. ఈ వఱదకు వెఱచెదనా, ద్యావాభూమ్యంతరమున దరికొని యార్వా
దావాగ్నిజ్వాలావళి, నావసుధన్ విలయ వలయ నాట్యము సేయన్. 1

క. ఈ వఱదకు వెఱచెదనా, నీ వాంధ్రుఁడ వేను దెల్లునెఱసరి ననుచున్
గేవలదుర్వాదవిధా, నావిష్టుం దగుచు నస్మదనుజుఁడు వదరన్ 2

క. ఈవఱదకు వెఱచెదనా, భావేమఖకుండమునకుఁ బ్రథమాహుతియౌ
నీవికిఁ జాలినరెడ్డికి, నావాసంబైనపుడమి నవగడ మెగయన్. 3

క. ఈవఱదకు వెఱచెదనా, క్రేవలవా రాంధ్రజాతికీర్తి పతాకా
లావనమునకుఁ దెగింపఁగఁ, గావిరిచీఁకట్లు తెనుఁగుగడ్డన్ గవియన్. 4

19-5-69

---

క. తనయాయువు తన సౌఖ్యము, తనమన్నన తనవిముక్తి తనశీలముతోఁ
బెనఁగొనియుంట నెఱింగిన, మనుజుఁడె విద్వాంసుఁ డతనిమాటలెఱుక్కల్.

---

# మేడూరి

మ. జయ! మేడూరివనీ వసంతసుషమా సంధాతృచూడామణీ!
జయ! నాగేశ్వరనామధేయ! జనతాసంహూత సభ్యాగ్రణీ!
జయ! నానాముఖలోకసేవనవిధా సంతర్పితాంధ్రావనీ!
జయ! షష్ట్యబ్దసనాథ! సాధుచరిత స్ఫారప్రతిష్ఠాఖనీ! 1

సీ. ఒకనాఁడు సమతాప్రయోగనిష్ణానిధుల్, శాతవాహనుల కాస్థాని యగుచు
ఒకనాఁడు వైదిక ప్రకృతిలుబ్ధమనీషు, లిక్ష్వాకులకు నధీనేల యగుచు
ఒకనాఁడుఁ సారస్వతో పాసనప్రియుల్, కొండవీడ్విభులకుఁ గోట యగుచు
ఒకనాఁడు దానధర్మకళానిధులు వాసిరడ్డిభూపతులకు రాజ్యమగుచు
గీ. నఖిల దిక్కుల విఖ్యాతి నందుకొన్న, గర్తపురమండలము నేలుగద్దె వడసి
పేఁటపేఁట నహో! యనిపించుకొంటి, వెంతధన్యుఁడవోయి! నాగేశ! నీవు. 2

ఉ. కేవలమంత్రతంత్ర పరికీలితధీనిధి నాధికారిక
శ్రీ వరియింప నొల్లదు వరించిన మెచ్చదు నాల్గుపూఁటలున్
నీవలె నెవ్వఁ డౌచితి గణించి లభించిన పారుపత్తెమున్
సేవకు రేవగల్ వ్యయముసేయు నతండె రుచించు దానికిన్ 3

మ. నిదురంబాసెద వేటుకూర; వరగానిన్ స్నానమున్ దీర్తు; వె
న్మదలం ద్రావెద వింతటీ; కొణికిలో మాటాడి యుద్ధంకివా
రెదురై నిల్చు జనం బసాపదుచు నాయీవాదముల్ తీర్చి పూ
నెద వధ్యక్షత మద్దిపాటిపురవాణీకౌముదీవేదికన్. 4

మ. సభలన్ నీవు ప్రసంగముల్సలుపుచో సాహిత్యలక్ష్మీ నవ
ప్రభ లవ్వారిగఁ బల్కుపల్కున రసప్రాలంబముల్ వెల్వడున్,
ప్రభుతన్ మోసెడివారిలో నినుబలెన్ భాషావధూటీ కృపా
విభవాహర్తలఁ బెక్కురన్ గనము నీ విద్వత్తకున్ భద్రముల్! 5

ఉ. దిక్కులనెల్ల నేలుజగతీపతి వచ్చిన నిల్చి నీ వహో!
చక్కనికబ్బముల్ నుదువు సత్కవి కర్చన లాచరింతు; వీ
పెక్కువ యెల్లవారికి లభించునె గుంటురిసీమ వారికిన్
దిక్కనకైతసొంపులు జితించినవారికిఁగాక ధీనిధీ! 6

చ. పెడపెడగా రిపుల్ పరుగుపెట్టఁగఁ బాండ్యమహిన్ దెనుంగువాల్
సిదములు నాటుచున్ గృతులుసెప్పఁగఁ జెప్పెడి వెంకనాదులన్
గడు నలరింపఁగాఁ బదురుగన్నఘనుల్ రఘునాధరాణ్ముఖుల్
సడిసనినట్టి నీకొలముసాములు నామది నిల్తురిత్తతిన్. 7

ఉ. వీరులకోవ నీవు ప్రభవించుటఁ జేసి మహీస్వతంత్రతా
భేరిరవమ్ము ప్రమ్మి వినిపించినయంతన సంతతవ్యథా
గారము కారకుం జని జగాకడిమిన్ వెడలించి యంచితా
చారులమెప్పు లందితివి చాఁగురె! మేదురివంశవర్ధనా! 8

ఉ. గాంధి గురుండుగా బ్రదుకఁగంటివి గాన నిరంతరక్షమా
గంధము పట్టె నీ; కెదిరి కందనిపల్కు లభించె నీకు; గ
ర్వాంధులకన్ను విచ్చువినయమ్ము వశంపడె నీకు; ధీరతా
బాంధవ మబ్బె నీకు నయభద్ర! జయమ్ములు నీకు నిత్యముల్. 9

ఆ. మతము మఱచుఁ గులము మఱచు ని న్నెతిఁగిన, వాఁడు తనదునూరు నాడు మఱచు
నిక్కమునకు నీవు నిఖిలప్రజాబంధు, మౌళి వచ్చుమైనమానవుఁడవు. 10

చ. తనిసిరి షష్టివర్షకలితమ్ము హితమ్మగు నీదుమన్గడన్
గనిన తెనుంగువారు నినుఁ గమ్మనికైతలతో సరాగముల్
తొనికిసలాడుదీవనలతో సురభిప్రసవస్రగాళితో
గొనబులుచిందు కాంచనదుకూలపరంపరతో నలర్చుచున్. 11

ఉ. ఇంకొకయర్వదేండ్లు జగదీడ్యపథమ్ము పదమ్ము నీకు న
భ్రంకషమైనకీర్తి సపరాజితమైనసుఖమ్ముగూర్చ ని
శ్శంకమనీషమై మనము సభ్యమహాశయు లీసదస్సు-నల్
వంకలవార లీనుడు లవశ్యము పందు నటంచుఁ బల్కఁగన్. 12

చ. జనుఁ డొనరించుసేవ ఫలసంగములేనిది యైననాఁడు త
న్మనమున రాగవైరములు గ్రమ్మఁదిననాఁ డతఁ డన్యదోషమున్
గొనక గుణమ్ము నెంచ ననుకూలత సూపిననాఁడు లోభమున్
దునిమిననాఁడు వాని కకుతోభయవైభవ మబ్బు టబ్రమా? 13

చ. జగమున దంభదర్పములసందడి హెచ్చె దురాశ రెచ్చె నీ
సెగసె ననార్యభోగకలనేచ్ఛ కదల్కొనె సత్యశౌచముల్
దిగువకువచ్చెఁ బ్రేమ సెడె దెప్పరముల్ పదివేలు మూఁడె; నీ
తెగులు నడంచి సంఘమును దిద్దువలంతులె ధన్యతానిధుల్. 14

ఆ. తుంటతడిక పెట్టి గుంటూరు వంగవోల్, వేఱు వేఱు చేసినారు దొరలు;
ఏది యెట్లులైనఁ బోదుగదా కవి, బ్రహ్మశంభుదాసబాంధవమ్ము- 15

19-4-70

# బోడేపూఁడి

క. పాండిత్యమునన్ గవితను, బందుటకు నుదాత్తమైబ్రదు కందుటకున్
జందతరదీక్ష నెత్తురు, పిండి తహో! బోదెపూఁడి వేంకటరాయా! 1

గీ. ఏడెనిమిదేండ్లు బాపట్ల నీవు నేను, [1]వద్లమూడియు [2]నబ్బరాద్వంశభవుఁడుఁ
దెనుఁగుటొజ్జలమై భారతీవికాస, రతి నొనర్చిన సేవ విస్మృతికి రాదు 2

క. క్షితి నెవ్వండును సర్వ, జ్ఞత వదయంజాలఁ దన్నసత్యము గని ప్రా
జ్ఞత నెఱయ నపుడు పెనఁగితి, మితరేతరదేశికత్వ మీకొని సుకృతీ! 3

ఆ. త్రచ్చి త్రచ్చి శాబ్దతత్త్వ, మర్థవిశేష, మాహరించువఱకు, నాద్యులైన
నన్నపార్యతిక్కనల గుట్టు భేదించు, వఱకు మనము తెప్ప వాల్ప లేద. 4

క. కాసులకొఱ కీవేసట, మోసితిమా లాఁతినుదులముసుఁగునఁ దెనుఁగుం
బాసపాడ యదఁగరా దను, రోసమునకుఁగాక సద్గురుత్వవిభాసీ! 5

ఆ. భావసరణియందుఁ బల్కున నదతలోఁ, దెలుఁగుముద్ర సొంతవెలుఁగుముద్ర
యంటవలయు నన్న యారాటమున శిష్య, పట్ల మనము లెస్స పడితి మపుడు. 6

గీ. చలిదికూటికిఁ జాలని సంబళంబు, నిస్సిరో! నాఁడు తేఁడు లెట్లిచ్చినారొ 7
సాహితీమూర్తి మాతృభాషాగురుండు, పారములు క్రొల్చె నొకమూఁడుపదుల కొప్పి. 8

ఆ. బానిసీని కింటిబాడిగ కివి బొటా, బొటిగ సరిపదంగ బువ్వ బట్ట
యీావి తావి పెద్ద లిచ్చినయాస్తితో, వెళ్లఁబుచ్చె ధర్మవీరుఁ డితఁడు. 9

క. కాటూరి వేంకటేశ్వరు, బోఁటిమహాకవులఁ దీర్చి పొంగుటగా కే
పాటిసువర్ణము తెనుఁగుం, బీఁటను వేంచేసి చెల్లపిల్ల గడించెన్? 10

ఆ. తెలుఁగునాట నెల్లదెసల నీశిష్యులు, కలరువైదుషీప్రకాశఖనులు
సకల వైభవప్రశస్త మాచార్యక, మవధరించి ధన్యుఁ డైతి వీవు. 11

క. మీశిష్యుఁడు వీఁడని యొక, దేశమ్మును బనుచుబిరుదు తెల్పుచు వినయ
శ్రీ శేవధియై మ్రొక్కఁగ, దేశికుఁ డొరుఁ దందలేనితృప్తిన్ గుదుచున్. 12

ఆ. ఒజ్జకంటె నన్యుఁ డుండునె కై సేయఁ, దగినవాఁడు సభ్యజగమునందు;
చాలుఁజాలు గురుఁడు సాక్షాత్పరబ్రహ్మ, మనెడిపల్కు నిచ్చ మనెడితక్కు. 13

---

1 వద్లమూడి వేంకటరత్నముగారు, 2 అబ్బరాజు వీరరాఘవయ్యగారు.

గీ. చదువులం దాఱితేఱి యొజ్జనము నెఱపి, కన్నకీర్తి చిరంబగుఁ గైతకతన
నీకు నిది దక్కెఁ దొంటిపున్నెములు పండి, మాధురీ సాధురీతి సమగ్ర మగుచు. 14

ఆ. గాలివాలు చూచి కబ్బ మల్లవు; ధన, తృష్ణ కోడి భారతిని గలంప;
వంటువడిన నుడుగు నాదరింపవు; సము, న్నిద్ర సంప్రయోగనిష్ఠ నీది. 15

గీ. ఉన్నతికి గభీరతకు నన్యూనగతికి, నూఁతయై నిన్ను నుద్దించు కైత నీది
దక్షిణాపథ విశ్వవిద్యాసదస్సు, లాదరించి దానిహొరంగు మూదలించె. 16

క. రాచసిరిగుల్కు కులమునఁ, దోఁచుట నీ వాంధ్రశౌర్యధూర్వహన కళా
శ్రీచుంచువుకథ వ్రాసితి, వౌచిత్యవిదుల్ మనీషు లయ్యారె! యనన్. 17

ఆ. తనివి పరమభాగ్యమని విశ్వసించిన, గఱువ వగుట నీవు తఱి యెఱింగి
కమ్రఫణితిఁ గూర్పఁగంటి "తృష్ణావర్త", కృతిని బుద్ధలోకహితముపొంటె. 18

ఆ. తగినవాని కంకితము చేసితివి సదా, శివున కీ యుదారకవనధార;
నతఁడు సర్జ నయ్యు నతిసంచయము నొల్లఁ, దతఁడు సాహితీప్రగతికి నలఁగు. 19

ఆ. కవులు వేయిమంది కనిరి నీయట్లు నా, గార్జునాద్రిఖచిత మమరశిల్ప;
మీవుగాక దాని నెందఱు కైతకుఁ, దెచ్చి యందుకొని రతీవగరిమ? 20

ఆ. కరుణ సత్త్వశుద్ధి కలమానవుండు గా, కెల్లవాఁడు చాలఁ డిట్టిపనికి
నెంతగా ద్రవించి సంతరించి 'కళా, క్షేత్ర' మది రసప్రసిద్ధసృష్టి. 21

ఆ. జాలిలేనివాఁడు శాక్యగౌతము, సత్య, వాణివలపులేనివాఁడు గాంధి
నుగ్గడించుఁగాక యుసుఱుండునా వాని, నుడికిఁ గుంటిగ్రుడ్డియొడలు తక్క. 22

క. ఇతివృత్తమునకు దీ టగు, బ్రతు కేకవి కుండు నతనిపల్కు రహించున్
మతిమన్ముఖ్యుల కది యా, మెత లిదు నుడివోని మేలిమేలిగుణాలన్. 23

ఆ. చదురులేని మడుగుమదిలేని పేరాస, నెదురలేని కలుచబెదరులేని
బదుగు లెగసి కైతపరు వూద్చుతఱి నీవు, తేకపోక తడ్డ లేమి నుడికి. 24

ఆ. దెబ్బదేండ్లబ్రదిమి యబ్బిననేమి కీ, దృడనికీర్తి యగ్గపడిన నేమి
నీకు నిహముతోడినెయ్యంబు తొలఁగుట, మాకు సైఁపరానిమంట గూర్చు. 25

ఆ. వాసిరెడ్డిసుకవివరు నధునాతన, హాలచక్రవర్తి నాప్తబంధు
నెనసి కావ్యగోష్ఠి నెలరారుచుంటివా, చీఁకుచింతలేని లోకమందు. 26

క. మంచిది! నీహృష్టి నపే, క్షించుట మాపాల విహితకృత్యము కానన్
సంచితసుకృతమ్ములు ని, ర్వంచితమగు శాంతి నొసఁగ వాసింపు మటన్. 27

గీ. ఉపనిషద్రాశిఁ ద్రచ్చినయోగి వీవు, తత్త్వ మెఱిఁగిన శేముషీధనుఁడ వీవు
దేహిదేహాంతరము గన్నదిట్ట వీవు, నీకు దెప్పరమా శాంతినివృతిలబ్ధి? 28

ఆ. వీరగురుని బ్రహ్మవిన్మౌళిసేవగా, మాననీయకవినమస్య కొగ్గి
యొరులపెంపుఁ జూచి పరితృప్తి నందిన, నీకు నరుదె వికృతినికృతిసిద్ధి. 29

గీ. పితృభక్తిపరాయణు నీ, సుతుని చిరంజీవిరావుశుభ మెంచుచు నీ
కృతి నిఁక నుడిగింతు భవత్, స్మృతికొగ్గిన తెనుఁగులెంక నేను యశస్వీ! 30

4-6-70

---

## అంతర్వీక్ష

ఉ. నాతలమీఁది కెక్కినవి నల్వది యేఁబది కాదు దెబ్బదేం;
ఢ్లాతతసాహితీసృజన నాంధ్రమహిన్ బహుసీమలందు వి
ఖ్యాతినిగంటిఁ గాని యివియన్నియుఁ బిన్నలదృష్టిలోఁ గదుం
బ్రాఁతలు రోఁతలై నికృతిపాత్రములయ్యె నిఁకేమిసెప్పెదన్. 1

చ. ముదుకకొలాయిగుడ్డ నొకమూరెఁడు దాలిచి బోసినవ్వులన్
గదలినజోగి నబ్బుడుగు గాంధిని గన్గొని తన్మయస్థితిన్
బొదలిననన్ను వెండితెరబొమ్మల కుల్కుమిటారి తళ్కుఁజూ
పుఁదళుకు సోఁకి మైమఱచిపోయెడివారు సమాదరింతురా? 2

ఉ. కారణజన్ము విశ్వకవిగా నవనమ్ములు గన్నవాని రా
గూరును బూర్జువాకవులకోవకు నెట్టి తదీయసాహితిన్
బేరిచి పేర్చుచున్ దగులఁబెట్టినవీరుల విన్న గుండె జే
జారగుచుండెఁ దచ్చటులచండిమకున్ బదివేల దండముల్. 3

ఉ. కాలముమాఱె నూతనవికాసము లేర్పడె నిర్నిరుద్ధులై
బాలురు దేశికావళికిఁ బారముసెప్పెడిప్రొద్దు వచ్చె రా
జ్యాలను దీర్చిదిద్దఁగల చాతురియున్ గనినారు వీరు మే
ల్మే లిఁక సంన్యసింపఁదగులే ననుబోఁటులు వృద్ధులందఱున్. 4

గీ. సంతతత్యాగసాధ్యంబు సౌఖ్య మనుచు, విశ్వసించుట నేఁ దవివేక మయ్యె
నిరవధిక రాగభోగ ప్రణేయమైన, సుఖము పొంగులువాఱు నెచ్చోటఁ గన్న. 5

ఆ. జగమనీశ్వరమ్ము మగువయు మగవాఁడుఁ, గదియ నిది జనించుఁ; గామ మొకఁడె
హేతువగును దీని కితరమ్ముగా; దను, పలుకు లిపుడు క్రొత్తపాట లయ్యె. 6

ఉ. మాటలు వచ్చిరాని చిఱుమన్మని తర్కముముందు నాదు ధీ
పాటవమెల్లఁ బొల్లువడి పర్విడుఁ; జెప్పుకొనంగ సిగ్గుచే;
బోటికయూ! సభన్నిలిచి యే నొక పెద్దవిధాన మాటికిన్
మాటికి గొంతుచించుకొనుమార్గము త్రొక్కుట యివ్విధమ్మునన్ 7

చ. బుదుతల నిర్వికారమగుబుద్ధులఁ గ్రోధదవాగ్ని మండలం
బదరఁగఁజేసి విప్లవమహోకవిపట్టము నందు నేర్పు నా
పదయఁగరానివిద్య, పలుబాముల కోర్చిన శాంత్యహింసలన్
విదువఁగలేని మామకకవిత్వము నెందఱు మెత్తు రియ్యెడన్. 8

ఉ. మంచినిజెడ్డఁగాఁ జెడును మంచిఁగ మంచినిమంచిఁగాఁ బ్రద
ర్శించు చవార్యవేగమునఁ జిత్రగతిన్ జను కాలమూర్తికిన్
గించిదుపాంతమం దొదిఁగి కేలు మొగిడ్చి మదాత్మ కింపుసం
ధించుపథాన మౌనిపగిదిన్ బయనించుట లగ్గు నా కిఁకన్. 9

5-3-71



గీ. అంద తొ నన్న దానిఁ గా దనుట ఘొకని, నెత్రులో గూఁడుగట్టిన నీచగుణము
తిక్కరేఁగి తారాడెడికుక్క నితని, నొక్క తెగఁ జేర్చి దాయకయుంద్రు బుధులు. 1

ఆ. మంచిపనులచే గడించు దేవత్వంబు, మంచిచెడ్డపనుల మనుజుఁ డగును
చెడ్డలే యొనర్చి జీవుండు పశువుగాఁ, బురువుగా జనించి పొక్కు గుడుచు. 2



# ముక్తిపారము

గీ. అతఁ డిటుల్ పల్కె నో ప్రభూ! యస్మదక్షి, పాపవాంఛల నొదవించు రూపములను
గానకుండునటుల్ ననుఁ గావుమయ్య!, గ్రుడ్డితనమైన మంచి దీజడ్డుకంటె. 1

గీ. అతఁ డిటుల్ పల్కె నోదేవ! యస్మదధర, మనుచితములైన వచనమ్ము లాడియాడి
మైలపడకుండునట్లు నన్ మనుపుమయ్య!, మూఁగతనమైన మంచి దీముప్పుకంటె. 2

గీ. అతఁ డిటుల్ పల్కె నోతండ్రి! యస్మదీయ, కర్ణములు హేయమైన వాక్యముల నాల
కింపకుండునటుల్ కరుణింపుమయ్య!, చెవిటితనమైన మంచి దీచెట్టకంటె. 3

గీ. అతఁ డిటుల్ పల్కెఁ నోనాథ! యస్మదాత్మ, పరసతులపట్ల వికృతపుంబాట త్రొక్క
కుండున ట్లనయంబు న న్నోముమయ్య!, మృత్యువైనను మంచి దీయెగ్గుకంటె. 4

* * *

క. అతఁడు తుకారాముఁడు తన, బ్రతుకున్ హరిసేవ కిచ్చి పండిన ధన్యుం
డతఁ డెల్లరయందు జగ, త్పతి నవలోకింపఁగన్న భక్తాగ్రణియున్. 5

ఆ. ఒక్కనాఁడు తోఁటప్రక్కగా నేగెడి, సాధుమౌళి నతనిఁ జక్కఁ జూచి
సేద్యగాఁ డొకండు చేమోడ్చి నాతండ్రి!, కొంచె మాఁగు మనుచుఁ గొసరికొసరి- 6

ఆ. ముదిరిముదిరి యున్న ముంగారు చెఱకు దం, టులను ద్రెంచి కట్టి "యలఁతికాన్క
యిది పరిగ్రహింపవే" యని భక్తుని, మూఁపుమీఁద నిడియె మోపు దెచ్చి. 7

గీ. పిన్నలకుఁ బెద్దలకుఁ దన తెన్నునందుఁ, గన్పడినవారికెల్ల నాగడలు పంచి
కొసకు మిగిలిన యొకతుంట నొసఁగె పోర్ద, మెసఁగ రాముఁడు తనచాన కిల్లుసేరి. 8

క. ఆ కోపన యీయొక్కటి, నీకిచ్చిన బుద్ధిలేనినిర్భాగ్యుఁ డెవం
డీకట్నమె పదివే లని, యీకొని నీ వెట్లు తెచ్చి యిచ్చితి నాకున్. 9

క. మతిపోయినదా నీ కని, పతి నాగడతోడ నాల్గుబాదులు బాఁదెన్
క్షితి రెండై పడె నిక్షువు;, యతచిత్తుం డైనరాముఁ డపు డిట్లనియెన్. 10

గీ. నెలఁత! నెదెసనీకున్న నెయ్యమునకుఁ, దియ్యమునకు నెల్లలులేమి తెలిసికొంటి
నీ వొకర్తవె తినుటకు నిష్టపడక, చెఱకుదంటును రెండుగాఁ జేయుకతన. 11

* * *

క. అతికర్కశమగు ఘటనము, నతులప్రియతారసార్ద్ర మగున ట్లొనరిం
చి తితిక్షాశేవధి నా, బ్రతికి తుకారాము ముక్తిపారము గఱపెన్. 12

13-3-73

# భావయ్య

గీ. క్రొత్త భావయ్యచౌదరి చిత్తశుద్ధి, వడసినమనీషి సంఘసేవానిరూఢ
జీవనుండు, పావనుండు, మనస్విప్రియుండు, గద్యమునఁ బద్యమున నేర్పుగన్నమేటి. 1

గీ. కమ్మవారిచరిత్రముగా నితండు, సంతరించినకృతి తెల్గుజాతిగాథ
సర్వమును బాహిరించుకోశము, తెనుంగు, దేశమున కమరప్రథన్ దెచ్చురచన. 2

గీ. కావ్యములు రెండు వల్లించి కవిత నల్ల, వచ్చుఁగాని చరిత్రను ద్రచ్చి పలుకఁ
జాలదీనేర్మి; వేనవేల్ శాసనమ్ము, లరసి వేసారవలె నైతిహాసికుండు. 3

క. భావయ రక్తము మాంసము, జీవము విత్తము చరిత్రసృష్టిని హుతమై
త్రోవం జూపెను వాఙ్మయ, సేవార్థి కటంచు మానసింతురు ప్రాజ్ఞుల్. 4

క. ధన్యుఁడు భావయచౌదరి, మాన్యుఁడు సకలాంధ్రజనసమాజంబున; కా
ధు న్యద్రి వన సముద్రము, గణ్యం బగు నితనికీర్తి కమనీయవిభన్ 5

19-7-73

---

# మహిళాపదయాత్ర

ఉ. అక్కఱలేని సంపదల కాసలు పెంచినవాఁడు నేఁ డెటో
దక్కినలోకతంత్ర మయథాతథమై చెడు నంచు జాతికిన్
జుక్కలు సెప్పినట్టి యపరిగ్రహధర్మవిధాన గాంధికిన్
మ్రొక్కెద నార్తమానవ సముద్ధరణ ప్రవణ ప్రయోగికిన్. 1

చ. రవి తనదీప్తివైభవపరంపర నగ్నికి నప్పగించి తా
నవలికి నేగినట్టులు మహాత్ముఁ డిహమ్మును వీడెఁ గోవిద
ప్రవరున కాత్మశక్తిపరిపాకవశీకృతదేశదేశమా
నవతతికిన్ వినోయతికి నైజమహస్సు నొసంగి తృప్తుఁడై. 2

శా. భావేసద్గురుసన్నిధిన్ శతవిధబ్రాహ్మీ రహస్యజ్ఞులై
సేవాధర్మవిశిష్ట జీవనకళా చిన్మూర్తులై చిత్తభూ
హేవాకప్రతిరోధి సంయమబలోపేతాత్మలై పుణ్యపుం
దావుల్ త్రోవల నింపు నీ మహిళలన్ దర్శించి హర్షించెదన్ 3

చ. అడుగులు పొక్కఁగా నహరహమ్మును విశ్వహిత క్రియారతిన్
నడుతురు వీరు, సత్యకరుణా పరిణద్ధ పవిత్రభావనల్
పుడమి నెసంగఁజేయుటకుఁ బుట్టిరి వీరు ఖరాంశుతాపమున్
గుడుచుచు నీడలన్ బథికకోటికి మేలిడు ప్రాఁకులంబలెన్. 4

ఉ. లోకము లోభమోహములలోఁ బడి సంతతవేదనాభర
వ్యాకులమైన కాలమున వచ్చిరి వీరు; వివేకసౌరభ
శ్రీ కిరవైన వీరినుడి చేకొని పావనజీవనక్రమం
బీకొని యెల్లవారు గడియింతురుగాక సుఖమ్ము శాంతియున్. 5

26-8-73

ఈ బృందమున-

1. కుమారి లక్ష్మీబహన్‌పుకన్ (అస్సామి)
2. కుమారి నిర్మలవేద్, ఎం.ఏ; ఎల్.ఎల్.బి. (పంజాబి)
3. కుమారి దేవీబహన్‌రిర్ఖ్వాని, ఎం.ఏ. (సింధీ) మధ్యప్రదేశ్ - అనువారు కలరు.

ఈ సోదరీమణులు బ్రహ్మవిద్యాసంపన్నలు; వీరు బ్రహ్మవిద్య, గ్రామస్వరాజ్యము, మహిళాశక్తి యావద్భారతమున ప్రచారము చేయుటకై 12 సంవత్సరముల దీక్షపూని వినోబాజీ దీవనలు పొంది 2-10-67 ఇండోరులో కదలి 14000 మైళ్లు పదయాత్ర సాగించి 26-8-73 తెనాలి వచ్చి సర్వోదయ సేవాసంఘమువారి మన్ననలు పొందిరి.

---

గీ. చచ్చి క్రొత్త పుట్టువునకు వచ్చుటేమి, గొప్పపని? చాక నూతన జన్మమునకు
రాక దొడ్డతనం; బిది రామునెల్ల, వారిలోఁ గంట, నా నీలు వదలుకొంట. 1

ఆ. తుక్కుతుక్కు సేయుదురు మాయ పన్నిన, వలను జ్ఞానులైనవార లెదిగి;
అణఁగి మణఁగి భక్తులా తెరచిఱుకంటి, వలన వెడలివత్తు రలంతలేక. 2

---

# భారతీదేవి

గీ. సత్యమునకు నహింస కాస్థానమైన, పుణ్యయుగమున జన్మించి భోగములను
మఱచి బ్రదుకు సర్వము త్యాగమయ మొనర్చి, చనిన భారతీ! నీ పెంపు సంస్మరింతు. 1

మ. నడివేసంగితతిన్ ఖరాంశుఁడు జగానన్ నిప్పులన్ గ్రక్క న
య్యుడుకున్ సైఁచి విదేశవస్త్ర విపణివ్యూహంబు మ్రోలన్ నిలం
బడి నీవై పికిటింగుచేసిన కథల్ భావంబునన్ దోఁచి మా
యొడలెల్లన్ బులకించు నిప్పటికి; నోహో! దేశసేవాకృతీ! 2

క. ఒక్క చెఱఁ గాదు రంగా, యెక్కడ నేచెఱలఁ బడియె నీవును నా యా
యిక్కట్లఁ బడితి వోడక, నిక్కపు సహధర్మచారిణీత్వము వెలయున్. 3

క. పదవుల కాసింపక సం, పదలకు నారాటపడక పతితసమాజా
భ్యుదయము నర్థించిన నీ, బ్రదుకు నెలంతలకు మేలుబంతిగ నిలుచున్. 4

ఆ. ఈవు మమ్ము వీడి యేఁడాది యయ్యెనా!, కాలచక్ర మెంతగా భ్రమించె!
మాకు మాత్ర మీవు మాయంద యున్నట్లె, తోఁచు ననుదినంబు శౌచమూర్తి! 5

గీ. అకట! భారతి పోయెనా యని వగర్చు, మనుజు లీఁనాడు త్యాగంబు మరగవలయు
ఇదియ తత్సతికిన్ శాంతి నిచ్చు, నిదియ, తత్సతికిఁ దగినట్టియోదారు పగును. 6

15–9–73

---

# గృహస్థ ధర్మము

క. అతఁడు పరివ్రాజకుఁ; డా, యతి పుణ్యక్షేత్ర దర్శనాసక్త మతిన్
క్షితి నెల్లం దిరుగుచు నొ, క్క తతిన్ జనుదెంచె నొక్క కటకమ్మునకున్. 1

గీ. మూఁడు నాళ్ళయ్యె నతఁ డన్నమునకు నోఁచి, సైఁపలేఁడాయె సంన్యాసి జాఠరాగ్ని
అరిగె నంత "భిక్షాందేహి" యనుచుఁ బెక్కు, తావులకు బోద యడుగులు తడఁబడంగ. 2

గీ. వంట యగుచున్న దనె నొక్కయింటి మగువ, మరల రమ్మనె నొక్కమందిరపులేమ
నేఁడు వీలుగా దనె నొక్కనెలవు నెలఁత, మెతుకు నిప్పచ్చరయ్యె నయ్యతికి నపుడు. 3

ఆ. ఉస్సురనుచు బోడి యొకవీథిలోఁ గూలి, యింత మహికి నన్న మిడు ప్రభుండు
నన్నుఁ ద్రోయఁ గారణంబేమి యే నెట్టి, యొగ్గు సల్పినాఁడ నిట్లు కుములు. 4

క. ఓ పరమేశ్వర! నను రా, రాపులఁ బెట్టకుము కనికరమ్మునఁ గను మే
నాపన్నుఁడ నా ప్రాణము, గాపాడు మటంచుఁ బెక్కుగతులన్ వగచెన్. 5

క. భగవంతుఁ డప్పు డొక వృ, ద్ధగ నయ్యమిమౌళిమ్రోలఁ దోఁచి యలంతిగా
నగుచున్ "మనుజుల నడుగక, వగచెదవేలయ్య వెఱ్ఱి వట్టెనె నీకున్" 6

క. అనవుడు 'నే నెందఱనో, కని వేఁడితి భిక్ష; నరులు కారా వారల్.
నను వెఱ్ఱి పట్టె నందువు, నినుఁ బట్టిన దండు నే' ననెన్ యతి పెలుచన్. 7

ఆ. ముసలి నవ్వి నవ్వి రుసరుస యేల నీ, కన్నవారు నరులు గారు బోడి!
యీ సులోచనంబు లిదెదను వీనితోఁ, జూడుమని బిరాన సురిఁగిపోయె. 8

ఆ. తలిసి యత్రపడుచుఁ దాత యిచ్చిన కంటి, జోడు నవధరించి చూచెఁ బురము
నదిర! వీటివార లంద ఱాతనికి భీ, కరమృగమ్ములట్లు కానఁబడిరి. 9

క. ఒక్కఁడు సింహముగా నిం, కొక్కఁడు శార్దూలముగ మఱొక్కఁ డెలుఁగుగా
నొక్కఁడు ములుపందిగ వే, ఱొక్కఁడు తిమ్మఁడుగఁ దోఁచె నోరలనెల్లన్. 10

గీ. అద్దములఁ దీసి చూచెనా యన్ని దెసల, మానవులె కాని మఱియొండు ప్రాణి లేదు;
ఏమి విడ్డూర మదియని స్వామి మురిసి, తిరిగి తిరిగి పట్టణమెల్లఁ దేఱిచూచె. 11

ఆ. రాచబాటప్రక్క నేచి తనర్చిన, రావినీఁడ బాదరక్ష కుట్టి
కుక్షి నింపుకొనెడి గొడగరి మాత్ర మే, రీతిఁ గనిన నరునిభాతిఁ బొలిచె. 12

గీ. విస్మయంపడి సన్నాసి వీట నీతఁ, డొక్కఁడే నరుఁడా! యిది నిక్కమైనఁ
జనునె యే నిస్సిరో కడజాతివాని, బిచ్చమడుగుట గొద నెంత నొచ్చుచున్న. 13

ఆ. ఏను; వీఁడు, లోక మిదియెల్ల నాత్మప, దార్థమగుట రూఢ మౌనుగాని
దిక్కుమాలినట్టి దేహాభిమానంబు, కదలదయ్యె నన్ను వదలదయ్యె. 14

గీ. వనజభవునుండి చిఱుచీమ వఱకు నఖిల, కాయముల సాక్షిగా నిల్చి క్రాలునట్టి
దొక్కచైతన్యమే యని వక్కణించు, చదువు నేర్చియు నేర్వనిజడుఁడ నైతి. 15

ఆ. గంగయందుఁ దోఁచు కమలాప్తునకును మా, తంగవాపి నలరు తరణికిని ర
వంతయేని భేద మగపడునా యింత, తెలిసి దారిదప్పు దేబె నైతి. 16

క. చేకొని "త్వయి మయి చాన్య, త్రైకో విష్ణు" వను సూక్తి నెన్నోసభలన్
వాకొంటిఁగాని పూర్ణవి, వేకము గననైతి మబ్బువీడమి నకటా! 17

క. చేఁతలకు రాని కూఁతల, వ్రాఁతల నెవ్వనికి ముక్తివచ్చును విశ్వ
ప్రీతి వెలివిరిసి తేఱిన, చేతమ్మునఁ దక్క సమతచేతను దక్కున్. 18

క. అని వగచు పరివ్రాజకు, ననుతాపము చర్మకారుఁ డాత్మబలమునన్
గని యతిరాజా! మ్రొక్కులు, కొనుఁడనియెన్ వినయభార కుంచితతనువై. 19

క. మీ యంగద మీయఱమర, మీ యలజడి గంటి సంయమీ! యిఁక దిగులున్
ద్రోయుఁడు మీ మది కింపగు, చాయన్ దొలఁగింతు మీ విచారము ననియెన్ 20

గీ. మధురభక్ష్యంబు లమ్ము బ్రాహ్మణుని విపణి, తనకు నెదురుగ నుంట నత్తావునకు య
తీంద్రునిం జేర్చి యీసామి యెంత కోరు, నంత యిమ్ము మిఠాయి విప్రాగ్ర! యనియె.

క. నేఁ డేను సిద్ధపఱిచిన, జోడునకున్ ముట్టునట్టి సొమ్మెల్లను నీ
కోడక యిచ్చెద ననె నెద, యీడెఱుఁగనికరుణ పొంగి యివతాళింపన్. 22

ఆ. మంచిదనియె బేరి; మస్కరి బూరె లొ, బ్బట్లు లడ్లు కోవ లంగరొల్లె
లొఁగు లఱిసె లాదియైన పణ్యారముల్, కుతుకబంటి గాఁగఁ గుడిచి త్రేఁచె. 23

క. రాజును మంత్రియు నపుడే, వాజులపై వచ్చి రటకు; వారికి వినయ
శ్రీ జాటిగొడగరియెదో, తాఁజెప్పఁ దలంచి వెఱపు దందడిసేయన్ 24

ఆ. పలుకలేక తొట్రుపడుచుండ నోయి; జం, కేల నీ తలంపు నెఱుకపఱువు
మనె మహీధవుండు; మన సప్త పాదునం, బడఁగ నుడివె నిట్లు పాదుకృత్తు. 25

గీ. దేవరా! చర్మకారవృత్తిని రవంత, నేర్పు గలవాఁడనే; నివి నేఁడు తీర్చి
నట్టి చెప్పులు, చక్కని గట్టి చెప్పు, లర్హమగు మూల్యమిడి వీని నందుకొనవె: 26

ఆ. అనుడు మానవేంద్రుఁ డతనికి శతరూప్య, ములకుఁ జాలు పసిఁడిముద్ర నొసఁగె
నేల యింతపైఁడి యీ తోలుముక్కల, కోదొరా! యటంచుఁ బేద బెదరె. 27

క. ఏమో నామది కరఁగిన, దీమాత్రకు నన్నుఁ బ్రోత్సహించిన దిది హె
చ్చో మతి లొచ్చో తడవకు, భీ మాను మటంచు రాజు ప్రేమలు కురిసెన్ 28

క. తామెంత యిచ్చినను నే, నా మొత్తము నెల్ల నీ బెహారి కిడవలెన్
భూమీశ; యనె గొడారి య, దేమనెఁ బఠి; యతఁడు గ్రంథమెల్లను వినిచెన్. 29

క. ఆ జోడు నిట్లు తె మ్మని, రాజు నిజాక్షులకుఁ జేర్ప రథ్యాజన మా
భూజాని కుగ్రజంతు స, మాజమయ్యె కానిపించె మది తిచ్చపడన్. 30

ఆ. తాను సింగముగఁ బ్రధానుండు బెబ్బులి, గా, వణిక్కు కొంగగా, యతీశుఁ
డావుగా, గొడారి యతఁ డొక్కడె నరుండు, గా ధరాధిపతికిఁ గానిపించె. 31

ఆ. దొరకు నావహిల్లె దొరలేని యబ్ర; మా, యయ్య చర్మకారు నట్టె చూచి
యెట్లు వచ్చె నీకు నింత గొప్పతనమ్ము? మమ్ముఁ జుట్టుకొన్న మైల యెద్ది? 32

క. మాదిగవు కావు నీ వ, న్నా! దివి నెడఁబాసి భువికి నరుదెంచిన వే
ల్పొదు వన వలదు వలదు మ, హోదయ! న న్నింత మెచ్చు టుచితం బగునే. 33

ఆ. శ్రుతులు నేర్వలేదు వ్రతములు పాటింప, లేదు తపము సేయలేదు నదుల
మునుఁగలేదు జన్నముల నేను గావింప, లేదు సురలఁ దేర్పలేదు గాని – 34

గీ. ఈశ్వరార్పణ దృష్టితో నెల్లపనులు, పూనెదను నేను ఫలసంగబుద్ధి లేక
వచ్చుబడియందు సగముపా లిచ్చుచుందు, నతిథి కభ్యాగతునకు నిందారుపేర్మి. 35

ఆ. కడమసగములో సగమ్ము నాపితరుల, కర్హమైన తిండికై వ్యయింతు
మిగిలినట్టి నాలుగగుపాలు వెచ్చింతు, నాకుటుంబమున కనారతముగ. 36

ఆ. ఏను బడసినట్టి మానవత్వమున కీ, నియతి హేతు వగునె నృపవతంస!
యింతనాఁటినుండి యిదియ నా జీవన, మార్గమనె వినీతిమై గొడారి. 37

గీ. రా జపుడు కన్నువిచ్చి యోరా! త్వదీయ, పథము సామాన్యమా యోగివరుఁడ వీవు
ధర్మమున కవలంబమై తనరె దీవు, దయకు నెలవైన మానవోత్తముఁడ వీవు. 38

గీ. చదువులేకున్న నేమి కోవిదులమదికి, బెదరు పుట్టించు నెఱుక నేలెదవు నీవు
నా గురుండవు నీవని నాఁటినుండి, తన్నుదిద్దుకొనెం బ్రజాతతిని దిద్దె. 39

క. యాగమునకంటె గేహ, త్యాగమ్మునకంటె నధికతర పుణ్యద మౌ
యోగము గృహస్థధర్మము, రాగము రావలయు మోక్షరతులకు నిందున్ 40

ఆ. తల్లి నాశ్రయించి పిల్లలందఱు సుఖ, మందురీతి లాఁతియాశ్రమంబు
లన్నియును గృహస్థు నండదండలనార్తి, భారదూరమైన బ్రదుకు గాంచు. 41

ఆ. అతిథిశిష్టమైన యన్నము, నిజ వధూ తృప్తి దానశీల, మింద్రియముల
నగ్గపఱుచుకొంట, యణఁకువ, పితృభక్తి, వలచుగేస్తుఁ జూచి వణఁకు నఘము. 42

25-2-74

# గురుపూజ

(107 వ జయంతి)

శా. ఏ సద్దేశిక సర్వతోముఖకళా హేవాకరోచి స్తతిన్
నా సాహిత్య మెలర్చె నద్రితనయానాథార్చనాధీనధీ
వాసున్ వాగపరావతారు నతనిన్ వర్ణింతుఁ దాదేపలి
శ్రీ సంతత్యుదితున్ గృపాప్తతి నఘచ్ఛి ద్వేంకటప్పార్యునిన్. 1

శా. ఏకశ్లోకరహస్య బోధనముచే నెవ్వాఁడు శిష్యున్ సుధీ
లోకాగ్రేసరుఁ జేయు నవ్విబుధుఁ గొల్తున్, వేంకటప్పార్య న
స్తోక శ్లోక మయూఖ రాజదఖిలాఖన్ రామగాథామృతా
ఖ్యాక గ్రంథమతల్లికా జనకు నిద్ధాచారు మద్దేశికున్ 2

క. వెలనాటి రాచవీటికి (చందవోలికి), వెలనాటినబుధుని భువన విస్మయ శీలా
కలన ప్రియభావను నీ, వెలనాటికులీనుఁ దలఁతు వేకువవేళన్ 3

ఉ. అర్ధమరేయిదాఁకఁ బొల మారసి క్రోసులు రెండు దూసి యే
నొద్దిక నొద్దికిం జన గురూత్తముఁ డీకరుణాసరిద్విభుం
డద్దిర! నిద్దురన్ వదలి యయ్యయిపాఠము లుగ్గడించె నీ
పెద్దతనంపుసొంపు కనిపింపద లాఁతులయం దొకింతయున్. 4

గీ. ఒక్క శ్లోకమునైన నాయొద్ద నేర్చు, నతఁడు కృతమతి యగుట తథ్యం బటంచు
నా దిగులు మాన్పె నొజ్జ యానాఁడు, చిరము, చదువుసాగక నే నొచ్చుసమయమునను

---

మధ్యాక్కర
వినతుఁడనై నిక్క మొక్కటి వినుతు వింతవారికడ
నను మించి యపుడు చదివిన కుఱ్ఱలు నా నేస్తగాండ్రు
కనరైరి నేర్మి నించుకయును గురుని కడివోనిపల్కు
పెనుపుమై నేన రేకెత్తి మెఱవడి పెద్దయుం గనితి. 6

క. వచ్చిన శిష్యులకున్ బదు, విచ్చుటయే కాక యన్నమిచ్చెను వస్త్రం
బిచ్చెను మా యయవా రీ, వెచ్చము దుస్సహమ యైన వెఱవఁడు లవమున్. 7

క. అనాఁడు చర్లబ్రహ్మాయ, కానంబడె నిట్టియావి కలదేశికుఁడై
యేనాఁడు జాతిగర్వని, దానము లీద్క్ష కోవిదప్రాగసరుల్. 8

ఉ. నన్నయ తిక్కనాది కవినాథుల నేర్పులు తోఁచుకైవడిన్
బ్రన్ననిబాటలో నడిపె రామకథన్ మహనీయ కావ్యమున్
పిన్నలు పెద్దలున్ దెలుఁగుపేఁటల నారతులిచ్చి కొల్వఁగా
బున్నెపుముద్ద నా నిలిచిపోయెను ముద్గురుఁ డంధ్రసాహితిన్. 9

ఆ. గురునినేర్మి యోర్మి కరుణ కవిత్వమ, హత్త బుషిత రూపునందె ననఁగ
రాణకెక్కె సుతుఁడు రాఘవనారాయ, ణాహ్వయుండు లోక మబ్రపడఁగ. 10

క. ఉత్తరరామకథన్ రస, వత్తరముగఁ బల్కె బయలుపడని కవిత న
చ్చొత్తించె నహో! పితృణము, నిత్తెఱఁగునఁ దీర్చుచేవ యెందఱ కబ్బున్! 11

క. అణఁకువ రాఘవనారా, యణశాస్త్రికి నంజలింతు నాత్మజత మహత్
ప్రణతుల్ గను మద్దేశిక, మణికి సమీచీనధర్మమయ ధీఘృణికిన్. 12

24-9-74

---

## మధునాపంతుల

ఉ. తీయనికైతతోడ గడిదేఱిన పాండితితోడ నాంధ్ర రా
ష్ట్రీయ వికాసమున్ వలచు డెందముతోడ నపారశౌచల
క్ష్మీయుత జీవనప్రవణ శీలముతోడ నెసంగు సత్యనా
రాయణశాస్త్రికిన్ జయపరంపర సంతతమై లభించుతన్! 1

ఉ. ఆలను రాగితేకులఁ బురాతనవాఙ్మయ కందరమ్ములన్
మూలుగుచున్న తెల్గుకథ ముమ్మరపుంబడ లోర్చి తీర్చి మేల్
మే లని కోవిదుల్ పొగడ మేటిప్రబంధముగా సృజించి ని
ర్వేలయశమ్ము గన్నసుకవిన్ గొనియాడెద నిమ్మహామతిన్. 2

చ. మన మనుజేశ్వరుల్ కవు లమాత్యులు యోద్ధలు దాతృతాపరా
యణులు మనీషిపుంగవు లహస్కరసోములు నిల్చునంతకున్
మనఁగల కీర్తినంది రని మాటికి మాటికి మెచ్చు లోక మీ
యనఘుని సాధుసుందరము నాంధ్రపురాణకృతిన్ బఠించుచున్. 3

చ. కులమత వాదభేదములకున్ దవుదవ్వుల నిల్చిసత్యమున్
పలుకుట వేయిజన్మములపాటిఫలం బిదు నన్న ధర్మువున్
వలచుచు శాస్త్రి కూర్చు కవివర్యచరిత్రము తెల్గువాణికిన్
జెలువము సంతరించుకయి సేఁతలలోఁ దొలిబంతి దొంగదా! 4

చ. తొలుతను జోళభూపతులతో నిటు వచ్చిన కంచిద్రావిడుల్
తెలుఁగున కున్నతీపి గని దిగ్గన మానిరి మాతృభాష; నే
వెలితియు లేని తెల్గులయి వెల్గిరి; చెల్విళసత్కవీంద్రుఁ డీ
వలతిఁయు నెవ్వ? రాతమిళవాసన వాసినబాఁపలేసుఁడీ! 5

ఉ. అచ్చపుఁదెల్గువార లదిరా! యనఁ గమ్మనికైత సెప్పి వి
ద్వచ్చయ మెన్నఁగా నమరవాణికి వన్నెలుదిద్ది శాస్త్రముల్
త్రచ్చి శ్రుతుల్ పఠించి ఋషిధర్మముఁగొల్చి తెలుంగుజాతి కీ
సచ్చరితుల్ ఘటించిన ప్రశస్తిఁ దలంచి శిరమ్ము వంచెదన్. 6

చ. చదురుల నిందియున్ వినయసంగతి వీడఁడు శాస్త్రి; దైవసం
పద లభయాదు లంచు హరి పల్కుసు నమ్రత నందుఁ జేర్చె; ని
య్యది కొఱవడ్డనాఁడు నరుఁ దర్హణకున్ దగఁ డెన్ని శాస్త్రముల్
చదివిన నెన్ని కావ్యములు సల్పిన శిల్పము లెన్ని కూర్చినన్. 7

ఉ. మన్ననచేయఁ దగ్గ నెఱమానిసియౌ మధునాకవీంద్రుఁడీ
యన్నను సత్కరించు ప్రజలైన నలంతులె! పూజ్యపూజకున్
బన్నుట సంఘధర్మ మనుపాడి నెఱింగినకార్యకర్తలన్
బిన్నలఁబెద్దలన్ సుగుణపీరములన్ మనసార మెచ్చెదన్. 8

ఉ. నేఁ డొక ఝంఝ రేఁగినది, నెట్టన దీనికి జంకి ధర్మువున్
వీడఁడు శాస్త్రి, వెన్కడుగు వేయఁడు, మున్నటి నన్నతిక్కనల్
ప్రొడలు చన్నమార్గమునఁ బోవుచు రేపటినుండి యర్వదా
ఱేఁడులు నిల్చి పల్కఁగలఁ; డిద్ధకృతుల్ శతముల్ సహస్రముల్. 12-2-75 9



ఆ. తెలుఁగువాని వంటతీ రన్యదుర్లభ, మమరులైన మెత్తు రతనివిందు
వంకలేని దిందు వైదికపాక, మా, పోపు నాల్కత్రుప్పుఁ బాపుమందు.

గీ. చక్కనలు గుల్కువానకు సమరమునకు, నిచ్చపడు నాంధ్రుఁ దండాల కిర వితండు
తిండిలో మొనగాఁ డని తెల్పినట్టి ప్రాకృత కవీంద్రుపల్కు లిప్పటికి నొప్పు.
(ఈ కవి 9వ శతాబ్దిలోని ఉద్యోతనుఁడు)

# యం. ఆర్. అప్పారావు

ఆ. ఈవు పుట్టి యఖువదేం డ్లాయెనా యెంత, వింతగూర్చువార్త వెడలె నేఁడు
జవ్వనంపు బిగువు సడలమి కేయోగ, మందుకొంటి రంగయాప్పరాయ 1

ఆ. ధర్మువుదప్పని కోర్కులు, నిర్మలజీవిత, మహంత నేర్పమి, నీకున్
వర్మములై వార్ధక వ, క్రోర్ముల నరికట్టె నందు నుర్వీరమణా! 2

గీ. నరులకడగండ్లు తీర్చినదొరలు కలరు, గాని మీ యప్పరావుచందానఁ బసుల
బాధలున్ దొలఁగించిన ప్రభువు లవనిఁ, గలరె ధర్మావతార మా తెలుఁగుతేఁడు. 3

క. దోమలరాయిడి కడలెదు, గోమహిషచయమ్ము రద్దుకొనఁ బ్రాంశుశిలా
స్తోమము కొల్లేటన్ బలు, భూముల బాఁతించె నతఁడు పొంగిన కరుణన్. 4

క. కవిపండిత పోషకులై, కవితా వైదుష్యరుక్ ప్రకాశితులై వీ
మివిలిరి మీపెద్దలు తద్, భవితవ్యము నిల్పి తీవు ప్రాజ్ఞతకలిమిన్. 5

ఆ. రాచబిడ్డ వగుట రాష్ట్రోపలబ్ధికై, యెల్లలేని సేవ కియ్యకొంటి;
వలఁత లోర్చి యోర్చి యాంధ్రమహాసభా, యాజమాన్య మూని యశము గంటి. 6

క. ఈ యుగము ప్రజాతంత్ర వి, దాయుక్తము గాన మంత్రితాగౌరవమున్
నీయది యయ్యె సమాజ, శ్రేయము నర్థించి మెప్పుసెందితి వపుడున్. 7

ఆ. విజ్ఞలోక మలర విశ్వకలాపరి, షత్తు నేఁడు నీ మహత్త వలచె
నఖిలవిద్య లెసఁగి యాంధ్రశారదకీర్తి, ప్రబలుఁగాక నీదు పాలనమున. 8

క. ఆయుష్యం బారోగ్యము, శ్రీయున్ బ్రాభవము నీకుఁ జేకూర్చుత! నా
రాయణుఁ డపారముగ; సుగు, ణాయతనప్రాయ! రంగయాప్పారాయ! 9

19-2-75

---

ఆ. ధర్మువునకు నెలవు దయ, కీర్తికిన్ బీజ, మీవి, పుణ్యజగతి కేగు తెరువు
చూపుదివ్వె నిజము, సుఖముల కన్నింటి, కాదిహేతు వచ్చమైన నడత.

ఆ. తినుము తిను మటంచుఁ దనమ్రోల నిల్చిన, గోవుకుతుక నొత్తి కొఱుకలేక
వెనుక కేలసాగె వేఁగి? సత్యమహస్సు, సైఁపలేక చంపు నోపలేక.

# కృష్ణశాస్త్రి

క. ఋషినోట వెల్వడిన యుప, నిషదుక్తులు కృష్ణశాస్త్రినిగదితకృతు; లీ
సుషమకు నెలవై తెనుఁ గు, న్మిషమై పరభారతీ సమీడితః మయ్యెన్. 1

క. తనయెడఁదన్ రఘుపతి నా, యని పదచిహ్నములు చెఱుగ వని మానవతా
ఖని కృష్ణశాస్త్రి పల్కుట, విని విజ్ఞులు తనియుదురు దివిన్ భువి నొకటన్. 2

క. తెనుఁగు రవీంద్రుఁడు నా నితఁ, డనవధియశ మందుకొనె; నిజాధ్వమునకు రాఁ
బెనఁగెడి కవులన్ బెక్కురఁ, గనుఁగొనె; ధన్యత్వ మింతకంటెను వలెనా? 3

ఆ. పరమసత్యమైనపలు కేమతమ్మునఁ, దోఁచుఁగాక దాని సైఁచు నితఁడు
సమత సర్వయోగసారముగా విశ్వ, సించునట్టి మధురశీలుఁ డితఁడు. 4

ఆ. లిఖ్చికొఱకు వ్రాయలేదు కైత, చెనంటి, కట్టికొఱకుఁ బదము కట్టలేదు
పలికెఁ గృష్ణశాస్త్రి పరమేశ్వరప్రీతి, కొఱకు సత్యధర్మగుప్తికొఱకు 5

ఆ. భక్తుఁడై నిజార్తి పలుకు నీశ్వరుముందు, ప్రేయసీత్వ మూని ప్రియుని వెదకు
బంటుగా నొనర్చుఁ బ్రభున కూడిగ మెల్ల, జగ మెఱుంగు శాస్త్రి సగుణసేవ 6

ఆ. శాస్త్రికూర్చు మేఘసందేశమున్ విని కాళిదాసుఁ డెంత కరఁగినాఁడొ
యితనిగీతి మఱవ దీజాతి పయ్యెర, వీచుదనుక మల్లె పూచుదనుక. 7

ఆ. కరుణ కలదు ప్రేమ కల దీవి కల దాత్మ, కలదు కృష్ణశాస్త్రి కవితయందు;
టన్ను బరువు దానికున్నదా? యని నొస లెత్తి యడుగువాని కేటికోళ్ళు. 8

14-3-75

---

క. భగవద్విభూతు లనఁగాఁ, దగు నింతులయందుఁ దోఁచుతాల్మియుఁ గృపయున్
సొగసును బాతివ్రత్య, ప్రగాఢనిష్ఠయును మధురఫణితియు ధృతియున్.

ఆ. వేద్మలందు వెతల వ్రీల దావంతయు, వదల దోర్మి కూర్మి ముదిమినైన
బీతు సిగ్గు సడలఁ బెరిఁగిపెరిఁగి సాంద్ర, సఖ్యమై కరంచు జంటతనము.

గీ. వేల్పునకుఁ బతివ్రతకును వేఱు లేమి, ననుమతింతురు బుధులు; ధర్మార్థకామ
సౌఖ్యములు సాటిలేని యశమ్ము సాధ్వి, కతనఁ బతి కబ్బు ననుట నిక్కమును గనుట.

# యలమంచిలి

ఉ. కల్లకు బాహిరంబయిన గాంధియుగమ్మునయం దహింసకున్
దల్లిగనున్న కాలమున దాస్యనికృంతన దీక్షతోడ అం
పిల్లిన వీరకోటి నొకవీరుఁడవైతివి తెల్గునేల; నీ
తొల్లిటిపున్నె మీగరిమతోఁ దనిపెన్ నిసు వేంకటేశ్వరా! 1

క. జాతిపిత చరణసన్నిధి, జాతిగురూత్తముని కరుణఁ జరితము నోత
ప్రోతముగ దిద్దుకొని యుద్, ద్యోతించిన నిన్ను నభినుతింతురు ప్రాజ్ఞుల్. 2

క. అనితరలబ్ధ ప్రత్యయ, మనూనధీశక్తి యందయై నిలువంగన్
వనము నలవోక విద్యా వనమును గావించునిన్ను వర్ణింత్రు కవుల్. 3

శా. హిందీ భారతజాతిభాష యనుప ల్కేనాఁడు లోచూపుతో
గాంధీ పల్కె మహోంద్రమెల్ల నిది యుక్తంబంచు భావించె నీ
చందంబున్ మదిమెచ్చి శిష్యకసహస్రజ్యోతివై క్రొత్తవా
పొందున్ నేర్పితి వీవు తెల్గులకు మెప్పుల్గంటి వాచార్యతన్. 4

గీ. మచ్చలేనిమానవులు నిర్మాణకార్య, కర్త లీనేల నెందఱో కలరు గాని
బిచ్చమెత్తక సంస్థలఁ బెనిచి మనుచు, దంట లెందఱు కలరు నీవంటివారు? 5

చ. నరుఁడొకఁ డొక్కనాఁడు భువన స్తవనార్హములైన కృత్యముల్
జరిపి యతాత్మలేక దిగజాఱును గ్రన్నన వేంకటేశ! నీ
వరమరలేనిపూన్కి జగదభ్యుదయ ప్రవణుండవై నిరం
తరముగ స్రగ్గుచుందు; గుఱిదప్పనియోగము నీకు లోపడెన్. 6

ఉ. లోకము వక్రమార్గములలోఁ బడె, రాబడి చూపుతక్క నీ
మూఁకను ధర్మదృష్టి లవమున్ గనిపింపదు, హింసకున్ నమో
వాకము బిచ్చుబుద్ధి పరివర్ధిత; మియ్యెడ నిన్నువంటి సే
వాకృతు లాయు రున్నతనిరామయజీవనులై మనన్ దగున్. 7

ఆ. నీడవోలె నిన్ను వీడక సేవించు, సతి సరస్వతమ్మ సంతసింప
నందికొనుము విద్వదాశీస్సు లింకొక, షష్టిపూర్తిమహము సాగుసభను! 8

26-7-75

క. రొక్కముచే సత్కవికృప, చిక్కదు, సవనప్రసక్తిచే హరికృపయున్
జిక్కదు; చొక్కపుమన్గడ, నక్కజమగుభక్తిఁ జిక్కునది యిది నేస్తీ!

ఆ. వీథు లూడ్చువాని విశ్వ మేలెడివాని, వేర్మి విడిచి గౌరవింపవలయు;
కృత్యమెల్ల నుత్యమే యనుసత్యంబు, చాటినట్టి గాంధి కేటికోళ్ళు.

ఆ. తల్లి దిద్దవలయుఁ బిల్లల మున్ముందు, గురులమాట చూచుకొంద మవల
వాని నంటరాదు వీనితోఁ దినఁగూడ, దనెడిమాత దేశహాని కూఁత.

---

## రంగనాయకులు చౌదరి

సీ. సొదుతారమణీయ చారిత్రవల్లరి, కల్లుపందిరియైన హోలికుడు
అన్న వెంకనవదాన్యత కృతార్థత నందఁ, గట్టలంతలు సైఁచు కార్యకర్త
సకలసంపదల కాస్థాని యయ్యు రవంత, గర్వగంధంబు సోఁకని మనస్వి
ధర్మ విఖ్యాంకితనతతి "సత్యసద"నాఖ్య, తనయింటి కిడి ప్రజన్ దనుపుగేస్తు.
గీ. శూరతా నరపాలతా సుజనవినుత, దాతృతా శుభశీలతా ధన్యమైన
యార్లగడ్డాన్వయమ్మునం దలరుమేటి, రంగనాయకు లభిమతార్థములు గనుత! 1

మ. ఇతఁ డాంగ్లమ్మున దిట్టయయ్యు మన సాహిత్యమ్మునన్ బ్రోడయై
సుతులందం బ్రియతించునిచ్చలు కవీంద్రుల్ ప్రాక్తనుల్ నూతనుల్
మతిమన్మోళులు కూర్చుకబ్బములు పల్మాఱుల్ పఠించున్ దద
ద్భుతసృష్టిం గొనియాడుచున్ సొగసి నింపున్ బాష్ప వాఃపురముల్. 2

చ. సకలజనుల్ ప్రసిద్ధకవిసత్తము లౌననఁగా మహర్షి క
న్నకవి రవీంద్రనాథుఁ డధునాతనగీత రచింప రంగనా
యకులు తెనుంగుచేసెనటె! యక్కవితన్ రుచులూరుపల్కుతో
నకుటిలధారతోఁ జిరతరాస్తికతాపరిణద్ధబుద్ధితో. 3

ఉ. చక్కని తెల్గుఁగైతలదెసన్ వల పగ్గలమౌట రేపవల్
తిక్కనభారతం బితఁ డతీవరతిన్ బఠియించు, నమ్మహా
వాక్కులమర్మముల్ దెలుపు "వాహిని"లోఁ బ్రజ, కామెఱుంగులన్
దక్కఁగొనన్ దపస్వివలె దయ్యును లోకము విస్మయంపడన్. 4

చ. పరువపు సొంపునన్ గొఱఁతపా టిసుమంతయురాని వీన్నికై
యఋవదియేండ్లపందు వని యాప్తులు మన్ననచేఁత చూడ నా
కరుదగుఁ గాని లోభహతు లందనివాని జరాదు లంటఁగా,
వెఱచు నటన్నసూక్తి ఋజువేయగు నీదృశులం గనుంగొనన్. 5

చ. తెలువులకెల్ల మిన్నయగు తెల్వి పరాత్పరుగుట్టు గంట, ని
శ్చలము నిరస్తదోషమగు సంయమ మిందు శరణ్య మందు, నీ
కలిమికి నొగ్గుచున్ దనివిగాంచుచు ఋచ్చమ సేవ లందుచున్
నిలుపు రంగనాయక! మనీషిమణీ! శతమానపూర్తిగన్. 24-10-75 6

---

ఆ. ఎన్నినాళ్ళు నీటనున్నను జెకుముకి, ఱాయి విడదు నిప్పురాల్చుగుణము;
ఉచ్చువంటి లంబినున్నను భక్తుండు, గునియు రాముపేరు వినినయంత.

ఆ. ముప్పులెగసి నన్నుముసరుకొన్నపుడొడ్ల, సాయమునకుఁ జేయిసాఁచియార్చు
పితికితనము నాకుఁ బెట్టకుమని హరి నడుగు భక్తమౌళి పదయుజయము.

క. పసివాని పగిది భక్తుఁడు, కసటెఱుఁగని తలఁపువాఁడు కావలయు సతం
దొసఁగునది నీరమైనను, రసమయ మధువౌను ప్రేమరాశికి హరికిన్

---

## సత్యనారాయణ చౌదరి

గీ. క్రొత్త సత్యనారాయణ కోవిదుండు, గురుఁడు కవి, విమర్శకుఁడుగా గరిమనందె
నిన్ని నేనువు లొక్కచో నిరవుకొంట, యబ్బురంబని భావించు నాంధ్రజగము. 1

క. ఆస్తికతయందు నితఁడు ప్ర, శస్తిం గనె వేంకటేశచరణార్చకతన్:
ప్రస్తాఖిలవేదనుఁడై, స్వస్తిం గను నితఁడు నేఁడు జలజాక్షుకడన్. 2

క. పున్నెములకుం గొటా రగు, నన్నయ తిక్కన్న యెఱ్ఱనయు సోమనయున్
జిన్నయసూరియుఁ గన్పడ, మిన్నందినతనివి నితఁడు మెలఁగుచునుండున్. 3

గీ. నా కథాసరిత్సాగరవాకు నీదు, గద్యమునఁ దోఁచు నని యనవద్యుఁడైన
వేదముబుధుండు కొనియాడ వినతుఁ డగుచు, బాష్పములు రాల్చియుండు నీపండితుండు. 4

ఆ. మానవత్వదృష్టిలేని పురాణముల్, త్రచ్చి నిజము వెలికిఁదెచ్చి తనుచుఁ
ద్రిపురనేని సుకవి దీవింప "నిది నీదు కరుణ" యని యితండు కరఁగియుండు. 5

9-11-75

# రాష్ట్రజయంతి

అంజలించెద నతశిరమ్మున, నాంధ్రరాష్ట్ర విధాతృకోటికి
మొదటి మ్రొక్కులు పొట్టి శ్రీరా, మునకుఁ జెల్లింతున్. 1

ఇరువదేం డ్లొకలెక్కగా దీ, యినుఁడు తారక లుండునంతకుఁ
దెలుఁగుజెండా రెపరెపల్ నలు, దెసల మ్రోఁగవలెన్. 2

తెలుఁగుసంస్కృతి వన్నె కెక్కెను, తెలుఁగుసంపద పొంగిపొరలెను
రాష్ట్రరమతోఁ దెల్గువానికి, రాణ చేకూరెన్. 3

విలయవార్ధులువోలె నెగసిన, విప్లవంబులు రెండుసమసెను
ఐదుకోట్ల తెలుగుప్రజలో, హార్దములు పూచెన్. 4

తరతరాల తెలుంగు పెద్దల, తపమునకు వెలలేని పంటగ
నాధికారికభాషయై తెలుఁ, గందె గౌరవమున్ 5

తెగువచూపి నదీనదమ్ముల, తగవులను దెగటార్చి రాష్ట్ర
ప్రగతికందగ నిల్చిన జగా, ప్రగడ కగు జయముల్! 6

మంత్రిమండలి కొమ్ముగావఁగ, మహి వెలుంగు తెలుంగు లందఱి
నొక్కవేదికఁ జేర్చి ప్రస్తుతి, కెక్కె నీదిట్ట. 7

కట్ట తెగి గోదావరీఝరి, కదలిపా లగువేళఁ జంటకుఁ
జెట్టరానీ నన్న యానెఱ, జెట్టి కగుశుభముల్! 8

తెలివి చాలదు యుక్తిచాలదు, దేశమును బాలించువానికి
వలయు వెంగళరావు గుండియ, వాఁడిగల తనమున్. 9

అభయ మన్నది దైవసంపద, నాదిమం బని గీత పల్కెను
మంచిపనికిఁ దెగించువాఁడే, మానవోత్తముఁడు. 10

దారితప్పినవారి యెడఁదల, దడదడలు చెలరేఁగె నేఁటికి
పల్లెపట్టులు మొగ్గవిచ్చిన, మల్లెపొద లాయెన్. 11

అసలుకంటెను వడ్డి ఐరువై, కుసులువిఱిగిన బడుగుమానిసి
కోలుకొని తలయెత్త వచ్చెను, గ్రొత్తసంక్రాంతి. 12

ఆంధ్రభూమికి సాటిలే దని, యాంధ్రజాతికి నుద్దిలే దని
యెల్లరాష్ట్రము లుగ్గడించిన, వేకకంఠముగన్. 13

మంచెపై నిలుచున్న కన్నియ, మంజుమంజురవమ్ము లొల్కఁగ
విజయగీతము పాడుచున్నది, వినుఁడు తెలుఁగన్నల్! 14

18-8-76

---

గీ. రాజుపని బంటుపనియు సమాజమునకు, గావలయు నెచ్చుతగ్గులు లేవు వీన
నొకటి ప్రాణమువంటిది, యొకటి మేని, వంటి; దిం దేదిరాణించు నొంటి దగుచు?

గీ. దొరతనమ్ములకతనఁ గత్తులఁ గటార్లఁ, గసిమసంగిన సేనలకతనఁ గాదు
సత్యబలమున సౌహార్ద శక్తివలన, బ్రదుకవలయును లోకంబు భయముదక్కి.

ఆ. ఎదుటివానికులము నెట్లేని సడికట్టి, చేయు మపుడు రాజకీయచర్చ
మాటలందె కాని మదిఁ జావలేదయా, కుల మతీవమూలబలము కాన.

---

# కావూరి వెంకయ్య

ఆ. ఇతనియింటిపేరు జతపడె మాయూరి:, కెవ్వఁ డితఁడు? మమ్ము నేల విడిచె?
విప్లవంబు లెవ్వి వెంకయ్య నల పల, నాటి కనిపె నాగులేటిదరికి? 1

క. పలనాటిరాజునకు మా, వెలనాటిమహీశునకును వియ్యము గదురన్
దళవాయిగ వెంకయపె, ద్దలతో నొకఁ దలుగురాజుదండకుఁ జనెనో! 2

గీ. కాకుండిన వెంకయ్యకు, నీకడమియు బరవసంబు నెమ్మోయి దక్కన్
లోకోత్తర వీరాగ్ర, శ్రీ కుల్యలు వీని శిరలఁ జిందులు త్రొక్కన్. 3

గీ. తాతముత్తాతలకు శిరోధార్యమైన, యుద్ధవీరము వెంకయాఖ్యుని యెదంద
ధర్మవీరముగా నవతారమెత్తె, భావగతి మాఱి బాపుజీప్రభలు చేరి. 4

క. పలనాటికి నితఁ డెంతయు, వెలుఁగిచ్చెన్ బగలు రేయి వేసటపడుచున్
వెలివాడల మలనీడలఁ, జెలరేఁగు పిసాళికాఱుఁజీఁకటు లణఁగన్. 5

ఆ. మరల మహికి వచ్చె మనబ్రహ్మనాయండు, కుటిలకులవిధాన కుడ్యవీథి,
విటతటమ్ముసేయ వెంకయ్యగా నని, పలికె నితనిఁజూచిపల్లె నాఁడు. 6

ఆ. పుంజ నంజ యయ్యె బుడిబుడికాలువల్, సాగిసాగి కృష్ణజలము నింప;
వెలిఁగె నింటనింట విద్యున్మహస్సు లీ, పరహితైషి గాసిపడుటఁజేసి. 7

ఆ. ఇతనిసేవకతనఁ గృతబుద్ధులై సము, న్నత పదంబు లంది నుతులుపడయు
దొరలు గలరు ఏఁడు హరి, గిరిజనులలోఁ, బల్లెపట్టునుండి ఢిల్లివఱకు. 8

ఆ. సజ్జకంకు లేఱి చలిదికిన్ జాలక, నవయునూళ్ళు రాజనాలఁ దినుచుఁ
ద్రేఁచుచుండె నిపుడు దివినున్న శ్రీనాథుఁ, డబ్రపడఁగ లజ్జ నడఁగిమడఁగ. 9

ఆ. తెల్లదొరతనమ్ము చెల్ల దీమహి నన్న, దిట్ట యితఁడు గాంధిచుట్టమితఁడు
పురుగు లురలు కసటుఁబుటుసు పాయసముగాఁ, ద్రాగె నితఁడు చెఱల కేగియేగి. 10

ఆ. ఇతనిసేవ యీవి యిట్టి దట్టిది యని, పలుకనేల వేయిపద్యములను;
వీరనారి యైన భారతికిన్ బ్రాణ, మనఘుఁ డైన రంగ కాత్మ యితఁడు. 11

ఆ. చావలే దితండు చచ్చినాఁ డని విశ్వ, సించువారు తెలివిసెడినవారు,
గాంధి చచ్చినపుడె కావూరి వెంకయ్య, చచ్చు, రవియు శశియుఁ జచ్చు నపుడె. 12

25-8-76

## వేంకట కవి

గీ. షష్టితమ జనురుత్సవ సత్సభా ని, విష్టుఁడై శిష్టలోక కోవిదసమాజ
కవికదంబ ప్రశంసఁల గరఁగు కొండ, వీటి వేంకటకవికి దీవెనల నిడుదు. 1

గీ. పండితులఁ గొల్చి మెప్పించి పడసినట్టి, ప్రజ్ఞకున్ జరితార్థతాభాగ్య మొదవ
విప్లవాత్మక రచనా ప్రవీణుఁ డగుచు, నలరు కవిరాజునకు జయం బగుత సతము 2

గీ. మనమతమ్ముల వర్ణాల మనపురాణ, గాథల నణంగియున్న తెక్కలితనమ్ము
క్రుళ్లు కుట్ర వెలారించి కుటిలమతుల, యాటకట్టించె నితఁడు సత్యార్థి యగుచు. 3

ఆ. ఏన్గువీఁపుమీఁది కెక్కి యూరేగెడి, గుంటనక్క యొడలు గుండె లదర
బెదరి తూలి బిళ్లబీటుగాఁబడి బొఱ్ఱ, నదుఁగ బాఱె నితనియుదుటు సూచి. 4

ఆ. వేలయేండ్లనుండి వెడవెడనమ్మికల్, కఱపి కఱపి ప్రజలకన్ను గప్పి
సాముదయ్యమైన సోమరి పరకకున్, గొంచెపడియె నితఁడు గొంతువిప్ప. 5

క. వేంకటకవీంద్ర మను మీ, వింకను వేయేండ్లు కవనహేతి నిశాతా
గ్రాంకురిత వహ్నికీలా, సంకర్షణమున సమాజజడతలు సమయన్. 6

గీ. సాంస్కృతికమైన దాస్యంబు స్రగ్గదనుక, రాజకీయవిభూతికి రాణ లేదు
కంచమున గూఁడుగట్టినకసటు తొలఁగు, దనుక మృష్టాన్నమునకు నాదరము రాదు.

ఆ. నిన్నుఁజూడఁ ద్రిపురనేని మహర్షి నా, మదికి వచ్చుఁ దీవ్రమంజు దీప్తి
విడువ కితని భావవీధి సినీకథా, దృష్టినైనఁ గావ్యసృష్టినైన. 8

గీ. నీకు నీధర్మనిష్ఠయ నైకసుఖము, లీయఁగలదు దీర్ఘాయువు నీయఁగలదు
చుక్కలు వెలుంగునందాఁక మొక్కవోని, గౌరవము నీయఁగలదు వేంకటకవీశ! 9

22-11-76

---

గీ. మనుజునెడఁదను గుఱువెట్టు మంచిమంచి, తలఁపులన్ దట్టి మేల్కొని తెలివి యొనవి
పులుకునం దోఁచుఁ గవి యనం బాత్ర మతఁడె, పదయు నక్షీణకీర్తివైభవము నితఁడె.

ఆ. సమత కాదిగురువు సాహితి, నానా వ్య, థా పయోధి బ్రుంగి తల్లడిల్లు
ప్రజలఁ దేర్చు పరమబంధువు సాహితి, ధీమహస్సు సాహితీరహస్సు.

---

# సంజీవరెడ్డి

ఆ. మంచిమాట వింటి మన తెన్గుబిడ్డ సం, జీవరెడ్డి లోకసేవఁ బండి
యెదురులేనిపోర నెక్కటిగెల్పుగాఁ, పడసెనట్టె! రాష్ట్రపతిపదంబు. 1

క. ఇదిచిన్నది యిది పెద్దది, యిదికీ డిదిమేలు నాక యీతఁడు పదవా
లెది కృత్య మనె హసా దని, యది చేసి గడించె నిమ్మహావైభవమున్. 2

ఆ. ఐదిలిబదలి బీళ్లు పండించి ప్రజకెల్ల, బువ్వఁబెట్టురైతె పుడమి నేల
వలయు నన్న గాంధివాక్కు నేఁడు ఫలించి, భారతమున నూత్నపర్వమొదవె. 3

గీ. జయజయధ్వను లీనాఁడు షష్టికోటి, కంధరల సందడించి క్రక్కదలుఁ జదలు;
శివునికుత్తుకుఁ గలకప్పు చెదెఁగదా త్వ, దీయ మహనీయ కీర్తి దీధితికి రెడ్డి! 4

ఆ. ఏదికలదు కోర నెవ్వానికేని యీ, నేల నింతకంటె మేలిగద్దె?
ధన్యమయ్యె భావితభవమ్ము దేశమ్ము, రడ్డి! మనుము! శతశరత్తు లెలమి. 5

20-7-77

---

## ఝంఝ

క. ఎనిమిదవపదిన్ బడితిని, మును పెన్నఁడు నెఱుఁగ నింతముప్పును, జలము
గ్గణమును ఝంఝానిలమును, బెనంగొని సృష్టించె లోకభీకరలయమున్. 1

ఆ. పెల్లురేఁగె వాన, పల్లెపల్లెయు నబ్ధి, ననుకరించెఁ, బడవలయ్యె శవము,
లనుచరాళితో వయాళిసాగించె నీ, తెప్పలెక్కి మిత్తి తెలుఁగుదీవి. 2

ఆ. బెడిదమైనగాలి కదలినప్రాఁకు సా, ష్టాంగవందనంబు నాచరించె
నిండ్లమీఁదిపెంకు లీగాడ్పుజూదరి, ముద్దుసేయు పేకముక్క లయ్యె. 3

ఆ. ఎల్లశక్తులు పఱపి వేయేండ్ల కేని, నరుఁడు పూరింపఁజాలనినష్టి వచ్చె
నకట! యొకజాములో; వర్షహతియు గాలి, బెడఁద మున్నీటిపొంగు దుందుడుకు సేయ.

క. ఇఁక నాప్రజ్ఞాపటుతకుఁ, బ్రకృతి జోహా రనుచు నగ్గపడు నని గర్వా
ధికతన్ జాటెడిమానవు, నకు గూబలుపిండి చెప్పినది యిది చదువున్. 5

ఆ. మగఁడు పోయె బిడ్డ మడిసెను గేహాది, కూలె నిలిచెఁ గొట్టకొనకు మగువ;
మగువ కడచె బిడ్డ మరణించె గేహాది, తొలఁగె బ్రదికెఁ దుట్టతుదకు మగఁడు. 6

ఆ. అమ్మకన్నుమూసె నయ్య త్రెల్లె సమస్త, బంధుచయము సమసెఁ బాప మిగిలె
నెల్లవారిఁ జంప నేడ్చువా రెవ రని, యిట్లు చేసెనేమొ మృత్యు వదిర! 7

గీ. మంచిదే కాని దీనులు మనుట కింత, తినుట వలయుఁగదా యెదీ తిండి యిచట?
నకట! కోఁతకువచ్చి సిద్ధాన్నమైన, శాలిసంపద మున్నీటిపాలఁ బడియె. 8

ఆ. కూడులేక నాలిగుడ్డయులేక 'నా' , యనెడిదిక్కులేక యలమటించు
నరునిపా ల్లెతింగి కరఁగి యుదారతా, ప్రవణ మైనజగతి కవు జయమ్ము! 9

2-12-77

---

ఆ. పోలిసెట్టిగారు పోలయ్య యైనంత, నిరుగుపొరుగువారి కేమియొఱుగు
వెనుకఁబడ్డవారివెతలు నావెత లని, మానసించినపుడె మహిసుఖించు.

ఆ. బౌద్ధయుగమునాఁటి పాషాణముం గని, యాతఁ డుస్సురస్సు రనును గాని
మెతుకులేక చావుబ్రతుకులనడుమ నేఁ, కారువానిఁ జూచి దారిమార్చు.

---

## బాలాబ్దము

ఆ. కల్ల కపుడు లేని కసి కక్కుఱితి లేని, యెడఁదతోడ వచ్చు నిలకు బుడుత,
మల్లెపూవు చందమామ పుణ్యమ్ముల ముద్ద నిద్దమైన యద్ద మతఁడు. 1

ఆ. కులమతాదిభేదములఁ గల్మిలేములఁ, గటికిమచ్చరములఁ గ్రాఁగుజగము -
గాలి సోఁకినంత బాలుఁడు మెలమెల్ల, బాటదప్పు మైలపడును జెడును. 2

గీ. లోక మెటులున్నఁ దలిదండ్రు లేకలంకు, లేని నడవడితో శ్రద్ధధాను లగుచు
మనుపవలయును బిడ్డల మధురశీల, ధీ గరిష్ఠత గనునట్లు దిద్దవలయు. 3

సీ. అఁకొన్న పొట్టతో నసురుసురై యొంగి, లాకు నాకఁదొడంగు నసదయందు
ఝంఝూహతికి నొచ్చి చచ్చినపతిమీఁద, వ్రాలి వందురు పేదరాలియందు
గోఁచిప్రాఁతయు లేక యేచినచలికి రా, బాటఁ గొంకరవోవు బడుగునందు
రక్కెసవడగాడ్పురాయిడిలో శిలల్, వ్రక్కలించెడి పేదవానియందుఁ

ఆ. దన్నుఁ జూడవలయుఁ దండ్రి, దురాశలు, వీడవలయు నిక్క మాడవలయు
సుతుఁడు సుతయు విశ్వహిత మెంతు రావేళ, నపుడె నవసమాజ మవతరించు. 4

ఆ. నాకు నగ్గపడిన నైతికబలమెల్ల, నన్ను గన్నవారి నడతపంట
శిరము వంతు వీరిచరణాలపై నన్ను, గాంధిపల్కు మఱవఁగాదు పితలు. 5

గీ. నిత్యసత్యాశ్రయుండు గణేయవినయ, కలితుఁ డౌదార్యమూర్తి నిష్కంపధైర్య
రతుఁడు లంచం బెఱుంగనిప్రగడ కీర్తి, రాశి నాతండ్రి యనె సబర్మతిమహర్షి 6

చ. గృహగతదైవతార్చాన ముగింపక ముట్టదు భోజనంబు, న
న్నహమును సంజప్రొద్దు గుడి కాదట నేగి ముకుందుఁగొల్చు, దు
స్సహముల నౌపవస్తముల సైఁచును వేమఱు మత్సవిత్రి, త
న్మహిమ మపార మించు మతిమన్మణి గాంధి కరంగు నెంతయున్. 7

సీ. మగువ నంటక మద్యమాంసంబు లొల్లక, పొగడికల్ గనె భోగభూమియందు
చేసినదోసముల్ మూసిపెట్టక చాటి, మప్పెఁ బాఠమ్ము సమాజమునకు
జగమిచ్చినట్టి లక్షలకొలందిధనమ్ము, వెచ్చపెట్టెను బ్రజావితతికొఱకు
గుడులలో లేఁడయా గుహలలో లేఁ డని, చూపించె నీశ్వరు సూనృతమున

గీ. లోకమెల్ల నెదుర్కొనుగాక నిలిచి, గెలిచె నసిలేని కసిలేని కలను దీర్చి
బాపుజీ యెట్లుపడసె నీ ప్రాభవమ్ము, కన్నవారల నడవడికతన; గాక. 8

చ. పిన్నలు సాగిసాగి మన పెద్దల గద్దెల నాక్రమించు ప్రా
ద్దున్నది, వారితీర్పులకు నుర్వి సెబోసని శాంతి సౌఖ్య సం
పన్నతమై మెలంగవలె, బాలల బాలురఁ దీర్చినప్పుడే
సన్నిధిసేయు నీశుభము, చల్లపడున్ బ్రజ నేఁచునీరసల్. 9

చ. పలుకుల్ సత్యసరస్వతీ పటుతర ప్రాకార కుడ్యంబులై
తలఁపుల్ విశ్వజనీనహార్ద కరుణా ధారా ప్రసన్నంబులై
నిలువుల్ ధర్మవిధేయ భవ్యపదవీ నిర్దిష్ట నిశ్రేణులై
గెలుపుల్ గూర్చుత బాలబాలికల కగ్రీయమ్ము లెల్లప్పుడున్. 10

28-5-79

---

గీ. మదిరత్రాగను బరసతిన్ గదియ నన్నృత, భాష లాడను దక్కిడిబ్రదుకు నొల్ల
హింస గావింప నని నెగ్గు నెవ్వఁ డతఁడు, ధన్యుఁ డన్నమునీంద్రు గౌతముని మెత్తు.

ఆ. అద్రినుండి దుముక నసిక్రింద మెడఁబెట్ట, శిఖిని జొర మృ గేంద్రుఁ జేర నరుఁడు
జంకనేల మద్యశాల నావేశింప, జంకవలయు నన్నశాక్య మెత్తు.

గీ. వేల్పు నేకాంతమగుచోట వేఁడవలయు, బిచ్చగానికి గుట్టుగాఁ బెట్టుటొప్పు
సిరినిద్రోయక కనలేఁడు నరుఁడు హరిని, పండిపండి వచించె నిప్పలుకు లేసు.

---

# నమశ్శివాయ

చ. ఇతఁడు నమశ్శివాయ జగదీడిత భావపరీత భారతీ
కృతమహనీయ కావ్య సుకవీంద్రనికాయ బహూపచార వి
స్మృతసుఖ సాధుజీవనవిశిష్టత షష్టిశరద్వయస్కుఁడై
నతుఁడయినాఁడు నేఁడు సుజనప్రకరప్రథితన్ సదస్సునన్. 1

చ. కవులకు వర్గభేదములు కక్షలు కయ్యము లెన్నియున్న నా
రవరవ లంట వీతనికి, రమ్మను నెవ్వరినైన నాదృతిన్;
తవుల మనోరథమ్ము సమతాసరణిన్ బయనింప నెంతగా
నవసి తపఃక్రియల్ సలిపినాఁడొ యితండు పురాభవమ్మునన్. 2

చ. పలికినకై సరుండు తనపద్యము సర్వము నొక్కనాఁ డెదన్
వెలయక క్రిందు మీఁదు గనువేళ నితండు పరించి ధారణా
బలము వేలార్చి నివ్వెఱఁగుపాటు ఘటించును గోష్ఠిఁ గెందఱీ
కలిమి గడించినారు? నుతిగన్నవధాని నమశ్శివాయయున్. 3

మ. అసలే చక్కనివాఁ డితండు చిఱున వ్యామోమునం దెల్లప్రా
ద్దు సిరుల్ నింపుటఁ దేనియల్ తొనఁకు సుక్తుల్ వీనిసొమ్మౌట ని
త్య సదాచారపరత్వ మీతనికి సత్యర్థమ్ముగా నుండుటన్
రసలుబ్ధప్రజ లాదరింతు రఖిలాంధ్రక్షోణి నీసజ్జనున్. 4

చ. అఱువదియేండ్లకేమి యితఁ డప్పటి యర్వదియేండ్లమన్గడన్
నిరుపమశాంతిసౌఖ్యముల నిర్భరకీర్తి నెసంగుఁ దెల్గు లీ
గఱువను గాంచి నేర్చెదరు కావ్యకృదర్చన మింద్రకీలభూ
ధరశిఖరాగ్రదుర్గ బహుధా విజయం బిదు నిమ్మనస్వికిన్ 5

31-8-79

---

## వెంకన్నచౌదరి

ఉ. ఉన్నది నీకు నైహికసుఖోన్నతికిన్ దగినంతకల్మి; యీ
యున్నది యెల్లవారి దనునుత్తమసత్యపుగుట్టెఱింగి యా
యున్నది కోరి యీవిదెస కొగ్గినమేటికి నీకు లేనిదే
మున్నది వెంకనా! జగమహో! యనసాగె భవన్మనీషకున్. 1

మ. కలవారందఱు కన్నువిప్పి జగతీకల్యాణ మర్థించినన్
గలుముల్ పంచెడి ధర్మకర్తలగుచున్ గార్పణ్యమున్ ద్రోసినన్
విలయం బెద్దియు రాదు జాతికని మున్ వేమాఱు ఘోషించె నే
యలఘుం డాగురుమౌళిగాంధిని మఱా కార్జింతు వాత్మోన్నతిన్. 2

చ. పదుగురబాగునందె తనబాగు కుదుర్కొనియుంట గన్నవాఁ
డదియిదికాదు జన్న మన నన్యులకున్ దనచేయు మే లటం
చెదను దలంచువాఁడు పరమేశ్వరుఁ డిచ్చినచాతురుల్ సిరుల్
పదవులు సంఘసేవ కిడి పాయని శాంతికి నాటపట్టగున్. 3

ఉ. చెంతకువచ్చి విన్నపముచేసి కవుల్ కడుమెచ్చి దస్సినన్
సుంతయు ముట్టఁజెప్పుటకుఁ జూడనిసాహు లనేకులుండ నీ
వెంతమనస్వివో కవులయింటికిఁ గాన్కలు దెచ్చియిచ్చి భం
గ్యంతరసాధుశీలమున కాస్పదమైతివి దాతృసత్తమా. 4

మ. యతమార్గ ప్రియులన్ మహాత్ముల నహింసారాధనా సూనృత
వ్రతపారీణుల మెచ్చుమాదృశుల నవ్యాజానురాగమ్మునన్
మతిమన్ముఖ్యు లిటుల్ భవాదృశులు సమ్మానింప జాతీయసాం
స్కృతికఖ్యాతి సదాతనంబ యని పొంగెన్ దేశ మ్రబాశిరైౖ 5

21-1-80

---

# గోపాలరెడ్డి

చ. ప్రతిభటగర్వపర్వత విపాటనదక్ష సమీకచాతురీ
ధృత బహుమండ లాంధ్రజగతీభరులై వరణీయశీలురై
వితరణమూర్తులై బుధకవిస్థిరజీవన కారణమ్ములై
కృతిశతకర్తలై నుతివహించిన రెడ్లమహత్త నెన్నెదన్. 1

ఉ. కాలము మాఱి హాలికుఁడుగా మనుచుండిననేమి ధారణీ
పాలకలక్షణంబులను బాయఁడు రెడ్డి; నిజాన్వయప్రభుల్
ప్రోలయవేమరెడ్డి యనపోతమహీపతి, వీరభద్రరా
ణ్మౌళిముఖుల్ ప్రియంపడినమార్గము లేమఱఁ డెంతవిజ్ఞుఁడో! 2

గీ. వాసి కెక్కిన బెజవాడవంగడమున, రాణకెక్కెను పట్టాభిరామరెడ్డి;
యితఁ డుదారగుణమ్ములకెల్ల నెల్ల, యితఁడు మకుటములేని మహీవిభుండు. 3

శా. పల్లెల్ పట్టణముల్ సెబా సనఁగ నీపట్టాభిరామాహ్వయుం
డెల్లన్ ధర్మము లాకళించి తనపల్కే తీర్పుగా నర్థకా
మోల్లాసంబున హద్దుమీఱిన జనవ్యూహంబులన్ దిద్దుచున్
మల్లీమంజుల మంజరీధవళిమన్ మాయించెఁ గీర్తిచ్ఛవిన్. 4

చ. తగవులుతీర్చితీర్చి యలంతం గను నీపెదరెడ్డికొల్వులో
నెగయును భారతీచరణనిష్ఠిత నూపురకింకిణీధ్వనుల్:
జగమునఁ బేరుగన్నకవిసత్తము లుత్తమవైదుషీనిధుల్
సొగసరికైతలన్ వినుచుచో రసచర్చలకున్ గడంగుచో. 5

చ.కవులకుఁ గాన్క లీగి యనఁగా మనరెడ్డికి దొడ్డపండువై
నవనవహర్ష మిచ్చు; నొకనాఁడు మొగమ్మున మొల్కమీసలున్
గవియనిరాయప్రో లితనికట్నములందె వధానవిద్యలోఁ
దగినమెఱుంగు చాటి, కవితానిధిసుబ్బన జంటగా నిలన్ 6

మ. తనగార్హస్థ్యముపంటగాఁ గనియె నీధన్యుండు సాబర్మ
మునిధర్మంబు రవీంద్రభావగతి దుర్మోహోరువల్లీ నిక్ఱం
తనశక్తం బరవిందదర్శనము నంతశ్శుద్ధిమై మెచ్చునం
దనులన్ ముప్వుర శిష్టతుష్టికరకృత్య స్తుత్యచారిత్రులన్ 7

క. ఈ ముప్వురలో నొకఁడె, శ్రీమద్గోపాలరెడ్డి చెలఁగెన్ భరత
క్ష్మామాతృ దాస్యవిదళన, కాముకతన్ సారెసారె కారలఁబడుచున్. 8

మ. కొనియాడందగు రాజకీయపదముల్ కోకొల్లగా నబ్బినన్
దనదెందమ్మును సాహితీసరణికిన్ దత్తమ్ముఁ గావించుటన్
దెనుఁగుంబల్కు వెలంది పెంపునకు నర్థిన్ దయ్యు నిమ్మేటి, యిం
త నెఱామన్గడ నేర్చియున్ మఱవఁ డేనాఁడేని నమ్రత్వమున్ 9

క. ఏరెడ్డిమఱచె వినయ ర, మారమ్యగుణంబు నితఁడు మఱచుటకు? నహం
కారప్రియు లాత్మస్తుతి, పారీణులు గామి రెడ్లు పదయుదురు సిరుల్? 10

ఆ. కులము మతము మఱచి గోపాలరెడ్డి మా, నవత నాశ్రయించినాఁడు గాన
నవత యితనిఁబ్రదుకునన్ నిరంతరముగా, నుజ్జ్వలించు నవఁత యుండ దెపుడు. 11

క. సమతానురక్తి సాహి, త్యము పెట్టినభిక్ష; సకలధరణీస్తుతిపా
త్ర మహాకవి రవిగురుకృప, నమరినభాగ్యంబు రెడ్డి, కని యూహింతున్ 12

గీ. ఉత్తమోత్తమపదముల నున్న రెడ్డి, కహితుఁ డొకఁడైన లేమికి నబ్బఁబడెద
నీసుతోఁ గుందుమహి నుందయించువాని, కింతకంటెను ధన్యత యేమివలయు! 13

ఉ. పావనభావపేటి పితృపాదులపేర నితండు నన్ను సం
భావనచేసె నిద్ధకవిపండిత మండితమౌ సదస్సునన్,

ఈవిభవం బణంకువమెయిన్ గొనువాఁడ, దెనుంగువానికిన్
సేవలొనర్చువాఁడ నని చేతులుమోడ్చు సదస్యకోటికిన్. 14

గీ. శంఖమునఁ బోయఁ దీర్థమై జల మపార, మహిమమున్ గనురీతి సమ్మాన మిది"ఆ
కాదమీ" ముద్ర వడి కడున్ గణుతిగాంచి, నన్నుఁ దనియించె ననెద నానతుఁడ నగుచ

27-1-80

---

ఆ. అతఁడు ముక్తినందు నపరంజి నినుమును, సన్నబువ్వ నాళ్లజావ నలరుఁ
బన్ను నుర్వి నొక్కపగిదిఁ గనంగల, యెఱుక సంతరించి యెతఁడు తనరు

గీ. అంతలిట్టినవాని సైరింతు వెంత, వెఱ్ఱి వీ వనఁగాఁ దత్తవేది యొకఁడు
వానియందును నాయందు వాసుదేవుఁ, డొకఁడ కలఁ డని చిఱుతన వ్వొలయఁ బల్కు.

---

# కాఁకరపర్తి

(ఈ చిరంజీవి తొలుత నుపాధ్యాయవృత్తి నవలంబించెను. పదంపడి భీమా వ్యాపారమునకు మాఱి డెవలప్‌మెంట్ ఆఫీసరై కోటిందాఁటినబేరము నిర్వహించెను. ఈ సందర్భమున నితనికి చీరాలలో కలిగినసమ్మానసదస్సున వెడలిన మేలిపల్కు లివి.)

గీ. ఎన్నినా ళ్లొజ్జగా నున్న నేమిమిగులు, నరునకున్ సుద్దముక్కలు నాల్గు గాక
యీ రహస్యమ్ము గని వేంకటేశ్వరుండు, మంచిపనిచేసె బ్రతుకుభీమాకు వచ్చి. 1

గీ. లాభనష్టము లరయు ధీవైభవమ్ము, వశపడినయింటఁ బుట్టినవాఁడు గానఁ
దెలివిమైఁ "గూసమునఁ జేయి మలఁచుకొనియెఁ", బాలడబ్బాలకర్చు పైఁబడకమున్నె.

గీ. మంచితనముంటఁ దియ్యనిమాట యుంటఁ, బట్టుదల యుంటఁ బ్రతినిధుల్ దిట్ట లగుట
దీటులేనిజయమ్ము సాధించె నితఁడు, కోటి దాఁటినబేర మీనాట నెఱపి. 3

క. ముడిపై ముడివేయఁ డితం, డొడఁగూడిన కల్మి కొంత యొసఁగును వెతలన్ -
సుడివడువారికి, జాతికిఁ గడుమేలు పొసంగఁజేయు కర్జంబులకున్ 4

గీ. ఉన్నతోన్నతపదములు క్రన్నఁ గనుచు, నాయురారోగ్యభాగ్యాదు లందుకొనుచుఁ
బడయుఁ గావుతఁ గాకరపర్తి వంశ, వనవసంతుఁ డీతఁడు శ్రీనివాసుకరుణ 5

మ. యువలోకమ్ము సమాత్తపట్టము నిరుద్యోగార్త మీ భూరిగౌ
రవ మార్జించిన వేంకటేశ్వరుని శూరత్వమ్ము పాటించుచున్
నవతామంజులజీవనమ్ముల మహానందమ్ములన్ దేలుచున్
జివురుల్ సాగు వసంతముంబలె మహీశ్రేయమ్ముసంధించుతన్! 6

ఉ. నీ కణుమాత్రగాఁ జదువు నేర్పినవాఁడసు గాన, నిచ్చలున్
నా కనుకూలమౌ పను లొనర్చుట కీవు శ్రమింతు గాన, నేఁ
డీ కమనీయవైభవము నెంచి కదున్ ముదమందినాఁడ నో
కాఁకరపర్తి! సంతతవికాసములన్ మనుమా శతాబ్దముల్. 7

27-4-80

---

ఆ. చెలికి మేలిసొగసు చేటుదెచ్చును విధి, యిచ్చుఁగాకహౌసు నిల్లువెడలి
వచ్చునప్పు డామె పిచ్చివేసముతోడ, రాక లగ్గు చెనఁటిరావు తగ్గ

గీ. రచ్చలో నొకరుండు వాక్రుచ్చుచుండ, నొరుఁడు నోర్విప్పకుంట నాగరికతాంక:
మౌచితి నెఱింగి వక్త మాటాడవలయు రిత్తగాఁ గాలమును దిగమ్రింగరాదు.

ఆ. పాడిదప్పి నరుఁడు పడసినవిత్తంబు, పేదకిచ్చుఁగాక పెద్దపెద్ద
గుడుల కిచ్చుఁగాక బడులకిచ్చునుగాక కలుషమునకు దవ్వుగాఁడు వాఁడు.

---

## రాజశేఖరము

శా. సీతారాఘవసత్కథల్ శ్రుతిశిరశ్శ్రీసూక్తి సారంబు లు
ద్ధూతాఘంబులు వస్తువై తనర మాధుర్యప్రవాహమ్ము సం
గీతబ్రాహ్మిని వెల్వరించి భువనక్షేమమ్ము చేకూర్చి య
ద్వైతానందము నందుకొన్నఋషికిన్ ద్యాగయ్యకున్ మ్రొక్కెదన్ 1

గీ. భావపురి నేఁడు రసిక ప్రపంచహర్ష ,హేతువై నుతిగన్న సంగీతకళకు
మెఱుఁగుదిద్దిన రాజశేఖరుని మెచ్చి, మెప్పులందెను గోష్ఠి నాశ్లేషితముగ. 2

గీ. చెలఁగి తన రెండుపాలిండ్లు చేఁపె జేనని, భారతీదేవి యీముద్దుబాలకునకు;
పొట్టియయ్యు నీతఁడు పెద్దపొట్టయుంట మస్తుగాఁ బీల్చె నమ్మకమ్మునివయస్సు.

ఉ. శిష్టత సత్యసంధతయు శ్రీరమణీగిరిజాప్రియార్చనా
దృష్టియు ధర్మనిష్ఠయు నతీవవితీర్ణియు నైకసత్కళా
పుష్టియు నేర్చినేర్చి యొకపోఁచకొలందియుఁ ద్రుక్కు నేర్వఁగా
నిష్టుఁడుగాక చాటు నితఁ డిప్పటికిన్ వెలనాటితత్త్వమున్. 4

మ. ఒకసంగీతమునందె మిన్న యని మీ రూహింతు రిమ్మేటి; నే
సుకృతంబో బహుసాహితీ కుశలుఁగా సూచివ్రజస్తోత్రపా
త్రకవిత్వమ్ముల దిట్టఁగాఁ జలిపె; నందంజూచెనా వైదుషీ
నికరంబెల్ల నితండు లోఁగొనుజుఁడీ! నేఁ దర్వదిన్ దాఁటినన్. 5

ఆ. గాంధితలఁపు మెచ్చి కన్యను హరిజను, చేత నిడె, వినో వచించినట్లు
నంజ నిచ్చె నితఁడు నాదారులకు జీవి, తం బనంగ నిది సదస్యులార! 6

ఉ. గాంధియుగమ్మునన్ నుడువఁగా దగువారలు పోవఁబోవ ధీ
సింధువు లిట్టివారు మనసీమలఁ బొల్చెద రందునందు, మో
హాంధముగాని మన్గడకు నాదరమిచ్చెడివారు వీరికిన్
గంధ మలంది వై చెదరు కప్రపుదండల నోలగమ్మునన్. 7

క. ఏదండయు నేభోగము, నాదటసేయండు పరమహంసవిధానన్
సోదరమానవగౌరవ, సాధనకే దయ్యు నితఁడు సంతతదీక్షన్. 8

శా. పాకీవాడకు విద్యనేర్పు నితఁ, డాప్రాంతంబు నంతర్బహి
ర్వ్యాకేంద్రమ్ము నొనర్పఁ జూచు, సిరులం బాటింపఁ డేనాఁడు ని
ర్భీకుండై నిజకృత్యముల్ నెఱపు;, గీర్తింగోరఁ; డీయన్నకున్
బాకీపడ్డది లోక, మీతని కగున్ బ్రహ్మాయురారోగ్యముల్! 9

ఉ. గాయకసార్వభౌముఁ డనఁగా నుతులందిన పాఱుపల్లి కా
వ్యాయముగూర్చి నేర్చితివి ప్రసన్ననిపాట; నిఁకన్ గణాధిరాడ్
గేయముతోడఁ దేనెచిలికింపుము కొల్వున; "శిష్టసత్యనా
రాయణ రాజశేఖర!" జయంబగు నీకు మనీషిమౌళికిన్. 10

21-9-80

---

ఆ. చక్కఁదనమునందు సాఁబాలు కాదు ము, ప్పాలు జవ్వనంపుదాలు దెచ్చు;
తక్కునొక్కపాలు నిక్కపుంజెలువ; మీ, గుట్టు వెల్లడించు జుట్టు నరసి.

జుట్టుకర్త

# కొసరాజు

క. చక్కని చిక్కని పాటలు, పెక్కులు రచియించి తెల్గుబిడ్డమదికిన్
జిక్కిలిగింతల నిడుచున్, జొక్కెడు కొసరాజుకవికి శుభమస్తనెదన్. 1

క. పల్లెపదమ్మున దేశపు, టుల్లము నుడిసొంపు జాతియుం గల దని య
ల్లల్ల నితఁ డెఱిఁగి నేఁ డొక, బల్లిదుఁడై నిల్చె జానపదకవికోటిన్. 2

గీ. దారిదప్పినవారి యుద్ధతి నణంప, దీనజనహిత మధురసందేశ మొసఁగ
నలఁగుఁ గాని రాఘవుఁడు మనస్వి యగుటఁ, బచ్చిసింగారమను జాట నిచ్చపడఁడు.

క. పాటలతో నాఁగక రస, పేటికలౌ కృతులఁ గూర్చి పెద్దల "కాహో"
పాటిల్లఁజేసి కవ్వడి, పాటిక నితఁడొప్పె నంధ్రభాషాజగతిన్. 4

ఆ. ఎన్ని చదురు లున్ననేమి వినమ్రతా, రాశిగాఁ జరించు రాఘవుండు;
ప్రాజ్ఞకోటి కితని ప్రస్నని తిన్నని, బ్రదిమిఁ గన్న విన్నఁ బండ్లుపులియు. 5

గీ. కొండముదినారసింహుడు కొడుకునట్లు, సూచి సాహిత్యమర్మముల్ లోఁచె నితని;
కొజ్జకున్ గీర్తి నొదవించునొఱవు వీని, పాలిదై మేలిదై కవీశాలిఁ దనిపె. 6

క. గురుముచ్చట వచ్చిన మై, మఱచును రాఘవుఁడు బాష్పమంజులుఁ దగుచున్
నెఱిదక్కి కృతఘ్నుగతిం, బఱచి సెడినవారు సిగ్గుపాటున గ్రుంగన్. 7

గీ. సప్తతికి మించి వయసున్నఁ జవ్వనంపు, రవణలకు దవ్వుగాఁడు మా రాఘవుండు;
సజ్జనులపజ్జ కేతేర జర వణంకు, ననుట కీతనిబ్రదు కుదాహరణ మయ్యె. (15-12-80)

గీ. సాగెఁ దొలకరివానలు, వాఁగు లేర్లు, పరువులెత్తెను, నా రడ్డపచ్చ క్రమ్మె,
దంపనాఁగళ్లకెలనఁ గేదారధరణిఁ, బఱఁతు *లూడ్చిరి తుమ్మెదపాట లెగయ. 9

*నారునాటిరి

ఆ. మొక్కనిల్పి పచ్చమూనకుఁ దిరిగెనో, లేదొ తుంగ *యూద లేచెమడిని
కడఁగె రైతు కాళ్లతడి యాఱియాఱక, మున్నె కలుపుదీయ వెన్నువంచి. 10

*ఒక తెగకలుపు

ఆ. *కట్టి చిట్లి దుబ్బు గట్టి కణుపువేసి, చిగురుదగిలి క్రొత్తచెలువుఁ *గుల్కఁ
బొడమె వరిపొలానఁ బోటాకు పోలికా, నీక జయరమాపతాక యనఁగ. 11

*కర్ర్రుపదము, *ప్రకటింపఁగా (స క్రి )

## పశుపతి

చ. పశుపతి సత్కవీంద్రుఁ డని పల్కుట చాలదు చిద్విశిష్టతల్
వశపడినట్టియోగి యని వాకొను టొప్పు, నిహప్రసక్తిలో
విశదమొనర్చు దత్త్వపదవీ బహుమర్మము, లాంతరాంధికా
విశసనకౌశలం బితని వీడ దహా! కల మెట్లుత్రిప్పినన్. 1

క. ఆ పరమహంసకథలన్, శ్రీపశుపతి తేనెలూరఁ జిన్నరినుడికిన్
బ్రాపగు తెన్గునఁ బల్కె దు, రాపం బానేర్మిపెఱుల కని చెప్పఁదగున్. 2

ఆ. పుడమి కెఱుకపడని ప్రోద యితండు, ని, గూఢవృత్తి బ్రదుకఁ గోరునితఁడు;
ఐన నెంతకాల మాఁచు నహస్కరుఁ, బీఁచుపీఁచుమబ్బు లేచి యోఁచి. 3

గీ. దైవసంపద కీతఁ డాస్థాని యగుట, వసురశక్తి వణంకు నీయన్నఁ జూచి;
తనివి పశుపతికిన్ బెన్నిధాన మగుటఁ, గలిమిలేములదెస కేగు తలఁపు రాదు. 4

ఆ. పొలముదున్ని పొట్టపో రణఁగించును, కలముపట్టి దివ్యకవిత వ్రాయు
చలముపూని చిత్తజయ మందుఁ బశుపతి; లాఁతిగాఁ డితండు పోతరాజె. 5

27-3-81

---

## రోశయ్య

ఉ. ఆశలఁ దూల్చు నింద్యముల, నన్వహమున్ గురుధర్మరక్షణా
వేశము దాల్చు సత్యపవీనదవీయసియైనవాణికిన్
గోశముగాఁ దనర్చు బుధగోష్ఠికి వార్చు నెలర్చుఁ గైతకున్
రోశయ; శాంతిసౌఖ్యరుచిరుం డగుఁగాక యితండు నిచ్చలున్! 1

ఆ. తెలుఁగునేర్ప నేమ దిట్టల మనువార, లుడలుచుంద్రు రోశయాఖ్యుఁ గదియఁ
గలఁడె యింగిలీసు కఱపెడియాచార్య, సముదయమున నిట్టిసవ్యసాచి! 2

గీ. మఱపునంబడి కాదు కాః దెఱుక లేక, వ్రాసినాఁడను మును"యశోవంత" మనుచు
దోసమును దీనిఁ దెల్పిన ధీసముద్రుఁ, డితఁడ మేవడిమైఁ దన కేకతమున. 3

ఉ. చిన్నయసూరినామ మునిచెన్ దనపట్టికఁ; జాలుఁజాలు నీ
యెన్నిక తెల్గుమేల్మికొఱ కీతఁ డొనర్చుతపమ్ముఁ జాటఁ; దాఁ
బన్నినకమ్మయున్ వెలఁదిపల్కులకున్ గుదురై రహింప నీ
యన్న పెనంగు; శౌచ మఖిలాశల లాస్యముసల్పు వీనికిన్. 4

చ. తన కొకరీతి యున్నదని తా నొక సంస్కృతి కందదండగా
మనుట యవశ్యకార్యమని మానసవీథిఁ దలంపు మాని నేఁ
దనుచిత మార్గముల్ వలచు నజ్ఞజనావళి నల్వరింత కై
మనవలె రోశయాదులు సమాత్తవివేకు లనేకవర్షముల్! 5

29-9-81

శ్రీ యలవర్తి రోశయ్య, ఎమ్.ఎ., రిటైర్డ్ ప్రిన్సిపాల్, జె కె.సి. కాలేజి - గుంటూరు.

---

## కాళేశ్వరరావు

క. నూతేండ్లనాఁడు పుట్టిన, వారలకే చెల్లె నిప్పువలె జీవింపన్;
పోరాము లెట్టివైనను, సైరించిరి వీరు దేశజననీసేవన్. 1

గీ. వలచి నూనూఁగుమీసాల వయసునందుఁ, గడఁకమై ధరించిన వీరకంకణమ్ము
నయ్యదేవర కాళేశ్వరాభిధుండు, విప్పఁడయ్యె నహో! మేను విడుచుదనుక. 2

ఆ. బానిసమునఁ గ్రుంగు భారతదేశమ్ము, విక్రమించి విశ్వవీథి నిల్చి
శిరము నెత్తఁ జాలుతరుణమ్ము రా నితం, డియ్యకొన్నవెతల కెల్ల కలదె? 3

క. మొగజోదు లిట్టిదిట్టల, తెగువఁగదా కనె సబర్మతీఋషి జయముల్
పగ నణఁచి పగతు నణఁపక, జగదుద్భుతసంగర ప్రసాధకుఁ డగుచున్. 4

ఆ. సేవ కిష్టపడక యీవి నెఱుంగక, రాచపరువు నందఁ జూచువారు
తెలియవలయు నయ్య దేవరచరితంబు, నలయవలయు జాతి కహరహమ్ము. 5

1-1-82

---

# ఉగాది తలఁపులు

ఆ. మావికొమ్మ ననసె మల్లెతీవియ పూచె, కోకిలమ్మ గొంతు కురిసెఁ దేనె
కవిసెఁ బైరగాలి యవునుగాని మదాత్మ, పొంగ దీయుగాదిపొలుపు నెంచి. 1

ఆ. ఒదిఁగియొదిఁగి పేద లో తల్లి పండుగు, ముద్ద యనుచు గారెముక్క యనుచు
గడపగడపముందు గగ్గోలుపడుచుండ, నలరఁజాలఁ నిది మహాస్సటంచు. 2

ఉ. వచ్చె స్వరాజ్యలక్ష్మి, మనవంతలు చింతలు నూఁచముట్టుగా
విచ్చునటంచు భారతసవిత్రికి భావియుగాదు లున్నతిన్
దెచ్చునటంచు హర్షమునఁ దేలితి, మైనను దేశమందు నేఁ
డెచ్చటఁజూచినన్ గొఱంతలే కనిపించెడి నేమిసెప్పెదన్. 3

క. సిరిగలవారికోశములు చిన్నవి పెద్దవియయ్యె సంపదల్
పెరిఁగినవారి కబ్బినవి పెత్తనముల్ నిఱుపేద కెంతయున్
బరువుగమాఱె జీవితము ప్రాణములున్న శవమ్ముకై వడిన్
దిరుగు నతండు నేఁడు నిజదేశనికృష్టదశా పతాకయై. 4

సీ. పగలు రేయి నలంగి పదయుపైసాలతో, నెండి యేఁకరుపొట్ట నిండదయ్యె
పదఁతుకపరువు గాపాడఁజాలినవల్వ కొనఁదగ్గశక్తి చేకూరదయ్యె
తాటాకు పావులాధర పల్క నెండవా, నలతాఁకు చలిసోఁకు తొలఁగదయ్యె
పసిపాపనికి సన్నిపాతవిపత్తి రాఁ, గఱవయ్యె మాత్రకు గవ్వయేని 5

గీ. ముప్పులకు జంకి తెచ్చినయప్పు దీర్ప, నసలుకంటెను వడ్డీ నాల్గంతలయ్యె
బాపురే! పేదవాని కీబదవ లణఁగి, నలుగురన్ దలయెత్తు టేనాఁటి కగునొ! 6

క. మనపెద్దలు గద్దెలకున్, బెనఁగుటతోపాటు పేదపెంపునకును లె
స్స నలంగవలయు సేవా, జనితానందమును మించుసౌఖ్యము కలదే! 7

శా. కే.యల్.రావు దరిద్రతాహతజనక్షేమార్థి సాంకేతిక
శ్రీయోగప్రవిభాసి గాసిపడి తేల్చెన్ మున్నె గంగాసరి
త్తోయస్ఫారఝరిన్ గవేరతనయా తోయంబునం జేర్చినన్
మాయున్ భారతభూజలార్తి యని ధీమంతుల్ బలారే యనన్. 8

ఆ. వేలవేలకోట్లు వెచ్చింపవలయు నీ, జన్నమున కటంచు సచివచయము
జంకరాదు ప్రజలసాయ మువ్వారిగా వచ్చు నిందుఁ గనకవర్ష మనఁగ. 9

క. శ్రమదాన పరాయణులై, క్షమఁగల యువజనులు గురులు ఛాత్రుల దీనన్
జెమరోడ్తురు తగునాయకు, లమరినచోఁ బ్రజలు సైఁతు రలఁతల నగుచున్. 10

ఆ. రాము సద్గుణాభిరాముని జూచి వా, నరులు కదలిఁగట్టినారు మున్ను
గాంధి నాత్మశౌర్యకంధిని గని మొన్న, త్రోలినారు తెల్లదొరల నరులు. 11

చ. నదు లివి సంగమించిన ననంతమహిన్ బహుధాన్యముల్ పదిం
బదిగ ఫలించు, ఆకాలపయిఁ బందును రాజనముల్ క్షుధావ్యథన్
మదిచెడియున్న మానిసులు మంగళమూర్తులుగా రహింతు రీ
సుదినమురాక భారతసుంధరకున్ శనిపోక నాఁదగున్. 12

ఆ. పంటహెచ్చుఁగాక ప్రజ సంతుబరువును, హెచ్చనీయరాదు మెచ్చఁదగిన
త్యాగమిదియ నేఁడు ధరణీజనులకెల్ల, మూల మిదియ దేశములు సుఖింప. 13

గీ. సంపదలు పొంగుకొలఁదిని బ్రుంపవలయు, నరుఁడు తృష్ణను; దనసుఖం బొరుని సుఖము
నంద కల దనుసత్యంబు నరయవలయు, బాపుజీ నేర్పిపోయినపాఠ మిదియె. 14

11-3-82



గీ. వినయమునకు నహింసకు వేర్మిలేదు, నిల దహంకృతి నమ్రత నిలుచుచోట
నిలుచునే నది ధూర్తవినీతి, మొదవు, మోముపులి, బూదిలోముచ్చుముడిగినగ్ని

క. నరుఁ దక్కువలేనిసిరిన్, వరించి చెడురీతి నతఁ దనావశ్యకధీ
పరిణతి నాసించియుఁ జెడు, దురాశ యెదియైన నరు నధోగతి కీడ్చున్.



# రంగా

నిండెను రంగా కెనుబది, రెం డేఁడులు జీవితమున;
నేఁడుసైత మీతనిలో, నెఱజవ్వన మున్నదేమి?
తిండి లేదు నిదుర లేదు, దేశసేవలో నితనికి
ఎట్లువచ్చు నింతపుష్టి?, యెట్లేర్పడు నింతతుష్టి?
కల్ల లేని కవుదు లేని, గద్దెలపై మమత లేని
తత్త్వముతో నుద్ది లేని, సత్త్వము రంగా గడించె. 1

ఇతఁ డార్తసమాజములో, నీక్షించు రహీము, రాము
దీనావనదీక్ష యితని-, ధీ మెచ్చిన దైవభక్తి 2

భక్తున కొకముక్తి గాక, ప్రార్థనీయ మేది కలదు
పదవులు సంపదలు వలచి, పతితుఁడు కాఁ డిమ్మనీషి. 3

గతి దప్పిన లోకమునకు, శ్రుతి గలియని సంఘమునకు
నీతి నేర్ప బహుకాలము, నిల్చుఁగాక రంగాజీ. 4

7-10-82

# దీపావళి

వచ్చినది వచ్చినది దీపా, వళిమహా స్సని యెట్లుపొంగెద
చచ్చిచావని బక్కబ్రతుకులు, సకలమహీ నుండన్. 1

కడుపుఁజిచ్చున కోర్వఁజాలక, కన్నుమూసిన తల్లిపైఁబడి
తొమ్మనమలెడి వెఱ్ఱిపాపల, రోదనము వినుచున్ - ఎట్లుపొంగెద. 2

క్రొత్త పాఁతల సందునం బడి, కూలిచిక్కక ఋణముపుట్టక
అస్సురుస్సురు మనెడి కార్మికు, నలమటన్ గనుచున్ - ఎట్లుపొంగెద. 3

నరకుఁ డేమో చేసినాఁ డని, కొఱుకనేటికిఁ బండ్లు పటపట
నేఁడు పదఁతిని బట్టి పతిచెడు, వాఁ డసుర కాఁడా? 4

మతము వేఱని రాజనైతిక, మార్గములు వర్గములు వేఱని
ప్రజలఁ బలిగొనునరుల నరకుని, బాంధవులు గారా? 5

ప్రళయహేతువులైన యాటం బాంబులను సృష్టించి మిడిసెడి
కట్టిఁడులు నరకునకు ననుఁగుం, జుట్టములు కారా? 6

ఎపుదు త న్నొరునందుఁ జూచెడి, యెఱుక మానిసి కగ్గపడునో
అపుదు పొంగెద నిక్కమగు దీ, పావళిని గనుచున్. 7

ఎపుదు కామాద్యసురసంపద, లిచ్చగింపక నిల్తురో ప్రజ;
లపుదు పొంగెద నిక్కమగు దీ, పావళిని గనుచున్. 8

ఎపుదు సంతృప్తిని స్వతంత్రత, నెల్లపేదయు ననుభవించునొ
అపుదు పొంగెద నిక్కమగు స్వా, తంత్ర్యమును గనుచున్. 9

2-11-82

---

క. మును పెద్దలు జన్మమ్మునఁ, దినవచ్చుం బొలసు ననుడు దినయాగములన్
గనుఁగొని రయ్యలు కొందఱు, చన విచ్చినఁ జాలు నరుఁడు జఱ్ఱున జాఱున్.

గీ. మతికి రేపటిరొట్టె సంగతిని దేశ, నరుఁడ! యేనాఁటి కానాఁడు నలఁగి తినుము
వలదువలదు పరిగ్రహవాంఛ యన్న, ఏసునుడి విన్నప్రజ కంట దీసుమంట.

---

## భావేస్మృతి

ఎన్నఁడో పోయెను మహాత్ముఁడు, నిన్న భావేఋషియుఁ బోయెను
కాఱుమబ్బులు క్రమ్ముకొన్నవి, భారతాభ్రమునన్. 1

కత్తిపట్టని నెత్తురోద్వని, క్రాంతితో నుతిగన్నగాంధికిఁ
దగినశిష్యుఁడుగా వినోబా, జగము నలరించెన్. 2

నరునిమదిలో గుఱ్ఱుపెట్టెడి, కరుణ మేల్కొనె నితనిపల్కున;
పరుగులిడె భూదానగంగా, ఝరులు నల్గడలన్. 3

ప్రథమదాత య్యెవండు? పోచం, పల్లివాఁడే తెలుఁగువాఁడే
రామచంద్రారెడ్డి యితఁ డప, రాజితయశుండు. 4

వాఁడు నాకంటెను దరిద్రుఁడు, వానికిన్ బొల మిండు ముం దని
చెప్పిన మహాభూనవుని సృష్టించెను వినోబా. 5

నీవు చక్కనిదాన వబలా! నేను దుష్టుఁడ నన్నుఁ గదియకు
మిదె జొహా రనుమేలిమానిసి, నితఁడు సృష్టించెన్. 6

సఖ్య ముడిగి మరుత్సుత జరా, సంధులై చెడు నన్నదమ్ములు
రామలక్ష్మణు లైరి యీయతి, రాజుహితవాణిన్. 7

ఉన్నకుంటలు నాల్గు పేదకు, నొసఁగితి నిఁకన్ గూలి కేగెద
నిదిగొపత్రం బనుదయాఖని, నితఁడు మన కిచ్చెన్. 8

వేడ్కతో నర్పించుదాతలు, వినతిమైఁ గైకొనుదరిద్రులు
చట్టములతో రారు యతిస, ద్రూట్టునుదుల వినా 9

బొజ్జపెంచినసాహు లందఱు, పూనవలె నపరిగ్రహవ్రత
మిది వినోబాయతివరేణ్యున, కిష్టమగు చేఁత. 10

గోవుకుత్తుక గోయుచెన్నఁటి, గుండెలో నెన రెపుడు పైకొను
నపుడు భావేగురుఁడు శాంతికి, నాలవాల మగున్. 11

ఆత్మవిచ్చివిచ్చి మల్పాల్పమగు మేన, నిముడలేక కవిసె నెల్లదెసల;
లేదు మనకు నిఁకనులేదు భావేయతి, ప్రభువుతనువు పాంచభౌతికమ్ము. 12

యోగిభాస్కరుం డయో! క్రుంకినాఁ డని, కుందరాదు నరుఁడు కందరాదు;
ఇతనిదీప్తి నిల్వ నేను లేనా యని, నిలిచి యెల్లవాఁడు నెగ్గవలయు. 13

మూఁడునాల్గేఁడులా పదుమూఁడుసమలు, ధాత్రి జయపెట్టఁగాఁ బదయాత్ర సల్పి
బాపుజీశిష్యుఁ డిమ్మహా పండితుండు, చాటె మనకు వేయేండ్లకుఁ జాలునీతి. 14

తత్త్వవిద్యకు విజ్ఞానతంత్రమునకు, సఖ్య. మేర్పడవలయు విశ్వము సుఖింప;
బుద్ధికిని మనస్సునకును బొసఁగుపాటు, లేనిచో నుర్విచెడు నన్నజ్ఞాని యితఁడు. 15

ఎల్లమతముల సారంబు నెఱుఁగు నితఁడు, సర్వధర్మంబులను మెచ్చుసాధు వితఁడు
సకలభాషలు విద్యలు చక్క నేర్చి, వాణిమగరూపుగా నుతుల్ వడసె నితఁడు 16

వేదముల నరణ్యవీథులఁ దోఁచిన, ఋషినిగంటి మీవరిష్ఠునందు:
అజర మమర మమల మవికార మగు పెను, వెల్గుగా కితండు వేఱు కాఁడు. 17

22-11-82

# సంక్రాంతి

క్రొత్తక్రొత్త పంటలతోఁ, గుడియెదమల సందడితోఁ
గదలినసంక్రాంతిని గని, కమ్మతీఁడు పడసెఁ దృప్తి. 1

సంజలు పుంజలు ఫలించి, నవిలే యని యితఁ డబ్బుట
యొగ్గుకాదు గాని వీని, యెదకూడ ఫలింపవలయు. 2

పొంగరాదు కలిమిం గని, క్రుంగరాదు లేమిం గని
సమతనేర్చి యోర్చి యోగ, శక్తి నితం దలరవలయు. 3

ఆర్తులదెసఁ గరఁగవలయు, నహితుల మన్నింపవలయు
సడిసన్న వివేకముతో, శాంతి సుఖము నందవలయు. 4

ధర్మమునకు హానిరాని, దారిని బయనించువాని
కాపద లేప్రొద్దు కలుగ, వనుసత్యము నెఱుఁగవలయు. 5

పాలముపంట బుద్ధిపంట, పొంపిరివోయెడి నేలకు
దిగివత్తురు దేవత లని, తెలిసికొనన్ వలయు నితఁడు. 6

8-1-83

---

# యుగాదిమాట

గారెలతో బూరెలతో, సొరుగుల్కు వలువలతో
నుప్పొంగెడి సోదరులకు, యుగాది నొకచిన్నమాట 1

చూపులేని ముదిబికారి, పాపతోడ వచ్చి నిల్చి
అమ్మా! "పండగ"బు వ్వని, అఱచుట మీ రివ్వన్నారా? 2

ఎంగిళ్లకుఁ బగలు రేయి, యెదురుచూచు కటికిపేద
లెందఱు మన కున్నా రని, యెపుడే ననుకొన్నారా? 3

పేదవాని కడుపుమంట, పెరిఁగినచో జగ మాఁగదు
ఏడుసముద్రాలు పొంగి, యే కార్చవ మైతీరును. 4

వీటికి నొకబాపూజీ, పేటcకు నొకభావేఋషి
పుట్టవలయు లోభాదులు, గిట్టవలయు వేవేగను. 5

రాచతికములో సత్యము, శౌచము నర్తింపవలయు
తమ్ములార! లోకము మన, దారి చూచి పొంగవలయు. 30-3-83 6

---

# శ్రీశ్రీ

క. విశ్రాంతి నెఱుంగక దీ, నశ్రామికలోక వికసనప్రదకవితా
విశ్రుతుcడైన మహాకవి, శ్రీశ్రీ కనుమూయ జగ మచేతన మాయెన్. 1

క. ధృతి యున్నది నిర్భరసా, హితి యున్నది రచన కసువు లీcగల శిల్పో
న్నతి యున్నది శ్రీశ్రీ; కీ, ప్రతిభోద్ధతి నితనివాకు బాcకై వెడలెన్ 2

క. ఇతc డనిదంపూర్వం బగు, గతిc గవితన్ నడిపి నిర్వికంప యశోభ్రా
జితుc డయ్యె; నితని కెనయగు, కృతికర్తలు లేరు, రారు రేపైన నిcకన్. 3

క. ప్రజ కేమి తెలియు మూర్ఖ, వ్రజ మది; యనుకవిశిరస్సు వంగcగ శ్రీశ్రీ
నిజ మరసి ప్రజాహృదయ, ధ్వజమ్ముగా నెత్తె నుగ్రధాటీకవితన్. 4

క. "నాయుగ మిది" యని ఢంకా, వాయించి వచింప విప్లవకవిచ్ఛటయం
దీయన్న కె కల దర్హత;, "జే"యందు నెదంద విచ్చి శ్రీశ్రీకవికిన్. 5

2-7-83

---

# రామబ్రహ్మము

మ. సహజంబుల్ ధృతి శాంతి సత్య శుచితా సత్వాదు లెవ్వాని, క
న్వహ మెవ్వాcడు పరోపకారఘటనా వాల్లభ్యమున్ సైcచు, లో
కహితాచారులనెయ్య మెవ్వని ననర్ఘ శ్రీ బలెన్ దేర్చు, న
మ్మహనీయాశయు గుత్తికొండకుల రామబ్రహ్మమున్ మెచ్చెదన్. 1

గీ. గాంధియుగమున మోపట్టు కన్నకీర్తి, జగమెఱుంగు మెఱుంగు; శ్రీ చంద్రమౌళి
తులసిబా యితc డితరయోధులును దీని కందగా నిల్వc బందువుల్ పందు నిట్లు.

సారతరప్రవర్తనులు జాతివికాసపరాయణాత్ము లూ
రూరc దెలుంగునాట జయహో! జయహో! యనుచున్ సబర్మతీ
తీరమహర్షి సేనల నతీవతీర్థికి నుత్సహించుచున్
జేరెదునాcడు దాస్యము నిసీ!, యనునాcడు త్రివర్ణ కేతన
స్ఫారమయూఖముల్ నలుదెసన్ విరియన్ రణవీధి కేగి దు
ర్వారపరాక్రమక్రమ విరాజితుcడై ఋతభారతీ కృపా
భారవినమ్రుcడై పరనృపాలక గర్వనిరాపక క్రియా
పారగుcడై ప్రజావళి సెబాసన నిల్చెను గుత్తికొండ; క
ర్పూర పటీర హీర సురభూరుహ శీతనగామరాపగా
శారదకౌముదీ రజతశైల మరాళ ఫణీశ కాంతులన్
మీఱు యశమ్ము నేలుకొను మేటిగనిల్చెను గుత్తికొండ; యీ
వీరుcడు తల్లిదీనదశ వీడెను లే యని గుఱ్ఱుపెట్టినా
తోరమువిప్పెనా వెతలcదోcగుజనమ్ముల యార్తనాద మీ
ధారుణి లేనినాcడె, జనతావదనమ్ము వికాసరేఖలన్
సౌరు వెలార్చునాcడె, ప్రతిసద్మమునందు సుఖంబు శాంతియున్
మూరిననాcడె యీసుకృతమూర్తి విడున్ దనకంకణమ్ము; నీ
పేరిమి వచ్చుదాcక ప్రజపెంపునకే చెమరోడ్చెదన్ వయో
భారము లెక్కసేయ నని భావెగురుండు విధించుసేవలో
నోరిమిచూపుచున్ జిఋతయుంబలె సాగుచు నిత్యనుత్య గం
భీరత చాటుచున్ సిరులుపెంచుట గద్దెవరించు టెన్నcడుం
గోరక దారిదప్పుప్రజకున్ గతిcజూపుచు నాత్మజీవితం
బూరికిc బట్టణమ్మునకు నొజ్జగc జేయును గుత్తికొండ; యీ
భూరివివేకసంపదలc బొంపిరివోవు నుదాత్తశీలు తీ
రారసి చంద్రమౌళిముఖు లార్జనశోభితు లీ మహాసభం
గూరిచి యిమ్మనస్విగుణకోటిని మెచ్చి మనమ్ములిచ్చి స
త్కారముసేఁత గాంచి కవితాసతి పొంగి కరంగి నాదెసన్
గారుణికత్వముం బఱపెc గాన జయించితి, రిత్తగా సభన్
జేరనివాcడనై తి; సుఖసేవధిగా మనగుత్తికొండ నూ
ఱూఱుశరత్తు లుండు నని యాశిషముల్ పచరించి యీసభా
స్తారులకున్ జొహారువులు సల్పి యిcకన్ విరమింతు నీకృతిన్. 2

15-7-83

# అగస్త్యుపదేశ

క. అగస్త్యుపదే శనఁగా, నాగుండియ నెగసె రణగుణధ్వని, మాతృ
క్షాగౌరవ సంపాదక, యోగులు యోద్ధలు వెలింగి రుల్లమునందున్. 1

ఉ. ముందల నమ్మహారధ సమూహమునన్ నిలచెన్ నిసర్గజా
స్పందపరాక్రమక్రమవిశారదుఁ డుద్ధతరాగవైర గ
ర్వాంధతమోవిదారణచ ణాత్మవిభావిభవుండు హార్దని
ష్యందివచోభిరాముఁడు మహాత్ముఁడు కన్నుల కింపు గొల్పుచున్. 2

శా. ముద్రల్ కోట్లకొలంది వెచ్చపడినన్ ముంగైమురామున్న సం
విద్రాజుల్ సరకార్లు విశ్వపరిషద్వీథుల్ ప్రఘోషించినన్
నిద్రంబాయని పల్లెటూళ్ల కెవఁ డున్మేషమ్ము సంధించె నా
భద్రాకారు సబర్మతీఋషి నెదన్ బ్రార్థింతు నీప్రొద్దునన్. 3

చ. అతఁ డుపవాసదీక్ష గొనినంతన నగ్రహ సాబ్ధి సోర్వీభృత్
సతరు సజంతువౌ జగమ్ము సర్వము తల్లడ సెందె; శేముషీ
చతురుఁడు మార్గనాల్డు వివశస్థితినంది మహాత్మ! నీ కివే
నతు లనియెన్, సవర్ణుల సనాతనవాదుల కొమ్ము కీడ్వడెన్. 4

చ. అతని చెల్లెఁబో శతసహస్రశరత్తులనుండి భారతీ
యత కొకమచ్చగా నెదిగినట్టి పిసాళిపిశాచి నంటరా
నితనము నుక్కడంప, మహనీయసదస్సుల దేవళమ్ములన్
పతితజనాళికిన్ జొరవ బంగరుపువ్వులపూజ గూర్పగఁన్. 5

చ. అతఁ డుపదేశమిచ్చెఁ గ్రతువన్న జగద్ధితకార్య మంచు, సత్
క్రతువన నూలుదీఁతయని; కర్షము లిట్టివి మాని తిండి కా
యితపడువాఁడు దోఁచి గడియించినయన్నము తిన్నవాఁడగున్
బతితుఁడగున్ జుఁడీ! యనుచు! భారతభావుక మాసచేయుచున్ 6

చ. అతఁడు స్వతంత్రభారతమహస్సునకున్ దమభోగభాగ్యముల్
పితికినత్యాగమూర్తులకుఁ బెద్దగ నుండియు గద్దెకెక్కి యీ
క్షితి నలరింపవే యని విశిష్టులు వేఁడఁగ నార్తసేవ నా
వ్రతమని నౌఖలీరుధిరవాహిను లాఁపఁ జనెన్ వినమ్రుఁడై. 7

ఉ. ఇంతటిగాంధి నేఁడు మన కెంతయుదవ్వయిపోయె వానిసి
ద్ధాంతము విస్మరించితి మయారె! నిరంతరలాభలోభ దు
ర్ధాంతజవమ్ము నోర్వఁగలదార్ఢ్యము కోల్పడి సర్వదా మన
శ్శాంతివిహీనతన్ బ్రదుకసాగితి మీఁగితిమెల్లతప్పులన్. 8

క. లంచమునిచ్చినఁ గాకియు, నంచయగున్ నేఁడు మనకు; నధికారము నా
ర్జించుట కేవెరవైన రు, చించు నహో! లేవు మంచిపెద్దలచర్చల్. 9

ఉ. ముం దపరిగ్రహమ్మునకు మూర్ధమువంచుట, దీనమానవా
నందముకోరి పెద్దయుఁ బెనంగుట, పట్టి పెనంగువారిపై
దుందుడుకుల్ దుమారములు త్రోయకయుండుట, సత్యనమ్రతా
మందిరమై నుతుల్ పదయుమన్గడ గంటయు నేఁటికృత్యముల్. 10

క. ఎవరెట్లున్నను శుచితా, ప్రవణులు యువలైన నవ్యభవ్యాశయవై
భవు లగుచు నీపతాకో, త్సవమును సాగింత్రుగాక! జాతీయమ్మున్. 11

20-7-83

## ముగియిక

ఆ. తుమ్మలాన్వయుండు కొమ్మనకొమరు పా, టించుబాసకై తపించునతఁడు
తగ రచించె నీ "కదంబకైత" మనస్వి, యమ్ములయ్యకీర్తి కంద గాఁగ. 1

ఆ. ఎంతముదుకఁ డైననేమి సీతారామ, మూర్తి యితఁడు చేతయా ర్తి లేమి
భవ్యకవితపట్లఁ బటుతరావేశమ్ము, కలిమి నీ కబందకైత గూర్చె. 2

క. చెంచమ నారయ లితనిన్, గాంచిరి; వెలనాట నలరు కావూరను జ
న్మించెన్ బెరిఁగె నితండు; వ, సించును నేఁ దప్పికట్లఁ జెలికాం డ్రలరన్. 3

గీ. ఇచట నితఁ డొజ్జగాఁ బదియేఁడు లుండి, విడుమరం గని శిష్యుల విడువలేక
పండితుల బంధువుల నెడఁ బాయలేక, యనఘకవితాకలాస్రష్ట యగుచు నిలుచు. 4

5-9-1983

## అర్థములు

ననయు = వికసించు
విఱివి = సెంపు
లావనము = కోఁత
కౌముది = ఉత్సవము
వాల్ సిడములు = ఎత్తరిజెండాలు
వేంచేసి = కూర్చుండి
కైసేయు = పూజించు
ఉద్దించు = పోలు
మడుఁగు = శుద్ధము
నవనము = పొగడ్త
ప్రగేయము = వశ్యము
భీ = భయము
దూసి = పరుగెత్తి
కడివోని = రిత్తగాని
మెఱవడి = గౌరవము
వాపొందు = భాషామైత్రి
చొక్కపుమన్గడ = స్వచ్ఛజీవితము
కట్టలంతలు = మిక్కిలిశ్రమలు
లంబి = కుటుంబము
సాముదయ్యము = సగము దేవుఁడు
నిలువు = బ్రదుకు
అప్పటి = మఱియు
ఆయున్నది = అసత్పదార్థము, బ్రహ్మము
కారణ్యము = లోభము
ఈఁగి = ఇచ్చుట
నవఁత = కృశించుట
జాతి = స్వభావోక్తి
లోఁచె = వశపఱిచె
మేవడి = నమ్రత
అల్వరింత = సవరింత
ననసె = చిగిరించె
నిలదు = నిలువదు
సమలు = ఏండ్లు
కమ్మతీఁడు = సేద్యగాఁడు
ముంగైమురాము = ముంజేతికంకణము
చేతయార్తి = మనోవ్యధ (చేతన్ ఆర్తి)

# విషయసూచిక

# మొగమాట

తెనుఁగు వారి కేతరమువారి కైనను పరనీయమగు మహాత్మునిచరిత్రను సరళమైన భాషలో భిన్నమైనఛందస్సులో వ్రాయుట లెస్స యని తలంచి యీకృతిని సంతరించితిని.

ఛందోనియమములు, బాసకట్టడలు, నా తెనుఁగువలపు హేతువుగా ఇందు కఠిన పదములు కొన్ని చేరినను వానియర్థముల నొకపట్టికలో చూపితిని. మఱియు నిది 'గాంధిగాన' మగుటచే రాగతాళముల కనుకూలించునట్లు దీనిని కూర్చితిని. ముత్యాలసరాలు, నవాక్కరలు, మంజరులు - ఇందుఁ గలవు. ఇవి పాటకుఁ దగినబాటలో నడుచును.

'నవాక్కర' అనునది మదుపజ్ఞము. ఇంద్రగణము లైదు, తరువాత నొకసూర్య గణము దీన నుండును. ఐదవగణముమొదట యతియుండును. ప్రాసనియమము కలదు.

అసహాయోద్యమము, సహాయనిరాకరణము - అనువానికి రాజకీయముగా వచ్చినరూఢిని పాటించితిని. ఇం దొకచో 'దుండగులు' అనుమాట కలదు. దీనిని బల్లిదాదులలో చేర్చితిని. ప్రల్లదుఁడు, ప్రల్లదీఁడు - అను రూపద్వయము ననుసరించి దుండగుఁడు, దుండగీఁడు - ఆదరణీయములని నిశ్చయించితిని.

తత్సమమగు 'రాశి' బహువచనమున 'రాశులు' కావలెను. ఐనచో పలుకుబడి కనుకూలము గాదు. కాన దీనిని 'రాసులు'గా (దురితరాసులు) వ్రాసితిని. విద్వన్మణులు వావిలికొలనువారును ఈ మార్గము నంగీకరించిరి.

నా యెఱుంగమిచే నొదవినతప్పులు గాక పంచాశీత (85వ) వత్సరమును మోయుచున్న వయసునం బల్కుటచేత నీకైతలో కొన్ని పొరపాట్లును ఉండును. పెద్దలు వీనిని మన్నింతురు గాక!

ఇట్లు,

తెనుఁగు లెంక

# అంకితము

క. ఈ కైత 'గాంధిగానము', నీ కంకిత మయ్యె మానినీలోక యశః
శ్రీ కారణగుణతృష్య, న్నైకపుర గ్రామజనచయా! అనసూయా! 1

ఉ. తొల్లిటిపాప మేచి రుజతోడఁ గడున్ దురపిల్లు నన్ను నాఁ
గళ్ల గురుప్రసాదు బుధగణ్యుఁ డుదారుఁడు తెచ్చి, వెజ్జు మీ
యల్లుఁడు వేంకటేశ్వరునియండకుఁ జేర్చిన * నాఁడు నీవు మా
చెల్లెలు పోలికన్ గనుటచిత్తమునన్ దిలకింతు నిచ్చలున్ 2

ఉ. నాసతి నీకు బొట్టిడిననాఁడనురాగరసాబ్ధి వైన నీ
వాసతిమోమునన్ దిలకమద్దుట హేతువుగా మదీయ రుక్
త్రాస మడంగె నంచు శతధామతి నమ్మెద నీవు దుర్గ క
బ్జాసనురాణి కద్రిధరునంగనకున్ బ్రతిభూత్వ మందుటన్ 3

గీ. పేరు కొంద ఱకున్ నేతిబీఱ కాఁగఁ, గొందఱకు రసాలం బయి కూర్చు యశము;
లేశమును నీకు నీరస లేమిఁజేసి, సోదరీ! భవదాఖ్య సంస్తుత్య మయ్యె 4

ఉ. అత్రియ నీవిభుండు, జగదభ్యుదయంబు వరించి యుత్తమ
చ్ఛాత్రుల సంతరింపఁగల * సద్గురుపీరము పార్థువీటికిన్
మాత్రవనీగళస్థ మణిమంజులమాలకుఁ జేర్పఁగాఁ బగల్
రాత్రియు విస్మరించి ఋషిరాజగుటన్ మహిళామచర్చికా ! 5

---

* 1979 జనవరి

* ఆంధ్ర లొయోలాకళాశాల విజయవాడలో నెలకొనుటకు

చ. రుసిపని యింద్రియార్థములరోయుట, తత్త్వరహస్యవేత్తగా
మసలుట గాక సేవదెసమక్కువ చూపుట, నైహికార్థముల్
వసపడునట్లు లోకమునవారికి దయ్యుట, పామరప్రజన్
బసరపుబాటనుండి నరపద్యకుఁ జేర్పఁగ నారటింతయున్ 6

ఉ. పావన కాట్రగడ్డకులభాస్కరుఁ డీ రఘురామశౌరి మ
జ్జీవనరీతికో కవితచెల్వునకో యటుగాక రెంటికో
తా వికసించి నన్ నెనరుతావుల నిచ్చలు ముంచితేల్చు; నీ
బావకు, నీకు లెస్సఋణపడ్డది నా కలమున్ మదాత్మయున్ 7

ఉ. ఈవు సమస్తభాగ్యములకిమ్మగు నైహికయాత్ర మాని ధ
ర్మావనసుప్రసిద్ధ వనితావళిచెంతకుఁ * జేరుకనొన్న నాఁ
దే వెడలించినాఁడ భవదీద్యచరిత్రము తోఁచినట్లు సం
భావనచేసి నాల్గయిదుపద్యములన్ స్మృతికైతగా నిటుల్ 8

చ. "కుసుమ సమృద్ధితోఁ, బసపుగుంకుముజల్లుల వెల్గువెల్లితో,
నొసపరిబందుగుల్ పరపునూర్పులవెచ్చనతో, విచారముల్
ముసరనిమోముతో సుకృతమూర్తులు నా నుతిగన్నవారికిన్
వసపడు దివ్యలోకమున వాలితివా మము వీడి సోదరీ! 9

ఉ. రాముని గొల్చినట్లు రఘురాముని గొల్చి నితాంతగౌరవ
శ్రీమహనీయవై వినయసేవధివై కరుణావిధేయవై
ధీమ దపత్యసంపద నుదీరితవై విజితాత్మవై సతీ
స్తోమలలామ వైతి వనసూయ ! నినుం గొనియాట శక్యమే! 10

---

* 21-11-1982

గీ. శ్రుతులు గోవులు సూనృతవ్రతులు దాన, రతులు నీవంటి సత్ పతివ్రతలు గాక
యెవ్వరు మహీభరంబు సహింపనేర్తు ?, రెవ్వ రీ కలికలుచ మాయింపఁగలరు ? 11

ఉ. నీపతి రామభక్తిగణనీయుఁడు శ్రీరఘురాముఁ డాంధ్రసే
వా పరతంత్రచిత్తుఁడు భవదృశ మాశశిభాస్కరమ్ముగా
నీపుడమిన్ దనర్చుపని కీకొని చేకొని రామగాథ పు
ణ్యాపణ మందచందముల కద్దముగా వెలయించె మానినీ! 12

ఉ. రామునివంటివారు కలరా నరు లన్యు లశేష సద్గుణ
స్థేమము నాఁచికొన్న ప్రభుశేఖరు నీతని వేల్పుఁగా బుధ
గ్రామము నమ్మి కొల్చుఁగద ! కల్మియు ముల్కియుఁ బల్కునున్ రఘు
స్వామికి నొక్కఁడే యనినసైఁపనివా రిల నుండరేకదా! 13

ఉ. దిక్కు దివాసి లేని పెడదీవిని దుర్విధి కోడి నిల్పినన్
రక్కసరక్కసుల్ దురితరాసులు కత్తికటారి దూసినన్
ధిక్కృతశంకయై నిజసతీత్వమహత్త్వము గాచుకొన్న సీ
తక్కచరిత్ర రామకథకాంతరకాంతికదా! యవీయసీ! 14

---

* శ్రీరఘురామయ్యగారు తమధర్మపత్ని సంస్మరణార్థము శ్రీవెలమాటి లక్ష్మీనరసయ్యగా రనువదించిన రైట్ఆనరబుల్ శ్రీనివాసశాస్త్రిగారి "రామాయణ - ఉపన్యాసములు" తొలి సంపుటము - రెండవ కూర్పు వెలువడుట కగు ఖర్చు భరించిరి.



'గాంధిగానము' కృతిస్వీకర్త - శ్రీమతి కొత్రగడ్డ అనసూయమ్మ

సీ. ఎది సుఖమ్ములయందు నిమ్ముదప్పులయందు
నద్వైతపరిపాటి నవధరించు
ఎది యెల్లదశలలో నెడపడ కితరేత
రస్వాంతములకు నూఱట ఘటించు
ఎది వార్ధకస్థితినేని హార్దమ్మున
కావంతకొఱఁత డాయమికిఁ బెనఁగు
ఎది మెలమెల్ల జంకుదొలంగ, సిగ్గుజా
ఱఁగ నారఁబండినరక్తి నలరు

గీ. అదికదా జంటతన మన, నదికదా గ
ణేయదాంపత్య మన; దీనినిలుపు, పొలుపు
నభిలషింతురు సడిసన్న యాలుమగలు
మప్పెదరు లోకమునకు ధర్మంపుగుట్టు" 15

ఉ. ఈ పనికేమిలే యని యహింసన సూనృత రోచిరీద్యమున్
బాపుచరిత్రమున్ సుగుణభద్రకు నీకు నుపాయనమ్ముఁగా
నోపినయట్లు కూర్చుటకునొగ్గితి, శంకల దవ్వుదవ్వుగాఁ
జోపితి, * నందితిన్గలము, సోదరి! * నేఁటికి స్వస్తిపల్కితిన్ 16

* 5-4-1986 * 22-9-1986

# గాంధి గానము

ముత్యాల సరాలు

శ్రీరమాధవు నెంచి పుణ్యా, గార మనఁదగు గాంధి చరితము
సౌరుగుల్క వచించెదను నీ, పేర ననసూయా ! 1

రామభక్తుఁడు కాట్రగడ రఘు, రాముసతివై రాణకెక్కిన
నీమహత్తకు గుర్తుగా నిది, నెగడు ననసూయా ! 2

అన్నఁగా నన్నాదరించిన, నిన్ను సాహిత్యమున నిల్పఁగఁ1
బన్నినట్టికవిత్వ మిది గుణ, భద్ర ! యనసూయా ! 3

## జన్మాదికము

వినుము ఘూర్జరదేశమున నుతి, గనిన "పుత్తలిబాయి"కిన్ నయ
ఖని కరంచందునకు నొదవెను, గాంధి యనసూయా ! (2-10-1869) 4

తల్లిదండ్రులు కోరి "మోహన, దా" సనెడిపే రిడిన నితనికి
నిల్లుపేరే పేరుగా మహిఁ, జెల్లె ననసూయా ! 5

కన్నవారలనడత నాణెము, పిన్నవారికి నబ్బుఁ గావునఁ
జిన్ననాఁడే గాంధి ప్రజకు రు, చించె ననసూయా ! 6

అమ్మ నయ్యను మోయుశ్రవణుని, బొమ్మఁ జూచిననాఁడు గాంధి మ
నమ్మునన్ బితృభక్తి నెలకొని, ననసె ననసూయా ! 7

కరఁగె గాంధి త్రిశంకుసుతుకథఁ, గన్నయంతనె వెన్నకైవడి
బిరబిరన్ సత్యవ్రతంబును, మరగె ననసూయా ! 8

ఏకపత్నీవ్రతము ధర్మా, నీకమున మే; లన్న పెద్దల
వాకునకు మోహనుఁడు శిరమును, వంచె ననసూయా ! 9

## చదువు - పెండ్లి

చిన్నచదు వైనంతఁ నీతఁడు, చేరె నున్నతపాఠశాలను
ఎన్నఁడే నట నొజ్జయానతి, నెదురఁ డనసూయా ! 10

తెన్ను దప్పిననాఁడు సిగ్గిలి, తెలిపె నేరము నొరుల కపుడే
కన్ను సత్యమునందె నిల్పెను, గాంధి యనసూయా ! 11

ముగిసినది మనగాంధికిన్ బదు, మూఁడవశరత్తున వివాహము
తెగులుతో దిగులందుజనకుని, తృప్తి కనసూయా 12

ఆలు కస్తురిబాయికిని వయ, సపుడు పదుమూఁడేఁడు లుండెను
బాల చెరచెర నెత్తుకొనె నొక, బాలు ననసూయా ! 13

## సీమ చదువు

గొప్పచదువులు నేర్వవలె నను, కోర్కితో నింగ్లండునకుఁ జని
మెప్పులందెను గాంధి ధర్మువు, దప్ప కనసూయా ! 14

మదిరత్రాగక పొలసుమెక్కక, మగువనంటక భోగభూమిని
బ్రదికి బారిస్టరుగఁ బట్టము, పడసె ననసూయా ! 15

ప్రజకు నాంగ్లక్షోణిలోఁ గల, ప్రాభవము గని పొంగెఁ గానీ
నిజదశన్ గని గాంధి వనట ము, నింగె ననసూయా ! 16

భారతీయుఁడు సైఁచు బానిస, బ్రదు కదెట్లుతొలంగు నన్న వి
చారమునఁ దనతల్లి గడ్డకుఁ, జేరె ననసూయా ! 17

వచ్చె మనవాఁ డిఁకను సిరికి ని, వాసములు మనమందువా లని
రెచ్చి రీతనిబంధు లెద చిగు, రింప ననసూయా ! 18

న్యాయవాదిగ గాంధి కొక రూ, పాయయును రాదాయె; సత్యముఁ
బాయ ననువాఁ డెట్లువడయును, బసిఁడి ననసూయా ! 19

అట్టితతి నేతెంచె నొకబే, హారిముస్లిము గాంధిచెంతకు
పట్టువదలినయట్టి దైవము, పంప ననసూయా ! 20

అతఁడు తనతగ వొకటి నడుపఁగ, నాఫ్రికాకుం జనెదవా యన
మతినిజూపెను గర్మచంద్రుకు, మారుఁడనసూయా ! 21

## ఆఫ్రికా యాత్ర

పడఁతి నిచటనె యునిచి యావిరి, పడవనెక్కెను గాంధి బొంబయి;
నడుమ నెదిరినమరుని బింకము, నుడిపె ననసూయా ! 22

చేరె నేటాల్ రాష్ట్రమునఁగల, తీరపత్తనమైన "దర్బాన్"
బేరితమ్మునియింట నొకదెస, విడిసె ననసూయా ! 23

సెట్టియభియోగమ్మునం గల, గుట్టు గన్గొని పెదవకీల్ - మది
కిట్టలంబగు తనివి గూరిచె, నీతఁ డనసూయా ! 24

వాదికిన్ బ్రతివాదికిని దన, వాదనైపుణి స్వాదువాక్కులు
మోదమిడ మోహనుఁడు పనిలో , మునిఁగె ననసూయా ! 25

పగతు రిర్వురు గాంధిపల్కులు, పరమసత్యములని యెతింగిరి
తగదు పో రనుకొనిరి పంతము, తఱుఁగ ననసూయా ! 26

అఱులక్షల నిచ్చుటకు నెదు, రాడువర్తకుఁ డియ్యకొనియెను
మేరలేనియశంబు గాంధిని, జేరె ననసూయా ! 27

క్రైస్తవులతో నపుడు గాంధికి, నేస్తమేర్పడె; వారు ప్రభువుం
బ్రస్తుతించుట మెచ్చెఁ గస్తురి, భర్త యనసూయా ! 28

ఏసుభక్తులు గాంధి కామత, మీయఁజూచిరి గాని వారల
యాస లాయాసములు పండని, వాయె ననసూయా ! 29

తనమతంబై నను సమస్తవి, ధాల నుత్తమ మని తలంపక
కనఁదొడంగె మతాలమర్మము, గాంధి యనసూయా ! 30

సేటుకోరినపని యొనర్చితిఁ, జేకుతెన్ గెలు పిర్వురకు నిఁక
బోటునెక్కెద నని యతం డెదఁ, బొంగె ననసూయా ! 31

అఁగుమాఁగుము నీయశోలత, సాగుపను లీనేలఁ గల వని
యాఁగె విధి కస్తూరివల్లభు, నప్పు డనసూయా ! 32

## ఆఫ్రికాలో ప్రజాసేవ

కూలిపనికై భారతీయులు, కొందఱాఫ్రిక కేగుదెంచిరి
ఏలువారికి వీరిగౌరవ, మింప దనసూయా! 33

ఓటుహక్కులు మాటహక్కులు, బాటహక్కులు లేక మనవా
రోటనందుచు నాఫ్రికామహి, నుందు రనసూయా! 34

రాజకీయముగా నిటుల్ పలు, ఱాపు లందెడివారు కొందఱు
గాజువాఱుమొగాల గాంధిని, గదిసి రనసూయా! 35

కొన్నినాళ్లిట నిల్చి మాపదు, బన్నములఁ దొలఁగింప నీకొను
మన్న! యని మోహనునకున్ నతు, లైరి యనసూయా ? 36

సేవకొఱకే యవతరించిన, జీవి గావున గాంధి యార్తజ
నావళికి నెదురాడనొల్లక, యాఁగె ననసూయా ! 37

వసతికిన్ గూటికిని గుడ్డకు, వలయురూకలు గాక శ్రమకున్
వసువుముట్టక పూనుకొనె వరి, వస్య ననసూయా! 38

భారతీయసభన్ సృజించెను, ప్రజకుఁగర్తవ్యంబు నేర్పెను
వార లిడురువ్వకును లెక్కలు, వ్రాసె ననసూయా! 39

ప్రజల కూడిగ మాచరించుట, భగవ దాదరసాధనం బని
గుజరికోమటి వలచె దీనుల, కొలువు ననసూయా ! 40

ఏలువారికి మనవు లంపెను, చాలువారికి వెతలు తెల్పెను
కూలివారల నుద్ధరించుట, కొఱకు ననసూయా ! 41

బడి యొకం డేర్పఱిచెఁబుస్తక, భవనమును నెలకొల్పెఁ దమ్ముల
జడత మాన్పఁగ గాంధి నిచ్చలు, బడలె ననసూయా ! 42

కర్మకరు "లీ వేదిచెప్పిన, నోర్మితో నొనరింతు, మది మా
ధర్మ" మని మోహనునిడెందము, తనిపి రనసూయా ! 43

రాచకయ్యము సాగె సత్యా, రాధకుండు మోహనుండు నడుపంగ
ఊంచపోయిన కార్మికులు నాఁ, డేచి రనసూయా ! 44

మోహనునితో బందె కేగిరి, ముందునిల్చిరి మరఫిరంగికి
సాహసం బిది వెలుంగుగూర్చెను, జగతి కనసూయా ! 45

దొరలబింకము సడలెఁ గార్మికు, నొరయు తలప న్నంతరించెను
విరిసె గాంధియశమ్ము నేటాల్, ధరణి ననసూయా ! 46

తనజయం బిది చూచి పొంగక, తమ్ములకుఁ గలబెడఁద లన్నియు
నణఁపఁజూచెను గాంధి కరుణా, యత్తుఁ డనసూయా ! 47

కడపె మూఁడేం డ్లాఫ్రికామహి, గాంధి యొంటరితనము నోర్చుచు
బెడఁద యిది తొలఁగింప నిత్తఱిఁ, గడఁగె ననసూయా ! 48

## ఇండియాకు

తనపనుల్ తగువారితల నిడె, ననుఁగునేస్తుల బుజ్జగించెను
వనధిపైఁబయనించె భారత, వసుధ కనసూయా ! 49

నావదిగి రైలెక్కి కస్తురి, నాథుఁ డింటికిఁజేరి బంధుహి
తావళికి నొదవించె నిర్భర, హర్ష మనసూయా ! 50

భారతీయుం డాఫ్రికామహిఁ, బడయుబాధలు పరిభవంబులు
ధారుణీప్రజకెల్లఁ జాటం, దలఁచె ననసూయా ! 51

వచ్చె నీరచనంబు పసిరిక, వన్నెగల కవచంబు దాలిచి
పచ్చ పుస్తక మనిరి దీనిని, బరిత లనసూయా ! 52

చేరె నీచిఱుపొత్త మవనిం, బేరుగల పత్రికలకెల్లను
సారవాక్కుల దీని మెచ్చిరి, సరసు లనసూయా ! 53

మెప్పులివి నేటాలుదొరలకు, నిప్పులై వేంద్రమును గూర్చెను
ఒప్పుకొందురె దుర్మతుల్ తమ, తప్పు లనసూయా ! 54

మోహనునకింక వచ్చు వెతలకు, మూలమయ్యెను వెక్కసం బిది
ద్రోహులే మస్తకము వంచిరి, తుదకు ననసూయా ! 55

అది యటుంచెద; నపుడు బొంబయి, నలముకొన్నది బొబ్బజాడ్యము
కదలె గాంధి విపన్న సేవా, కాంక్ష ననసూయా ! 56

మఱుగుదొడ్లను బాగుచేసెను, మైల తగదని ప్రజకు నేర్పెను
కరఁగె వెలివాడల శుచిత్వము, గాంచి యనసూయా ! 57

గుడులలోఁ గలకంపు పుత్తలి, కొడుకుమదికిం గలఁత గూర్చెను
అడియరుల్ సిగ్గిలిరి బెగ్గిలి, రప్పు డనసూయా ! 58

గుడి పవిత్రక్షేత్రము చుఁడీ!, మడుఁగుఁదన మిం దెసఁగవలె నని
నుడువుకస్తురిమగనికిం బ్రజ, మడఁగె ననసూయా ! 59

నరుఁడు లోవెలివెలఁదితనమున్, మరగినపుడే ముక్తుఁడగు నని
కఱపె జనులకు మేలిపారము, గాంధి యనసూయా ! 60

అవల మోహనుఁ డాఫ్రికన్ దన, యాచరించెడిసేవ పెద్దల
చెవికిఁ దెచ్చుట లెస్సయని యో, చించె ననసూయా ! 61

లోకమాన్యునిసన్నిధికిఁ జని, గోకులుని దరిసించి వారలు
నీకు జయ మన వెల్లడించె వి, నీతి ననసూయా ! 62

నడిపె సభలను బొంబయిని బూ, నాపురిన్ మదరాసునందును
కడుఁ జెలంగిరి శ్రోత లీతని, కథల కనసూయా ! 63

కాళిఘట్టము జేరి గఱువల, గౌరవము గని గాంధి యట నొక
యోలగంబును జరుప జతనం, బూనె ననసూయా ! 64

## మరల ఆఫ్రికాకు

ఇంతలో దర్బానుమిత్రుల, తంతి వచ్చుట నింతితోడను
సంతుతోడ నెటాలుగడ్డకు, సాగె ననసూయా ! 65

ఓడ దిగెనో లేదొ మోహనుఁ, దోపరానివిపత్తునం బడె
మూఁడు వెత సుకృతికిని దుర్విధి, ముదల ననసూయా ? 66

తెల్లవారిని బలుతెఱంగులఁ, దిట్టె గాంధి నిజోర్వియం దని
కల్లవార్తలు పొక్కె నపు డా, గడ్డ ననసూయా ! 67

తిక్కరేఁగిన తెల్లకుఱ్ఱలు, తీండ్రపడి కస్తూరిపతిపైఁ
బెక్కుఱాలను రువ్వి రార్చిరి, పేర్చి రనసూయా ! 68

గ్రుద్ది తన్ని కడించికట్టులఁ, గొట్టి మూర్ఛితుఁజేసి రనఘుని
బుద్ధిగలవా రపుడు గాంధిని, బ్రోచి రనసూయా ! 69

గండమును దప్పించుకొనె హరి, కరుణమై నాపన్నబంధువు
దుండగుల జగమెల్ల నొకటై, దూతె ననసూయా ! 70

చట్టములు రెం డపుడు నేటాల్, శాసనసభా చర్చ నుండెను
చెట్ట నిదు నివి కూలివారల, సిరికి ననసూయా ! 71

కదుఁ బెనంగెను మోహనుం డీ, కట్టడల వారింపవలె నని
కద కధర్మమె సభ్యసమ్మతి, గాంచె ననసూయా ! 72

భారతీయుల యభినివేశము, బలపడిన దీయపజయమ్మున
ధీరు లాపత్కాలమున వెను, దీయ రనసూయా ! 73

తిరిగితిరిగి సభానిధిన్ వి, స్తృతముఁ జేసెను గాంధి, సభ్యులు
పెరుఁగున ట్లొనరించె సేవా, పరత ననసూయా ! 74

న్యాయవాదిగ నుచితమగు నా, దాయ మందుచు దంబమెఱుఁగని
తోయమునఁ గాఁపురము నడుపం, దొడఁగె ననసూయా ! 75

నిలిపెఁ దనబిడ్డలకుఁ జదువులు, నేర్పఁగా నొక యాంగ్ల విదుషిని
తెలిపెఁ దా నపుడపుడు గుజరీ, పలుకు ననసూయా ! 76

తాను నిల్పినపాఠశాలకుఁ, దనయులను గొన్నాళ్ళు పంపెను
మానెఁ బట్టములిచ్చువిద్యల, మమత ననసూయా ! 77

పట్టములు లేకున్న నేమీ, దిట్ట లీతనిసుతులు సుజనత
నెట్టిబెడఁదలనైన నోర్తురు, స్వేచ్ఛ కనసూయా ! 78

పొగడఁదగు నాత్మోన్నతియు నీ, బుదుతలకు వశపడియె, నార్జవ
మెగయు వీరల జీవితము నం, దెపుడు ననసూయా ! 79

తల్లి దండ్రుల మేలిమనుగడ, దక్కె వీరికి నింటనుంటను
నల్లవో ! సరిలేదుకద యా, నడత కనసూయా ! 80

మోహదశలో నున్న గాంధికి, మొదటి కొడుకుగఁ బుట్టినాతఁడు
సాహసించి యెదిర్చె నంతటి, జనకు ననసూయా ! 81

అదియటుండెను గాంధి యత్తతి, నాసపడె రోగార్తు సేవయు
మదిని రోయక కుష్ఠపీడితు, మనిచె ననసూయా ! 82

అతనిన్ దనయింట నునిచెను, రోఁతగ్రక్కెడిపుండ్లు కడిగెను
చేఁత యిది హరి కూడిగముగాఁ, జేసె ననసూయా ! 83

ఏలువారల వైద్యశాలకు, నేగి యైచ్ఛిక సేవకుం డై
పాలకులకొనియాట లీతఁడు, పడసె ననసూయా ! 84

## బ్రహ్మచర్యము

పరుగులెత్తెను గాంధి చిత్తము, బ్రహ్మచర్యముదెసకు నప్పుడు
పెరుఁగు సంతతిబరువు గని యది, బెదరె ననసూయా ! 85

కస్తురికిఁ దనతలఁపు వాకొని, గాంధి నీవేమందు వనఁగా
శస్త మిది సంశస్త మిది యనె, సాధ్వి యనసూయా ! 86

చెలువసెజ్జకు దవ్వుగాఁదన, సెజ్జ నిడి యయ్యాయి చేఁతల
నలసినపుడే గాంధి కూర్కున, కరిగె ననసూయా ! 87

ఎంతబిగిసిననేమి యపుడపు, డితఁడు పప్పునఁ గాలువైచెను
పంతమును వీడక జయంబును, బడసె ననసూయా ! 88

ముప్పదేడవయేఁటనే చుమి, మోహనుం డీనిష్ఠ కొగ్గెను
గొప్పవారల నెదురఁ బ్రాయము, గొంకు ననసూయా ! 89

తన్ను వలపించుట యెఱుంగని, తరుణిగా సిగ్గునకు నెలవుగ
నున్న కస్తురిపున్నెములు పతి, నోమె ననసూయా ! 90

సంతు నాఁపెను సేవకుం దగు, సమయ మిచ్చెను గాంధి కెంతో
శాంతినిచ్చెను నేఁటిభీషణ, శపథ మనసూయా ! 91

తనువునకు బుద్ధికిని హృదికిని, ద్రఢిమనిచ్చును బ్రహ్మచర్యము
అనుపమవ్రత మిది యనెన్ స, త్యార్థి యనసూయా ! 92

తొలుత నించుక నెగులు నిడినను, దుదకు రసమయ మౌను దమ మని
పలికె మోహనుఁ దనుభవమ్మునఁ, బండి యనసూయా ! 93

కారమున కఖిఘూరమునకును, దూరమై మితమైన శాకా
హార మిత వగు బ్రహ్మచారికి, ననియె ననసూయా ! 94

కుడుపు దిద్దక యింద్రియమ్ముల, నడఁపఁజూచుట వడను మంచుం
బడయఁగోరుట యనియెఁ గస్తురి, భర్త యనసూయా ! 95

ఎతఁడు కోరునొ బ్రహ్మచర్యం, బతనికిన్ దగుతిండి పండ్లని
కృత పరీక్షల మోహనుఁడు గు, ర్తించె ననసూయా ! 96

కలుగు నెవ్వని కాత్మదర్శన, కాంక్ష మది నాతని కవశ్యము
వలయు నింద్రియనిగ్రహం బని, తెలిపె ననసూయా ! 97

మదిని గెల్చుట దుశ్శకం బను, మాట యుక్తమె కాని రాముని
సదనమైనపు డణఁగు నది యని, చాటె ననసూయా ! 98

త్యాగి హరికీర్తనము వినుటకు, భోగి జావళిపాట వినుటకు
వేగపడియెద రనె నహింసా, వీరుఁడనసూయా ! 99

కోటియేన్గుల నోర్చు నింద్రియ, పాటవం బిద్దానిఁ ద్రోయఁగ
గాటమగు హరిభక్తి వలె ననె, గాంధి యనసూయా ! 100

మందిరం బయ్యాయివస్తుల, సుందరము గావింప మోహనుఁ
డిందనుక భావింప వెచ్చం, బేచె ననసూయా ? 101

చాకిపనియును మంగిపనియును, సలిపె నంతట గాంధి ; వెచ్చపు
ప్రేఁకనన్ దొలఁగించుకోరిక, విరియ ననసూయా ! 102

ఒక్కతతిఁదనపట్టు సేలును, జక్క దిద్దిన గాంధిరజకత
నక్కజముతో గోకులుఁడు కొని, యాడె ననసూయా ! 103

తనయొనర్చిన కత్తిరింపును, గని యనుంగులు నవ్వ సొంతపుఁ
బని యెటున్నను దనుపు ననె గుణ, భద్రుఁ డనసూయా ! 104

భోగమొప్పని దమవిధానము, పూనువానికి దంబములపై
రాగ మేర్పడ దనుట కిది తా, ర్కాణ మనసూయా ! 105

నవాక్కరలు

(5 ఇంద్ర గణములు, 1 సూర్య గణము, 5 మొదట యతి)

# బోయరు యుద్ధములో సేవ

అదియట్టులుండె నానాఁడాఫ్రికానేల, నల్పభాగమున
కధికారులైన బోయరులతోఁ దెలవారి, కాహవం బొదవె
నెద యీవిపత్తునం దాంగ్లభూ విభులకే, యిమ్ము సాయ మనఁ
గదలె మోహనదాసు క్షతగాత్రులను దేర్పఁ,గా ననసూయ! 1

భారతీయులు వేయిమంది సేబా సంచుఁ, బరుగునన్ వచ్చి
చేరి రయ్యెడ గాంధి చేకూర్చుదళములో, సేవాభిరతిని
ధీరతన్ మేరువై దీపించుపదవాలు, దీనులై మూల్గు
వారికై శిబిరమొక్కటి నిల్పెఁ గలని కీ, వల ననసూయ! 2

కాలు పోయినవానిఁ గరము త్రెస్సినవానిఁ, గను చెద్దవానిఁ
గీలాలమున మున్గి తేలాడుచున్ గిల, గిల లాడువానిఁ
దూలుచున్ మోసి దేరాలనీడకుఁ జేర్చి, తొడిఁదొడిన్ దొడఁగి
మేలియూడిగము గావించె నీదళ మిచ్చ, మెయి ననసూయ ! 3

మరఫిరంగులు తుపాకులు పరఁగించు పెన్, మంట లావంత
సరకు సేయక రణాంగణమునం దొక్కొక్క, సమయమం దీఁగి
యొఱఁగినబంటులన్ దెచ్చి సేవించె; నియ్యూడిగం బపుడు
నెఱపె సేనాపతికిని మనమొన కడున్, నెతి ననసూయ! 4

సేనాపతులు మెచ్చి రేలికల్ పొగడి రీ, సేవ నవ్వేళ;
నౌ ననె నాఫ్రికా ప్రజయెల్ల భారతీ, యాదరం బెసఁగ;
ఏనాఁడు లేనినెయ్యము కూలివారిలో, నేర్పడె; గాంధి
యానందమందెఁ దమ్ములవంత లింక నిల్వవని యనసూయ ! 5

పదపడి నేటాలునందున్న భారత, ప్రజలశౌచంబు
మదిఁ గోరి యిల్లు వాకిలి వల్ప పెఱవారి, మన్ననల్ పడయు
విధమున దిద్దుడా ! యనుచు వారికిఁబట్టు, విడువక తెల్ప
నదిరా ! యటంచు మెచ్చిరి పెఱవారు మోహను ననసూయా ! 6

తనవారి కయ్యాయిహక్కులు వలె నని, తద్దయుం బెనఁగు
వని గాక వారల మడ్డితనంబును, బాపుచేఁతయును
బొనరించుగాంధి వివేకంబునేర్చిన, పురుషుం దటంచుఁ
గొనియాడి రతని నప్పుడు తెల్లవారు మక్కువ ననసూయ! 7

అగుఁగాని రాజకీయంబుగాఁదన కెప్డు, ననుకూలురగుచుఁ
బొగడికల్ పొందినతమ్ములే కొంద ఱీ, ప్రొద్దు "మా యింటి -
సొగసు మేమెఱుఁగమా యేటికి నీకంర, శోష" నా గాంధి
నగి సంస్కరణ మల్పకార్యంబు కా దని, నాఁ డనసూయ ? 8

## మరల ఇంటికి

ఆవెన్క భారతావనినున్న చెలిమి కాం, డ్రన్న ! నీ సల్పు
సేవనం బిఁక మాతృభూమి కర్పించి మా, చిత్తముం దనుపు
మీవసుంధరఁబెక్కు బెడఁదలన్ గుందువారెందఱో కలరు
రావయ్య! యని గాంధికనిచి రర్మిలి నుత్త, రము లనసూయ ! 9

తనపనుల్ సేయ నాజరు ఖాను వంటి పెద్దలు లేరె యనుచు
ననుకూలుఁ డయ్యె నీయభ్యర్థనమున కా, ర్జావన ప్రియుఁడు
కనికరించి యనుజ్ఞ నిండు నా కన్నలు !, కాఁణాచి కేగ
నని నేటాల్‌చెలుల వేఁడెను గరంబులు మోడ్చి, యతఁ డనసూయ! 10

ఈమాట విన్నంత ఱాబొమ్మలై తొల్లి, యెఱుఁగని వెతకు
గీములై కన్నీటిదీములై వారెట్ట, కేల కోయయ్య!
మేము రమ్మనినప్పు డేఁడాదిలోపల, మీరు రావలెను
మామంచిచెడ్డ లారయవలె ననిరి నమ్రత ననసూయ! 11

ప్రేమపాశమునఁ ద న్నెన్నఁడో గట్టిగా, బిగియించినట్టి
యీమిత్రములకోర్కి కెదురాడలేకపో, యెను మోహనుండు
గ్రామంబులం బట్టణముల సేవామూర్తి, గాంధికి సాగె
నామెతల్ వీడ్కోలుసభ లుపాయనములు, నపు డనసూయ ! 12

వెండిపళ్లెరములు బంగారుగిండులు, వెలలేనిమణుల
నిండిననగ లొసంగిరి గాంధి కానాఁడు, నెచ్చెలికాండ్రు
కొండంతబరువున్న జాళువాదండ మ,క్కువ మెండుకొనఁగఁ
గొండని కాంత లర్పించిరి మోహను - కొమ కనసూయ ! 13

## కానుకలు మానుట

ఈ సంపదలు నావి కావు నావే యన, నీకొన్ననాఁడు
నాసల్పినట్టిసేవకు విల్వయుండునా, నలుసంతయేని
యాసీమఁగల భారతీయసదస్సున, కిచ్చెద వీని
నాసలన్ ద్రోసెద నని యెంచె నపుడు మో, హనుఁ డనసూయ ! 14

తన నిర్ణయము దెల్పి యేమందు రని గాంధి, తనయుల నడుగ
వెనువెంటనే వారు సముచితం బిది యని, వేడ్కమైఁ బల్కి ;
రనుమతింతువుకదా ! నీవు నంచపుడు మో,హనుఁ డింతితోడ
ననుడుఁ బెద్ద కలంగె నలమటన్ గ్రుంగె న,య్యమ యనసూయ ! 15

నీకేల యీనగల్ నీవుసెప్పినరీతి, నృత్యం బొనర్చు
నీకుమారులకేల నాల్గవపదినున్న, నీయాలి కేల
నాకొమ్ము రానున్నకోడలికైనను, వలయునో వలదో
పోకుమా పెడదారి కనె వేఁడివేడిఁయూ, ర్పుల ననసూయ! 16

వేగిరింపకు దొరా ! రే పెట్టిదో యని, వేఁడెద నిన్ను
బాగుబా గని ప్రజల్ కొనియాడి యర్పించు, పావడంబులను
భోగంబునకుఁ ద్యాగమున కిచ్చువచ్చిన, పోల్కి వెచ్చించి
సాగింపఁజనదె సంసారం బనెన్ గాంధి, సతి యనసూయ ! 17

పిచ్చిదానా ! రత్నహారమ్ములను గోరు, పిల్ల కోడలుగ
వచ్చునామనయింటి ? కొకవేళ వచ్చుఁబో!, వలయుసొమ్ములను
దెచ్చుట కేనులేనా ! కారణములేని, దిగులేల నీకు ?
మెచ్చులే నిపుడని న్ననె గాంధి చెలి కోర్కి, మెయి ననసూయ ! 18

నాసొమ్ములన్నింటి నెన్నఁడో తెగనమ్మి, నను బోసిదానిఁ
జేసినదొరవు నీవా కోడలికి నగల్ , సేయించుమామ !
వీసుద్దులకు నేమిగాని లోకంబు నా, కిడిన కడాని
కాసులపేరు నిట్లిమ్మనెఁ గస్తూరి, కసి ననసూయ ! 19

కాసంత కలఁగక చిఱునవ్వు చాటుచు, గాంధి యవ్వేళ
నీ సేవ కలరి యర్పించిరా యీ దండ, నేటాలువారు
నాసేవ కలరి యర్పించిరా ? పరికించి, నాయంబు తెల్పు
మాసనం బిడకుము కిన్కకుం గస్తురీ !, యనె ననసూయ ! 20

ఇంతి యావెన్క నయ్యా! లెస్సపల్కితి, వీదండ నీవు
చింతలన్ వంతలన్ సైఁచి కావించిన, సేవ కీలోక
మెంతేని తనిసి యిచ్చినయుదుగర, యని యెఱుఁగుదుఁగాని
సుంత నామనవి నాలింపుమా యనియె నూ, ర్చుచు ననసూయ ! 21

ఏ నెల్లప్రొద్దు నీసేవ గావింతు, నీ, హితము వర్ధించి
మేనెల్ల స్రుక్కఁగా వండివడ్డింతు నీ, మిత్రుల కిదియు
ధీనిధీ! సేవగా కేమియౌ ననెఁ గడున్, దెగఁబాటుతోడ
నీనుడుల్ నిశితశస్త్రమ్ము లయ్యెను గాంధి – హృది కనసూయ! 22

అమ్మేటి తద్బాధ నెట్టెటో సైఁచి తి, య్యని ప్రసంగములఁ
గొమ్మ నొప్పించి భూషలనెల్ల వాణిజ్య, కోశమం దునిచి
నమ్మం దగినవారి ధర్మకర్తలఁ జేసి, నౌకపై ఁ గదలి
నెమ్మి నాల్బిడ్డలతోఁ జేరె మాత్రవ, నికి ననసూయ ! 23

కాళికాఘట్టమం దానాఁడు వర్తిలు, కాంగిరెస్ సభకు
వైళంబ చేరి మోహనదాసు గోఖలే – వాత్సల్య మంది
కూలివాండ్రుగ నాఫ్రికన్ భారతీయులు, కుడుచుబన్నంబు
లేలువారలపోక లెఱిఁగించె సభ్యుల, కితఁ డనసూయ ! 24

మాతృదేశము దాస్యమగ్నమై నానావ, మానముల్ కదియ
భీతిల్లుకాలాన గతియేమియని దుర, పిల్లు కాలాన
లాఁతినేలను గుందు మనవారి కేపాటి, లగ్గు చేకూర్చు
నీతనిశ్రమ మంచుఁబెక్కు రూహించి ర, య్యెడ ననసూయ ! 25

గెలుపు నోటమి నొక్కమెయి నెంచి జనహిత, కృత్యముల్ నెఱపు
నలవాటు కలయోగి యగుట మోహనుఁడు ధై, ర్యంబును విడక
తిలకుమున్నగు మహారథులను గని వారి, దీవనల్ పడసి
తిలకించెఁ గాంగ్రెసునగరంబునందలి, తీ రనసూయ ! 26

## మఱుఁగు దొడ్లు బాగుచేఁత

సేవావిధుల్ గాన రైచ్చికభటు లాన, సేయుట తక్క
నేవాఁడు నెఱుఁగఁడు వినుటయన్నది ; సభ్య, లీదండుకతన
నావంతమే లందలేక గగ్గోల్పడు, టారసి చెలిమి
నావిష్కరించి లెంకలను దిద్దెను గాంధి, యపు డనసూయ ! 27

ఆపేంట నెగసెడిగోలు నోరువలేక, యతని నాసికలు
వాపోవం జీంపురుంగట్ట గడించి సే, వాధర్మమూర్తి
తేపు మాపు మఱుంగుదొడ్డను సవరింప, రేంగినలజ్జ
నాపురుషోత్తమున్ గనిరి భటుల్ పురే, యని రనసూయ ! 28

ముగిసెం గాంగ్రెస్సభల్ భారతోర్వీదాస్య, మును ద్రోసివై వం
దగినచర్చలతోడ నుజ్జ్వలోపన్యాస, తతితోడ సాగి ;
జగమెతింగిన గోకులునిచెంత నంత శి, ష్యతను గస్తూరి
మగండు కొన్నాళ్లుండె మెఱుంగిద నాత్మీయ, మతి కనసూయ ! 29

పొగడికల్ గన్న కోవిదుని సంయమిని బ్ర, ఫుల్లచంద్రాఖ్యుం
దగువాని దేశభక్తుని వదాన్యతకు మూ, దలయైనవాని
జగమానిసిన్ గోకులునితోడ సముదాత్త, చర్చలు నెఱపు
సుగుణాబ్ధిం గని గాంధి తనిసె నానాండుహె, చ్చుగ ననసూయ ! 30

విడలేక విడలేక గోపాలకృష్ణుని, విడి మోహనుందు
సడిసన్న కాశికిం జని మనముక్తికై , స్వప్రాణధనము
ముదుపుగట్టిన తల్లి నానిబిసెంటు ని, మ్ములం గని మ్రొక్కి
వడసె నవ్వి దుషీమతల్లి యొుంసగు దీ, వన లనసూయ ! 31

పదపడి యతండు బొంబాయి కేతెంచి గో, పాలకృష్ణార్యు
మదికి విధేయుండై కాంగ్రెసుపనియు, ధర్మస్థానకృతియు (కోర్టుపని)
మదిమదిం గావింప దొరంకొనియెం గాని, మతకరిదైవ
మెదిరించె నక్కటికము లేక తజ్జగ, ద్ధితు ననసూయ ! 32

## జలవైద్యము

అతనిపుత్రుండు మణిలాల్ సన్నిపాతజ్వ, రార్తికిం జిక్కె
బ్రతుకుట దుశ్శకం బనిరి వైద్యు; లొకండు, పలలరసంబు
నితని కిచ్చుట లెస్స యన గాంధి నేనొప్ప, నిది యనె; మణియుం
బితపల్కు పాటింతు ననెం గుఱ్ఱండయ్యు ఱం, పిలి యనసూయ ! 33

కొడుకు నగ్గించుచు గాంధి తా నేర్చిన, కూనేచికిత్స
బుడుతపైం బఱపి తీవ్రజ్వరంబున సెగల్, పొంగుత త్తనువు
తడిగుడ్డ నాపాదమస్తంబుగాం గప్పి, దయంజూపు మనుచు
విడువక రాము వేండందొడంగెం గస్తూరి, విభుం డనసూయ ! 34

అవెన్క నొకజాములో మణిలాలుదే, హమునుండి చెమరు
వావిరిగా నోడిగిల్లి వేcకి యదంగి, వారనివేద్క
గూర మోహనుcడు రామునకుc జెల్లించె మ్రొ, క్కులు భక్తలోక
భావుకాళీరక్తునకు యుక్తునకుc గృపా, స్సతి కనసూయ ! 35

గండంబు కడచె నోయీ ! మణీ ! తేఱుమిc, కన్ భీతిపడకు
తండ్రీ ! మదీయవిజ్ఞాపనం బాలించి, తనిసిన రాఘ
వుండే శుభం బిది సమకూర్చెc గాని వే, ఱొండు కా దనెదc
బండినసూనృతం బిది యనె సుతుc డెల, ర్పcగ ననసూయ ! 36

కొమరునారోగ్యంబు దినదినంబును గడల్, కొనుచుంట గాంధి
ప్రమదమందుచు నెఱాపాడిపట్టునc బేరు, పడయువకీళ్ళ –
కమనీయవాదనై పుణి క్రమమందుచుc, గరcగుచు జయము
సమకూరులే ! కోర్టు పనులయం దని, తన్విసనె ననసూయ ! 37

ఇంతలో నేటాలునెయ్యురు గాంధి కో, హితమణీ ! నీవు
సుంతయుం దడయక రావలె నిటకు వి, శ్రుతుcడైన యాంగ్ల
మంత్రి చేంబర్లేను వచ్చెడి; నతనికి, మనకథల్ చాటి
చింతలం దీర్చుకోవలె నని తంతిని, చ్చిరి యనసూయ ! 38

## మరల ఆఫ్రికాకు

పిలిచినంతన వత్తు నని మాటయిచ్చి యా, ఫ్రికనే స్తగాంధ్ర
నలరించి తల్లిగడ్డకు వచ్చెc గాన మో, హనదాసుc డంతc
జెలిని బిడ్డల వీడి కోర్టులంపట వీడి, చిత్తంబు రాము
నిలు చేసి తరణిపై నెక్కి చేరె నేటాల్మ, హికి ననసూయ ! 39

భారతీయప్రజా ప్రతినిధివర్గంబు, పాలింటికార్య
భారంబు తలcదాల్చి గాంధి చేంబర్లేను – పజ్జcగార్మికులc
గారించుగోరాలనెల్ల వినీతమా, ర్గమ్మునc జాట
నౌరా ! యనిరి లోభహతి నెఱుంగనిశ్రోత, లపు డనసూయ ! 40

ప్రెగడచేంబర్లేను భారతీయులమొఱల్, వినివిని మీకుc
దగుసాయ మొనరింతుc గాని మీ రిట నిల్వc, దలcచెదరేని
జగడముల్ మాని యేల్బడివారితో సంధి, జరిపికోవలయు
జగ మాదరించుతీ రిది యనె మృదులభా, షల ననసూయ ! 41

కాలుసేతులు చల్లపడె భారతీయవ, ర్గమున కవ్వేళ ;
నేలబేలతనంబు; పరిహార్య మిది యని, హితవాక్కు లాడి
ప్రీలినధైర్యమ్ము నమ్మిత్రకోటికి, వెండియున్ గూర్చి
కాలోచితక్రియారతుఁ డయ్యె సత్యకిం, కరుఁ డనసూయ ! 42

నేటాలువీడి చేంబర్లేను ట్రాన్సువాల్, నేలకుం బోవ
గాటపుంబూన్కి నమ్మహి కేగె తివ్వనఁ, గస్తూరిపతియుఁ
బాటింపరైరి నెఱాదొర లితని మా, ప్రజలమేల్ గీడు
చాట నీవెవ్వండ వని రీరసంబు ష్షౌ, చ్చఁగ ననసూయ ! 43

ఎల్లరీతుల నేలుబడివారి నెదిరింతు, నిచటి సోదరుల !
యుల్లంబులకుఁ జేవగూర్తు జొహాన్సుబ, ర్గనికిగా నిల్చి
బల్ల కట్టెదను బారిస్టరు వృత్తితో, బ్రదికెద ననుచు
నుల్లాసి యయ్యె నయ్యెడ ధర్మవీరవ, ర్యుం డనసూయ ! 44

పరమార్థవాంఛతో పాటు విత్తార్జన, పరతయు నింత
వఱకుంటఁ బదివేల కెపుడొ భీమాచేసె, బ్రదుకును గాంధి;
పరిణామమందె నీతనిచంద మీనాఁడు, బలిసెఁ ద్యాగేచ్ఛ,
హరియె యెల్లరఁ బ్రోచు నన్న నమ్మికయు నా, యన కనసూయ ! 45

భీ మాని భీమానుమానె నంతట గాంధి, పీడిత ప్రజల
సేమంబునకె వెచ్చ పెట్టనెంచెను దన, చేకూర్చు సొమ్ము
శ్రీ మీకు నిఁకఁబంపలేనని కమ్మ వ్రా, సెను బూర్వజునకుఁ
గామాది కిటు దవ్వుగా నిల్చుటయె ముక్తి , కద యనసూయ ! 46

## గీతా పఠనము

అనాఁడు గీతార్థ మెఱుఁగఁ దలంచి మో, హనుఁడు గీర్వాణ
వాణిలోఁ దనకున్న నేర్మి చాలమి నను, వాదముల్ చదివి
యౌనౌననెన్ గాని మూలంబు రామికి, నలఁదురి కొఱంత
దీనిఁదీర్చు కొనంగఁ బూనె నక్కజమైన, ధీ ననసూయ ! 47

పలుదోమ నీరాడ నిరువదినిముసముల్, పట్టుఁ గస్తూరి
చెలువున; కిక్కాలమున గీత వల్లెయుఁ, జేసె నమ్మేటి
వలుదయక్కరముల రెండు శ్లోకంబులు, వ్రాసిన ముక్క
నల తానపుంగదిగోడ కంటించి యొ, య్యన ననసూయ ! 48

జనసేవయును గోర్తుపనియును హెచ్చి వి, శ్రాంతి లేకున్కి
ననఘుఁ డివ్విధి నేర్చె ధర్మకోశంబు నా, నలరారుగీత ;
మనుగడ నెప్పు దేశంక తోఁచిన నొజ్జ, మాడ్కిఁగన్ విచ్చి
తనిపె నియ్యది గాంధి; నారాధ్యు నొనరించె, ధర కనసూయ ! 49

నరుఁడు నేమం బెద్ది పాటించినను మేలి, నడువడు లెవ్వి
వరియించినను సంపదలను సంసారమున్, వదలించుకొనక
పరమేశ్వరుని గానలేఁడు లేఁ దనుమేలి, పార మాతనికిఁ
గఱపె గణ్యంబైనయుపనిష త్తది తేట, గా ననసూయ ! 50

పదపడి భారతీయాశయం బను పేరఁ, బరఁగుపత్రికకుఁ
బదుగురున్ దనియ సంపాదకుఁడయ్యె ద, బ్బఱకంపులేని
మృదులతం బాయనివ్యాఖ్యానముల దాని, మెఱయించె గాంధి ;
అదిరా ! యనెన్ దదీయప్రథన్ గాంచి దా, యయు ననసూయ ! 51

తనసొమ్ము వేల్వేలు వెచ్చించి దానియం, దము చంద మెంచి
వణిజులుగాఁ గూలివాంద్రుగా నాఫ్రికా, వసుధకువచ్చి
మనవారు రాజకీయమ్ముగాఁ బడునిడు, మల నందు గాంధి
వినిచె నాంగ్లమ్మున గుజరీనుడిన్ జంకు, విడి యనసూయ ! 52

మన పేదవారు నిల్చిన గూడెమున మహో, మారి వ్యాపించి
తనపొట్ట నిడుకొనం దలపడెఁ బ్రజల న, త్తఱి దయమాలి
మనసున్న దిట్టలు కొందఱు తోడురా, మఱిమఱి నలఁగి
యణఁగించె నార్తనాదములు వేవేగ మో, హనుఁ డనసూయ ! 53

## సర్వోదయము

తిలకించె గాంధి యవ్వల రస్కినుమనీషి, దీనబాంధవుఁడు
పలికిన "అన్‌టుదిలాస్టు" నాఁ దగుకృతిన్, బ్రత్యేకదీక్ష;
నలరించె నిందలి ప్రతిపదం బీయన్న, నైదాఱుమార్లు
నిలిచి నిల్చి పఠించున ట్లొనర్చె దయాధు,నీ ! యనసూయ ! 54

తనకోరుసౌఖ్య మందఱిసౌఖ్యమునయందె, దాఁగియున్న దనె
మనుగడతీ రొక్కమైనుంటచే వకీల్, మంగలి సేయు
పనులకుం గలవిల్వ తుల్యంబ యనెఁ గాఁపు, బ్రదుకు కార్మికుని
మనువు మేల్తర మనె రస్కిను సముదార, మతి ననసూయ ! 55

సంతుష్టిగూర్చు రస్కినురచనన్ గాంధి, సర్వోదయాఖ్య
సంతరించెను గుజరీబాసఁ బ్రకటించెఁ, జక్కనికృతిగ ;
నింతియకాక యీమూఁడుతెన్నులు తల, నిడికొని బ్రదుక
సంతనకట్టె గెల్పిమ్మనివేఁడె నీ, శ్వరు ననసూయ ! 56

## ఫినిక్సు ఆశ్రమము

పోలక్కు వెస్టు మున్నగుమిత్రులును గాంధి, పోయెడితెన్ను
మేలితె న్ననిరి ఫినిక్సు నాఁజనుచోట, మేటిపొలంబు
వేలువె ల్వెచ్చించి కొనె మోహనుండు ని, వేశముల్ మిట్ట
నేలలో వెలసె, నేర్పడె నడవికిఁ బల్లె, నెతి యనసూయ ! 57

ఒదవె ముద్రణశాలయును దీనిమర తొల్త, నొక్కింత యల్గి
కదలెఁ బత్రికసాగెఁ గష్టించి పండించి, కడుపు నిండింప
మొదలిడి రాశ్రమమ్మునవారు దంబముల్, ముడిఁగించి తమకుఁ
జదురున్నసరణిం బ్రజాసేవ కొగ్గి ర, చ్చట ననసూయ ! 58

నానామతమ్ముల నైకజాతులవారు, నాఁడట నున్న
నేనాఁడువీరిలో మొలతేరదయ్యెఁబో, రించుకయేని
చానతోఁ గైమరత్రిప్పి గోధుమపిండి, సమకూర్చుగాంధి
యౌవన లాఁతిజంటలుఁబూనెనప్పని, కపు దనసూయ ! 59

మలమెత్తుపనియుఁగావించిరి గాంధికు, మారు లవ్వేళఁ
దుల లేని హర్షంబు నందె మోహనుఁడీసు, తులచంద మరసి
జలజల నశ్రులున్ రాల్చె వారికిఁ దగ్గ, చదువు గూర్పమికి ;
బలియయ్యె బిడ్డలచదు వయ్యలోక సే, వకు ననసూయ ! 60

చదువబ్బకున్నను జగ మహో ! యనఁజాలు, సౌశీల్య మబ్బి
నది గాంధికొమరుల; కొక పెద్దవాఁడె జ, నకుచెంత లేమిఁ
గొదవడెం బ్రజమెప్పు గనఁజాలునడత ;ని, క్కొఱఁత గుర్తించి
మదిఁగలవెత నయ్యకడ వెళ్ళఁగ్రక్కు వే, మా అనసూయ ! 61

పరితుష్టిమై ఫినిక్సునఁగొంత కాలంబు, బ్రతుకు సాగింప
దొరకొన్న గాంధి కీయోగంబు లేమిని, దుర మొందు సాగె
దొరతనమ్మునవారి నెదిరించిరి "జులూ" లె, దో తప్పుఁజూపి
వెఱతురా వీరికి బహుసేనలున్న భూ, విభులనసూయ ! 62

క్షతగాత్రులైన జులూల కూడెముసేఁత, సాగించె మిత్ర
శతమును దోడుగా నిలువ మోహనదాసు, జగతీహితార్థి !
భృతశస్త్రమై సైన్య మెటుదూఁకు నటు గాంధి, వెడలె డోలీల;
నతఁ డెంచె నీసేవ యీశ్వరారాధనం, బని యనసూయ ! 63

మజ్జీవితంబునం దిట్టి సేవలు మాటి, మాటికిన్ దప్ప
వుజ్జగిల్లక వీని నొనరింపవలెనన్న, నుల్లంబు శాంతి
నుజ్జిలేనిది యౌట వలయు, బిడ్డలసంఖ్య, నొగిఁ బెంచువాని
పజ్జకు శాంతిరా దనియు నెంచెను గృపా, ప్రతి యనసూయ ! 64

అలు చూలాలైనయపు డిట్టియూడిగం, బంగీకరింపఁ
జాలుదునే రెండు గుఱ్ఱాలపై స్వారి, సలుప నోపుదునె
వాలాయముగ నాకు బ్రహ్మచర్యపథంబు, వలయును వలయు
నేలజా గని గాంధి యపుడె తద్విధిఁ దల , నిడె ననసూయ ! 65

(37వ యేఁట)

మొదట నీనియమమ్ము మోహనున కసాధ్య, ముగఁ దోఁచెఁ గాని
పదపడి సంతృప్తిజనక మయ్యెఁ దపమ్ము, వలె నాత్మబలము
పొదలించె నంత మోహనునకుఁ గలనైన, భోగానురక్తి
యొదవదయ్యె నణంచె నతఁడింద్రియమ్ముల, యుదు టనసూయ ! 66

చందనద్రుమముచెంగట నుండువేములున్, పరితావు లీను
చందాన గాంధిసన్నిధి నిల్చునెయ్యురున్, సైఁచి రీనియతి ;
నందఱు నింతిసెజ్జకు దవ్వుగాఁ బండ, నలవాటుపడిరి
క్రందుగా నలసినప్పుడె పవ్వళించి ర, క్కా! యనసూయ! 67

## (అక్క – పూజ్యు)

ఆతేండ్ల నాఁడె మోహనదాసు బ్రహ్మచ, ర్యవ్రతం బూను
కోరిక వొడమి కస్తూరికిన్ దెల్ప న, క్కమ్మ వేవేగ
నూరీకరించి నిజోదాత్తతం జాటె, నుప్పొంగెఁ గాని
దారిదప్పె మగండె యపుడపు డింద్రియో, ద్ధతి ననసూయ ! 68

ఈనాఁడు గాంధి పట్టినపట్టు వీడక, యెద రాము నిల్పి
బోనంబుతగ్గించి పండ్లారగించి య, ప్పుడప్పుడు తిండి
మానుచుంగనుమూయుదనుక సంయమికుల, మౌళిగా బ్రదుక
నానాశ్రమల్ వలచి సహించె విశ్వ మె, న్నఁగ ననసూయ ! 69

ఒకవంక సత్యాగ్రహోద్యమం బది సాగె, నొకవంకఁ గస్తు
రికి దుర్భరంబగురుజ రేఁగె నన్నుఁబ, రీక్షింప వేల్పు
నకు నిచ్చ పొడమిన దని గాంధి తలఁచి మం, దరముగా నిలిచి
సకలమార్గంబుల నింతిని మనుప వే, సరె ననసూయ ! 70

## కస్తూరి గొప్పతనము

తెగులు రక్తస్రావ మగుట శస్త్రచికిత్స, దీనికి వలయుఁ
దగ దన్యవైద్యంబు నమ్మ నాప ల్కని, దాసు నొప్పించి
తెగె వెజ్జు కోఁతకుఁ దద్బాధ నోర్చిన, తెఱవనిబ్బరము
పొగడె మోహనుఁడు జోహారులర్పించె వే, ల్పున కనసూయ ! 71

కోఁత నిర్విఘ్నంబుగాఁ జాగె గాంధి పె, క్కువనెల్లఁ గన్న
హేతువునన్ వెజ్జు తజ్జాయకస్తూరి, కితమగు సేవ
రాతిరి పవలు గావించుచున్నను శక్తి, రాదయ్యె నామె ;
కీతీరు గని వైద్యుఁ డు త్తలమందె న, య్యెడ ననసూయ ! 72

తుదకు మాంసరసాదు లీనిచో నిలదు క, స్తూరి యటంచు
మదినెంచి గాంధి కీతలఁపును వినుప న, మ్మగువ వల్దనిన
మదిరాదు లేనను వలదందు ననె ధీర, మౌళి; వేదాంత
మది చెల్ల దిపు దని బెట్టిదమ్ముగ భిష, క్కనె ననసూయ ! 73

ఏమందులిచ్చియే నేతిండిపెట్టియే, నేము రుగ్ణులకు
సేమంబు గూర్పఁజూతుము వైద్యులందఱు, చేయుదు రిట్లె
నామాట వినవేని సమయు నీయమ్మ; డెం, దము ఱాయి చేసి
యేమెయిన్ గందు నీచా వనెన్ దీంద్రించు, నెద ననసూయ ! 74

నాపల్కు విందువా నేను నాయింతి నీ, నారి కోల్మానుట
కోపినంతశ్రమింతు మొందు సెప్పెదవేని, యుగ్మలితోడ
వేపొ మ్మిచటు వాసి నాచేత నీమాట, వెండి పల్కించి
కోపంబు తాపంబు పెనుపకు మనెఁ గలం, గుచు ననసూయ ! 75

పిదప మోహనదాసు వసివాళ్లపాలయి, పెనువెతల్ గుడుచు
సుదతిచెంగటి కేగి వెజ్జుధోరణి నామె, శ్రుతి వైచి మాంస
మదిరాదు లీకొందువా యనఁ గస్తూరి, మగనికి మ్రొక్కి
మదిగట్టితనము పొంపిరివోవ నుడివె ని, మ్మయి ననసూయ ! 76

వలదు మాంసరసంబు వలదు మద్యంబు పూ, ర్వభవంబునందు
నలంగి సాధించినపుణ్యాల ఫలముగా, నా కబ్బినట్టి
వెలలేని మానవీకాయంబు నపవిత్ర, విధి కీడ్వనొల్లఁ
గలుషాన్నముల నిల్పు తను వూన, ననియె ను, గ్రత ననసూయ ! 77

నీచాన్నముల కియ్యకొనక నాపాటించు, నియమంబు విడక
నీ చేతులం దేను మరణింతునేని యీ, నిఖిలజగంబు
నాచరిత్రను మెచ్చు నశ్వరంబగుమేను, నీకేల, కీర్తి
యాచంద్రతారకం బలరుఁ, గోరెద నిదే, యనె ననసూయ ! 78

మగఁ డంతఁ గస్తురీ ! యొకమాట వినుము నా, మతము నీ విట్టి
నెగులునం బాటింపఁ బనిలేదు, గోరముల్, నెగసిన ప్రొద్దు
తగునిద్ది తగదిద్ది యనుచింత మాని హైం, దవు లామిషంబు
నగునని తినుచుంద్రు కొంద, తీవెఱుఁగవా, యనె ననసూయ ! 79

ఎంతచెప్పిననేమి యింతి పట్టినపట్టు, నిసుమంత విడక
కాంతునిం గని నన్ను నాశ్రమోర్వికిఁజేర్చి, కరుణింపు మనుడు
నెంతేనివగచి మోహనుఁడు వెజ్జుం గని, యిఁక సెలవిందు
పంతగింపకుఁడనె, వేల్పుపైనిడె నెల్ల, బరు వనసూయ ! 80

నిప్పుకల్ గ్రక్కుచు వెజ్జు గాంధిని జూచి, నీవంటిమగని
నిప్పుడమిన్ గానఁగస్తూరి యేపాటి, నెవ్వయు సైఁప
దిప్పుడు మీ రేగుబాటయు విషమంబ, యీామె యేమౌనొ
తప్పదు కీడు మూర్ఖుల కనె ధార్మికో, ద్ధతి ననసూయ ! 81

మందుఁడా ! కొంపకు నిప్పంటుకొన్నపి, మ్మట బావిత్రవ్వి
పొందుమే లుండునా యనియు వాక్రుచ్చె; న, ప్పుడు గాంధి మౌని
చందాన నిల్చి కస్తూరిని నరుఁ డీడ్చు, శకటమందునిచి
క్రందురానిపథానఁ జేర్చెను బొగబండి, కడ కనసూయ ! 82

సతిని మోహనదాసు తనచేతులన్ ధూమ, శకట ఘట్టమున
నతిజాగరూకత మోసి పెట్టియ నుంచె, నాదరం బెసఁగ;
జతలేనివానయా సాగె నప్పుడు గుండె, జాతినపతికి
నతివయే ధైర్యంబు గఱపె నే నలయలే, దని యనసూయ ; 83

కలఁడీశ్వరుండా ర్తజనులను రక్షించు, కారుణ్యరాశి
వలదు మీ కావంతవంతయు ననియె, న, వ్వాకులన్ గాంధి
యలరెఁ, గస్తురి యెంతనేర్చె నహో ; యని, యబ్బురమందె
తొలిపున్నెములపంట యిది యనుకొనియెఁ దో, డ్తో నసూయ ; 84

అఁగె రైలు ఫినిక్సునం; దాశ్రమస్థు లై, దార్గురు వెలఁది
బాగెంచి యపుడు డోలీతోడ వచ్చిరి, పైదలి నలఁత
మూఁగనిగతిఁ జేర్చి రునికిపట్టున కంత, మోహనదాసు
సాగించె వైద్యంబు సడిసన్నజలచికి, త్సకుఁ దనసూయ ; 85

తొట్టివైద్యం బనుకూలమై ధీరక, స్తూరి కారోగ్య
మిట్టలంబుగ దక్కె, బ్రదికించుకొంటి నే, నింతి నటంచుఁ
గట్టలేనిముదమ్ము గాంచి మోహనగాంధి, కార్యకర్మములు
పట్టె నయ్యాయితావుల కేగి హితులు తో, డ్పడ ననసూయ ; 86

స్వామి యొక్కండు గాంధియును గస్తూరియుఁ, జావు పై కొన్న
నామిషంబును ముట్టరా దన్నకట్టడ, కగ్గమై యుంట
సేమంబుగాదని యొక్కనాఁడు ఫినిక్సు, చేరి ప్రసన్న
తా ముద్ర వెలయ నిట్ల నియెను వారి క, త్తతి ననసూయ ; 87

పలలంబు దినినఁ బాపమురాదు, రోగాల, పాలయి బ్రదుకు
నిలుచునో నిలువదో యని తోఁచినప్పుడే, నియు మీ రయారె ;
పొలసుముట్టరు, మనుధర్మ శాస్త్రంబు మీ, పోకడ కెదురు
పలికెడి, ననిన నమ్రతమెయిన్ గస్తురి, పతి యనసూయ ; 88

తినఁదగ్గ దిది యిది తినరాని దని భోక్త, తేల్చుకోవలయుఁ
జన దిందు లాఁతివారలతీ ర్పనన్ లేమ, స్వామి ; మీనుడికి
వెలయిచ్చి మనుటకై నంజుదు దిననొల్ల, వెడలుఁడు ; నన్నుఁ
దలయేరుపా ల్సేయకుం డనె మెత్తమె, త్తగ ననసూయ ; 89

## చెఱసాలకు

పదపడి సత్యాగ్రహాచార్యుఁ డాఫ్రికా, ప్రభుత నెదిర్చి
మొదటిసారిగ నేగెఁ జెఱసాలకున్ దన, మొన వెంట నడువ (1908)
నది సంయమికి నిష్టమగు కట్టుపాటుల, కందగా నుంట
నెద నుబ్బె నిది పెద్దమేల్గదా యని విశ్వ, హితుఁ దనసూయ ; 90

నల్లబందాలకు రవిక్రుంకువేళ బో, నంబు వడ్డింతు
రొల్లరు లవణంబు కారంబు కూరలం, దొక్కింత చేర్ప
నల్లవో ; తేనీరునిడ రధికారు లీ నడత సన్యాసి,
యుల్లంబు నలరించుఁ గాని బాధించు న, న్యుల ననసూయ ; 91

ఉప్పుతోఁ గూరల నుడికించి కారము, నొసఁగుఁడు కొంచె
మిప్పాటి కియ్యకొం దని బంధితుల్ పల్క, నిరు విందులకు
నిప్పట్టునకు వచ్చితిరె యని బందివె, జ్జించుక కరఁగి
యొప్పుకోల్ చూపె నుప్పునఁ గూర లుప్పుట, కో యనసూయ ; 92

కావలె నని పూను తిండికట్టడవంటి, కట్టడల్ మదికిఁ
జేవగూర్చును గాని చెఱసాలనియమాలఁ, జిక్కి కోరికలు
చావనిదశఁ బూను సంయామ మేమాత్ర, సత్వ మిచ్చు నని
భావించె గాంధి యత్తఱిని జిజ్ఞాస యే, ర్పడ ననసూయ ; 93

## ఆహార నియమము

ముగిసెను జెఱసాలకాఁపురం బిలుసేరె, మోహనదాసు
దిగనాడెఁ దేనీరు, రవిక్రుంకుటకుమున్నె, తినుట సాగించె
నగుఁగాని లవణంబు విడఁడయ్యె, నపుడు దే, హబలంబు మృగ్య
ముగనుండఁ దగదు ప ప్పనియును గనె గ్రంథ, ముల ననసూయ ; 94

ఐనను లవణంబునట్లు పప్పును దన, కాశాస్య మగుట
దానికిన్ స్వస్తిపల్కుట కోడె, నంతలోఁ, దరుణిరోగమ్ము
కానిపించెను వెండియును దనవైద్యంబె, గాంధికావించెఁ
గాని యీసారి కాసంతకృతార్థతన్, గనఁ దనసూయ ; 95

ఉప్పుఁ బప్పును మాను టొండె నీయం దని, యువిదకుం జెప్ప
నొప్పక "యయ్యగారూ ; పేరుగన్నవై, ద్యుండుమీకుప్పు,
పప్పు వర్జ్యం బని పల్కిన విడుతురా",పలుమాటలేల
చెప్పుట సులభ మెవ్వరికేని యనియె న, చ్చెలి యనసూయ ; 96

సతిపట్లఁ దనకున్న మక్కువ నెఱఁగించు, సమయ మీనాఁడు
జతపడ్డ దని గాంధి సంతసంబంది బి, షక్కువా క్కేటి
కతివ ; నీవోడితి వేఁడాదిదనుక నే, నారెండు లేని
మెతు కారగింతుఁబొ మ్మనుదు నుల్కొదవె నా, మెకు ననసూయ ; 97

మన్నింపవయ్య ; నాతప్పు, నీమదిఁ గన్న, మగువన యయ్యుఁ
దెన్నుదప్పితిని వాగ్దోషంబు గావించి, తిని బప్పునుప్పు
నెన్నఁడున్ నేనంట, నిఁక నొట్టుమాట నీ, వెద విస్మరించి
నన్ను రక్షింపు మనెం జాన వినయావ, నత యనసూయ ; 98

మగువ నోదార్చుట మంచిది యని గాంధి, మది నూహచేసి
మిగుల మేలగు నుప్పుపప్పుమానిన నీకు; మెలఁత ; నా కేని
తగులగ్గు చేకూరుఁ గావున నాశప, థంబును ద్రోయ;
వగవకు మన నెట్టకేల కయ్యమ శాంతి, వడె ననసూయ ; 99

ఈకూటికట్టడ నింతిరోగవ్యథ, యెడసె; గాంధికిని
జేకూరె నారోగ్యపుష్టి, వెండియు వీని, సేవించుకోర్కి
పోకాడె సంయమప్రీతి రేకెత్తెనీ, పొలి కతం దలరి
కైకొనె నిత్యవ్రతమ్ముగా నీతిండి-కట్టనసూయ ; 100

పదపడి పాలుసైతము బ్రహ్మచర్యంబు, పాటించువాఁడు
వదలుట కర్తవ్య మని గాంధి ఫలములు, వాడఁ దొడంగె
నిదిగాక పేదగా బ్రదుకవలయు నన్న, యిచ్చతో విలువ
కొదవద్ద వేరుసెనగపప్పు దిన మొద, ల్కొనె ననసూయ ; 101

ఉపవాసముల నొంటికుడుపుల నపుడప్పు, డూనఁదొడంగె
నపవిత్రమగు చిత్తమును సంస్కరించు ని, య్యవి యని తలఁచె
అపు దాశ్రమంబునం దతనిపొత్తు వరించి, యలసెడివారు
నుపగమమ్మును జూపి లోఁగి రీకడిఁదిచె, య్యల కనసూయ ; 102

ఎల్లవారికిఁ బస్తుమున్నగు నేమముల్, హితము లౌననుట
చెల్ల దింద్రియముల నోర్వ, నీశ్వరుని వీ, క్షింప దీక్షించి
యల్లటపడువారికే గెల్పు నొసఁగు, గీతాచార్యుఁ డిదియ
తెల్లంబుగాఁ బల్కెననె గాంధి నెయ్యుర, దెస ననసూయ ; 103

## గురుత్వము

చదువునేర్వం దగ్గశాబకుల్ బాల లా, శ్రమమునం దుంట
మదినిడి వారికిన్ గురుఁడయ్యెఁ గస్తూరి, మగఁడు, నమ్రతయు
సదమలాచారంబు ధైర్యంబు తాల్మియు, సత్యనిష్ఠయును
మృదుతయున్ గరుణయుఁ జదువుతోపాటు నే, రిపె ననసూయ ; 104

మఱియు దేహపరిశ్రమము నేర్పె నేర్పెను, మలమెత్తుపనియుఁ
గఱపెఁ జెప్పులుకుట్టుటయుఁ దోఁటపనియుఁ బా, కములుదీర్చుటయు
మఱవరానిది తల్లిబాస యంచెఱిఁగించె, మౌక్తికశ్రేణి
యొఱపున వ్రాల్వ్రాయువారిఁ గావించె శి, ష్యుల ననసూయ ; 105

వలయుఁ బిన్నల కాత్మశిక్షయు నని గాంధి, పఠించే భజన
సలిపించె నీతికినిలయమ్ములగు కథల్, చదివించె, జగము
నలరించువారు గావలె ఛాత్రు లని తదీ, యాభ్యుదయంబు
వలచి రేయుంబవల్ నానాశ్రమంబులు, వడె ననసూయ ; 106

ఎంతదస్సిననేమి జవ్వనంపుఁబిసాసి, యేడ్తెఱనెదురు
పంతమ్ముచాలక యిర్వురు నైతిక, పతనంబు నంది ;
రింతకుము న్నెఱుంగనికొందలము గాంధి- యెద రేఁగె నీ యు
దంత మాలించినంతన కదున్ గంపించె, దా ననసూయ ; 107

తనప్రయోగంబు సత్యాగ్రహం బపుడప్డు, తాఱుమాఱై నఁ
దనరువంతకు వేయిరెట్లయ్యె గాంధిన, త్తఱి నేఁచువంత
మునుపె యీదొరతోడ మొత్తుకొన్నది "కుఱ్ఱ, మూఁకను నమ్మఁ
జన" దని కస్తూరి లోకజ్ఞతావిక, స్వర యనసూయ ; 108

ఎవ్వరికో శిక్షయేల నాకే తగు, నిదియని గాంధి
బువ్వ నేడుదినాలు బొత్తిగా విడి యొంటి, పూఁటనే తినుచు
నవ్వల నై దుమాసంబులు కడపుట, కంగీకరించె
దవ్వులకేగె నంతట దాసు నేర్చుకొం, దల మనసూయ ; 109

ఉపవాసములఁ గృశించుతపస్వి నమ్మహో, యోగి నీక్షించి
నపుడాశ్రమంబునవారిలో లజ్జయు, నార్తి యు రేఁగె
అపరాధములజోలి కిఁకఁ బోముపో మని, యశ్రువుల్ కురియ
శపథంబొనర్చి రందఱు గాంధిచెంతకుఁ, జని యనసూయ ; 110

## మంజరి

రఘురామయాఖ్యునిరాణి ; సద్వాణి, వినవమ్మ కస్తూరివిభునికావ్యమ్ము ;

## స్వదేశమునకు

భారతీయప్రజా ప్రాబల్యమతిని, సాగిన మోహనసత్యాగ్రహంబు
జగతి కబ్రముగూర్పు సాంపరాయికము, హింసనొల్లని కల్లనెఱుఁగనికయ్య
మాఫ్రికాదేశమం దాఁగుటకతనఁ (1914), దల్లి గడ్డకు గాంధి తరుణితోఁ గదలె
అపు డాంగ్లమహినున్న యనఘు గోకులుని, యిచ్చనుబాటించి యింగ్లాండు వలన
మాతృభూమికిఁజేర మదిలోఁదలంచి, కడలిపై c బయనంబుగావించి దాసు
లంపటల్ సైరించి లండనుచేరి (6-8-14), గోపాలకృష్ణుండు గోరాలఁజిక్కి
ఫ్రాన్సునందుఁ జికిత్స పడయుచున్నట్లు, విని వెచ్చనూర్చి కావింపఁగాఁదగిన
చేఁత యెయ్యదియని చింతయొనర్చి, శార్మణ్యులకు నాంగ్ల జాతివారలకు
సంగర మప్పుడే సాగెనుగాన, (4-8-14), గయ్యపుంబెడఁద కగ్గంపడినట్టి
యాంగ్లేయులకుఁ జేతనై నంతసాయ, మాచరించుట కృత్యమని విశ్వసించి
తత్పురినున్న సోదరభారతీయ, సంఘము నొకసభాశాలకుం జేర్చి
యీపోరిలో మన మింగ్లీ షువారి, కుపకారమొనరించు టుచితమౌ ననియె
ఈనుడుల్ విని కొంద ఱీదియేమి; గాంధి;

భారతోర్వీ దాస్యభర హేతులైన, తెలవారిజయము నర్థింతమా మనము ?
పరిహసింపదె యిట్టిపని సూచి లోక ?, మిపు దేలువారల నిఱుకునఁబెట్టి
మనమేలుగా వీరిమల్లడి నెంచి, కోరికల్ పండించుకొందము మనము
లేశమేనియుఁ దప్పులే దయా ; యిందు, నావుడు గాంధి యన్నలు ; శాంతినందుఁ
డిది తెల్లవారల నెదిరించి బిగిసి, బెదరించి మనయభీప్సితము సాధింపఁ
దగువేళ కాదు, యుద్ధమునిల్చుదనుక, మన మోర్మిచూపుట మంచికర్జంబు
మన మీవికొగ్గుట మాన్యకృత్యంబు, మనయుదారత సర్వమహి కప్డు తెలియు
మనసభ్యతను సర్వమానవుల్ మెత్తు, రిచ్చవచ్చినవార లీఁగుఁ డీచేఁత
ననవుడు దాసుప ల్కొననువారు, పలువురు నిల్చి రాపరిషత్తునందుఁ
జెచ్చెర నేర్చడె సేవాదళంబు, దిట్టలు కొన్నాళ్లు దిద్ది రాదందు
నది రణక్షతగాత్రులై నయోద్ధలకు, నెదతోడఁ దగునూడెమెల్లఁ గావించె
నుజ్జగించెను దిండి నొక్కొక్క రేయి, యిదిరేయి యిదిపగ లిదిభార మనక
యార్తుల సేవించె నధికారు లలర, దుర్భరశ్రమమునం దోఁగుటకతన
శ్వాసకోశము లుబ్బి శక్తి యడంగి, గాంధి మంచముపట్టెఁ గడుజాలిగూర్చెఁ
గావించువైద్య మక్కఱకురాదయ్యెఁ, గదియంబడెను మంచకా రంతలోన

నిఁక మీరు మీనేల కేగుట లెస్స, సైఁపలే రిచ్చటిచలిపీడ మీరు
వినుఁడు నాపల్కుని వెజ్జు ప్రార్థింపఁ, బొలఁతుకతో దాసు బొంబాయిచేరెఁ
దలఁగెఁ దచ్చింత లంతట ననసూయ ;

ఆరోగ్య మది యెంతయలఁతిగా నున్నఁ, బ్రీతిమై గోపాలకృష్ణుఁ డేతెంచి
కదలితీరమ్మునఁ గస్తూరిమగని, కెదురుకోల్మన్నన లిచ్చుమై సలుప
నది పర్వమాయె సత్యాశ్రయుమదికి, ఎపుడోపదేండ్లనాఁడెడఁబాసినట్టి
తల్లి గడ్డను గాంధి దర్శించినంత, నబ్ధికై వడిఁ బొంగె నతనియుల్లంబు
బొంబాయిపురిని గాఁపురముసాగించు, ఘూర్జరు లొకసభం గూర్చి మోహనుని
విశ్వ సేవానిష్ఠ వినుతించి రపుడు, బంధువుల్ మిత్రులు పలువురునిల్చు
రాజకోటకుఁ బ్రజారాధకుం దరిగి, పతిహీనయై దుఃఖభరమునఁ గ్రుంగు
వదినియ నూరార్చి వరణీయచరితు, గోపాలకృష్ణగోకులు నిజాచార్యుఁ
బూనాపురిం గని పూజింప నతఁడు, సోదరా ; భారతక్షోణినల్గడల
వసియించుప్రజల జీవనరీతిఁ జూచి, తలఁపులెఱింగి కర్తవ్యనిర్ణయము
గావింపు మన నగుంగా కనె గాంధి, పదపడి రవికవిప్రభుని వీక్షించి
తత్కృపం బడసి యూతనిశిష్యకోటి, తనకూడుగూరలు తానె వండుకొని
తినుట మే లనుడు శాంతినికేతనంబు, సొంతబానసముతో శోభ గడించె
గురుకులంబున దీనఁ గొన్నాళ్లునిల్చి, కొంతసంస్కృతి నేర్పఁగోరుదాసునకు
విధియెదురై మేనువిడిచె గోకులుఁడు, తల్లి వోయినలేఁగ తల్లడకుడుచు
పోల్కి గాంధి తలంకి పూనాకుఁజేరి, గురునపరక్రియల్ కొసముట్టుదనుక
నవ్వీట నిల్చి యహమ్మదాబాదు, నగరంబునకు వచ్చి నాలుగుదెసలు
పరికించి తనయున్కిపట్టుగా దీని, నాదరించుట లెస్స యని విశ్వసించి 1

## సబర్మతీ తీరమున

దీవ్యత్సబర్మతీతీరమ్మునందు, సత్యాగ్రహాశ్రమసంజ్ఞఁ జెలంగు
నాశ్రమంబును నిల్ప నర్థవద్గణము, తగుసాయ మొనరింపఁ దలపడెఁ దాని;
కది విశ్రుతంబాయె నల్లల్ల మహిని;, ఒక మాలజంట మీయునికిలో నుంట
కంగీకరింతురా యని తన్నుఁ గోరఁ, దలయూఁపె మోహనదాసు వేవేగ
సమ్మతింజూపి రాశ్రమసభ్యులెల్ల, వచ్చె దూదాబాయి వనితతో నపుడు,
తలఁదాల్చె నాశ్రమధర్మంబు లాతఁ, డిది పురమ్మునవారి కిష్టంబు గామి
మానిరి వా రాశ్రమము నాదుకొనుట, యెల్లి వంటకు నూక లిల్లె యటంచు
మగనలాల్ కస్తూరిమగనికిం దెల్పె, మంచిది ; గూడెంపుమందిలోఁ జేరి
కూలి పనుల్చేసి కూటిసమస్య

చక్కదిద్దుద మేలజంకుటమనకుఁ, గట్టుఁడీమూటలు ; కదలుఁడీ ; యనుచుఁ
జిఱునవ్వుతో గాంధి చెప్పెడివేళ, నొకకుఱ్ఱఁ దేతెంచి యోయయ్య ; నిన్నుఁ
గనుటకు నొకసాహు, కారులో వచ్చి, నడవలో నిల్చియున్నాఁడు, నిన్బిల్వ
ననుఁబంపినాఁడని నవభారతర్షి, కెఱిఁగింపఁగా వీథికేగె మోహనుఁడు ;
సెట్టి గాంధిని జూచి చిన్నారినగవు, మొగమున మొలకెత్త మ్రొక్కి యిట్లనియె. 2

## దేవునిదయ

ఓయన్న ; యాశ్రమాభ్యుదయమ్ముకొఱకు, నించుక తోడ్పడనెంచి వచ్చితిని
మన్నింతురా నాదుమదిని మీ రనినఁ, దప్పక మీవాంఛితము నియ్యకొందు
మిప్పుదు మాచిక్కు లెన్నేనిగలవు, వార్చుచున్నాము మీవంటిసజ్జనుల
దయ కని మోహనదాసు వచించె, వణిజుండు వెండియు వత్తు రేపనుచుఁ
గదలి చెప్పినరీతిఁ గామక వచ్చి, చిఱుతవానిని గాంధిచెంతకుం బంప
సరగ నయ్యనఘుండు సాహును గదిసె, పలుకుల దెసఁబోక పదుమూఁడువేల
రూప్యముల్ గలసంచి రుచిరాత్ముఁ డతఁడు, మోహనునకునిచ్చి మునిపోలె వెడలె
భగవత్ ప్రసాద మీబాసట యనుచు, వినతుఁడయ్యెను గాంధి వేల్పున కెడఁద
నొచ్చెమెద్దియులేక మొకవత్సరంబు, బండినీడ్చుట సులభం బని తలఁచె
మాలపల్లెకుఁ జేరుమాటను మఱచె; 3

## బీహారు

ఆవెన్క దాసు బీహారున కేగి, యచట భూస్వాములౌ నాంగ్లవర్తకులు
సేద్యగాండ్రకుఁ దమసిరి పెంచు నీలి, పంట పండించుచు బడలు పేదలకుఁ
దా మిచ్చుకూలి తద్దయు నల్పమగుట, యెఱిఁగి రైతులఁదేర్ప నెన్నేనివెతలు
సైఁచి సత్యాగ్రహసరణియుం ద్రొక్కి, జయమంది సడిసన్న సాధుతామూర్తి
రాజేంద్రబాబుగారవము నార్జించి, శౌచంబెఱుంగని సైరికులుండు
పల్లెలలో నిల్పెఁ బాఠశాలలను, వాడలలో నిల్పె వైద్యశాలలను,
మరలె సబర్మతీమందిరంబునకు; 4

## ఖేడా

అంతలో ఘూర్జరమం దొకసీమ, ఖేడా యనం జెలంగెడిమండలంబు
బెట్టపాలై వెదపెట్టినగింజ, మొలవక కఱవుతో ముచ్చిరుచుంట
పంటపోయిన కాఁపుబాధల నుఱక, యేలువారు కరంబునిమ్మని యతని

హింసపెట్టుట విని యెదఁ గుంది గాంధి, ఖేదాకుఁజని మేలుగీడు లెఱింగి
దొరలబింక మడంగుత్రోవలు వెదకి, యేకీడువచ్చిన నేము పన్నీయ
మనుదిట్టతనముతో హాలికుల్ నిలుచు, నట్లు రంగముదిద్ది యసి కసి లేని
సత్యాగ్రహరణంబు సాగించె నంత, మెల్ల మెల్ల నడంగెమీసాలుత్రిప్పు
నధికారులయహంత, యాగడంబడఁగె, వీలున్నవా రరివెట్టుఁడీ యనుచు
దొరలు రైతుల వేఁడ దొరలేనిగెల్పు, పడసె సత్యాగ్రహాభండనంబపుడు
కర్షకుల్ తమశక్తి గనిరి, వినూత్న, చైతన్యమందిరి, సత్యం బహింస
పరమాస్త్రము లటంచు భావించి తనిసి, రెనలేనినాయకుఁ డీగాంధి యనిరి,
జనముక్తి నీతఁడే సాధించు ననిరి; ఈకథ యిట్లుండ నింగ్లీషువారు
పరఁగించు ప్రథమప్రపంచ సంగ్రామ, ముగ్రమై యవ్వేళ నుర్వి నుఖ్యాంత
లూఁగింపఁదొడఁగుట నుదరి వై స్రాయి, రండురండని వేఁడె రాచకర్జములఁ
బేరుపొందిన మనపెద్దలనెల్ల, గాంధియు నేగె నాకారితుం డగుచు 5

## యుద్ధమునకు సాయము

"మనప్రభుత్వమువారు మందలలేని, యిడుమ నున్నారు, మీ రీకష్టి నెఱిఁగి
స్వర్ణంబు సైనికశక్తి మున్నైన, చేవలు వారికిఁ జేకూరునట్లు
సాయం బొనర్పుఁడా ; జయ మబ్బురీతి", నని హస్తిపురవిభుం దడఁకువమెఱయఁ
గోష్ఠిలోఁ బల్కుడు గుణనిధిగాంధి, యితనికోర్కిని మెచ్చి యీసభయందు
నాలీద్వయంబు మహామహుఁడైన, గంగాధరుఁడు లేమి కడువెల్తి యనియె
పదుగు రౌనన ఖిలాఫత్తుసమస్య, నాంగిలేయులు దిద్దు టది పాడి యనియె
నధికారు లుబ్బి రీయన్నపల్కులకు, అయ్యెడ మోహనుం డాంగ్లరాజ్యంబు
నిపుడు కాపాడిన నిది రేపు మనము, కోరుపెత్తన మిచ్చి కూర్మినందించి
చాటును దనకృతజ్ఞత నని నమ్మె ; క్రన్నన ఖేదాకు గాంధి యేతెంచి
బంట్లుగాఁ జేరుఁడీ బవరాన కనుచుఁ, బల్లెలు పట్టణాల్ పగలు రే యనక
తిరుగాడి ప్రజల నర్థించుచున్ దగిన, కూడు చిక్కనిపూఁట గొదనోర్వలేక
వేరుసెనగపప్పు వేమాఱు నమల, నారోగ్యమున కిది హానిగావించె
నతిసారబాధ మోహనుపా లొనర్చె, మఱుఁగుదొడ్డి కితండు మాటిమాటికిని
బరుగెత్తి మంచానఁబడి స్రుక్కి స్రుక్కి, తప్పదుచా వని తద్దయు నమ్మి
యసురుసు రనుచుండ నాప్తులు వగచి, ఘనవైద్యు రావించి గాంధి నెట్లైన
బ్రదికింపు మని వేఁడఁబట్టినపట్టు, విడువక వె జ్జెన్ని వెరవులం గనిన
నెడయదయ్యెను దాసు నేఁచురోగంబు, తుదకు సామాన్యవైద్యుఁ డొకండు వచ్చి
కాచె గాంధిని మంచుగడ్డవైద్యమునఁ, బ్రకృతిచికిత్సలో c బరమానుభూతి

యతనికిం గల్మి నీయశ మావహిల్లె, తెగులుతగ్గెను గాని దేహయంత్రంబు
దుర్బలమ్మయ్యెఁ గస్తూరినాథునకు, పాలుద్రావిన వచ్చు బల మనె వైద్యుఁ
డవి నిషిద్ధములునా కనెమోహనుండు, కస్తూరి యపుడు రంగమునకు వచ్చి
మనియున్న నేకదా మనుజుఁ డేదేని, గణనీయమగుచేఁత గావింపనేర్చు
నినుఁజూడ నాగుండె నీరగుచుండె, నీదీనురాలిప లీవు మన్నించి
పాలుత్రాగుము ప్రభూ ; పాల్ త్రాగు మనఁగ, నెన్నఁడో శపథించి యేను దుగ్ధంబు
మానుటెఱుంగవా మగువరో ; నీవు, పాడిదప్పినవెన్క బ్రదు కది యేల
కాదందువా యని గాంధి వచించె, వనిత యంతట బాలువలదన్నవేళ
నావుపాలే కలవయ్య ; నీమదిని, కడునిక్క మీపల్కు కాదనలేవు
మొదవుపా లిపుడైన ముట్టకు మీవు, క్రోలుము మేఁకపాల్ క్రోలు మారోగ్య
భాగ్యంబు నందుము ప్రతినదప్పకయె, నావుడు గాంధి తన్నారీమతల్లి
తీర్పు గాదనలేక దేశంబుకొఱకుఁ, దా నిల్వవలె నన్నతమి వీడలేక
మెల్లన శిరమూఁపె మెలఁతపల్కునకు, నల్లన వికసించె నాతల్లి మోము 6

## రౌలటు చట్టము

రౌలటు నా నొప్పురాజనీతిజ్ఞు, నాధ్వర్యవంబుతో నప్పుడేర్పడిన
సంఘం బొనర్చిన చండశాసనము (18-3-19),
తలయెత్తె, దీనియాదరువుతో నితఁడు
సర్కారువారికి శత్రు వటంచు, నీనేలఁగలవాని నెవ్వానినైన
బందిలో నిడవచ్చు, బంధితుఁడైన, భారతీయున కిది పాటింపరాని
చట్టమయ్యా ; యని జడ్జిసన్నిధిని, విజ్ఞప్తిగావించువీలు నొసంగ,
దేలువారితెఱంగు నెదిరించుప్రాఁత, లున్నపత్రిక కిది యురిత్రాడువంటి,
దీపని సేయరా దిట నిల్వఁగూడ, దని యేనికే నిది యానలీవచ్చు,
వలసినగతి నొక్కవచ్చును బ్రజల ; నాంగ్లరాజ్యమునకు హానిగల్గించు
కుట్రలు భారతక్షోణి నున్నట్లు, నమ్మి యేల్బడివా రొనర్చి రీతెగువ,
రణములో మనపద్దరాపు లెఱింగి, యీమేలుచేసిరా యింగ్లీ షువారు
బాపురే ;యని గాంధి భారతభూమిఁ, బెక్కుతావుల కేగి పెదపెద్దసభల
రౌలటుచట్టంపురాయిడిన్ దెగడు, పనుల నీకొండని ప్రజల నర్థించె
హరతాళమున కొక్కయదను సూచించె (6-4-19),
నుపవాస మానాఁడు యుక్తమౌ ననియె
మనకోర్కి నేలికల్ మన్నింపరేని, సత్యాగ్రహంబును సాగింత మనియె
పాంచాలమున గాంధి పగటినపనులు, నిర్వహించెను ప్రజానీక మబ్రముగ
నిదివిని పంజాబు నీక్షింపవచ్చు, గాంధిపైనము నరికట్టిరి దొరలు (10-4-19) 7

## జలియనువాలా బాగు హత్యలు

దుష్కార్యమిది యని తుకతుకనుడికి, యమృతసరమ్మున కందంబు నిదుచు
జలియనువాలాఖ్యఁ జనుతోఁటయందు,
సాగించె సభను బ్రజానివహంబు (13-4-19)
ఖండించె నం దేలికలశాసనముల, దయ్యరు సేనాని టకటక వచ్చి
పరిషత్తుపై c బదార్వందలగుండ్లు, కాల్పించె రాకాసికరణి గర్జించె
నగ్నిగోళంబుల కాసభాసదులు, వసుధఁ గూలిరి నాల్గువందలమంది
చచ్చియుంజావని సందిగ్ధదశకు, వచ్చి మూలుగుచున్న వనితలు వృద్ధు
లర్భకుల్ "నీరు నీ"రని చేరపట్టి, వాపోవుదీను లిర్వదివంద లుండ్రు
కొండలు కరఁగె నీ ఘోరా ర్తిఁజూచి, సైనికరాజ్యంబు సాగె నిబ్భంగి,
నీప్రళయోదంత మెఱిఁగి వేవేగ, మోహనుం దేతెంచి ము న్నెట నెవరుఁ
జేయనిచెట్ట లాసీమపా లగుట, కని విని నిట్టూర్చి కలఁగుచునుండ
నమృతసరమ్మునం దతిరథుల్ బలియ,
నాయేఁటి కాంగ్రెస్‌మహాసభసాగె (1919 డిశంబరు)
అంగ్లేయులిచ్చిన యలఁతిపెత్తనము 8

## మాంటుఫర్డు సంస్కరణములు

నీకొనరా దనియెను లోకమాన్యుఁ, డిచ్చినదానితో నీనాఁడుతనిసి
ప్రజలలో నిగ్రహబలమును బెంచి, తరువాతఁ బూర్ణస్వతంత్రతం బడయఁ
దగునని మోహనదాసు నమ్రతను, తర్కంబు లటునిటుఁ దద్దయున్ రేఁగెఁ
దుదకు నెగ్గెను మహాత్మునినిర్ణయంబు, జయజయధ్వానముల్ సభను ఘూర్ణిల్లె
నపుడె భారతభూమి నలరుముస్లిములు, తమ ఖలీఫామాన్యతను ద్రోసినట్టి
యాంగిలేయుల పెంపు నాసించుపనులు, సాగింపరాదని సభలఁ బెక్కింట
నిర్ణయించిరి క్రుధాగ్నిజ్వాల లెగయఁ, గాలుమోపిరి నిరాకరణమార్గమున,
మోహనుం డిదిచూచి ముస్లిముల్ వేఱు, పరులు వేఱైనచో భారతావనికి
దాస్యంబు తొలఁగుట దబ్బఱ యనుచు, మదినమ్మి తనదారి మార్చె వెన్వెంట 9

## సాహాయ్య నిరాకరణము

దొరతనంబు నెదుర్చుత్రోవకువచ్చె, బిరుదాలబరువు తప్పించుకొం దనుచుఁ
బాయుఁడీ గౌరవపదము లటంచు, జీతాలనిచ్చు కుర్చీ మానుఁ డనుచుఁ
గొనకుఁడీ పెఱనేలగుడ్డనటంచు, నాసీమ కీసీమ కరిగి సోదరుల

కెతిఁగించెఁ గ ర్తవ్య మెన్నేనిసభల; నంతలో గీతారహస్యవిజ్ఞాత
కర్మయోగీంద్రుండుగంగాధరుండు, తిలకస్తమించె ధాత్రీజనుల్కుంద (31-7-20)
కదలేనివెతఁ జిక్కె గాంధి యానాఁడు, "నాతలం పెట్లున్న నల్గురు మెచ్చి
నిర్ణయించిన బాటనేనును వత్తు", నని యుదారచరిత్రుఁ డాలోకమాన్యుఁ
డన్నపల్కు దలంచి యశ్రువుల్ జార్చె;, అంతట నాలిద్వయమ్ముతోఁగదలి
హిందువుల్ ముస్లిము లేకమార్గమునఁ, బయనించి విజయంబు పడయుటొ ప్పనుచు
జాతీయమగు సేవ సల్పుచునుండఁ, గాలిఘట్టంబునఁ గాంగ్రెస్‌సదస్సు
ప్రత్యేకమైనది ప్రారబ్ధమాయె (4-9-20), చిత్తరంజను డెంతచేవ చూపినను
జయమందె గాంధి యీ సభయందుసైత, మితనిపల్కున కబ్బె నెనలేనివిలువ,
ఓటొసంగమి కోర్టునోరకుం జనమి, యింగ్లీషుచదువున కియ్యకోలీమి
ముఖ్యబహిష్కారములుగాఁ దనర్చె, వచ్చినవెన్నికల్ వంద నైదాఱు
సమ్మతుల్ పడసి దేశమ్మును మఱచి, గద్దెలకెక్కిరి ఘనులప్డుకొంద (20 నవంబరు)
రంత నాగపురమ్మునందుఁ గాంగ్రెస్సు, నడచె సాధారణన్యాయంబుపట్టి (20 డిశంబరు)
గాంధితెచ్చిన నిరాకరణపద్ధతుల, కిది ముద్రవైచుట యెన్నఁగాఁదగిన
పని యౌట మోహనుబాట నీకొనని, చిత్తరంజనదాసు సిరిగలవాఁడు
ముప్పదార్వేలసొమ్మును వెచ్చ పెట్టి, తనకు జేకొట్టంగఁదగినవారలను
బలువురఁ దెచ్చె నీపరిషత్తునకును, ఖదరువల్వలు దాల్చి గరితలు పురుషు
లెల్లమతాలవా రిందుఁ బదాఱు, వేలు పాల్గొనిరి నవీనతేజమున
రాజకీయపధాన రాణగన్నట్టి, విజయరాఘవుఁడు కోవిదవతంసంబు
నడ పె నీసభను జనం బహో ; యనఁగ, తెలవారు పాపభీతి రవంతలేక
పాంచాలమున హింస పరఁగించుకతన, నల ఖలీఫాహక్కు లణఁగించు కతన
సహకారవిముఖమౌ సరణి కీకొంట, యావశ్యకంబయ్యె నని వల్కుకంటె
నెల్లయర్హతలున్న హిందూధరిత్రి, కాంగిలేయులు స్వరాజ్యము నీమికతన
నీదారిత్రొక్కితి మే మనుటొప్పు, నని సభాపతిపల్క నలరిమోహనుఁడు
తననిర్ణయంబును దగునట్లు మార్చె, చిత్తరంజనుండును శిరమూఁపె దీని
కౌనసె లజపతి యావేశ ముడిగి, పండితమోతిలాల్ బాగుబా గనియె
మదనమోహనుఁడు పాల్ మజ్జరే ; యనిరి, అద్వితీయజయంబు నందెనుగాంధి
యితనిపై నెవ్వరి కీసురాదాయె, నీయుదారత గోష్ఠినెల్ల రంజించె
శాంతిబద్ధము న్యాయసమ్మతమైన, సరణిలోఁ గాంగ్రెసు జయమందవలయు
నన్న మోహనువాణి కలఁతులు వలఁతు, లెల్లరు తలయూఁపి; రిదిమెచ్చి గాంధి
సత్యం బహింసయు స్వప్నమందేని, మఱవకుఁడన్నలు! మనకాంగ్రెసునకుఁ
బ్రాణంబులే యివి యని విన్నవించె, త్యాగముల్‌చేయక దాస్యంబుతొలఁగ

దని హెచ్చరించె సాహాయ్యనిరాక, రణ రణభేరి భారతభూమినెల్ల
దెసలఁజాటఁగ బయల్దేతెె నయ్యోద్ధ; పరదాస్యర క్తికిఁ బాదైనచదువు
నింగిలీసునుమాసుఁ డిది భారతీయ, సంస్కృతినణఁగించు సకలవిధాల
మద్యంబుమానుఁడు మానుఁడుకోర్టు, నింటింట రాట్నంబు నేర్పాటుచేయుఁ
డెన్నికల్‌దెసపోకుఁ డేలువా రిడిన బిరుదులు వదలుడు పీఠముల్‌వదలుఁ
డెల్లమతాలవా రేకోదరులుగ, బ్రదుకుసాగింపుఁడు పదయుఁడుముక్తి
మానవతావాదమహిమం బెతింగి, యంటరానితనంబు నటుత్రోయు టొప్పు
నను గాంధిసందేశ మాలించి ప్రజలు, తనిసి జాతీయవిద్యామందిరములు
పాదుకొల్పిరి, పాడిపట్టులు విడిరి, సమకూర్చుకొనిరి పంచాయతిసభలఁ
గ్రొత్తపుట్టువు నందుకొనిరి మేన్‌విడక ; యేలువా రీపొంగు నీక్షించికలఁగి
బందింపఁదొడఁగిరి ప్రథగలవారిఁ, గసివోకచంపిరి కాల్చి కొందఱను
కాంగ్రెసువా రంతఁ గర్తవ్యమరయ 10

## బెజవాడ తీర్మానములు

వచ్చిరి బెజవాడపట్టణంబునకు (31-3-21), గాంధిమున్నగువారిఁ గనుట కానాఁడు
వేద్కమైఁ దెలుఁగువా ర్వేనవేల్మంది, కదిసిరి కనకదుర్గాదేవిపురిని
ముదుకవల్వాలుదాల్చి ములుగట్టుదాల్చి, సభకువచ్చిన వీరిచంద మీక్షించి
భారతస్వాతంత్ర్యభాగ్య మీ ప్రజలె, సాధింపఁగలరని నడిసన్నవారు
లజపతిరాయ్ మోతిలాల్ వంగనేత, యాలిసోదరు లెంచి హర్షంబుగనిరి
వాలుఁగట్టును జపావర్ణంపుఁబాగఁ, గిట్టుచెప్పులఁ దాల్చి కృష్ణుఁ డానాఁడు
తెల్గుదళంబును దిద్దుచుం బ్రజల, యభినుతుల్ గడియించె నాంధ్రరతనంబు;
పెద్ద లంతటఁ దిలక్‌పేరన్ స్వరాజ్య, నిధి కొకకోటినాణెముల నార్జింపఁ,
గాంగ్రెసుసభ్యులుగాఁగోటిమంది, ప్రజలసమ్మతి పొంద, రాటంపువరవళి
యిరువదిలక్షలయిండ్ల మ్రోయింప, నిర్ణయించుచు జూనునెలతోడఁ దీర్పు
లివిమూఁడు సాధింప నిడిరొకమేర, యేలువా రిడునాజ్ఞ లివు దెదిరింప
వలదని కస్తూరివల్లభుం డనఁగ, సభ్యు లంగీకృతిం జాటిరి సరగ,
వెలయించెఁ బింగళి వెంకయ్యచేతఁ, బ్రణుతులందిన దేశభక్తునిచేత
శిల్పకళాసుప్రసిద్ధునిచేత, గాంధి యత్తఱియందె కాంగ్రెస్‌పతాక,
అంత గుంటూరుమున్నగుపురంబులకుఁ, జని మహాత్ముఁడు తెల్గుజనులిచ్చురూక
లాభరణంబుల నందుచు నొయ్య, నేలూరికింజేర నిద్ధచరిత్ర
మాగంటియింటి శ్రీమతియన్నపూర్ణ, మంగళ సూత్రంబుమాత్రమ మాని
భక్తిమైఁ దనమేనిబండెఁడునగల, నాయయ్య కర్పించె నరమరలేక
గడువుదాఁటకముందె కాంగ్రెసువారి, నిర్ణయంబులుమూఁడు నెఱపంటపండె
నుప్పొంగె దేశ మీయుద్ధతిం జూచి, దేశభక్తికిని జాతీయత్వమునకుఁ

జిహ్వామై యలరారెఁ జేతినూల్వులువ, జగ మహో ; యనె గాంధిజయము నీక్షించి
బెదరి రేల్బడివారు బెగ్గలంపడిరి, అనసూయ ; వినవమ్మ ; యపుడు వై స్రాయి
రీడింగు గాంధి నాదృతితోడఁ బిలిచి, యాయాసమస్య లాయయ్యతోఁ దడవి
ముప్పులుపదివేలు మూఁగినన్ గాంధి, వదలఁడు సత్యంబు వదలఁ దహింస
శాంతిభంజకమైన సరణికింబోవఁ, దని విశ్వసించి యన్నా ; భవదీయ
కార్యక్రమంబు నిక్కమును జంపమిని, బాటించువఱ కడ్డుపడను నే ననుచు
నాలీద్వయం బటనట హింస రేఁపు, నుడు లాడుచుంద్రు కనుంగొను దీని
నని యొకపత్రంబు నయ్యకుంజూప, గాంధిసిగ్గిల్లి చెంగటనున్న యన్న
దమ్ముల నిదియేమి తగనిపల్కేల, పల్కితి రన శాంతిపాటింతుమేము
మాపల్కులో హింస మప్పుభావములు, తోఁచిన సిగ్గిల్లుదుము నెగుల్పడుదు
మని వారునుడువ మేలనెను రీడింగు; వచ్చె నంతటఁ దిలక్వర్ధంతి ప్రొద్దు (1-8-21)
వాసరంబది పరవసుధ నెర్పడిన, వలువలం గాల్చెడువాసరం బాయె 11

## విదేశవస్త్ర దహనము

నఖిలభారతభూమి నమ్ముహూర్తమున, సాగె విదేశవస్త్రము లేర్చుజన్న;
మానాఁడు మగవార లాఁడువా రిడిన, వెలలేనివల్వల వినువీధికంటు
ప్రోగైనవల్వల బొంబాయిపురిని, గాల్చుచు గాంధి యుత్కటహర్ష మంది
వేయేండ్ల నుండి యీవిపులా ప్రజాళిఁ, గారించుదాస్యంబు కటకటా ; యనుచుఁ
జచ్చుచున్నది; యీశ్మశానాగ్నినుండి, భారతస్వాతంత్ర్యభాస్కరుం డుదితుఁ
డగుఁజూఁడీ ; యనఁ బౌరు లతివేలహర్ష, కలితులై వినుప్రీలఁ గరతాళరవము
లొనరించి యొనరించి యూఁపిరి పురిని, కదలుకొన్నది నిరాకరణోద్యమంబు;
సైరణవీడిరి సర్కారువారు, కాంగ్రెస్ప్రచారంబు గావించుభటుల
బాధింపఁదొడఁగిరి బందికినంపి; రేచెట్టచేసిన నీయువల్ కినియ
కెదురుపల్కాడక యిడుమ లీకొనిరి, ముస్లిములందఱు మొనవీడివచ్చి
తమదేశభక్తిని ధరణికిం జాట, నగు నటంచు మహమ్మదాలి యానాఁడు
గర్జించెను గరాచికటకంబునందు; ఇది యోర్వఁజాలక యేల్పడివార
లాలీద్వయంబునుహాళహాళింబట్టి; రంతతోనాఁగక యతిరథులైన
ముస్లిముల్ పల్వుర ముట్టిబాదించి; రపుడు దక్షిణభారతావనియందుఁ
గాంగ్రెస్ ప్రచారంబు గావించుగాంధి, యీవార్తవిని దొర లింతచేసినను
బ్రజలు సంయమదీక్ష పాయమి కలరె, తిరుచనాపల్లి కే తెంచిననాఁడు
ప్రజమేన ఖద్దరుబట్ట లేకున్కి, కెంతయుదురపిల్లి యీదోసమునకుఁ
దాన బాధ్యుండని తలఁచి దోవతిని, జొక్కాను టోపీని స్రుక్కకమాని
కొల్లాయి కండువా కోరిధరించి, తననేరమికి శిక్ష తాన వైచికొనె;

అప్పుడు కాంగ్రెసువార లర్హతయున్న, మహి సాగవచ్చు సమష్టిశాసన తి
రస్కార మనుడుఁ బేర్గన్న పల్నాటి, హోలికుల్ కనెగంటిహనుమంతుపల్కు
పాటించి పుల్లరిన్ బ్రభుత కీమనిరి, వీరితీరునెఱుంగ వెడలినవారి
నున్నవసర్దారు నుత్తమాచార్యు, నరసింహు బంధించినా రేలువారు
కసివోక చంపిరి కనెగంటిహనుమ; నాంధ్రరత్నము నేతయైనిల్వ నాఁడు
చీరాలఁ బేరాలఁ జెలఁగుగృహస్థు, లింటిప న్నీమని యెదిరించిదొరల
గాంధికిజే యంచుఁ గారకుంజనిరి, మునుముందు చనినట్టిమొన కలంకృతిగ
నలమేలుమంగమ్మ యనువృద్ధ కలదు, సకలభారతభూమిఁ జట్టముం ద్రోసి
చెఱసాల కేగినస్త్రీలలో నీమె, మొదటిదియై తెల్గుముదిత కపూర్వ
యశముగూర్చిన దంట యబ్రమ్మగాదు, కరిపురంబునఁ గ్రొత్తగా బయల్పడిన
శాసనసభకు నాశాసనం బిడఁగల, బ్రధితిగాంచినరాజబంధు వత్తతిని
గాల్మోపె బొంబాయిఘట్టమ్మునందు; కానాటు నాఁడగుగఱువకీతనికిఁ
బ్రజలు వైముఖ్యంబు ప్రకటించుకొఱకు, హరతాళమొనరించి రన్యానసరణిఁ
బోలీసువారి కప్పుడు మతిపోయి, కాంగ్రెస్ఖిలాఫత్తుగణములమీఁది
కగ్నిగోళంబుల నంపి రెన్నేని, ప్రజలలో నిగ్రహబలమెల్ల ఁ దొలఁగె
రక్షకభటులపై ఱాల్వాన గురిసె, వీధులలో నెత్రువెల్లువల్ పొంగె
గాంధి తద్దయుఁ గుంది కడుసిగ్గునంది, ప్రజలపాపమునకుఁ బాచితంబనుచు
నైదునా ళ్లుపవాస మంగీకరించె, వారాన కొక ప్రొద్దు వలచె మౌనంబు
అఁపుఁడు సత్యాగ్రహం బాఁపుఁడనుచు, బార్డోలివారికిఁ బంపెనువార్త 12

## నిర్బంధములు

కాంగ్రెస్ఖిలాఫత్తుగణములు రెండు, చట్టమొప్పని సమాజంబు లటంచు
నేలువార్చాటిరి యెల్లసీమలను, ప్రజలు దీనినెదిర్చి బందిగంబులకుఁ
జనిరి వేలకువేలు సర్వరాష్ట్రములుఁ, జనె మోతిలాల్ చనె జవహరలాలు
చనె లజపతిరాయి చనె వంగనేత; అంతఁ గాంగ్రెసువా రహమ్మదాబాదు
సభలో సమష్టిశాసనతిరస్కృతికి, నియ్యకోల్ ప్రకటింప నిత్తఱియంద
పోలీసువారికాల్పులు పై ఁపలేని, ప్రజ "చౌరిచౌరా"ను బఱుత నీకొనియె,
పెద్దలనుడి వీడి పెడదారిఁబట్టె; ఈవార్త విని గాంధి యెంతేని కలఁగి
శాసనధిక్కృతి చనదు నేఁ డనఁగఁ, దెల్గువా రాఁగక దేశనాయకుని
వెంకటప్పయ్యను విశ్రుతాచారు, నయ్యసన్నిధికంప నర్హతయున్న
నేల్పడి నెదిరింపుఁడీ ; యనెగాంధి ; 13

# పెదనందిపాడు

పదపడి పెదనందిపాటినల్లడలఁ, గలరైతులెల్లరు కాంగ్రెసుజోదు
పర్వతనేని సద్వంశ రత్నంబు, వీరయ్యచౌదరి విభుఁడుగా నిల్వ
గాంధీకిజే యని కరనిరాకరణ, దీక్షపూనిరి గుండెదిట వున్న కతన (21 డిశంబరు)
పాలకు లీపోటు భరియింపలేక, పంపినసైనికుల్ పల్లెకేగి
కాఁపుల కెనలేని కడగండ్లుగూర్చి, రవమానములుగూర్చి రతిదారుణములు
గుణ్టాలతోఁకలకున్ గట్టి యువల, నీడ్చిరివీథులం దెదలేనిజంతు;
లెంతచేసిననేమి కృషికులతాల్మి, యణుమాత్రయును దగ్గదయ్యె నయ్యదనఁ
గరణముల్ గ్రామాధికారు లానాఁడు, మానిరిపీఠముల్ మదిజంకులేక
యెందఱోచెఱకేగి రీకయ్యమందు, జగమెల్లమెచ్చె నీసాహసస్ఫూర్తి
మహియెల్ల నుబ్బె నీమగఁటిమిన్ దెలిసి, అంతఁ గాంగ్రెసువార లౌగాములరసి
భారతావనినెల్లఁ బాటించిచూచి, పన్నులిం దని నందిపాటికర్షకుల
కాదేశమును బంప నాఁగె నీదురము, కర ముమ్మలించిరి కర్షకులపుడు;
విను మనసూయమ్మ ! వేమాఱు గాంధి, వలదు చట్టము ద్రోయవల దనుచుంట
విసిగివేసారి తెల్విదొఱంగి ప్రజలు, గౌరవింపరు నేఁడు గాంధి నటంచు
నతనిఁబట్టఁగ నిదేయదనుపొ మ్మనుచు 14

# గాంధినిర్బంధము

నూహించి దొర లాశ్రమోర్వికి నేగి, బంధితుంజేసిరి బాపును నిసిని; (10-3-22)
వైష్ణవగీతంబు వరణీయగీత, మాలపించుచు గాంధి యధికారివెంట
నేగినంతట జడ్జి మృదులోక్తు లలర, నీవు రాజద్రోహి వేల్పడినెదురు
నడవలోఁ బ్రజలను నడిపించినాఁడ, వేమందు వని గాంధి నీక్షించి పల్క
నిక్కంబు నిక్కంబు నీమాట యనుచు, బాపు వచించె నిబ్బరికంబు మెఱయ
నాఱేండ్లు చెఱనుండనగు నీవటంచు, నానతిచ్చె నహమ్మదాబాదు జడ్జి (18-3-22)
సత్యం బహింసయుఁ జక్కఁబాటించి, కడఁకమై నిర్మాణకార్యక్రమంబు
సాగింపుఁడని నెమ్మి జనతకుం బల్కి, పూనాకుఱంగటఁ బొల్పారుచున్న
యెరవాడచెఱసాల కేగెనుగాంధి; 15

## స్వరాజ్యపక్షము

శాసనసభలకుం జని నిరాకరణ, కార్యక్రమంబు నక్కడన సాగించి
దేశంబునకు దీప్తిదెచ్చు టొప్పనుచు, నపుడు కొందఱు పెద్ద లాత్మనూహించి
రాష్ట్రముల్ తిరిగి స్వరాజ్యపక్షమును, గాంగ్రెసునం దొండుగణ మగుదాని
నేర్పరించిరి; వచ్చె నెన్నికలంత, గెల్చె నీవర్గంబు కీర్తనీయముగ;
కాకినాడపురానఁ గాంగ్రెసువారి, వార్షికసభ దీనివాదంబు మెచ్చె (1924) 16

## గాంధిని వదలుట

అంతట జారరంబగునట్టి తెగులు, బాపును బెద్దయున్ బాధింపఁదొడఁగె
నది కోఁతవైద్యాన నడఁగారెఁగాని, యయ్యు దుర్బలుఁడయ్యె నసురుసురయ్యె
ఏలువా రలజడి నీఁగి మహాత్ము, నెరవాడచెఱనుండి యింటికిఁబంపి (5-2-24)
రించుకతేటిన హింసావిరోధి, సన్నిధి శాసనసభ లొప్పువారు
నొప్పనివారు మృదూక్తులతోడఁ, దమవాదమునుజాటి తమ రుచితంబు
నిర్ణయింపుఁడనంగ నే శిష్టసభల, కేగుటొప్పనుగాని యేగెడివారి
నిందింపనొల్ల నానేత లెన్నేని, చాగముల్ సల్పిన సర్దారులగుట
భోగంబులొల్లని పూరుషులగుట, యెఱుఁగనా యనెగాంధి హితమితోక్తులను
జాతీయవిద్యలు, సర్వమతాల, మైత్రి. రాట్నపునూలు, మగ్గ, మస్పృశ్య
తాదోష మణఁగింపఁ దలకొను టాది, గాఁగల నిర్మాణకార్యక్రమంబు
సాగించుటే నేఁడు చను మనకనియె 17

## అల్లూరిసీతారామరాజు

సోదరీ! విను మనసూయమా! యిచట, ధైర్యమంధాద్రి సీతారామరాజు
నల్లూరికులజాతు నాంధ్రసోదరుని, దలపోఁత కృత్య; మీతఁడు హింసనూఁది
యింగ్లీషువారి జయింప నెన్నేని, మార్గమ్ము లారసి మన్నెపుందొరల
ఫౌఁజుతోఁ గొన్నాళ్లు ప్రభుత నలంచి, మజ్జరే! హంవీరమరణంబు నందె (7-5-24)
నితనిసాహసమున కితనిస్వాతంత్ర్య, కాంక్ష కీవికి నశ్రుకణములు రాలఁ
బల్కితి నీకథ బాటవేత్తైన; అదియట్టులుండె మోహనదాసుఁ డంతఁ
గాంగ్రెసుసభ్యులుగా నుండువారు, తమవడికినయట్టిదారంబు నెలకు
రెండువేలగజాలు రెచ్చినపేర్మిఁ, గాంగ్రెసునకు నీగి కట్టడచేయ
ననుచరుల్ మేలుమేలని ముదంపడిరి, హిందువుల్ ముస్లిము లిత్తతియందె
కోహటునగరానఁ గూరిమిన్ మఱచి, మతకలహాగ్నిలో మాఁడిరి పెక్కు
రీయకార్యంబున కిర్వదియొక్క, ప్రొద్దులు బాపుజీ పూనె నుపాస 18

## బెల్గాము కాంగ్రెసు - గాంధి

మింతలో మోహనుఁ డేలికగాఁగఁ, గాంగ్రెస్ సదస్సు బెల్గామునన్ జరిగె
ఖద్దరు పెంపు ముఖ్యక్రియ యనుచు, జాతీయభాషగాఁ జను హింది యనుచు
భాషాప్రయుక్తతన్ బరఁగురాష్ట్రములు, భారతక్షోణి నేర్పడవలె ననుచు
రాజ్యతంత్రంబు లారాష్ట్రంపుబాస, కగ్గమై సాగుట యభినంద్యమనుచు
బాపుపల్కిననుడుల్ పరిషత్తు మెచ్చె (24 డిశం॥,) శాసనసభ కేగఁజనదనువారు
గురునిగా గాంధిని గొల్చెడివారు, సాగించి రంత నాశ్రమము లందందు
అస్పృశ్యతా నిందితాచార మణఁప, జాతీయవిద్యతో జనతను దిద్ద
నింటింట రాటంపుటెలుఁగు మ్రోయింప, నుద్యమించిరివీ రహో! యనంబ్రజలు 19

## వైకము సత్యాగ్రహము

అపుడు దక్షిణభారతావనియందు, రహిఁ దిరువాన్కూరురా జేలుమహిని
వైక మన్పేరఁ బిల్వంబడునూర, సూరుల కిరవైన శ్రోత్రియమందుఁ
గేలప్పనాఖ్యుఁ గాంగ్రెసుపనుల్ దీర్చు, సంచితాశయరాశి యాజమాన్యమున
సాగె నుత్కటమైన సత్యాగ్రహంబు (1925 మార్చి,) అగ్రహారపువీధులందుఁ గొన్నింట
మాలలు మాదిగల్ మడమ నానింప, రాదనుకట్టెడ రక్కసపనుపు
తరతరంబులనుండి తలయెత్తియుంట, నిది దారుణాచార మిది నిషేధ్యంబు
త్రోయందగున్ దీనిఁ ద్రుంగింపఁదగును, కదలుఁడీ నావెంటఁగదలుఁడీ యనుచుఁ
గేలెత్తిజేకొట్టి కేలప్ప నడువ, నవమానహతిఁ గుంది నాసీమజనులు
నవమానసంపాదనస్పృహం గదలి, వైకమునం దెల్లవాడలన్ నడువ
బందింపఁదొడఁగి రేల్బడివారు వీరి; మోహనుం డిదివిని మోదఖేదముల
కగ్గమై బిఱబి నచ్చోటుచేరి, కేలప్పసేవలఁ గీర్తించి చెఱల
కేగినవారెల్ల రిలుచేరునట్లు, నగ్రహారమ్మునం దన్ని వీధులను
నరమాత్రులందఱు నడయాడునట్లు, విభునియ్యకోలందె విశ్వ మౌననఁగ. 20

## చిత్తరంజనదాసు నిర్యాణము

అంతలోవంగనాయకవతంసంబు, చిత్తరంజనదాసు చేరెను దివికి (1925 జూన్)
ఇవ్వార్తవిని గాంధి యెంతేనిక్రుంగి, కదువడిన్ గాళికాఘట్టంబు చేరి
దాసుపీన్గును మోయుదంటలయందుఁ, దా నొక్కఁడై ప్రజాతతిమెప్పు లంది
బంగాళమునయందుఁ బదిలక్ష లర్థ, మార్జించి గణనీయమగు వైద్యశాల
చిత్తరంజను స్మృతిచిహ్న మేర్పఱిచె, మోతిలాల్ పండితమూర్ధన్యుఁ డపుడు
దాసుపీఁటకువచ్చి తనయిచ్చకొలఁదిఁ, బాలించెను స్వరాజ్యపక్షంపువారి
నూలిచందాను మానుటకు నీవర్గ, మొయ్యనొయ్యనఁ దలయూఁపె నయ్యారె!

నాకేల కాంగ్రెసునాయకత్వంబు, మోతిలాలే దీనిమోయు టొప్పనుచు (1925 జూలై)
నార్తిమై మోహనుఁ డవ్వేళఁబల్క, నతిరథుల్‌కొంద ఱాయయ్యకు మ్రొక్కి
వత్సరంబిది నిండువఱకును మీరె, యధిపతుల్గా నుండుఁడని విన్నవింపఁ
గరఁగి మహాత్ముఁ డొంగాకనిపల్కె, రానురా నదిరా! స్వరాజ్యపక్షంబు
కాంగ్రెసే నేనని గర్జింపసాగె, వాదోపవాదముల్ వర్గానఁ బెరిఁగె
జయకరుదళము విసర్జించె దీనిఁ, బరిణామవాదులబల మోసరిల్లె
మరలవిజృంభించె మతకలహముల, వగచె బాపూ దేశవైకల్య మరసి
కలముపట్టెను దనకథను వ్రాయంగ, పోడమె నవ్వేళఁ గాన్పూరుకాంగ్రెస్సు
తెలుఁగింటికోడలు ధీమాననీయ, కవితాసరస్వతి కాంగ్రెసునంద
రుచిరవిచార సరోజినీదేవి, యాధ్వర్యవంబున నలరె నీసదసు డిశం. (1925)
తనబరు వీయమ్మతల నిడి గాంధి, వదలెఁ గాంగ్రెసుపొత్తు వర్షంబదనుక
గౌహతీకాంగ్రెస్సు కదలె నావెన్క (1926 డిశం॥,) సంపూర్ణమగు స్వరాజ్యము నాసచేయు
నిర్ణయంబునెదిర్చి నెగ్గె మహాత్ముఁ, డపుడు శ్రద్ధానందయతిని రషీదు
చంపుటంజేసి దేశము వేఁగుచుండ, నితరేతరద్వేష మిరువాఁగునకును
నేర్పినపెద్దలే నింద్యులుగాని, దోషికాఁడు రషీదు దోషికాఁ డనియె
ఇన్నాళ్లనుండియు నియ్యోగమూర్తి, ఖాదీవికాసంబు కాంక్షించిపడిన
శ్రమమెల్ల గౌహతిసంతలోఁ బ్రజల, కంటికిం గనిపించెఁ గ్రమరూపమున
మనసన్న ఖద్దరు మరవల్వసొగసు, నోడించెఁ బొందూర నుదయించినట్టి;
దాంధ్రకాంతలపాలి హస్తకౌశలము, కీర్తించి రపుడు కాంగ్రెసు పెద్దలెల్ల;
అదియట్లులుండె నోయనసూయ! వినుము, పరిణతమతి విఠల్ భాయిపటేలు
పరిణామవాదులపక్షంబు నడుప, దొరఁకొనె నానాఁడు దొరలేనిరీవి
నధికారు లానేత కాదృతి మెఱసి, ప్రగ్గడలై ప్రజన్ బాలింపుఁ డనుడు
విర్ధలుఁ డీనేతిబీఱపెత్తనము, మాకేలయని వారిమాట భంగించె 21

## సైమను బృందము

మఱికొన్ని హక్కు లిమ్మహికి నీకున్నఁ, బ్రజ లాఁగరని యాంగ్లపాలకు లెంచి
యుచితనిర్ణయముల నొనరించుపొంటెఁ, బంపిరి సైమనున్ భారతక్షితికి;
అతనిబృందమ్మునయం దొక్కఁడేని, భారతీయుఁడు లేమి పరికించి ప్రజలు
పెల్లుగా నుడికి రెబ్బెతికంబు చాటి 22

## మద్రాసు కాంగ్రెసు

మానినీ! యింతలో మద్రాసునందు, వరణీయచరితుండు వైద్యవతంస
యన్సారి యాజమాన్యమ్ము వహింప,
సాగెఁ గాంగ్రెస్‌పరిషత్తు గణ్యముగ (1927 డిశం॥)
మతమైత్రిలేనిచో మనకు స్వరాజ్య, మాకాశకుసుమంబె యనియె నమ్మోటి
మతి నిరాకరణోద్యమంబుచే మనకుఁ, జెఱపురాలే దదే చెడె మనచేత
నాపల్కు నమ్ముఁ దన్న లటంచువెజ్జు, నమ్రతమైఁ జాటె నగ్న సత్యంబు
వినఁదగ్గమాటలు వినిపించుకతన, జయజయధ్వను లప్డు సభ విజృంభించె
మన్నింపరాదు సైమనుపిండు ననుచు, నుచితమౌతీర్మాన మొనరించె గోష్ఠి
తత్సమజ్యను సర్వతంత్రస్వతంత్ర, రాజ్యమేవలయు భారతమున కన్న
నిర్ణయంబును నెగ్గె నెహ్రూబలాన, నిది నెగ్గుతతి గోష్ఠి నెరవాదయోగి
లేఁడయ్యె నవల నాలించె నివ్వార్త, బడిపిల్ల లొనరించుపని యిది యనిమె
నౌగాము లెఱుఁగుట యక్కఱ యనియె. కల రాజకీయ వర్గంబులనెల్లఁ
గాంగ్రెసువా రొక్కకడకు రావించి, యధినివేశ స్వరాజ్యమునకున్ దగిన
సూత్రమ్ములను రచించుట లెస్స యనెడి, తీర్పుసైతము సమ్మతించె నీసదము;
కాంగ్రెసువారివైఖరి యిట్టులుండ 23

## గుజరాతులో వఱదలు

గొప్పవల్లడి రేఁగె గుజరాతునందు, వారివాహంబు లవ్వారిగాఁ గ్రమ్మి
చదలునం దరిదిబెజ్జాలు పడ్డట్లు, దొడదొడ నేఁబదిదిక్కులవాన
కురిసె రేయుంబవల్ కుండపోఁతగను, వాఁగులుపర్వెత్తె వఱదలు పొంగె
వంతెనల్‌చెడె గండ్లువడెనురస్తాల, కిండ్లుకూలెను బంటలెల్లను సమసె
నదిపల్ల మిదిమిట్ట యనువేర్మి తొలఁగె, గొఱ్ఱెలు మేఁకలు గోవులున్ గెడసె
నరులెందఱో వీడినారు ప్రాణముల, విరిసె నివ్వెత యైదువేలపల్లియల
బలసె నివ్వెత మైదువేలపల్లియల, బలసె నీచేద్పాటు పలుపట్టణముల
లేమికిన్ గల్మికిన్ లేదాయె నెరవు, గుడిసెకున్ మేడకున్ గూలె వింగడము
విన్నఁబోయెజనంబు విదికంజలించె, నెడసె నహంకార మెల్లదెందముల
నపరంజిటెంకి యహమ్మదాబాదు, బాపురే! మున్గె సాఁబాలు వెల్లువను
కూలి గుండెలుబాదుకొనిరి వర్తకులు, మచ్చరంబులుపోయె మనుజులయెదల
నిండెను దొరలేనినెయ్యతియ్యములు; 24

# వల్లభుని సేవ

వల్లభు నాధ్వర్యవమ్ముతో నప్పు, దార్తసేవాసంఘు మాసీమ నొదవె
స్వచ్ఛందసేవకుల్ వందలు వేలు, చేరి రాదళమందుఁ జెలరేఁగుతమిని
అధికారులకుఁ బట్టదయ్యె నీగొడవ
సర్దార్‌పటేల్ దండు సాగె సేవలకు, మైసూరుసీమ నామయపీడ నణఁపఁ
గాఁపురించుచునున్న గాంధిమహాత్ముఁ, డీజలప్రళయంబు నెఱిఁగి నిట్టూర్చి
కదలె గుజ్జరికిఁ దన్గన్నట్టిమహికి; వల్లభుం డిదివిని వలదు రావలదు
బాపూజీ!నీశిక్ష పడసినమేము, కలముగదా యూడిగం బిటన్ సలుప?
నారోగ్య మార్జింపు మాఁపుము పైన, మనఘ!నీబ్రదుకు ముఖ్యము జగత్తునకు
నని యొజ్జకున్ వార్తనంప మోహనుఁడు, మన్నించె సర్దారుమాట నత్తఱిని;
చినచిన్న తెప్పలఁ జేరి పల్లెలకు, సర్దారుదళ మార్తజనుల నోదార్చి
కూడుగుడ్డలు వారికొఱకు నర్పింప, బడలుచుండఁగఁ బ్రజల్ భగవానుఁ దంపె
నీదూతలన్ మనయిడుమలం ద్రోయ, నీచుట్టముల మన కింతకూ డొసఁగ
నని శాంతినంది రొయ్యనఁ దేఱుకొనిరి, స్వపరభేదముమాని సౌజన్యరాశి
వల్లభుదండు నెవ్వల కగ్గపడిన, మధికారులకును సాయమొనర్చి తనిసె
మండలాధీశుఁ డీమహనీయవర్గ, మంపినబోనంబు నద్దిరా! తినియె
జారరజ్వాలను జల్లార్చుకొనియె, అల్లల్లనఁ బటేలునౌదార్య మెఱిఁగి
విశ్వమెల్లఁ గరంగి వినుతించె నతనిఁ, బారంబునేర్చిరి పగతురున్ నాఁడు;
రఘురాముఠాణి! యార్తప్రజ కపుడు, కూడుగుడ్డలచిక్కు కొఱవడెం గాని
పవళింప నిల్లేది? పంటచేనేది?, యొద్దేది? యేరేది? యెను పెంటియేది ?
పగటెఁ బటే లేలుబడివారికృత్య, మిచ్చిరి రెండుకో ట్లీబుద్ధిమంతు,
లార్జించె వల్లభుం దరకోటిసొమ్ము, కాంగ్రెసువార లీకాసులనెల్లఁ
బంచిరి హాలికాది బాధితప్రజకు, నసమానయశమందె నపుడు పటేలు
కర్షకాన్వయసరః కమలమిత్రుండు, బాపుసృష్టించిన బంగారుకొండ
విన్నందనములేని వీరశేఖరుఁడు, దేశికున్ గరగించుదిట వున్న శిష్యుఁ
డౌచిత్యమును గన్నయట్టి నాయకుఁడు, సేవాపరాయణజీవనాంచితుఁడు;
అదియట్టులుండె నోయనసూయ!వినుము, దేశ పరిస్థితుల్ తెలిసికోనెంచి
సైమనుబృంద మెచ్చటికిఁబోయినను, నల్లజెండాలతో నదువుమీా వెన్క
కనెడికేకలతోడ నఖిలభారతము, రెచ్చి రెచ్చి బహిష్కరించె నీగమిని
బోటుడిగ్గిననాఁడె బొంబాయివారు, హరతాళ మద్వితీయమ్ముగా నెఱపి
చకితంబొనర్చి రీసైమనుపిండు, నిది కలకత్తాకు నేగినప్రొద్దు
రక్షకభటులకున్ బ్రజకుఁ బోరయ్యె, లక్నోకుఁజేరఁగా లాటీలతోడఁ

బొడిచిరి పౌరులన్ బోలీసువారు, సత్కారమిది దక్కె జవహరునకును;
సైమను పాట్నాకుఁజని పల్కుసభకు, వచ్చినశ్రోత లార్వందలే కాఁగ
నాతని వెలివెట్టునట్టిసమజ్య, కరుగుదెంచినవార లరలక్షయైరి
లజపతి నేతగా లాహోరునందు, సాగు బహిష్కారసభ నోర్వలేక
యితఁడుబాలుఁడు వృద్ధుఁడితఁ డని చూడ, కిస్సిరో! పోలీసు లెల్లరన్ మోఁది;
రీదుడ్డుగట్టిపో ట్లెన్నెనితాఁకి, లావతి దివికేగె లజపతి యల్ల; 25

## సైమనురాక-ఆంధ్రకేసరి

మదరాసుపురికి సైమనువచ్చునాఁటి, కాంధ్రకేసరి ప్రకాశామాత్యమౌళి
దిద్దియుంచె బహిష్కృతిక్రియల్ నడుప, దేశభక్తిస్ఫూర్తి దీపించుప్రజల
సైమనూ! వెన్కకుఁజను చను మనుచు, నసితపతాకాళి నార్చుచున్ వార
లెదురుగా నడతెంచి రీబృందమునకు, రంగదుత్తుంగ తరంగసంఘాత
భీకరాంబుధిఁబోలె బిలబిలవచ్చు, పౌరవాహినిఁ జూచి పాడిదొలంగి
యధికారివర్గ మహంత అంపిల్ల, నంగవించె జనాళి నటునిటున్ దోలఁ
గదలదాయె జనంబు గ్రావత్వమందె, నిది సహింపఁగరానియెల్లిదంబనుచు
నగ్గిఁద్రొక్కినక్రోఁతులై రధికృతులు, బెదరిపోవచ్చు నీపెనుమూఁక యనుచు
గతిదప్పి మతివోయి కాల్చిరిగుండ్లు, పార్థసారథి యన్నపౌరుఁ డొకండు
కూలె నత్తతి నగ్నిగోళంపుదెబ్బ, కెందఱో గాయాల నిల్లిగ్గులంది
రగ్గలించెఁ బ్రజాళి హాహారవంబు, లీవార్తవిని జను లిండ్లనువీడి
సాగిరి వేల్వేలు సమరధరిత్రి; కావెల్లువంగని మధికారివర్గ
మొకగదిన్ బీనుంగు నునిచి కాపుండె, కుణపంబు నీక్షించుకోర్కితోఁ బౌరు
లొక్కుమ్మడిగ దూఁకి రోవరిదెసకు, నపుడు పౌరుల బంటు లంకిలి పెట్టి
రాకుఁడీరాకుఁడీ రక్కెసతాల్మి, నాఁగుఁడీ! బ్రదుకుపై నాసక్తియున్న
నాఁగరా ప్రేల్చెద మగ్నిగోళములు, కదలరా మీనెత్రు కాల్వలై పాఱు
నన నాంధ్రకేసరి యపుడు గర్జించి, కూర్పాసమును జీల్చి గుండెచూపించి
యెవ్వఁ డాకాల్చువాఁ డెవ్వఁ డాదిట్ట, కాల్పవచ్చును గుండెకలదేని గుండు
శవము నీక్షింపక చననేను జనను, నన్నాఁప నెవనికున్నదినేఁడు దమ్ము?
నను నిల్పలేఁడు పినాకియున్ నేఁడు; ప్రాణంబునాసించి పరువు గోల్పడెడి
పాఱుఁబోతులు లేరు భారతక్షితిని, పరులగర్వము సైఁచుప్రజ లిందులేరు
అరులకత్తికి జంకు నధములు లేరు, నేనకా దీప్రజానీకంబు సర్వ
మీపీనుఁగున్ జూడ కింటికిఁబోదు, తొలఁగుఁడీ తొలఁగుఁడీ త్రోవనిం డనుచు
నడ్డువచ్చినవారి నటునిటున్ ద్రోయు, చదిర! తారాజువ్వ యన దూసికొనుచుఁ
బార్థసారథికుణపం బున్న గదికి, నుఱికె రెండుగజాల కొకయంగ నిడుచ

భటులమోముల మతాబా వెల్గెనపుడు, చేజాతిపదె వారిచెనఁటితుపాకి;
టంగుటూరియశస్సు రవరవలేని, తెలుఁగుజోదుయశస్సు దేశగౌరవము
నిలఁబెట్టినట్టి మన్నీనియశస్సు, వెండికొండకు నాఁడు వెల్లన పెనిచె
కాళికాసతిమేని కప్పెల్ల నణఁచె, పారిజాతముఁ జూచి పకపకనవ్వె
ఏడుదీవులనున్న యిరులఁదూలించె; అవ్వలివృత్తాంత మాలింపుమమ్మ!
సోదరీ! సైమ నెచ్చోటికింజనినఁ, బొమ్ముపొ మ్మను నుదుల్ పొరిఁబొరిన్ మొరసె
వడిగ నీతఁడుపట్టె వచ్చినదారి; మోతిలాల్ పెత్తనమ్మున సర్వపక్ష
సభ యొకండేర్పడి సంపూర్ణబాధ్య, తాయుతమైనస్వాతంత్ర్య మీయిలకు
నేల్బడివారిచ్చు టెంతేనివలయు, నన్ననిర్ణయ మంత నావిష్కరించె
జవహరలాల్ బోసు సాంబమూర్తియును, జప్పరించిరి దీనిఁ జచ్చుతీ ర్పనుచు 26

## బార్డోలి రైతులు పన్ను మానుట

బార్డోలినపు దేలుబడి సేయువారు, నంజపుంజలపన్ను నాయంబువీడి
పెంపుచుసిరి ప్రజాభీష్టంబు నుఱక, మంచిచెడ్డలెఱింగి మంతుగన్నట్టి,
దేశభక్తిని బ్రసిద్ధింగనినట్టి, బాపుజీప్రేమకుఁ బాత్రులైనట్టి,
చాగంబునకుఁ గొంకు జంకులేనట్టి, బార్డోలికాఁపు లీపన్ను వ్రేఁ గోర్వ
రానిది యనుచు సర్కారుపెద్దలకు, మనవులంపిరి గాని మార్పురాదాయె;
తద్ద పెంచినశిస్తు తగ్గించుదనుక, నరివెట్టమని చాటి రపుడు హాలికులు
కరనిరాకరణ సంగరమును దీని, నడుపవే నీ వని నమ్రతం దెలిపి
యొప్పించిరి పటేలు నుక్కుమానిసిని; కష్టాలకౌగ్గిన కర్షకావళికి
విజయోస్తటంచు దీవెనపంపె గాంధి, గడువుదప్పెనుగాని కాఁ పొక్కఁడేని
మడితీర్వలో నణుమాత్రమే నిడఁడు, ఈ పేదమూఁకకు నింతబింకంబె
యౌరౌర!సైరింతుమా దీని ననుచుఁ, బాలకుల్ తెగి పండ్లు పటపటఁ గొఱికి
కదలిరి తమపరాక్రమము చూపింప; ముందుగా నొకసెట్టిమ్రోల బీరంబు
వెడలించి రతఁ డుత్త పిఱికివాఁ డనుచు, నెంతగద్దించిననే మధికృతుల
పప్పులుడుకవయ్యె బచ్చుముంగడను, ఒకవంక సకలోర్వి నుఖ్యాఁతలూఁపు
బిరుదరి కోమటిబిడ్డగా నుండ, నింతయజ్ఞత వీరి కెట్లావహిల్లె
కానరేమీ కాలగతి వీ రొకింత; అవల సర్కారువా రాగ్రహంపడుచుఁ
నొకపేద ముస్లిము నుదరింపఁ దొడఁగి, దీటులేని నిరాకృతికి వసంపడిరి
సాగనికిన్కచే సంతాపపడిరి; గడ్డిపోఁచయు నీము కరము నే మనుచు
సన్న కాఁపులు సాధ్వసమువీడి నడువ, నుద్యోగు లేమిసేయుదమా యటంచు
దొడ్డగాఁ జింతించి తుదకుఁ బరాను, దండు రావించిరి దయలేనిమూఁక;

నెదియొనర్చినేమి? హేమాద్రులట్లు, నిలిచిరికర్షకుల్ నేతవల్లభుఁడు
పనుచునానతుల నప్పసము పాటించి, గెలిచిరి జగమెల్లఁ గీర్తింపఁదగిన
యోర్మియు నేర్మియు నున్నవా రగుట; వచ్చినట్టి పరానువాఁగు గోవులను
గేదెల మేఁకల గిత్తలం బట్టి, నడిపిరి బందెకు నవ్వనర్భకులు,
కరణముల్ కాఁపు లాకయ్యంపువేళఁ, బదవులువీడి సెబాసులన్ గనిరి
యిడిరిదస్త్రంబుల నేలువారలకు, బదుగువెట్టియు వీరిబాటలో నడిచె
పలువురు శిష్టిసభాసభ్యు లపుడు, గద్దియల్ వదలిరి కర్తవ్య మరసి
యెటఁగన్న నుత్సాహ మెటఁగన్న నీవి, యెటఁగన్న గౌరవతృష్ణయున్ మెఱసె
భారతశిష్టిసభా వల్లభుండు, ఘూర్జరక్షోణికిన్ గూరిమిబిడ్డ
విరలభాయిపటేలు వీరాగ్రగణ్యుఁ, దపు దేలువారి నయ్యలు! మీరు ధర్మ
వరయుఁడు బార్డోలియం దెసరేఁగు, మంటలార్పుఁడు నాదుమాట పాటించు
మది మీకులేదేని మత్పీరి వదలి, యేగెద నేనని హెచ్చరికింపఁ
గన్నులుతెఱచి సర్కారువా రతని, కుచితోక్తులాడి నెయ్యురువోలె సంధి
సాగించి నంజపుంజల కెచ్చినట్టి, తీర్పులో ముక్కాలు దిగనాడినారు
మానినపదవులు మరల నొసంగి, యుద్యోగులకుఁ దృప్తి నొదవించినారు
వల్లభాదులచెఱన్ వదలించినారు, ఇఁక దాస్యమును సైఁప దీదేశ మనుచు
జాతీయవాదు లుత్సవ మందినారు 27

## కలకత్తా కాంగ్రెసు

రఘురాముదేవి! తర్వాతఁగాంగ్రెస్సు, మోతిలా లాధ్యక్ష్యమును స్వీకరింప
నడచెఁ గాళీఘట్టనగరంబునందు (డిశం॥ 1928,) అఖిలపక్షములవా రౌననినట్టి
యధినివేశస్వరాజ్యవిధానమపుడు, సభసమ్మతిం బొంద సభ్యులమ్రోలఁ
బ్రకటించె గాంధి తీర్మానంపురూపు; రావలెఁ బూర్ణస్వరాజ్య మటంచు
నెద్రిచెను జవహరుం డీనిర్ణయమును, బోసుమున్నగుయువల్ బోరన దీని
వెక్కిరించిరి తీవ్రవిధిని మాటాడి, రపుడు కర్తవ్యంబు నరసి మహాత్ముఁ
డధినివేశస్వరాజ్యము నీధరిత్రి, కేఁడాదిలోపల నీరేని ప్రభువు
లపుడు పూర్ణస్వరాజ్యమె కాంగ్రెసునకు, లక్ష్యమౌనని మృదులంబుగాఁ బల్కి
తీర్మానమునుమార్ప దివి ప్రీలునట్లు, కరతాళరవము లుగ్గడువుగా మొరసె
ఈవార్తవిని దొర లిల్లిగ్గువడిరి, ప్రజ లెల్లయెడల సేబాస్! బలే! యనిరి
పదపడి బాపుజీ బర్మాధరిత్రిఁ, గలనెయ్యురం జూడఁగా నిచ్చచేసి
యాఁగెఁ గాళీఘట్టమం దొకప్రొద్దు; 28

## మహాత్మునికి జరిమానా

పౌరు లివ్వార్తకుఁ బరితుష్టినంది, తుటుములుగా మహాత్మునిబసన్ జేరి
గాలంబు రిత్తగాఁ గడపుట తగదు, వాడవాడ విదేశవస్త్రముల్ పడసి
కావింత మవ్వలికార్యం బటన్న, గాంధిపల్కుల కుబ్బి గంతులువైచి
బాపుజీతోసాగి పట్టణమెల్లఁ, దిరిగి గృహస్థు లుదీర్ణహర్షమున
నొసఁగిన పెఱనేలయుడుపులన్ దెచ్చి, పెనుగొండఁగా వానిఁ జేర్చిరివీథి;
నవల నాగుట్టకు నగ్గిముట్టించి, యిది బానిసపుగుట్ట యిది పాపరాశి
యిది బూదియగుచున్న దీనాఁడటంచు, సంయమీంద్రుఁడు పల్క జను లహో! యనిరి
పదుగురు నడయాడుబాటలో నిట్టి, పరిచేఁత చట్టమొప్పనికార్య మనుచు
నధికారి నమ్రత నాడి బాపునకు, శిక్షగా నిర్ణయించెను రూప్య మొకటి;
అబ్రంపడిరి ప్రాజ్ఞు లాతీర్పుచూచి, పరువుగోల్పడి రేలుబడివారు మిగుల; 29

## ఖద్దరు నిధి

పిదప గురుండు తాఁ బెద్ద ప్రేమించు, ఖద్దరు బహుధా వికాసంబునంద
నిధి కూర్పవలెనని నిరవద్యచరిత, జయరామదాసుని జతకు నెన్నుకొని
యయ్యాయి రాష్ట్రములందు విత్తంబు, పడయుచు మనకోర్కి పాటించి తెలుఁగు
పల్లెలు పట్టణాల్ బ్రాఁతిమై దిరిగి, మూఁడులక్షలరూప్యముల నందుకొనియె (1929 ఏప్రిలు)
పొందూరు దుర్గి చేఁబ్రోలు మాచెర్ల, కనిగిరి కర్నూలు ఘంటసాలయును
సృష్టించినట్టి దేశీయవస్త్రముల, చెలువంబు గని తెల్లచేతినే ర్వరసి
యబ్బురంపడె గాంధి హర్షంబునందె; మాయూరి కపు డీ యమర్త్యసన్నిభుఁడు
వేంచేయఁగా బ్రజల్ వేయాఱులిచ్చి, కావూరికీర్తి కగ్గలిక చేకూర్చి;
రవు దేను వ్రాసితిన్ స్వాగతపత్ర, మపు దేను 'ధన్యోస్మి' యని చొక్కుగంటి;
సోదరీ! విను మనసూయా! గణేయ!, యిట మహాత్మునిచంద మీరీతి నుండ 30

## కార్మికపక్ష విజయము

నట నాంగ్లభూమి మేలగుమార్పు వచ్చె, మార్పు నొల్లనివారు మఱఁగి రెన్నికలఁ
కార్మపక్షమువారు కనిరిజయంబు, దేశకాలంబులతీరు గుర్తించి
నడుచువివేకమున్నది వీరిగమికి, నర్థింతురు స్వతంత్ర మగుభారతమును
పాటించెద రుదారపద్ధతిన్ వీరు, జాతీయవాదు లిచ్చుటివారు నిచ్చ
వలచుచుందురు వీరివైభవోన్నతిని, ప్రజకొనర్చినసేవ పండి యీనాఁడు

మార్గనాల్డు ప్రధానమంత్రిగా వచ్చె, ఇండియామంత్రి యయ్యెను వెడ్జివుడ్డు,
"సకలపక్షంబుల సంస్తుతి గన్న, రాజనీతిజ్ఞుల రావించి త్రచ్చి
వలయురాజ్యాంగంబు వలయురక్షణలు, రచియించి యాంగ్లసామ్రాజ్యవిధేయ
సరణి సాగెడిస్వరాజ్యమును హిందూర్వి, కొసఁగుట మాకు నిం పొందవించు చేత"
యని వీరు చాటఁగా నఖిలభారతము, దొరలేని సంతుష్టిఁ దోఁగె నవ్వేళ;
మార్గనా ల్డపు డాంగ్లమహికి వై స్రాయి 31

## ఇండియా రాజ్యాంగ మెట్టిది ?

నిర్విసున్ రావించి హిందూర్వి నున్న, రాజ్యాంగ మేప్రకారంబున దిద్దఁ
దగు నన్నచర్చలు తద్దయున్ జరిపె, హస్తినకున్ జేరినట్టివైస్రాయి
"యిచటి యేల్బడి యింక నెట్లుండవలయు, నెదికృత్య, మెదినుత్య, మెదిసర్వజనుల
సమ్మతిన్ గను, నన్నచర్చలు జరుప, మనరాచ తెగలతో, మనగడ్డలోని
సంస్థానముల నేలుసాములతోడ, లండనుపురిని వైళమ సాగు సదసు,
దేశీయు లిట నెల్లతెఱఁగుల సాయ, మందింపవలె" నని యర్థిమైఁ జాట
సద సది యధినివేశస్వామ్యమునకు, ననుకూలముగ సాగునా యనె గాంధి,
యెటులుండునో యనె నిర్విన్ ప్రభుండు, వైస్రాయిపల్కు గోవాల్ల కానాఁడు
చప్పచప్పగనుండె పసిలేని దగుట; సంధితంత్రము నొకచక్కి సాగింప
నొకచక్కి బందాల కొప్పమి గూర్పఁ, దెగె నిర్వి నానాఁడు ధీ గోలుపోయి,
చెఱనున్న జోదు లీచెట్ట సైరింప, కుపవాసదీక్షకు నొగ్గిరి పల్వు,
రర్వదినాల్గునా ళ్లాహార ముడిగి, నవసి కూలె యతీంద్రనాథదా సపుడు,
రిత్తవోవని పూన్కి రెవరెండు విజయ, వారెవా! నూటయర్వదినాల్గుప్రొద్దు
లిల్లిని సైరించి హేయమైనట్టి, మై నుజ్జగించె బర్మాబందిగమున,
చలముపైకొని కేంద్రశాసనసభను, బాంబుప్రేల్చుటఁజేసి బంధితులైన
దత్తు భగత్సింగు తాఁకకరొట్టె, కట్టెలుగానైరి క్రాంతికాముకులు,
కార్మసమస్యలుం గదుకొని యపుడు, బొంబాయిలో వంగభూమిలో సమ్మె
లురవణించె నశాంతి యుద్వేలమాయె, మార్గనా ల్డత్తతి "మహనీయచరిత!
భారతోర్వి స్వరాజ్యభానూదయమున, నుద్దీప్తినందుట కుబలాటపడెడి
మా ప్రభుత్వమునకు మార్గముల్ చూపి, తోడ్పడు" మనుచుఁ గస్తూరినాథునకుఁ
దంత్రివార్తను బంపఁదన్మహాశయుఁడు, "సచివాగ్రణీ! మీకు సాయంబు సేఁత
నామది కెంతేని నచ్చినచేఁత, కాంగ్రెసు కాళికాఘట్టాన మొన్నఁ
బ్రకటించినట్టి నిర్ణయమునుంబోలె, విశ్వసింతును మీరు వెడలించుపల్కు;
నింగ్లీషువారు మాయిల కున్నచరిత, పరికించి ప్రాక్తనప్రథను గుర్తించి

తగురాచతిక మీయఁ దలఁతురయేని, ప్రజలకు మేల్సేఁత పాడి యటంచు
నిచ్చటియధికారు లీకొందురేని, కత్తిగాదు తుపాకిగాదు పాలితుల
హార్దమే తమ కండయని యెంతురేని, అక్షరమ్ములకంటె నర్థమ్ముకంటె
నుఱవు భావం బని యూహింతురేని, అధినివేశస్వరాజ్యం బన్ననుడికి
నిచ్చవచ్చినపూఁట నేము సామ్రాజ్య, సంబంధమును వీడుచన వర్ధమేని
మనపొత్తుఁగూర్చి వేమఱు బిరుసైన, కట్టడల్ కోరునక్కఱ లేదు నాకు,
మాకోర్కి పండింప మాపేర్మి పెనుప, నగుశక్తి మాకులే దని యెఱుంగుదును
మాయిచ్చలెల్ల మీ మంచితనంబు, కతననే సఫలముల్ కావలె ననెద
సచివమూర్ధన్య! మీసామ్రాజ్యమందు, నున్నంతవఱకు మే ముర్విలో శాంతి
హెచ్చుటకే శ్రమియింతుము గాని, యాంగ్లప్రభుత్వంపు టవధులు పెనుప
నన్యులసంపత్తు లాహరింపంగఁ, గలనైనఁ బెనఁగము గతిదప్పిచనము
మాతలంపుల మీరు మన్నించినపుడు, తరతరమ్ములనుండి తమరు మాపాల
నాచరించిన బహుళాపరాధముల, కది పాచితంబని యది పరిహార
మని తలంచుట లెస్సయగును మీ కనెద, తప్పు నొప్పిననాఁడె తలయెత్తు నరుఁడు
మదిని విప్పిననాఁడె మానవుం డెసఁగు, ఆఁగుఁడీ కొన్ని నా ళ్లాఁగుఁడీ! యనుచు
మీ రందురేని నే మిమ్ముఁ గాదనను, కలఁగ నల్గను గొంతకాల మాఁగెదను
మంత్రిమణీ! నాదుమది పల్కినట్టి, నుడువు లియ్యవి వీని నూల్కొనువార
లెందఱున్నారొ నేనెఱుఁగ నాలెక్క", అని సమాధానంబు నంపె వేవేగ,
నిది మార్గనాల్గున కెంతసంతృప్తి, నిచ్చెనో దైవంబ యెఱుఁగు నాగుట్టు.
అనసూయ! వినుమమ్మ! యవ్వలికథను, దారిగానక పరితప్తచిత్తమున
నుత్తలంపడు భారతోర్వి కానాఁడు, హితమైనసందేశ మిచ్చుటకొఱకుఁ 32

## లాహోరు కాంగ్రెసు

**బొడమెను లాహొరుపురిని గాంగ్రెస్సు; (1929 డిశం॥), యువలకు నుద్దీప్తి నొదవింపఁజాలు**
జవహరుం డీసభన్ సాగింపవలయు, నను మాని యతని నున్నతపీఠి నిల్పుఁ
దని గాంధి గుణకంధి యాప్తులం గోర, నధ్యక్షుఁడయ్యె జవ్‌హరుఁ డోలగమున;
కింతపిన్నటివాని కీమేలిగద్దె, యీపేర్మి దక్కలే దీనాఁటిదనుక,
విద్యావివేకముల్ వితరణస్ఫూర్తి, లోకసేవనదీక్ష లోపద్దవాని
కంఠమున్ విరిదండఁ గై సేయునపుడు, ప్రాయ మెన్నరు బుద్ధిపండినవారు;
నెహ్రూసుధీమణి "నేఁడు భారతము, మునిఁగియున్నది జగాముప్పులకడలి,
నద్రికైవడి నిల్చి యరు లబ్రపడఁగ, నొడ్డుచేర్చుట మన కుచితకృత్యంబు,
సర్వస్వతంత్రతా సంపన్నమైన, దారిలో మనజాతి తలయెత్తవలయు,

విన్ను బ్రీలునుగాక విలయ మౌఁగాక, మన మహింసాదీక్ష మానుకోరాదు
హింసచేఁ బ్రతిహింస యెసరేఁగుచుండు, నవినీతి పెరుఁగు నుద్యమ మణఁగారు
నన్నలార! సదస్యులార! నాపల్కు, పాటించి విజయంబు పడయుఁడీ" యనియె
ఇతనిపల్కులు గాంధి కెలమిచేకూర్చె, నితనిధోరణి సభాతృప్తికిన్ జాలె
అధినివేశ స్వరాజ్యంబు నొసంగ, నేలువారికిఁ గాంగ్రె సిచ్చినగడువు
సడలె నాఁడేయిలో సగమౌటతోనె (31-12-29,) తన్నిశీథమున నుదాత్తసదాన
నిలిచి మోహనగాంధి నేతలనేత, పూర్ణస్వరాజ్యంబపో! నేఁటినుండి
కాంగ్రెసువారిలక్ష్యం బనుతీర్పు, వినిపింప సభయెల్ల విజయారవముల
నంగీకృతిం జాటె నాతీరుపునకు; చట్టంపుసభ మున్న సభ్యు లందఱును
వెసఁ బీఠములువీడి వెలికిరావలయు, నెల్లి రానున్నట్టి యెన్నికలకును
గాంగ్రెసువార్ దవ్వుగా నుండవలయు, నిర్భరదీక్షతో నిర్మాణకార్య
వికసనంబున కంగవింపఁగావలయు, నెడ సూచి కరనిరాకృతి కొగ్గవలయు
శాసనధిక్కృతి సాగింపవలయు, నన్నతీర్పులుసైత మాగోష్ఠియందు
మన్నింపఁబడె వేఱుమాట లేకుండ, పెనుగాలివాన పింపిసలాడఁ దొడఁగెఁ
గదలె మున్నీటిపైఁ గాంగ్రెసునౌక, ఉల్లోలపంక్తుల నుదధి ఘూర్ణిల్లె
ఆకాశ ముగ్రమేఘావృత మ్మాయె, తెరవంటిమంచుతో దిగ్భ్రాంతి వొడమె
అనుభూతిలేనివా రైరి తెర్వరులు, అగుఁగాక నావికుం డసమానధైర్య
శేముషీనిధి కానఁ జేటెట్లువచ్చు?, ఉర్వీశు లేదియో యొఱగఁబెట్టెదరు
ప్రజలకోరికలను బాటింతు రనుచుఁ, గాంగ్రెసువా ర్వార్చుకాలంబు కడచె
త్యాగముల్ సాగించుతరుణంబు వచ్చె, కాంగ్రెస్‌మహాసభ గణనీయమైన 33

## జనవరి 26

పొంగుతో లాహెూరుపురమునన్ నడచి, ముగిసినంతన మొనముం దుండువారు
చర్చించి జనవరిషడ్వింశదినము (26), పూర్ణస్వరాజ్యంబు పుట్టువుగన్న
సుదినమ్ముగాఁ దేల్చి "శుభమస్తు" పల్క, మంచుగుబ్బలినుండి మలయాద్రిదనుకఁ
బల్లెల నగరాల బహిరంగసభలు, కావించి యెన్నియిక్కట్లేని సైఁచి
పూర్ణస్వతంత్రతాభోగ మార్జింతు, మని ప్రమాణమొనర్చి రానాఁడు జనులు
నివురుగప్పిననిప్పునెతి నున్నయట్టి, భారతీయప్రజా స్వాతంత్ర్యవాంఛ
తేటతెల్లంబాయె దేశాల కపుడు; ఇది యిట్టులుండఁగా నిర్విన్ ప్రభుండు
రాదు సంపూర్ణస్వరాజ్య మీయిలకు, వలయితగోష్ఠిలో వచ్చునిర్ణయము

సభవారితలఁ పనన్ జాలునుగాని, చట్టంబుగా దని చాటె దుర్నగను
బాపు దీనిం గని బళిబళీ! ప్రభువు, జంకక మదినున్న సత్యంబు పల్కె
వెలువరించుట లెస్స వేవేగ నితని, భావశుద్ధికి మహీప్రజ కృతజ్ఞతను,
ఇచటికోటీశ్వరుం డిడుమలఁ గుందు, కూలివాఁ డైనప్డు కొందు కొం దనుచుఁ
బెత్తనం బిచ్చు నీ పెనుదాత మనకు, ఈదుర్దశ ఘటిల్ల నెన్నియేం డ్లైన
నోర్చి నిరీక్షించుచుండు నీయయ్య, కాంగ్రెసునకు బల్మికలదేని నేఁడు
శల్యావశిష్టుఁడై సంక్షోభమందు, కాఁపును గోటీశుఁ గావించి తనియు
దైవంబుగాదు నాదారిద్ర్యమునకు, హేతు వేల్పడియని యెఱిఁగినవేళ
నేదారి ద్రొక్కునో యేవిప్లవంబు, నాశ్రయించునొ భారతావనీహాలికుఁ,
డతఁడు లోకం బహెూ! యనఁదగ్గబాటఁ, బాయకుంటకు రేయి పగలు కాంగ్రెస్సు
వేయికన్నులతోడ వీక్షించు నతని; జగ మెఱుంగును దీని సాధువర్తనము;
జనులసైరణబల్మి సడలమి కిపుడు, పంటపన్నున నర్ధభాగంబు తొలఁచి
కలు ద్రావరాదని కట్టడసల్పి, యుప్పుప న్నంతయు నుడిగించివైచి
పెఱవల్వపైఁ బన్ను పెంపుగావించి, మాఱకపుంబన్ను మడఁగింప నొప్పి
తొలఁగించి దేశభక్తుల బందిబ్రదుకు, సైనికవ్యయమున సాఁబాలు కోసి
తద్దగా నొసఁగుజీతములు తగ్గించి, చారశాఖా విసర్జన మొనరించి
యోడబేరము ప్రజకొప్పనచేసి, యాత్మసంరక్షణ కసి పట్టనిచ్చి
యేలువారలు పాలితేచ్ఛ లీపాటి, మన్నింతురేని సామము నింతురేని
యుజ్జగించును శాసనోల్లంఘనంబు, వలయితగోష్ఠికి వచ్చి కాంగ్రెస్సు
నిజమనోరథము లన్నియు వెల్వరించు", నని తన 'యంగిండియా' యందు వ్రాసె
విలువ నీఁడయ్యె నిర్వను గాంధినుడుల, కణఁగెఁ గాంగ్రెసువారి కాత్మనిగ్రహము
కార్యవర్గమువారు క్రన్నన వచ్చి, గురుమ్రోల నాశ్రమక్షోణిఁ గూర్చుండి 34

## శాసనధిక్కారము

"శాసనధిక్కార సమయంబు వచ్చె, సాగింపవలయు నీసమరంబు గాంధి
సత్యాగ్రహుల నెల్లజను లాదరించి, యుచితసాహ్యము వారి కొనరింపవలయు
పెద్దవారిం జెఱఁ బెట్టిననాఁడు, రావలెన్ బిన్నలు రణరంగమునకు
నుద్దీప్తి నీవలె నుద్యమంబునకు", ననెడితీర్మానంబు నంగీకరింప
విరిసె నుత్సాహంబు వివిధరాష్ట్రముల, నెది త్రోయఁదగుచట్ట మిపు డని ప్రజలు
తహతహపడుచుండఁ దర్కించుచుండ, నుప్పుచట్టం బనె యోగిపుంగవుఁడు
తననిర్ణయంబు నత్తఱి నిర్వినునకు, నెఱిఁగించు టొప్పని యెంచి మహాత్ముఁ
డొకకమ్మ వ్రాసి నెయ్యుఁడు రెజినాల్డు, దూతగా నద్దాని దొరకు నందించె,

ఆకమ్మయందు "వయస్యవరేణ్య!, చట్టమున్ ద్రోయంగ సమయంబు వచ్చె
ఈవార్త మీకు ముం దెఱుకువచేసి, తలఁగించుకొందు నాతలమీఁదిబరువు,
ఏ నహింసావాది నే ప్రాణికేని, కీడొనర్పుట నాకు గిట్టనిచేఁత
నాకు నావారి కేనరుఁడైన నెగ్గు, సేయుచో సైరింతుఁ జిటచిటలాడ
ఈనేల నాంగ్లేయు లేలెడితీరు, పాపపుంబాదని భావింతుఁ గాని
యిచ్చటితెలవాని కితనిసంపదకు, నెదరు గల్గింప నే నెన్నఁడున్ దొడర
నాంగ్లేయులందఱు నాలరుల్ గారు, నాకాంగ్లమిత్రు లున్నా రెందఱేని
గర్వింతు నీకల్మి కలదు నాకనుచు, ఇంగ్లీషువార లీయిల కెగ్గు సేఁత
కనుఁగొంటి నొకపుస్తకమును బరించి, తద్గ్రంథమును సూనృతప్రియుఁ డైన
యాంగ్లేయుఁడే కూర్చె నన్నిమూదలల, ఈమహిం గలవిత్తమెల్ల నల్లల్ల
నాహరించినదయా యాంగ్లరాజ్యంబు, మోయఁజాలని వెచ్చమున ముంచె దీని,
నోర్లేనిప్రజలకు నొవ్వులుపెంచి, కటికిపేదతికంబు కల్పించె నకట!
మాకు దాస్యముగూర్చె మాయాత్మ నణఁచె, జగదీడ్యమైన మాసంస్కృతిం జంపె
అసిపట్టుహక్కు లేదన్నది మాకు, తలయెత్తలేని పందలఁ జేసె మమ్ము
ఎల్లి మీ రోడఁగూర్పు నెల్లపక్షముల, సభ నేతిబీఅయౌ చందంబు తెలిసె
ఇండియా కధికార మేరాళ మిడిన, బేరసారమ్ములపేర మాకల్మి
సంగ్రహింపఁగఁ దగుసం దుండ దంచుఁ, దలఁచిరి మీవారు తథ్య మీపల్కు
మే మింకన్ దడయుట మేలుకాఁబోదు, దాస్యంబు నదలించుతఱి వచ్చె మాకు
మావారు కోరుస్వామ్యము తీరు వినుతు, నానుడుల్ సావధానంబుగా వినుఁడు
పూర్ణస్వతంత్రతా పూరితమైన, భారతంబున లోఁగవలె నేలపన్ను
ఒకమేర శిస్తున కొనగూడవలయు, హాలికునిమేలు ముఖ్యంబుగాఁ జూచు
నాయవ్యయము లుండనగు నేలుబడికి, ఉప్పుపన్నంతయు నుడివోవవలయు
మద్యంబు నమ్ముట మణగిపోవలయు, వేతనమ్ములు గూర్పుప్రేఁగు పోవలయు
వలయు సేమములెల్ల వసపడుపొంటెఁ, దగుకర్జముల కేము తలకొనవలయు
నలుసంత యగుఁగాక నాయనుభూతి, యది యహింసాశక్తి యతివేల మనును
అస్మ దహింసామహత్త నీనాఁడు, జగతికిన్ జాటెదఁ జట్టంబు నెదిరి
మున్నుగా నాశ్రమంబున నుండువారె, శిష్టి నుల్లంఘింత్రు శిక్షితమతులు
పదపడి యెల్ల రీపని యొనర్చెదరు; ఇది విపత్కరమని యే నెఱుంగుదును
వనటలందక యెట్లువచ్చును జయము?, నిన్నమొన్నటిదాఁక నే నంధునట్లు
తోడుగా నిల్చితి దొరతనంబునకు, నేఁడు కన్నులువచ్చి నిక్కంబుగంటి
సాయంబుమానుట చను ననుకొంటి, తెలవారిపైఁగల తియ్యంబుకతన
వారికి మేల్గూర్పువాంఛ కతానఁ, బఱపితిశస్త్ర మిప్పటికిఁ దెగించి
ఆంగ్లేయు లీసత్య మంగీకరించి, యెద మార్చుకొందురే నెలమినందెదను;

నావారు నాబాట నడుచుకాలాన, దుర్భరవ్యథలలోఁ దోఁగుట తప్ప
దపుడు పాషాణంబులైనను గరఁగు, నవు దుక్కు వెన్నగా నగుట నిక్కంబు
ఈపల్కులకు మీర లియ్యకోల్‌చూపి, మనకున్న భేదముల్ మఱఁగింపరేని
పదినాళ్లుచూచి సబర్మతీప్రజలు, వెంటరా నమ్రాశివేలకు నేగి
యుల్లంఘనమొనర్తు నుప్పుకట్టడను, గంజి కెంతోయుప్పు కావలెఁగాన
పేదవానికి నుప్పు పెద్దయున్ వలయు, దీనిపైఁ బన్ను విధించుటే నింద్య
మఱఁగించువాఁడ నీయరిని మున్ముందు, బందిగంబునకు నన్ బంపి నాయాట
కట్టించుటకు శక్తికలదయా! మీకు, నాతోడ నాఁగ దీనాఁటిధిక్కార
మౌగాము లరయని యాలంబుగాదు, ఇన్నాళ్లనుండి నే నేగెదుబాట
పల్కెడిమాట సేబాసని మెచ్చు, సత్యాగ్రహులు వేలసంఖ్యనున్నారు
ఈకయ్యమును సిల్గు లెన్నేని సైఁచి, వేడ్కమై వారు నావెనుక సాగింత్రు
శాసనావళికి మచ్చుగఁ దోఁచునట్టి, శిష్టిని ద్రోసి మున్ చెఱకు నేఁజనెద
నిదియె నాకర్తవ్య మిర్వినూ! నేఁడు, కడుఁబెనంగితి మిమ్ముఁ గారించుమాట
యీకమ్మలో నొకండేని చేరమికి, నా కెంతజయ మబ్బినదొ మహీపాల!
దైవం బెఱుంగును దా మెఱుంగుదురు, అంగ్లేయుఁడగునేస్తి హస్తమందునిచి
చేర్చుచున్నాఁడ మీచెంత కీజాబు", ఒజ్జ యీరీతి లోకోత్తరమైన
కమ్మ నంపఁగ దీనిఁ గన్నంత నిర్వి, "నిపుడు గాంధి యొనర్పనెంచినచేత
శాస్త్రవిరుద్ధంబు శాంతిభంజకము, మల్లడిగూర్చు నామది" కనిపల్కె
అపుడు బా పిట్లనె నక్కటా! రొట్టె, నడుగఁగా నిటిక నాకబ్బె నీనాఁడు
నశియించునఁట శాంతి నాపనివలన; వెడఁదబందిగముగా వెలసినచోట
నిపుడున్నదా శాంతి యానేలయందు? బల్మి నాంగ్లేయుండు వశపడుఁ గాని
యితరసాధనముల నితఁ డెట్లులొంగు, నాకున్నయనుభూతి నలికంబు గామి
నిర్వినుమాటల కే నమ్రపడను, కన్పించినది నాకుఁ గార్యంపుసరణి
లవణశాసనము నుల్లంఘింతు నిఁకను, నన్నుఁ బట్టిననాఁడు నడువఁగాఁ దగిన
తెరువెట్టిదో మున్నె తెల్పితిం బ్రజకు, నాఁడు నాపల్కు మన్ననచేసినట్లె
పాటింపఁగోరెదఁ బ్రజల నేఁడేని, కారకేగిననాఁడు కాంగ్రెసుసొమ్ము
నర్థింపరా దింటి కనుచుటకొఱకు", ననుడు భారతమెల్ల నలరి ధిక్కార
సమయంబునకు వార్వసాగె నుత్కంఠ; నేకసప్తతియోద్ధ లిద్ధచరిత్రు
లాచార్యుతొనేగు నర్హతం గనిరి, ఎర్నేనివారింట నేర్పడ్డబిడ్డ
యాంధ్రసవిత్రిపుణ్యంబుల పంట, సత్యాగ్రహాశ్రమ సభ్యతాగరిమ
నలరు సుబ్రహ్మణ్యుఁ డాజోదులందు, నొకఁడయ్యెఁ దెల్గువా రుల్లాసమంద
దం డిది రెండువందలమైళ్ళు నడచి, పశ్చిమవారాశిపజ్జ నొప్పారు
దండి యన్‌పల్లెకుఁ దఱియంగవలయు, నట నుప్పుచట్టంబు నదలింపవలయు

కదలనుండె దళంబు; కదలె మున్ముందు, వల్లభాయిపటేలు వరణీయచరితుఁ
డతఁడు బార్డొలిసీమయందు ననేక, జనపదమ్ములు చూచి జాతీయముక్తి
కొకమహాయజ్ఞంబు నొనరింప గాంధి, వచ్చుచున్నాఁడు మీవంతుకానుకల
నర్పింప వేవేగ నాయిత్తపడుఁడు, మాటిమాటికి నిట్టిమహనీయమఖము
రా దిట్టిపండువురాదు పల్మాఱు, బాపుజీ నడిచినబాటలో నడువ
బాపుజీ పల్కినపల్కు పాటింప, నడుముగట్టుఁడు వచ్చినది ముహూర్తంబు
రంగమ్మునకురండు రం డనిప్రజల, కుత్సాహమును గూర్చుచుండ నేలికలు
సైరింపలేక యీజగజెట్టిఁ బట్టి – మార్చి 6, శిక్ష మూన్నెలలని చెఱసాల నిడిరి
అహమదాబాదునం దపుడొకలక్ష, జనులు కూడి పటేలుసరణి మా సరణి
యిడుమ లెన్నిటినైన నే మోర్చుకొందు, మిచట స్వతంత్రతాహేళిరోచిస్సు
ప్రసరించుదనుక మాపాణి కీనాఁడు, కట్టిన హంవీరకంకణం బూడ్ప
మందాఁక శాంతింప మందాఁక శాంతి, దొరకనీయము తెల్లదొరతనంబునకు
సత్యంబునకు నహింసకు దోయిలించి, పడుతుము దాస్యంబుభంజించుశక్తి
నని ప్రమాణమ్ము సేయన్ గురుమౌళి, యలరి వయస్యులారా! మిమ్ము మెత్తు
నొకపల్కు వినుఁడు నే నుప్పుచట్టమును, ద్రోయునంతకు మీరు త్రోయుట వలదు
ఏను గమ్యస్థలి కేగునప్పటికిఁ, గార్యక్రమంబెల్లఁ గన్పించు మీకు
నిగ్రహమూర్తులై నిలుఁడు నిలుండు, తగదు తొందరపాటు తంత్రంబుపట్ల,
గ్రామంబులను బ్రేమగౌరవంబులకు, నాటపట్టులఁజేయ నలయుఁడీ మీరు
ఒకమాట నొకబాట నున్నదేశంబు, తెల్లవారల గుండెదిటవు పోకార్చు
భారతోర్విికి ముక్తి పాటిల్లుకొఱకు, రణరంగమగును ఘూర్జర మంటి మున్నె
కంటి నేనాడొ మీకడిమిని నేను, కను నెల్లలోకంబు కామక రేపు"
అని సభ్యులకుఁ బ్రశంసావాలమైన, సందేశమొసఁగ జైజైధ్వనుల్ రేఁగె
అంతలో లవణసత్యాగ్రహసవన, నిర్ణీతకాలంబు నెట్టనవచ్చె 12-3-30
ఆనాఁటిరేపాడి నాశ్రమసభ్య, తతితోడ గాంధి ప్రార్థన నిర్వహించి
చేత మువ్వన్నియజెండా ధరించి, కదలె దళంబుతోఁ గదలియొడ్డునకు;
సన్నిహితగ్రామ సైరికప్రజలు, కడుఁ బేరుగాంచిన కాంగ్రెస్‌వజీర్లు
బహుదేశపత్రికావ్రజ విలేఖకులు, ప్రతిబింబసంగ్రహ ప్రజ్ఞాప్రసిద్ధు
లసమానచలనచిత్రాళీ విధాత, లహమదాబాదుపౌ రార్భకుల్ యువలు
విశ్వబాంధవుని సంవేష్టించి రపుడు, సన్న వెదురుగఱ్ఱ శయమునం దాల్చి
మోహనంబగు మౌనముద్ర ధరించి, సేనాముఖంబునఁ జెకచెక నడుచు
బాపుతోఁ బ్రజ పిక్కబల మున్నదనుక, నరిగి; రాదృశ్య మత్యద్భుతం బయ్యె
ప్రస్థాన మిద్ది ప్రారంభించునపుడు, సత్యాగ్రహాపూర్వసమర విధాత
మందివంకకుఁజూచి మార్గమధ్యమున, మరణింతునా సరే! మనియుందు నేని

స్వాతంత్ర్యభాస్కరచ్ఛవి తోఁచుదనుక, రా నాశ్రమోర్వికి రా ననిచాటె,
భయదూరుఁ డీక్షిత ప్రజ్ఞశేఖరుఁడు, సర్వసేనాపతిస్థాన విభాసి
గురుమౌళి యిట్లైదుక్రోసులు నడిచి, యస్లాలి యనుచోట నాఁగె నాపూఁట
నూరివా రర్థిమై నొసఁగినతిండి, సొపడియెను సానుచరముగా గాంధి,
ఖద్దరుకట్టుఁడు కల్లుత్రావకుఁడు, తరలింపుఁ డస్పృశ్యతా కిల్బిషంబు
నెలవుల బాటల నీటుగా దిద్ది, శౌచధామమ్ముగాఁ జలుపుఁడు పల్లె
తరతరంబులనుండి తలఁగనిదాస్య, మణఁగింప సత్యాగ్రహంబునఁ జేరుఁ
డిట్టిభాగ్యము దక్క దెల్లవేళలను, ప్రాక్తనపుణ్యముల్ పండి యీనాఁడు
మనపాలిదై వచ్చె మాతృసేవనము, తల్లిబన్నము పాపు తనయుఁడే తనయుఁ
డమ్మకై బలివోవునతఁడె మానవుఁడు, తనువు నిత్యముగాదు ధనము చంచలము
చావులేనివికీర్తి, శౌర్యవిస్ఫూర్తి, స్వప్రయోజనములచక్కికిం గాక
దృష్టిసారింపుఁడీ దేశంపుదెసకు, అధికారులకు జంక నక్కఱలేదు
లే దహింసాగ్ని వెల్గెడిచోట భీతి, యని గ్రామవాసుల కాదేశమిచ్చె
వందలు వేలుగా వచ్చి దేశికుని, పౌఁజుఁలోఁ జేరిరి పల్లెలవారు
సాగుచున్నది గాంధిసంగ్రామయాత్ర, మ్రోఁగుచున్నది విశ్వమున జయస్వనము
సత్యంబు కల్లను సమయించునట్లు, తేజంబు చీఁకటిన్ దెరలించునట్లు
ప్రాణంబు మిత్తిని భంజించునట్లు, బాపూజీ తెలవానిపస దూల్చు ననుచు
జగమెల్లఁ బలికె నాసమయంబునందు, ఒకనాఁటివిడిదికి నొజ్జను గాంచ
నేగుదెంచినవారి నీక్షించి తనిసి, బా పిట్లు నుడివె నోబాంధవులార !
భరతోర్వి కాంగ్లేయపరిపాలనమున, నిప్పచ్చరమువచ్చె నీతినశించె
అధ్యాత్మికంబగు నాసక్తితొలఁగె, ఇది పాపములకెల్ల నిల్లనుకొంటి
పరిమార్పవలయు! నీప్రభుత నీనాఁడు, ఏల్బడి నణఁగించుటే పాడిగాని
దొరలపై మన కెట్టిదుశ్చర్య తగదు, ఈశ్వరుండు మహీశు నేలుగా కనెడి
పాట పాడితి మున్ను పరిషత్తులందు, వేమాఱుపంపితి విన్న పంబులను
సంధికృత్యము లెన్నొ సాగించినాఁడ, ఇది రిత్తపని యని యీనాఁటి కెఱిఁగి
వేఱొండుదారిలో వేసితి నడుగు, ప్రభుత నెదుర్చుటే పనినాకు నేఁడు
తోడైన మిముఁజూచి తుష్టినందితిని, పదివేలయేన్గులబలిమి నాకొదవె
ఏల్బడిలోనిక్రు ళ్లెలను ద్రోఁత, తగునుగానీ హింసతగదయా! మనకు
కత్తి, నెత్తురులేని కదనంబు మనది, జగతి కపూర్వమౌ సమరంబు మనది
సామాన్యబాధల జయమురా దిందు, సత్యంబు ధైర్యంబు శౌచంబు కరుణ
వినయంబు త్యాగంబు విశ్రుతక్షమయుఁ, గలవారె గెల్తు రీకయ్యంబునందు
జాతిము క్తిని వారె సాధింపఁగలరు, ప్రజకిట్లు ధర్మువుం బగటుచు గాంధి
సాగిపోవుచునుండ సకల రాష్ట్రముల, దైవాఱఁదొడగె నుద్యమము వేవేగ

ఏల్బడివార లీయే పోర్వలేక, కొల్లాయిగట్టి యేకులు కదు రూని
దండికిన్ జెకచెకఁ దరలుమహాత్మ, బొమ్మలు చూపింపఁబోల దటంచుఁ
జిత్రశాలల కాజ్ఞచేసి రయారె!, సత్యం బహింస శస్త్రములుగాఁ బోరు
ప్రజ గాంధిప్రజ యన్న బహిరంగమర్మ, మెఱిఁగియు సత్యాగ్రహిచయమ్ము వెనుకఁ
బోలీసుపిండు నబ్బురముగా నిల్పి; రిదిగాక గాంధివాహినికిఁ దోడ్పడెడి
గూఢచారుల నెల్లి కొటికలన్ నిల్పి, రిదిగాక గాంధివాహినికిఁదోడ్పడెడి
జనులమన్నింపదు సర్కారటంచు, భేరగాంధ్రకుఁ బెదపెద్దకాఁపులకు
సాహుకారులకు హెచ్చరికలుపంపి, రాంగ్ల మించుకనేర్చి యద్దాన బ్రదుకు
సాగించువార లీజంకెనల్ సూచి, భయమునందిరి గాని పల్లెలవారు
నవ్విరి కొండలునా నిల్వఁబడిరి, కుట్రల్ కుతర్కముల్ కూటిబెడంద
లెఱుఁగనిచోటఁగా కెచట ధైర్యంబు, దేశభక్తి వితీర్ణి దీపింపఁగలదు?
ఆయెడ గ్రామీణు లాంగ్లప్రభుత్వ, మీయుర్వి నిలువరా దిది జాతిసిరిని
మానమున్ గబళించు మాయలమారి, యీదయ్యమును నావ కెక్కింపవలయు
నీకయ్యమునఁ బ్రాణమే నొడ్డవలయు, చీము నెత్తురులేని చెన్నంటిగాక
యెవఁ డోర్చు స్వాతంత్ర్యహీనమౌబ్రదుకు, పరిపంథు లెన్నియాపదలు గూర్చినను
బదరాని రక్కెసపాట్లు తెచ్చినను, బూర్ణస్వరాజ్యానుభూతి యౌదనుక
భారతమాతృ శోభాసుప్రసాద, కలితమంగళమూర్తి కన్గొనుదాఁక
విప్పము విప్పము వీరతాయెత్తు, త్రిప్పము త్రిప్ప మేస్థితినైన మడమ
ననితెగించి మహాత్మునాదేశమునకు, వినతులై నిల్చిరి విక్రాంతిమూర్తు
లానాఁడు పల్లెటూ రనిమొననుండెఁ, బోనాడె స్వార్థానుభుక్తిపై రక్తి
గ్రామ మివ్విధి నాయకత్వముం దాల్ప, నోట రాఁగలదా ప్రజోద్యమంబులకు
వినుసోదరీ! ధర్మవీరునిదండు, దినదినం బిట్లు వర్ధిల్లుచునుండ
"జంబుసారు"ను జేరి జగజోదు గాంధి, యచటివా రన్నపానాదుల నాఁపి
సరకారులెంకల సర్వవిధాల, నేఁచుచున్నారని యెట్లోయెఱింగి
చనదు సాంఘికబహిష్కరణ మెవ్వరికి, నిది నింద్యమగుచేఁత యెదిరిసేమంబు
చెఱుచుట మనకు నిషిద్ధకార్యంబు, సర్పపుంగాటుతోఁ జావనున్నట్టి
పగవానితనువును బటపటం గొఱికి, విసమెల్లలాఁగి యావిద్వేషిబ్రదుకు
నిలుపం బెనంగుదు నే ననినుడివి, యఖిలభూతంబులయందును దనకుఁ
గలహార్దముం జాటి కదిసె సూరత్తు; అచట వేల్పుఁను వేదునవసరమందుఁ
దనవారిఁజూచి సోదరులార! మనము, శాసనధిక్కృతి సలుపఁగాఁ దగిన
సీమ కీనాఁడు వచ్చితి మల్లనల్ల, మనపట్ల నెంతేని మమతవెలార్చు
నెయ్యురు పెక్కు నీనేల నున్నారు, గారెబూరెలతోడఁ గమ్మనివిందు
సమకూర్చి వడ్డించి సాపడుఁ డంచు, నర్థింత్రు మనలవీ; రపు డామెతలకు

లోపడకుండు మీరు లోఁగి నాలుకకు; మనపయనం బిట్టిమధురాన్నములకు
సాగుటలే దన్న సత్యంబు గనుఁడు, కడిఁదివెచ్చము నోర్చి కావించుతిండి
మన మారగించుచో మాసాన కింత, సంబళమేల వై స్రాయి! నీ కనుచుఁ
బ్రశ్నింపనేర్తుమా పాడినెఱుంగుఁ; దన్నార్తులబెడంద నణఁచుటకొఱకు
మాయాత్రసాగు నమ్మా! యయ్య! నమ్ము:, దని సదస్సులఁ బల్కునట్టివారలకు
హక్కున్నదా?మెక్క హల్వా పకోడి, హక్కుఁజేసట్టేవిం దారగించుటయు
దొంగిలితినుటయున్ దుల్యదోషములె, దొంగతిండియనంగ దోసాలనెల్లఁ
జంపని పాదరసం బనఁజెల్లు, దారిద్ర్యమునఁ గందుధరణి నేపాటి
కన్పించునో యార్థికంబగుశక్తి, యాపాటికిన్ మించినట్టి బోనంబు
తినుట చౌర్యమ్ముతోఁ దెచ్చినతిండి, నారగించుటపోలె నవమానితంబు
తెలియునా మనభూమి దినమున కేదు, కాసులరాబడి కలదు మానిసికి
అయంబునకుఁ దగినట్లే తినుండు, కినియకుఁడేను బల్కినవాక్యములకుఁ
దరుణంబువచ్చె నంతర్ముఖుల్ కండు, అనినబాపువచస్సు లందఱకన్ను
తెఱచెఁ దూలించె సందియములనెల్ల, మున్నూర్వురుపటేళ్లు మోహనునుడులు
వినుచు నుద్యోగముల్ వెసవెసఁ ద్రోసి, రంతట నవసారి కరిగి మహాత్ముఁ
డాయూరివారి కిట్లనెఁ బేర్మిమెఱయ, కల్లుసారాలమ్మి కాసులార్జించు
పని మానుకొండు తప్పక బేరగాండ్రు, పాపపుంబని యిది పరువుమర్యాద
లణఁగించుపని యిది యర్థముం బడయు, టుచితంబె కాని ధర్మోల్లంఘనంబు
గావించి విత్తమున్ గడియింపరాదు, కల్లుబేరము నుప్పుగంటిపన్నణఁపఁ
జాలితిమా యహింస జయించినట్లు, వచ్చు నీగెల్పుతో వసుధకు ముక్తి;
ఆచరితవ్య మెయ్యది యని తచ్చి, యుప్పుచట్టము ద్రోయ నుద్యమించితిని
పడయుదు నిందుఁ దప్పక కృతార్థతను, ఈమేలురానిచో నీసముద్రంపు
టలలపై నూఁగింతు నస్మచ్ఛవంబు", నొజ్జ యిమ్మొయిఁబల్కి యొకనాఁడు రామ
భద్రుండు లంకను బ్రాపించినట్లు, తగగమ్యమైనట్టి దండికిం జేరి – (ఏప్రిలు 5)
వచియించె నీరీతి వార్తావహులకు, వారణం బావంత వాటిల్లకుండ
ముగిసెఁ గయ్యంబున మొదటిరంగంబు, ఇది వేల్పుదయగాక యేమనువాఁడ
నర్పింతు నేటికో ళ్లాజగత్పితకు;
రాజకీయంబు లెన్నియో సల్పితి మున్ను భావింతు నిది తుదిబవరం బటంచు
సరిలేనిగెలు పిందు సమకూడుఁగాక, యీపైనమున కెట్టియిబ్బంది నిడని
యేలువారితెఱంగు నెంతయు మెత్తు, వల్లభుం జెఱకంప వంగనాయకుని
సేనుగుప్తను బట్టఁ జెలరేఁగినట్టి, యధికారు లేలనన్నడ్డరో నేఁడు
చుల్కగాఁ బ్రజమదిం జుఝ్ఝుపుట్టించి, యవల వారికిఁ బెద్దయళుకు గల్గించి
తీవ్రశిక్షలువైచు తెలివిలో వీర, లారితేతినదిట్ట లనుట నిక్కంబు

హింసకుదవ్వగా నివు డీజనాళి, సాగించురాచకర్దముల నణంప
జగ మిసీ! యను నన్నసరణికి వచ్చి, యుగ్రతన్ విడి యోర్మినుందురు వీరు
ఇన్నాళ్ల నాయాత్ర నెదురనిదొరలు, రే పెల్లసీమల రేఁగుధిక్కార
మోర్తురా చూచెద; నుప్పుచట్టంబు, నెల్లి యుల్లంఘింతు నిష్టులతోడ
పాపంబెఱుంగని పాంచాలజనులఁ, బ్రథితమౌ జలియనువాలావనాన
నెదలేనిదయ్యరు హింసించినట్టి, సమయ మేప్రిల్‌నెల షష్ఠదినంబు
కడుఁ బవిత్రదినంబు కాంగ్రెసువారి, కది పాచితంబున కనుకూలదినము;
వచ్చు రే పా ప్రొద్దు వార్చెడిప్రొద్దు, పస్తుకట్టడ పూని భగవంతు వేఁడి
సాగింతు మెల్లి శాసనతిరస్కార, మఖిలభారతము శుద్ధాత్మమై నిల్చి
యీలగ్నమున శిక్షి నెదిరించుఁగాక, మాతృదాస్యంబును మానించుకొఱకుఁ
బ్రజలొనర్చెడిసేవ, పాటించునీవి, పండివైరి "జితోస్మి పల్కునుగాక"
కదిసెమూర్తంబు చీఁకట్లుపర్వెత్తె, నరుణారుణద్యుతి నర్కుండు తోఁచె
పశ్చిమాబ్ధితరంగపటలి నర్తించె, బాపుజీ యీశ్వరప్రార్థన సల్పి
కాంతులీనెడి యుప్పుగల్లును బట్టె, దళవాయితోపాటు దళమెల్లఁ బట్టె
చాఁగురే! మూఁగినజనమెల్లఁ బట్టె, చట్టంబు నిటు తిరస్కారమొనర్చి
విశ్వంబునకు నిట్లు విధనిచె మోహనుఁడు, లే దుప్పుచట్టంబు లేదునేఁ డిలను
ధిక్కరింపుఁడు ప్రజల్! దీని నెల్లెడల, ధిక్కరించెడివా రధికారు లేచి
యేశిక్షనిడిన సహింపఁగా వలయు, వీలున్నచోటికి వెడలి జనంబు
చెలరేఁగి లవణంబు సృష్టింపవలయు, తెలియనివారి కీతెఱఁగు బోధించి
యిది యేలుబడివారి కింపమి దెల్పి, చెఱసాలకంపెడి చెయువని పల్కి
కావలెనని చేయుకార్యంబు గాన, నిది దొంగపనిగామి యెఱుకువచేసి
కడలిచెంగట నుండు కయ్యలయందు, నుప్పు వెల్వడుననియున్ వివరించి
తిన్నంతతినవచ్చు దీనిని బసికి, నిడవచ్చు మఱి విక్రయింపఁగావచ్చు
నని చాటి యఖినంద్యమైన జాతీయ, వారమం దీపనుల్ వారక చేయఁ
దగునట్టివనిపల్కి ధైర్యంబులేని, ప్రజలు విదేశవస్త్రంబు వర్జ్యమని
రాట్నంపుమగ్గంపురవళు లింటింట, మొరయు టొప్పని కల్లు ముట్టరాని దని
యూరూర వాక్రుచ్చు టుచిత; మిప్పనికి, మగవారికంటెను మగువ లెంతేని
తగుదు; రహింసావ్రతంబునయందు; ధీరత్వమందు, నింద్రియనిగ్రహమున,
నౌదార్యమున నింతి యార్జించినట్టి, జయము చక్క వచింపఁ జాలదుబాస,
మగవాఁ దహంకారమగ్నుఁడైనప్పు, దబలయైనది నారి యనుట నిక్కువము"
గురుఁ డిట్లు నుడివి యీకోలు నొసంగ, నెల్లరాష్ట్రముల నాఁ డెగసె ధిక్కార;
మాంధ్రరాష్ట్రమునఁ గొండాన్వయోదితుఁడు, విమలశీలుండు కోవిదవతంసంబు
"దేశభ"క్తాంక ప్రదీప్తుఁడైనట్టి, వెంకటప్పయ నేతృవిధి నిర్వహింప

నెల్లసీమలయందు నెల్లపురాల, నెల్లగ్రామంబుల నీతిరస్కార
మారబ్ధమాయె ధర్మావేశ మెగయ, కర్షకవర్గ మీాకయ్యంబునందుఁ
బెద్దయుంబాల్గొనె బేర్చినవేద్క, నిల్లువీడనియింతు లినదీప్తి గనని
వెలఁదు లీసమరాన వేలకులేలు, చేరిరి మువ్వన్నెజెండా ధరించి,
ఉప్పుచట్టంబెకా దొప్పనిచట్ట, మెదియేని నిల్వరా దీదేశమందు
దుష్టశిష్టులనెల్లఁ దొలఁగించుదనుక, శయనింప మని ప్రజల్ శపథించి రపుడు
సింధుతీరమ్మున శిబిరముల్ నిల్పి, వండిరి లవణంబు వాములైతనర
కడలికి దూరంబుగా నున్నవారు, చౌటిమట్టిని వండి సాధించి రుప్పు,
సత్యాగ్రహులు జట్లుజట్లుగాఁ గదలి, యూరూరుతిరిగి యీయుప్పుపొట్లాల
నమ్మిరి జాతిమే లాసించుపజకు, పాటలో నైదన్న ఁ బదియని పాడి
కొని రుప్పుమదుపులు కుప్పాలవారు, కార్చిచ్చువలెఁ దిరస్కారోద్యమంబు
క్రమ్మెఁ బట్టణముల గ్రామంబులందు, నిది రిత్తపనియని యిన్నాళ్లదనుక
నవ్వినపాలకుల్ నలఁగి కలంగి, జా గిఁకన్ దగదని సడిసన్నవారి
బందాలఁగావించి పదపడి బంట్ల, బందిగంబులకంప బవరంపుబల్మి
కడుకొనెఁగాని తగ్గద యించుకేని, యీపొంగు చెఱలతో నిగ్గదటంచు
నధికారు లూహించి యమదండమునకుఁ, దోడఁబుట్టువులైన దుడ్డుగఱ్ఱలను
సత్యాగ్రహులతలల్ చదిపి రెల్లెడలఁ, గొన్నితావులఁ దుపాకులు ప్రేల్చిప్రేల్చి
చంపి రావంతదోసము లేనిజనుల, నీహింసకతన నహింసారణమ్ము
పూఁటపూఁటకు నహో ! పొంపిరివోయె, గురుపిల్పుతో వేలకొలఁది వెలందు
లెల్లరాష్ట్రంబుల నేలువా రదర, సమరధాత్రికి దూఁకి సారాయి కల్లు
లాఁతివిలాతివల్వలు విక్రయించు, విపణులముంగడ వెఱవీడి నిల్చి
పికెటింగుసాగించి పేరుపే రంది; రేల్బడివార లీయింతులదెసకుఁ
జనలేక మగవారిఁ జాఁగొట్టిరపుడు, శ్రీమత్తలో నాగరికజీవనమున
విద్యలో నడతలో విశ్రుతులైన, కాంగ్రెసువారికిఁ గారాగృహాలఁ
గుక్కలుందాఁకని కూడు వడ్డించి, పాషాణముల ప్రీల్చుపను లప్పగించి
గానుఁగనీడ్చు దుర్గతిని గల్పించి, శిక్షలమేరయుం జెచ్చెరఁబెంచి
చాటిరి తమరాక్షసత్వమయ్యారె!, ఎట్టిదుండతికంబు నీకొన్ననేమి
యెవ్వాఁడు వెఱచె నీహింస కానాఁడు, నామన్నదకునేమి నాదేశమాత
పరువు పోఁగొట్టినపరపాలనంబు, నశియించినంజాలు నాకదేవలయు
పురుగులుతేలాడు పులుసువడ్డించి, చెఱసాల నరకంపుఁజెలి యైననేమి
తనియుదు నాతల్లి తలయెత్తెనేని, నాశరీరం బీరణక్రతువహ్ని
నాహుతంబైననే మస్మద్ధరిత్రి, సర్వతంత్రస్వతంత్రత గన్నఁజాలు
నని యెల్లమానిసి యపుడు భావించె; కట్టరాదన్నట్టి ఖద్దరు కట్టె

పెట్టరాదన్న టోపీని ధరించె, ముట్టరాదన్న యుప్పును సంగ్రహించె
జగ మబ్రపడ మనజనత యానాఁడు; పెడబుద్ధులన్ బెద్దపేరు గన్నట్టి
యేలికల్ చెఱకంపి యేఁచుటకంటె, లాటీలతోడ నలంచుటకంటె
నగ్గలమ్ముగఁ బ్రజ నార్థికశిక్ష, కారించు ననియెంచి కాంగ్రెసుపనుల
మలయువారికి జరిమానా విధింపఁ, దొడఁగి రూరూరను దుర్భరంబుగను
నవ్వి సత్యాగ్రహుల్ నాఁ డొకచిల్లి, గవ్వయు నీకుంటఁ గక్కసపడ్డ
యేలికల్ గేదెల నెల్లఁ బొలాల, వేలమునంబెట్టి విలుచువార్లేక
వెల్లఁబాఱిరి సిగ్గువెల్లువం బడిరి, ము న్నెన్నఁడో చన్నముద్రణశిష్టి
కూపిరిపోసినా రుర్వీశు లంత, పత్రికల్ వెడలించుపని సేయువారి
నచ్చొత్తువారి నియ్యది కడున్గుంచు, నధికారు లడిగినయంతవిత్తంబు
బాధ్యతాధనముగాఁ బత్రికాధిపులు, వారక చెల్లింపవలయు నిద్దాన
సంచాలకులప్రాంత సర్కారువారి, కిష్టంబుగాదేని యిచ్చినసొమ్ము
నల్లవో! శిక్షాధనంబుగా మాఱు, నొజ్జ యాచట్టంపునుదుటు వీక్షించి
తనదు 'యంగిండియా' తరలిక నాఁపి, చాటె నీరీతి నీచట్టమున్గుఱిచి
"యీనేలవా రంద ఱెఱుఁగరుగాని, యిచట నేఁ డుచితమౌ నేల్బడిలేదు
ప్రభువు పౌరస్వామ్యపరిరక్ష మాని, సేనాపతిత్వంబు శిరమునం దాల్చె
నితనిచట్టంబులు హేతిచట్టంబు, లితనిపాలనము గర్హితపాలనంబు
ఇతఁ డున్నచట్టాల నెడలింపఁగలఁడు, రక్కసచట్టాల రావింపఁగలఁడు
ప్రతిఘటనక్రియాపరత లేనట్టి, వినతులై బ్రతుకులు వెడలించునట్టి
ప్రజల నిరంకుశ ప్రభుతపాల్ చేసి, తనబల్మి నెల్లఁ బ్రదర్శింపఁగలఁడు
ఈబింక మీగర్వ మీసాహసంబు, చెల్లునా భారతక్షితి నిప్డు? చెల్ల;
దాకాల మాయుగ మాదుర్ముహూర్త, మెప్పుడో పరుగెత్తె నీమహినుండి
యీక్రొత్తచట్టంబు నీక్షించి ప్రజలు, భయముపా ల్గారని భావింతునేను
పత్రికాచాలకుల్ ప్రజలకోర్కులకుఁ, బ్రతిభువులైన నీపనుపునన్ బెదరి
చెదరి ధరావత్తు చెల్లింపఁజనదు, మనమే నొసంగ సమ్మతిపడ్డనాఁడు
మనయాస్తి నొసఁగ నుమ్మలికింపరాదు, వచ్చి స్వాతంత్ర్యదేవత మనయింటి
తలుపుదట్టుచునుండఁ దత్ప్రసన్నతకు, మనప్రజ లూరూర మరణానకైన
నాయిత్తపడుచుండ నాపని కేము, కామందురా పత్రికాప్రతినిధులు?
మనయచ్చుకూటాల మనయంత్రములను, బట్టుకొందురుగాని పాలకుల్ నేఁడు,
పట్టుకొందురె మనపల్కు కలంబు?"
బా పిట్లునుడివి యేల్బడివార లుప్పు, పట్టినగుప్పిటిపై దుడ్డుగట్టి
నార్చుట గర్హించి యధికారు లేచి, యుద్యమంబు నణంప నుంకింతురేని
రక్కసపనులతో రాచెదరేని, చనదు కింకిరిపాటు సత్యాగ్రహులకు

చనదు కంకరపల్కు సత్యాగ్రహులకు, ‘నని దండునకుఁదెల్పి యద్దిరా! దొరలు
తప్పుచందము దెల్పి దానికిందగిన, శిక్ష దోషికివైచి చెఱసాల కతనిఁ
బంపక లాటీల బాధించుకంటెఁ, జంపవచ్చునుగదా చండాగ్ని పరపి
యని యేలుబడివారి నపు డెచ్చరించి, తనవారిఁజూచి సోదరులార! తాళ
ఖర్జూరవనములఁ గన్పించుగెలలఁ, గోయుఁ దవే కల్లుకుండల నింపు
మనకుశత్రువుకదా మద్య మటంచుఁ, దాన ము న్నొకగెలతలఁ ద్రుంచివైవ
మెఱపుకైవడి నుర్వి మెఱసె నీవార్త, ఊరూర నీకోఁత యువలు సాగింప
నెగసెఁ గాంగ్రెసువెల్గు లింటింటియందు, ఇఁకఁ దన్ను బంధింతు రేలువా రనుచు
భావించి బాపుజీ ప్రజల కిట్లనియె, యుగయుగంబులనుండియును భారతోర్వి
కున్నమన్నన కెందు నుద్ది కన్పడదు, తనగొప్పతన మిది ధాత్రికినెల్లఁ
జాటఁగాఁ దగినట్టిసమయంబు వచ్చె, నియమముల్ తప్పక నిష్ఠ నేమఱక
సమరంబు తుదదాఁక సాగించునేని, యిది సమగ్రస్వామ్య మీనాఁడు పదయు
నిది పైఁడిగద్దియ కెక్కు విశ్వమున; కష్టముల్సైఁచి త్యాగములాచరించి
సంతరించినగెల్పు సర్వదా నిలుచు, నేమూలనైన మీయెద నింతవెఱపు
దాఁగియున్న బిఱానఁ దఱుముఁడీ దాని, చచ్చుటలోఁగాక చంపుటయందుఁ
గానిపింపదు నాకు గణ్యమౌత్యాగ; మీరహస్య మెఱింగి యీప్సితార్థంబు
పదయుఁడీ సోదరప్రజలార! సరగ, మనగౌరవంబెల్ల మనబ్రదుకెల్ల
నొదిఁగియున్నది గుప్పెఁడుప్పులో నిపుడు, లాటీలవారి తుల్వతనంబు హెచ్చి
పిడికిలి నలియైన బిగినివీడకుఁడు, నన్ను ఁ బట్టిననాఁడు నలఁకనందకుఁడు
సారథి నేఁగాను సర్వేశ్వరుండె, కలఁ డెల్లవారిలోఁ గలఁ డీశ్వరుండు
నమ్ముఁడీ నాపల్కు నలిలేనిపల్కు, నమ్మిననాఁడు మీనాయకుం డతఁడె
సారథి యాతండె సచివుఁ డాతండె, వరదుఁ డాతఁడె కాచువాఁడు నతండె;
మనగమ్య మెద్దియో మనమార్గ మెదియొ, నిర్ణీతములుచుఁడీ! నెచ్చెలులార!
ఉప్పుచట్టము ద్రోయుఁ దుర్వేశు లదర; మదిర సారా నల్లమం దమ్ముచోట
లాఁతివిలాతివల్వల నమ్ముచోట, నదుపఁగావలయుఁ జానలు పికెటింగు
సీమగుడ్డల బూదిసేఁతయున్ వలయు, ఇంటింటమగవార లింతులు వృద్ధు
లర్భకుల్ తకిలీ సహాయమై తనరఁ, బుట్టింపవలె నూలు, పుడమికిం జాలు
కద్దరువల్వ లంగడికి రావలయు, ముట్టరానితనంబు ముడిఁగిపోవలయు
సకలహిందువు లొక్కసమితి గావలయు, హిందువుల్ ముస్లిము లేసయ్యవారు
పారసీకులు పరస్పరమైత్రితోడ, నితరేతరాశయ హితబుద్ధితోడ
జీవింపవలయు సుశ్రేయము ల్గనుచు, అల్పసంఖ్యాక జనావళిమెప్పు
గనవలె నధికసంఖ్యాకవర్గంబు; బాలకుల్ వెస రాచబడి వీడవలయు
నుద్యోగు లేల్బడి కొలువు గావలయు”, అనవుడు నుద్యోగుల లుకలంపిల్లి

సత్యాగ్రహుల బహుస్థలములయందు, వేధింపఁదొడఁగఁగా విశ్వమిత్రుండు
కలఁగి 'దర్శన' యను గ్రామంబునందు, మూల్గునుప్పుకొటార్ల ముట్టడింపంగ
నెద నెంచి వై స్రాయియిర్వినుకడకుఁ, జేర్పుట కిట్లువ్రాసెను బెద్దకమ్మ
"అవధారు! ప్రియమిత్రమా! దర్శనాఖ్య, నొప్పుపల్లియనున్న యుప్పుగొటార్ల
సానుచరంబుగా నాక్రమించుటకు, నిశ్చయించితి; నన్ను నిలువుతలంపు
మీకున్నదే నుప్పుమీఁదికప్పంబు, మానింపవలె, నొండె మముఁ బట్టవలయు,
నొండె నెత్తురుటేఱు లురల మాతలలు, వ్రక్కలు సేయింపవలయును మీరు
ఎట్లుచేసిననేమి యేతేరఁగలరు, కయ్యంబుసాగింపఁగాఁ గ్రొత్తబంట్లు
ఈముట్టడి మదాత్మ కిష్టంబుగాక, యిన్నినా ళ్లాఁగితి నెంతసయింపు
చూపిన మీవారిచుఱుకుఁదనంబు, కఱకుఁదనంబు మొక్కలితనం బకట!
నానాఁడు హెచ్చుచున్నది మహీపాల!, శాంతికాముకులైన సత్యాగ్రహులను
నాగరికంబగు నడతతో దొరలు, నిలువరించెద రని నేనూహ సేయఁ
బెడదారిఁద్రొక్కి రీబిరుదు లెందులకొ, ప్రథితినందినవారిపట్లఁ జట్టంబు
ననుసరించుట కొంత యగపడెఁగాని, సాధారణశ్రేణిసైనికుల్-దెసను
లేదుచట్టము నీతిలేదు వీరలకు, ప్రజలు గుప్పిటితోడఁ బట్టినయుప్పు
వదలింప నెమ్ములు వ్రక్కలౌనట్లు, పొడిపొడియౌనట్లు పోలీసువారు
బాఁదిరి మనికట్లపై దుడ్డుపూని, యిస్సిరో! నలిపినా రీదుష్టమతులు,
మావారిముష్కముల్ మనుజత వీడి, పదడుచేసిరి వీరు పంటపొలాల
త్రిప్పించి మల్లించి త్రిచ్ఛాయమైన, జెండాను విడువనిచిఱుతలఁగొట్టి
రెన్నియోదౌష్ట్యంబు లేచె బార్డోలి, నధికారులకు సత్య మన్నది గిట్ట
దపవార్తలను మీకు నంపెదర్వారు, మైరేయపానంబు మానుఁడీ! యనుచు
మావారు పల్కఁగా మద్యవిక్రేత, లెసరేఁగి వారల హింసిచుచుండఁ
బోవరై రటకు మీ పోలీసువారు, ఇదియెట్టియేల్బడి యిదియెట్టినీతి?
తలయెత్తె నేఁడు ముద్రణశాసనంబు, తలఁగె భగత్సింగుతప్పు చర్చించు
తతిఁ గోర్టువారికి ధర్మానురక్తి, యిట్టిచర్యలఁ జూచి యిపుడు దేశమున
సైనికరాజ్యమే సాగెడి ననుట, దోసంబుగాదని తోఁచు నామదికి
ఈ దుష్టపాలన మీకత్తిరాజ్య, మస్మన్మహీప్రజ నణఁపకమున్నె
తగుచర్య పాటింపఁదలఁచితి నేను, మీయల్క యిఁక మేరమీఱిపోవచ్చు
కాదేని తగ్గి చక్కంబడవచ్చు, నాపల్కులన్నియు నమ్మరుగాని
చిత్తగింపుఁడు వాని శిష్టులు మీరు, సత్యాగ్రహుల నేఁడు చక్కటిదప్పి
యధికృతుల్ హింసించునట్టి తెఱంగు, మీ కెఱిఁగించి యీమిడిసిపాటెల్ల
నరయఁగా మిమ్ము నాహ్వానింపకున్న, ననుఁ బాఱఁబోతని నవ్వదాజగము
పసలేనివాఁడని పల్కదా జనము, ఏ నాఫ్రికాయందు నీగడ్డయందు

సలిపితి ము న్న హింసాసమరంబు, లిందుఁ దేలినదేమి హింస నహింస
శాసించు ననుమహాసత్యమేచుండు!, మనసులో మాటలో మతి పనియందు
హింసకూడదు యని యెన్నేనిమార్లు, తెల్పితింబ్రజల; కీదినమునవారు
నేర్మినోర్మినివీడి నింద్యంబులైన, పనుల కొగ్గినఁ బూఁటపడఁజాలనేను
దౌష్ట్యం బహింసతోఁ దలక్రిందులగుట, నిజమని నమ్మిననేను నారణము
నెట్లునివారింతు? నీరుప్పుపన్ను, రద్దుచేసిననాఁడె రణ మాగిపోవు
శాసనధిక్కృతి చనదుపో! యనుచు, మీ కిష్టమగుభాష మీరు మాపనిని
దూఱవచ్చునుగాని దుర్దాంతశస్త్ర, వితతితోడఁ బెనంగువిప్లవచర్య
నగ్గింతురా సెప్పుఁ దాలకించెదను; అన్నారుమున్ను మీ రస్మద్రణంబు
చంపుతోముగియుట సత్యం బటంచు, నేఁడైన నీసరణిన్ బల్కవచ్చుఁ
గాని మిమ్ముఁ జరిత్రకర్త రే పెదురు, తెల్లవార లహింసతెలుఁగు నేనాఁడు
గాననివా రౌటకతన మానవుని, జెడుదారి కంపి రిసీ! యని యతఁడు
వ్రాయుటతప్ప దోవైస్రాయి! యెల్లి, అస్మదీయులకు మీ రల్క పుట్టించు
పను లెన్నిసల్పిన భగవానుఁ డోర్మి, నీయంగలఁడు; తాల్మి నెదయనిదండు
నాకుండఁగా నెట్లు నాతేరు నిల్చు? ఉప్పుకట్టదను మీ రుడిగింపరేని
సాగు నారథము ఝుంఝుంఝుంపతోడ (4-5-30) 35

## గాంధిని చెఱకంపుట

ఈలేఖ మరుసనాఁ డిభపురి కనుప, నెంచిన బాపుజీవృత్తాంత మెఱిఁగి
గుఱ్ఱువెట్టుచునున్న గురుని మేల్కొలిపి, యర్ధరాత్రమ్మున నధికృతుల్ పట్టి
యిస్సిరో! కొనిపోయి రెరవాడచెఱకు; జగమెల్ల నుడికె నాసమయంబునందు
సానుభూతివెలార్చె సకలవిశ్వంబు, హరతాళములు భారతావనిన్ జాగె
బేరంబులాఁపిరి బేహారు లడలి, కొంద ఱుద్యోగాలకున్ స్వస్తిపల్కి
రొకనాల్గునాళ్లలో నుర్వియందున్న, ఖద్దరుసర్వంబు కర్చయిపోయె
కాంగ్రెసువా రప్డు కార్యంబు నరసి, మనమరబట్టయున్ మాన్యంబె యనిరి
తీర్పిదివెడల విదేశ వస్త్రములు, కొనువారులేక మూల్గుటకున్ దొడంగె
కలవైరి యానాఁడు కల్లమ్మువారు, అబ్బాస్‌తయాబ్జీ మహాశయుం డపుడు
దేశికోత్తమునిగద్దియకు వేంచేసె, దర్శన్‌కొటార్లపై దాడిసాగినది
పోలీసులాటీకిఁ బొగరు హెచ్చినది, బంధితుండయ్యె నబ్బాసుతయాబ్జి
సరగ సరోజిని సారధ్య మూనె, ఈమెయు మూన్నాళ్ల కేగెనుజెఱకు
మదమత్రిప్పకసాగె మనగాంధిదళము, కొట్టెఁ బోలీస్‌మూఁక గుదియలన్ దాని
దివికేగి రెందఱో దేశసేవకులు, ఒకవిదేశీయుఁ డీయుద్ధతిం జూచి
"యింతసంయమశక్తి యేనెందుఁ గాన, బాపుజీప్రజకె యీభాగ్యంబు దక్కె

కసిలేని యసిలేని కాంగ్రెసువారి- తలలు వ్రయ్యలుసేయదండంబులెత్త
నెట్లు తెగించె నీయేల్బడిమూఁక? యీనాఁడు సత్యం బహింసయు గాంధి
బలఁగంబునెత్రుతోఁ బడసె నేకత్వ, మీదుష్టచర్యతో నీహింసతోడ
నాంగ్లజాతిఖ్యాతి యంతయున్ సమసె”, అని వార్తలంపె నయ్యాయిపత్రికల
కితరదేశమ్ముల నేపారువాని, కపుడు శిక్షాకాల మంతయున్ ముగియఁ
బ్రజలన్ గదిసె వల్లభాయిపటేలు, ఈతనిరాకతో నెగసె బొంబాయి-
సీమలో గుజరాతిసీమ నుద్యమము, వెడలెఁ గాంగ్రెసుపేర వెలయుసంఘములు
చట్టమొప్పని వన్నశాసనం బపుడు, అద్దానిఁగని పటే లఖిలభారత మ-
హింగలప్రాణుల హృదయంబులెల్లఁ, గాంగ్రెసునెడఁదలే, కాంగ్రెసున్‌గొల్చు
సంఘములే యనిచాట నైస్రాయి- మొగము విన్నంబడె ముకుళితమాయె
అంతఁ బటేల్‌మాట కలరి బార్డోలి, బోర్సదుసీమలం బొలుచుహోలికులు
పన్నీయ మనుచు నేల్బడివారి నెదుర, దొరలనిర్బంధముల్ దుడుకుందనాలు
పెరిఁగెనూరూరఁ బొంపిరివోయెదురుసు, వల్లభుతల్లి పావనశీల సుకృత
మూర్తి యెన్బదియేండ్లముసలమ్మ వండి, కుదుటఁబెట్టిన కూటికుండలో నిసుక
చిమ్మి పోలీసు కార్చెను గబ్బుచమురు; బోర్సదుమగువ లపూర్వోత్సవంబు
వెడలింపనెంచి దప్పికహెచ్చి రెచ్చి, నోరెండినప్పు డానుటకు నందందు
నిల్పికొన్నట్టి చన్నీటిబానలను, వ్రీల్చి పోలీసు లావెలఁదుల గొడ్డఁ
దోలినచందానఁ దోలి రయ్యారె!, పరుగెత్తలే కిలంబడి లేవలేని
తరుణిని బొరలించి తద్వక్షమెక్కి, త్రొక్కి రుదగ్రపాదుకలతో నిసిరో!
కరముచెల్లింపని కర్షకుం బట్టి, శిస్తీయవేని నీశేషమ్ముగోసి
నిన్నుఁ బేడినిజేసి నిర్భాగ్యుఁజేసి, జీవచ్ఛవంబును జేసెద మనుచు
బదరినా రొకయూరఁ బాపంపుగనులు, ఏల్బడివా రెంతహింసకుం దెగినఁ
బ్రజలు మఱవరైరి బాపూవచస్సు, వల్లభుం డపు దన్యవసుధాంబరంబు
వెలివేయుఁడీ! యని వెలఁదుల వేఁడ, వచ్చిరి కుసుమపూవన్నె చీరలను
బెక్కంద్రువనితలు పికెటింగు సేయ; వదలను నే సీమవల్వ బేర మని
మోహరించిన మూర్ఖమోము దీల్పడఁగ, నతనియంగడి మ్రోల నతనియిల్లాలె
పికెటింగుసాగించి బేరంబు నణఁచె, లాంకషైరువణిక్కులకు మతివోయె
త్రుప్పుపట్టెను వారిదుస్తులమరల, ఈబహిష్కృతిసేయు నింతుల నపుడు
పోలీసుమూఁక ముప్పొంగెడికాఁక, లారీలకెక్కించి లజ్జపోనాడి
వీటికిదవ్వుగా విడువం దొడంగె, చెట్టలెన్నింటిఁ గూర్చిననేమి చావొ
బ్రదుకొ తేల్చుకొనంగ భారతప్రజలు, నడుముగట్టి రహింసనప్రియదీక్ష
నెల్లరాష్ట్రంబుల నీనాఁడు చెఱకుఁ, జన్నవా రొకలక్ష సంఖ్యకుం గలరు
పోలీసులాటీలపోట్లతోఁ దలలు, నజ్జైనవార లున్నా రూరనూర

నగ్నిగోళమ్ముల కాహుతియైన, వజ్జీరు లున్నారు వందలకొలఁదిఁ
బాణిపాదము కుంటుపడి సైఁపరాని, వెతలఁగుందెడివారు వేలకున్నారు
సర్కారువార లాసురవృత్తి కొగ్గి, గడుసరులైన దొంగలను రావించి
దోఁచుకొం డనిరి రైతులబవంతులను, నిప్పు పెట్టించిరి నెలవుల కిసిరొ!
క్రూరతరంబైన గుణ్ణాలదండు, నూరూరఁద్రిప్పించి రుల్లాసపడుచు
సత్యముం బ్రకటించుచనవునణంచి, రై దాఋగురుకూడు టపరాధ మనిరి
కాంగ్రెసుసంఘ మక్రమసంఘ మనిరి, బాసచాలదు వీరిబ్రదుకెల్లఁ దెలుప
నేలువా రెగ్గు లెన్నెన్ని చేసినను, దేశంబు జతలేనిధృతిని నిల్చినది
ఇంతవా రంతవా రేహింసలేని, క్రాంతిసాగించి రక్కజమైనదీక్ష
వేల్వేలకాంత లీవిప్లవమందుఁ, బాల్గొంట చూచి యబ్రంపడ జగము
గాంధిబాటకువచ్చి కాంగ్రెసున్‌మెచ్చి, వెనవెసన్ బంద్రెండువేలముస్లిములు
బాపురే! నడిచిరి బందిగంబులకు, హిందువుల్ ముస్లిము లిట్లేకమగుట
యటనట సైనికు లాజ్ఞలం ద్రోఁత, గాంచినతెలవారు కంపించినారు
విన్నయాంగ్లేయులు వెఱ్ఱులైనారు, ఆరాష్ట్ర మీరాష్ట్ర మనిచెప్ప నేల
సకలరాష్ట్రంబు లీసమరాన దుమికె, బంగాళమున రెచ్చె బందాలసంఖ్య
హెచ్చెను గరనిరాకృతి ఘూర్జరమున, ఎక్కె రెండవపీఁట నిందుఁ గన్నడము
పొగడందె సంయు క్తభూము లావెన్క, బీహారునుతికెక్కె c బెఱవల్వ్రదోసి
యుత్కలంబును దీప నొందె నాదరము, మఱఁచెఁ గానలపన్ను మధ్యరాష్ట్రములు
కల్లుపాటలు చావుగనెఁ గేరళమున, తమిళనాటికి నిందు దక్కెగౌరవము
బందిబాధలు హెచ్చెఁ బాంచాలమందు, తనరె గ్రామీణచైతన్య మాంధ్రమున
నెందఱో చెఱకేగి రిచటఁ గర్షకులు, లాటీలవెత లీయిలన్ విజృంభించి
నాగళ్లకృష్ణయ్య నలినలియయ్యె, సుజనుండు గురుతల్లజుఁడు గుళ్లపల్లి
రామకృష్ణయ తేలె రక్తవాహినుల, కొండిపర్తిబుధుండు ఘోరా ర్తి నందె
గోనుగుంట్లవజీరు కొయ్యగామాఱె, స్రుక్కెను నాగభూషుఁడు గ్రుడ్డివాఁడు
తల్లాప్రగడజోదు తల్లక్రిందాయె, బ్రహ్మజోస్యులవీపు పఱియలువాఱె
రారాపులందె నారాయణమూర్తి, కటకటంబడియె వంకాయలగుప్త
బాబులాల్ పచ్చడిపచ్చడి యయ్యె, రక్తంబుచిందె దుర్గాబాయిమేన
బుచ్చిసుందరరావుబోఁకెలు విఱిగె, వెంకటప్ప శిరంబువ్రీలి మూర్ఛిల్లె
ఎందఱో లాటీల నిటు సచ్చిబ్రదుక, నుసుఋలం బాసె నహూ! యొబలేసు;
ఏమిసెప్పుదు నాఁటియేల్బడితీరు, రాకాసిరాజ్యమై రాపాడెఁ బ్రజల
గొంతెండి ప్రాణముల్ గుటగుటలాడ, నలమటచెందు సత్యాగ్రహినోట
మంచినీ ర్పోసినమానిసి నిసిరొ! యీడ్చిరి చెఱసాల కిల నేలువారు
ప్రతిపురంబునకు మల్పిరుసైనికుల, రావించి రానాఁడు ఊగుండెవారి

నీరక్కసులు తద్దయెగసి రే పవలు, గాలించి ఖద్దరుకట్టినవాని
బాఁదిరి నేల పైఁబడి తన్ను కొనఁగ, దొరతనం బెంతదుందుడుకుతో నున్న
మనవారు కనరైరి మనసుపేదతీమి, ధాత్రి యిట్లు స్వతంత్రతాసిద్ధికొఱకు
రెచ్చినతమి మోహరించుటంజేసి, యిచట వైస్రాయిపొం గిట్టింకులింకె
నచట మంత్రివరేణ్యుఁ డల్లాడిపోయె 36

## స్లోకోంబు రాయబారము

మార్గనా ల్డంత నిమ్మహీనున్న వానిఁ, బత్రికాలేఖకపద విరాజితుని
స్లోకోంబు నాఁ దగు సుహృదు నీతిజ్ఞు, సన్నిధికిం బిల్చి జంకులేనట్టి
బవరంబునకున్ దిగెన్ భారతభూమి, ఈఁగఁదొడంగె నాయుర్వి నాంగ్లేయ
పరిపాలనా మూలబంధంబు లకట! ఈసంగరంబున కేలికయైన
గాంధినిగని నీవు కమనీయఫణితి, సుభయగౌరవముల కూనతరాని
కరణిని మాటాడి కయ్యంబు నాఁపి, యీనేల కరుదెంచి యెల్లపక్షముల
గోష్ఠి నమ్మేటి పాల్గొనునట్లు చూడు, మసిలేనిప్రజలతో ననిసేయుటెట్లు
వారించుటెట్టు లీవైషమ్య మనినఁ, దలయూఁపి స్లోకోంబు తరినెక్కి యిచటి
కరుదెంచి యెరవాడ కరిగి మహాత్ము, నీక్షించి వినతుఁడై హితమితోక్తులను
"సత్యాగ్రహము నిల్పి శాంతివహించి, సర్వపక్షంబులసభ కేగుదెంచి
తమకోరు రాజ్యాంగతత్త్వంబు దెల్పి, యొప్పుఁడీ యీసంధి కోయయ్య" యనివ
నాచార్యుఁ డలరి "సత్యాగ్రహమందు, సంధికి సర్వదా సమయంబు కలదు
పాడి కీకోల్చూపి ప్రత్యర్థి రాఁగ, నతని కాసనమిత్తు నాదరమిత్తు
నెట నహింసరహించు నీర్వాదు లచట, నిలువఁజాలవుచుమీ! నీ వోట మాను
మేను హార్దముతో జయించినరాజ్య, మాసచేయుదు నన్య మర్థింప నొల్ల
నెమ్మి నబ్బినసిరి నిల్చునుగాని, పగను దక్కినకల్మి బ్రదుకునా చిరము?
ఈరహస్యము గాన కీనాఁడు జగము, కత్తులువిచ్చి యిక్కట్లు కిల్లాయె
ఏరాజ్యమునకు నేఁ డెద శాంతికలదు?, హింస హింసనుగాక మేమివడ్డించు?
పొరుగింటివానితోఁ బోరుండెనేని, నెచ్చెలీ! నరునకు నిద్రయెట్లబ్బు?
పాలితులెల్లరుం బగ తైననాఁడు, గోరంతసుఖము దక్కునె పాలకులకు?
చెల్లదుతంత్రంబు చిరజీవి యగుచు, నెల్లకాలముగెల్వ దెవనికత్తియును
ఆంగ్లేయు లీరహస్యంబు నెఱింగి, సుపథంబునకువచ్చి శోభింత్రుగాక
వారు మానెయ్యంబు వాంఛింతురేని, బందాల నిండ్లకుఁ బంపింపవలయు
ఉప్పుచట్టము వేగ నుడిగింపవలయు, కల్లుత్రాగుట తప్పుగాఁ జాటవలయు
పరదేశవస్త్రముల్ భారతక్షితికిఁ, జేరరా దనెడిశిక్షిని జేయవలయు

అధినివేశస్వరాజ్యపు రూపుదిద్దు, పని వలయితగోష్ఠిపాల్ సేయవలయు
ననుటయు స్లోకోంబు హర్షంబు నంది, మనగాంధినుదులెల్ల మార్గనాల్డునకు
వినిపించి భారతోర్వికినెల్ల గాంధి, యాత్మసుండీ! నమ్ముఁ దస్మద్వచస్సు
మీరు మీమంత్రులు మేలెంచి సంధి, కంగీకరింపుఁ దనర్థముల్ తొలఁగు
నేదెసన్ దురుసున్న నెడమగు లగ్గు, సకలార్ధజనకంబు సామరస్యంబె
యనిన నీతనిపల్కు లాంగ్లభూ ప్రజల, కన్ను విప్పెనుగాని కలిమిలో మునిఁగి
తేలు భూస్వాములదీవనల్ కోరు, పత్రికలకు సహింపఁగరాని వాయె;
అనసూయ! వింటివా యపు డీధరిత్రిఁ, గల మితవాదులు గాంధితలంపు
సంధికి వీలైనసరణిలో నుంట, యెఱిఁగించివై స్రాయి కీవియ్యకొన్న
నెరవాదచెఱసాల కెల్లనాయకులఁ, జేర్తుము, బాపుజీచెంగట వారు
సముచితచర్చలు సాగింతు రనినఁ, దలయూఁపె నిర్వి; నంతటమోతిలాలు
సయ్యద్మహమ్మదు జయరామదాసు, మున్నగుపెద్దలు మోహనగాంధి
చెంత కేతెంచిరి చెఱసాలనుండి; స్లోకోంబునకు గాంధి సూచించినట్టి
పదకంబునకుఁదోడు భారతక్షితికి, బుద్ధిపుట్టిననాఁడు పూర్ణస్వరాజ్య
సంపన్నమగునట్టి చన వుండవలయు, ననుతీర్పుఁజేర్చి మహాత్మునాశీస్సు
లంది బందిగమున కరిగిరి మరల; కాలంబు పక్వంబుగామి నాంగ్లేయు
లీనిర్ణయంబుల నీకొనరైరి, చనదయ్యె వలయితసభకుఁ గాంగ్రెస్సు
వరుఁడులేనట్టి వివాహంబుకరణి, సర్వపక్ష సదస్సు జరిగె లండనున; (12-11-30)
దీనిబండారంబు తెలిసికొన్నట్టి, మంత్రిచూడామణి మార్డనా ల్డపుడు
"కాంగ్రెసువారు చక్కంబడి శాస, నోల్లంఘనక్రియ నుడిగెదరేని
విడుతుము చెఱనుండి వేవేగవారి, వలయితగోష్ఠి వాహ్వానించి నేఁటి
చిక్కులుతూలంగఁ జెలిమిమై వారి, సాయంబు పడుతు, మీసందర్భమునకు
వలసినపనులెల్ల వైస్రాయి చేయు", నని వెల్లడించుడు హస్తిపురీంద్రుఁ
డిర్విను కట్టడలెవ్వియు నిడక, గాంధిమున్నగువారిఁ గారలనుండి
విడిపించె సడిసన్న వీరులనెల్ల; చిన్నబందినివీడి సీమలులేని
చెఱసాల కపుడువేం చేసినగాంధి, యేప్రాణియందు నా కీరసలేదు
ధర్మంబుపట్ల సత్యంబునయందు, మక్కువచూపు నామది సదా యనియె
మోతిలాల్ వితరణమూర్తి ధీశాలి, కాంగ్రెసున్గొలుచు నగ్రశ్రేణియోద్ధ
కోటీశ్వరుండయ్యు ఘూర్జరయోగి, ధర్మువు మెచ్చి పేదఱికంబువలచి
యాచంద్రతారార్క మగుకీర్తిగన్న, మానవోత్తముఁ దప్పు మహికిదవ్వగుటఁ
దద్దయుఁగుంది పెద్దయుఁగ్రుంగె నొజ్జ;

## గాంధి-యిర్విను సంధి

గాంధి యిర్వినుసంధి కలిగె నావెన్క, ఆఁపెను సత్యాగ్రహము మహాత్ముండు
వలయితసభకుఁ బోవఁగ నిష్టపడియె, ఏలువారును బ్రజాహితనిర్ణయములు
కావించి రొకకొన్ని గారవం బెసఁగ, సడలించి రపు డుప్పుచట్టంపుబిఱ్ఱు
బందాల నిండ్లకుఁబంపి రందఱను, విజయోత్సవంబులు వెడలె నూరూర
నధికారులమొగమ్ము లణఁగె సిగ్గునను, ఇంతలో నిటనిండె నిర్వినుశకము;
విల్లింగ్డ ననుపేర వెలయునతండు, ప్రేమించు టెఱుఁగని పెడసరకట్టె
చనుదెంచె నపుడు వైస్రాయిగా మనకు, బోరనఁ జెలరేఁగెఁ బోలీసుదురుసు
కదలె లాటీధ్వనుల్ గర్తపురాన, లఘునాళికలు నిప్పులన్ గ్రక్కఁదొడఁగె 38

## తోఁటనరసయ్య మగటిమి

జాతీయచైతన్యజనని యైనట్టి, బందరుపురి మధ్యభాగమం దపుడు
త్రిచ్ఛాయమగు జయంతి నెగుర్పనెంచి, కొంకుజంకులులేక కోనేటికడకు
దూఁకెను నరసయ్య తోఁటాన్వయుండు, పోలీసు లీపని పొసఁగనీ మనుచు
నడ్డిననేమి సత్యాగ్రహవీర, శార్దూల మానరసయ వారి నుఱక
యెక్కె ఁడెక్కెముమీఁది కెత్తెఁబతాక, మ్రొక్కెనుజెండాకు మూరినభక్తి,
నించె 'మహాత్మగాంధికిజే' యటన్న, రవళి హరిత్కందరములు మార్మ్రోయ,
దిగివచ్చునివ్వీరు ధీరులువోలె, బలసి దెందములేనిభటులు లాటీలఁ
గొట్టిరి వందలకొలఁదిదెబ్బలను, వ్రయ్యలైనది తోఁటవంశ్యుని యొడలు
కాల్వలై యితనిరక్తము పాఱిపాఱి, ముంచిన దారుణ్యమునఁ దటాకమును
జను లయో! నరసయ్య చచ్చెనటంచు, గగ్గోలుచెందిరి గాని పేర్గన్న
మల్లుఁ డీతఁడు మంజుమందహాసమున,
లేచి రాకాసి పోలీసుల సరసఁజని సార్థవత్సరసత్కార మంది
చేరెఁ గోరాపుట్టిచెఱసాలగదికి; నల్లవో! మున్ను చిన్నాపురినుండి
యితఁ డుప్పుదేరఁగా హేమాహెమీల, వంటి రక్షకభటుల్ పదునార్వు రెంత
పెనఁగియు నితనిగుప్పిలి వ్రయ్యవార్చి, లవణంబు లాగఁజాలక విన్నఁబోయి
కసిదీఱ నీజెట్టికన్నాకు నిలకుఁ, ద్రోసి మోఁదిరి జగాదుడ్డుఁగోలలను
తుదకు వీరే లజ్జఁదోఁగిరిగాని, నరసయ్యకడిమి చిన్నము జాఱదాయె
ఇతనికి నోనమాలేనిరా; వచ్చు, కాఁపుగాఁ 'బాగోలు' గడ్డను బెరిఁగి
కుస్తీలునేర్చి పల్గురకు నేరిపిన, నెఱసరి యితఁడు, గాంధిమహాత్మువేరి
సాబర్మతీసరస్వతితీరమందు, మ్రోఁగినంతనె పట్టములు గడించిన మ
నీషులు వెఱఁగంద నిర్భరబాధ, లోరిచి సత్యాగ్రహోద్యమసమర
యోధులుగా నెందఱో యిట్టివారు, వెడలిరి భారతోర్విని బల్లెపల్లె;

నొరులమెప్పునకు వీ రొలాకుపడరు, పదవులకై వీరు బందికిం జనరు
నిస్స్వార్థసేవకు నిరవద్య సేవ, కవతరించిన పూరుషాగ్రణుల్ వీరు
మనదేశమున నెంతమందినాయకులు, పుట్టరుమున్ను, బాపూదక్క నెవఁడు
మేల్కొల్పె నిట్టిగ్రామీణప్రజాళి?, నద్వితీయత్యాగ మవిరతసేవ
దంభదూరగజీవితము నేర్చినేర్చి, యింతకుఁ జాలినాఁ డెరవాడయోగి
మంతర మీతండ్రిమాటపల్లెలకు; ఏలువారలు సంధి నిమ్మెయిం ద్రోసి
రాకాసిచేఁతలారంభించి ప్రజల, ప్రాణంబు మానంబు భంగించుచుంట
వలయితసభ కేను వచ్చుట పొసఁగ, దని గాంధి వైస్రాయి కంపెను గమ్ము;
అకమ్మ నాంగ్లరాజ్యామాత్యమౌళి, కడకు విల్లింగ్డను క్రన్ననఁబంపె
మార్గనా ల్డంత నీమార్గంబు నింద్య, మనుడు వైస్రాయిపొం గంతయు నణఁగె;
పగటె నీతఁడు సంధిపాటింతు ననుచు 39

## గుండ్రబల్లసభకు గాంధిపోక

ఇతనిపల్కులు నమ్మి హితులతోఁ గదలి, లండనుచేరె నల్లన మహాత్ముండు
ఎందఱోసంపన్ను లెంతవేఁడినను, గాదని పేదలకడగండ్ల నణఁప
బడలు 'లిస్టరు'కన్యప్రార్థన కలరి, యాలేమయింట నేయందాలులేని
నెలవున దీనులు నివసించువాడ, బసపెట్టె నపు డార్తబాంధవమౌళి;
మోఁకాలుదాఁటని మొలకట్టుగట్టి, కాంతులొల్కు నలంతిగావంచ గప్పి
గడియారము బిగించి కటిసూత్రమునకుఁ, గొయ్యచెప్పులుదాల్చి
కుఱుగఱ్ఱ పూని యాడంబరంబుల కవ్వలనుండు
బాపును గన్నంత బాలకుల్ కరఁగి, మ్రొక్కులర్పింతు రామోహనమూర్తి;
కాయయ్య రేపుమా పర్థిమైజరుపు, వేఁడుకోల్ సభలకు వేడ్కమైవత్తు;
రెడఁబాయఁజాల రహింసావిధేయుఁ, బ్రాఁతచుట్టములైరి బాలు రాయోగి
కొజ్జయు వారిలో నొకకుఱ్ఱఁ డగుచు, నాడుచుం బాడుచు నలజడుల్ మఱచు;
సర్వపక్షసదస్సు సాగె నద్దాన (14-9-31,) గాంధి చక్కవచించెఁ గాంగ్రెస్‌చరిత్ర
మతభేద మొప్పని మహనీయసంస్థ, జాతిభేదంబు మెచ్చని పరిషత్తు
సత్యం బహింసయు సాధనంబులుగ, దాస్యంబు నణఁగింపఁ దలఁచుసదస్సు
పేదలతనివికై పెనఁగుసంఘంబు, రైతులవెతలు దీఱఁగ దయ్యుచుట్ట
మంటరానితనంబు నఱఁగించుదళము, కాంగ్రెసనన్ విశ్వకల్యాణకారి;
ఇంగ్లీషువారు మాయెడలఁ గావించు, వాగ్దానములు ఫలవంతముల్ గామి

నీనాఁడు చట్టంబు నెదిరించుపనికి, నిది సాహసించెఁజుఁడీ! యన్నలార!
తుల్యగౌరవములతోడ నీరెందు, దేశంబులుంట నర్థించుఁ గాంగ్రెస్సు
మాకోర్కి న్యాయసమ్మత మనిగాంధి, జనరంజకంబుగా సదసునం బల్క
ధర్మదేవతయాన తలఁదాల్చి మహికి, నొయ్యన దిగివచ్చి యొకదేవదూత
యాంగ్లరాజ్యంబులీ రరసి గుణాలు, దోషముల్ పరికించి త్రోయంగరాని
తీర్పు చెప్పెడి నని ధీ పండినట్టి, గఱువలు నమ్మిరి గానితంత్రముల
నావాపముల నేర్పునందినదిట్ట, లాంగ్లమంత్రులు గాంధి నల్పసంఖ్యాక
వర్గాలతృప్తి కెవ్వడువు చూపితివి?, సరళంబుగా దిది జటిలసమస్య
యిది తేలినప్పుడే యిండియా కొసఁగు, పెత్తనంపుసమస్య బిఱబిఱఁ దేలు
ననుచు నిక్కచ్చిగా నడుగ మహాత్ముఁ, డీపన్నుగడగుట్టునెల్ల నెఱింగి
వలయితసభ కేను వచ్చి కొండంత, తప్పుచేసితి దారిదప్పితి నకట!
యిఁకఁ జట్టమున్ ద్రోయుటే కరణీయ, మని కొల్వునం బల్కి యాంగ్లభూపాల
దంపతుల్ కోరఁగాఁ దనదుబికారి, వేసంబుతోడనె విశ్రుతరాజ
మందిరమును జొచ్చి మధురవాక్యముల, నాజంట నలరించి యవల నైదాఱు
సభలకు నేగి విశ్వంబున కెల్ల, నొకయహింసయె శాంతి నొదవించు ననుచు
సత్యంబె కవచ మీజగతి కటంచు, వాక్రుచ్చి వర్తకవర్గ మొం దడుగ
నొఁగాకయని పరమాత్మతత్త్వంబు, పలికె నీరీతి శబ్దగ్రాహియందు 40

## పరమాత్మతత్త్వము

"ననుఁజుట్టియున్న యనంతవిశ్వమునఁ, గల చరాచరవస్తుగణము నశించుఁ
బ్రభవించు నెన్నేనిపరిణామములకుఁ, బాల్పడుఁ గాని యీప్రకృతి కాధార
మవికార మక్షరమై పొల్చునట్టి, చైతన్యమేచుఁడీ! చను దేవుఁ డనఁగ
అతఁడు మృత్యువునందఁ డమరుఁడై తనరు, తిమిరంబు నెఱుఁగఁడు తేజోమయుండు
ఆర్తికి నవలివాఁడానందమూర్తి", ఇదె నమూల్యంబైన యీవ్యాఖ్య కలరి
లక్షరూప్యములు 'కొలంబియా'విపణి, మండలి కాన్కగా మనమహాత్మునకు;
సిరిని దీనిని బ్రజాసేవ కర్పించి, బాపూజీ క్రన్నన బరువుడించుకొనె;
వలయితగోష్ఠి నవ్వల భారతీయ, సైన్యచర్చను దెచ్చె సచివపుంగవుఁడు
"బాపూ!స్వతంత్రతం బడసిననాఁడు, భారతక్షితిని గాపాడంగఁదగిన
సైనికశ క్తి నీసన్నుతిసేయు, కాంగ్రెసుసంస్థకుఁ గలదా" యటంచుఁ
బ్రశ్నించె నాప్తునిపగిది నమ్మేటి; "లేకేమి కాంగ్రెస్సు లీలగా దేశ

రక్షగావించు శౌర్యంబును మెఱసి, మాసేనలోఁ దెల్లమాసి లేకున్న
నదలము మేము మా కాత్మరక్షణకుఁ, దగుచేవ యున్నది ధైర్యంబు గలదు
మారాజపుత్రులు మాసిక్కుయువలు, మాముస్లిములు ఘూర్ణమగలు మామహిని
రక్షింపఁగల రెట్టిరాయిడిలేని, గడ్డఁగాఁ దొడ్డగాఁ గాపాడఁగలరు
అలుకులేనివజీరు లతిమానుష ప్ర, తాపదీపితులు శాత్రవనుతిపాత్రు
లెన్నే నిరణముల నిద్ధజయంబు, లందిన వీరనారాయణుల్ వీరు
దేశమున్ బాలింప దిగులేమిమాకు?, ఈవలె నాంగ్లేయు లెల్లహక్కులను
రావలె యశము వారలకును మాకు", నని మాఱుపల్కె మహాత్ముఁ డావెన్క
సభ సమాప్తంబాయె సారంబులేని, మాటలతోడఁ దీర్మానాలతోడఁ
దరణినెక్కెనుగాంధి తఱిసె బొంబాయి (28-12-31,)
తాఱుమాఱుగ భారత క్షోణియుండె; 41

## మరల సమరము

ఏలువారలు దయాహీనులై నీతి, దూరులై ప్రజలను దుర్భరవిధుల
హింసించుటం గని యిదియే మటంచుఁ, గమ్మనం పెను బాపు కరిపురీంద్రునకు;
కాంగ్రెసుబలఁగంబు కావింపరాని, పను లొనర్చుటఁజేసి ప్రజలలో శాంతి
కడచనుటంజేసి కఠినచర్యలకుఁ, బాల్పడినా రేలుబడివార లనుచు
వైస్రాయి గాంధికి వ్రాసెనుత్తరము, "త్రోసెద నిఁక శిష్టి దొర!" యనె గాంధి
"వెఱవనయ్యా!" యనె విల్లింగ్డ నపుడె, సాగె నావెన్క శాసనతిరస్కార
మేగెను జెఱసాల కెరవాడయోగి, పదపడి నాయకుల్ బంధితులైరి
పిదప నేల్బడివారు బిఱబిఱ నెల్ల, గ్రామంబులన్ రేఁగి కాంగ్రెసు సేవ
కుత్సహించెడివారి నొకలక్షమందిఁ, బట్టి బందిగములపాలు గావించి
రున్న చెఱల్ చాలకుంటచే సంత, రించిరి క్రొత్తగా రేకులపాక
లవియునుం జాలమి నరికట్టు టాఁపి, దుడ్డుగఱ్ఱలఁ గొట్టఁదొడఁగిరి ప్రజల
నేమి సెప్పుదు సోదరీ! యెల్లయెడల, నరకముల్ సృష్టించినారు పాలకులు;
న్యాయవిరుద్ధమైనట్టి గుం పనుచుఁ, గాంగ్రెసున్ నాఁ డధికారు లడంప
సర్వప్రయత్నముల్ సాగింపఁదొడఁగి, రెంతచేసిననేమి యిక్కట్లనడుమఁ
గరిపురిన్ జెచ్చెరఁ గాంగ్రెసుజరిగె 32 ఏప్రిలు, రావలెఁ బూర్ణస్వరాజ్య మటంచు
శాసనోల్లంఘనసమరంబు మరలఁ, గదలుట సంతోషకారి యటంచు
బాపుజీపిల్పును బాటించి దేశ, మభినంద్యమైనది యనుచు మహాత్ము

నేతృభావము వాంఛనీయ మటంచుఁ, బ్రతినిధుల్ నాల్గుతీర్మానముల్ చేసి
రగ్గించిరి యహింస కనుకూలమైన, సమరంబు నడిపిన సరిహద్దుప్రజల
ముగిసెను బరిషత్తు మూఁగెఁ బోలీసు, దళము, వెల్వెలఁబాతె దానిమొగమ్ము;
దుద్దుగళ్లులవారిదుడుకు గణింప, కానాఁడు గుంటూర నాంధ్రరాష్ట్రంపుఁ
గాంగ్రె సొక్కగుడిన్ జగద్ధేయధైర్య, నిధి కమలాదేవి నేత్రిగా జరిగె;
నడిచెఁ దెనాలిలో నదు రింతలేని, విశ్వసుందరి పెద్దపీఁటపై నిలువ
సీమకాంగ్రెసు గాంధిజీచౌకునందు; సకలభారత మహింసారణం బిట్లు
సాగించుచుండ నచ్చట నాంగ్లమంత్రు 42

## హిందూ సంఘమును చీల్చుకుట్ర

లొకకుట్రపన్ని రీయుర్వి నెసంగు, హిందూసమాజము నిటు నటుం జీల్చి
దుర్బలంబునుజేయఁ దొడఁగి రయారె!, "నిమ్నజాతులవారు నిలువఁ బ్రత్యేక
పదములు శాసనపరిషత్తులందుఁ, గల్పింపవలయు, నీగద్దియలెక్కి
రాణింపఁ జాలినరహి గలవారిఁ, జక్క గుర్తించి యీజాతులవారె
యెన్నుకోవలయు, నీయేర్పాటుకతన, వీరిమన్గడ కొక్కవెలుఁగు వాటిల్లు
నవశకం బొదవు నీనాలివారలకు", ననువాదమును రేఁపి రన్యాయ్యసరణి
"మానుఁ డీతలఁపు ధర్మ్యముగానితలఁపు, దేశంబునకు నెగ్గుదెచ్చెడితలఁపు
నాచిత్త మీవిధానము నియ్యకొనదు, మార్గనాల్దూ! రమ్ము మంచితెన్నునకు"
నని మహాత్ముఁడు పల్క నాపల్కు ద్రోసి, తన కుతర్కంబు నాతఁడు మానఁడయ్యె 43

## గాంధి పస్తు

అంటరానితనంబు నణఁగించుకొఱకు, నిమ్న జాతులవారి నిఖిలమార్గముల
దిద్దుటకొఱకు రాతిరి పగల్ నవయు, మహనీయుఁ డాచార్యమౌళి యీమోస
కెంతయు వెతచెంది యెరవాడబంది, నవధిలేనియుపాస మొదలందాల్చె
దీనిగెల్చునుగోరి దేశమావేళఁ 20-9-32, బస్తునీకొని దేవభవనంబులందు
"రఘుపతిరాఘవ" రమ్యకీర్తనము, పాడి గీతాశ్లోకపఠనం బొనర్చె
అస్పృశ్యతాదోష మది సమూలముగ, నశియింపవలెనన్న నడవకువచ్చి
రండురండని యంటరానితమ్ములకుఁ, దెఱచె నుబ్బుచుఁ బెక్కు దేవాలయముల;
మాలవ్య పెద్దగా మంతుగన్నట్టి, హిందువుల్ కుంజ్రు, రాజేంద్రప్రసాదు,
జయకర, రంబేద్కరు, జయరాము, తక్క, రాదిగాఁగలవార లయ్యను గదిసి
సాంఘికంబగు సమస్యను జక్కఁబఱుప, దీర్ఘచర్చలొనర్చి తీర్మానమొకటి
కావించి యద్దాని గాంధికింజూప, బాపుజీ మీతీర్పు పాటింతు ననియె

నాంగ్లమంత్రులును మేలని రీతెఱంగు 24-9, ఇల్లిమానె మహాత్ముఁ డెల్లఖండముల
నెల్లదేశంబుల నెసరేఁగె శాంతి; అనాఁడె రవికవి యరుదెంచి గాంధి
కొసఁగె శుభాకాంక్ష లుల్లంబు తనియ, నేఁటితీర్పునుబట్టి నిమ్నజాతులకు
నేర్పడ్డయొకపీఁట కీతెగల్వారె, కోరుకోవలయు నల్గురను మున్ముందు
అవల నానల్గురయందు నొక్కరుని, హిందువులందఱు నెన్నుకోవలయు
అగ్రవర్ణులలెంక లస్పృశ్యతతికిఁ, బ్రతినిధులై సభాభవనాలనుంట
తొలఁగె నీకట్టడతో నవశ్యముగ; మఱియు నగ్రకులాలమైత్రితో బ్రదుక
వలసినయక్కఱ వచ్చె నస్పృశ్య, జాతులవారి కీసవరింతకతన; 44

## హరిజన పర్వము

దేశికుం డపుడు మాదిగ, మాల, తోటి, మున్నగు బహునామముల నుండువారి
కిడె "హరిజన" సంజ్ఞ;నీప్రజ లార్తు, లగుటయు హరి వీరి కనుఁగుఁజుట్టముగ
నిలుచుటయున్ గడునిక్కంబు గాన, హరి కిష్టులగువారి హరిభ క్తితోడ
నాపోకగనువారి హరిజను లనుట
సముచితంబనె మనీషాకంధి గాంధి, ఈ పేరు గడియలో నిలనెల్లమొరసె
ఈ పేరు నగ్గించి రెల్లమానవులు; బాపుజీ చెఱసాలపంచఁ బండియును
హరిజనపత్రిక నపుడు వెలార్చె; ఒజ్జతో బందిలోనున్న పున్నెంపు
దీవి మహాదేవదేశాయి ధీర, మౌళి యీపత్రికామణిబ్రేఁగు కొంత
తనతలందాల్చె; నుదా త్తధర్మముల, మానవతావాదమంజూష యనఁగ
భాసిల్లె నిది వారపత్రిక యగుచు; చట్టంబులను ద్రోయుసందడిలేని
హరిజనోద్యమ మప్పు డారబ్ధమాయె, ప్రజలెందఱో దీనిబాగు నర్థింప
దారిదప్పిన సనాతనవాదు లచట, నచట దీనిదొసంగు నాసింపఁ దెగిరి
యీవార్తవిని కుంది యిరువదియొక్క, ప్రొద్దులప స్తునె భువనబాంధవుండు (8-5-1933)
ఇన్నినాళ్లయుపాస మీయయ్య నేఁడు, చేయఁజాలం డనెఁ జెఱసాలవెజ్జు;
అధికారు లీపల్కు నంగీకరించి, వదలిరి వెస యోగివరు బందినుండి;
గాంధికిన్గూర్చు "ఠాకర్సే" గృహాన, విడిసె నయ్యెడ నయ్య విడువకనిద్రు;
నిద్రునిండినవెన్క నిర్భరదీక్ష, హరిజనోద్యమజయం బాసించి బడలె
గుడిగంటమ్రోఁగించి గోవింద! యనుచు, శంభూ! యనుచు హరిజనుఁ డుబ్బఁదొడఁగె
ఈమేల్మి యిట్లుండ నేలెడివారి, యుదుటు నానాఁటికి నురడింపఁజాగె
దీని నోరువలేక దేశికమౌళి, వ్యష్టిసత్యాగ్రహ వ్యవహర్త యయ్యె
ఏలువారికి ముందె యెఱిఁగించి రాచ, పనుపు నుల్లంఘించుపనిచుమీ! యిద్ది
అనసూయ!వింటివా యనఘుఁడు గాంధి, ధిక్కారమున దీన దిగుటకు ముందు
సత్యాగ్రహాశ్రమ సంపత్తి నెల్ల, హరిజనోద్యమమున కర్పణచేసి

యైహికంబుగఁ దన కగ్గమైయున్న, తుదిపొత్తుసైత ముత్సుకతఁ ద్రెంచుకొనె
అధికారు లిది విని యర్ధరాత్రమున (31-7-1933,) నిద్రించుగాంధిని నెఱిమాలి పట్టి
పంపినా రెరవాడబందిగంబునకు, నాల్గునాళ్లే యోగినాథు నిందుంచి
పూనాపురిం బాసి పోఁగూడ దన్న, నియతితో వదలి; రీనియమంబు నుఱని
గాంధి నేల్బడివారు క్రన్ననఁ బట్టి, యే డాదిశిక్షతో నెరవాడ నుంచి;
రానాఁడు వ్యష్టి సత్యాగ్రహరణము, సాగించెఁ గడిమిమై సకలభారతము;
సర్కారువార లీసంరంభ మరసి, యడలిరి కినిసి రయ్యకుఁబ్రాణమైన
హరిజనపత్రిక నరికట్టి రాగిని, పత్రిక నాఁపుటన్ బాపుజీ కలఁగి (16-8-1933)
క్రన్ననఁ బస్తాని కడునీరసించె, ఏకట్టడయుఁబెట్ట కేలెడివారు
విడిచి రాచార్యుని వెఱపునం దోఁగి 23-8, గాంధి యవ్వేళ శిక్షాకాల మెంత
వఱకుండు నేనంతవఱకును గార, నున్నట్లె వెలుపల నుండెద ననియె
ఇమ్మెయిం బాడిగు ట్టెటిఁగినవారు, తన కర్తమగుశిక్ష తాన విధించు
కొన నొప్పువారు నీకువలయమందు, నెందఱుందురు తమం బెదలినవారు
మేలుగీడుల నొక్కమెయిఁ జూచువారు?, అడిగినవారి కాయాహితోక్తులను
బల్కుచు ననుచితపద్య కుద్యమము, పోకుండఁజూచుచుఁ బురము గ్రామంబు
హరిజనాభ్యుదయంబు నాసించునట్లు, తిరుగుచు బదలుచు దీనబాంధవుఁడు
తనియం దలంచె నత్తరుణంబునందు?, మహనీయుఁ డల సబర్మత్యాశ్రమంబు
నుజ్జగించినవెన్క నొకయున్కి పట్టు, లేనివాఁ డగుటఁ బల్లెకు నొకరేయి
నిల్చుచుఁ దనమెచ్చునిర్మాణకార్య, గతి కనుకూలించు గ్రామంబు నెంచి
యందుంట లగ్గని యనుకొనందొడఁగె; ఒజ్జకుం బ్రియశిష్యుఁ దుర్వీశుభంబు
పాటించి తనసిరిన్ బంచిహర్షించు, నడవడిగల 'జమునాలాల్ బజాజు'
ధనవర్ధణేయుఁ డీతలఁపు నెఱింగి, తనకాఁపురించు 'వార్ధా' పురమ్మునకుఁ
జేరువఁగల తన 'సేగావు' నలఁతి, గూడెమున్ బాపునకుంజూపి మీకు
నిది యనుకూలించునేని మీరిందు, నిలువుఁడా! యన గాంధి నిలిచె నచ్చోట;
అలరె సేవాగ్రామ మని దానిపేరు, సవరించి యన్వర్థసంజ్ఞ ఘటించి
పదపడి పదినెలలల్ భారతక్షోణి, నయ్య సాగించెను హరిజనయాత్ర;
ఈ సయనంబునం దీశ్వరుఁ డంట, రానితనంబు ధర్మం బనువారి
మన్నింపఁదనియె నిమ్మహి నీయఘమ్ము, వర్ధిల్లివర్ధిల్లి బానిసతనము
పీఁటవెట్టినదనెఁ బ్రేమలేనట్టి, మత మెల్లకాలంబు మనదనె గుదులు,
తెలియఁ దెల్లరకనె దేశకాలములు, గుర్తింపుఁడనె; నిట్లుక్రుమ్మరుగాంధి
రఘురాముదేవేరి! రమణీయశీల!, నాకాణయాచియై నల్గురిమయెచ్చు

బ్రదుకునకై దయ్యుపల్లెయై తనరు, కావూరికేతెంచి గ్రామపుంబ్రజలు (23-12-1933)
వేఁడఁగా శివునికోవెల హరిజనుల, కావిష్కరించె నాంధ్రావనియందు
హరిజనున్ బ్రేమ నాహ్వానించినట్టి, దేవళమ్ములలో నిదే కనిష్ఠికకు
వచ్చెనులెక్క; నవ్వలఁ దనకోరు, నిర్మాణకార్యముల్ నెఱవేర్పఁజూచు
వినయాశ్రమంబు నావిష్కృతిచేసి, సూత్రయజ్ఞమున నుత్సుకత నూల్వడికి
కార్యకర్తల మెచ్చెఁ గస్తూరిమగఁడు; బాపూజీ యనునాఁడు ప్రఖ్యాతిగన్న
కర్షకనేత రంగాప్రార్థనమున, నిడుఁబ్రోలిలో రామనీఁడువిద్యాని
కేతనంబును రాజకీయధీశక్తి, యువజనస్తోమమం దొదవించుదాని
నావిష్కరించి, తదాచార్యు నతని, దేవిని భారతిన్ దీవించి, తాళ్ల
పాలెంపు హరిజనప్రతతిడెందమున, నానందవీచిక లదరఁ దదీయ
హరిజనవిద్యాలయంబును దెఱచి, సేవాపరాయణు జియ్యరుదాసు
నాశీఃపరంపర నలరించి కదలి, హరిజనోద్యమబలం బార్జించుచుండఁ
గేరళదేశానఁ గేలప్ప సేయు, తపము పంటకు వచ్చి తతకీర్తిగన్న
గుడి 'గురువాయూరి' కోవెలతలుపు, విచ్చె హరిజనప్రవేశంబుకొఱకు;
ఈపని సంధిల్లదేని మహాత్ముఁ, డుపవాసపుంగాసి కొగ్గుటవలయు
నొగ్గెద నని కర్మయోగీంద్రుఁ డితఁడు, మాటయిచ్చెను ధర్మమతమైఁ దొల్లి;
యీకస్తి మీయయ్య కెడయుటంజేసి, లోక మానందాబ్ధిలో మున్గితేలె
పొంగువెంటనె క్రుంగు పుట్టునన్నట్లు,
పొడమెను బీహారుభూకంప మపుడు (15-1-1934)

## బీహారు భూకంపము

ఇది మ్రింగె మనుజుల నిర్వదివేల; కుంచె నియ్యది రెండుకోట్లమానవుల;
పలుకంగఁజాల నీప్రళయంబునెల్ల; వాక్రువ్వనేర నీవల్లడి నెల్ల;
అవ్వేళ హరిజనయాత్ర చాలించి, యాచార్యుఁ డేతెంచె నాపన్నమహికి (11-3-1934)
గుండె ఱాయిగఁ జేసికొని మహాత్ముండు, కడగండ్లపాలైన గ్రామముల్ చూచె
పొక్కునన్ బ్రుంగినపురములన్ జూచె, ఈదారుణార్తి కీయిలఁ గలప్రజల
దురితముల్ ముఖ్యహేతువు లనిపల్కె, ఈదురితంబులం దెన్నఁగాఁ దగిన
దురితంబు హరిజనున్ ద్రోయుట యనియె, నరునాత్మయు నతం డొనర్చెడిపనుల
పగిది మార్పుందెచ్చుఁ బ్రకృతియం దనియె, ధర్మబద్ధంబులు ధరణీహితమ్ము
లగచున్ దలఁపులుంట యక్కఱయనియె, తలఁపులు నుడులు చేఁతలు నొక్కబాటఁ
బయనింపవలె వేఱుపడుట యొగ్గనియె; పదపడి బాపు విపన్నజనాళి
దిగులున కెడయొాచుఁ దేఱుకొనంగ, బాధానివారక ప్రతతు లేర్పఱిచి

నెలనాళ్లు తద్భూమి నిలిచి రాజేంద్రుఁ, డాదిగాఁ గలవారి కార్తసేవా ప
రాయణులగు మహారథులకు వలయు, సందేశమొసఁగి యచ్చటు విడనాడి
హరిజనోద్యమభార మౌదలం బూని, యయ్యాయితావుల కరుగుచు నొక్క
నాఁడు పూనాపత్తనమునకుం జేరి (25-6-1934), పాకివారలసభం బాపపుణ్యముల
గుఱిచి పల్కుచునుండఁ గుత్సితాచారుఁ 46

## గాంధిపై బాంబు

డంటరానితనంబు నణఁగించుపనుల, నోర్వఁజాలనిమూర్ఖుఁ డొకఁడు మహాత్ము
దెసకు బాంబునువేయ దేవునికరుణ, గుఱిదప్పి యామిత్తి కుంఠితంబాయె
ఇన్నాళ్లనుండియు హిందూధరిత్రి, నిట్టిచెట్ట జనింప దెచ్చోటనైన;
పుట్టెనేఁటికిఁ బుణ్యపురమునయందె; యిది గాంధి కిఁక నెట్టి యిక్కట్టునిడునొ
యిది యెంత పాపాన కియ్యకో లిడునొ, తంద్రి నాపదనుండి తప్పించినట్టి
యీశున కపుడు మ్రొక్కిడిరి సజ్జనులు, అజమీరునం దొకహరిజనోద్ధర్త
యానాఁడు తన కెదురాడినబుధుని, శిరము వ్రయ్యలు సేయ జీసస్సుపగిది
గాంధియు నప్పాపికలుషంబు తొలఁగ, నేఁడుదినాలప స్తీకొనె నదిర !
ఇట్టిమహామహు లీశ్వరదూత, లిట్టిధన్యులె శక్తు లిమ్మహిన్ దిద్ద;
అది యట్టులుండె నోయనసూయ! వినుము, నాఁడు దేశాయిమున్నగు నెఱసరులు
బందిగమ్ముల వీడి బయటికివచ్చి, దేశపరిస్థితుల్ తిలకించి లెస్స
భారతక్షితి నప్డు పాదుకొన్నట్టి, జడత పోవం దగుచందంబు నరసి
సరగ స్వరాజ్యపక్షము నుద్ధరించి, యెల్లి రానున్నట్టి యెన్నికలందుఁ
బాల్గొని కేంద్రసభం బ్రవేశించి, దారుణశాసనతతిని ఖండించి
వలయితసభ నయ్య వాంఛించినట్టి, హక్కులురాకకై యశ్రాంతదీక్ష
దాల్చుట మే లన్న దారికి వచ్చి, గురుదేవుఁగదిసి మాకున్ దోఁచినట్టి
భావంబుపట్ల మీపలు కెట్టిదనిన, నోయన్నలార! మీ రొనరింపఁజూచు
పని కడ్డురాను, మీభద్రంబు వలతు, మీయుద్యమమునకు మేలుచేకూర
నాఁపెద వ్యష్టి సత్యాగ్రహం, బనుచు, నొజ్జ వచింప నయ్యోద్ధలు తనిసి;
రంతఁ గాంగ్రెసు నాఁటి కనుకూలమైన, రథ్యకువచ్చి స్వరాజ్యపక్షంబు
తన కనుబంధియై తనరుపక్షంబె, యితరంబు గాదని యెన్నికలందుఁ 47

## మరల ఎన్నికలలో నిలుచుట

బాల్గొన నాయిత్త పడె, దీనినెఱిఁగి, యేలువార్ కాంగ్రెసు నింతకుమున్ను
బాధించుచట్టాలబారు తొలంచి; రావేళఁ గాంగ్రెసునందలివారు
కొందఱు విద్యార్థికూటువ లనియు, యువజమాజము లనియున్ సామ్యవాది
సంఘంబు లనియును సరిక్రొత్తగలము, వెడలింపఁబూనుడు వీరి కహింస

పట్ల సత్యముదెసం బ్రణయంబుకలదె ? యని సంశయించి "న్యాయవిధేయమైన,
శాంతియుతంబైనసరణి కాంగ్రెస్సు, లక్ష్యం" బనెడిపల్కులకు మాఱు "సత్య
సమిత, మహింసానుసారియైనట్టి, దారి కాంగ్రెసున కాదర్శ" మటన్న
తీర్మానమును గాంధి తేర బొంబయిని, గూడిన కాంగ్రెసుగోష్ఠిలో దాని
కోటమి వాటిల్లె; నొజ్జ యావెన్కఁ, గాంగ్రెసుసభ్యుఁడుగా నుంట వదలి,
వదలనివారికి వలసిననాఁడు, పేర్మిమై హితముచెప్పెద ననిచాటె 1934 అక్టో
చట్టంబుల నెదుర్చుసమయంబు తొలఁగి, వెలసె శిష్టిసభాప్రవేశయుగమ్ము;
కాంగ్రెసువా రెన్నికలను బాల్గినిరిస, గణనీయమగుగెల్పు గనిరి దేశమున; (1934 చివర)
అనసూయ!వినవమ్మ! యానాఁడు గాంధి, పల్లెపట్టుల పెంపె భారతక్షోణి 48

## కుటీర పరిశ్రమలు

పెంపని భావించి పెద్దలతోడ, సకలభారత పరిశ్రసంఘ మనఁగ
నొకమండలిని గూర్చి యూరూర వడుకు, నూలు, చేనేంత, గానుగనూనె, తేనె
దంపుడుబియ్యంబు తద్దయున్ విరియ, బడలందొడంగె రే పవలనికనక;
అదిగాక సాత్వికమైన బోనంబు, సత్యక్షమా దయా శౌచ దమాది
దైవసంపదల భోక్త కుఁ గూర్చుననియుఁ, బ్రజ కూడిగమొనర్చి బ్రదుకు పండించు
కొనఁజూచువాఁడు వేకువలేచి వీథు, లూడ్చి తా నివసించునూ రెల్లప్రొద్దు
గరగరగా నుంటకై చెమరోడ్వ, వలెననియున్ సంతు వారించుకొఱకుఁ
గృతకమార్గమ్మున కేగరాదనియు, నది విషయాసక్తి నభివృద్ధిచేసి
యాత్మవికాసంబు నణఁగించుననియు, మతవైరములఁదెచ్చు మాటలతోడ
వెడలినరచనంబు విప్పరా దనియు, వృత్తి విద్యలకు నాదృతినిచ్చునట్టి
బడు లేర్పరించుట భావ్యమౌ ననియు, హరిజనపత్రికయందు వ్రాయుచును
సభలఁజాటుచును బ్రజాసేవ నుండ 49

## క్రొత్త రాజ్యాంగము

వచ్చె నాంగ్లప్రభుత్వమువారి ముద్ర, లంది నవీనరాజ్యాంగశాసనము;
అనాఁడు మార్గనా ల్గన్నయట్లైన, లేదాయెనొద్ది, బళీ! నేతిబీఱ
కాయగా వెడలె, నాంగ్లప్రభుత్వము, కలకాల మిట నిల్పకరణిఁ దాంత్రికులు
కలసిసృష్టించినగారడం బిద్ది, బలు పింఛుకయుఁ గనంబడనివాఁ పిద్ది
రాష్ట్రపాలకునకు రాజప్రతినిధి, కిది యధికారంబు లెన్నే నొసంగి
మంత్రికిచ్చెను నామమాత్రంపుఁ జనవు: మంత్రితీర్చినతీర్పు మణఁగించుహక్కు
నిడె గవర్నరుపీఁట నెసఁగునాతనికి, కేంద్రశాసనసభాకృతిని నిర్మించు

పని రాష్ట్రశిష్టిసభాపతి కొసఁగి, ప్రజ కిది సృష్టించుభాగ్య మిదాయె;
సంస్థానములయందు స్రగ్గెడిప్రజల, యిక్కట్లు తొలఁగుతీ రిది చెప్పదాయె
సైన్యంబు విత్తంబు సర్కారువారి, పాలనంబున కగ్గపడియుండు ననియె
నిరసించెఁ గాంగ్రె సీనిర్ణయం బరసి, పెదవివిటిచె జాతిపిత దీనిఁజూచి;
ఐనను వచ్చినయధికారమునకుఁ, దలయూఁపి, రానిపెత్తనము నార్జింపఁ
గడఁగుట లగ్గని, కాంగ్రె సీవేళ, నలిగికూర్చున్నచో నర్హతలేని
జనులు గద్దెలకెక్కి సర్కారువారి, కండయై దేశంబు నార్తిపాల్ సేఁత
నిక్కువం బనియును, నేఁటి చట్టమున, సమ్మతి నిడువారిసంఖ్య హెచ్చనియు,
దేశానఁ గాంగ్రెసుదెసఁ గూర్మి పేర్మి, కలవారు పెల్లుగాఁ గన్పింతు రనియుఁ
గాంగ్రెసుగెల్పు నిక్కము నిక్క మనియు, నానాఁడు నేన యీయవనికిఁ దగిన
ప్రతినిధినని దెసల్ బ్రద్దలుకాఁగ, నార్చుచుఁ గాంగిరె స్సనవచ్చు ననియు,
నీశిష్టి కేంద్రమం దిడుపెత్తనంబు 50

## ఎన్నికలు - కాంగ్రెసుగెల్పు

గణనకున్‌జాలదు గాని రాష్ట్రముల, యం దిడునధికార మసదు కాదనియు,
నెన్నికలన్ గెల్చి యేల్బడివారు - యాట కట్టించుట యభినంద్య మనియుఁ,
బ్రజకై నలంగుచుఁ బ్రధగన్నకొంద, ఱాడిరి కాంగ్రెసునందలివారు;
అంతలో జవహరు నాధిపత్యమున, జరిగిన కాంగ్రెస్సు చట్టంబు నొప్పి
కాంగ్రెసువా రెన్నికలను బాల్గొనుట, సముచితంబనె నంత సాగె నెన్నికలు (1937
మొదట), జై జై మహాత్మకు జై జై యటంచుఁ
గాంగ్రెస్‌పతాకలు కరములం దాల్చి, యూరూరఁ గాంగ్రె సీయుర్వికై పడిన
బాధలు చాటుచు బాపుజీ కోటు, పచ్చపెట్టెకు నోటు ప్రజల ప్రాణాలు
బలిగొను తెలవానిప్రభుతఁ గూల్చుటకు, నోటిందు ప్రజలార! యోతల్లులార!
యోయయ్యలార! యం చుడుగనిదీక్షఁ, దిరిగి రింటింటికి దేశాభిమాన
కలితజీవనులైన కాంగ్రెసుయువలు; కొసప్రాణములతోడఁ గుందుచున్న
ముసలమ్మయును దండమునుబూని వచ్చి, యిచ్చెఁ గాంగ్రెస్సున కెలమిమై నోటు
పడవై చెఁ బెట్టెలోఁ బావులాబిళ్ల; వంగోర్విఁ బాంచాలవసుధను సింధు
మహిఁ దక్కఁ దక్కెల్లమాగానులందు, గెలిచెనుగాంగ్రెస్సు కీర్తనీయముగ
నూరూర ఱంపిల్లె నుత్సవజ్యోత్స్న, లేలువారిమొగాల నిరు లాక్రమించె
మంత్రిపదమ్ములమాట యే మనుచు, రేగెజర్చలు కాంగిరెసువారినడుమ

వల్లభుండు ప్రసాదు వలయునం చనఁగ, వలదనియెన్ సామ్యవాదివర్గంబు
పెద్ద లత్తఱి జాతిపిత తలం పడుగ, నెక్కటిహక్కుల కియ్యకో లిడక
చట్టంబునకు లోఁగి సచివు లొనర్చు, తీర్పు గవర్నరు ధిక్కృతిసేయ
కాదరించునయేని యంగీకరింప, నగును బ్రెగ్గడగద్దె ననియెను గాంధి;
సరుకారువార లీసరణి నీకొనక, యన్యపక్షంబులయందలివారిఁ
గీల్పొమ్మమంత్రులక్రియఁ జేసికొనిరి, శాసనసభఁగూర్ప సాధ్వసంపడిరి
యేల్బడిసాగించి రెప్పుటియట్లు; ధీమంతులెల్ల రీతెఱఁ గిసీ! యనిరి
రాజ్యంబులెల్ల నీరగడ తప్పనియె, ఏల్బడివా రంత నీఁగిరి లజ్జ
నొజ్జపల్కినమాట కొప్పుకోల్చూపి; రెనిమిది రాష్ట్రాల నెలమిమైఁ బ్రెగడ
గద్దె కెక్కెంచిరి కాంగ్రెసువారు (7-7-1937) 51

## బాపూ మంత్రులకు హితము చెప్పుట

గురుఁ దయ్యమాత్యులగుఱిచి యానాఁడు, హితముసెప్పుచు "నన్న! లీదేశమందుఁ
బెరిఁగిన పన్నులపీడ పోకార్చి, యధమర్ణతాభార మణఁగారఁజేసి
కర్షణస్వామ్యరక్షణము గావించి, కాఁపులకున్ మేలు గావింపుఁడయ్య !
కూటికింజాలని కూలితోనవయు, బడుగురాబడి పెంచుపని కొగ్గుఁడయ్య!
కర్షక కార్మికగణ వికాసంబె, దేశాభ్యుదయ మని తెలిసికొండయ్య!
మైరేయమును నల్లమందు గంజాయి, వాదరానివిధాన వలయుచట్టములు
గావించి మూర్ఖలోకము దిద్దుఁడయ్య! ఉద్యోగదూరులై యుమ్మలికించు
పట్టభద్రులు చక్కఁబడఁ జూడుఁడయ్య! సరగ సమగ్రప్రజారాజ్య మొదవు
రీతి వర్తించి కీర్తిని గాంచుఁడయ్య! స్వార్థప్రియత లేమి యగ్గింపఁదగిన
బ్రదుకౌట విస్మరింపకుఁడయ్య!" యనియె, మంత్రులంతట తమ
మాగానులందుఁ బ్రజనుద్ధరించుకార్యంబులు పెక్కు
లాచరింపఁదొడంగి రవ్యాహతముగ, స్వాధీనభారతం బాకాంక్ష చేసి
హింసాత్మకక్రియా హితులైనవారి, ద్వీపాంతరముల బందెల స్రుక్కువారిఁ
గారావిముక్తులఁ గావించి తనిపి; రంటరానితనమ్ము నణఁగింపఁజాలు
చట్టముల్చేసిరి, సాలె వడ్రంగి, కుమ్మరి కమ్మరి కోలుకోఁదగిన
పనులకుం దొడఁగిరి, ప్రజలో స్వరాజ్య, తృష్ణ హెచ్చింపఁగాఁ దిరిగి రూరూరు. 52

## బోసు గెల్పు

అంతలో నేతెంచె హరిపురికాంగ్రె; (1938, ఫిబ్రవరి)
నపుడె బందినివీడి యరుదెంచె బోసు, గాంధి యాతఁడె నేఁటి కాంగ్రెసున్ నడుప
నర్హుఁ డన్నంతనే యధ్యక్షుఁడాయె, హలికబాధ లణంప ననుకూలమైన
సంస్థానజనసమస్యలఁ దీర్పఁదగిన, జాతీయవిద్య హెచ్చుఁగ నర్హమైన
నిర్ణయంబులు పుట్టె నేఁటికాంగ్రెసున; రానురా నివి మహారథుఁడు బోసునకుఁ
జప్పచప్పగఁ దోఁచె సరిగానివయ్యె, శాసనసభలఁ గ్రచ్చఱ వీడవలయు
నెగసి యేల్బడివారి నెదిరింపవలయు, సరగ స్వరాజ్యంబు సాధింపవలయు
గాంధిమార్గము వీడి కాంగ్రెసువారు, తెగి తగుదారి కేతేరఁగావలయు
ననుబోసునుడులు జనాళి కవ్వేళ, నుద్రేకమునుగూర్చె నుచితంబులాయె
కాంగ్రెసు పేరుతో గద్దియల్ పడసి, రాచఱికమునల్పు రాహుతల్ కొంద
ఱనుచితకృత్యంబు లాచరించుటయు, నొకకారణం బాయె నుడుకిది పుట్ట;
త్రిపురిని గాంగ్రె సీతింద్రలో రాఁగ, నధ్యక్షతకు నిల్చినట్టిపట్టాభి
నెదిరించి బోసందె నెన్నికన్ గెలుపు; బాపుజీ యత్తఱిఁ బట్టాభియోటు
నాయో టటంచుఁ గ్రన్ననవక్కణించె, రచ్చలో బోసువర్గమువారి తీర్పు
లన్నియు వీఁగి మహాత్మునిదళము, తెచ్చినతీర్పెల్ల దిగ్గన నెగ్గె
వెనువెంటనే బోసు విడిచెఁ బీఠంబు 53

## బోసుదారి వేఱు

తనదారి వేఱుగాఁ దరలె నాయొద్ద, ఇద్ధశీలుండు రాజేంద్రప్రసాదు
వచ్చెఁ గాంగ్రెసునేలువాఁడుగా నపుడు; 54

## రెండవ ప్రపంచ సమరము

కథ యిట నిట్లుండఁగా ద్వితీయ ప్ర, పంచయుద్ధము వచ్చె భయదార్భటముల; (3-9-1939)
జర్మనీపై నాంగ్లజాతివా రపుడు, ఖడ్గంబునెత్తి రాగ్రహ మెసరేఁగ,
వైస్రాయి భారతావనియు నీకలన, నాంగ్లదేశంబున కండగా నిల్చి
పోరాడునని సింగపూరున కిచటి, సేనలనన్నిటిం జేర్చె వేవేగ;
ఈ వార్తలకు నొజ్జయెంతేనిక్రుంగి, నరునిరక్తం బయో! నదులుగాఁ బాఱు
గడె వచ్చెనాయని కన్నీరుగార్చె, అటులయ్యు నోడరా దాంగ్లేయు లన్న
తలఁపుతో నుండె నుదారతారాశి; కాంగ్రెసు పెద్ద లక్కాలాన గాంధి
యిరవున కేతెంచి యింగ్లండువార, లిండియాతోడ్పాటు నిచ్చింతురేని
యీరెండు దేశాల కిసుమంత వేర్మి, కానిపింపని రాచగౌరవం బుంట

కీకొన్న పదపడి యీనేలవారి, సాయంబు నడుగుట సముచితం బనిన
తీర్మాన మొనరింప దేహళీవిభుఁడు, పెనఁకువ ముగిసినపిదపనే కాని
తగ దిట్టిచర్చ యీతరుణమం దనియె, అంతఁ గాంగ్రెసువార లని కేము సాయ
పడఁజాలమని తేటపఱిచి రేలికకు, హస్తినాపురసభ కరుగరా దనుచుఁ
బనిచి రానతి తత్సభాసదస్యులకు; పాకంబుచెడెఁ గానఁ బదముల వీడుఁ
డని రాష్ట్రమంత్రుల కానలొసంగి ; (22-10-1939), రదుగడుగున వీరి కడ్డంకులిడుచు
వలదుస్వాతంత్ర్యంబు వలదిపు డనుచు, ముస్లిములీగును మూఁపునంబూని
నాఁడు అంపిల్లె జిన్నా దారిదప్పి, యిదికృత్య మని నిర్ణయింపఁగాలేక
కాంగ్రెసు మిగులఁ ద్రొక్కటపడంజొగె, కొన్నాళ్ళ కది తేఱుకొని తెల్లవారు
హింధూధరిత్రియు నింగ్లండునట్లు, సర్వస్వతంత్రతాసంపన్నమైన
ధరణిగా గుర్తించి తగిన రాజ్యాంగ, మేర్పఱించుటకొఱ కెల్లపక్షముల
చదురులతోఁ బరిషత్తు నిర్మింపఁ, దగునన వై స్రాయి తలయూఁపఁడాయె (15-2-1940)
ఇఁకఁ జట్టమున్ద్రోఁతయే కృత్యమన్న, తలఁపు బాపునెడందఁ దలచూపెనపుడు
పదపడి సడిసన్న పండితుఁ డాత్మ, వేత్త చూడామణి వివిధ సంస్కృతుల
మర్మం బెఱింగినమాన్యుఁ డిస్లాము, ధర్మమున్ ద్రచ్చి యందలినిగ్గు గన్న
ముస్లిముగృహమేధి మోహనమూర్తి, జగమెల్లనెఱిఁగిన జాతీయవాది
యిరువదేఁడులనుండి యెదలనిదీక్షఁ, గాంగ్రెసునూడెంబు గావించుదిట్ట
చిఱునవ్వుతో నెమ్మిచెలువుతో నలరు, ననఘుఁ డబుల్కలామాజాదు నడుపఁ
గాంగ్రెసుజరిగె రాంఘుర్పట్టణమున; ఆజాదు తనయుపన్యాసంబునందు
నానాఁటిదేశ కాలాదుల తెఱఁగు, తడవుచు "నోసభాస్తారులు! వినుఁడు
కొండపైకెక్కుచు గోతిలోఁబడుచు, వీలు వాలును లేని విషమోర్వియందుఁ
గదలుచున్నది నేఁడు కాంగ్రెసురథము, ఈసంకటస్థితి నెదిరించి నిలువఁ
గావలె మనకు జాగర్య యెంతేని, అదమఱచి తప్పటడుగులు వేయఁ
గ్రన్నన మన మధోగతికి నేగుదుము, హిట్లర్ ముసోలినీ యీప్రొద్దు రేఁగి
ప్రజలేలురాజ్యాల భంగింపఁజూచు, టది నింద్యమేకాని యాంగ్లేయు లేచి
వలచెడి సామ్రాజ్యవాద మర్హంబె ? వలయు స్వతంత్రత వలయునా కనుచుఁ
బలుకుహ క్కున్నది భారతక్షితికి, ఈకోర్కి నొప్పని యింగ్లీషువారి
జయమున కిది యెట్లు సాయం బొనర్చు ? ఆఫ్రికామున్నగు నవనులన్ వీరు
వేఁడినయ ట్లేలవేఁడ రీధరను? ఎఱుకసేయక వీర లీమహామహిని
సమరాన దించుట సముచితం బగునె ? ఇపు డిండియాస్థాన మెట్టిదయారె !
తప్పదా దీనికి దాస్యపుంబరువు ? తమచేయుసమర మంతయుఁ బ్రజాస్వామ్య
మెదుగుటకే యన్న యీరాచవారి, తీ రాసియాకు వర్తింపదా ? వీరి
తలఁ పెట్టిదైనను దలవంచుబ్రదుకు, నిఁకసైఁప దీదేశ మిఁకనొప్పుకొనదు

ఇపుడు మంత్రిపదమ్ములే వీడెఁగాని, కావించు నెట్టిత్యాగములైన నెల్లి"
యనుడు నోలగ మబ్ధియనఁగ నుప్పొంగి, శాసనధిక్కృతి సాగింపవలయు,
గాంధి దీనికి నేతగా నిల్వవలయు, ననుతీర్పు లొనరించె నవ్యాహతముగ
ఆవేళ సత్యాగ్రహవిధాత గాంధి, "అన్నలారా! సైనికార్హతయందు
నించుకలోటున్న నింతకుముందు, సైఁచి కయ్యంబును సల్పితిఁగాని
యీనాఁడు సైఁపలే నిసుమంతయున్న, బవరంబుసాగించు పడవాలుపల్కు
వారక తలఁదాల్పవలయును బంటు, ఇంతకుమున్ను మీయెఱుకకురాని
బెడిదంపుబెదఁదలం బిఱుదీయ కీరు, నేఁ డెదుర్కొనవలె; నిర్భరాపత్తు
లిపు డింటబయట నెన్నేనియుం గలవు, ఏలువారికి మనయిచ్చ దెల్పితిమి
తేటతెల్లగ వారి తెలుఁగు వా రనిరి, సమరవ్యథన్ గ్రుంగు సర్కారువారి
నెదురుచో నిక్కట్లు లెసరేఁగుఁ బెక్కు; తగినమార్గమున నుద్యమ మేగునేని
బయటిత్రొక్కట కేను భయపడంబోను, ఇంటికస్తియ వచ్చె నియ్యెడన్ మనకు
దీని నోర్చుటయెట్లు తే జందుటెట్లు ? కాంగ్రెసువా రధికారంబు గనుట
గనుఁగొని యెట్టియోగ్యత లేనివార, లిందుఁ జేరిరిపెక్కు రెల్లసీమలను
తమమేలు సాధింపఁ దమకించువీరు, మనకుఁగూర్తురు పెక్కుమార్గాల ముప్పు
సంతతంబుగఁ బ్రజాస్వామ్యంబు కోరు, మనము వీరల నాఁపుమార్గంబు లేదు
మనమనుగడ నిప్పుమాడ్కి నున్నపుడె, మనము వీరలపొత్తు మరగినయపుడె
మనపల్కునకు నడ్డుమాటాడ వీరు, చాలరు నైతికశక్తి లేకునికి;
నీరహస్యంబు మీ రెఱుఁగుటవలయు, తగినబాటకు వీరిఁ దరలింపవలయు
కడఁకమై నిర్మాణకార్యక్రమంబు, సర్వదా పాటింపఁజనుఁజుడీ! మీరు
తలచూపరాదు మీతలఁపునం దీసు, చిఱుగుంపులుగ మీరు చీలిపోరాదు
సత్యంబునకు నహింసకు లొంగియుంట, మనమతం బగుటయు మఱచిపోరాదు
సర్వసేనాపతిస్థానమం దేను, నిల్చితి నాకున్ననెతి ప్రేమ యొండె
అనుసరింపుఁడు తాల్మి నందఱు నన్ను, చేయుఁడు నావిధించిన పనినెల్ల
నేను మీవంటిమానిసి నౌటకతనఁ, దప్పొనర్చెద నొక్కతరుణంబునందు
అర్థంబు నాకు 'మహాత్మ' యన్‌బిరుద, మని తలపోయ నిద్రావస్థనైన
ఈచిన్నె నాపట్ల నెవరేనివాడ, ముమ్మరించినలజ్జ మునిఁగెద నేను
ఈలోకమునఁగల యెల్లమానవులు, జగదీశుమతి కొక్కచందంపువారె
మనుజులనెల్ల సమానహార్దమునఁ, దిలకించు వేల్పు, సందియములే దిందు
హరిజనుల్ ముస్లిము లవనీసురర్చ్యు, లొక్కరీతినె తోఁచుచుంద్రు నామదికి
నాతమ్ముఁగుఱ్ఱ జిన్నా యనితలఁతు; తీయమ్మున మహమ్మదీయ లందఱును
ననుఁ గన్నకాల మున్నది యీధరిత్రి, నీభాగ్యము తొలంగె నీప్రొద్దు నాకు
ఈలేమిఁ దలఁచి యే నెంతయున్ వగతు, ఉర్దుపత్రికల న న్నుత్తలపెట్టు

వెడనుడు లీనాఁడు వెలువడుచుండె, చదివినాడ ఖురాను శ్రద్ధమై నేను
ఈవిశ్వమందున్న యీరెండు తెగల, లవమాత్రమైన నల్లా వింగడింపఁ
డీనేలప్రెగడగా నెనఁగుజెట్లందు, గాయమేర్పడి పెద్దగాఁ గుందునప్పు
డాప్రేటునకు నేన యగ్గపడ్డట్లు, వగచితిఁ గన్నీరు వఱదలై పాఱ
మీ కేసు వలయుచో మిత్రు లిద్దాని, యంతరార్థ మెఱుంగుఁ డావేశపడక
పగవానిగుండెలోఁ బరమసౌహృదము, నర్తింపఁజేయుటే నాదులక్ష్యంబు
తెలవారి సామ్రాజ్యతృష్ణ నెదిర్చి, యెన్ని బాధలనైన నీకొందుఁగాని
యాంగ్లేయ సామ్రాజ్య యంత్రచాలకులు, పగవారు నా కని భావింపఁబోను
వారిడెందపుమార్పు వలతునుగాని, వారి సంకటపాటు వలవ నేనాఁడు
మేలిమేలిగుణాలుమీ కెన్నియున్న ; ద గరుమీ రీనాఁడు తగ రాలమునకు
రాట్నంబువడికి యర్హత నందుకొనుఁడు, ఖద్దరుగట్టి యోగ్యత నందుకొనుఁడు
వెఱ్ఱి కాదన్నను విడనైతి రాట్న, మిది పొగబండియందేని త్రిప్పెదను
నాకు రాట్నముమీఁదినమ్మిక, పేర్మి, యొరులు నవ్వుకొలంది నుత్కటంబయ్యె
రహటయంత్రంబు నారాధించి మీరు, కలనికిం బాత్రత గడియించుకొనుఁడు
పాత్రతాహీనులు పదివేలమంది, సత్యాగ్రహులకంటె సడిసన్నవారు
నల్గు రుంటయె లెస్స నాయనుభూతి; నిపుడు కత్తులతోడ నీరసతోడ
నడరుచు శాంతియన్నదిలేక వగచు, విశ్వంబున కహింస విడువకపూని
జయమంది నూతనసందేశ మిందు", నావుడు సభ్యు లానందవీచికల
నూఁగుచు జేజేల నొసంగిరి గురున; కపుడె హిట్లరుదెబ్బ కదవదయగుచు
ఫ్రాన్సు మిణకరింప బాహప్పళించి, జర్మనీ యాంగ్లదేశముపైకి దూకె (14-5-1940)

## వ్యష్టి సత్యాగ్రహము

ఆవేళ నేల్బడి నలయించు తీవ్ర, సత్యాగ్రహంబును సాగింప నొజ్జ
సమ్మతింపక వ్యష్టి సత్యాగ్రహంబె, తగు నిప్పు డనియెంచి తనదునీకోలు
పడసినాతఁడె ముందు పాలించువారి, కెఱిఁగించి నడివీధి నీబవరంబు
సాగింపఁజను నని "సర్కారువారు, నడుపుచున్న రణంబునకు విత్తమిచ్చి
ప్రజలనుబంపి తోడ్పడుట తప్పిదము, ఎల్లకయ్యముల నహింసతో నడ్డ
వలె" నన్నది ప్రమాణవాక్యంబు గాఁగ, సత్యాగ్రహికిఁగూర్చి స్వక్రియావార్త
వైస్రాయికంపి యవ్వల వినోబాకుఁ, బ్రథమసత్యాగ్రహిపదము నొసంగె;
ఆసంయమీంద్రుఁ డాయనఘచరిత్రుఁ, డాయతి యాగాంధియంతటివాఁడు
వ్యష్టిసత్యాగ్రహ స్యందనం బపుడు, కదలించె ముందుగా గణపతిం దలఁచి
రాష్ట్రంబులెల్ల నారంభించె నంత, సత్యాగ్రహం బహింసాబంధురంబు;
కాట్రగడ్డాన్వయ ఖ్యాతివల్లికకు, నల్లువెట్టినతల్లి! యనసూయ! వినుము

అఖిలభారతభూమి నానాఁడు దేశ, భక్తు లీపోరిలోఁ బాల్గొని చెఱకు
నేగి రిర్వదివేల హేమాహెమీలు; అదిమంచి దిదిచెడ్డ దనిపల్కఁదగిన
హక్కైనఁ బ్రజకీమి నాంగ్లేయు లపుడు, తేలికపడి రెల్లదీవులయందు
జర్మనీ కావేళ జంటగానిల్చి, జబ్బుతట్టుజపాను చైనాను గెల్చి
జావాసుమత్రాల జయభేరిగొట్టి, పడగెత్తె రంగూనుపట్టణంబునను
ఇండియాలో నిల్చి యిఁక నని సేఁత, యనివార్య మని నమ్మె నపు డింగలాండు
భరతోర్వితో సంధిపాటింపుఁ డనుచు, నమెరికా సూచించె నాంగ్లమంత్రులకు
దిక్కుదోఁపకమున్న తెల్లవారంతఁ, గాంగ్రెసువారిసఖ్యంబు నాసించి (3-12-1941)
విడుతుముబందాల వేవేగ ననిరి, పొరిఁబొరి నిండియా పొలమేరదనుక
రేఁగిన సంగరార్చిస్సుల కదరి, జవహరుమున్నగు సరదారులెల్లఁ
జర్చలుగావించి జాతీయమైన, యేల్బడి కేంద్రమం దేర్పరించుటకు
నాంగ్లేయులొప్పుచో ననికి సాయంబు, చేసెద మనిరి దేశికు నటునిల్చి;
ఆయయ్య సత్యాగ్రహము నుజ్జగించి, శాంతిసేనంగూర్ప సమకట్టె నపుడు,
పదపడి సింగపూర్‌పట్టె జపాను, అఱఁగెఁ జర్చిలుగర్వ మాదెబ్బతోడఁ
దనమంత్రిమండలిం దనరెడి'క్రిప్పు', నాతఁ డంపెను సంధియత్నాల కిటకు
క్రిప్పుసూచనలు కాంగ్రెసువారిమదికిఁ, జప్పచప్పగనుంటఁ జనియె నాప్రెగడ
కుత్సితరాణ్నీతికోవిదుఁడైన, యాంగ్లేయు నిఁక సైఁప ననియు నతండు
వెసవెస హిందూర్వి విడవలె ననియు, నతఁడు పోయినవెన్క నౌగాములరసి
భారతీయులె తమభ్రదు కెంతు రనియు, హరిజనపత్రికయందు మహాత్ముఁ
డావిష్కరించి యాయవసరమందె, 'విడు మిండియా' నన్నవీరమంత్రంబు

## క్విట్ ఇండియా

నుచ్చరించుడు నది యుర్వినల్దెసను, మాఱుమ్రోఁగఁదొడంగె మంతుగన్నట్టి
కాంగ్రెసువర్గ మీగర్జ బొంబాయి, నంగీకరించె నహో! పురే! యనుచు (8-8-1942)
బాపూజీ యా ప్రొద్దు ప్రజలను గూర్చి, "వినుఁడు సోదరులార! వినుఁడు నానదుపు
సమరంబులన్ గడసారి దీసమర; మిదియు నహింసతో నెసఁగుసంగరమె
యిదియు సత్యము నాశ్రయించుసగరమె
ఇందు హింసావిధు లీకొందురేని, కనలేరు సప్రాణుఁగా నన్ను మీరు
సంధికార్యంబులు సాగించి కయ్య, మేర్పడమికి శ్రమియింతు మున్ముందు
వై స్రాయి నాకోర్కి పాటింపఁడేని, సమరాకృతిన్ మీకుఁ జక్కవెలార్తు
ఏను బానిసనుగా నేను స్వతంత్ర, పోరుండనని ప్రతిభారతీయుండు
తలపోయవలయు నీతరుణంబునుండి, ఎట్టి త్యాగంబునకే నియ్యచేసి
దేశదాస్యంబును దెగటార్పవలయు, మగువలు మగవాండ్రు మది భీతిలేక

పాల్గొనవలయు నీభండనమందు, పద కెన్నఁడులేదు బ్రదికెడిహక్కు
పితికివాఁ దుర్విఁకిఁ బెద్దయుంబరువు, "చేయుము లేదానశింపు" మటన్న
వీరోక్తితో విశ్వవీథి కంపిల్ల, నదుచులగ్నము వచ్చినది నేఁడు మనకు"
మేనెల్ల నుప్పొంగ మిణుఁగురుల్ వోలె, బాపు వెలార్చునీపల్కులు ప్రజల
యెదల వీరావేశ మెసరేఁగఁజేయ, నపుడే స్వరాజ్యభాగ్యం బబ్బినట్లు
కదు సంతసించిరి కాంగ్రెసువారు, దేశాన గునియు జాతీయోద్యమంబు
నణఁచివైచుటకుఁ బెల్లారాటపడెడి, యేలువా రారేయి నెల్లరు నిద్రఁ
గూరియున్నట్టి వేకువజామునందు, సానుచరమ్ముగా నరికట్టి గాంధి 57

## గాంధిని పట్టుట - ప్రజరేఁగుట

నునిచి రాగాఖాను నుద్దిలేనట్టి, నట్టునయందుఁ బూనాపట్టణమున,
కాంగ్రెసుకార్యవర్గమువారిఁ బట్టి, రఖిలరాష్ట్రంబుల నన్ని జిల్లాలఁ
గలమొనగాంద్ర నెక్కడనున్న వారి, నక్కడబంధించి యంపిరిచెఱకు
కనకదుర్గాకటాక్షమున వర్ధిల్లు, విజయవాటికయందు విశ్రుతిగన్న
వాడయౌ 'పటమట' వాసంబుగాఁగ, నలరినసోదరీ! యనసూయ! వినుము
ప్రబలె నుద్రేకంబు ప్రజలలో నపుడు, ఉపదేష్టలేఁడయ్యె నొకఁడేని వారి
కయ్యపల్కు నహింసనాదులన్ మఱచి, రయమారఁ బెతికిరి రైలుపట్టాల,
వంతెనల్ కూల్చిరి వార్తలనడుపు, తంత్రులుత్రెంచి రత్తఱి జనుల్రేఁగి
సరకారుబంటు లాసమయంబునందు, వదలిరి మానవత్వము నూఁచముట్టు,
ఆకంఠముగ సోదరాస్త్రంబు త్రాగి, రువిద కెగ్గొనరించి, రూళ్లు పట్నాలు
దోఁచిరి దూష్యపుంద్రోవలఁ బడిరి; ఈదుండగంబుల నీయవమతుల
సైరింపలేక ప్రజల్ సాహసించి, పోలీసులనుజంపి పోటీ ప్రభుత్వ
మేర్పాటుచేసి మున్నెఱుఁగనిబెడఁద, లిమ్మహిన్ సృష్టించి; రిదియిట్టులుండ
నొజ్జతోనున్న ధన్యుఁడు మహాదేవ, దేశాయి రుగ్ణుఁడై దివికేగుదెంచె
తనకార్యదర్శియై తనరుదేశాయి, తనచోదకుండుగాఁ దనరుదేశాయి
తనగోష్ఠిబుధుఁడుగాఁ దనరుదేశాయి, తనకరమ్ములయందె తనుబాంధవంబు
వదలినదేశాయి వరణీయచరితఁ, దలఁచి బాపావేళఁ దద్దయుఁ గుంది
నలినీదళంబుపై నర్తించు సలిల, కణము, శరత్కాలఘనతటిద్వల్లి
బ్రదుకని కని కొంతబాధను మఱచి, హితునకు నౌర్ధ్వదైహికవిధుల్ నెఱపి
మెలమెల్ల నీయార్తి మ్రింగుచునుండ, నయ్యాయిపత్రిక లపు దుర్వి యల్ల
కల్లోలముగనుంట కంటికిందెచ్చె, ఈదుర్దశకు గాంధి యెంతేని కలఁగి
వైస్రాయి కిమ్మెయి వ్రాసెనుత్తరము (14-8-1942), "దారిదప్పితి వేల ధరణీశ! ప్రజల
దుర్భరాపదలలోఁ ద్రోసితివేల, అంతతొందరయేల యాగ్రహమేల

పోలునా నీకిట్టి పొరపాటు నృపతి ! నీతోడమాటాడి నీవు నాపల్కు
సమ్మతింపనినాఁడె సత్యాగ్రహంబు, సాగింతునంటి నాసమయంబునందె
ప్రజకుఁ గయ్యముతీరు ప్రకటింతు నంటి, హింసలేనిరణంబె యిదియు నటంటి
నారాకనొల్లక నామాట వినక, యదియుచితం బిది యనుచితం బనక
నిదురించునన్ను బంధించితివేమి ? ప్రజకు నాకును బొత్తు పాపితివేమి ?
కర్తవ్య మెఱిఁగింపగలనేత లేమి, నిచ్చవచ్చినచేఁత కెగఁబడెన్ జనత
దేశంబు నణఁగింపఁ దెగిరి నీబంటు, లగ్నులుకురియించి రకట! యూరూర
నసురులై జరపి రత్యాచారములను, క్రూరతమై రెచ్చఁగొట్టిరి జనులఁ
జెఱిచిరిశాంతి నిసీ! సైఁపరాని, చెట్టలుదాపరించెను భారతోర్వి
కీవు కాంగ్రెసుకోర్కి నీకొన్న నింత, పుట్టునా ? నాజీప్రభుత్వంబు దుష్ట
మని జగత్కంటకమని కాంగ్రెసెపుడొ, పల్కెఁగదా! ప్రజాస్వామ్యమే తగిన
యేల్బడియని కాంగ్రెసెన్నఁడో చాటెఁ, గద! ప్రభూ! సామ్రాజ్యకాంక్షలేకున్న
నింగ్లీషువార లీయిల నస్వతంత్ర, జగతిగా నుంతురా ? జరిగిన దేమొ
జరిగె నీవిపుడైన శాంతతనంది, వేవేగఁ గాంగ్రెసువీరుల చెఱల
వదలించి సంధికై వలయుయత్నంబు, లొనరింపవే! శక్తి యున్నది నీకుఁ
బగమాని చెల్మికై బడలవే ! యలుక, సకలసంతాప సంజనక, మీసత్య
మీవెఱుంగవె పంతమేల నామనవి, పాటింపవే కూచిపనుపులనెల్ల
నుపసంహరింపవే, యుర్వి దావాగ్ని, కీలలఁజిక్కి బెగ్గిలి తల్లడిల్లు;
నౌగాము లరసి యీయలజడి మాన్పి, శాంతిచేకూర్పవే జగమున;కేను
బల్కెద నీమిత్రుపగిది నీపల్కు, లుచితమార్గమున నిన్నునుచు నీశ్వరుఁడు
మంచికై ప్రేచి నిన్ మనుచు దైవతము", లేఖనిద్దాని లిన్‌లిత్‌గో పఠించి
యెగ్గెల్లఁ గాంగ్రెసుదే యనిపల్కె, ప్రజ కిదే నేర్పెను బాపాల ననియె
ఇది జర్మనీగెల్పు నిచ్చించు ననియె, ఇది జపాన్‌విజయంబు నీకొను ననియె
ఇదిచెప్పినట్లుగా నెదిరెడిమూఁక, నణఁచుట తప్పుగా దనియె నయారె!
ఈవాద మోర్వలే కీవన్న దెల్లఁ, గల్లగా రూపింతుఁ గరిపురాధీశ !
సత్యంబుపై నీకుఁ జవిగలదేని, దీనికి నంగీకృతిం జూపు మనుచు
బాపూజీ వెండియుఁ బత్రంబునంప, నవ్వల నోర్విప్పఁదయ్యె నయ్యేదిరి;
అతనిచెడ్డతనంబు నవనికిం జాట, నతనియసాధుత్వ మాఱడిసేయ
దేశికుం డనశనదీక్ష వహింప, సమకట్టి తనధర్మసరణిఁ బాటించి
తెలిపె వై స్రాయి కీతీర్పు మున్ముందు, కపటమార్గం బిది కారాగృహార్తి
యెడలఁగాఁ బన్నినయె త్తిది యనుచుఁ, జెనఁటికైవడి గేలిచేసె నాప్రభువు;
గత్యంతరము లేక గాంధి యావెన్కఁ, బూనెను ముయ్యేదుప్రొద్దులపస్తు (10-2-1943) 58

## బాపూ మరల నుపాసము

ఈయయ్య యిత్తతి నెముకలగూఁదు, మాడ్కి నుండిననేమి మానందుపట్టు
సాగుచున్నది యోగిసత్తముతపము, వేఁగుచున్నది సర్వవిశ్వప్రజాళి
సడిసన్న వెజ్జు లాసంయమిం జూచి, యోర్వలేఁ డీనిట్టు నోర్వలేఁ దనిరి
మెలమెల్ల నొకనాఁడు మృత్యు వాచార్యుఁ, గదిసెఁగాని యెదుర్పఁగా జంకి పఱచె
ఏమగునో గాంధి యెల్లి యటంచు, నొకభారతమెకాక యుర్విసమస్త
మలమటగుడిచి మహాత్మునివిడువఁ, దగునని ఘోషించె, ధరణిఁ బేర్గన్న
పత్రికలన్నియు బాపూజీ నిపుడు, చెఱసాలనుంచుట చెడుచేఁత యనియె,
అఖిలపక్షసదస్సు హస్తినన్ గూడి, యొజ్జనువదలుట యుచితమౌ ననియె
ఎవ రెంత వేఁడిననేమి వైస్రాయి, మనసులో నిసుమంతమార్పు రాదాయె
గాంధి యాబెడఁదలోఁ గనుమూసెనేని, రాపెల్లఁ దొలఁగు, సామ్రాజ్యంపుమేర
చెదరకనిలుచు, నీజిత్తులమారి, నణఁచుట కిదె మంచియదనని యతఁడు
మొఱకుఁదనమ్ములో మునిఁగె నానాఁడు, వారక యీయుపవాసంబునందు
సత్యాగ్రహవిధాత సమయు నంచెంచె, ఆచార్యదహనాదు లాబందియందె
జరుపఁదెగించె, నాసమయానం బ్రజలు, చెలరేఁగి యల్లరిసేయమి కెల్ల
దెసలఁ గాపుంచెను దిట్టలౌబంట్ల, ఎంతచేసిననేమి యీశ్వరుకరుణ
నాత్మశక్తిసమగ్రుఁ డగ్ని పరీక్ష, కోర్చి పూర్తియొనర్చె నుపవస్త మొజ్జ,
ఆపదుద్ధర్తకు నాశ్రితానీక, వరదాతకున్ భగవంతున కెఱఁగి
సుకృతవితర్ది కస్తూరి యొసంగు, ఫలరసం బించుక బాపుజీ క్రోలె
అఖిలవిశ్వము పొంగె నమ్ముహూర్తమున, నుద్విగ్నభారతం బూపిరిపీల్చె (3-3-1943)

## కస్తూరిబాయి కన్ను మూఁత

ఆవెన్క సోదరీ! యఖిలప్రపంచ, హార్దసమ్మానంబు లందుకొన్నట్టి
గాంధి కిల్లాలైన గణనీయచరిత, యఱువదేఁడులనుండి యగ్ని సమ్మితుని
మగని మెప్పించిన మహిళామతల్లి, మతకులభేదముల్ మఱచి మానవుల
సేవించి తనివిగాంచిన క్షమామూర్తి, భారతస్వాతంత్ర్య పరిలబ్ధికొఱకు
సిలుగులెన్నేని సైఁచినవీరనారి, గణ్యపుణ్యశరణ్య, కస్తూరిబాయి
కటకటా! కనుమూసెఁ గారాగృహమున (23-2-1944),
గాంధి యీయెడఁబాటుకతనఁ గన్నీరు
కురిసి దిగ్గనఁ దేఱుకొనె ముక్తుఁ డగుట, మాలవీయాదు లీమానిని పేర
నాపన్న సత్వల కండగా నుండఁ, జానలవిద్య కాశ్రయముగా నిలువ
బహువైద్యశాలలు పాఠశాలికలు, పట్టణంబుల కెడపడినపల్లియల,
లేవడితో నుమ్మలించుపల్లియలఁ, బాదుకొల్పుట మేలిపని యనితలఁచి

నడుముగట్టిరి కాంచనము సమకూర్ప; కస్తూరిపైఁగల, గాంధిపైనున్న
భక్తిచే రక్తిచేఁ బ్రజ సమర్పింపఁ, గూర్చిరి కోటి కెక్కుదుగా ధనంబు
తీర్చిరి తల్లికీ ర్తికి మందిరములు, కస్తూరిమేన్ పోయెఁ గాని యమ్మాత
చరిత మాచంద్రభాస్కరముగా నిలిచె; బందిగంబుననున్న బాపుజీ నంతఁ
జలివేఁకి పీడింపసాగె రే పవలు, పస్తులతో లాఁతిబాధలతోడ
నలఁగినలంగి చిన్నముపాటిచేవ, లేని యాగురుమౌళి లేవలేనట్టి
బడుగయ్యె నీనొవ్వి పఱపువేదనల, విన్నఁబోయిరి నాఁడు వెజ్జులందఱును
గోలపెట్టిరి ప్రజల్ గురు వీడుఁదనుచు, బెదరి యేల్బడివారు బిఱబిఱ నయ్యె
చెఱ వదలించి రంచితగౌరవముల; ఇంతిసమాధిపై మేలిసరు లుంచి వేల్పు
నెంచి తన్నలరించు నిద్ధచరిత్ర, వెలయు 'ధాకర్సీ'నివేశమై తనరు
'పర్ణకుటిన్' మిత్రపటలితోఁ జేరె; అయింట నైదునా ళ్లరిగినవెన్క
నారోగ్యభాగ్యంబు నందుటకొఱకు, బాపు బొంబయిచెంతఁ బరఁగు 'జుహూ'కు
వచ్చె, నచ్చట వీరు వారేగుదెంచి, యామాట లీమాట లాడించి యొజ్జ
కలసటం గూర్పమి కవ్వేళ నేర్మి, దీవి సరోజినీదేవి దీక్షించి
పులి తన బిడ్డను బ్రోచువిధానఁ, గాపాడఁదొడఁగెను గస్తూరిమగని,
ఈమెయానతిలేక యెంతవారైనఁ, బోలేరు నాఁడు బాపూనిల్బు గదికి,
ఎందఱెందఱొ వజీ ర్లీయానరాక, మది నుమ్మలించుచు మరలుచునుండ
జీర్ణాంబరంబులఁ జిఱుతవాఁడొకఁడు, బెదరుఁజూపుల జాతిపితఁ జూడవచ్చె
ఎప్పుడో రేపాడి యేతెంచి వాఁడు, వార్చుచుండెను బ్రొద్దు వాటాలుదనుక
వాడిపోయిన వానివదనంబు చూచి, కూడునీ ళ్లెఱుఁగని కుక్షినిజూచి
పెడపెడగానిల్పు భీతిని జూచి, తెప్పపాటెఱుఁగని దృష్టులంజూచి
తెనుఁగింటికోడ లాదేవి పేర్గన్న, కవయిత్రి కరుణ కగ్గంపడి మధుర
భాషితమ్ముల వానిఁ బజ్జకుం బిల్చి, యేమోయి! బాపూజి నీక్ష సేయంగ
వచ్చితివా మంచివాఁడవే పొమ్ము, కను మన వినతుఁడై గాంధిని డాసి
యతఁడు తత్పదముల కష్టాంగసహిత, వందనంబిడి పారవశ్యంబునంది
తేఱి హర్షాశ్రువుల్ తెరలఁగా నొజ్జ, పజ్జఁ దాఁ దెచ్చినఫలముల సజ్జ
నునిచి జన్మఫలంబు నొందితిననుచు, భావించుసమయాన బాపుజీచెంత
నున్న ఘనుం డొక్కఁ దూరూరు తిరిగి, పైసలనార్జించి బ్రదుకు బికారి
కావచ్చు నితఁ డని కటుతరోక్తులను, వెడలింప బాలుఁ డావేశంబునంది
తండ్రి! నీకే నసత్యము వక్కణింప, బిచ్చపుంగూడు నాపిల్లియుం దినదు
నాకును లేకిమన్నడకును బొత్తు, లేదు మహాత్మ! కూలికిదున్ని దోఁకి
బ్రదుకువాఁడను నేను, బరువు మర్యాద, వాటించుపల్లియవాఁడను నేను
చెమటనోడిచి యోడ్చి చేకూర్చుకొన్న, విత్తంబుతోఁ బండ్లు విలిచినవాఁడ

నీకు వీనినొసంగి నీకృపనంది, ధన్యతంబడయంగఁ దలఁచినవాఁడ
నాదరింపవె మదీయంబు నీకాన్క, ననుడు గాంధికరంగి యలరితినోయి!
నీపల్కులకును నీనిష్ఠ కెంతేని, పం డ్లివి నీకష్టఫలములు వీని
నారగింపుము తమ్ముఁడా! నీవె యనియె, పదపడి బాపుజీ! ఫలములు నాకు
వలదు వలాదు నీవంటిమహర్షి, పొట్టలోపలి కివి పోయెనా నాదు
పొట్టయునిండు నప్పు డటంచు లేఁత, నగవుతో మ్రొక్కి మాణవకుండు వెడలె;
వింటివా! సోదరీ! విశ్రుతాచార! గాంధిమహత్త యీగతిఁ బిన్నలకును
దెలిసి వివేక ముద్దీప్తి యొసంగె; బాపూ జుహూనుండి ప్రకృతిచికిత్స
వలచి పూనాచేరి వైద్రాయి కిట్లు, కమ్మవ్రాసెను గూర్మి కదలుకొనంగ (17-6-1944)
"ఓయన్న! భారతీయులు పెఱవార, లీనేలఁగలచిక్కు లెడయించి ప్రజలఁ
దేర్చుటకై ప్రయత్నింపు మటంచు, ననుఁగోరుచున్నారు నైకలేఖముల
నేనుగోల్కొనుటకు నెంతకాలంబు, చెల్లునో విధిమేలుచేసి వైళంబ
యారోగ్యభాగ్యంబు నందుదుఁగాక, యొంటరినై యేమి యొనరింపనేర్తు
కాంగ్రెసునకు నండగా నిల్వఁదగిన, చదురు లందఱు చెఱసాలలోఁగలరు
వారలంజూడక వారితో మంచి, చెడ్డలన్ దడవ కేఁ జేసెడిచెయిది
కాసంతలేమినిక్కము, గాన వారి, నీక్షసేయఁగ నాకు నిమ్ము సమ్మతిని
బంది నున్నపుడె యీపని కపు డేలు, వైద్రాయిముదలను వలచితిఁగాని
ప్రకృతిచికిత్సలో బాధలు కొన్ని, యణఁగారుటంజేసి యవల విశ్రాంతి
పడయఁ బూనాపురిపజ్జఁ దనర్చు, పంచగనిం జేరి పదిప్రొద్దు లందు
నిలిచి క్విట్టిండియా నినదంబునాఁడు, వదలినయున్కి సేవా గ్రామమునకు
సపరివారంబుగాఁ జనుదెంచి గాంధి, బావురు మనుచున్న పట్టుఁ గస్తూరి
నిలుచుకుటీరమున్ వీక్షించివగచి, శాంతించి యాశ్రమస్థ సగంధసమితి
సేమంబునడిగి యాశీస్సులతోడ, నద్దానిఁ దనిపి యయ్యాయికార్యముల
స్రగ్గుచునుండ నాసంయమీశ్వరుఁడు, పుట్టిన పుణ్యాలప్రొద్దు వేంచేసె (2-10-1944)
జనరంజకంబుగా సాగె సదస్సు, బెర్నార్డుషా వంటి పెద పెద్దవారు
పండిన బాపుజీబ్రదుకును గూర్చి, యంపిన యభినందనాళి నాసభను
జదివిరి సూనృతార్చకు వమచరులు, గురుసేవ లీవులు కొనియాడి తనిసి
రాయురారోగ్యంబు లర్థించి రొజ్జ; కావెన్క నొక గణ్యమైన కార్యంబు
కావించె గాంధి తత్కథ యెట్టిదనినఁ, గస్తూరి బందిలోఁగాలంబునీడ్చు
తఱి సనాతనసంప్రదాయంబు నెంచి, చెఱముంగిటన్ దులసినినాటి పెంచి
యనుదినం బర్చించె నాత్మ రంజిల్ల; అయ్య కారాముక్తుఁడై వచ్చువేళ
నామొక్క నొకదాని నమ్మనూగాంధి, భక్తితోడుతఁదెచ్చి పసిబిడ్డఁబోలె
బ్రదికించుచున్నది పావనాచార; గాంధి యీమొక్కను గళదప్పియున్న

కస్తూరినెలవుముంగడఁ గీలుకొల్పి, క్రతువహ్నివంటి మన్గడను సాగించి
తనసేవలో నిరంతరముగా దన్సి, తను వుజ్జగించిన ధన్యతారాశి
వెలఁదికస్తురి నెంచి, వేఁడియూర్పులను, విడువ నెల్లరకంట వెడలె బాష్పములు;
అలసోక్రటీసు రామానుజసూరి, శ్రుతులుతార్మాతైన సుదతులకతనఁ
బడినసంకటపాటు బాపుజీ యెఱుఁగఁ, దర్ధాంగి సాధుశీలాంచిత యగుటఁ
బతికి నింపితమైనబాటలో నడిచి, పాపంబులకు భయంపడి నడిరేయి
వచ్చినవారికిన్ వండివడ్డించి, హరిభక్తిలో వంతలన్నియున్ మఱచి
హిందూవధూటికి నెనలేరికీర్తి, సంతరించిన మహాసాధ్వి కస్తూరి;
గుండెనిబ్బరమున్న కులకాంత యగుటఁ, బరువపుంజేవ తప్పనివయస్సుననె
బ్రహ్మచర్యంబును బాటించి నిల్చి, పతికోర్కితీవ కుపఘ్నమై తనరె;
సంతతమ్ముగఁ దీవ్రసంస్మర్త యగుచుఁ, జరియించుపతి కెగ్గుసల్పఁగా నెంద
తెందతో పూనుట యెఱిఁగి కస్తూరి, కాచె జాగర్యతోఁ గాంతునిబ్రదుకు,
కాచె లోకమ్మును గాచె ధర్మువును; చదువు హేతువుగాదు సద్గుణంబులకు
ననిచాటె నీయమ్మ యంగనాతతికి; అన్నంబునిడె మాల, కతనియెంగిళ్లు
కడిగె శుద్ధమొనర్చెఁ గాల్మడికుండ, మాలపిల్లను బిడ్డమాద్రిగాఁ బెనిచె,
నీతల్లి ప్రేమకు నెల్ల కన్పడదు; జాతికెల్లను గాంధి జనకుఁడుగాఁగ
జననియైనది పుణ్యచరిత కస్తూరి; బందిలోఁ గల యెల్లవారికి మ్రొక్కి
రామ!రామ! యటంచుఁ బ్రాణేశునొడిని, దలనుంచి కస్తూరి తనువుజ్జగించె;
అది యట్టులుండె బా పాశ్రమమందు, విశ్రాంతిగనుచుండ విశ్వంబునెల్ల
నాఱేండ్లనుండి యల్లాడించుచున్న, సమరమం దక్షరాజ్యములవా రోడ
నాంగ్లరాజ్యంబువా రందిరిగెల్చు (1945 మే) , అని సమా ప్తంబాయె నంత వైస్రాయి
కాంగ్రెసు కార్యవర్గమ్మునవారిఁ, జెఱనుండి విడిపించి "సిమ్లాపురాన
నాయాజమాన్యాన నడచెడి సభకు, భారతోర్వీ పరిపాలనక్రమము
నారయుసభకురం"దని సర్వపక్ష, నాయకులకుఁ బంపె నాఁడు పిల్పులను
కాంగ్రెసుసభ్యుండు కాకున్ననేమి, వేవెలుకోరికన్ వితసేయలేక
యొజ్జయువెడలె నీయోలగంబునకుఁ, దెలిపె నుదారమౌతీ రొండుగాంధి
యిదియును జిన్నా కనిష్టంబు యగుట, నెలమిగూర్పనిదయ్యె నీపరిషత్తు
కడఁగుఁడు నిర్మాణకార్యక్రమంబు, సాగింపుఁ దేలవిచారం బటంచు
నాప్తులకుందెల్పి యయ్యు యిల్ సేరె, పదపడి సోదరీ! బాపూజీ పుణ్య
నగరంబుచెంగటన్ దనరారుచున్న, "యురిలికాంచన" మను నూరికింజేరి
యటఁగల ప్రకృతివైద్యాలయమందు, నుచితమైనచికిత్స నొందఁగాఁడొడఁగె
మూన్నెల లీవైద్యమును నిర్వహించి, యారోగ్యభాగ్యంబు నంది మహాత్ముఁ
డిరవున కేతెంచి హితులమే లరసి, కనికరంబెఱుఁగని కఱవురాకాసి

యుదుటు నోర్వఁగలేక యొకయర్ధకోటి, ప్రజలను గోల్పోయి పలవించుచున్న
వంగోర్వి కేగె సేవాపరాయణుఁడు (1945 నవం 30), నిరయతుల్యంబు నానేల నీక్షించి
కన్నీరు మున్నీరుగాఁ గుందికుంది, తేరి యీవెత పరాధీనతాఫలమె
యిఁకనిల్వ దీదాస్య మీనాలిబ్రదుకు, అవిగో! స్వతంత్రతాహస్కరమంద
లారుణరోచిస్సు లమరేంద్రుదిశను, బసిడిజల్లులువోలె బయలుదేఱెడిని
చూడుఁ డింటింటికిఁ జూతప్రవాళ, తోరణంఋలుగట్టి తుష్టిమై నిల్వుఁ
డయ్యలారా! యమ్మలారా! యటంచుఁ, బ్రజలనుబ్రార్థించి రవికవిలేని
శాంతినికేతనస్థలి కేగి గురుల, శిష్యుల నోదార్చి శ్రీమద్రవీంద్రు
మతముచుఁడీ! విశ్వమానవప్రేమ, బదలుఁ డీధర్మంబు పరిపుష్టినంద,
ధనములేదని పరితాప మందకుఁడు, మనచేయుపని లోకమాన్య మైనవుడు
వచ్చుఁ దానై మనవంక కర్థంబు, నాయనుభూతి నన్నాఁడ నీపల్కు
లన్నలారా! నమ్ముఁ డనె మహాత్ముండు; అనసూయ! వినవమ్మ యంతట నొజ్జ
చేరె నెయ్యురతోడఁ జెన్నపురంబు; (1946, జనవరి)
ఇరువదైదేండ్లనాఁ డీనగరాన, రాష్ట్రభాషాప్రచారము నిర్వహింప
వెలసినసదసు గావించుపండువున, బాల్గొని దేశికప్రవరుండు గాంధి
"భారతోర్వింగల ప్రజలకునెల్ల, నుమ్మడిబాసగా నొకబాస వలయు
పలువురు హిందీకిఁ బరిచితు లగుట, జాతీయభాషగాఁ జను నీవచస్సు
ఇది మాతృభాషల కెగ్గుగావించు, ననువారివాద మే నంగీకరింప
హిందీప్రచారంబు హితమని నమ్మి, యీపల్కు నెసఁగింప నిచ్చమైబడలు
దక్షిణభారతధాత్రీజనంబు, సంభావనార్హంబు సదసద్వివేక
సంపన్నమని సభన్ జక్క వాక్రుచ్చి, హరిజనున్ బేర్మి నాహ్వానించినట్టి
మధురకోవెలఁ జూచి మరలెవార్ధాకు; దారిలో నాంధ్రపత్తనమైన విజయ
వాటిక నయ్యోగివల్లభుం డాఁగి, హిందీప్రచారకు లేర్పాటుచేయు
భవనంబునకు మేలిపల్కులు పల్కి, బలసిన వేల్వేలప్రజలను గాంచి
యాంధ్రులపట్ల నా కాశలు మెండు, వారక వారు నావాంఛలఁదీర్తు
రస్పృశ్యతాపిశా చాహంత నణఁచి, హరిజనులకు గుడులన్నియుం దెఱచి
ప్రతినికేతనమున రాట్నంబుద్రిప్పి, కడగండ్ల నుడిగించు ఖద్దరుగట్టి
జాతీయమైత్రి నిచ్చలు నాసచేసి, తల్లిపల్కునఁ బ్రోదతనము నార్జించి
రాష్ట్రభాషకు నాదరము వెల్వరించి, తెనుఁగువారలు భారతీయదాస్యంబు
నదలింపఁగలరు న న్నలరింపఁగలరు", నావుడుఁ దెన్గు లానందంబునంది
పగటిరి జయజయధ్వనులు బాపునకు; ఈకథ యిట్లుండ నింగ్లాండునందు,
మనభూమిలో మేలిమార్పులు వచ్చె, అచటఁ గార్మికపక్ష మధికారమందె
ఇచటఁ గాంగ్రెసుగెల్చె నెల్లయెన్నికల, నదియొనర్చినసేవ యతివేలమగుటఁ

బూనాపురిన్ జబల్‌పూరునం దొండు, పట్టుల సైన్యముల్ ప్రభుత నెదిర్చి
సాయుధవిప్లవ వ్యవసాయమునకు, నురవడింపఁదొడంగె నుఖ్యాడఁదొడఁగె
విధి యుదారతవీడి విపరీతమగుట, బోసుసైన్యము పరాభూతంబుగాఁగ
మనసరకారు బర్మానుండి ధానిఁ, దెచ్చి యొచ్చెములేనిదిట్టలతలల
రక్కసనేరముల్ రాజకీయములు, పదులు వందలు మోపి ప్రత్యేకమైన
కోర్టు హస్తిపురానఁ గూర్చి దండింప, సాగుటంజేసి దేశమున రోషంబు
లావేశములు విలయాబ్ధులై పొంగె; ఈపొంగు నణఁగింప నెవ్వరుంజాల
రీరాచతమి నాఁప నీశుఁడుంజాలఁ, దనినమ్మి యట్లీమహాశయుం దప్పు
డిఁక నిండియా తనకిష్టమైనట్టి, రాజ్యాంగసూత్రముల్ రచియించుకొనును
అక్కఱయనుకొన్న నాంగ్లేయరాజ్య, వర్గమం దది యుండవచ్చు నొండేని
దానికిదవ్వుగాఁ దా నుండవచ్చు, అల్పసంఖ్యాకవర్గాభ్యుదయంబు
నరయుట మనకృత్య; మానేలనున్న, సంస్థానముల సమస్యను దీర్చువారు
ప్రజలే యటంచు సభం బ్రకటించె; మునుకొని శరవేగమున దూఁకుచున్న
రాచమార్పుల నేమఱక గాంధి కనుచుఁ, బలికె నిమ్మెయి నొక్క ప్రార్థనాసభను
"దేశదాస్య మడంగు దివ్యలగ్నంబు, తమ్ములారా! కదుదాపునం గలదు
ఆంగ్లమంత్రులుముప్వ రాముహూర్తంబు, తెల్పుట కిచటి కేతెంచుచున్నారు
వారిని శంకింపవల, దట్టిచేఁత, గఱువలకొనియాట గనలేనిచేఁత
అధమర్ణుఁడైనవాఁ డప్పు చెల్లింప, మనయింటి కేతేర మనమార నతని
మన్నింపఁదగుఁ గాని మర్యాదదప్పి, యతఁడు మున్ చేసిన యవగడంబులను
బాహిరంబొనరించుపని తగ" దనిన, నగుఁగాక! యనిరంద, అంత లారెన్సు,
క్రిప్సులెగ్జాండ రాంగ్లేయధీసచివు, లిభపురికింజేరి రింగ్లాండునుండి (24-3-1946)
వైస్రాయిమున్నగువారల నున్న, తాధికారంబుల నలరారువారిఁ
గాంచి యామంత్రు లౌగాము లెతింగి, పంపి రాహ్వానంబు బాపుసన్నిధికి;
కదలి ఢిల్లీచేరి గాంధి వాల్మీకి (30-3-1946), గుడిచెంతఁగల పాకిగూడెమునందు
నొక కుటీరంబునం దొదిఁగికూర్చుండె, ఇటకువచ్చెడిబాట యిఱుకాటమైన
జవహరాదులు సుప్రశ స్త నాయకులు, చనుదెంచి యొజ్జతోఁ జర్చలు సల్ప
నిచటనే మొదలిడి, రిచటనే ముగురు, ప్రెగడలు భారతర్షివరేణ్యుమ్రోల,
నూలుదీసెడి జగన్నుతమతిమ్రోల, వినతులై రాజ్యాంగవిధులు తర్కించి,
రిచటనే హిందూమహీ మహోరూప, కల్పన గావించి గణనీయులైరి,
ఇచటనే నూటేఁబదేఁడులనుండి, తననెత్రు తనపేర్మి తనజీవ మెగసి
పీల్చుచు నార్చుచుఁ బేర్చుచున్నట్టి, పరతంత్రతను నెట్టె భారతీయుండు,
ఇచటనే సత్య మహింసయున్ గెలిచి, విస్మయంబునుగూర్చె విశ్వానకెల్ల, 59

## జాతీయవారము

వచ్చెను జాతీయవార మత్తఱిని 6-4-1946, సాగించె సూత్రయజ్ఞంబు తా నున్న
హరిజనవాటికయందు మహాత్ముఁ, డెందఱెందఱొపెద్ద లేతెంచి గాంధి
ముంగడ నూల్ దీయ మొదలిడి రర్థి, నమ్మేలిపని జవహరుఁడునున్ జేఁత
యోలగంబునకు నేత్రోత్సవం బాయె; ఆనాఁటిరేపాడి నాచార్యమౌళి
వేల్పునువేఁడినవెనుక నిట్లనియె; "మన స్వరాజ్యముకథన్ మఱవంగరాని
కాల మియ్యదిచుఁడీ! కట్టలుతెగిన, యేటిలీల స్వరాజ్యతృష్ణ ఱంపిల్లి
తొల్లి పొంగెత్తె నీదొడ్డకాలమున, హిందువుల్ ముస్లిము లిసుమంతవేర్మి
లే కన్నదమ్ములలీల మెలంగి, రాంగ్లప్రభుత్వంబు నవలికిం ద్రోయ
నడిచి రంగలుసాఁచి నాల్గుదిక్కులను, పోయి రింటింటికి బుజములుకలిపి
దీక్షితుల్కందు స్వాధీనత కనుచు, తమబానిసంబును దరలింప నెత్రు
పిండెద మనిరి పింపిసలాడుకడిమి, నానెయ్య మాతియ్య మాతెంపు చూచి
తలఁకి రేల్బడివారు తత్తఱపడిరి, మఱచిపోఁజాలనామైత్రి నెన్నఁటికి
విస్మరింపఁగఁజాల వీరతన్ దాని, మనపట్ల నీశ్వరుమది మాఱెనేమొ
యలుకపుట్టినదేమొ హైందవుల్ వేఱు, మేమువే ఱనుచు నెమ్మిదొఱంగి నేఁడు
మనముస్లిములు కొంతమంది వాదాడఁ, దొడఁగిరి పెడదారిత్రొక్క నీకొనిరి
సత్యంబు నరసి దేశహితంబు నెంచి, యరమరల్వీడి నెయ్యంబును మరగి
యీగడ్డఁగలవార లెల్లరు నొక్క, బాటకు నేతెంచి భారతక్షోణి
ముక్తికిఁ గంకణంబులు గట్టవలయు, శక్తికి జతనముల్ సాగింపవలయు
ఆనాఁడు జలియన్వనాంతరమందు, నేల్బడివా రహంకృతిఁ జల్పినట్టి
దారుణహింసకతాన దేశాన, నుద్వేలమగుశక్తి యుద్భూతమయ్యె
ఇద్దాని నణఁగింప నేలికల్ ఘోర, చర్యలు సాగించి సకలరాజ్యములు
తెగడఁగా నిఁక భారతీయునిన్ జగము, పాటించుమార్గానఁ బాలించు టరిది
యనివిశ్వసించి సౌహార్దంబుతోడ, మంత్రులముమ్వర మనచెంత కనిపి,
రీశ్వరుండు వివేకమిచ్చె వీరలకు, మంత్రిత్రయం బిది మనకిచ్చుతీర్పు
సకలభారత హర్షసంధాయకంబు, కాఁగల దనియె; నీకథ యిట్టులుండ 60

## బోసు దళము

నేల్బడివా రప్పు డెఱ్ఱకోటయందు, బోసుదళమ్మునం బొగడికల్గన్న
యోద్ధలపై మోపుచున్న నేరంబు, లుగ్రంబు లగుట నీయుర్వి యట్టుడికి
నట్లుడుకంబాఱె నన్నితావులను; బాపుజీ యీఘోరవార్త నాలించి
మది కల్పవారాశిమాడ్కి ఘూర్ణిల్లఁ, ద్యాగదీక్షితులన్ స్వతంత్రహిందూ బ
లాధికారులను మోహనసింగు, షాన, వాజు మున్నగు యోధవర్యులఁజూచి

తర్థీరతాదులు తద్దయు మెచ్చి, యీకొనుం డిఁకమీ రహింసావ్రతంబు
దేశంబుకొఱకుఁ గత్తిని బట్టుకంటెఁ, జీఁపురుం బట్టుట శ్రేయఃప్రదంబు
నావుడు శ్రోత లానందితులైరి; పదపడి సోదరీ! భారతక్షితిని
స్వాధీనతాదీప్తి సమకూర్చుకొఱకు, వచ్చినట్టి యమాత్యవర్గ మీమహిని
జీల్పరాదని యెంతచెప్పిన నేమి, తనమొండిపట్టు సుంతయు సడలింప
నొల్లఁడయ్యెను లీగునాదయుఁడు జిన్న; ఒజ్జ నన్ జీల్చుట కొప్పెదఁగాని
యవనిఁజీల్చుట కొప్పనని నిల్చిపల్కె, అటునూయి యిటుగోయి యన్నచందాన
రేఁగిన వాదాలరీతి నీక్షించి, ధర్మువుదెస చూచి ధారణిం జీల్పఁ
గాదని ముగురుప్రెగ్గడలు భావించి, కాంగ్రెసు లీగువర్గంబులవారు
సమసంఖ్యలో నుండుసరణి జాతీయ, మంత్రిమండలిని నిర్మాణంబుసేయు
దారి కేతేర నూతనసమస్యలను, రేఁపి జిన్నా యెదిరించె నాతీరు, 61

## జాతీయ ప్రభుత్వము

నాంగ్లమంత్రివరేణ్యుఁ డపుడు "జిన్నా తె, అంగెట్టులున్న భారతభూమి నిపుడు
కాంగ్రెసు పైచేయిగా నుండెఁగానఁ, దన్నాయకునిబిల్చి తగుచర్చసల్పి
తెమ్ము వేవేగ జాతీయప్రభుత్వ, మది లేనిచో దేశమం దెచ్చియున్న
కఱ వణంగ, దశాంతి కాల్కదలింప", దనుచు వేవెలుచెంత కనిపెనుగమ్ము;
అంతఁ గాంగ్రెసునకు నధ్యక్షుఁడైన, పండిత జవహరుపజ్జకు వేవె
లొకలేఖ నంపుచు నోయయ్య! నీవె, పూఁటగానిలిచి ప్రభుత్వముం గూర్పు,
మాలసింపక మంత్రులగువారిఁ దేల్చి, యిభపురంబునకు రావే! యనికోరె;
చాఁగురే! బాపుజీసత్యంబు గెలిచె, అజ్జరే! నెగ్గె మహాత్మునహింస,
కాంగ్రెసువారిత్యాగంబులు పండె, కడచె భారతధాత్రిఁ గ్రమ్మినయిరులు
మెఱసె స్వతంత్రతా మిహిరారుణాంశు, లలరారె నారీనరాస్యపద్మములు;
గురునిదీవన లందుకొని జవహరుఁడు, చేరె బొంబాయికి జిన్నానుజూడ;
నేల్బడిలోఁజేర నెంతవేఁడినను, లేశ మీకొనఁడాయె లీగునాయకుఁడు
మాపల్కు పాటించి మహిఁ జీల్పకున్నఁ, బ్రత్యక్షచర్యకుం బాల్పడఁగలము
మానుకోఁగల మహింసన మని పదరె, అతనిప్రసన్నత నార్జింపలేక
జవహరు వైస్రాయిసరస కేతెంచి, ప్రెగడలపట్టి నాపెద్ద కందించె,
అది సీమసర్కారు నామోదమంది, వచ్చినంతనె ప్రజావారాశి పొంగఁ
దాత్కాలిక ప్రభుత్వము నుదాత్తుండు, నెహ్రూ ప్రారంభించె నియమబద్ధముగ (2-9-1946)
బాపుజీ యానాఁటి ప్రార్థనాసభను, బలికె నిమ్మెయి "నేఁడు భారతదేశ
రాజకీయ చరిత్ర రమణీయమైన, యధ్యాయ మారంభమయ్యె నూతనము,
కంటకమకుటంబు కాంగ్రెసు తాల్చె, దేశస్వతంత్రతాదీక్ష నొప్పారు

జనమెల్ల దీని కస్రాంతజయంబు, చేకూర్పవలయు స్వశ్రేయంబు మఱచి,
ప్రజలలో వర్గముల్ పక్షంబు లెన్ని, యున్న నెల్లరు దీనియున్నతివలచి
కష్టించి మాన్యతన్ గడియింపవలయు, అంకటిమంటల నల్లాడి సమయు
పేదలదెసం గూర్మి పిండంగావలయు, మతకులభేదముల్ మండల రాష్ట్ర
సంఘర్షములుమాని సర్వమానవుల, సంతుష్టిలోఁ దమసంతుష్టి యుంట
తెలిసికోవలయు, నీదేశంబునట్లె, యెల్లదేశంబుల నీక్షింపవలయు,
ప్రాణిహితంబుగాఁ బచరించుచేఁత, యీశ్వరసేవగా నెఱుంగంగవలయు,
శంకింపరా దాంగ్లజాతిమానవుల, శంకితునకు సుఖశాంతు లేర్పడవు"
అనుటయు నోలగం బమ్లానమాయె; సచివులందఱు ప్రజాసౌఖ్యంబుకొఱకు
దీక్షమై నలయంగఁ దివిరి రప్పసము; ఈకథ యిట్లుండ హిందూధరిత్రి
వ్రక్కలుగామి నవారణక్రుధకు, దక్కినలీగువార్ తా మేలుచున్న 62

## హింసాకాండ

వంగభూమిని ముందు వదలిరి శరము, ప్రత్యక్ష చర్యకుం బాల్పడి రేచి
కాళిఘట్టమున దుకాణముల్ మూయ, నానలు పెట్టి రయ్యదనఁ జెన్న ఁటులు
దోఁచిరిసంపదల్ త్రుంచిరి నరుల, నడచె నీసమరంబు నాలుగునాళ్లు
పఱచె నెత్తురుటేర్లు పలువీధులందు, హా!హా! రవంబుల నైదాఱువేల
మంది గ్రమందిరి, కటా! మఱి కాలు, కేలు, తెగి తలవ్రక్కలై దీనులైకుందు
వార లిర్వదివేలవఱ కుందు; రిచట, మూరినమంటలు బొంబాయి నెగసె
పాంచాలమున సల్పెఁ బ్రళయనాట్యంబు, ప్రాగ్వంగమం దిది బడబాగ్ని కరణి
అంపిల్లంగాఁ ద్రిపురన్, నవుకాళి, మున్నగుమండలమ్ముల వేలకొలంది
హిందువుల్ సిక్కులు నీల్గిరి; మొఱకు, లపహరించిరి వనితావళిన్ నుదువఁ
దగనిబన్నంబులఁ దరుణుల నేఁచి, రాలయంబులఁగూల్చి రగ్గిముట్టించి
కొన్ని పల్లెల బూదికుప్పలంజేసి, రీచావు లీనోవు లీపరాభవము
లక్కటా! నౌకాళి నాగుబ్బలయ్యె, వివలేనికథ లివి విని క్రుంగిక్రుంగి
"పందలవలె మేను పాయుటకంటె, హింసతో రిపుఁదాఁకి యీల్గుట మేలు,
మగవానికైనను మగువకునైన, మానంబు ప్రాణంబు మనుచుకొవంగ
హింస పాటించుట యెగ్గు నాఁజనదు, ఎల్లరుం జాల రహింసతో నిలువ"
నని హెచ్చరించె మహాత్ముండు ప్రజల; అంతలో లీగువా రయ్యావరాలు
పడసి యించుకతేఁటి భారతప్రభుత్వఁ, జేరిరిగాని దాక్షిణ్యంబులేని
పని మానుకొనరైరి ప్రత్యక్ష చర్య; ఒజ్జ నే నిపుడు వంగోర్విలో నుంట
భావ్యంబని తలంచి బలంగంబుతోడఁ, గదలివచ్చెను గాళికాఘట్టమునకు, (30-10-1946)
అనాఁడు వంగరాజ్యము నేలుచున్న, సుహ్రావర్ది గురుంజూచి కేల్మోగిచి

"బాపూ! సమీపించె బక్రీదుపండు, వది గోవధంబున కవకాశమిచ్చు
వది సాగుచో వీట నల్లరుల్ రేఁగు, నావేఁడికోల్ విని నగరాన దీనఁ
గొన్నాళ్ళునిల్చి యీగొడవరాకుండఁ, జూడవే!" యనుడుఁ గస్తూరినాథుండు
తలయూఁచి రెండుమతంబులవారు, సరిసంఖ్యలోనుండ శాంతిసంఘమును
నిర్మించి యతనిఁ దన్నేత నొనర్చె, అతఁడు దుండగులకు నండగానుండె
అతనిపెత్తనముచే నగుమేలు సున్న, యనికొంద అనుదు నేలా యనుమాన
మది భీరులక్షణ, మద్దాని కేను, దా వీను, లోకంబు తను నమ్మినప్పు
డాకతాయియు సాధువగుననె గాంధి; అంతలో బీహారునం దాగడములు
చాగిన వనువార్త చాటెఁ బత్రికలు, ఈ వార్త విన గాంధియెద సెగల్రేఁగె
ఒజ్జ పాటించెఁ బ్రాయోపవేశంబు, ఆప్తులకోర్కిపై నద్దాని గాంధి
సగప్రొద్దునిట్రుగా సవరింతచేసి, బీహారువారి కివ్విధి విన్నవించె
"ఓయన్నలార! మీయొప్పును గూర్చి, కన్నాఁద బంగారుకల లింతదనుక
ఈనాఁదు నాకలలెల్ల బీర్వొవ, వంచించితిరి నన్ను వనటఁ ద్రోసితిరి
వంగోర్వికంటె మావసుధ మేలనుచు, మీరందురేని నేమెచ్చ నాపల్కు
తెన్నుదప్పినమాసిదెస మాఱుచేఁత, యసమర్థునకుఁ బంద కానవా లనెద
సైరింపఁజాల హింసావిధానంబు, మానవజాతికి మచ్చ యీచెయిది,
దుండగంబులఁజిక్కి దురపిల్లువారి, రక్షింప సేనలు రాఁ బనియేమి ?
ప్రల్లదుల నడంచి ప్రజలె ముస్లిముల, కభయంబునీవలె నండగా నిల్చి
కాదందురేని రక్కసిబుద్ధి మాకుఁ, బోదందురేని నేబొందిని విడుతు,
సానుభూతివెలార్పఁ జన దీరు నాకు, క్రించుల నోర్చుటే కృత్యంబు మీకు"
అనుదు సిగ్గిల్లి బీహారుహిందువులు, చాలించినారు హింసావిధానంబు;
గాంధి యావెన్క నౌకాళికిం గదలి (6-11-1946),
మంత్రివరేణ్యుగ్రామమున నిట్లనియె 63

## నౌకాళి మంటలు

"మున్ను ఖలీఫాకు మూడినముప్పు, తొలగించుపొంటె హిందువులు ముస్లిములు
నన్నదమ్ములపోలె నలయికల్ సైఁచి, రాచెల్మి బల్మి నాయాత్ర నీనాఁదు
తోఁచుఁగాక, మదాత్మఁ దోఁచునుగాక! మతములువేఱైన మానవులెల్ల
రో సభాసదులార! యొకజాతివారె, యీసత్యమునెఱింగి యెల్ల రెల్లరను
నెమ్మిమైఁ జూచుట నేర్చుకోవలయు, నెమ్మినొల్లనిజాతి నిలుచుట కల్ల
మనుపఁగాఁజాల దేమతమేని దాని", నని సాగిసాగి మహాత్ముఁ డింకొక్క
యూర "నిచ్చట శాంతి యుదయించుదనుక, నాయాత్ర ముగియ దన్నలు! రామనామ
జప మెల్లబెడఁదల సమయింపనేర్చు, నమ్ముఁ డీపల్కని నమ్మికగూర్చి

వేఱొక్క దెసఁ దెలివిన్ గోలుపోయి, దారిదప్పినవారి దరిసించి “నేను
గసితోడఁగాక యగ్గలమైనవనట, నేతెంచినాఁడ, నాయెడఁద మీఁ(మోల
విప్పు వచ్చినవాఁడ, విపుల నిద్దాన, ముస్లిముల్ కొందఱు మూరినయార్వ్యఁ
జేసినపాపముల్ చిన్నలు పెద్ద, లుగ్గడింపఁగ వినుచున్నాఁడ నిపుడు
ఇస్లామునకుమచ్చ లీహింసనములు, ఇవి ఖురా నొప్పనియెగ్గ లటందు
చదివినాఁడ ఖురాను శ్రద్ధమై నేను, ఇస్లా మనఁగ శాంతి; యిఁకనైన శాంతి
నర్థింత్రుగాక మహమ్మదీయు లిట, హిందూసతులపరు వీకొంద్రుగాక”
యన నొజ్జతోవచ్చినట్టి యమాత్యుఁ, డుత్తమాశయుఁడు షంసుద్దీనహమ్మ
దెంతయుంగరఁగి “యిసీ! మందిబల్మి, మా కున్నదని ముసల్మాను లొక్కెడను
హిందువులనుజంప, హిందువు లొక్క, యెడ ముస్లిములఁ జంప నేమేలుకల్గు?
చంపుతో రా దర్ధచంద్రపతాక, దుర్బలుమస్తంబు త్రుంచెదువాని
దురుసు మన్నింప దేదౌరతనమైన, పరసతిన్ బల్మిమైఁ బట్టెదువాని
దుడుకు సైరింప దేదౌరతనమైన, తిమిరం బడంగి చంద్రికవచ్చుకరణి
నిట నీసుపోయి పొందెసఁగుత !” మనియె, మఱునాఁడు నౌకాళిమండలమందుఁ
గాలుమోపినయొజ్జ కరుణాబ్ధి నీశు, నర్థించుసభ నిట్టులనియె” నోయన్న
లార! ముసల్మానులార! మీతోడ, హిందువుల్ క్రైస్తవు లితరమతాల
వారు వసించుట వలతురా ? మీరు, చెప్పుఁడు నిక్కంబు చిత్తమున్ ద్రచ్చి,
ఏను హిందువులకు నిస్లామువారి, కాప్తుఁడనైలెంకనై మనుచుందు,
ఉర్వి నిద్దాన నాయుద్యమంబులకు, హితులైనముస్లిము లెందఱో కలరు
దుండగములతోడ దౌరతన మబ్బు, నని యెంతురా ? సాగ దనెద నాకోర్కి
సాగినన్ మీకప్డు శాంతియేర్పడదు, యశముచేకూర దెయ్యదియెట్టులైన
మాపజ్జ హిందువుల్ మనుట సహింప, మందురా యామాట నంజకచెప్పుఁ
డపుడు వంగమువీడి హైందవులెల్ల, రేమూలకో చనియెద రుట్టితోడ;
జడిసినవారికి సత్రాలు పెట్టి, యెన్నినా ళ్లేలువా రిడెదరుకూడు?
ఇడెదరుగా కది యాయర్తజనుల, కేమిల గ్గీబ్రదు కెవ్వరాసింత్రు?
రాచవారలకూడు రక్షయు వీరి, కేలకాలయు? మీరే వీరి మనుపుఁ
దాదృతింగనుఁడు మీయనుజను దల్లి, నీ రెట్లు చూతురో యాదీనజనుల
సోదరిన్ మాతను జూడుఁ డక్కరణి, నెఱిఁగింపుఁడయ్య! మీయెదలోనితలఁపు
సత్యంబెతెల్పుఁడు సందియంపడక, యనుడుఁ” గొల్చునవార లందఱు సాశ్రు
నయనులై దురపిల్లినా రగ్గలముగ ; పలికె నొండెకసభన్ బాపూజీ యిట్లు
“ప్రకృతిలో శాంతి కన్పట్టునుగాని, ప్రజమొగంబునఁ గానఁబడ దది నేఁడు
ముప్పిదిగని బాష్పములురాల్తుఁ గాని, దుఃఖితుకన్నీరు తుడవఁగాఁ జాల
వడిసె మదీయాశ్రువారియు నిపుడు, ఇది యింకుఁగాక నాయెద దుర్భరాగ్ని

గోళమై సెగలుక్రక్కుచునున్న దకట!, ఇట్టిమతద్వేష, మిట్టిహింసనము,
నిట్టిచెట్ట నెఱుంగ నే నెన్నఁ దేని, ఇవి నన్నుఁ బెద్దగా నెరియించెఁగాని
రిత్తగా వంగధాత్రిని వీడ నేను, నానిఘంటువునందు నైరాశ్యమనెడి
నుడిలేదు వేయికన్నులఁ గనుంగొనిన, ఇచట ముస్లిము లేచి హిందూప్రజాళి
కుత్తుక లెన్నేని కోయుటకతన, నచట బీహారున హైందవుల్ రెచ్చి
ముస్లిముల నణంప మొనకట్టినారు, చెడుపను లిర్వురు చేసినవేళ
నరయంగరా దెవ్వఁ డతిదుష్టుఁ డనుచు, మాఱుచేఁత తెలంగు మహినెవ్వరైనఁ
గనవలె నాదుమన్ననడతీరు సూచి, అపకారి కుపకార మాచరించుటయె
తృప్తిసంధించు ప్రతీకార మనెద", అని యొజ్జ 'దాస్ఘరియా' యనుపల్లె
కేగుటన్ నిర్ణయించుకొనంగ, నయ్యపోకకు మున్నె యమ్తుస్సలాము,
కన్యకామణి, గాంధిగాదిలికూఁతు, రీయూరికింజని యిస్లామునందుఁ
జేర్చిన హైందవస్త్రీల నందఱను, మరల వార్మన్నించుమతమునఁ జేర్చి
యవ్వేలందులతోడ హర్షంబుతోడ, రఘుపతిరాఘవ రమణీయగీతి
పాడుచు దేశికప్రవరున కెదురు, వచ్చి స్వాగతగౌరవంబు లొసంగె,
అతిరమణీయదృశ్యం బిది, ధర్మ, దేవత కిది యనిందితమైన జయము;
అనసూయ! వినవమ్మ! యవ్వల గాంధి, తనబలఁగంబునం దనరారువారి
విడఁదీసి ప్రజలలో విజ్జినవెఱపు, నుడిగింపఁగా నూరికొకనిఁగాఁబంపి
తాను నొకండుగాఁ దరలం దలంచి, హితులతో నెమ్మిమై నిమ్మెయింబల్కె:
"నేనొంటిఁగాఁ బయనించెద నిఁకను, నా కండగాఁ బ్రజల్ నర్మిలి నిల్వఁ
బచరింతు నిచట నాపన్నులసేవ; పిలుచుముస్లిమునింటఁ బ్రీతిమైనిల్తు
నతఁ డిచ్చుబోనంబు నారగించెదను, రాముకారుణ్యంబు రా శ్రమించెదను;
కొమ్మ లీసీమలోఁ గుడుచుబన్నములు, నావంటివారు కొందఱు చన్నవెన్క
సమసిపోవచ్చుఁ, బెల్చన దిక్కులేని, ప్రజలను బాధించుపలువల కపుడు
బుద్ధిరావచ్చు, నీపుడమి నహింస, జయమందదేని విశ్వంబునం దపుడు
హిందూమతము లేదు, హిందువు లేఁడు, నామెచ్చెడి యహింసనమున కీప్రొద్దు
వచ్చె నగ్ని పరీక్ష, వార కే నిందు, జయముగాంచుట పునర్జన్మమెత్తుటయె"
అనిపల్కి తనమాట లనువదించుటకు, నాకోర్కి రిత్తమైనది ప్రభూ! నాఁడు
నేఁడు బందాకానినేను గాంగ్రెసునఁ, జాలినవారల సడిసన్నవారి
సరస నొగాములు చర్చించివత్తు, నీకొనుమయ్య! నా కీవు మైకోలు
పంపకమున్నె నీపజ్జ కేన్ వచ్చు, టక్కఱయందువే నరుదెంతు, నెడద
విచ్చి నాతలఁపులు వివరింతుఁ బెక్కు, ప్రొద్దులపయన మిప్పుడు సైఁచుబల్మి
లేదు నాకు; మఱొకు లేవడిన్ దీని", వేవె లీలేఖంబు వీక్షించి నీవు
క్విట్టిండియాతీర్పు విడ నిష్టపడని, సరణి నున్నావని జయకరుపాలి

కనిచినజాబుతో నవగతంబాయె, చెఱసాలయందున్న చెలికాండ్రఁజూచి
నేఁ డీవు గావించునిర్ణయం బెట్లు, తనియించు నన్ను? నాతలఁ "ఇండియాను
విడు" మనువాదంబు విడనాడఁదగిన, వాదమనున్, గాన వలయునారోగ్య
మబ్బిననాఁ డుభయప్రియంబైన, పదకంబు తెల్పుము పాటింతు దాని"
నని పేర్మిమైఁ గమ్మనంపె బాపునకు; సర్కారువారితో సంధియత్నములు
కావించుప్రొ ద్దిది కాదని తలఁచి ముస్లిములీగు ప్రేముడిని గడింపఁ
గడఁగి దేశంబు ప్రక్కలుగాని సరణిఁ, జర్చలుగావింప సాగె మహాత్ముఁ
డెంతనెప్పిననేమి హిందూర్విఁజీల్ప, వలెనని జిన్నా వివాదంబుసేయ
నాచార్యునభిలాష మాఱిడివోయె, అంతఁ బూనాపురమందు నేర్పడిన
కాంగ్రెసుగోష్ఠిలో గాంధి, యిట్లనియె, 'సత్యంబునకు నహింసకు శత్రువైన
చేఁతకు నే నియ్యసేయంగఁజాల, నన్యు లొనర్చుకార్యములను ద్రచ్చి
నిర్ధరింపఁగనొల్ల నేఁడు మేల్, కీడు; అగుఁగాక యన్నలారా! యొకముక్క
చెప్పనెంచితి, మనచేసెడిపనుల, నెంతగా సత్య మహింసయు నిముడు
నంతగా మనకు లభ్యంబగు గెల్పు, మనసాధనము శౌచమహితమై యుంట
నుచితచైతన్యంబు నొందిరి ప్రజలు, మతిచెడి ధర్మువున్ మఱచిననాఁడు
కఱకరినై వీరి గర్హించినాఁడు, ఈదేశమందు రెండేఁడులనుండి
గతిదప్పి మనవారు గావించుహింస, తెఱఁ గెఱుంగుదును బందిగమునం దున్న;
అధికృతుల్ ప్రజచేసినట్టి యాగడము, గోరంతయైనను గొండంతయంద్రు
తమయొనరించినతప్పు హిమాద్రి, యంతయగుంగాక యణుమాత్రమంద్రు
ప్రజ లొనర్చెడి చెట్టపనులకున్ గతము, కన్పించుఁగాని సర్కారువార్ సేయు
హింసకుఁ గానరా దేకారణంబు, పక్షపాతములేని పలుకులు నావి
ప్రజలు ప్రభుత్వంబు పచరించుపనుల, నరయుదు నేను సత్యాహింసనముల
నస్మదీయార్హత యదియెట్టిదైన, నన్ను మీ రెంతయు నమ్ముకొన్నారు
సత్యంబుదెస నహింసావిధిపట్ల, నాకేర్పడినర క్తి, నాకున్నభక్తి
నాబలిమికిఁ గారణంబని తలఁతు, రాజనైతిక కార్యరంగంబునందు
సత్యంబునకు నహింసకు నిసుమంత, తావు లేదని పల్కెదరు కొంతమంది,
ఏ నీయకొనఁజాల నీనిర్ణయంబు, ఈరెంటిని సమాశ్రయించినమనుజు
లేదేశమందైన నేపనినైన, విజయ మందెదరని విశ్వసించెదను
సరియ! నేనిపు డేమి సాగింపనేర్తు, అగస్టుతీర్మాన మది ప్రయోగించు
చనవు నాకున్ జెఱసాలకుఁ జన్న, నాఁడే తొలంగె, నీనాఁడు నేనెద్ది
కదపిన వైయక్తికమ యగు నద్ది, కాంగ్రెసుకార్యంబు కాఁజాల దద్ది,
కాంగ్రెసునకుఁ బూఁటఁగాను నేనిపుడు, నారుగ్ణతం గని న న్నేలువారు
విడిచిరిగాన నీవేళయందేని, బందినున్నట్లె నే వర్తింపవలయు

కాంగ్రెసునేతలు కారకుంజనిన, పదపడి వారు మున్ పలికినరీతిఁ
గాంగ్రెసు సేవలోఁ గలయెల్లవాఁడు, తనకుఁ దానే నేతృతను సమార్జించె,
సత్యంబునకు నహింసకు దవ్వుగాక, యెల్లరు తమనిశ్చయించిన సరణి
సాగింపఁదగు నేఁడు స్వాతంత్ర్యసమర; మస్మదాత్మకు నసహాయోద్యమంబె
తగునని తోఁచు నిత్తరుణంబునందు, ఈశ్వరుపై భారమిడి జంకువీడి
మనకృషి మనము కామక సల్పవలయు, మనశక్తిదెస మనమదికి విశ్వాస
మేర్పడవలయు నిదే కార్యసిద్ధి, హేతువు నాఁజెల్లు, నెట్టియిక్కట్లు
క్రమ్మిన గగ్గోలుగనఁ దెన్నఁదగిన, సత్యాగ్రహి యటంచు సవినయరీతి
వచియింతు, మనకృషి వంధ్యమైనప్పు, డా దుర్దశకు మనయందలితప్పు
గాక యింకెయ్యది కతమగున్ జెపుఁడు", అనుడు నోలగమెల్ల హర్షంబునందె
సముచితసమరంబు సాగింపఁబూనె; దగువార లిర్వురు తనవెంట నడువ
శ్రీరామపురికి దేశికమౌళి కదలె, "బాపూ! బీహారును బలసినపగలు
సమసె, మీ రీచెట్ట సైరింపలేక, వాటించు నర్థోపవాసనిర్ణయము
నిఁక మానుఁ" డనుచు రాజేంద్రప్రసాదు, పంపినశుభవార్త భగవత్ ప్రసాద
మనఁగ నత్తతికి రా నయ్య నాకిఁకను, లేదు మృత్యుభయంబు లే దని పొంగి
మూఁడుగంటల పైనమును జక్కసైఁచి, గమ్యంబునకుఁజేరి కడఁకమై వంట
మున్నగుకర్తవ్యములఁ దీర్చుచుండ, నొక్కమౌల్వీ వచ్చి యోదయారాశి!
యెల్లి మాయాతిథ్య మికొనుం డనుచు, నమ్రతన్ వేఁడ దీనప్రజాబంధు
వంగీకరించి యీయాదృతి వేల్పు, ననుకంపగాక యొుండగునా యటంచుఁ
దలఁచి ప్రార్థనసభాస్థలిఁ జేరియున్న, హిందూప్రజావళి కిమ్మొయిం బల్కె
"ఆపన్నులార! ధైర్యంబు వహింపుఁ, డేను మీపీడల నెడలించు కొఱకు
వచ్చినవాఁడ నీశ్వరు విశ్వసించి, యిటనిల్తు నేను మీ యెద తేఱుదనుక"
గురుఁ డిమ్మెయిన్ భయాకులచిత్తులైన, హిందువులకు ధృతినిడుచు నాలరులు
కావించినట్టి యాగడములు కనుచు, వినుచు నారోగ్యంపువెలితి పాటింప
కెల్లభూములనుండి యేతెంచుచున్న, కమ్మలకున్ మాఱుకమ్మల నిడుచుఁ
దెగులుగొంట్లకుఁ బ్రకృతిచికిత్స చేయు, చాయూర నివసించునట్టి ముస్లిముల
గృహములఁ జని వారికీడు మేల్ తెలిసి, కొనుచు వారికి హితోక్తులుపల్కుచుండ
నిరువంక ప్రజలకు నితఁడు మానవుఁడు, కాఁడు దేవుఁడు పంపఁగా జగత్తునకు
వచ్చినదూత సర్వజ్ఞశేఖరుఁడు, వెజ్జులతలకట్టు వీనికేల్ తగిలి
నంతన రోగంబులడఁగు, నీసాధు, వాడినదే పాడి యను బుద్ధి వొడమె;
అంత నేల్బడివార లామండలమున, నుభయమతాలవా రొప్పుకొన్నట్టి
సభ్యులతో శాంతిసంఘముల్ నిలిపి; రవి భయంపడువాని కండగా నుంట,
ప్రజల నేఁచినవారిపట్టికన్ దేల్చి, యధికారి కొసఁగుట, యగ్గిపాలైన

గృహములలెక్క లార్జించి పైవారి, కనుపుట మున్నగు నభినందనార్హ
విధు లొనర్చుచునుండ వివిధరాష్ట్రంబు, లార్తులగోరంబు లణఁగ వేల్వేల
విత్త మంపఁదొడంగె విరిసినజాలి; గురుఁ డప్పు డొకవేఁడికోల్ సభ యందు
"ఒడ కాత్మత్యాగ మొనరింపఁజాలు, నరుఁ డూరి కొక్క ఁడున్నను లోటురాదు
దుండగంబు నహింసతో నడ్డి యాత్మ, బలిదానమొనరించు ప్రాజ్ఞుండు రిపులఁ
గరఁగించి శాంతికిఁ గారణంబగును, ఈశ్వరుండన సత్యమే, కాని భక్తుఁ
డేమూర్తి నీశునకిచ్చునో వేల్పు, తన్మూర్తి నతనికి దర్శనంబిచ్చు
ఎచటనోలేఁడువే ల్పెదయందె కలఁడు, వెలుపల నీశ్వరున్ వెదకఁడు జ్ఞాని,
భగవ దంకితమై బ్రదు కేని దతని, ప్రార్థనమే జగత్ ప్రభుఁ డాలకించు
భౌతికం బగుశ క్తిపస తగ్గినపుడు, గర్వంబుసర్వంబు కడచన్నయపుడు
ప్రాణి నోదార్చి కాపాడుఁ బ్రార్థనము, వేల్పొకఁడేచుఁడీ! వేవురు లేరు
సర్వమతంబులసార మొక్కటియె, ఒకద్రుమాన శతశాఖ లుదయించుకరణి
నొకమతంబున నెన్నియోపాయ లొదవె; మతిలేని కొందఱుమల్కలకతన
నణఁగిన దిస్లాముయశ మొకకొంత, ముష్కరుల్ మతయుద్ధములు రెండు పన్ని
క్రైస్తవధర్మంపు గరిమకు మచ్చఁ, దెచ్చిరి పాశ్చాత్య దేశాలవారు,
అంటరానితనంబు నంగీకరించి, హిందువుల్ తమపాడి కిడిరి కలంక;
భారతోర్వికిఁ బల్లె ప్రాణంబు కాన, నవని కూడిగము సేయఁ దలంచువారు
చనవలె నటకు, నచ్చటఁ బేరుకొన్న, యజ్ఞానము నణంప, నామయం బుడుప,
బాటచిక్కులుదీర్ప బడలఁగావలయు", అనుడు శ్రోతలు సెబాసనిరి మేల్కొనిరి
శ్రీరామపురి బాపుజీ యిటులుండఁ, బ్యారిలాల్ మున్నగు పావనాచారు
లయ్యతోవచ్చిన యనుచరు లూరి, కొక్కండుగానిల్చి యుసుఱుపోవుటయు
నుంటయు మఱచి రేయుం బగల్ ప్రజకు, భీతిమాన్పుచు మత ప్రియజీవనంబు
సమకూర్చుతుష్టిని జూటందొడంగ, నలరి సర్కారువా రాసేవకులకు
వలయువిత్తము నంపి వా రంపులెక్క, కగుఁగదే యన దీని నాలించి గాంధి
తనిసేఁ బాడికి గెల్పుతప్ప దటంచు; పదపడి గాంధి యప్పట్టును వీడి
యయ్యాయితావుల కరిగి విపన్న, జనతకు నూఱట సంధింపఁదలఁప
నవ్వార్తవిని దిగులంది శ్రీరామ, పురికి నూరూరికాఁపులు వచ్చి గురుని
జూచిపోఁదొడఁగి; రీచూపఱయందుఁ, గలరు వందలువేలుగా ముస్లిములు, మ
హాత్ముని నమ్మరాదని యొకనాఁడు, సంశయించినవారు; జాతిపితన్ వి
రోధిఁగా భావించి రూక్షవాక్యములు, విసరినవా; రహెూ! వీరు నేఁడిట్టి
పుణ్యచరిత్రుండు పుట్టఁ డిందనుకఁ, బ్రేమార్చకుఁడు సంభవింపఁ డిందనుక
నితఁడున్న యెడ నుండు నీశ్వరుఁ,డితఁడు, నిలుచుచోట నహింస నిలుచు, నితండు
కలచోట సత్యంబు కలదు, ధర్మంబు, కలదు, శాంతిస్ఫూర్తి కలదు, సంపత్తి

కల, దెల్లసంపదల్ కల వని యొజ్జ, నగ్గింపసాగి రజ్జా! యనం దొడంగి;
రల సుప్రహహర్షియు నపుడె మహాత్ముం, డొకవంగమందెకా దుర్వి నెందయినం
గృతకృత్యుం డగునని గెల్పందునని లి, ఖించెం బత్రికలకుం; గిల్బిషదూరుం
డెల్లకాల మణంగునెట్లు? తన్మెచ్చు, ప్రజల కంజలిచేసి బాపుజీ నేను
సర్వజ్ఞుండను గాను సందియంపడక, నాలోపములుదెల్పి నాకు మేల్సేయుం
డాత్మశుద్ధికి దయ్యునతనికిం దప్పు, లెఱింగించువారలే యెన్నంగందగిన
యాప్తులు నా రచ్చ నశ్రువుల్ గురిసె; రఘురాముగాణి శ్రీరామపురంబు
వదలి చండీపురవాసిగా నైదు, నాళ్లుండి బాపుజీ నరులమన్నదకు
దారసిల్లును వెతల్, తప్పవు, వీని, నాత్మశక్తి నణంపనగుంగాని క్రుయ్యం
బాఱుట తగదని ప్రజ కెఱింగించె; అయున్కినుండి సంయమిచక్రవర్తి
పాదరక్షలుమాని పయనింపం దొడంగె, ఇదియేమి బాపుజీ యీబాధ నెట్లు
భరియింతు ? ననవంటి పదములు నీవి, ఱాలు అప్పలు ముండ్లు రాపాదుబాట
నఱకాలుమోపెదే యని మనూకన్య, విలపింప మనము కోవెల కేగువేళ
వారక చెప్పులువదలమా? చెప్పు, మోసిమనూ! పవిత్రోర్విలో నడుచు
తఱి మెట్లుతాల్చుట తగదందు రార్యు, లీనేల నేదోస మెఱుంగనిసతుల
బాలుర వృద్ధులం బాలసుల్ చంపి, రీగడ్డ యేదోస మెఱుంగనిప్రజల
యస్రానం దడిసి పుణ్యక్షేత్రమయ్యె, దేవాలయమువంటి తీర్థమే యయ్యె
అమ్మా! దరిద్రనారాయణస్వామి, పజ్జకుం జనుచున్న భక్తుండ నేను
సిగ్గుదాంచు కొనంగం జినింగిన గుడ్డ, మూరెండై నను లేనిముప్పునం గుములు
తల్లులు నివసించుధరణిపై నడుచు, తెరువరి నేను, దద్దీనలం జూడం
బెద్దయుం ద్వరపడుబిడ్డను నేను, పరమపవిత్రమౌ పయనమ్ము నాది
చెప్పుల నెట్లు సైంచెదనమ్మ! యిపుడు ? ధర్మువుం గనుమని తండ్రి వచించె
అదియట్టులుండె నోయనసూయ! వినవె, సత్యార్చకుండు మనూస్కంధమ్మునందు
నొక్కకేలుంచి యొండొకకేలం గోల, ధరియించి దళముముందటను రేపాడి
నాయూరి కాయూరి కరుగుచు విశ్వ, కవి రవీంద్రునిహృదిన్ గదలినగీతి
"నెన్నికేకలు పెట్టి యెంతవేసరిన, నొకండైన నీతోడ నుంటకు రాక
పిఱికియై మొగముదప్పించునుగాక, యొంటిగానే సాగవోయి! ముంగడకు
సాటివా రెల్లరు సత్యంబునుడువం, దాలిమిలేక తత్తఱపడువేళ
నెలుంగెత్తి సాహస మెసరేంగ నీవె, చాటు! మోదీనుండా! చాటు! నీతలంపు,
దుర్గమమై నొంచుత్రోవలో సాగ, వెఱచి నిన్నందఱు విడుతురుగాక
నీపాదముల ముండ్లు నిండారుంగాక, నీనెత్రుతో దారినింపుచు నీవె
చనుము నిర్భాగ్యుండా! చనుము ముంగడకు, కాఱుమబ్బులుక్రమ్మి కటికిచీంకట్లు
అంపిల్లు భయదశర్వరి నేగునీకు, దీపంబుచూపించు దిక్కు లేకున్న

నడలక నీహృదయానలజ్వాల, దరికొల్పుకొని దానితాఁకున నీదు
హృది నొకదానినే యేఁచుచు నగుచు, నడువు మభాగ్యుఁడా! నడువు ముందఱకు
ననుదానిఁ బాడుచు నరుగందొడంగె; తెలివిమాలినవారి దిద్దంగడంగె;
ఒకనాఁడు యోగీంద్రుఁ డుదితార్కుఁ జూచి, కదలె జగత్పురాఖ్య గ్రామసరణి
సమ్మార్గమును గొంద అమలమ్ముఁజేయ, సమలమ్ముఁజేసి రజ్జరె! మఱికొంద;
అయ్యు యాపనికి నత్యానందమంది, మసటుకుప్పలనెల్ల మట్టితోఁగప్పి
మనవచ్చు దారిలో మల ముంచి వీరు, కొంతకోపమును బోఁగొట్టుకొన్నారు
కొంత పాపమును బోఁగొట్టుకొన్నారు, నావుడు వెఱఁగందినా రనుచరులు;
అయ్యూర జరిపె సాయంవేళ సదము, వనితలు పెక్కురు వచ్చిరచ్చటికి,
హతభర్తృ చరణంబునందలియెమ్ము, స్మృతికిఁ జిహ్నముగ దాఁచినచాన యోర్తు
సభకుఁ దదస్థితోఁ జనుదేర నొజ్జ, యవ్వెలందిని గని యమ్మ! యీచిన్నె
యేలపాటించెద విది భౌతికంబు, నశ్వర మిది శాంతినాశన మిది వి
సర్జింపుమిది, ధృతి సాధించి మృతులు, మఱలమి నెఱిఁగి నెమ్మది రామునిల్పి
పదయు! ప్రతిష్ఠితప్రజ్ఞ, నాఁ గొలువు, నిస్తరంగపయోధినెఱిని గన్పించె;
బాపుజీ యొకనాఁడు భాటియాల్ పురము, చేరి నాల్గైదు ముస్లింగృహంబులను
జూచి గేస్తులకష్టసుఖముల నరయు, తఱి నొకగేస్తుండు తనరాణివాస
మీక్షింపు మని సంయమీంద్రునిం గోర, నంగీకరించె మహాత్ముఁ డాపనికి;
అపు దంతిపురమువా రందిన తనివి, కెనలేమి నిక్క; మాయింతు లయ్యూర
జరిగిన హింసలచందంబునెల్లఁ, గన్నీరుగార్చుచు గాంధికిన్దెల్పి
గురునితోఁ దీయించుకొనిరి చిత్రమ్ము, మాపాపములు నేఁడు మడిసిన వనిరి,
మాపుట్టువున నిది మంచిప్రొద్దనిరి; అయూరిముస్లిము లల్లరివేళ
నిరవులవీడి పోయినవారినెల్ల, వారక రావించి వారికి వలయు
సాయంబొనర్తుము సైఁపు! మాతప్పు, లని సిగ్గునంబల్కి రనఘునిమ్రోల,
అవగడంబులు రేఁగినపుడు పాడైన, గుడి నేఁడు నెలవయ్యె గురువరేణ్యునకు,
క్రన్నన నుభయవర్గంబులవారు, సవరించి రద్దానిఁ జక్కనల్ నిండ,
అందఱసమ్మతి నంది మహాత్ముఁ, డందు విగ్రహము నొయ్యనఁ బ్రతిష్ఠించె,
వెనువెంటనేసాగె వేలుపుంగొలువు, గణగణధ్వనులతో గంటలుమ్రోఁగె,
అంతట 'నటకోర' కరిగి దేశికుఁడు, తనచేత మలమెత్తి దారులనెల్ల
సవరించుచుండఁ బ్రజల్ శిలలట్లు, నిలఁబడి యితఁ డెట్లునేర్చె నీరోఁత
పని యని యజ్ఞతం బ్రకటించుచుండఁ, గడువేగమున మనూకన్య యేతెంచి
బాపునుగదిసి యీపనికి నీవేల, నియమింపరాదె తండ్రీ! నన్ను ననుదుఁ

జిఱునవ్వుతో నిట్లు సెప్పె దేశికుఁడు, ఇట్టిపనుల్ సేయునెడ నాకు నొదవు
ముదము నెఱుంగని ముగ్ధవు నీవు, నినుఁబిల్చి యిదికరణీయ మటంచు
నెఱుకువచేసి చేయించుటకంటె, నేన యిప్పనిచేఁత యెంతయుసుఖము,
కాదందువా నేఁడు గ్రామశౌచంబు, దెస నావెలార్చినతివుట నాపడిన
పాట్లు గ్రామీణులభావముల్ మార్చి, చేయింపవా వీరిచే నిట్టిపనుల
నెల్లి రేపాడి నీ వీచటికి వచ్చి, వాడవాడయుఁజూచి వచ్చినమార్పు
నా కెఱిఁగింపుము నాఁ గన్య యలరె, మఱునాఁడు కన్యకామణి వచ్చిచూడ
విష్ఠతోడనెయుండె వీథులన్నియును, మలమెత్తుపనికిఁ గుమారిపూనంగఁ
బ్రజ లామెకుం దోడుపడుచు నోయమ్మ! యిఁక మేమె మాయూరి నేచి దిద్దెదము
రాకు మీపనికీవు రాకురే పనిరి, యీవార్తవిని యొజ్జ యెంతయు నలరి
నాపాలిపుణ్యంబు నాఁచికొం టేమి ?, మంచిదానవె యని మనువును మెచ్చె,
మలమూత్రములతోడ మార్గముల్ చెఱుచు, నీదురభ్యాస మోసీ! భారతోర్వి
నెల్లతావులఁగల, దేను వీలైన, తఱిని జీఁపురుపట్టి తనిసెద ననియె
పొట్టనిండనినాఁడు పురవీథిమలము, నెత్తనినాఁడు నాయెద పండదనియె,
అంతట నొకపల్లె కయ్య పోవంగ, నచ్చోట మేఁకపా లబ్బనివాయె
గురువర్యుఁ డంతట గొబ్బెరపాలు, గ్రోలఁగా నతిసారరోగ మేర్పడియె,
అది హెచ్చి హెచ్చి మహాత్మునికాళ్లు, చేతులు శీతలస్థితికి రావించె
నపుడు మనూకన్య యదరి వైద్యునకు, నంపఁబూనెం గమ్మ; నది గాంధి యెఱిఁగి
యోసి! మనూ! రాముఁడొకఁడె నావెజ్జు, నాసేవనంబు నెన్నాళ్లు వాంఛించు
నన్నాళ్లు నను రాముఁడవనిపైనిల్పు, వీఁడేలభువి కని వేల్పించునేని
పెఱతావునకు నన్నుఁ బిలుచు నా ప్రభువు, సతతంబు రాముని జపియింతునేని
నామది రామమంత్రము నిండునేని, చావను రుజతోడఁ జావను నేను
జగమునంగల సర్వజనుల కీపల్కు, వర్తించు, నీవిధి వర్తించునమ్మ!
అన్నపానముల విహారాదికముల, నరుఁడు చేసినతప్పునకు శిక్షతప్ప;
దగుఁగాక యూపిరియాడునందాఁక, మానరా దతఁడు రామస్మరణంబు
చిలుకపల్కినరీతి శ్రీరాము పేరు, పల్కుట చాలదు, భక్తిమై నిత్య
నియతిమైఁ బల్కుట నేర్చుకోవలయు, ననుచు గుమారి మహాత్మునిమ్రోలఁ
దలవంచె రాముముందట వంచినట్లె; గురుఁ డొయ్యనన్ దేఱుకొని వంగభూమి
నా ర్తసేవా పరాయణతమై నిల్వ, బీహారుహిందువుల్ పెల్లు ఱంపిల్లి
ముస్లిములన్ బొరింబొరిఁ జంపఁ దొడఁగి; రీచెట్ట నణఁగింప నెంచిన గాంధి
శిష్యవర్గంబుతోఁ జేరె బీహారు; (5-3-1947) 64

## బీహారు చెట్టలు

మఱునాఁడు దీనసమాజ బాంధవుని, గన దుండగంబుల గగ్గోలుపడిన
ప్రజలు కొందఱు వచ్చి బాపుజీ! నీదు, రాక మా కీశ్వరురాకయే, నేఁడు
మదిమదిఁ గంటిమి మాభాగ్య మిట్లు, పండిన, దనుదుఁ గ్రైవారముల్ మాని,
సంతుష్టి మాని, యిచ్చటఁబద్దవెతలఁ, దలపోఁత మాని, యీతావును వీడి
పదఁడు! నౌఖాళికిఁ బదఁడు! మీరంద, ఱీనేలయందు నే నెన్నినా ళ్ళుందు
నానేల యందు మీరన్ని నాళ్లుండుఁ, దచటి మూర్ఖులఁ దేర్పుఁ దచటిపశుత్వ
మణఁపుఁడార్తుల సేవ నలయుఁడు మైత్రి, కఱపుఁడు ప్రజకు, నౌఖాళిని మీరు
నిల్చినతఱి నెట్టినింద్య ప్రవృత్తి, యిట రేఁగినను దానియెగపు నాఁకట్ట
నాప్రాణములనొడ్డి నలఁగెద నమ్ముఁ, దనుదుఁ జిత్తము చిత్త మనిరి ముస్లిములు;
పదపడి సోదరీ! బా పాకగోష్ఠి, "నిచట శాంతినిగూర్ప నేను వచ్చితిని
ఇదినాకు నలవిగాదేని మేన్విడుతు, నాశపథం బిది, నాళ్లు సంద్రాలు
పొంగి ఘూర్ణిల్లినఁ బుడమిక్రుంగినను, వదల నీశపథంబు, వదల నీతీర్పు,
నడుతు నూరూరికి, నాకంటఁబడిన, యెల్లదట్టెమును నీ వెట్లుచచ్చితివొ
వినిపింపుమా యని వేఁడెద నిఁకను, వంగభూమికి సర్వవసుధకుం దగిన
యుడిగం బొనర్తు నీయుర్వినేనిలిచి, హిందువుల్ ముస్లిము లీనేలఁ జెలిమి
నుందురా యుండరా యుచ్ఛృంఖలముగ, రేఁగినపో రీధరిత్రి నిఁకైన
నడఁగునా యడఁగదా యన్నది తేల్తు, ప్రజలలో సద్భావబల మావహిలినఁ
బ్రజలలో సత్యానురక్తి యేర్పడినఁ, బ్రజలలో హార్దానుభవము పాటిలిన
నిచట జయంబు రా నేమియబ్బురము? పోలీసు లాయుధంబులకొసల్ చూపి
యిట శాంతిచేకూర్తురే కలకాల ? మిశాంతి కోరువా రెట్లుస్వతంత్ర
భారతంబున కాసపడెదరో యెఱుఁగ, ఇంగ్లీషువారితో నిన్నాళ్లనుండి
జరుపునాలముకంటెఁ జాలబెట్టిదము, నాఁదగు నేఁటిరణం; బది యొరుని
తప్పుపై నెఱపుయుద్ధం, బిది తనదు, నెగ్గుపైఁ బఱపుపో; రిందు జయంబు
రా దలంతులతోడ రా దైననేమి, విశ్వ మోహెూ! యనువిజయ మియ్యదియె'
అని మహాత్ముఁడు తనయాత్ర సాగించి, యల్లరుల్ రేఁగినయపుడు బెగ్గిలిన
ముస్లిములకు నెట్టిముప్పు రాకుండ, నండగా నిల్చినయనఘులఁ గాంచి
మానవత్వంబును మనుచుమీవంటి, వీరులే యీనేలప్రేఁకన సైఁతు
రని కొనియాడ వా రవనతులైరి, పదపడి గురుఁ డొండుపల్లెకుం బోవ
నేపాప మేకోప మెఱుఁగనివారి, మాయూర మావాడ మనుచున్నవారి
కుత్తుకల్ త్రెంచినకూళమేము, కరుణలేనట్టి రాకాసుల మేము

మన్నింపవే మమ్ము మన్నింపు మనుచుఁ
గొందఱుహిందువుల్ గురునిపాదముల, వ్రాలఁగా జనకునివంటి రాజర్షి
పుట్టినభూమిలోఁ బొడమినవారె, యింతకుందెగినచో నిల నెవ్వఁడోము?
అన్యం దెదియొనర్ప నలుగునో మనుజుఁ, డొరుపట్లఁ దా నది యొనరింపకుంట
యఖిలధర్మంబుల కాధార, మదియె, జగదున్నతి కమోఘసాధనం బనియె;
బీహారునం దిట్లు ప్రేమయున్ దయయు, ధర్మవున్ వికసింపఁ దంద్రి వేసారు 65

## పంజాబులో దుండగములు

సమయంబునందుఁ బాంచాలరాష్ట్రమున, నల్లరుల్ సాగిన వని వల్లభుందు
బాపునకున్ లేఖపంపఁగా మిగులఁ, గలఁగె మహాత్ముఁ డాకమ్మను జదివి;
కాంగ్రెసువార లౌగాము లూహించి, వంగపాంచాలముల్ వారకచీల్ప
వలె నన్నబాటకు వచ్చినా రనెడి, వార్తయు నపుడె వెల్వడెను బత్రికల
నవిభ క్తభారతం బాసించి పెనఁగు, కాంగ్రెసు గతిదప్పఁ గతమేమటంచు
నొజ్జ తోడ్తోడ నెహ్రూ నడుగంగ, నిత్యహింసలతోడ నేరంబులేని
ప్రజ సచ్చుటోర్వక, పడఁతుల నేర్చు, భంగపాట్లోర్వక బాపూ! తెగించి
కాఁపురంబునుజీల్పఁ గాంగ్రె సీకొనియె, మన్నింపు మని మహామంత్రి వచించె;
ఎద్దియుందోఁపక యెరియుబాపునకు, నిభపురంబునకు రావే! క్రన్న నను చు
నపుడె యాహ్వానంబు నంపె వైస్రాయి; తనపరాన్జాతి సత్యమునం దహింస
నగ్రగణ్యం బగునటు దిద్దినట్టి, సరిహద్దుగాంధి నా సడిసన్నయట్టి,
యవగడంబులు సాగినంతన వచ్చి, బీహారులో మతప్రియత వర్ధిల్ల
నలసటలందుచున్నట్టి గఫూరు, ఖానుశిరమ్ముపైఁ గార్యభారంబు
నునిచి దిగ్గనఁజేరె నొజ్జ ఢిల్లీకి ; (31-3-1947)

## పాట్నా-ఢిల్లీ, ఢిల్లీ-పాట్నా

పొగబండిదిగిన బాపూ పదయాత్ర, సాగించి తన కిమ్ము సంధించువాడఁ
బాకీపనుల్ చేయుప్రజ లుండువాడ, వాల్మీకిగుడిచెంత వసియించి ప్రొద్దు
వాలినపిమ్మట వైస్రాయి మౌంటు, బాటనుకడ కేగి పరమాదరంబు
చాట నొజ్జకు భక్తిచాటి యమ్మేటి, యక్కటా! రాజకీయంబైన చెలిమిఁ
గోరక భారతక్షోణి యీప్రొద్దు, పగలతో సెగలతోఁ బదరానిపాట్లు
పడుచున్నదేమి యీప్రళయంబు నణఁచు, మార్గంబు వెదకవే! మహానీయ! యనియె

తరువాత గాంధి పెద్దయు విచారించి, తనకిష్టమగు నమాత్యశ్రేణితోడ
నడిపింపవచ్చు జిన్నా ప్రభుత్వంబు, నతనితీర్పులను నీ వరసి మేల్గీడు
లెఱింగింపవచ్చు నా నిది మెచ్చఁదగిన, తలఁపని వైస్రాయి తనతృప్తి దెలిపె
అంత బాపూ జవహరుఁ జూచి దీని, కేమందు వనఁ గాంగ్రెసే నిర్ణయింపఁ
దగును గృత్యం బని తనయవరోధ, మెఱింగించె నయ్యకు మృదులవాక్సరణి;
ఇఁకఁ బ్రభూ! నే నిట నేలాయటంచు, వచ్చె మహాత్ముడు వాల్మీకిగుడికి
అపుడు రావల్పిండి నదరినహింస, పడలేక వచ్చినప్రజ తెల్పువార్త
లాలించి ఢిల్లీజనావళి కిన్క, కగ్గమై కొఱకొఱలాడం దొడంగె
ఇట్టి తఱిన్ గుడి నేర్పడినట్టి 67

## గుడిలో ఖురాను చదువకు

ప్రార్థనసభ ఖురాన్‌పల్కులు కొన్ని, చదువందొడంగె నాచార్యసత్తముఁడు
హిందూమహాసభాహితుఁ డొకం డప్పు, డిది హిందువులగుడి, యిచట ఖురాను
వినిపింపరా దన వేవేగఁ గొంద, ఱతనిమీఁదికి దూఁకి రాగ్రహం బెసఁగ
ఒజ్జ వారల నాఁపి యొకఁడు వల్దనిన, నాఁపెద వేఁడికో లని స్వస్తిపల్కె
నాల్గవనాఁడు గందరగోళ మింత, యైనను లేమి నయ్య సదస్సు జరిపె
పిదప నయ్యనఘుని బెదరించుకమ్మ, లనుదినంబును వచ్చు టారంభమాయె
అపు డొజ్జ యెవ్వఁడే నజ్ఞుండు నన్నుఁ, గాల్చుపట్టుననైనఁ గదల దీనోట
రామనామముతక్క రవ మన్య మెదియు, కదలెనా నన్ను దొంగుగా జగంబు
తలపోయవచ్చు; హైందవులకు నేను హితుఁడనో వైరినో యెఱింగించు నాదు
మరణ; మెదందలో మలినతలేని, జనులకే తెలియును సత్యంపుమర్మ;
మని తనమది రేఁగినట్టి వేదనను, బ్రకటించి పాట్నాకుఁ బయనంబుగట్టె (12-4-1947)
గమ్యంబుచేరి యక్కడ నార్తసేవ, నెఱపుమిత్రులు వక్కణించువార్తలను
వినుచుండ నేనుంగువీటఁ గాంగ్రెస్సు, కావించుసభ కీవు కామక రాక
నర్థించుచుంటి మహాత్మ! యటంచు, నణఁకువమై జవహరలాలు కమ్మ
నంపె నాయయ్యకు; నది కని గాంధి, తనదారి కాంగ్రెసుదారి వేఱైన
బరువెల్ల నీశ్వరుపై మోపి కదలి, హ స్తిన కేతెంచి యన్నా! ధరిత్రి
తుండెముల్ గాకుండుత్రోవలు వెదకు, మఱవఱసేయుచో నల్పసంఖ్యాక
వర్గంబులకు సుఖావాప్తి హుళిక్కి, యని పండితునితోడ ననెఁ గాని తుదకుఁ
గాంగ్రెసువారు ప్రక్కలుసేయకున్న, వచ్చునిక్క ట్లనివార్యంబు లనిరి
నిర్ణయించిరి మహిన్ రెండుగాఁ జీల్ప 68

## దేశము చీలినది

బోరన మాతంగపురి రాజకీయ, వాతావరణమున వహ్ని రేకెత్తె
గాంధియారోగ్యంబు కదు నీరసించె, నైన నయ్యోగి బీహారుపైనంబు
గావింప సమకట్టఁ గాళీపురాన, నల్లరుల్ సాగిన వనువార్త వెడలె
క్రన్న నమ్మని కలకత్తాకు వచ్చి (7-5-1947), శాంతిగోల్పోయినజనుల నోదార్చి
వలయుసందేశంబు వారి కొసంగి, బీహారుచేరి యూపిరిపీల్చుకొనుచు
బలcగంపుటూడెముల్ పరికించుచుండ, మరల రమ్మని మహామంత్రి విజ్ఞప్తి
నంపె నాయయ్యకు; నపు డెంతనవcత, నున్నను దేశికుం డొయ్యనc గదలి
వారణపురిc జేర, వచ్చె వెన్వెంట 69

## రాజ్యాంగశాసనము

నాంగ్లరాజ్యంబువా రంపినతీర్పు, భారతక్షితికి నేర్పడినచట్టంబు
అది దేశమును జీల్ప నంగీకరించె, అది రెండురాజ్యాల నంగీకరించె
అవి యిష్టమైననాc దడ్డంకిలేని, యధికారముల నుంట కర్తవ్యంబు లనియె
ఆగష్టునెలc బదునైదవనాcడు, జనియించు నధినివేశ ప్రతిపత్తి
నీరెండుదొరతనా లీగడ్డ ననియె, సంయుక్త భారతక్షమకు నీకొనని
యీనిర్ణయము గాంధి నెంతేని గలcచె; గెలుపు నోటమి నొక్కక్రియc జూచుపగ్గె
పడసినవాc డౌట బాపుజీ యపుడు, "ప్రజలార! నూటయేcబదియేండ్లనుండి
మన కెల్లవెత లవమానముల్ గూర్చు, దాస్యంబు సమసెడితతి సమీపించె
నిcక మీరె మీదేశ మేలుకోవలయు, జవహరుcడైన నాజాదైన ధర్మ
పటువు పటేలైన బాబురాజేంద్రుc, డైన జిన్నాయైన నమృతకౌరైన
మీ రెన్నినప్పుడే మేలిగద్దియల, నిల్చి శాసింతు రీనేలను; వారి
పదవి మీచేతిది, బదలిజీవించు, మీరలే శాస్త్ర లీమేదినికెల్ల
సేవాపరాయణచిత్తు లౌవారిc, బంపుcడీ సభకు మీప్రతిభూత్వమూన"
నని యొక సభc బల్కి యలరించె జనుల; 70

## ఇcక కాంగ్రెసు పనియేమి ?

ఒకనాcటిసభ నొకం "డోయయ్య! కాంగ్రె, సిన్నాళ్లు వేసటలెన్నేని సైcచి,
యెన్నేనిత్యాగాల కియ్యకోల్ చూపి, తెచ్చె స్వరాజ్యంబు; దీనికర్తవ్య
మిcక నేమి?" యన జగద్ధితుc డిట్లుపల్కె, "అనుయోగ మిది మంచి, దలరితిన్ దీనc
దమ్ముcడా! కాంగ్రెసుతలcపు లీడేతి, దేశదాస్యము నివర్తిల్లెను గాని
పాయవడ్డదికదా! భారతధాత్రి, ధాత్రి చీలిన విభక్తముగాదు కాంగ్రె,

సది సర్వభారతీయం బగు సంఘ, మది యెల్లమతముల కాప్తమౌ సృష్టి
అది యెల్లతెగలమే లర్థించుసంస్థ, అది యిఁక 'సర్వోదయసమాజ' మగుట
యుచితం బని తలంచుచున్నాఁడ నేను, సర్వమానవ వికాసము సంతరింపఁ
బేదసాదుల నొంచుబెడఁదల నణఁప, మతకులద్వేష సమ్మర్దంబు లుడుప
శాంతిప్రదము నాత్మశక్తిని బెనుపఁ, బరులఁ బీడింపనిప్రజను సృజింప
వంచనసైఁపనివారి నేర్పఱుప, నిర్మాణకార్యముల్ నియతిమై నెఱపఁ
దపియింపవలయు నేతత్సమాజంబు; అధికారవాంఛకు నవ్వలివారు
రాజకీయాడంబరము లేనివారు, నిత్యసత్యవ్రత నియతులౌవారు
కరుణ కాస్థానంబుగా నుండువారు, లోకసేవాధర్మ లుబ్ధులౌవారు
సాగింపఁదగుదు రీ సత్సమాజమును" అనిన సభాసదు లతివేలహర్ష
పులకితులై దివి భువియు వడంకఁ, గరతాళరవములఁ గావించి రంతఁ;
గాశ్మీరమున రాచకలఁతలు పుట్ట, నయ్యె తన్మహికేగి యచ్చటం బ్రజల
యేల్బడి సాగింప నీకొనునట్లు, సంస్థానపుందొరన్ సరగ నొప్పించి
బీహారునకు వచ్చి పీడితప్రజల, కథ లాలకించి నౌఖాళికిం జేరఁ
గాలికాఘట్టంబుఁ గదిసి ఖాదీ ని, కేతనంబున నుండఁ గెరలువైరముల
నల్లాడుప్రజలు త మ్మాదుకొనంగ, నేతెంచె గాంధిగా నీశ్వరుం డనుచు
శాంతి నార్జించి; రాసమయంబునందె, బాపుచెంతకు సుహ్రావర్ది యేతెంచి
"జోహారు గురువరా! జోహారు నీకు (13-8-1947), నార్తసేవా పరాయణ మానసునకు;
ఇచ్చట విలయాగ్ని యెగసి తీండ్రింపఁ, జొచ్చెఁ బౌరులచావు చూడలేకుంటి,
నీపురంబున శాంతి యేర్పడుదనుక, విడిసి నౌఖాళి కావెన్కన వెడలు;
మిది నాదుప్రార్థనమే కాదు తండ్రి!, సకలప్రకృత సంప్రార్థనంబు"
నా మహాత్ముఁడు కరుణావిధేయుండు, పదరానిహింసల పాలైనపేఁట
నార్తులై ముస్లిము లల్లాడుచోట, నొకపాడుకొంపలో నొదిఁగి హిందువులు
మలకలు దౌష్ట్యముల్ మాని సోదరుల, క్రైవడి జీవించుగడె వచ్చుదనుక
నెవరియింటికివార లేతెంచుదనుక, జనతలో నిర్భీతి సంధిల్లుదనుక
విడువ నీగూఁటిని విడువ నీవీటి, నని శపథించె నాహా! పురే! బెగయ;
ఎంతచిన్నది యైన నెంతయేవమ్ము, పుట్టించునది యైన భువనబాంధవుఁడు
వసియించు వెడగీము వైకుంఠమాయె, అందలివేల్పు ననావిలచరిత
నెందతో దర్శించి యిగ్గెఁ బాపంబు, లని తొప్పదోఁగిరి యశ్రుమోదకముల;

## స్వరాజ్యము వచ్చినది

పదపడి స్వాతంత్ర్యపర్వంబు పొడమె, 14-8 రా 12గం.
నదరె నూరేగింపు లన్ని పేటలను, హిందువుల్ ముస్లిము లెనలేనికూర్మి
నిలిచిరి మూఁడువన్నెలదాలు పూని, నౌఖాళిలో శాంతి నర్తించుచున్న
దనెడివార్తయు వచ్చె నయ్యకు నపుడె, ఏదియెట్లున్న యోగీశుండు నిద్రు
పూనెఁ దూర్పునఁ బ్రొద్దు పొడుచుటచూచి, యిదియేమి తాత! మాకీనాఁడు లడ్లు
పంచుట మాని యుపొస మీకొంటి, వని మనూకన్య నా నమ్మాయి! నేను
వెతల వేడ్కల నిల్లి విడువక తాల్తు, మౌనముద్రయు నిందు మన్నింతు, వేల్పు
నభినుతింతును, సూత్రయజ్ఞం బొనర్తు, నని దేశికుఁడు పల్క ననుయాయు లెల్ల
రవధరించిరి పస్తు; నంత రాట్నంపు, రవళు లయ్యెడ మధురమ్ముగా సాగె;
కరిపుర ప్రభుతకుం గైవసమైన 72

## మంత్రుల కర్తవ్యము

పశ్చిమ వంగముం బాలించుమంత్రు, లవ్వేళఁ దనచెంత కరుదెంచి మ్రొక్కఁ
గస్తూరివిభుఁ "దధికారంబు కతనఁ, బొడము నహంకృతి, పుట్టు స్వార్థేచ్ఛ,
కల్గుభోగాసక్తి; కడుమెలంకువను, మెలఁగువారే ప్రజామ్రేడితస్తుతులు
గడియింత్రు, నిర్భరక్షమ నేర్చి, నేర్మి, నేర్చి, కూర్మియునేర్చి, నిఖిలమతాలఁ
గులముల వర్గాలఁ గొనియాడఁదగిన, యనురాగమునఁ జూచి యాడంబరముల
వాసనలేని జీవనము వరించి, యార్తసేవనమున కంగలుసాఁచి
సత్యంబునకు నహింసకు గద్దెలిచ్చి, మద్యపానంబును మరగినవారి
యెడఁదల సవరించి యెసలికవేళ, రాట్నమున్ ద్రిప్పి నిరంతరవ్యథలఁ
గుందుపేదకుఁ గూడుగుడ్డ లొసంగి, చదువులు నేర్పించి సవరనిపర్ణ
శాలలో నివసించి చాఁపఁ గూర్చుండి, ప్రజల కద్దంబగు బ్రదుకు సాగింపుఁ"
దనెడిపల్కులు వ్రాసినట్టి పత్రంబు, నయ్యమాత్యుల కిచ్చె- నది యట్టులుండ
భారతోర్వికి నగ్గపడినపాంచాల, వసుధలో హింస లవ్వారిగా సాగె
సరగ నేతెమ్మని జవహరలాలు, గాంధి నర్థించె - నక్కాలంబునందె
కాళీపురమ్మునం గల సిక్కుయువలు, హిందూమహాసభ నీఁగినవారు
నేచి ముస్లింప్రజ నేఁచుట కొగ్గి, రెగసె గగ్గో లెల్లయెడల దందడిగ
మడఁగినశిఖి వెండి మండెనే యనుచు, నవ్వేళ బాపుజీ యలమటఁ జిక్కి
యిక్కట్లఁ దన్‌గాచు నిల్లికిన్ దొడఁగె (1-9-1947), భగవత్కృపం గూర్చుపస్తు నీకొనియె;
ఉడికెను నగర మట్టుడికినభంగిఁ, దలఁకిరి నానామతంబులవారు
బాఁకులు బల్లెముల్ బాంబులు దొఱఁగి, తులువలు పెనుసిగ్గుతో మెల్లవచ్చి

యార్తబంధువు గాంధియడుగులఁవ్రాలి, సైఁపనే మాతప్పు సైఁపవే తండ్రి!
విడువవే నిద్రని వేమాఱు వేఁడ, నిఁక జగడంబు రానీమని గురుని
దరి నిరువాగు పెద్దలు పూఁటపడఁగఁ, గళవళపడఁగ నాల్గవనాఁటిరేయి (4-9-1947)
సుకృతిమూర్ధన్యుఁ డించుకగంగ ముట్టె, ప్రకృతికి నొకమహాపర్వంబు పుట్టె;
కాళికాఘట్ట మిక్కైవడి నుండ, ముస్లిముల్ చెలరేఁగి ముదుకఁడు పాపఁ
డింతి యనితలంప కెల్లహిందువుల, సిక్కులం బంజాబుసీమలో నొంపఁ
దొడఁగుటంజేసి యార్తులుకొంద ఱిట్లొ, హస్తినకేతెంచి హా!హా! రవాలఁ
దమపడ్డ వెతలగాథలు వెల్వరింప 73

## ఢిల్లీలో హింసలు

హిందూమహాసభా హితులు, సిక్కులును, విలయాగ్నులై యేన్గువీటి ముస్లిముల
నల్పసంఖ్యాకుల నణఁగింపఁ దెగిరి, పాఱిపోయినవారిపాకల నిండ్లఁ
గాందిశీకప్రజల్ కాఁపురముండి, రిత్తఱిఁ బాంచాలహింసాగ్ను లార్పఁ
గదలినబాపుజీ కరిపురిదనుక, విచ్చేసి యటనుండివెడలుట కోడి
వాల్మీకిగుడిఁ బాకివాడఁ గ్రిక్కిఱిసి, దయనీయ మున్న వార్త నెఱింగి ధనవ
దగ్రణి బిర్లాగృహంబున విడిసి, పాపంబెఱుంగని ప్రజల రక్తంబు
క్రోలుధూర్తుల తీండ్రకుం బెద్దవగచి, దుడుకునుదెగడు హిందువులు ముస్లిములు
తనవెంట నడువ నార్తజనంబు నిలుచు, వీథులకుం జని విహ్వలప్రజల
నోదార్చి ధీరతాయుతులఁ గావింప, దొరఁకొని సభలలోఁ దులువలతీరు
దూఱి కోవెలమసీదులగౌరవంబు, గాపాడ రెండువర్గమ్ములవారి
నియమించి దీనులనెవ్వల నణఁప, నీశ్వరుండె సమర్థుఁడిదినమ్మి వేల్పు
నాశ్రయింపుఁడు కొల్వుఁ దని వేఁడికోలు, రచ్చలఁ బల్కి హార్దములేనిమాసి
బ్రదు కీధరిత్రికి బరువని నుడివె; ఎంతచేసిననేమి యిభపురి నూఁచ
ముట్టుగా హింసలు ముదుఁగనివాయె, మూర్ఖమైన సమాజమును జూచి కుములు
బాపున కారోగ్యభంగ మేర్పడియె, మనవలె ననుకోర్కి మణఁగె నిట్లుండఁ
బొడతెంచె నాయయ్య పుట్టినరోజు, ప్రాప్తించె నొకమహాపర్వ మిమ్మహికి
దగ్గుతో గాసిల్లుతండ్రి యానాఁడు, ప్రార్థనసభకు రాన్ బాపుజీ! సూది
మందు వాడకయున్న మాన దీ తెగులు, పాటింపుమయ్య! నాపల్కని సఖ్యుఁ
డొకఁ డడంకువఁ బల్క నోయన్న! రామ, నామంబుకంటెను నాణెమైనట్టి
మందులే; దైనను మనుగడ సాగ, వలె నింక నని నాకు వాంఛయు లేదు
వెండి వచ్చు జయంతి వేడుక నేను, గననేమొ యనె దేశికప్రవరుండు,
పదపడి కష్టాలపాలై తపించు, కాందిశీకులఁ దేర్చుకార్యంబు లిచ్చ

నెఱపుసంఘంబుల నిర్మించుపనుల, నలయుచు మతమైత్రి కనుకూలమైన
సూక్తులు వెల్వరించుచుఁ గరాచీదొ, రల్ తగుదారికి రారేని హస్తి
నగరపాలకులు రణక్రియ కొగ్గ, వచ్చు నీభారతవసుధ నోడింప
ఫాలాక్షుఁడైనను బనికిరాఁ డనియె; అదియట్టులుండె నో యనసూయ! వినుము
హిందువు కాశ్మీర మేలును గాని, ముస్లిము లామహిన్ మొగ్గగాఁ గలరు
ఇం దల్లరుల రేఁపనెంచి కరాచి, యేల్బడివారు వాహినులను బంప
నవి ముట్టడించె నయ్యాపట్టణములఁ, దనదండుతో వానిఁ దఱుమంగలేక
సంస్థానపతి మనసఖ్యంబు కోరి, మనకూటమునఁ జేరి మనుపవే నాదు
పరువు మీసేనలఁ బంపించి యనుచు, జవహరు నర్థింప సచివేంద్రుఁ డతఁడు 74

## యుద్ధము చేయుము

కర్తవ్యమే మని గాంధిని వేఁడ, నాచార్యుఁ డౌగాము లరసి వేవేగఁ
దరలింపు మచటికి దళముల ననియె; ఈ వహింసావాది వీపనికెట్లు
సమ్మతించెద వని సఖు లప్పు డనఁగ, "ఒకఁడు హింసావిధి నోర్చినమాత్ర
నతనిసద్గుణముల నగ్గించుచేఁత, మానఁ దహింసార్థి మాను టొప్పదును;
బోసు ఖడ్గముపట్టి పోరాడెఁగాక, యతనివిక్రాంతి సాహస మార్జవంబు
ధృతి దేశభక్తి యు త్తేజితప్రజ్ఞ, కొనియాడఁదగు మేలిగొనములు కావె;
హింసాపరాయణు లిర్వురు పెనఁగు, తఱి నహింసావాది ధర్మువున్ విడని
వాని సమర్థింపవలె నవశ్యముగ;, తనకోలుపోయిన ధనము రాఁబట్ట
నితరోద్యమములెల్ల వృథయైననాఁడు, నరుఁడు కృపాణియై నడుచునే నతని
సరణి మెచ్చని యహింసాదీక్షితుండు, పాపాత్మునకుఁ దోడుపడినవాఁ డగును"
అని యొజ్జ ధర్మరహస్యంబు మెఱయ, నందఱు తలలూఁపి రద్దిరా! యనిరి
అనసూయ! వినవమ్మ! యవ్వలికథను 75

## కరాచి వారి సొమ్ము నిండు

భారతావని రెండుపాయ లైనపుడు, పరికించిలెక్క లేఁబదియైదుకోట్ల
వసువును హస్తినవారు కరాచి, కీవలె నని నిర్ణయించిరి పెద్ద;
లంతఁ గాశ్మీరంబు నాక్రమించుటకు, సేనఁబంపిరి కరాచీనేలువారు
పాడిదప్పినవారిబాకి చెల్లించు, టె ట్లని రిభపురం బేలెడివారు
కినుకలోమున్గి పాకీస్థాన మప్పు, డిండియాధోరణి నెదిరించి సెగలు
పొగలు గ్రక్కుచునుండఁ బుత్తలీబాయి, తనయుండు వై ప్రాయితలఁపు నర్థించె
అమ్మేటి తగదు సొమ్మాఁపుట యనియె, చిల్లిగవ్వయుఁ దనచేతిలో లేక
యిడుమలందు కరాచి నిభపురి నలఁచు, టొప్పునా సుచరిత్ర కునికియాదేశ
మని యహింసామూర్తి యార్తిపా లయ్యె, గ్రుచ్చుకొన్నది తండ్రిగుండెలో ముల్లు. 76

# ప్రాయోపవేశము

మఱునాఁడు బాపుజీమౌనవ్రతంబు (12-1-1948), కావుటంజేసి యగ్గఱువ లిఖించి
ప్రార్థనాగోష్ఠికిం బంపె నీనుడులు, "ఎల్లి సాపడినంతనే యిల్లి పూన
నెంచితి దీనికి నెల్ల నేమింప, నిట్రులో నీరమో నిమ్మరసంబొ
త్రావెద నన్యంబు తాఁక నెద్దియును, ప్రజలచిత్తం బతిపాప మైనపుడు
ప్రజ లహింసాపథప్రవణు లైనపుడు, వర్జింతు ననశనవ్రతమును దీని
వసుధ ధర్మగ్లాని వచ్చిననాఁడు, మానవత్వము మటుమాయ మైనపుడు
సంఘమున్ సవరించుశక్తి లేనపుడు, తనయసమ్మతి చాటఁ, దననొవ్వి తెలుపఁ
బస్తుగాక యహింస పాటించువాని, కస్మాదృశున కన్యమగుదారి లేదు
వచ్చె నాకిపు డౌపవ స్తలగ్నంబు; నాల్గుమాసంబులనాఁ డీపురంబుఁ
గదిసి కాంచితి వల్లకాటిలీ రిందు, ఇచటఁ జైతన్య మె ట్లేర్పడు ననుచు
నిచట సౌహార్దమె ట్లెసరేఁగు ననుచు, నొచ్చితి నీతులెన్నో వచించితిని
నివులుకట్టెనుగాని ని ప్పాఱలేదు, మూన్నాళ్లనుండి యీముప్పు నణంప
వెరవెద్ది యని పెద్దవెదకి యీతీర్పు, తగు ననుకొంటి, నీతపము నా కమిత
సంతుష్టి నిడు, దీని జగమెల్ల నెఱుఁగు, మైలయెద్దియులేని మనుజుండ నేను
వెఱవఁడు ప్రాణాల విడువం బవిత్రుఁ, డీదేశపుంగీర్తి నిల కొనియాడఁ
బూనితిఁబస్తు, నాపూన్కి కాదనక, నాపట్ల నల్గక నన్ను దీవింపుఁ
డన్నలారా! యహింసార్చకులార! తమ్ములారా! సూనృతవ్రతులార!"
శౌచాశ్రయుండు వైష్ణవకీర్తనంబు, పాడి ప్రారంభించెఁ బ్రాయోపవేశ;
మిది మానుఁ డని మాన్యులెందఱో గాంధి, నర్థింపమొదలిడ, రాఁపవే పస్తు
నని లీగు పెద్దలు నయ్యను వేఁడి, రానాఁడె హస్తిన కరుదెంచుచున్న
కాందిశీకుల రైలుగతి నరికట్టి, మల్కు లాదీనుల మడియించి తనిసి,
రపుడు వల్లభుఁడు మహాత్ముని గదిసి, నీయాన తలఁదాల్తు నిల్పుని ట్రనియె
అటులైనచో నేఁబదైదుకోట్లర్థ, మెల్లి కరాచీకి నిమ్మనె నాజ్ఞ
చేరె నవ్వీటి కాసిరి మఱునాఁడె, గాంధి ముస్లిములకుం గాదిలిచుట్ట
మితనిఁ జక్కాడుట యొగ్గుగా దనుచు, నిప్పులుక్రక్కి రానిముసానఁ గొంద;
ఱచటికి శరణార్థులై పఱతెంచి, కసిదీఱ మల్కులఁ గాఱియ పెట్టు
సిక్కులు హిందువుల్ చిత్తముల్ మాఱి, వందలు వేలుగా వచ్చి మహాత్మ!
మతవైరములు మాని మనెదము, నీవు, మానవే పస్తును మానవే యనిరి;

ఇభపురి నుత్సాహ మెసఁగె, సౌహార్ద, గంధముల్ కదలె నల్గడ శాంతిపొదలె;
అర్థరుమూర'ను నాంగ్లేయు డొజ్జ, దెస సానుభూతిని దెలుప నుపాస
మూనినాఁ డనువార్తయును వచ్చె నపుడె, పాటియాలా మహాప్రభువు మాసిక్కు
లాగడం బిఁకఁజేయ రనె గాంధితోడ. నొకసిక్కు హతుఁడైన నోహటంపదక
పదిమంది మల్కుల ప్రాణంబు లేను, గొనియెద ననె 'మలేర్కోట్లా' నవాబు,
నాటిసాయంవేళ నడిచినసభకుఁ, జనలేక గాంధి కుంజరపురంబేలు
వారు కరాచి కీవలసినవిత్త, మిచ్చుట గణనీయ మిది జగంబునకు
సంతృప్తి నిదు నని సందేశ మంపె, పదపడి రాజేంద్రబాబుగేహమున
నానామతంబుల నాయకుల్ కూడి, మైత్రితో నిచ్చలు మనెద మే మనిరి,
బాపుచెంతకు వచ్చి పస్తిఁకవిడువుఁ, దని విన్నవించి; రోయన్నలు! నన్ను
వంచింపవలదు మీవాక్కులు నమ్మి, నాయిల్లి మానితి, నారింజరసము
త్రాగుచున్నా నని తండ్రి శాంతించె, 4వ నాఁడు,
పదపడి యొకనాఁటి ప్రార్థనసభను (20-1-1948)

## బాంబు ప్రేలినది

బాంబు ధామ్మనిప్రేలె బాపుజీచెంతఁ, జేసె నిప్పని కాందిశీకుఁడై వచ్చి
మాతంగపురి నున్న 'మదనలాల్‌పావ', పోలీసు లితని గొబ్బునఁ బట్టుకొనిరి
తగురీతి దండింపఁ దలఁచిరి గాని, మఱునాఁటిసభ నహింసాయోగమూర్తి
మదనలాల్‌కథ నెత్తి  మాటాడువేళ, నితనికీ దెంచకుఁడీ! బంటులార!
నన్నుఁ బోకార్చిననాఁడు హిందూస, మాజ మెచ్చుఖ నని మదినెంచె నితఁడు
హిందూమతంబున కీగాంధి నతక, రించురక్షకుఁడు ధరిత్రిని లేమి
యెఱుఁగఁ డీపిన్నవాఁడెఱుఁగఁడీమూర్ఖుఁ, దనవుడు నీయోర్మి యతిమానుషంబు
బాపురే! గురుఁ డెంతపండె నటంచు, సొగసెను దనివిమై శ్రోతృలోకంబు
పదపడి సోదరీ! బాపుదాపునకు (22-1-1948), వల్లభుఁ డేతెంచి ప్రార్థనాసభకు
నేతెంచువారిఁ బరీక్ష సేయంగ, నియమింతు బంటుల నీ వియ్యకొన్న
దేశికమౌళి! నీదెస నుద్దిలేని, కసి పెంచుకొన్న ముష్కరు లీధరిత్రి
నున్నట్లు మొన్నటి యుద్వర్తనంబు, చాటుఁగదా! యనన్ జంకెదవేల
నెచ్చెలీ ! దైవ మీనేల నెన్నాళ్లు, నను నిల్పఁదలఁచె నన్నాళ్లు నాకెట్టి
చెట్టయు రాదు, నాసేమంబు నరయ

## రాముఁడే రక్షకుఁడు

రాముఁడుండఁగ మర్త్యరక్షణ మేల, యని యొజ్జ హేమాద్రియై వక్కణింప
నొం దనలేక నిట్టూర్చె వల్లభుఁడు; సాయంసమయమందు సాగినసభకు
నడచివచ్చె గురుం డనాయాసముగను, కాందిశీకులకస్తి గని కుంది మంత్రు
లాత్మగేహంబుల నవ్వారి నిల్పి, యాదరించుట మెచ్చె, నందఱుగేస్తు
లీదారి త్రొక్కుట కృత్యమం చనియె; మఱఁగినదగ్గు క్రమ్మఱ సాగ నయ్య
క్రిందుమీ దగుచుండెఁ గీ డిది చూచి, యాప్తులు మందుతెమ్మందురా యనఁగ
రామనామజపంబె రాయు నిద్దాని, మందేల యనె, దీన మంచముపట్టి
చచ్చెదనేని నాజపము నాతపము, నల్పంబులని తెల్పు నామృతి యనియె,
ననుఁ జంప నెవ్వఁడైనఁ దుపాకి గాల్ప, మూల్గను, గాసిల్ల, ముదము నిండార
రామ! రామ! యటంచుఁ బ్రాణముల్, విడుతు, నది నామహత్తకు నానవా లనియె 79

## దుర్దినము వచ్చినది

అంతట దుర్దినం బరుదెంచె, నాంగ్ల, రాజ్య మహింసతో రాపడఁజేసి
సాటిలేనియశంబు సాధించినట్టి, దేశదాస్యంబును దెగటార్చినట్టి
జగజెట్టి బ్రదుకులోఁ జరమదినంబు; అనాఁటివేకువ నయ్య 'విశ్వము'ను
దనసేవలో మున్గి తనిసెడివానిఁ, జెంతకుం బిలిచి నాజీవనం బెల్లి
యుండునో యుండదో యుత్తరాల్ - సంచి, దెమ్ము జవాబులం దీర్చెద ననియె
ఉదయంపునడకకు నోపికలేక, యింటనే యటునిటు నించుక నడిచి
తగ నొడల్ పట్టించి తానమొనర్చి, యపు దేగుదెంచిన యాప్తులతోడ
నౌఖాళిసీమచందంబును దడవి, వంగ మించుక నేర్చి భారంబుతూఁచి (109 పౌనులు)
యర్థిమైఁ దన్జూడ నరుదెంచినట్టి, పౌరులదెసఁ బేర్మిపఱపి భుజించి
కుక్షిపై వండలిగుడ్డ నంటించి, సూనృతమూర్తి యించుక మిశ్రమించె,
పదపడి తత్సమీపమున కాత్మీయ, తనయతో వచ్చె సర్దారుపటేలు,
బాపుజీ రాట్నపుంబనినుండి తొలఁగ, కతనితో బహుసమస్యలు చర్చచేసి
జవహరుండును నీవు సచివపీఠముల, నుంట లెస్సయకాని యొకనిప ల్కొకని
కిష్టంబుగాదఁట యిది సైఁపఁజాల, నీవేని పండితుఁడేని యమాత్య
పదమును విడకతప్పద యని తలఁతు, చాటెదఁ బ్రార్థనాసభ నీతలంపు,
అలింతు జవహరునభిమతం బిందు, నావుడు సర్దారు నల్లవో! యనియె;
ఇంతలోఁ దనమ్రోల కేతెంచినట్టి, యాహారముం దిని యనఘుండు మరలఁ

దొడcగె వల్లభభాయితోడ భాషింప, వేcడికోల్‌తతి సమీపించెను గాన
గడియారముం జూపె గాంధికిం గోడ, లాయిత్తపడె సభ కాచార్యుc డంత
అపు డొక్కరుcడు వచ్చి యయ్య! నీతోడ, మాటాడ ఘూర్జరమహివార లిర్వు
రరుదెంచి రేమందు వని గాంధిమ్రోల, ననుడు నాతనువునం బ్రాణంబులున్నc
బ్రార్థనసభ సమాప్తంబైనవెన్కc, జూతు వారల నన సూరెలవారు
నొవ్విపాలైరి కన్నులుతేలవైచి; అనివార్య కార్యంబు లడ్డుటంజేసి
పదినిముసమ్ములపా టాలసించి, వేళదప్పె నటన్న వేదనరేcగ
నింగిని నెత్రుడాల్ నిండార మనుమ, రాండ్రమూcపులపైc గరమ్ములు మోపి
వెడలెను బాపుజీ వేదికకడకు, అత్తతి రెండుపాయలుగా జనంబు
చీలి దారినొసంగc జేదోయి నెత్తి, సభ్యులకున్ నమస్కారం బొనర్చి
గద్దియకుంజేరcగా మెట్టుమీcద, నడుగుమోపె మహాత్ముc డౌదలవంచి;
అనసూయ! యేమందు నవ్వేళc బ్రజల, నటునిటుం ద్రోయుచు నమ్మనూకన్య
నిల్పినన్ నిలువ కానెలcతను గెంటి, యయ్యకున్ దఱిసి జోహారువొనర్ప
వంగినచందాన వంగి యొకండు, పిఱుజేబునం గల పిస్తోలుదీసి
చెచ్చెరc బేర్చి ప్రేల్చెను మూcడుగుండ్లు, బాపుజీకుక్షిని బ్రద్దలుచేసి
గుండ్లురెం డేగcగా గుండెలోc జొచ్చి, కదలకనిల్చి నొక్కటి మృత్యుసఖము;
ఏగుండె కరుణకు నిల్లుగా నిలిచె, నేగుండె శౌచాన కెల్లగాc బొలిచె
నాగుండెపైc బ్రేల్చె నగ్నిగోళంబు, ఆగుండెమాసి నిర్భరమౌఢ్యరాశి 80

## రామ! రామ!

పలికినపల్కు తాcబ్రదికినబ్రదుకు, సత్యముల్ నిత్యముల్ సఫలముల్ కాcగ
రామ!రామ! యటంచు రక్తాశయమునc, గూలెc గై మోడ్పుతో గుణకంధిగాంధి;

వాలె నవ్వేళ విశ్వపతాకలెల్ల, నేడుదీవులనుండి యెగసె రోదనము
రవికాంతిలోc దిమిరంబు తీండ్రించె, బాపుజీ పోవ మ్రాన్పడె నెల్లజగము,

బుద్ధుండు జీసస్సు పోయినపిదప, నంతవాcడుగ నితం డవని కేతెంచె
నని జగం బెవనిc గొండాడె నాసుకృతి, బాపుజీ పోవ మ్రాన్పడె నెల్లజగము

తరతరమ్ములనుండి తరలనిదాస్య, మసిలేని కసిలేని యాలంబు పఱపి
వెడలcగొట్టిన మహావీరాగ్రసరుcడు, బాపుజీ పోవ మ్రాన్పడె నెల్లజగము

అపవర్గసుఖలబ్ధి కనుకూలమైన, దారికి నైహికధర్మమున్ మలపి
నవనందతనయుఁడై నతులందుకొన్న, బాపుజీ పోవ మ్రాన్పడె నెల్లజగము

అస్పృశ్యతా కల్పితావమానములఁ, గుందెడిమానవున్ గుడిలోని కనిపి
సాంఘికవిప్లవ స్రష్టయైనట్టి, బాపుజీ పోవ మ్రాన్పడె నెల్లజగము,

మతవైరములు పెనుమంటలై క్రమ్మి, ప్రజ నేర్చునప్పుడు రామరహీము
లొక్కరే యని శాంతి నొదవించినట్టి, బాపుజీ పోవ మ్రాన్పడె నెల్లజగము,

సేవతో నీవితో సిద్ధించుఁగాని, తోమాలెతో హొమధూమాలతోడ
రాదు కైవల్యంబు రాదన్నయట్టి, బాపుజీ పోవ మ్రాన్పడెనెల్లజగము,

రఘురామురాణి! నిర్భరహార్దవేణి!, సోదరీ! యనసూయ! శుచితావిధేయ!
సాధారణజగత్తుచంద మిట్లగుట, తప్పదు గానీ స్థితప్రజ్ఞుఁడైన

గాంధి పోయినపోక కడుమేలిపోక; తనలోకసేవ తద్దయు సాగుచుండ
బుద్ధి తేజస్వంతముగ వెల్గుచుండ, మానసస్థితి పూర్ణిమారాత్రిపోలెఁ

బరమప్రసన్నమై భాసిల్లుచుండ, నుత్తరాయణమున నొడలుచాలించి
సుజనప్రియంబైన శుక్లమార్గమున, నరిగి బ్రహ్మీభూతుఁ డయ్యెను గాంధి;
ఉపనిషద్రాజమై యొప్పినగీత, యౌనన్న పుణ్యాత్ముఁ డయ్యెను గాంధి
యెసరేఁగి యేరులై యెల్లకామములు, వెసవెసన్ దనలోఁ బ్రవేశించుచున్నఁ
దెరలక పొరలక తిరముగా నిల్చి, యలలేనిజలరాశి యయ్యెను గాంధి,
సరిలేని శాంతిని సాధించె గాంధి;

ఇతఁడు లేఁడని ప్రజ కేల మ్రాన్పాటు ?, ఇతఁడు లేఁడని ప్రజ కేల యుమ్మలిక ?
ఇతనిమన్గడచంద మిచ్చఁ బాటించి, జగ మందుకొనుఁగాక సర్వదా జయము!
జన మందుకొనుఁగాక సర్వదా శుభము!

(22-9-1986)

## అర్థములు

అంజక = వెఱవక
అడియరులు = కింకరులు
అతిపాపము = పాపమును దాఁటినది
అధమర్ణుఁడు = ఋణస్థుఁడు
అప్పసము = సదా
అభిఘారము = పోపు
అరి = పన్ను
అసదు = అల్పము
అస్రము = నెత్తురు
ఆఁగు = ఆఁపు
ఆపణము = అంగడి
ఆపన్నసత్త్వ = గర్భిణి
ఆమ్రేడితము = 2,3 సారులు పల్కఁబడినది
ఆర్చు = కదల్చు
ఆలరి = దుష్టుఁడు
ఆవాపము = విదేశవ్యవహారము
ఇగ్గుట = వెన్కకొఱగుట
ఇట్టలము = అధికము
ఇమ్ము = సుఖము
ఇమ్ముదప్పు = కష్టము
ఇల్లిగ్గులు = మిక్కిలిగా వెన్కకొఱగుట
ఈఁగి = చొచ్చి
ఈగి = ఇచ్చుట
ఈడ్యము = పొగడఁదగినది
ఉదుటు = గర్వము
ఉపగమము = సమ్మతి
ఉప్పుట = వండుట
ఉపఘ్నము = ప్రాఁకుడు కొయ్య
ఉఱవు = గొప్పది
ఉఱని = లెక్కింపని
ఎక్కటి = ప్రత్యేకము
ఎచ్చిఱు = వర్ధిల్లు
ఎనుపెంటి = గేదె
ఎరవు = భేదము
ఎరియు = తపించు
ఏఁచు = బాధించు
ఏచు = వర్ధిల్లు
ఏడ్తెఱ = పరాక్రమము
ఏరు = నాగలి
ఏర్చు = బాధించు, కాల్చు
ఐచ్చెము = కొఱంత
ఒఱపు = సొగసు
ఒసపరి = ముఖ్యమైన
ఓట = భయము
ఓలాకు = శ్రమ
ఓవరి = గది
కడాని = మేల్మి
కడిఁదిచెయ్వులు = కఠినకృత్యములు
కంకరపల్కు = పరుషవాక్కు
కరము = పన్ను
కామక = తప్పక
కింకిరిపాటు = కోపము
కుప్పము = పల్లె
కొటిక = పల్లె
కలుచ = పాపము
కన్నాకు = మేటి
క్రన్నన్ = త్వరగా
కర్షణస్వామ్యము = జిరాయితీ హక్కు
కాల్మడి = మూత్రము
కూచి = పదనుగల, తీవ్రమైన
కెరలు = విజృంభించు
గఱువలు = పెద్దలు
గ్రామము = సమూహము
చంపు = చంపుట
చదురులు = నేర్పరులు
చనవు = హక్కు

చోపుట = తఱుముట
జంకెన = బెదరింపు
జగా = గొప్ప
జాగర్య = జాగ్రత్త
తలయేరు = తలనొప్పి
తంత్రము = స్వదేశవ్యవహారము
తనరు = పెరుఁగు
తఱిసి = సమీపించి
తివుట = ఆసక్తి
తొడిఁదొడిన్ = వెంటనే
తోమాలె = ఆకులు, పూలుచేర్చిన దండ (వనమాల)
తోయము = రీతి
దొర = సాటి
దీము = ఇల్లు
నట్టు = ఇల్లు
ననసె = వికసించె
నలఁక = బాధ
నలికము = స్వల్పము
నల్లవో = బళీ!
నవఁత = కృశత్వము
నించెను = నిండించెను
నెఱి = రీతి
నెవ్వ = బాధ
నైక = అనేక
నెట్టన = తప్పక
పడవాలు = సేనాపతి
పగటిరి = ప్రకటించిరి
పద్య = బాట
పదఁడు = పొందు
పాచితము = ప్రాయశ్చిత్తము
పింపిసలాడు = నర్తించు
పుల్లరి = మేఁతపన్ను
పుల్లు = గడ్డి
పురే = బళీ!
పూఁటపడుట = బాధ్యతపడుట
పేరు = అధికము
పొలి = పంట, లాభము
పోకాడె = నశించె
ప్రతిభువు = ప్రతినిధి
ప్రతిభూత్వము = ప్రాతినిధ్యము
ప్రేచి = ప్రేరేపించి
ప్రొద్దు = దినము, కాలము
బలసి = చుట్టుకొని
బారు = సమూహము
మందల = హద్దు
మదిమది = నెమ్మది
మఱాకుము = మఱవకుము
మల్లడి = పరితాపము
మసటు = మలము
మాగానులు = రాజ్యములు
ముచ్చిఱు = వగచు
ముదల = ఆజ్ఞ
మాయింప = అణఁప
మూదల = తార్కాణము
మూరిన = హెచ్చిన
మెఱచున్ = ప్రకటింపన్
మెట్లు = చెప్పులు
మైరేయము = మద్యము
యవీయసి = చెల్లెలు
రక్కెస = అనుచితమయిన
రథ్య = బజారు
రాయును = ఎదిరించును
రాహుతులు = దిట్టలు, వీరులు
రుక్ త్రాసము = రోగభయము
రేపు = ప్రభాతము
రోచిరీడ్యము = దీప్తిచే మెచ్చఁదగినది
వడిసె = ఇంకెను, ఎండెను

| | | |
|---|---|---|
| వనట | = | దుఃఖము |
| వజ్జీరులు | = | శూరులు |
| వాఁగు | = | దండు |
| వార్చు | = | నిరీక్షించు |
| విజ్జిన | = | వ్యాపించిన, హెచ్చిన |
| వితర్ది | = | వేదిక |
| విలాతి | = | దేశము |
| విష్ఠ | = | మలము |
| వెద | = | విలువలేని |
| వెలఁదితనము | = | శౌచము |
| వేఁకి | = | జ్వరము |
| వ్రేఁకన | = | బరువు |
| శయము | = | హస్తము |
| శిష్టి | = | శాసనము |
| శేఫము | = | మగగుఱి |
| సగంధుడు | = | మిత్రుడు |
| సజ్జ | = | బుట్ట |
| సడిసన్న | = | ప్రసిద్ధమయిన |
| సవరని | = | చక్కని |
| సాధ్వసము | = | భీతి |
| సేవధి | = | నిధి |
| స్థేమము | = | బలము |
| హాళహాళి | = | వేగము |
| క్ష్మ | = | భూమి |

# చక్కట్లు

## విషయసూచిక

# ముందుమాట

"చక్కట్లు" అను ఈ ఖండకావ్యసంపుటి తెనుఁగులెంక శ్రీ తుమ్మల సీతారామమూర్తిగారి సరికొత్త పొత్తము. వారి ఖండకావ్యసంపుటములలో ఇది ఏడవది. వారు అనారోగ్య కారణముల వలన జీవించియుండగా దీనిని వెలువరించలేకపోయిరి. దీనినీనాడు వారి పెద్ద కుమారుడు శ్రీ శ్రీనివాసమూర్తి ప్రకటించుట ముదావహము.

ఇది 27 ఖండకవితల సంపుటి. వీటిలో ప్రథమఖండిక ప్రార్థన. ఇందలి నాలుగు పద్యములలో మూడు దైవమునకు కవి చేయు విన్నపము కాగా, నాల్గవది అప్పయ్య దీక్షితస్తుతి. అప్పయ్యదీక్షితులవారి ఆంధ్రభాషాప్రియత్వసూక్తి తుమ్మలవారిచే వారికీ తొలి పూజ గావించి నది.

తరువాత 54 చక్కట్లు కూర్చబడినవి. వీటిపేరే ఈ గ్రంథమునకు శీర్షికైనది. ఇవి ముక్త కములు. చక్కటి అనుపదమునకు గల న్యాయము, తీర్పు, మార్గము అను అర్థములు ఈ సందర్భమునకు తగినవి. ఈ ముక్తకములలో కవిగారు అనేక సార్వకాలిక సత్యములను చక్కని దృష్టాంతములతో చెప్పి పాఠకహృదయములకు స్ఫూర్తినొసగినారు. ఈ దృష్టాంతములు సామాన్యులకు సైతము సుపరిచితములు. ఉపాధ్యాయ వృత్తిని వదలి బహుకాలమైన విద్యార్థిని, అధ్యాపకుని మరువలేదు వారు. విద్యార్థి తన భావి జీవితమును పండించు కొనుటకు అలవరచుకొనవలసిన క్రమశిక్షణ సంయమములను గూర్చి, అధ్యాపకుని కర్తవ్యమును గూర్చి హెచ్చరించినారు.

కర్షకప్రసక్తి, ప్రశస్తిలేని తుమ్మలవారి ఖండకావ్యము లేదు. "నేఁడు కుప్పవేయ నిచ్చెనతోఁ బని లేకపోయె రైతులోకమునకు సంతు పెరిఁగి పెరిఁగి యింత చేసినదయా శరణమిక మరొక్క సాధువృత్తి" గిట్టుబాటుగాని ఈ నాటి మాగాణి ప్రాంత వ్యావసాయికవృత్తిని గూర్చిన కవిగారి యీ అంచనా సత్యమైనది. "నేల విడిచి సాము" చేస్తున్న కర్షకులను హెచ్చరించిన పద్యాలు తుమ్మలవారు తప్ప ఇతరులు వ్రాయలేనివి. దేశాలను చీల్చు రాజనీతి పిశాచము వంటిదని, మెచ్చరానిదని వారు చెప్పిన తీర్పు నిక్కమైనది.

వ్యక్తి ఉన్నతికి, సంతృప్తికి ఆత్మసంయమమే ప్రధానమని చెప్పారు తుమ్మలవారు. ఇది భారతీయ తత్త్వమునకు పునాది. "ధనమునకు నిత్యమైన లక్షణము లేదు" అన్న మాటను "వెండి బంగారు నజ్ఞాని విత్తమనును, తత్త్వవేత్త దరిద్రతం దలచు సిరిఁగ" అని సమర్థించిన తీరు అత్యంత సుందరము. భక్తిమార్గ వైశిష్ట్యాన్ని కూడ వారు అరటిపండు ఒలిచి చేతిలో పెట్టినట్లు వివరించారు. వీటికి అలంబన, ప్రేరణ వారి నడవడికే.

ప్రకృతిని వర్ణించనివాడు కవి కాడని పెద్దల మాట. ఈ సంపుటములోని తుమ్మలవారి ప్రకృతివర్ణన శరత్కాల సంబంధి. "సన్నయెండ లేఁత చలిముగ్గబాతిన వరిపొలాలు పూచి వలచుకంది కొదవలేనిపాఁడి యొదవి శరత్తునఁ బడసెఁ గ్రొత్తసొరు పల్లెటూరు". బురద

ఎండిన చెఱువుదారి, ఏనాదుల చేపలవేట, కాలువలలో ఈతవేసే కుఱ్ఱవాళ్ళు, గట్ల మినుము మేసి బలిసి పోట్లాడు కొనేకోడెదూడలు, శివాలయంలో మ్రోగే గుడిగంటలు అన్నీ పల్లెటూరి ప్రకృతి సోయగాలే.

తుమ్మలవారి ఖండకవితలలో సగావికిపైగా వ్యక్తులకు సంబంధించినవే. గాంధి, వినోబాలను గూర్చి వ్రాసిన కావ్యాలు కాక పూర్వఖండకావ్యాలలో 92మంది మహా పురుషులను కీర్తిస్తూ 105 కవితలు వ్రాసారు. వీటిలో సమకాలికులను గూర్చి వ్రాసినవే అత్యధికం. సమకాలిక వ్యక్తులపై ఇంత విస్తృతంగా కవిత చెప్పినవారు బహుశః తుమ్మల వారొక్కరేనేమో. ఈ సంపుటిలో 16 ఖండకవితలలో 16గురు విశిష్ట వ్యక్తులు గలరు. వీరిలో పోతన, పోతులూరి వీరబ్రహ్మంగారలు ప్రాచీనులు. ఇతరులు వారితో ప్రత్యక్ష పరిచయం గల విశుద్ధవర్తనులు, రాజకీయ పదవీస్థితులు.

తుమ్మలవారికి ప్రీతిపాత్రములైన సమతావాదము మానవతావాదములను వారికి 200 ఏండ్లకు ముందే ఆచరించి చూపిన మహనీయవ్యక్తి పోతులూరి వీరబ్రహ్మం. వారిని పంచరత్నాలతో అర్చన చేశారు తుమ్మలవారు. పోతనను గూర్చి తుమ్మలవారు 1923లో నవరత్నాలను ప్రచురించారు. తిరిగి 63 సం॥ల తరువాత(1985) మళ్ళీ పోతన వీరి నాకర్షించినాడు ఆ మహాకవి విశిష్టవ్యక్తిత్వము, భాగవత పద్యాలలోగల భక్తిమాధుర్యము తుమ్మలవారి జీవనాన్ని తీర్చిదిద్దినందువలననే వారికి పోతనపై అంత గౌరవము.

తాళ్ళూరి జియ్యరుదాసుగారి షష్టిపూర్తి సందర్భముగా వారికి కవితాభినందనలను అందించారు తుమ్మలవారు. వారు గాంధీమార్గానుగాములు. వారి స్వగ్రామమైన తాళ్ళ పాలెమును గాంధి 23-12-1933న సందర్శించారు. తనువును, తలపును ఉపాధ్యాయ వృత్తికే అంకితముచేసి గుంటూరు జిల్లా సంగంజాగర్లమూడి హైస్కూలుకు ప్రధానోపాధ్యాయునిగా పనిచేసి S S.L C పరీక్షలలో వరుసగా మూడేండ్లు నూటికి నూఱుశాతం విద్యార్థులు ప్రథమశ్రేణిలో కృతార్థులగుటకు పాటుబడి "రాష్ట్రపతి అవార్డు" నందుకొన్న ఉత్తమ ఉపాధ్యాయులు శ్రీ కొత్త రాజబాబయ్య "ఓజలకుఓజ" నిప్పువంటి నడత, నెఱవణి గలనేర్పు, కష్టసుఖసమీక్ష గనని దీక్ష' గల యోగమూర్తి తుమ్మలవారు వీరిని గూర్చి చెప్పిన మాటలువాస్తములేగాని సంస్తవములుగావు. ముఖ్యమంత్రి చెన్నారెడ్డిగారికి షష్టిపూర్తి (1978) సందర్భమున వారికి ఉపదగా రచించిన కవితలో సమగ్రఆంధ్రరాష్ట్రఅభ్యుదయమే గానము చేయబడినది. రాష్ట్రసిద్ధి కొఱకు రక్తమ్ముగార్చినకవి అంతగాక మరేమి కోరగలరు. రైతు కల్పకము ఆచార్యరంగాగారి సోదరులు, గాంధీ మార్గానుగాములు, స్వాతంత్ర్య సమర యోధులు అయిన లక్ష్మీనారాయణగారి మరణము సందర్భముగా వారిని గూర్చిన తలపోత కవితాకృతి దాల్చినది. కవిగారి శిష్యకోటిలో విశిష్ట వ్యక్తి శ్రీ కాకరపర్తి వేంకటేశ్వర్లు. వారిని గూర్చిన ప్రశంస ఇందు కూర్చటం సముచితం. గురువుగారు తన శిష్యునకు 'ఎక్కట్లు' అను గ్రంథమునంకితమిచ్చి సాహిత్యచరిత్రలో చరిత్రను సృష్టించారు. భారత ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి హత్యోదంతమునకు కలత చెందనివారు లేరు. తుమ్మలవారన్నట్లు అది 'సైంపరానికీడు'. కోహినూర్లకు నూర్లకే కొదువలేని తెలుగుకాంతల చరిత్రకు ప్రత్యక్షోదాహర

ణము అమరేశ్వరిగారిపై కవిగారు చెప్పిన కవిత. ఆమె అప్పికట్లలో రైతు కుటుంబమున జన్మించి, ఉన్నత విద్యల నార్జించి న్యాయవాద వృత్తిలో రాణించి, ఆంధ్రప్రదేశ్ హైకోర్టు న్యాయమూర్తిగా పనిచేసి కీర్తి గాంచినది జగమెఱిగిన మహామనీషి, మానవతావాది, హేతువాది, బహుముఖప్రజ్ఞాశాలి, పత్రికా సంపాదకీయాలతో ప్రభుత్వాన్ని పడగొట్టిన కలంవీరుడు శ్రీనార్ల వేంకటేశ్వరరావు వారి సంస్మృతిగా కవిగారు వ్రాసిన కవితలోని ప్రత్యక్షరమున కన్పిస్తారు నార్లవారు. తుమ్మల వారికి ఆత్మీయులైన కవి పండితులలో యార్లగడ్డ సుబ్బారావుగారొకరు. వారి సమ్మానసందర్భమున వీరు ఉడుగరగా వ్రాసిన కవిత సుబ్బారావు గారి ప్రశంస. బహుభాషా పండితులు, పరిశోధకులు, పత్రికా సంపాదకులు అయిన మరుపూరు కోదండరామిరెడ్డిగారు సహస్రమాస జీవులైనపుడు కవిగారు చెప్పిన హితవాణి రెడ్డిగారిపై వ్రాసిన కవితాఖండిక. సుప్రసిద్ధ వైద్యులు సాహిత్యాభిమానులు, సాహిత్యపోషకులు అయిన డాక్టరు కాసరనేని సదాశివరావుగారికి వారి షష్టిపూర్తి సందర్భముగా 32 పంక్తుల చంపకమాలికతో దీవనలు అందించారు కవిగారు. తిరుమల-తిరుపతి దేవస్థాన విద్యాంసులు శ్రీ వేదాంతం జగన్నాథాచార్యులుగారు (అప్పికట్ల) పరమపదించినపుడు కవిగారు తమ పరితాపమును ప్రకటించారు. ఈ సంపుటములో సంస్మరించబడిన తుది వ్యక్తి భావవిప్లవ వైతాళికుడు శ్రీ త్రిపురనేని రామస్వామి చౌదరి. కవిరాజు శతజయంతి సందర్భముగా, మహాకవి తుమ్మల సమర్పించిన కానుక.

ఇక ఈ సంపుటములోని ఇతర కవితా ఖండికలు ఏడు. ఇవి భారతీయుడు, కృష్ణానది, బాపూజయంతి, కులము, గాంధి దర్శనము, సత్కళ, ఉగాది అనునవి.

భారతీయ తత్త్వసారమునకు సారవంతమైన వ్యాఖ్యానమనదగినది 'భారతీయుడు' కవిత. దైహికానందములను చంపుకొని ఆధ్యాత్మిక ధర్మాచరణకు అంకితమైన వితరణ పండితులు, శంకరాచార్యుడు, బుద్ధుడు, అశోకుడు, వాల్మీకి, గాంధి వంటివారు జన్మించినదీ పుణ్యభూమి. 'మర్త్యుడయ్యు నతడమర్త్యుడు భవియయ్యు నభవుడైన గాంధిమహాత్ముని, అతని తత్త్వాన్ని పరిపూర్ణముగా అర్థముచేసికొని అనుసరించినవారు కనుకనే మహాత్మకథలోని 'ఉత్తమవాఙ్మనా, ఇత్యాది పద్యాన్ని తలపించే మఱొక మధుర పద్యాన్ని ఈ ఖండికలో రచించారు. తుమ్మల వారు. "పరిశుష్కదేహుడై బడలిన వాఁడయ్యు" నని సాగే ఆ పద్యం గాంధికి నిలువెత్తు దర్పణమే.

కృష్ణానదీ పుష్కరాలను పురస్కరించుకొని వ్రాసిన కవితలో నదీస్తవముతో పాటు చరిత్రనూ నిక్షేపించారు. ముఖ్యంగా కృష్ణానదీతీరంలో నిలిచి పరిపాలించిన వాసిరెడ్డి వంశీయులను, నదికి ఆనకట్ట కట్టిన 'కాటను'దొరను సంస్మరించి తమకు చరిత్రపై గల మక్కువను, కృతజ్ఞతను ప్రకటించారు తుమ్మలవారు.

గాంధిమహాత్ముని గూర్చి మూడు బృహత్కావ్యాలు, ఒక సంతాపకావ్యము వ్రాసినను తుమ్మలవారికి తనివి తీరలేదు. తన జీవితమును తీర్చిదిద్ది నడిపించిన బాపుస్మరణకు వచ్చినపుడెల్ల వారి హృదయము ఆ సచ్చరిత్రుని పద్యసుమములతో అర్పించుచునే ఉన్నది.

గాంధి యాస్థానకవికి అది సహజమే. గాంధి జీవితమును, ధర్మాచరణమును వారు దర్శించిన తీరు అనుపమానమైనది, అనితరసాధ్యమైనది. 1981 నాటి గాంధిజయంతి సమీపించు చున్నప్పుడు గాంధిని మరచి బ్రాందిని మరిగి, నైతిక ధర్మచ్యుతులై స్వార్థముతో, హింసతో లోకమును వ్యాకులపరచు జనగణమును కవిత తుమ్మలవారి గాంధి తత్త్వదర్శనమునకు 'పరాకాష్ఠ' అనదగినది. ఈ సంపుటమునకు మకుటాయమానమైనదీ కవితాఖండము. తుమ్మల వారి భావుకతకిది మణిదీపము. పాలిచ్చేగోవులో, పరుగెత్తే ఏరులో ప్రేమయెఱిగిన తల్లులో, కపటమెఱుగని పిల్లలలో, త్యాగైకజీవనులలో, ధర్మాచరణ ప్రవీణులలో, ఆర్తజనబాంధవులలో, అలరించే పిల్లగాలులలో తుమ్మలవారు తప్ప మఱొకరు మహాత్ముని చూడలేరు. ఈ ఖండికలోని 8వ పద్యంలో మనకు కన్పించేది తుమ్మలవారే.

సమాజములో కులము కల్పించు కుళ్ళు మేరలేనిది. కులాల కుమ్ములాటలు లేని కాలములేదు. చరిత్రను పరిశీలించితే సంకరముకాని కులమూ కన్పించదు, 'కులమున కున్ జెప్పు లక్షణములు నిశ్చలములు కావు' అన్న కవి వాక్కు సార్వకాలిక సత్యమై నిలువ గలదు.

తుమ్మలవారిది విశుద్ధజీవనము. 'మచ్చలేనిమనుగడ' అదే వారు మెచ్చిన కళ. దీని ఆవశ్యకతను, అభ్యాసమును గుఱించి 'సత్కళ' గేయంలో తుమ్మలవారు రమ్యముగా ప్రవ చించారు. తుమ్మలవారు రచించిన ఎనిమిదవ గేయమిది. హయప్రచార రగడ ఛందస్సులో నడిచినదీ గేయము.

సంక్రాంతి, ఉగాది పండుగలు తుమ్మలవారికి ప్రీతికరమైనవి. పల్లెటూరి వాతావరణ మును, ప్రజల జీవనమును వీరెంత రమ్యముగా చిత్రించినదీ రసజ్ఞులెఱుగుదురు. ఈ సంపుటిలోనిది తుమ్మలవారు ప్రకటించిన 5వ ఉగాది కవిత. ఉగాది నాటి ప్రకృతి వర్ణనతో ప్రారంభమై, ప్రబోధాత్మకంగానూ, ఆత్మపరిశీనాత్మకంగాను, విప్లవాత్మకంగాను సాగినదీ కవిత. భగవద్గీతార్థాలు, ఉపనిషత్సూక్తులు, గాంధి, వినోబాల అహింసా విప్లవ బోధనలు సంగమించిన ఈ కవితా ఖండిక తుమ్మలవారి ఆశయాలకు ఆదర్శాలకు ప్రతీక. సర్వోదయమే వారి కవితాతత్త్వము.

అందఱిలోఁదన్నుం గని
యందఱఁ దనయందుఁజూచి యక్షరమగునా
నందమునందు మహాత్ముల
సందేశము వినుటకతఁడు సమకట్టవలెన్.

దీనికి ఆలంబనమైనది, వారికి ప్రీతిపాత్రమైనది ఈశోపనిషత్‌లోని ఈ క్రింది శ్లోకము.

యస్తు సర్వాణి భూతాన్యాత్మన్యేవానుపశ్యతి!
సర్వభూతేషు చాత్మానం తతో న విజుగుప్సతే!!

ఈ ఖండికలో మఱొక విశిష్టత కూడ ఉన్నది. అది కవిగారి దృక్పథములో వచ్చిన మార్పు. సమసమాజ నిర్మాణాన్ని కాంక్షిస్తూ 1942 లోనే 'ధర్మజ్యోతి'లో వారు ఇక షాహుకార్ల

ఆటసాగదని, దరిద్రుడు చిచ్చుఱకన్ను తెరచి గజ్జకట్టునెపుడొ అని హెచ్చరించారు. ఆ హెచ్చరికకు ఉన్నవారు కావలసినంతగా జాగృతులు కాలేదు. అందువలననే 1960లో 'సర్వోదయ గానము' లో వారు మఱొక హెచ్చరికచేయవలసివచ్చినది. "ఉన్నవారు తెల్వియున్న వారగుచు సర్వోదయమ్ము దెసకు నొగ్గరేని, లేనివారు తాల్మిలేని వారగుచుఁ, దీంట్రింపఁగలరు కట్లు త్రెంపగలరు". అయినా పరిస్థితి 'ఆశాజనకంగా మారలేదు. విప్లవాగ్ని వ్యాపించక ముందే మేల్కొనవలసిన వర్గము ధనం మత్తును వదిలించుకోలేదు. తమ సంపదలకు తాము 'ధర్మకర్తల మని' భావించవలసిన వారిలో ఆ భావన పొడసూపలేదు. 'అశాంతిభూత'నర్తనం ఆగలేదు. 'కలవారందఱుకన్నువిప్పు'ట కల్లయని తెల్లమైనది. ఆ మార్గమున ఇక సర్వోదయ సాధన అసాధ్యమని గ్రహించి సంపన్నులకు బోధ మాని పేదలనే ప్రబోధించవలసి వచ్చింది. 'నలువదేండ్లనాఁడు తెలవాఁడు బోటెక్కె.....మీ పొత్తుచాలు వెతలనుత్తరింప' స్వాతంత్ర్యము వచ్చిన 40 ఏళ్ళకు కూడ ధనం కేంద్రీకృతమే కాని వికేంద్రీకృతం కాకపోవటం, దేశంలో అన్ని కొఱతలే కన్పించటం, అకటిమంట చల్లారకపోవటం, నిరుపేదలు ప్రాణములున్న శవమ్ముల వలె తిరగటం కవిగారిని కలవరపెట్టాయి. ఈ దుస్థితిని మార్చటానికి, 'సుకమెల్లరకున్ లభించు' అనుచు ఒక క్రొత్తసూత్రాన్ని ప్రతిపాదించవలసి వచ్చినది. అది కూడా అహింసామార్గాన్ని వీడకుండానే. అందుకే ఇక తప్పదని ఆ పేదలనందఱిని కులమత భేదాలను మఱచి ఏకమై ప్రజాస్వామ్యబద్ధంగా అహింసామార్గాన సాగవలసినదిగా ప్రబోధించారు. ఈ పొత్తు వారికి అధికారపీఠాన్ని కట్టబెట్టే ఓట్ల పొత్తుకు ప్రతీక అని కవిగారి భావం.

తుమ్మలవారికి 25-12-1985న 84సం॥ల వయసు నిండిన సందర్భమును పురస్కరించుకొని విశాఖపట్టణములో వారి సహస్రచంద్ర దర్శనోత్సవమును వైభవముగా నిర్వహించారు అభిమానులు. ఈ సందర్భమున తమ కృతజ్ఞతను వ్యక్తంచేస్తూ కవిగారు 67 పాదముల ఉత్పలమాలికను చెప్పారు తాను వృద్ధుడనైనా తన కవిత ప్రౌఢ అని కవిగారు చెప్పుకొనిన దానికి ఈ మాలిక చక్కని ఉదాహరణము. విశాఖలో పై ఉత్సవాన్ని ఏర్పాటుచేసి శ్రీ యం.వి.వి.యస్. మూర్తిగారి ఔదార్యమును ప్రశంసించే కవిత 'తనివి'. వారు వ్యాపార దక్షులు, విద్యాపోషకులు, సరసులు, సాహిత్యాభిమానులే కాక పోషకులు కూడా. 'విశ్రుతి గనియెన్ విశాఖపురి సుందరవాఙ్మయ తీర్థరాజమై' అన్న కవిగారి మాటలు ఆ పట్టణ సాహిత్య వైభవాన్ని పాఠకుల తలపునకుదెచ్చును. ఇదీ సంపుటీకరణ విషయ పరామర్శ.

ఇక మిగిలినది తుమ్మలవారు కవిత ఎందుకు వ్రాశారు? అది ఎటువంటిది? 'ఈ మేనెంత నలంగిన నా మనుగడ లోకసేవనమ్మున కిడెదన్ సామాజిక కల్యాణము కామించెద నవ్యభవ్యకవితా సృష్టిన్: అని వారే ఒకచోట చెప్పారు. జగన్మంగళము కొఱకే వారు కవిత వ్రాసారు.

'సాధుశీలమాభిజాత్యమ్ము చెలువమ్ము ననసి మెఱయు వనిత నాదు కవిత' ఇత్యాదిగా వారు తమ కవితను గూర్చి 'నేను'లోను ఇతరత్ర ప్రకటించారు. 'ధారాళమైన శయ్య, మాధుర్యముతో గూడిన సౌలభ్యము, తెనుగుదనము తుమ్మలవారి కవితకు ముఖ్యలక్షణము



'చక్కట్లు' కృతిస్వీకర్త

**శ్రీ తాతా వేంకట సుబ్బయ్య**

లని వారి ఆఱవ ప్రాణము శ్రీ నాగళ్ళ గురుప్రసాదరావు గారు సమీక్షించారు తుమ్మలవారి కవితను గూర్చి మౌలికంగా ఇంతకుమించి మఱొకరు చెప్పగలిగినది లేదు.

సార్థకపదప్రయోగాలు తుమ్మలవారి కవితలో తరచుగా కన్పిస్తాయి. ఈ విద్యలో మేటి తిక్కన అని పండితాభిప్రాయము. తుమ్మలవారు అభినవతిక్కన గదా! నార్ల వారు 'పారక చిత్తకుహర తిమిర ప్రకరోద్ధతినణచి లోకబాంధవుఁడై'నాడని వ్రాసిన పట్టున లోకబాంధవ పదము సార్థకముగా ప్రయోగించబడినది. 'కరతలామలకము'ను 'చేతియుసిరికాయ'గా మార్చి తెనుగుదనాన్ని చూపించుట ఎంత ఇష్టమో, వ్యావహారికంలో ప్రాచుర్యము గల 'ఇండియా' వంటి పదాలను స్వీకరించుట కూడా అంతే ఇష్టము వారికి.

తుమ్మలవారి కవితలో శబ్దాలంకారాలు తక్కువ. కాని వారి శబ్దప్రయోగవైచిత్రి విలక్షణమైనది. 'అప్పికట్లకే కాక సమస్తధాత్రికిని కాఁక ఘటిల్లె' వంటి ప్రయోగాలు వారి కవితకు తళుకు గలిగిస్తాయి. ఈ సంపుటములోని పద్యములతో తుమ్మలవారి మొత్తము పద్యముల సంఖ్య 14,000 లకు చేరినది.

'శుచితరవ్యాహార హృద్యాకృతి' అని స్వయంగా అభివర్ణించుకొనిన యీ కృతికి కృతిపతిగా శ్రీతాతా వేంకటసుబ్బయ్యగారిని ఎన్నుకొన్నారు తుమ్మలవారు.

శ్రీ తాతా వేంకటసుబ్బయ్యగారి స్వగ్రామం చందోలు దగ్గఱి బోలాయపాలెం. ఉపాధ్యాయ వృత్తి నవలంబించి ఉన్నత పాఠశాలా ప్రధానోపాధ్యాయులుగా పనిచేశారు. నిరాడంబరులు. గాంధిగారి అభిమానులు. సహస్రమాసజీవులు. నిడుబ్రోలులో తుమ్మలవారితో కలిసి పని చేశారు. నలువది ఎకరాలు భూస్థితిని పిల్లల చదువుల కోసం వెచ్చించారు. వీరి ఇద్దఱు కుమారులు నిడుబ్రోలులో ప్రసిద్ధవైద్యులు. మఱొక కుమారుడు యం.ఎ.; బి.యల్. చదివారు. వేఱొకరు ఐ.ఎ.యస్.లో ఉత్తీర్ణులై ఉన్నత ప్రభుత్వోద్యోగిగా ఉన్నారు. వీరు ఆధ్యాత్మికవిద్యలోని మర్మమెఱిగిన మనీషి, స్థితప్రజ్ఞులు. ఉత్తమ సంస్కారవంతుడైన సహోధ్యాపకుని తన కావ్యాన్ని అంకితమిచ్చి మిత్రబంధాన్ని శాశ్వతం చేసుకొన్నారు తుమ్మలవారు.

తమ తండ్రిగారి కవితా సంపుటికి ముందుమాట వ్రాయటానికి ఏవిధముగాను అర్హతలేని నన్ను ఎన్నుకొనుట తుమ్మలవారి పెద్దబ్బాయి శ్రీ శ్రీనివాసమూర్తిగారికి నామీదగల అభిమానమే కారణము. చేతకాని పని అని తెలిసి కూడ దీనికి నేనంగీకరించుటకు హేతువు స్థిరకీర్తులు, చిరంజీవులు అయిన మహాకవి తుమ్మల సీతారామమూర్తిగారి పేరుతో పాటు నాపేరు కూడా ఈ 'చక్కట్లు'లో ఎక్కగలదను పేరాసయే.

మహాకవి మధుర కవితా రసాస్వాదనా తత్పరులైన రసజ్ఞులను నిస్సారములైన నా యీ మాటలలో ఇంతసేపు అడ్డగించిన నా సాహసాన్ని మన్నింప వేడుకొంటూ ఈ 'ముందు మాటను' ముగిస్తున్నాను.

భట్టిప్రోలు
20-10-1992

ఇట్లు
సూర్యదేవర రవికుమార్

# కృతజ్ఞతలు

"చక్కట్లు" అను కృతిని నా తండ్రి కీ.శే. తుమ్మల సీతారామమూర్తిగారు ముదిమివయసు నందలి బలహీనత వలన ప్రచురించకయే ఈ లోకమును వీడినారు. దీనిని వెలువరించుట నా బాధ్యతగా భావించి అపని నేడు పూర్తి చేసితిని. ఇంతమాత్రముననే తండ్రి ఋణముతీరదు గదా!

ఈ కృతి స్వీకర్త శ్రీ తాతా వేంకటసుబ్బయ్యగారు 'ఉపాధ్యాయులకు ఉపాధ్యాయులు'. సుగుణసంపన్నులు, సత్యాన్వేషులు, ఆదర్శమూర్తులు. ఈ కృతిని స్వీకరించినందులకు వారికి నా భక్తిపూర్వకనమస్కారములు.

ఈ కృతికి నిండుశోభను చేకూర్చుచు విపులమైన పీఠికను వ్రాసి కవిగారిపట్ల కొండంత భక్తిని, నాపట్ల చాల అభిమానమును ప్రదర్శించిన విమర్శక శ్రేష్ఠులు డాక్టర్ శ్రీ సూర్యదేవర రవికుమార్‌గారికి నా కృతజ్ఞతాపూర్వక నమోవాకములు. వారు వృత్తిరీత్యా వైద్యులు, ప్రవృత్తి రీత్యా సాహిత్య పరిశోధకులు. వారి సాహిత్యవిమర్శనావ్యాసములు జగమెఱిగినవే.

ఈ కృతి ముద్రణ సందర్భమున తగిన సలహాలను ఇచ్చుచు నాకు చేదోడు వాదోడుగా నుండిన నా గురువులు పి.బి.యన్.కాలేజి, ఆంధ్రశాఖాధ్యక్షులు శ్రీ తాళ్ళూరి సత్యనారాయణ, M A. గారికి నా వినయపూర్వక నమస్కారములు.

ఈ కృతికి నిర్దుష్టముగా, రమణీయముగా, అచ్చుతప్పులు రానీయక, ముద్రణ యగుటకు అత్యంతశ్రద్ధతో, ఓర్పుతో మిక్కిలి శ్రమించిన 'శాతవాహన చరిత్ర' కృతిపతులును, విశ్రాంత ప్రధానాంధ్రోపాధ్యాయులును అగు 'భాషాప్రవీణ' శ్రీ జొన్నలగడ్డ జానకిరామయ్యగారికి నా వినమ్రతాపూర్వక వందనములు. వారి సౌజన్యము విస్మరింపరానిది.

ఇట్లు
విధేయుడు
**తుమ్మల శ్రీనివాసమూర్తి**
విద్యానగర్ - నిడుబ్రోలు

# అంకితము

శా. తాతా వేంకటసుబ్బయాఖ్యునకు విద్యారాశికిన్ దేశిక
వ్రాత గ్రామణి కీకృతిన్ శుచితరవ్యాహారహృద్యాకృతిన్
జేతోమోద మెలర్పఁగా నుపదఁగా జెల్లించి సంఘర్షమున్
ద్రోతున్ ధర్మపరాయణుల్ సుకవిచంద్రుల్ పెల్లురంజిల్లగన్. 1

చ. ననుఁదనియించె నీతనిగుణంబులు సూనృత ధీరతా దయా
వినయ వితీర్ణిముఖ్యములు విశ్వజనస్తవనోచితమ్ము లీ
యనఘునితోడుతన్ గతిపయాబ్దములొజ్జగ నుంటఁజేసి, నా
మనసిటువంటి సజ్జనులమైత్రి వరించునదౌటఁజేసియున్. 2

ఉ. సంపదనిచ్చి, మెచ్చ ఁదగు చాన నొసంగి, యుదాత్తరీతులన్
బొంపిరివోవు పుత్రులను బుత్రికలన్ దయచేసి వాసిలో
వంపులులేని బంధుహితవర్గముఁగూరిచి, వేల్పు, సుబ్బయన్
బెంపరిగేస్తుఁజేసె నరు పెంచినపుణ్యము రిత్తవోవునే? 3

సీ. ఒకపట్టి న్యాయవాది కదంబకమునఁ బే, ర్వడె మల్లికార్జునవర ప్రసాదు
ఒకపట్టి వైద్యవృత్తికి వన్నెలిడె నుదా, రత బాలకృష్ణవరప్రసాదు
ఒకపట్టి పడసె శస్త్రకలాధిక ప్రవీ, ణత సత్యనారాయణ ప్రసాదు
ఒకపట్టి నేర్చి నేర్చి కలెక్టరై ప్రజా, మాన్యతం గనియె రామప్రసాదు
గీ. చదువునందు, సదాచార సరణియందుఁ, గూఁతులల్లురు యశమందుకొనిరి లెస్స;
గేస్తు లెందఱు కీతృప్తి విస్తరిల్లె? సుబ్బయా: నీదు ధన్యత్వ మబ్బురంబు. 4

చ. అగునగుఁగాని మానవునకైహికసౌఖ్యములెన్ని దక్కినన్
దగిన సుఖంబు 'సోऽహ'మనుదారికి వచ్చిననాఁడె దక్కు; నీ
ప్రగతివశంపడన్ దపముపట్టుమనున్ మనధర్మ; ముత్తముల్
పొగడువిధాన నిప్పనియుఁబూని యణంచితి వింద్రియోద్ధతిన్. 5

గీ. కష్టసుఖముల సమదృష్టిఁ గానఁదగిన, పరమ భాగ్యముగా స్థితప్రజ్ఞ భావ
మెన్నఁడో కల్గె నీ; కిఁక నెఱుకగుట్టు, గోచరించుట చిత్రమా శౌచరాశి! 6

ఆ. నేఁటి తత్త్వవేత్తృ నికరంబునన్ దొలి, గద్దె నలరు యతి జగద్గురుండు
చిక్కె నీకు నదిర! చిన్మయానందుండు, కన్నువిప్ప నొజ్జగా మనస్వి! 7

ఉ. సాదులు భారతీయమగు సంస్కృతికిన్ నినువంటి గేస్తునిన్
మూదలగా వచించెదరు; మోహమునంబడి క్రుంగు వేలయున్
నీదెస మన్ననల్ పంపు; నెచ్చెలి: యెచ్చట దైవసంపదల్
ప్రోడి గనున్ జగంబచటఁ బువ్వులు చల్లుట సాజమే కదా! 8

గీ. కొన్ని మెఱుఁగులు నాపట్ల నున్ననేమి, కరఁగుదున్ నినుఁ జూచి నీసరణిఁ జూచి
హేతువిది కాఁగ సుబ్బయా! యీ కవిత్వ, మంకిత మొనర్తు నీకు; నౌ ననుము చాలు. 9

చ. "నలుగుర మెప్పుగన్న నరు నాకృతికిన్ బతిఁగా నొనర్తు" నన్
పలుకెపుడో వెదల్చితిని; బాములనైనఁ దదుక్తికందగా
నిలిచితి గెల్చితిన్; నియమనిష్ఠలనోర్చితిఁ, గర్మయోగమున్
వలచితి సుబ్బయాఖ్య! ఫలవాంఛ యెఱుంగని కైసరుండనై. 10

క. నీ, నా మడుఁగుం జెలిమికి, నీ నా తలఁపులకు, మాననీయాచార
శ్రీనిరతికిఁ "జక్క" ట్లివి, కానంబడు నానవాలుగా నిఁక సుకృతీ! 11

9-4-1987



# ప్రార్థన

క. నా యర్హతకున్ మించిన, శ్రేయము లిచ్చితివి; తనివి చెందితి; నైనన్
నీ యెడ నా మది నిలువన్, జేయుము పరమేశ! కొసరుచే రుచివచ్చున్. 1

గీ. కళ్ళెమెంత బిగింతునుగాక గతుకు, దారికే క్రేళ్ళువాఱు దెందపు హుమాయి
దేవ! నీవ లగామును దీసికొమ్ము, రమ్ము నా పీంట; కేను సారథ్య మోప. 2

ఆ. సమత కతనఁ జిత్తజవ మాఁగు నందు రీ, కలితనమ్ములేని యలఁతి నేను
హోరుగాలి నాఁప నేరనురా! ప్రభూ!, మ్రొక్కుమంటి నన్నుఁ జక్కఁబఱుపు. 3

ఆ. అల్పతపము తోడ నాంధ్రత్వ, మాంధ్రోక్తి, యగ్గపదదటన్న యఱవగఱువ
నఘవిదూరు ధీరు నప్పయ్య దీక్షితు, నభినుతింతు శంకరావతారు. 4



# చక్కట్లు

క. జననీ జనకుల దుర్దశ, లణఁగారు వలంతియైన యాత్మజుకతనన్
మును వినతనేఁచు నుడిగము, చనదే ఖగరాజు వలన జగమ్రపడన్. 1

గీ. మంచి పనికొగ్గు నతఁడు నమ్రతను విడువ,రాదు; బలి దాతయయ్యు శ్రీరమణు చేయి
క్రిందిదై మీఁది దయ్యె నా కేలటంచు, నెగసిపడి పద్ద త్రొక్కట యేలసెప్పు. 2

ఆ. చాలు నొక్కదిట్ట సాయంపడఁగఁ, జేవ, లేని బంటులేల? వేనవేలు
క్రీడి రాజరాజు కృష్ణుబాసట నెట్లు, కోరి. యెట్టులైరి పోరఁ దుదకు. 3

గీ. ఆత్మగౌరవ సంరక్షణార్థియైన, బిరుదు గురునైన హరునైన సరకు గొనఁడు;
పరశురాముఁడు తన కస్త్రపటుత నొజ్జ, యగును గాక నదీసుతుం డతని నెదిరె. 4

గీ. పాల నీలేదు జోలలు పాడలేదు, కృష్ణుఁ గని దేవకీదేవి యేమి తనిసె?
కనని తల్లి యశోదకే కలిగె సుత సు, ఖంబులెల్ల నదృష్ట మిక్కరణి నుండు. 5

గీ. ఎంత సేయదిసీ! జూద; మంత పరువు, బరువు గల ధర్మజుఁడు దీని బారిఁ జిక్కి
పట్టమహిషిని బణముగాఁ బెట్ట నోర్చెఁ, బలుకనేటికి లాఁతి సంపదల మాట. 6

ఆ. ఎంత నేర్చెఁ గర్ణుఁ, దేను మేనైనను, విడుతుఁగాని కీర్తి విడువ నొల్ల
పేరు లేనివాని బెరయని దుర్దశ, యెద్ది కలదహర్పతీ! యటంచు. 7

ఆ. బ్రహ్మచర్య ధర్మపాలన లేని వి, ద్యార్థి కెమ్మెయిన్ జయంబు దక్కు?
అతఁడు దనమొగమ్ము నద్దానఁ గంటయు, మానవలయు దీక్ష పూనవలయు. 8

ఆ. పొదుగుబరువు తోడ మొదవు దయామూర్తి, లేఁగ కొఱకుఁ బఱచులీల నెఱుకఁ
బండినట్టి గురుఁడు ప్రజకు దాపై పుణ్య, పాపముల తెఱంగు పల్క వలయు. 9

ఆ. నేఁటి గురునిబ్రదుకు నెట్టన రేపటి, తరము నందు వెల్లివిరియుఁ గాన
నొజ్జ శౌచమునకు నోలగమ్మై శిష్యు, సవరచేయ వలయుఁ బవలు రేయి. 10

గీ. కోర్కులుడిగిన వానిని గురుఁడు చుల్క, దిద్దఁగలఁ డమ్మెయి సకాముఁ దేర్పఁ జాలఁ
డెండుకట్టెను మండింప నిడుమ రాదు;, పచ్చి దానిని దరికొల్ప బడలు హెచ్చు. 11

ఆ. అమ్మయందు నయ్యయందును గురునందుఁ, గరుణ గురియు సాధు పురుషునందు
శిశువునందుఁ గలఁడు శివుఁ దభివ్యక్తుఁడై, కనుఁడు ప్రజలు నిర్వికారమతిని. 12

క. తల్లియెడఁ దండ్రియెడ గురు, తల్లజునెడఁ జల్పు నొప్పుదప్పుల నుత్పా
దిల్లెడి సుఖ దుఃఖమ్ముల, కెల్లలు లేవని జనమ్ములెఱుఁగుట వలయున్. 13

ఆ. నేఁడు కుప్పవేయ నిచ్చెనతోఁ బని, లేక పోయె రైతు లోకమునకు;
సంతు పెరిఁగి పెరిఁగి యింతచేసినదయా! శరణ మిఁక మఱొక్క సాధువృత్తి. 14

ఆ. పాఁడిగేదె లైదు, పది కోడిపెట్టలు, చాలు నాలివానిఁ జక్కఁబఱుప;
అనుదినమ్ము వచ్చు నాదాయ మించుక, లేనినాఁడు గెలువలేఁడు కాఁపు. 15

ఆ. కూరగాయలమ్మి బేరి సంసారపుం, గడలి నీఁదె నలఁతి మడుఁగుఁ బోలె;
అప్పడాల నొత్తి కుప్పమ్మ కొనె మిద్దె; కానవలయు జగముఁ గర్షకుండు. 16

ఆ. మిడిసిపడిన కాఁపు మెరకలు పల్లము, లమ్మి యమ్మి దీనుఁడయ్యెఁ దుదకు;
కాసు విలువ గన్న కార్మికులే చుఁడీ; కొన్నవారు వేలు క్రుమ్మరించి. 17

ఆ. వాని వీనిఁ జూచి చేనమ్మి సుతు విద్య, కర్థమెల్ల దులిపె నలఁతిరైతు;
బంటు పనియు రాక పట్టి వెన్నుడె, నేల, విడిచి సాము చేఁత వెఱ్ఱితనము. 18

ఆ. పల్లెటూర మన్ను బంగారుగా మార్పఁ, దగిన యువలు చేని దరికిఁ జనక
తప్పఁ ద్రాగి రేఁగి తందనాల్పాడిన, నేమి పండు నచట లేమిగాక? 19

ఆ. రాజనీతి మెచ్చరానిది, యిది మహిన్, జీల్చుఁగాని కలుప సిద్ధపడదు;
ఇండియాను జీల్చె నీ పిశాచము, కొరి, యాను జీల్చె, జర్మనీని జీల్చె 20

ఆ. భారతోర్వి బాగుపడుట కోరనివారు, భారతోర్వి బాగుపడుట కోరి
యెక్కఁద్రోయుచుందు రీర్ష్యావిధేయుల, గెలుచు ధర్మువన్న పలుకు మఱచి. 21

గీ. లేమి కంటెను విద్యలు లేమి కంటె, నైకమత్యము లేమి ఘోరారి మనకుఁ;
జెడితి మీవైరిచేఁ బెక్కుతడవ; లైనఁ, గానరీనాఁటి పెద్దలు కార్యగతులు. 22

ఆ. కలిమి బలిమి హెచ్చి కన్ను మిన్నెఱుఁగక, నిక్కువానిపొగరు సుక్కడంప
నితరతంత్ర మేల యెన్నిక తొంపిలో, నతని దింపవలయు నదను సూచి. 23

గీ. కులము చూడక, చెలిమికిన్ విలువనీక, చుట్టఱిక మాదరింపక, బట్టునుడుల
కుబ్బితబ్బిబ్బుగాక, యోగ్యుని గణించు, గుండెగలవాని పెత్తనముండుఁ జిరము. 24

ఆ. నరుఁడ! దుఃఖజలధిఁ దరియింప సుకృత ధ, నంబు నిడి శరీరనౌక గొంటి
విది తిరమ్ముగాదు, ఫ్రిదులకమున్నె యొ, డ్డెక్కవోయి! శాంతినేలు కొనఁగ. 25

గీ. నరుఁడు దేహంబ తా నని నమ్మదనుకఁ, గామరోషాది వైరివర్గమునఁ గుములు;
ఆత్మ నే నని తెలిసికొన్నపుడు వాని, కవనియే నందనారామ మగుట నిజము. 26

ఆ. జగము నెల్ల గెలువ సంబరపడువాఁడు, మొదట నింద్రియముల మొత్తవలయు;
జగ మొకండె కాదు సంయామమూర్తికి, లోకువగు నమర్త్యలోకమేని. 27

గీ. పేరుపేరు గడించిన భారతీయ, సంస్కృతికి జీవగఱ్ఱపో! సంయమమ్ము;
మనుజుఁ డేయోగమున కభిమానపడినఁ, జిత్తవిజయమ్ము లేక సంసిద్ధి గనఁడు. 28

గీ. విత్తవంతులతోఁగాదు వెతల నిచ్చ, నలఁగు పేదలతోఁ బొత్తువలయు బోద;
కతఁడు మనసార దీనుల కండయగుట, నేర్వవలయు సంకటపాటు నోర్వవలయు. 29

ఆ. ఏటి నీటి పోటు నెదురు మీను విధానఁ, గామలోభమోహగర్వధాటి
నణఁచువాఁడె యోగి; యతఁడె బ్రహ్మానంద, సుఖమునందు నంద్రు సూరివరులు. 30

గీ. ఎది యెవని కిష్టమో వాని కదియ ధనము; ధనమునకు నిత్యమైన లక్షణము లేదు
వెండి బంగారు నజ్ఞాని విత్త మనును, తత్త్వవేత్త దరిద్రతం దలఁచు సిరిఁగ. 31

ఆ. నేల క్రుంగుఁగాక నింగి వ్రీలును గాక, యబ్ధి లేకరూప మగును గాక
జగతి కెట్టిచెట్ట సంధిల్లుఁగాక వి, రక్తునకు భయప్రసక్తిలేదు. 32

ఆ. ఎంత నేర్చెఁ గర్చెఁ, దేను మేనైనను, విడుతుఁగాని కీర్తి విడువ నొల్ల
పేరు లేనివాని బెరయని దుర్దశ, యెద్ది కలదహర్పతీ! యటంచు. 7

ఆ. బ్రహ్మచర్య ధర్మపాలన లేని వి, ద్యార్థి కెమ్మెయిన్ జయంబు దక్కు?
అతఁడు దనమొగమ్ము నద్దానఁ గంటయు, మానవలయు దీక్ష పూనవలయు. 8

ఆ. పొదుగుబరువు తోడ మొదవు దయామూర్తి, లేఁగ కొఱకుఁ బఱచులీల నెఱకఁ
బండినట్టి గురుఁడు ప్రజకు దాపై పుణ్య, పాపముల తెఱంగు పల్క వలయు. 9

ఆ. నేఁటి గురునిబ్రదుకు నెట్టన రేపటి, తరము నందు వెల్లివిరియుఁ గాన
నొజ్జ శౌచమునకు నోలగమై శిష్య, సవరచేయ వలయుఁ బవలు రేయి. 10

గీ. కోర్కులుడిగిన వానిని గురుఁడు చుల్క, దిద్దఁగలఁ డమ్మెయి సకాముఁ దేర్పఁ జాలఁ
డెండుకట్టెను మండింప నిడుమ రాదు;, పచ్చి దానిని దరికొల్ప బడలు హెచ్చు. 11

ఆ. అమ్మయందు నయ్యయందును గురునందుఁ, గరుణ గురియు సాధు పురుషునందు
శిశువునందుఁ గలఁడు శివుఁ డభివ్యక్తుఁడై, కనుఁడు ప్రజలు నిర్వికారమతిని. 12

క. తల్లియెడఁ దండ్రియెడ గురు, తల్లజునెడఁ జల్పు నొప్పుదప్పుల నుత్పా
దిల్లెడి సుఖ దుఃఖమ్ముల, కెల్లలు లేవని జనమ్ములెఱుఁగుట వలయున్. 13

ఆ. నేఁడు కుప్పవేయ నిచ్చెనతోఁ బని, లేక పోయె రైతు లోకమునకు;
సంతు పెరిఁగి పెరిఁగి యింతచేసినదయా! శరణ మిఁక మఱొక్క సాధువృత్తి. 14

ఆ. పాఁడిగేదె లైదు, పది కోడిపెట్టలు, చాలు నాలివానిఁ జిక్కఁబఱుప;
అనుదినమ్ము వచ్చు నాదాయ మించుక, లేనినాఁడు గెలువలేఁడు కాఁపు. 15

ఆ. కూరగాయలమ్మి బేరి సంసారపుం, గడలి నీఁదె నలఁతి మడుఁగుఁ బోలె;
అప్పడాల నొత్తి కుప్పమ్మ కొనె మిద్దె; కానవలయు జగముఁ గర్షకుండు. 16

ఆ. మిడిసిపడిన కాఁపు మెరకలు పల్లము, లమ్మి యమ్మి దీనుఁడయ్యెఁ దుదకు;
కాసు విలువ గన్న కార్మికులే చుఁడీ; కొన్నవారు వేలు క్రుమ్మరించి. 17

ఆ. వాని వీనిఁ జూచి చేనమ్మి సుతు విద్య, కర్థమెల్ల దులిపె నలఁతిరైతు;
బంటు పనియు రాక పట్టి వెన్బడె, నేల, విడిచి సాము చేఁత వెఱ్ఱితనము. 18

ఆ. పల్లెటూర మన్ను బంగారుగా మార్పఁ, దగిన యువలు చేని దరికిఁ జనక
తప్పఁ ద్రాగి రేఁగి తందనాల్పాడిన, నేమి పండు నచట లేమిగాక? 19

ఆ. రాజనీతి మెచ్చురానిది, యిది మహిన్, జీల్చుఁగాని కలుప సిద్ధపడదు;
ఇండియాను జీల్చె నీ పిశాచము, కొరి, యాను జీల్చె, జర్మనీని జీల్చె 20

ఆ. భారతోర్వి బాగుపడుట కోరనివారు, భారతోర్వి బాగుపడుట కోరి
యెక్కఁద్రోయుచుందు రీర్ష్యావిధేయుల, గెలుచు ధర్మువన్న పలుకు మఱచి. 21

గీ. లేమి కంటెను విద్యలు లేమి కంటె, నైకమత్యము లేమి ఘోరారి మనకుఁ;
జెడిరి మీవైరిచేఁ బెక్కుతడవ; లైనఁ, గానరీనాఁటి పెద్దలు కార్యగతులు. 22

ఆ. కలిమి బలిమి హెచ్చి కన్ను మిన్నెఱుఁగక, నిక్కువానిపొగరు నుక్కడంప
నితరతంత్ర మేల యెన్నిక తొంపిలో, నతని దింపవలయు నదను సూచి. 23

గీ. కులము చూడక, చెలిమికిన్ విలువనీక, చుట్టతిక మాదరింపక, బట్టునుదుల
కుబ్బితబ్బిబ్బుగాక, యోగ్యుని గణించు, గుండెగలవాని పెత్తనముండుఁ జిరము. 24

ఆ. నరుఁడ! దుఃఖజలధిఁ దరియింప సుకృత ధ, నంబు నిది శరీరనౌక గొంటి
విది తిరమ్ముగాదు, ప్రిదులకమున్నె యొ, డ్డెక్కవోయి! శాంతినేలు కొనఁగ. 25

గీ. నరుఁడు దేహంబ తా నని నమ్మునదుకఁ, గామరోషాది వైరివర్గమునఁ గుములు;
ఆత్మ నే నని తెలిసికొన్నపుడు వాని, కవనియే నందనారామ మగుట నిజము. 26

ఆ. జగము నెల్ల గెలువ సంబరపడువాఁడు, మొదట నింద్రియముల మొత్తవలయు;
జగ మొకండె కాదు సంయామమూర్తికి, లోకువగు నమర్త్యలోకమేని. 27

గీ. పేరుపేరు గడించిన భారతీయ, సంస్కృతికి జీవగఱ్ఱపో! సంయమమ్ము;
మనుజుఁ డేయోగమున కభిమానపడినఁ, జిత్తవిజయమ్ము లేక సంసిద్ధి గనఁడు. 28

గీ. విత్తవంతులతోఁగాదు వెతల నిచ్చ, నలఁగు పేదలతోఁ బొత్తువలయు బోఁడ;
కతఁడు మనసార దీనుల కందయగుట, నేర్వవలయు సంకటపాటు నోర్వవలయు. 29

ఆ. ఏటి నీటి పోటు నెదురు మీను విధానఁ, గామలోభమోహగర్వధాటి
నణఁచువాఁడె యోగి; యతఁడె బ్రహ్మానంద, సుఖమునందు నంద్రు సూరివరులు. 30

గీ. ఎది యెవని కిష్టమో వాని కదియ ధనము; ధనమునకు నిత్యమైన లక్షణము లేదు
వెండి బంగారు నజ్ఞాని విత్త మనును, తత్త్వవేత్త దరిద్రతం దలఁచు సిరిఁగ. 31

ఆ. నేల క్రుంగుఁగాక నింగి వ్రీలును గాక, యబ్ధి లేకరూప మగును గాక
జగతి కెట్టిచెట్ట సంధిల్లుఁగాక వి, రక్తునకు భయప్రసక్తిలేదు. 32

ఆ. షష్టిపూర్తి పిదప సాగింపవచ్చులే, జపము తపము తత్త్వచర్చ యనుట
తెలివి లేని వారి తెఱఁగు, ప్రాణమ్ములు; రావియాకు లగుట ప్రాజ్ఞుఁ డెఱుఁగు. 33

క. మనము చదివిన చదువుల, మన గడించు, గద్దియలచాయ కెన్నఁడుం గనఁడు వేల్పు
మనయెడఁద యెంత పండె శమమ్ము దమము, నెంత కన్నార మనియె సమీక్షసేయు.

గీ. ఎడఁద పలుదారులం బరుగెత్తుఁగాక, మేను పోరాదు పోరాదు దానివెంట
నొడలిపై నధికార మేర్పడిన వెనుక, నల్లనల్లన బానిస యగు మనమ్ము. 35

గీ. కొసరి నూతిన యలుఁగైన మొసలిమేన, దిగని చందాన సంసారతృష్ణ విడని
మనిసిచెవిఁ దూఱ దపవర్గ మార్గమర్మ, మెఱుకసేయు విపశ్చి దుత్తరువచస్సు. 36

ఆ. అఖిలజగము హరిమయంబను నమ్మిక, కుదురు టరిది సాధకునకు మొదట
సురభియందుఁ జూచి చూచి విష్ణు నతండు, కొట్టకొసకు జూచుఁ గుక్క యందు. 37

ఆ. సాహునాశ్రయింప సమకట్టునతఁడు త, ద్దాసు నాదరింపఁ దగును మొదట;
హరి యనుగ్రహమ్ము నాసించువాఁడు త, ద్భక్తు నుపచరింపవలయుఁ దొలుత. 38

ఆ. ఎన్నియేండ్లనాఁటి యిరులైన నొక చిన్న, దివియ వెల్గు తాఁకఁ దెరలఁబాఱు
బహుభవార్జితాఘపటలియు రాము క్రే, గంటి చూపొకండు కదియ నడఁగు. 39

ఆ. రాముపేరు చెవికిరా నెవ్వఁ డానంద, బాష్పకలిత గండపాళి యగునొ?
వానికేల సందె వార్చుట మున్నగు, చేఁత? లతఁడు ధన్యతా తరస్వి. 40

ఆ. మనుజుబ్రదుకు భక్తి మయమయ్యెనా? యెట్టి, వెతలనైన నతఁడు విస్మరించు;
చిచ్చునందుఁజొచ్చుఁ; జిఱునవ్వుతో నురి, కంబమెక్కు; హాలహాలంబు మ్రింగు. 41

గీ. జ్ఞానులయ్యు నహంకృతి మానలేని, యతుల వెన్కకు నెట్టి నిరక్షరాస్య
లమలచిత్తులు భక్తియోగానుషక్త, లతివలు గడింత్రు నిశ్రేయసానుభూతి. 42

క. ఒరునిన్ దనవలెఁ జూచును; పరునకు నిడి తాఁ దినున్; స్వపరభేద మెదన్
మఱచును; భక్తుఁడు మతిపై, బరువిడ నొల్లఁడు; కుతర్క పరవాదములన్. 43

గీ. కలవసంఖ్యాత శాస్త్రముల్ కానఁదగిన, దెంతయో కలదాయు వత్యంత చపల
మంచ నీటిని వదలి పాలానుకరణి, నెఱుఁగవలయును మోక్షార్థి యెఱుక నిగ్గు. 44

ఆ. అది యనాత్మ, యాత్మ యిది యను తెల్వితోఁ, దెగు నుదగ్రసంసృతి ప్రబంధ;
మెఱుక యిది గడింపఁ దెవఁడు? వాఁ డెన్నేని, యుగములుండు లంబి యుచ్చునందు.

ఆ. ప్రభువు నగరి నుండఁ బ్రజలకుఁ జోరాది, బాధ లుపశమిల్లు పగిది, నెడఁద
నీశ్వరుండు నిల్చునేని కామాది పీ, డలు తొలంగు నందు రలఘుమతులు. 46

గీ. మదురఁబండిన పిమ్మట మావికాయ, రాలుచందాన, ముక్తికారాట వదెడి
దేహి కధ్యాత్మవిద్య సిద్ధించినంత, సంతరించును గర్మబంధావరుద్ధి. 47

ఆ. చంద్రుఁ డొక్కఁడయ్యు శతరూపములఁ దోఁచు, నక్షిరోగమున్న యట్టి వాని
కాత్మ యొక్కఁడయ్యు నగపడు నజ్ఞతా, శ్లిష్టమతి కనేక జీవులట్లు. 48

గీ. తేటగుల్కెడి జడినీరు చౌటినేల, నంటిన నపేయ మగురీతి ననఘమైన
బ్రహ్మవిద్య దురాత్ముల పాలఁబడిన, వికృతమై సత్యమును వికావికలు సేయు. 49

ఆ. బ్రహ్మనిష్ఠ లేక బహురమ్యముగ నౌప, నిషద మర్మములను నిర్వచించు
కోవిదునకు దవ్వుగావు పుట్టువు చావు, పోదు పోదు వాని బురదబ్రదుకు. 50

ఆ. కలుపు దీయకున్న గరిసె నిండదు, లోభ, మోహ రాగ వైర ముఖ్య రిపుల
మద మడంపకున్న బ్రదుకు పండదు; రహ, స్సిది యెఱుంగువాని కొదవు శాంతి. 51

గీ. భోగవాంఛను, రోగమున్ బుట్టినపుడె, త్రుంపవలెఁగాని పెంపు గావింపరాదు;
పెంపు గావించెనా? వాని బింక మణఁప, లేక నరుఁ డీఁగు దుర్వారశోకతతుల. 52

గీ. రెండుకట్టల నొదిఁగి పాఱెడు జలంబె, నది యగు, నదీత్వ మందిననాఁడె దాని
కబ్ధిసంగమ పారవశ్యము లభించు; సంయమస్థితి హేతువీ సౌఖ్యమునకు. 53

క. కమఠమునకు బలె నింద్రియ, సమితి నణంపన్ నిగుడ్పఁ జాలిన చదుర
గ్గము కావలయున్ నరునకు, సమతాయోగమ్ము నతఁడు సాధింపవలెన్. 54



## తాళ్ళూరి జియ్యరుదాసు

ఉ. దైవము పౌరుషమ్ము శుభదాయకమై భవదీయగౌరవ
శ్రీవిభవమ్ములన్ బెనుపుసేయ శతాధికవర్షజీవన
ప్రావహదాత్మ సంయమవిభావళితో జగదీడిత ప్రజా
సేవనరక్తితో మనుము జియ్యరుదాస! సభల్ సెబాసనన్. 1

చ. అఱువదియేండ్లు నీ బ్రదుకునందు గతించిన నేఁడు బాపుజీ
సురుచిరమూర్తి నీయెదఁద జొంపపుమల్లియ, నీదుపల్లియన్
మెఱయుట మేలిచేఁత; యిది మేరలు దప్పినవారి పాలికిన్
గురువగుఁగాక ధర్మమునకున్ నెలవేర్పడుఁగాక యిమ్మహిన్. 2

చ. హరిజనుఁ జేసె నిన్ను భవదభ్యుదయమ్మునకై నిరంతర
త్వరఁబయనించె; హైందవమతమ్ము సమూలముగా నశించినన్
వెఱవను గాని మాలదెస వేఱిమిసైఁపను దీనిఁద్రోయఁగన్
మరణమునైనసైఁతును జుమా! యని నిల్చె మహాత్ముఁడద్రియై. 3

ఆ. హరిజన ప్రవేశ మంగీకరించిన, తెనుఁగునాట మొదటిదేవళమ్ము
కానిపించె నపుడె కావూర మాయూరఁ, దెఱచె నది సబర్మతీ మహర్షి. 4

క. తగు నస్పృశ్యత యనఁగన్, జగద్గురువులైన నేఁడు చాలరయారే!
భగవానుఁ డెవఁడు? ధర్మ, ప్రగతి కుపాదానమైన బాపూ తక్కన్? 5

ఉ. జియ్యరుదాస! గాంధికి రుచించిన ధర్మువుగాక నెయ్యమున్
దియ్యముగూర్చి లోకమునుదిద్దుట కెద్ధియుఁజాల; దీర్వ్యలన్
వ్రయ్యలువ్రయ్యలై యడుగువట్టిన తమ్ములనుద్ధరించుచున్
దయ్యఁగదోయి! నీమనుగడన్ బ్రజలందఱు నాదరింపఁగన్. 6

చ. బ్రదికినఁ జాలునా? నరుడు; పాడికి నూడిగమాచరించుచున్
బ్రదికిననాఁడె తద్భవము పండును నిండును వానికీర్తియున్
కదలిన యర్వదేండ్లఁ గని కందక రాఁగల యర్వదేండ్లతో
మదిమదినందవోయి! పలుమాటలు నీదెసఁ జెప్పనేటికిన్? 7

క. చదివితివి, రాచసిరిగల, పదవుల నందితివి; సుకవిపండితమైత్రిన్
గుదిరితివి; సాధుసంస్కృతి, పొదలెడి మండలము నందుఁ బుట్టితి వన్నా! 8

ఉ. తాతలనాఁటి నుండి శుచితామయజీవన మాసచేసి వి
ఖ్యాతి గడించె నీకుదురు! గాంధి నినుంగని వెల్లఁబాఱి సం
ప్రీతమనస్కుడై తెనుఁగుపేఁటలబాటలఁ ద్రిప్పెనిన్ను దద్
జ్యోతికి నంజలించి మహసుందరతన్ గనుమయ్యజియ్యరూ! 9

16–4–1970

# భారతీయుఁడు

క. తినుటకుఁ ద్రాగుట కెపుడున్, గనుమూఁతలతోడఁ గుంభకర్ణుని కరణిన్
మనుటకును భారతీయుఁడు, జనియింపం డితరజాతిజనుఁ డెట్లున్నన్. 1

చ. ఇహసుఖలాలసావివశుఁడెండిన క్రుళ్ళిన యెంపముక్కకై
తహతహలాడు కుర్కురముతమ్ముఁడునాఁడగు, దగ్ధకాముఁడి
మ్మహికి ననారతంబుగ సమాదరణీయుఁడు సత్యవాక్యధూ
ర్వహనవిశిష్టశీలుఁడభిరాముఁడురాముఁడుపుణ్యధాముఁడున్ 2

సీ. షడ్రసాపూర్ణ భోజనభాజనము రోసి, కందమూలమ్ములఁ గడుపునింపి
మిన్నంటు మేడలమీఁదిమోహము వీడి, పర్ణకుటీరమ్ము పంచ నొదిఁగి
తినఁబోవునోగిరంబును మానుకొని క్షుధా, పరిపీడితునకు నర్పణమొనర్చి
చెలువంబు తొలఁకాడు వలిపమ్ము కాదని, ముదుగుమూరెఁడుగుడ్డ మొలకుఁజుట్టి
గీ. నవసి చచ్చిన దైహికానందమందు, నుదితమైన యాత్మానంద మూర్వికెల్లఁ
బంచిపెట్టె నఖండంబు పావనంబు, భారతీయుండు వితరణపండితుండు. 3

మ. జననమరణముల్ సుహృదహితులు, ధనస్వామి నిస్స్వకులు,
వనితాపురుషులు, శీతాతపమ్ములు, వాఁడు వీఁడనెడి
పెనుజంట తెగులు పోకార్ప నోపిన భిషగ్రియుండు
జనియించె భారతక్షోణి నద్వైతసౌధ నిశ్రేణి 4

సీ. పరిశుష్కదేహుఁడై బడలినవా దయ్యు, నందఱకంటెఁ దా ముందు నడిచె
ఊఁతగా నొకకఱ్ఱ నూనినవాఁడయ్యు, నఖిలజగత్తున కండయయ్యె
అపరిగ్రహవ్రతం బానినవాఁడయ్యు, నిత్యపూర్ణస్థితి నెగడనేర్చె
అస్త్రశస్త్రమ్ముల కవ్వలివాఁడయ్యుఁ, గవ్వించు వైరివర్గమును గెలిచె
ఆ. నెతఁ డతండు పుట్టె నీ పుణ్యభూమి ను, ద్వేలమైన యార్షతేజ మలర
మర్త్యుఁ డయ్యు నతఁడమర్త్యుఁడు, భవియయ్యు నభవుఁడతఁ డహో! మహాత్ముఁ డతఁడు.

సీ. ఆర్తసేవా పరాయణత పొంగులు వాఱ, నాలుబిడ్డలను రాజ్యమును దొఱఁగి
రక్తసిక్తంబైన రాకాసిబ్రదుకును, గన్నీటి ధారతోఁ గడిగి కడిగి
అనవద్యమగు ప్రణయమున కభిజ్ఞులు, మురియఁగా నక్షరమూర్తి నొసఁగి
ధీరత్వమున నసిధారావ్రతం బనం, గ నెసంగు కర్మయోగమును మరగి
ఆ. యొక మహాప్రవక్త, యొకమహీవల్లభుఁ, డొక కవిప్రకాండుఁ, డొకమహాత్ముఁ
డుద్భవించెనా మహోనిధు లెందఱో, పుట్టినారు భరతభూమి యందు. 6

## శరత్తు

ఆ. సన్న యెండ, లేఁతచలి, ముగ్గబాతిన, వరిపొలాలు, పూచి వలచు కంది;
కొదవ లేని పాఁడి యొదవి శరత్తునఁ, బడసెఁ గ్రొత్తసొరు పల్లెటూరు. 1

ఆ. ప్రిదిలి ప్రిదిలి పీఁచు పీఁచైన మేఘంబు, తెల్లమొగము వైచె నల్లనల్ల;
చెఱువు నీటి కేగు తెరువు నిష్పంకమై, పేదవాని చాన పీడ వదలె. 2

గీ. మావులం బన్ని పట్టిన మత్స్యతతిని, సారె సారెకు నెగురు మీసాలరొయ్య
మిడిసిపాటున కేనాదిపడుచు జంట, పాప! మిది కానదెగ్గని బాధ గుడిచె. 3

గీ. కూటువలుగట్టి కాలువనీటి నీఁత, గొట్టుచున్నారు పసి గాచు కుఱ్ఱవాండ్రు;
మేరలను ద్రోసి గట్లపై మినుము మేసి, కోడెదూడలు పోరాడెఁ గొమ్ము లదర. 4

ఆ. కార్తికాభిషేక ఘంటారవమ్ములు, సందడించె శివుని మందిరమున;
ముసలివారి కంటె ముందుగా నచటికి, సాగిరర్భకుల్ ప్రసాదమునకు. 5

12-11-75



## కొత్త రాజబాబయ్య

గీ. సత్యమును నేర్పె, ధర్మసంసక్తి నేర్పె, వీటిఁబోవు టెఱుంగని విద్య నేర్పె;
నితఁడు నేర్పని విన్నాణ మెద్ది బుడుత?, కోజలకు నోజ యయ్యెఁబో! రాజబాబు. 1

ఉ. ఛాత్రుఁడు విద్యలో బ్రదుకుచందములో గణనీయుఁడై యశః
పాత్రత గాంచుటెట్టులను భావనతో నితఁడద్దిరా! పగల్
రాత్రియు విస్మరించి పలురాపులు సైఁచి కృతార్థుఁడై సభా
స్తోత్రములందెఁ బామరులు సోమరులున్ గనువిప్పునం బడన్. 2

ఆ. నిప్పువంటి నడత, నెఱవణి గలనేర్పు, కష్టసుఖ సమీక్ష గనని దీక్ష
రాజబాబయాఖ్య నాజానజము లౌట, దేశమున కితండు దీప్తి దెచ్చె. 3

చ. గురుఁడొకయోగమూర్తియయి కుఱ్ఱలదిద్దిననాఁడె దేశపుం
గరిమము హెచ్చు, జాతికివికాసము చేకుఱు, నెన్ని చట్టముల్
పఱపిన, నెన్ని కావ్యములువల్కిన, వీనియొసంగు వెల్గు, స
ద్గురుఁడుఘటించు తేజమునకున్ సరితూఁగమి నిక్కమేకదా! 4

క. అంతేవాసి హృదంతర, సంతమసచ్ఛేత్తృ, ధీప్రసాధను, మోహ
భ్రాంతి దవిష్ఠుని, సుకృత ని, శాంతుని, శాంతుని దలంత్రు సజ్జను లొజ్జన్. 5

7-6-1976

# మట్టి చెన్నారెడ్డి

చ. అఱువదియేండ్లకేమి శతహాయనముల్ మహనీయపీఠముల్
పరమసుఖమ్ములున్ గనుచు భారతదీప్తికి నంధ్రకీర్తికిన్
మెఱుఁగులుదిద్దుచున్ జనసమీహితధర్మభరమ్ము నోర్చుచున్
సరస కవిప్రశంసల నెసంగుము మట్టికులైకభూషణా! 1

చ. కటకమునుండి కంచిదనుకన్ నిఖిలాంధ్రము తావకాన్వయుల్
పటుతరదీక్ష సర్వజనభావుకసాధకదృష్టినేలి దిక్
తటముల నింపినారు కవితామయముల్ జయగాథ; లమ్మహో
ద్భటులఁ దలంతు మిద్ధగుణభద్రు నినున్ దిలకించుపట్టునన్. 2

చ. నలఁగి నలంగి తెచ్చుకొనినారము నిన్న సమగ్రరాష్ట్ర; మీ
కలిమిని జీల్చుటొప్పునను కర్ణకఠోరనినాదముల్ బయల్
వెలలె నదేమి? నేఁ;డిది వివేకముగాదని చాటి నెయ్యముల్
నిలుపుము; జాతివైభవము నిల్పుము; నిల్పుము తెల్గుతేజమున్. 3

చ. "పొరపులుపోరులున్మఱచి పూనుఁదుకర్జము నెందఱోదొరల్
చిఱుకిఱుముక్కచెక్కలుగఁ జేసినగడ్డకు నొక్కయేల్బడిన్
మెఱవణిగూర్పుఁడన్న"! లని మేనికవోష్ణపునేత్రుతోఁగృతుల్
పఱపినవాఁడనౌట నిటుపల్కెద డెందము కొందలింపఁగన్. 4

ఉ. గంగనుగౌతమిన్గలుపుకాల మదెప్పుడొకాని గౌతమీ
తుంగతరంగ సహ్యసుతతోడను గృష్ణతరంగ పెన్నతో
సంగడిసేయునట్లు కృషిసల్పుము; కార్మికహాలిక ప్రజా
మంగళదాతవై మనుము మంత్రిమణీ! సకలార్థసారణీ! 5

- 20-11-78



# కృష్ణానది

గీ. తల్లి! కృష్ణానదీ! భవత్తటమునందె, మ్రోసె నాంధ్రపతాక మున్మొదటిదెగసి
తెనుఁగు నావలు నీదు దీవనలు పడసి, యెత్తెఁ దెరచాఁప, దీవులనెల్ల నొత్తె. 1

ఆ. సుకృతఖనివి నీవు; సకలభూముల వారి, యర్చలందు మల్లికార్జునుండు,
కనకదుర్గ నీకు గాదిలి చుట్టముల్; నతసమాజ! సహ్యనగతనూజ! 2

గీ. నీవు కరుణానిధివి కాన నీతటమ్ము, లాశ్రయము లయ్యె బౌద్ధవిహారములకు;
సుగతసంస్కృతి నిపుడేని పగటు నిచటి, జనత; పున్నెపుదొంతి! కృష్ణాస్రవంతి! 3

ఆ. వాసిరెడ్డివారు నీ సన్నిధిన్ బ్రజ, నేలునాఁడు లోకహితము నెంచి
విడుచు దానధార వడకారు నందేని, నింపె నీకు వఱద సొంపు కృష్ణ! 4

ఆ. నిన్ను దుర్గవీట నిలిపి తల్లి! వేఁగి, నాటినుండి కమ్మనాటి దనుక
జీవనార్తి నుడిపె నేవిఙ్ఞఁడా దయా, పేటి కేటికోళ్ళు "కాటను"నకు. 5

25-8-1980



## గోగినేని లక్ష్మీనారాయణ

క. హే! లక్ష్మీనారాయణ!, యేలా సశరీరయాత్ర నిస్సీ! యనఁగం
జాలితివి బంధుమిత్రుల, యాలుంబిడ్డల యెడంద లలమటఁ జిక్కన్? 1

గీ. ఔను నీతప్పు లేదులే! దాన ధర్మ, సత్య సౌహార్ద నమ్రతా శౌచరోచి
రుజ్జ్వలం బగువేళ నీ వుద్భవించి, యెదిగితివి సాధుశీల సంపదల తోడ. 2

గీ. తెల్లవాని నెదిరితివి సబర్మతి యతి, యిడిన హేతితో నహింస తోడ;
నరకకల్పమైన చెఱసాల నిల్చితి, వలరుఁదోఁట నిల్చినట్లు వలఁతి! 3

క. వదవులకుఁ జదువు లమ్మక, పదుగుర్కై లెస్స గాసిపడితివి; ప్రఙ్ఞా
నిధి యంగీకృత జనతా, భ్యుదయుఁడు రంగాకుఁ దగిన సోదరుఁదవుగన్. 4

క. గాడిదలకు గుఱ్ఱములకుఁ, దేడా కన్పింపనట్టి దినముల, సిరియే
తేఁదగు దినముల బ్రతుకుట, కూడదని తలంచి చేరుకొంటివి పరమున్. 5

18-6-81



## బాపూజయంతి

క. నీ పుట్టినదిన మనుచున్, పాపంబుల నుక్కడంచు పర్వం బనుచున్
మాప్రజలు నేఁడు పొంగరు, బాపూ! నిను మఱచినారు పల్లెలవారున్. 1

ఆ. అర్థకామములకు నారాటపడుట మా, కహరహమ్ము కృత్యమాయె గాంధి!
పాపములకు నేఁడు భయపడమేము, ని, యామకుందు నహి మహాత్మ! మాకు. 2

ఆ. భ్రాంది లేని విందు పాటింపమేము, మా, కనులు నగ్ననాట్యమునకు వార్చు;
ఒంటి నేగుచున్న యువతిని మన్నించు, తలంపు లేదు మాకుఁ దండ్రి! నేఁడు. 3

ఆ. తోఁటకూరకాడఁ ద్రుంచిన చందానఁ, గోయఁగలము నరుని కుతుక నేము
చెప్పనేల? మాకుఁ జీఁకటి బేరంబు, తలఁగరాని పరమధర్మ మనుచు. 4

క. ఏ నోరు పెట్టుకొని మా, యీనేరమి సైఁపు మందు? మీవు కృపా సం
స్థానమవను నమ్మికతో, మా నతులర్పింతు మార్తమానవబంధూ! 5

18-9-81



## పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి

ఆ. బ్రహ్మవిద్యగుట్టు పామరజనకోటి, చేతి యుసిరికాయఁ జేసి చేసి
నతులు నుతులు గన్న నవభారతమహర్షి, వీరగురునివెల్గు వెలయు సతము. 1

ఆ. మతము కులము లేని మానవతావాద, మాదరించె నిమ్మహాశయుండు;
కన్నువిచ్చె నితని తిన్నని పల్కుతోఁ, గొలఁదిలేనిజడతఁ గుందు వెలఁది. 2

ఆ. అంటరానితనము గెంటనిచో జాతి, బాగుపడదు; దీని యోగు సెడదు;
తమ్ములార! లెండు! ధర్మానుసారులై, నడుపుఁ దనియె నిమ్మనస్విమౌళి. 3

క. నా యందుఁ గలదు బ్రహ్మము; నీ యందున్ గలదు; జగము నిఖిలము బ్రహ్మ
శ్రీయుతమే యని చాటిన, ధీయుతు నీపోతులూరి దేశికు నెంతున్. 4

గీ. తత్త్వవేత్తల బోధనద్రఢిమఁ గాక, సాంఘికక్రాంతి రాదు శాసనముకతన;
పుట్టె నీ కోవలో నాఁడు పోతులూరి; అవతరించెను నేఁడు మహాత్మగాంధి. 5

5-3-84



## కాకరపర్తి వెంకటేశ్వర్లు

క. సారస్వత సేవారతి, సారాచారప్రయుక్తి, జతగా సహజో
దారత నస్మత్ కృతిసభ, భారము సైరించి మెప్పుఁ బడసితి, నేస్తీ! 1

గీ. వేంకటేశ్వర! సాహితీవేత్త లెసఁగు, కొలువునఁ "గదంబకైత" కగ్గలిక గూర్చి
కృతిపతికి, నాకు, నెనలేనితృప్తి నిడితి; వింతచేసియు వినయ, మావంత విడవు. 2

క. నీవంటి సచ్చరిత్రుని, నావానిం జేయఁజాలె నా చంద మెదో;
కేవల సత్యము లీనుదు లీ వెపుడో నన్నుఁ గంటి; వేలా వ్యాఖ్యల్? 3

క. పదుగుర సంతుష్టింగని, ముదమందెద వీవు లోకమోహనగుణ మి
య్యది నీకు నైకశుభములఁ, గదియింపన్ మనుము చిరము! కాకరపర్తి! 4

25-4-84



## ఇందిరాగాంధి

క. ఇందిర, నిశితమనీషా, మందిర, నిజదేశ విజయ మమతా లబ్ధా
స్పంద యశస్సుందర, దివి, కిం దరలుట సైఁపరాని కీడీ మహికిన్. 1

ఆ. అవనతంబులాయె నఖిల ప్రపంచ ప, తాకలెల్ల నీమె పోక తోఁద;
ఈదు లేని పేర్మి కిమ్ముగా నిమ్మెయి, మన్నమంత్రు లెంతమంది కలరు? 2

క. పేదతికమునకు దవ్వయి, యీదేశము వెలయ వలయు నిది నా లక్ష్యం
బాదిమవాంఛిత మని యీ, సోదరి నుతులందెఁ గార్యశూరత్వమునన్. 3

ఆ. తండ్రి జగము నేలెఁ; దాత మాతృమహీ స్వ, తంత్రతారధానఁ దనువుఁ బాసె;
ఇంటి తావి జీవికంటితీరు నటన్న, వాణి కిందిరమ్మరాణ సాక్షి. 4

గీ. పిఱికిపందలకరణిఁ జంపిరి చెనంటు, లిమ్మహామహిళామణిన్ హ్రీ దొఱంగి
వీరనారీమతల్లిగా వీడె నుసులు, సురిఁగె నిందిర శాశ్వతజ్యోతి యందు. 5

7-11-84



## అమరేశ్వరీ!

చ. శ్రుతులు ఋషుల్ మహాకవులు సూనృతవాదులు ధేనువుల్ పతి
వ్రతలు వదాన్యతారతు లవారణవత్సలతాసమగ్రలై
సతత జయమ్ము నీ కొసఁగ సర్వజనస్తవనార్హవై ప్రజా
హితనయరక్షసేయు మమరేశ్వరి! విశ్వము మేలు మేలనన్. 1

గీ. నీవు హైకోర్టుజడ్జివై, నిన్నుఁ గన్న, యప్పికట్లకుఁ గాక సర్వాంధ్రమునకు
సకల భారతమునకు యశస్సు నిడితి, విట్టి నిను మెచ్చి పడసెదమేము తృప్తి. 2

గీ. హస్తిపురధర్మపీఠమందధివసించు, యోగమున్నది నీకు, నత్యుక్తి గాదు,
ఎచట నే గద్దెపై నున్న నీవు మమ్ము, విస్మరింపకు వైదుషీ విభవధన్య! 3

చ. అతివలపెంపు దేశమునకాయువుపట్టని, తల్లితీరు సం
తతికి నవశ్య మబ్బునని, నాతి వికాసము దేశగౌరవో
న్నతికిఁబ్రధానహేతువని నమ్మి శ్రమింతుము మేము; మాకు నీ
కతమునఁ బుష్టి తుష్టియును గల్గునుగాక నిరంతరమ్ముగన్. 4

20-1-85



## కులము

ఆ. పెద్దకులమువారి దిద్దినారెందఱో, పిన్నకులమువారు కన్నువిప్పి;
కులము కల్పితంబు, కులమునకున్ జెప్పు, లక్షణములు నిశ్చలములుగావు. 1

క. చెడ్డపని చేఁతకున్ గుల, మడ్డమురా; దెవ్వఁడైన నర్థాదికి లో
పడ్డ తతిఁ బతితుఁడగు; నిది, యెడ్డె యెఱుంగక జగంబిసీ! యన వదరున్. 2

క. కులములతో నీర్ష్యాదులు, బలసెన్, స్వార్థ ప్రసక్తి పైకొనెఁ, గుట్రల్
తలకొనె నరునకు; నిక్కము, పలుకంగలచేవ జాతి పాపము పండెన్. 3

క. లచ్చన్న గద్దెకెక్కిన, బుచ్చన్న సహింపఁ డితఁడు పొగడికఁ గనుచో
నచ్చన్న కుములుఁ, గులములు, తెచ్చిన వేఱడము లివ్విధిన్ మహి నేఁచున్. 4

మార్చి 1985



## నార్ల వేంకటేశ్వరరావు

ఆ. నార్ల కన్నుమూసినాఁడట కటకటా!, జోదులేని తెల్గుజోదితండు
నిప్పువంటి బ్రతుకు నేర్చిన వాఁడౌటఁ, గత్తివంటి కలము నెత్తనోపె. 1

ఆ. కొంకు బెంకు లేక కొమ్ములు దిరిగిన, మేటి దోసమైనఁ జాటె నితఁడు;
సాధుశీలమూర్తి సామాన్యుఁ డైనను, మింటికెత్తె నతని మెచ్చి మెచ్చి. 2

ఆ. వెచ్చ పెట్టఁడయ్యె విత్తమీతఁడు తన, భోగమునకు, నింతిభూషలకును;
కాసులెల్ల వాణి కరుణకే చెల్లించి, సాహితీ జగత్ ప్రశంస వడసె. 3

ఆ. ఇతఁడు పల్లెటూర నేర్వోకపండువు, నాదరించునింట నవతరింప
నోఁచెఁ గానఁ దెనుఁగునుడి తీరుతీయనల్, మెఱయఁగల్గె నొరులు వెలుఁగునంద. 4

క. ఒక కావ్యముగా సంపా, దక రచన మొనర్చి ధన్యతరుఁ డీతఁడు పా
ఠకచిత్తకుహర తిమిర, ప్రకరోద్ధతి నణఁచి లోకబాంధవుఁడయ్యెన్. 5

2-7-85



# గాంధి దర్శనము

ఆ. చెత్తపరక మేసి దుత్తెఁడు పాలిచ్చి, బీడు దున్ని బ్రదుకఁ గోడె నిచ్చి
పరున కీవి నేర్పు సురభిలో మోహన, దాసు నా కొసంగు దర్శనంబు. 1

ఆ. విరతిలేనిదీక్ష నురుఁగు గ్రక్కుచుఁ బరు, గెత్తి యెత్తి పొలము లెల్లఁ దడిపి
ప్రాణికోటి కన్న పానమ్ము లిడు నదీ, మాతలో మహాత్ముఁ జూతు నేను. 2

ఆ. తిట్లు సైఁచి తిరిసి తెచ్చిన కూడెల్లఁ, జంట వెంట నున్న సంతు మెసవ
రిత్తపొట్ట తోడ నత్తమిల్లిన బిచ్చ, గత్తె యందుఁ గందు గాంధి నేను. 3

గీ. "నాన్న లేఁడని చెప్పుమన్నాఁ" డటంచుఁ, బంచలో నున్న యర్థితోఁ బలుకునట్టి
కల్లకంపునఁ బడనట్టి పిల్లవాని, వాణిలో నాకు బాపుజీ కానిపించు. 4

ఆ. పౌరలు దేశభక్తిఁ జెఱ కేగి పురుగుల, పులుసు త్రాగి వెతల బ్రుంగి బ్రుంగి
యేలువార లిచ్చు భృతి కాసచేయని, పేద యందు జాతిపితను గందు. 5

క. హరిజనునకుఁ గన్నియ నిడి, వరణీయచరిత్రుఁ డైన వసుధామర శే
ఖరులో, విశ్వప్రియతా, ఝరిలోఁ గస్తూరిమగని సందర్శింతున్. 6

గీ. మట్టితట్టలు మోసి చెమ్మటలు గురిసి, గాసిపడు పేద నోదార్పఁ గదలివచ్చు
మలయ పవనమ్ములో సబర్మతిమహర్షి, కృపను, గూర్మిని గని పులకింతు నేను. 7

క. రూకల కమ్ముడు పోవక, యాఁకలి నిద్దురయుఁ గాన కార్తసమాజ
శ్రీకై కృతులు సృజించు మ, హాకవిలోఁ జూతు గాంధి నఘపరిపంథిన్. 8

8-8-85



# యార్లగడ్డ వేంకటసుబ్బారావు

ఉ. పండిత పట్టమున్ బడసి, పట్టము వాసికి వన్నెదెచ్చు ను
ద్దండవిపశ్చితుల్ క్షితి శతంబున కిర్వురొ లేక ముగ్వురో
యుండెద; రిట్టిదిట్టలకు నొజ్జగ వేంకట సుబ్బరావహో!
పండె నఖండకీర్తుల సభల్ జయపెట్ట మహేంద్రవీథులన్. 1

ఉ. వేంకటసుబ్బరావు సుకవిత్వమునన్ గణనీయుఁ డయ్యె నే
శంకకుఁ జిక్కినాఁడొ? తెరచాటుననే కృతికన్య నుంచె; నీ
[1]యంకిలి మానునట్లు సకలావనియున్ దనివోవ శారదా
కింకిణి మ్రోయునట్లు కృషికిన్ సమకట్టుఁడు మిత్రబాంధవుల్. 2

ఉ. ఈతఁడు రాజకీయగతి కేగనిచోఁ గవితా కళా రమా
నూతనరత్నహారము లనూనముగా సృజియించియుండుఁగా
నీ! తనవెల్గులాసరణి నిండినచీఁకటులన్ [2]దొలంచుటన్
జేతము కొంతతేఱుకొన సిద్ధమగున్ ననువంటి వానికిన్. 3

ఉ. నిక్కముగాక యొండునుడినేరఁడు, కార్యములైన కర్మముల్
తక్కఁడుసుబ్బరావు; ధృతి,దాతృత,వీడఁ, దహంతకింతయున్
మక్కువచూపఁ, డీవిబుధమౌళికి నబ్బిన మేటితీరుసో
రెక్కడిదన్న నీతఁడుదయించిన వంశమొసంగినట్టిదే! 4

గీ. సుతుఁడుగా, నన్నగా, గృహస్థుఁడుగ, నాప్త; జనుఁడు, పౌరుఁడుగా, విశ్వజనహితమ్ము
నెంచు మనుజుండుగా నేతదేర్లగడ్డ, కోవిదుఁడు కన్న పేర్మికిం గొలఁది కలదె? 5

1 అంకిలి = అడ్డు, 2 తొలుచు = తొలగించు

25-9-85



# కృతజ్ఞత

ఉ. శ్రీయుత! వీరవేంకట విశిష్టపదద్వయపూర్వ సత్యనా
రాయణమూర్తినామ! సుపథాగత సుస్థిర కీర్తిధామ! జా
తీయవికాసముకమతిస్తుతిపాత్రుల భవ్యకావ్య కృ
న్నాయకులన్ మనీషుల మనస్వివరేణ్యులఁజేర్చి యీజగ
ద్గేయ సరస్వతీ రుచిర గేహమునందు, విశాఖ దేవ సం

స్త్యాయమునందపూర్వసవనామల శోభలు చిత్తరంజక
చ్ఛాయలు సందడించు పరిషత్తును గూర్చి తనర్చి మన్గదన్
వేయినెలల్ కృతంపడినవృద్ధతయున్ గృతిగూర్చు నేర్మియున్
నాయెదనుంట వీని కభినందనముల్ పచరించి యంచితో
పాయనమిచ్చి నన్ దనిపి బల్లిదుఁ జేసిన మిమ్ము, మీ కిటన్
సాయమొనర్చ నియ్యకొని సంతతదీక్ష వహించి సౌఖ్యమా!
హో! యనినట్టి శ్రీ బసవపున్నయముఖ్యులఁజూచి యేచి, వా
లాయముగా సదస్సునుతులన్ నెఱపెన్, గృతులిట్టిరుంటచేఁ
బాయదు సాహితీ రమను బ్రాక్తనగౌరవ మిప్పుడే ననెన్,
న్యాయము నిచ్చగెల్చుననె, నన్నిది లెస్స కరంచెఁగాని ప్రా
బాయితధర్మ! విద్వదధినాథులు, కావ్యకళానిధుల్ ననున్
నేయము తీయమున్ బఱపి నేఁడు కడున్ గొనియాటఁ జూచి గ
ర్వాయతనమ్ముఁగా; నిది యుదారతగా మది నెంతు, ధర్మ ని
ర్ణాయకమౌళి సాంబశివరావునుబోని వలంతు లెందఱో
చేయుపొగడ్త నన్ వినతుఁ జేయును, నల్వదియెన్మిదేండ్లుగా
నాయెడ నీయెదన్ దెలుఁగు లంచితబుద్ధులు నన్ను బిల్చి గాం
గేయమయాభిషేకముఖకీర్తితగౌరవముల్ ఘటించి మేల్!
మాయురె! యంచు మత్కవనమార్గము, జీవనపద్యమెచ్చి, రీ
తోయపుమన్ననల్ తనకుఁ దొల్లిటిపున్నె మొసంగు పంటగా
నా యెదనెంతుఁగాని యివి నా పస కీఁదగు కాన్కలంచు మో
హాయతికియ్యసేయ, జగమౌనని మెచ్చు కొలంది మానవ
శ్రేయముగూర్చు కైతలు సృజింపఁబెనంగుదు, నింతవృద్ధతన్
బ్రోయుచు నస్సురుస్సురని మూల్గుచు నుండియుఁ గైత మాన, నా
యాయువుసర్వమిప్పునికి నప్పనచేసితి, మందు బ్రాఁకులన్
నా యలఁతల్ వెతల్‌చన, వనాథ విపత్తినొ, కాఁపు ముప్పునో
రేయి పగల్ ప్రజాళి నెదిరించి సిరింగొను లంచగొండి చ
ట్రాయితనంబునో, కులమురక్కసి రక్కెస పట్టు చెట్టనో
వ్రాయఁగడంగినంత, నవి వారక పేరెము వెట్టు, సమ్మద
శ్రీయిలుగా నగున్‌మది, ప్రసిద్ధులు నన్నయతిక్కనాదికుల్
పోయినబాటలో నెనరుప్రోవులు నేరిమి దీవులౌనుపా
ధ్యాయులు తాడెపల్లి సదనాప్పయశాస్త్రి, దువూరి సూరి, మా
నాయన నారయాహ్వాయుఁడు నాకెతిఁగించిన విద్యలో జగం

బీయకొానన్ రచించితి, ననేక కృతుల్, నిజదేశ మీశ్వర
ప్రాయముగా భజించితిని, బాపు చరిత్రము విశ్వమానవ
ధ్యేయముగాఁ దలంచి నెఱతెల్గునఁ బద్యముగా సృజించితిన్
కోయిలనై ప్రజల్ కెరలి కోల్మోనఁ బాడితి రాష్ట్రగానమున్
మాయనివన్నె గూర్చితిని మాతకు వాణికిఁ దెన్గులెంకనై;
దాయలభంగి నాపదలు దందడి పెట్టిన, నుర్వి క్రుంగినన్
ద్రోయఁగరాదు పాడినని తోరము గట్టితి, దీన నాకు నే
రాయిడి రామి నిక్కువము, రక్షయునాకిదియొుండె, యెవ్వనిన్
దాయను మానుషంబుడిగి, దంబపువేసములూన, రక్షితం
బాయెనయేనిధర్మువదె, యవ్వల రక్షకమౌట తెల్ల; మ
న్నా! యదనౌట నిప్పలుకు లాడితి, వేఱ తలంపఁబో కెదన్,
మీయనురాగ మాదరము, మీసరసత్వము, మీవివేకమున్
దీయనిపల్కు, నిర్భర వితీర్ణియు, సర్వకవీంద్రభోగ్యమై
యీాయఖిలావనీ ప్రజకు నింపు ఘటించుత:, నల్వరాణియై,
తోయజనాభు సెజ్జయయి, ధూర్జటి మెట్టయి, పండువెన్నెలై
మీ యశమెల్ల దిక్కులకు మించులు గూర్పఁగ, మీరు లోకసే
వాయజనప్రియత్వమున వాసి గడింతురుగాక, సత్యదే
వాయతపాణి మీకు నభయంబిడ సంతత సామ్యయోగ ని
శ్చాయక నిష్ఠమై బ్రజల సంపదగాఁదులకింత్రుగాక, యా
దాయములున్న దిట్టలు సదా మిముఁగాంచుచు విశ్వశాంతిసం
ధాయక ధర్మదీక్ష నవధానము నింతురుగాక, నిర్గతా
సూయము నిత్యహార్దమగుచున్ జగమేకపతాక నీడలో
హాయి నెసంగుఁగాక, పురుషార్థపరాయణమౌనుగాక, బా
పూ, యతిరాడ్వినోబల తపోబలమబ్బురమై శివంకరా
ధ్యాయము సంతరించె మన ధాత్రిచరిత్రకు, దీనికాదటన్
దోయిలి పట్టినప్పుడె గతుల్ గలవీ ప్రజ, కర్థదాస్యమున్
రోయఁగ లేని వారికొకత్రోవను జూపెడి మీయెడన్ జిర
స్థాయి శుభమ్ములంగనుఁదు సాధుచరిత్రులటంచుఁ గ్రమ్మఱన్
స్ఫాయదపేక్షమై నుడివి, సభ్యులకున్ వినయమ్ముచాటి, నా
మై యెదురాడుటన్ మతుకుమల్లిసుధీ! యింక స్వస్తిచెప్పెదన్

25-12-85



# తనివి

ఆ. [1]మతుకుమల్లి వంశ మంజులోద్యాన వ, సంతమూర్తి! నీకు జయము! జయము!
నిత్యసత్యశౌచనిర్భయార్జవ మహా, స్ఫురుచిరాత్మ! నీకు శుభము! శుభము! 1

ఉ. ఎన్నఁడుఁజూడనైతి నిను, నీవు చరించు పథంబెఱుంగ, నీ
సన్నిధినుండు నెచ్చెలుల జాడయుఁగాన, మదంబ వాణియే
నన్నెతిఁగించె నీకు; నభినంద్యపదమ్మున నిల్పి 'తుమ్మలన్'
మన్నవసేయుమీ! యనియె మాన్యమతీ! పలుమాటలేటికిన్? 2

ఉ. నిర్జరలీల మద్యశము నిల్వఁగ మామకసంజ్ఞ నాంధ్ర నా
గార్జున విశ్వభారతుల కర్థము వేలకు వేలొసంగి వి
ద్యార్జనగణ్యులౌ యువలకాసిరితోఁ బతకమ్ములిచ్చు న
ట్లూర్జితపద్ధతిన్ నిలిపి యుర్వికిఁజాటితి నీ వివేకమున్. 3

చ. అతిరథులున్ మహారథులునైన బుధుల్ వరణీయ సాహితీ
చతురులు సత్కవీశ్వరులు చాఁగురె! భూసలిలాభ్రపద్యలన్
గుతుకమెలర్ప నీవు సమకూర్చుసదస్సున కేగుదేర వి
శ్రుతి గనియెన్ విశాఖపురి సుందరవాఙ్మయ తీర్థరాజమై. 4

శా. నీ సారస్వతసేవన ప్రవణతన్, నీ నిర్భరౌదార్యమున్,
నీ సంకల్పశుచిత్వమున్, మధురవాణీ నిష్ఠ, నీ నమ్రతన్
నీ సంతృప్త్యదజాతశత్రుత నొగిన్ వీక్షించి లోకమ్ము నీ
వాసిన్ గోరెడిచుట్టమై నిలిచె; దివ్యజ్ఞీవనాలంబనా! 5

ఉ. శ్రీకటమంచిరెడ్డిబుధసింహము నన్ గొనియాట హేతువై
నా కవితాపటుత్వమును నాయశమున్ విపులంబులయ్యె, నేఁ
డా కృతిపేర వెల్గెడి మహాభవనమ్మున నన్ను గౌరవ
శ్రీకు నొనర్చి ధన్యతముఁ జేసితి; నీతలఁపింత యొప్పునే! 6

గీ. సాంబశివరావు సభ నేలి సభ్యకోటి, తనియ నమృతమ్ము పిదికె వాగ్ధారలందు;
అన్యులకు నిట్లు గావించుటరిది గాని, సాజమేకద "అవుల" సత్కులునకు. 7

ఉ. అంచితరాజవంశమున నాంధ్రసరస్వతి సేవలన్ నుతుల్
గాంచిన రాజవంశమున గల్గిన పీ.వి.జి.రాజుచేతఁ జే
యించితి సత్కృతిన్ సదసు "జే" యన నీవలె నౌచితీవిధిన్
మంచినవారిఁజూడఁ గవిమండలి డెందము కందళించెడిన్. 8

1 వీరవెంకట సత్యనారాయణమూర్తి

చ. ననుఁగనిలోక మేకరణి నవ్విన వెన్కకురాక వీఁకమైఁ
జినపెదకర్జముల్ వలచి చేసితిఁ బెక్కు ఫలేచ్ఛ తక్కి యై
నను మును గేలి చేసిన జనంబుదరన్ ఫలమిట్లుదాత్తమై
మునుకొని వచ్చె నాకు గిరిమోసినవానికి లక్ష్మియుంబలెన్. 9

చ. వలచిన వానికిన్ ఫలమువచ్చుట దబ్బఱ, కాని ధర్మువున్
గొలిచి యసంగ యోగమునకున్ దలవంచిన వానిచెతంకున్
ఫలమది రాక నిక్కమని పల్కిన పెద్దల పల్కులెన్నఁడున్
వెలవెలపోవు; సత్యపదవిశ్రుత! విశ్వజన ప్రియవ్రతా! 10

క. పావిత్ర్యరాశి నీసతి, సావిత్రి తదీయ భావ సఖ్యంబున నీ
భావములు పండినవి, నీ; త్రోవలు నిష్కంటకత నుతుల్గనె మూర్తీ! 11

ఉ. వెన్నకు దీటువచ్చు మది వెల్వడి వేలుపుఁదోఁటలోని తే
నెన్నిరసింపఁ జాలునుడి నివ్వటిలన్ ననుఁబల్కరించి యీ
పున్నెపుదీవి యీ వినయ భూషిత నాదెసఁ జాటు పేర్మితో
గ్రన్ననఁదూలె నాబడలికల్ శతకుంజర సత్వమేర్పడన్. 12

ఉ. నీ గెలుపుల్ సదా వలచు నెయ్యరి, తియ్యనికైతలో యశ
శ్శ్రీ గనినట్టి దిట్ట, శుభలీల విశిష్టుఁడు, రంధి సోమరా
జాఁగని పట్టుతో నిలిచె నస్మదుదీర్ఘత నాసచేసి యీ
భోగము నాకు దక్కె గుణభూషణతోషణ! నీ కతమ్మునన్. 13

గీ. తగ సహస్రచంద్రదర్శను నన్నింత, మెచ్చి మేలికాన్క లిచ్చినట్టి
నీకు రెండువేల నెలలాయు వగుత! నీ, యాలుబిడ్డలకు నయమ్ము లగుత! 14

ఉ. "సాహులు ధర్మకర్తలయి సంపదలన్ జగతీహిత క్రియా
వ్యూహముపాలు చేఁతవలయున్; సుఖశాంతులు రావురావు లో
భాహిత చిత్తవృత్తులకు" నన్న మహాత్ముని పల్కు మెచ్చు నీ
యూహలు మోహబంధముల నిగ్గెడి స్రగ్గెడి వారిఁ దేర్చుతన్! 15

31-12-85



# మరుపూరు కోదండరామరెడ్డి

ఆ. వేయినెలలఁ గన్న వృద్ధుఁడవైతె కో, దండరామరెడ్డి ధరకు వచ్చి
యేల రిత్తకోర్కి? యింక నైదువందల, నెలలఁ గనుము సౌఖ్యనిధిగ మనుము. 1

క. ఆయువు నాఱడిసేయక, చేయందగుపనులు పెక్కు చేసితి, లోక
శ్రేయమున కాసపడి సమ, తాయోగము నవధరించి ధన్యతపందన్. 2

క. ఈవాంధ్ర సరస్వతికిం, గావించినసేవ కుద్ది కలదా? తెనుఁగుం
జేవ గల పల్కునకు నీ, వావిష్కృతిచేయు రచన యాదర్శమగున్. 3

క. తిక్కన మెఱసిన పలుకుం, జక్కన గుర్తించి దాని చందము చాటన్
మిక్కిలి నలంగి గెల్చితి, వక్కు నతిచి నిక్కువారలవతి నందన్. 4

గీ. ఆస్తికుఁడ వీవు శివకేశవాంతరంబు, లేని బుధుఁడవు కర్మఫలానురక్తి
లేని యోగివి నినువంటి జ్ఞానిబ్రదుకు, సంస్కృతికి నందదందగా సాగవలయు. 5

10-1-86



# సత్కళ

గేయము :

పాటగాదు కైతగాదు, పదిబొమ్మలు గీఁతగాదు
మచ్చలేని మనుగడయే, మంది ముందు మెచ్చెడి కళ. 1

సత్యమునకు దాసరిగా, జగతికెల్లఁ జుట్టముగా
నమ్రతకు నుదాహృతిగా, నడుచుటయే యుత్తమ కళ. 2

జగమంతయు హరిసొత్తని, వగకు విత్తు లోభం బని
పగ పగతో గతపడదని, భావించుట సముచిత కళ. 3

పాపమునకుఁ బుణ్యమునకు, ఫలము లున్నవని నమ్ముట
దారిదప్పు నింద్రియముల, దండించుట నిరుపమ కళ. 4

అనరానివి యనుట మాని, వినరానివి వినుట మాని
తినరానివి తినుట మాని, కనుడీ! నరులీ సత్కళ. 5

20-1-86

# పోతన

ఆ. పొలము దున్నుచున్న పోతరాజుం గని, వాణి తనిసి బాష్పవారి గురిసె,
పదను చూచి విత్తె బమ్మెరకవి కాఁపు, కంకి వెడలె రత్నగర్భ మగుచు. 1

క. దారిద్ర్యము నరునిన్ బెడ, దారికి మరలించు తులువదయ్యము; సమతా
శ్రీరాశి యగుటఁ బోతన, యీరక్కసికాళ్ళు విఱిచె హేలామాత్రన్. 2

క. విత్తముతో విల్తుము కవి, సత్తముల నటంచు జబ్బు సఱచిన ఱేఁడుల్
చిత్తైరి, పాసెమొల్లక, పత్తెపుగంజిని వరించు బమ్మెరచేతన్. 3

ఆ. తెలుఁగువారి పున్నెములు పండి పండి భా, గవత రచన కితఁడు గంట మూనె;
కదలి పొదలి పొంగెఁ గైవల్యకళ్యాణ, దాతయైన తీయకైత యిందు. 4

గీ. నిజహృదిన్ రామభద్రుండు నిలుచు మృదుల, పీఠమునొనర్చి కవిత గుప్పించె నితఁడు
నందనందన మురళీ స్వనమ్ము మొరసె, నఖిల పదములఁ గాదు-ప్రత్యక్షరమున. 5

క. ఏకథ, నేపద్యమ్మున, నేకడఁ గనుఁగొన్న మాయురే! శమ దమ శౌ
చాకాంక్ష గూర్చుపలుకే, వాకొనెఁ బోతన్న పారవశ్యం బెసఁగన్. 6

క. శ్రుతి మర్మంబులుపనిష, న్మతరీతులు కానలేని మానవుఁడు కృతా
ర్థత నందఁగలఁడు పోతన, కృతి భాగవతంబు నాలకించిన నర్థిన్. 7

క. హరిభక్తి మరగి మనుజుఁడు, చిరంతనానంద పదముచేరుటకై బ
మ్మెరకవిచంద్రుఁడు దిద్దిన, తెరువులు కొడికట్టులేని దివిటీలయ్యెన్. 8

ఆ. ఓనమాలు రాని కూనకున్ గేసన్న, కొడుకుకైత వచ్చుఁ గొంతయేని,
యే తెలుంగు కవికి నీభాగ్య మబ్బె? వే, మన్న కించుకంత యబ్బె నందు. 9

ఆ. గాలిలోనిదివ్వె కలిమి, వెల్లువ నీటఁ, బొడమి యూఁగులాడు బుడుగ లేమి,
పాయరానిసొత్తు పరువన్న పోతన్న, తెలివి లేని కవికి దేశికుండు. 10

ఫిబ్రవరి 86



# డా. కె. సదాశివరావు

చంపకమాలిక :

అఱువదియేండ్లనిండె భిషగగ్రణి కాసరనేని కన్నచో
వెఱఁగు జనించుఁగాని యిది విశ్వసనీయముగాని పల్కుగా;
దిరువదిముప్పదేండ్ల యువకీతఁడు జోడుగ నేలఁతోఁచు? నీ
గఱువ మొగమ్మునన్ ముదుత కన్పడదేమి; జరా పిశాచి యీ
నరుదరికేలరా? దనిన నామది యిట్లు వచించు 'నో! కవీ
శ్వర! యితఁ దర్థకామముల బానిస మొల్లఁడనామయవ్యథా
భరమునఁ గ్రుంగు మానిసికి బంధువుగా నుపకర్తృమౌళిగా
శరణముగా నలంగు; మనుజత్వము సత్వము నాదరించు; సత్
పురుషులు రోయు కోరికల పొంతకుఁ బోఁడు సదాశివుండితం
డెఱుఁగును దెల్గుతీపి, సుకవీంద్రుల గోష్ఠికి నారటించు, నే
యొరపిడి వచ్చినన్ విడువనొల్ల కహో! ప్రతి భానువారమ
బ్బురమగు సాహితీసభకుఁబాను, జగద్ధిత కావ్యరాజముల్
మెఱయును, దల్లిబాసకెది మేలది సేఁతకు వేలువేలుగా
సిరులను వెచ్చపెట్టు, నుతిచేసిన నుబ్బఁడు, నింద సల్పినన్
గఱకరి కాఁడు, నమ్రతకు గాదిలి తావు; జయప్రదాంబ యీ
సరసుని రాణి యౌటయును సంస్తుతిపాత్రము, తోడి వెజ్జుగా
నిరుపమ శౌచమూర్తిగ ననేక విధమ్ముల నీమె భర్తకున్
గరిమ నొసంగె, సంఘ మిది గాంచి కరంగి తెలుంగుదేశపుం
బరువునకండగా నగదపండితు నీ శివరావు నెన్ని సం
బరపడె, లోకసేవఁ గడుఁ బండిన కాసరనేని ధన్యతా
సురుచిర జీవనుండు జయసుందరుఁడై మహనీయ గౌరవ
స్ఫురణములన్ శతాబ్దములు భూరిసుఖంబుల నందుఁగాక! సా
గరమున రేఁగు ఫేనమును, గప్పురబోగి పసాదమున్; మరుత్
పుర నటదాపగన్, భుజగభూషణు మన్కిని, శారదాభ్రమున్
సరసిజగర్భువార్వమును, జంద్రిక నింద్రుకరిన్, బటీరమున్
విరిసిన మల్లియన్, బడగవిప్పిన శేషు నిజప్రభన్, నిరా
కరణ మొనర్చు కీర్తి పొసఁగన్ బరితృప్తి నెసంగుఁగాక యీ
నెఱసరి మన్గడన్ గనెడి నేఁటి కిశోరులు మేటి కర్షముల్

నెఱపి గణేయ పీఠముల నిల్తురుగాక, నరుండు సేవలన్
మరగిననాఁడె, యీవిదెస మక్కువ చూపిననాఁడె, మెప్పులన్
గొఱలు నటన్న గుట్టు గనుగొందురుగాక "తెనుంగులెంక" నాఁ
బరఁగెడి వృద్ధు దీవనలు పండునుగాక శుభాకరమ్ములై. 8

15-2-86

| | | |
|---|---|---|
| లైను | 13 మెఱయు - ప్రకటించు | 19 అగదము - మందు |
| | 23 కప్పురబోగి - ఒకజాతి మేలి వడ్లు | 28 నెఱసరి - దిట్ట |
| | 29 గణేయము - గణ్యము | 31 కొఱలు - ప్రకాశించు |

* * *

మ. తనకున్ లాఁతికి వేరులేదనుట యద్వైతమ్ము; సర్వప్రజల్
తన రీతిన్ సుఖముంట మేలనుట యద్వైతమ్ము; లోకంబు దీ
నిని బాటింపదయేని విప్లవము సంధిల్లున్; దదీయోద్ధతిన్
మణఁపన్ శక్యముగాదు తంత్రములకున్ మంత్రాలకేనాఁటికిన్



## ఉగాది

గీ. మెఱసె మల్లియ ప్రాసంగుమెతుకు వోలె, ఇగురుకొనె మావి యనురాగహేల వోలె
కదలె వలిగాలి సుకవీంద్రుకైత వోలె, వచ్చె నిదె చాంద్రమాన సంవత్సరాది. 1

క. నవ వత్సర పంచాంగ, శ్రవణముతోఁ బ్రజలు సంతసంపదక ఫల
ప్రవణతను వీడి, చేయం, దవిన పనుల్ పూనవలయు ధర్మప్రియతన్. 2

క. చిగిరింప వలయు నరులో, సగమున సగమైన దైవసంపదలీ నాఁ
డెగయవలె ననుజ మనుజ, ప్రగతిప్రియ భావసౌరభం బతని మదిన్. 3

క. అందఱిలోఁ దన్నుం గని, యందఱఁ దనయందుఁ జూచి యక్షరమగు నా
నందము నందు మహాత్ముల, సందేశము వినుట కతఁడు సమకట్టవలెన్. 4

క. బహిరంతర శౌచమ్మున, కహరహమున్ దయ్యవలయు నాతఁడు, లజ్జా
సహితుఁడు గావలె, మాధ్వీ ,పిహితోక్తులు నేర్చి సభలఁ బేరంద వలెన్. 5

ఆ. ఇరుగుపొరుగు వారి యిడుమలు తన్నేఁచు, నిడుమలంచు నాతఁ డెఱుఁగ వలయు;
తన సుఖంబు సర్వజన సుఖంబున నుంట, కానవలయుఁ, దృష్ట మానవలయు. 6

ఆ. ఎల్లలేని ప్రేమయే చుండీ! యద్వైత, మన్న, మధురవాక్య మార్షవాణి
గుట్టు దెలిసికొన్న దిట్ట వాక్యంబని, కరంగవలయు సేవ మరగ వలయు. 7

ఆ. కలుష దూరమైన కార్యంబునకు నెవ్వ, రడ్డపడిన నాతం డాంగరాదు;
దండితాత్ముం డగుచుం గొండకు దీటుగా, నిలువ వలయు, రిపుల గెలువవలయు. 8

గీ. విజయములం జూచి వినయమ్ము వీడరాదు, సత్యమునకు నహింసకున్ భృత్యుండగుట
మఱవరాదు, మృత్యువునకు వెఱవరాదు పాయరాదార్జవం, బోర్మి ద్రోయరాదు. 9

ఆ. చూలు ముమ్మరించి సోలు నింతిని గూలి, కంపు దొరతనంపు జంపు మాన్పం
గట్టవలయు నతండు కంకణ మీనాండు, జంకుం ద్రోచి, బాపు వంకం జూచి. 10

ఆ. నలువదేండ్లనాండు తెలవాండు బోటెక్కె, తాంకె మిన్నశోకధర్మచక్ర,
మెంగిలాకు నాక నెగంబడు బడుగులీ, యుర్విం గలరు నేండు నూర నూర. 11

క. ఒకయెడ విత్తము మూల్గుట, యొకయెడ నాంకంటిమంట యొలయుట యీ నే
లకుం దప్పు దయ్యె నేండును; సుకమెల్లరకున్ లభించు సూత్రము లేదా? 12

క. లేకేమి? కూడుగుడ్డల, కేకారెడి దీను లందఱేకతమై ని
ర్భీకతమై నిల్చిన నాం, డే కడం గన్గొన్న శాంతి యెసంగున్ పొసంగున్. 13

ఆ. మతము కులము కోవ మఱచి పస్తులతోడ, వగచు తమ్ములొక్కవర్గ మగుండు!
కత్తి వలదు మీకు, ఖడ్గమ్ము వలదు, మీ, పొత్తు చాలు వెతల నుత్తరింప. 14

10-3-86



# వేదాంతం జగన్నాథాచార్యులు

శా. సాధీయస్తకు సాహితీపటుతకున్ సర్వంకష ప్రజ్ఞకున్
మేధా తీవ్రతకున్ శ్రుతిస్మృతిపథామేయప్రియత్వాప్తికిన్
వాదప్రౌఢికిం దారకాణ యగుచున్ వర్ధిల్లి శ్రీమజ్జగ
న్నాథాచార్య! యిదేమి మన్గడకు సున్నా చుట్టితీవక్షయన్. 1

ఉ. పొట్టకుం గాక, శాస్త్రముల పోకడలోం గల చాతురిన్ జగా
గుట్టుం గనందలంచి బుధకుంజరసేవలొనర్చి దస్సి మేల్
పట్టము లందుకొన్న ప్రతిభానిధి వీ; విఁకనిమ్మహిన్ నెఱా
దిట్టలు నిన్నుం బోలెడి సుధీమణు లిద్దరు ముగ్గు రుందురా? 2

ఉ. కోవిదవర్య! రామకథ క్రోల్చుచు నర్థవిశేషముల్ సభా
భావసరోజముల్ విరియఁబాఱఁగ నీ వెతిఁగించువేళ నీ
పావనమూర్తి నాదికవిభాస్కరు వాల్మికి నార్షదీప్తికిన్
దావలమైన ధన్యుఁగని తద్దయుఁ జొక్కితి మేము పల్మఱున్ 3

ఉ. నీకిహయాత్ర నొల్లమి జనించుటచే నొక యప్పికట్ల కే
కాక సమస్తధాత్రికిని గాఁక ఘటిల్లె వృథావిదాయిర్యై
నాకొలువింత విన్నఁబడెనా యని నేఁ దలమేలుమంగతో
నాఁకలుఁలేని యూర్పులకు నగ్గపడెన్ దిరువెంగళేంద్రుఁడున్. 4

22-4-86



## త్రిపురనేని రామస్వామి చౌదరి

ఆ. సత్యనిష్ఠ యుంట సామితీబలముంట, రసవిశిష్టమైన రచన యుంట
నదురు బెదురు లేని మది యుంటఁ గవిరాజు, సాటి లేని కీర్తి సంతరించె. 1

క. ఒక విప్లవసారస్వత, శకమునకున్ గర్తయయ్యెఁ జౌదరి, జడతా
ధికతా విధేయ భావ, ప్రకరంబుల వ్రక్కలించు పలుకుం బలిమిన్. 2

క. మా యన్వయ మగ్రీయము, మా యున్నతి గణ్యమనెడి మానవు నుదుటున్
మూయించె నితఁడు సత్య, స్ఫాయదజేయోక్తి యుక్తిసంధాచణతన్. 3

ఆ. అడఁగి మడఁగి వేల్పునుడి వ్రేఁగునన్ బెల్లు, తల్లడిల్లుచున్న తల్లిబాస
జంకు దూల్చె నితఁడు సన్నజాజులఁ బోని, తెనుఁగు నుడులఁ గైతఁ దీర్చి పేర్చి. 4

ఆ. తిరము లితని కృతులు తిక్కన్న వేమన్న, చేమకూర కవుల సృష్టులట్లు;
నిక్కమైన తెల్గు నేర్తురుగాక యీ, నేలవారు వీని నెఱి నెఱింగి. 5

20-8-86





'దివ్యజ్యోతి' కృతిస్వీకర్త

**జనాబ్ గౌస్ బేగ్**

# దివ్యజ్యోతి

## విషయసూచిక

# సమాలోచనం

'తెనుఁగులెంక' శ్రీ తుమ్మలవారి చిట్టచివరి రచనము ఈ 'దివ్యజ్యోతి' దివ్యమూర్తుల సత్యసత్త్వస్వరూప ప్రశంసాజ్యోతి ఈ గ్రంథంలో జగదేకగురుడు భారత మహీ కళ్యాణ సంధాత యైన గాంధీ మహాత్మునికి సంబంధించిన కవితలు - బాపుజీ కదనమ్ములను దూకి కడిమి చాటిన యోధవరులకు సంబంధించిన కైతలు - యుగ లక్షణము గుబాళించు రచనలు చేసిన కవి పుంగవులకు సంబంధించిన కైతలు - దాతృతానిధులు, ఆత్మవేత్తలైన మహనీయులకు సంబంధించిన కైతలు - కలవు ఇది దివ్య సందేశాలకు ఖని. కమనీయ భావ పారిజాతాల నందనవని ఆంధ్ర కవితా క్షేత్రంలో ముక్కారు పంటలు పండించిన పెద్ద కాపు శ్రీ తుమ్మల కాగా, ముక్కారు పంటల సమృద్ధిని మచ్చుగా ప్రోవుచేసి అందించిన కృతి యిది తొలి, మలి పంటలలో చెదరిన పతిగ పంటను రాశీభూత మొనర్చి తుమ్మలవారి రచనలను పరిపుష్ట మొనరించుటకై యత్నించిన డా॥ సూర్యదేవర రవికుమార్ పరిశోధనా కృషి కొంతకు కొంత ఈ గ్రంథమునకు దోహదకారి చెదరిన సుధాబిందువులు రసభాండమున చేరినవి చిన్నారి పొన్నారి చిఱుత ప్రాయము నుండి ఆమరణాంతముగ కవి గారిచే వ్రాయబడిన భిన్న కవితా ఖండికలకు ఈ గ్రంథము సంగమ స్థలమైనది శ్రీ తుమ్మలవారి రచనా పాటవముల క్రమ వికాసము నిరూపించు కవితా సోపానము ఈ కృతి. పరిశోధకులకు, రచనా వ్యాసంగ జిజ్ఞాసువులకు ఈ గ్రంథము బహుళ ప్రయోజనకారి కాగలదు

# అంకితము

తుమ్మల వారు చిట్టచివరి దశలో కూర్చిన ఖండికలను మాలగా పేర్చి ఈ కృతిని నిర్మించడం జరిగింది తనతో పాటు స్వాతంత్ర్యోద్యమములో కృషి సల్పిన 'జనాబ్ గౌస్‌బేగ్' గారి స్మృతికి చిహ్నంగా, తమ మైత్రికి ఫలంగా వారికి అంకితమివ్వాలని కవిగారి ఆకాంక్ష. వీరి అంకితమొసంగు పద్ధతి విలక్షణము, విశిష్టము. కానుకలకై ఆశించి కబ్బముల నొసంగు పద్ధతి యనిన వీరికి గిట్టదు. ఉత్తమ గుణాఢ్యులకు అయాచితముగా, హరాత్తుగా కృతి సమర్పణ మొనర్చుట వీరి ఆచారము. ఔత్తరాహుడయిన లాల్‌బహదూర్‌శాస్త్రి గారికి తన 'మహాత్మ కథ'ను, విదేశీయుడైన మార్టిన్ లూథర్‌కింగ్‌కు తన 'నా కథలు' గ్రంథమును

ఆయా వ్యక్తుల మరణానంతరము స్మృతి చిహ్నముగా సమర్పించిన వీరి ఉదాత్తత ప్రశంసనీయము నేడు తన మహమ్మదీయ సోదరునకు ఈ గ్రంథము స్మృతి చిహ్నముగా సమర్పించుట పూర్ణఫలమంది నట్లయినది హిందు, ముస్లిం, క్రైస్తవ జామాతలకు తన కృతి కన్యకలనిడి తన కవితా క్షేత్రమును త్రివేణీ సంగమ మొనర్చె ననుటకు ఇది ప్రత్యక్ష నిదర్శనము. వర్గ, వర్ణ, కుల, మత తత్త్వములకు లొంగని వీరి మానవతా దృష్టికి ఇది పెను ఉదాహరణము వీరి మొట్టమొదటి గ్రంథము 'ఆత్మార్పణము' సతీ స్మృతి చిహ్నము, కాగా చిట్టచివరి గ్రంథము 'మిత్ర స్మృతి'కి చిహ్నముగా సమర్పింపబడుట గమనార్హము

# స్మృతి ఖండికలు

ఇది ఇరువది రెండు ఖండికలతో విలసిల్లు ఖండకావ్య సంపుటి, ఇందు ముఖ్యముగా స్మృతి కైతలకు ప్రాధాన్యము కలదు అంకిత పద్యములు సైతము స్మృతి ప్రధానములగుట ఈ ఖండికలోని విశేషము. ఈ పొత్తములో ఏడు ఖండికలు ఇట్టివగుట 'దివ్యజ్యోతి' అను నామకరణము ఈ గ్రంథమునకు సార్థకము వీరందరు గుణమణులు, విశాల హృదయులు, స్వాతంత్ర్యేచ్ఛ కలవారు, వితరణశీలురు, సంఘసేవా ధురంధరులు అగుట వారిని స్మృతి యొనర్చుకొనుట విశ్వకల్యాణ హేతువగునని కవిగారి భావము

అందు మొదటివారు రాజావాసిరెడ్డి వేంకటాద్రి నాయుడుగారు జగమెరిగిన వితరణ శీలురు, సాహితీ పోషకులు, బ్రాహ్మణారాధకులు, దైవభక్తి సంపన్నులు ఇట్టి మహనీయుని దానఫలమందినవారు సంస్మరించ ఏమరిరేమో గాని శ్రీ తుమ్మలవారు మాత్రము వారి స్మృతిని వీడకుండిరనుటకు ఈ ఖండిక నిదర్శనము

తదుపరి పోతన స్మృతి. పోతనార్యుని సుకుమార పదబంధమును గూర్చి, రస సంవిధానమును గూర్చి కవిగారు అభివర్ణించిన తీరు నాన్యతోకృతము.

"యతి విటుడు కాకపోవునే యస్మదీయ కావ్య శృంగార వర్ణనాకర్ణనమున" యను నృసింహ కవి శపధమునకనుగుణముగ

"రహి నపుంసకుడైన రమణుల గోరు నీ, శృంగార వర్ణనల్ చేరి విన్న" అని గూర్చుట శోభాతిశయము గూర్చు విధానము

యతి విటుడగుటలో ఆశ్చర్యమేమున్నది, నపుంసకుడు రమణుల గోరుటలోనే అద్భుతమున్నది

"ఆంధ్ర కవి శ్రేష్ఠులందఱు నిన్గవి - సార్వభౌముడవంచు సన్నుతింప

స్థిరభక్తి వేదాంత జిజ్ఞాసువులు మహా - వేదాంతివని నిన్ను వేడుచుండ"

ఈ పద్యము నన్నయగారి "ధర్మశాస్త్రజ్ఞులు ధర్మ శాస్త్రంబని - అధ్యాత్మ విధులు వేదాంత మనియు" అను పద్యమునకు జ్ఞాపిక

తరువాత దేశబంధుని గుణగుణముల విశేషణములను విశేష్యము లొనర్చి ప్రతిపాదమునకు చివర ఇమిడ్చి సమతాగుణ పరిపోషక మగునట్లు విషయ పరిపుష్టి యొనర్చిన సీస పద్యము మకుటాయమానము ఇట్టిదే 'ఆంధ్ర రత్నము' స్మృతి కూడా! ఇందలి మూడు పద్యములు త్రిరత్నముల వంటివి

"ఎవ్వాని మధురవాగింద్రియమ్మున మించు - నవరసంబులు చింది నాట్యమాడు"

అను సీసము

"ఎవ్వాని వాకిట మృగమద పంకంబు - రాజభూషణ రజోరాజి నడగు"

అను తిక్కన పద్యమును గుర్తునకు తెచ్చుచున్నది గదా!

వీరు నాయకులను, రాజులను, మహాకవులనే గాక సామాన్య ప్రజలలో గుణోన్నతి నొప్పిన వారిని సైతము కవితా వస్తువులుగా గ్రహించె ననుటకు నాగయ్య స్మృతి ఉదాహరణము కర్షక ప్రజా వికాసము దేశమునుద్ధరించునను భావనతో అరువదేడులు రైతు కల్పకము ఆచార్య రంగా వారికి అనుచరుడుగా కృషి నల్పిన కార్యకర్త ఇతడు

"బడిదైన, బాట యైనను - సడిసన్న కళాతపస్వి సత్కృతి యైనన్

బొడమినదా? నీవు కడుం - గడు వేసటపడక యప్పికట్ల పురానన్"

ఈతని నిరంతర సేవా పరతంత్రతకు నిదర్శన మీ పద్యము -

ఈరసమును గర్హనీయగుణముగా శ్రీ తుమ్మలవారు చెప్పని తావులేదు వివరింపని కవిత లేదు అట్టి అసూయకు తావీయని "అనసూయ" సార్థక నామధేయురాలు ఆమె స్మృతి సందర్భమున కూర్చిన ఈ పద్యము సాహిత్యమున మణిదీపిక -

పేరు కొందఱకున్ నేతి బీరకాఁగ - గొందఱకు రసాలంబయి కూర్చు యశము

లేశమును నీకు నీరస లేమిఁ జేసి - సోదరీ! భవదాఖ్య సంస్తుత్య మాయె -

రామకృష్ణుని నిగమశర్మాభిధానము నేతిబీర కాగా, ఇట అనసూయ నామము రసాలమయినదని వీరి ఉద్దేశము

# స్తోత్ర అవతార వర్ణనములు

సంస్కృతాంధ్రము లందు స్తోత్రములు పుంఖాను పుంఖములు, స్తోత్రము గూర్చని కవిలేడు స్తోత్రము లేని కావ్యము లేదు ఇందలి ఆంధ్ర లక్ష్మీ నృసింహ స్తోత్రము కవిగారి అనువాద పటుత్వమును నిరూపించు ఖండిక సంస్కృతమున లక్ష్మీ నృసింహ స్తవము సుప్రశస్తము శ్రీ శంకర భగవత్పాదుల విరచితము. కొండొక కారణముగా ఐహికమాయలందు చిక్కుకున్న శ్రీ శంకరులు తన ఐహిక బంధములను త్రెంచుకొన గావించిన స్తవముగా దీనికి విశేష ప్రశస్తి

సంస్కృతమున ఇది సరళమయిన రచనము దీనిని ఆంధ్రీకరించుట అసిధారా వ్రతము భావమునకు గ్లాని రాకుండ తెనుగున దీనిని కళాన్వితముగా అనువదించుట బహుదుర్ఘటము అతి విస్తృతి లేకుండా, భావానికి న్యూనత వాటిల్లకుండా ఏ విధమైన వక్రతకు, క్లిష్టతకు, సంకుచితత్వమునకు తావీయకుండా ఆంధ్రీకరణము చేయుట కవికి అగ్ని పరీక్ష ఇందలి భావములను దేశీయ ఛందమున ఇముడ్చుటకు వీలులేదు. ఇక ఉత్పల మాలాది సంస్కృత ఛందముల నిముడ్చుటకు మూలమందలి భావము చాలదు పైగా వృత్తము లోని గణ, ప్రాస, యతి నియమములు అడుగడుగునా రచయితకు అడ్డంకులుగా నిలుచును ఆ పైన మకుట నియమము ఒకటి సంస్కృతమున ఇట్టి అడ్డంకులు పరిమితములు. ప్రాస నియమమందు లేదు యతి నియమము కూడా నామమాత్రమే కొన్నియెడల గణములు వ్యత్యస్తమయినను దొసగు గాదు. ఇన్ని ఇరకాటముల మధ్య దీనిని కవిగారు భావమునకు క్షతి రాకుండ ఏకప్రాసపై ఇరువది ఐదు పద్యములలో ఈ స్తోత్రమును ఆంధ్రీకరించి యుండుట వీరి సాహితీ పరిశ్రమమునకు గీటురాయి. వీరి అనువాద ధోరణికి కలికితురాయి మూలమున కానరాని ప్రౌఢత్వము తెలుగున ద్యోతక మగుటకు ఇదియే కారణము. అవధాన కళయందు ఆశుకవితా ధారయందు సిద్ధహస్తులయిన వీరు అలవోకగా దీనిని గూర్చి ఆంధ్ర కవితా లోకమున సుప్రతిష్ఠిత మొనర్చుట గర్వ కారణము శ్రీ తుమ్మల వారి ప్రౌఢ సంస్కృత సమాస ఘటితమైన రచనమునకు ఇది మచ్చుతునక. అయినను ఇందలి లలిత పద బంధములు అర్ధ స్ఫురణమునకు కొంత దోహదకారి యగుచున్నవి. ఇక కృష్ణావతారాభివర్ణనము వీరి సీసపద్య రచనా పాటవమునకు ప్రతీక నిరంతర భాగవత

పరనాసక్తి పోతనామాత్యుని కవితపై గల ఆసక్తి కారణములుగా కృష్ణావతార ఖండికను కవిగారు నుడివినట్లు మనకు తోచును ఏమైననేమి రసవత్కవితా ఖండికగా, ఆపాత మధురముగా, ఆస్వాద యోగ్యముగా ఇట రూపొందింపబడుట మన అదృష్టము ఇందలి సీసములు సమతాగుణప్రధానములు, సరళములు మురళి పాడెడి ఆ దివ్యమూర్తిని మన కనులకు గట్టి నిల్పుట ఇందలి విశేషము.

## ప్రశంసలు - ఆశంసనములు

మంచిని విస్మరించుట - మొగమోటమునకై చెడును ప్రశంసించుట శ్రీ తుమ్మలవారు ఎఱుంగరు. విశ్వ కళ్యాణము నభిలషించు నిస్వార్థ జీవనులు సంఘ శక్తికి మూలమనియు, అట్టివారల గుణ కీర్తనము సాటి మానవులకు ఆదర్శమనియు వారి దృష్టి ఆ కారణముగా ఆయా వ్యక్తుల సేవలను సందర్భోచితముగా ప్రశంసా రూపమున కీర్తన మొనర్చుట వారికి నైజం. అట్టి ప్రశంసనములు ఈ ఖండిక యందు ఆరు గలవు అందు మొదటిది కొనియాట - 'దేశోద్ధారకుని' పై చెప్పిన ఖండిక ఇది భరత మాతృచరణ రాజీవ పీఠిక సమ్ముఖమునకు తన సర్వస్వమును ధారవోసిన మనీషిసత్తముడుగా దేశోద్ధారకుని చిత్రించిన విధము అపు రూపము ఆ మహనీయుని మూర్తిని కవి యూహించిన తెఱంగు ప్రశంసా పాత్రము. ద్వితీయము అమూల్యశ్రీ గారికి వీరు తెల్పిన హితవు, అమూల్యశ్రీ గారు కవిగారికి సాహితీ బంధువులు సాక్షాత్తుగా వీరి కదంబకైతకు కృతిపతులు. తర్వాత గాంధి యుగమున రాణకెక్కిన ఘనులలో తొలి బంతిగా నిల్చిన వ్యక్తి వెలువోలు సీతారామయ్య గారు, స్వాతంత్ర్యానంతరము కూడ లోక సేవా దీక్షలో నిలిచిన వ్యక్తి. అట్టివాని అమృతోత్సవ సందర్భమున కవిగారు కూర్చిన ముత్యాల సరాలివి విశ్వ సేవనా నిష్ఠ గల ప్రజ వీధి వీధి కబ్బవలెనను వీరి ఆకాంక్ష ఇందు ప్రధానము.

పద్యకవిత్వమునకు అవధానములద్వారా బహుళ ప్రచారము తెచ్చిన మహనీయులు శ్రీ తిరుపతి వేంకట కవులు. వీరికి శ్రీ కొప్పరపు కవులు ప్రత్యర్థులు, వీరిరువురు పందెములను వైచుకొని పరువులెత్తిన నాడు తెన్గువారెల్లరు రసతోయధిని మునిగి పరవశించిరి ఆ యుగము అంతరించినది. ఎందైన ఎవరైన అవధాన మొనర్చినను అవి నామమాత్రములైనవి మరల ఒకసారి అవధాన యుగమును సృష్టించిన గడుసరి శ్రీ మేడసాని మోహన్, వీరి నవావధానములు మంజులతర ఆశు కవిత్వ ప్రదర్శనములుగా ప్రశస్తి గాంచినవి, శ్రీ తుమ్మల వారి సమక్షమున మేడసాని పలుతావుల తన విద్యను ప్రదర్శించి

వారి మన్ననకు పాత్రుడగుట అతని కీర్తికి పతాక స్థానము తిక్కన్నను మెప్పించిన 'కేతన' వోలె, అభినవతిక్కన్నను మెప్పించిన మేడసాని భాగ్యశాలి అభ్యుదయ కవి శ్రీ రంధి సోమరాజు గారిపై వీరు గూర్చిన మెచ్చుకోలు అత్యంత స్వాభావికము. ఏ విధమైన మెఱమెచ్చులు లేనివి రసోరాజు కవితలు కరుణరస ప్రపూర్ణములు, సమతా మమతా ప్రసాదనములు వీరు వ్యావహారిక భాషాప్రియులు అయినను వీరి భావములు కవిగారి ప్రశంసకు పాత్రములైనవి శ్రీ నల్లపనేని మార్కండేయులు గారిని కవిగారు ఆకాంక్షించిన విధము నిండు ప్రేమతో కూడినది

"మధురవాణి నీ కున్నది – మంచి మనసు నీ పాలిది

సుధలూరెడి కృతులు పల్కి – సుకవిస్తుతు లందుకొమ్ము"

వీరు వృత్తిరీత్యా ఇంజనీరు, ప్రవృత్తిరీత్యా కవులు, సాహితీ సంసేవకులు చీరాలలో "తెనుంగులెంక శ్రీ తుమ్మల సీతారామమూర్తి సాహితీ పరిషత్తు"ను నెలకొల్పిన వారిలో వీరు ప్రముఖులు. వీరికి తుమ్మలవారిపై కొండంత భక్తి; తుమ్మలవారి కవితపై బంగారు కొండంత రక్తి వీరు మాటల మనిషి కాదు, చేతల మనిషి

## కథా ఖండికలు

రస గుళికలు, దీప కళికలు వంటి కథా ఖండికలను వీరు పెక్కింటిని గూర్చి తన కథా కథన దక్షతను, ఉదాత్త సన్నివేశ కల్పనాశక్తిని నిరూపించుకున్న కవితల్లజులు శ్రీ తుమ్మల వారు. ఇందు కొన్ని ఐతిహాసిక గాధలకు సంబంధించినవి మరికొన్ని చారిత్రక సత్యాలకు అనుబద్ధమైనవి అనుకరణములు కొన్ని, ఇంకను యధార్థమైన సాంఘిక గాధలు మరికొన్ని. ఈ ప్రక్రియ భావితరాలకు అదర్శమవుతుందని అస్మదాదుల భావన సమగ్రముగా ఇట్టి రచనములతో నిండియున్న గ్రంథము 'నా కథలు' యధార్ధ చిత్రాలను చిత్రించిన అభ్యుదయ వాదులకన్న, యధార్ధ గాధలను రూపొందించి ముందడుగు వేసిన శ్రీ తుమ్మల ప్రస్తవనీయుడు. వీరి ఖండ కావ్యములందు పెక్కు కృతులలో ఒకటియో, రెండో ఇట్టి ఖండికలను కూర్చుట వీరికి పరిపాటి ఈ గ్రంధమున 'నిరాశ' ఖండిక అట్టిది.

కథాకావ్య నిర్మాణమునకు పునాది 'నిరాశ' ఖండిక, కథను సూటిగా రసోత్పన్న సంధాయకముగా కథనమొనర్చుట వీరి ప్రత్యేకత నన్నయ కథాకథన దక్షతను – భాసుని సన్నివేశ కల్పనా చాతురిని – తిక్కన రసాభ్యుచిత సంవిధాన శక్తిని పుణికి పుచ్చుకొనిన మహా కవి శ్రీ తుమ్మల. అంతియే గాక ఎఱ్ఱనార్యుని సూక్తి వైచిత్రి గూడ ఎడనెడ రుచి చూపుట వీరికి పరిపాటి 'శ్రీ వచ్చిన కాలనడ్డు చెనటులు గలరే' ఇందలి లోకోక్తి మర్యాద,

వారి సూక్తి వైచిత్రికి పరిపోషణము. ఇందలి వస్తువు ఐతిహాసిక ప్రసిద్ధము. కావున పూర్వాపర వివరణము అనావశ్యకము. వీరు సత్యవతి వర్ణన గావించిన తెఱగు నాతి విస్తృతము, నాగరకము, మనోజ్ఞము. "కోమలిఁ గన్యామణి సౌందర్య నిధిని యోజన గంధి దటిల్లతాంగి సౌజన్య ఖనిన్" అను విశేషణముల ద్వారా వీరు ఆమె రూపమును మనో నేత్రమునకు సాక్షాత్కరింప జేసిరి.

శంతనుడు సత్యవతిని గాంచి ప్రశ్నించిన తెఱంగు గూడ కవిగారి నాటకీయమైన శైలీ సంవిధానమునకు - అర్థ విస్తృతి నొసంగు సందర్భోచిత పద ప్రయోగ చాతురికి తార్కాణము.

"జవ్వన మిటు లేటిపాలు సలుపం దగునే"

"పాంథు నను దరింపగఁ జేయుమో నాతి"

ఇందలి వక్రోక్తి వైభవము, వ్యంగ్యోక్తి ఛాయలు కథా గతికి సూచ్యర్థ సూచకములు, వస్తు నిర్దేశకములు.

కవిత్రయ రచనా సంవిధానమును పూర్తిగా ఆరాధించిన గాని ఇట్టి పట్టు చిక్కదు.

# స్వీయతత్త్వ వివరణము

'తెలుఁగు లెంక' స్వరూప స్వభావములను తనకు తానుగా, సమగ్రముగా ద్యోతక మొనర్చునట్లుగా తెలిపిన ఖండికలు అనేకములు. ఇది కవుల సంప్రదాయము, నన్నయ మొదలు కొని నారాయణ రెడ్డి వరకు వెలసిన ఆంధ్ర వాఙ్మయమున ఇట్టి స్వోద్యమ ప్రకటనము సర్వ సామాన్యము. అట్టివానిలో 'కృతజ్ఞవాణి' యొకటి. మద్రాసులో జరిగిన సమ్మానమునకు కృతజ్ఞతగా కూర్చిన ఖండిక ఇది. నూట పదిహేను పంక్తుల చంపకమాలిక ఇది. ఇంత అతి విస్తృతి గల మాలికలు ఆంధ్ర సాహిత్యముననే మిక్కిలి అరుదు. విసువు గొలుపకుండ, వివరణ చెడకుండ, విషయ విశ్లేషణ మొనర్చుట కత్తితోటి సాము, అట్టి సాము ప్రదర్శనమును ధారా వాహికగా, మనో రంజకముగా యొనర్చిన వీరి కవితా పరిణతి శిఖర ప్రాయము. ఒక చిన్న మాలికకే పెద్దన్న పెద్ద అన్న అయిన సంగతి సరసు లెఱింగినదే గదా! ఈ మాలిక దానికి ఇంచు మించు నాలుగు రెట్లు ఆనాటి ఆంధ్ర భోజులు ఈనాడున్న ఎంత బాగుండెడిది?

ప్రశంసా సందర్భమునకు తన లోక కళ్యాణ దృష్టిని, సర్వోదయ మార్గమును యేమరకుండుట వీరి అభ్యుదయ ధోరణికి పతాక స్థానము.

వీరు 'సురిగిపోయిన కైతలు పోవ నేఁటికే నిరువదివేల పద్యముల కెక్కుడుగాఁ బదిలింపఁ గంటి'నని దీనిలో పేర్కొనిరి అందు పదునైదు వేల పద్యములు గ్రంధ రూపమున మనకు ఉపలభ్యములు ఇంకను వీరు తన స్వభావమును వివరించిన తీరు సుప్రశస్తము. 'కైతలో నెరసులు రామికంటె మును నే నవలంబము సేయు మన్గడన్ గొఱఁతలు రామికిన్ గడు నెగల్పడు మానిసిని' అని వీరు చెప్పుకొనిరి

# కొనలు సాగిన జాతీయ కవితలు
# కొసమెఱపు సందేశాలు

ఆధునిక ఆంధ్ర సాహిత్యంలో జాతీయ భావ స్ఫూర్తి - సామాజిక స్పృహ నిండుగా దండిగా వెలయించిన కవితల్లజులలో శ్రీ తుమ్మలవారిది ప్రధమ స్థానము ఒకవంక స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొనటం - మరియొక వంక గాంధీ సిద్ధాంతములను కవితా రూపంలో ప్రచారం గావించటం కారణంగా వారాస్థానాన్ని అందుకొన్నారనటం వాస్తవం ఈ గ్రంథ మందలి 'స్వతంత్ర భారతి', 'గాంధీ జయంతి' ఖండికలు ఈ విషయ నిరూపణమునకు ప్రత్యక్షోదా హరణములు

ఒకవంక స్వాతంత్ర్య సమరయోధుల త్యాగస్ఫూర్తిని గుర్తు చేస్తూ మరియొక వంక దేశాభ్యుదయ సాధనకు అనుగుణమగు బోధలను గావిస్తూ - వేరొక వంక గాంధీ మహాత్ముని సేవా దృష్టిని వివరిస్తూ ఈ ఖండికలలో కవి గారు భారతీయ సహోదరులకు హెచ్చరికలు దెల్పటం సుప్రశస్త విధానము ఈ ఖండిక వీరి సామ్యవాద ప్రియత్వమును, గాంధీ తత్త్వ మహత్వమును చాటు కవితా ఖండము

"కొడుకు చచ్చిన నాఁడె నడిచె బంది కొకండు

పడఁతి యొక్కతె సాగెఁ బ్రసవ వేదనలతో"

ఈ విధంగా స్వాతంత్ర్య యోధుల అవిరళ త్యాగ దీక్షను మనకు స్మరణకు తెచ్చిన విధం అపూర్వం ఆనాడు "చెఱకేగి లాటీల నుఱక నెత్తురు గార్చి - యురికంబముల కెక్క నోర్చి - నారీ నరశ్రేణి", బాపుజీ వాణితో కనువిచ్చి స్వాతంత్ర్య ఫలము తెచ్చిందని వారి ప్రవచనం

నరుని జీవనరీతి పరమార్థమయముగా మెఱయవలెనని, సమతా సమిద్ధమై

విరియ వలెనని వీరు తెల్పిన సర్వోదయ మార్గం వీరి సామ్యవాద ప్రియత్వమును చాటు ప్రతీక నిరుపేద పెంపు శాంతికి నెలవని భావించుట, 'కలిమిని పెంచుట ఈర్ష్యకు దాసోహనుటయే' యని మందలించుట వీరి హృదయ వైశాల్యము నిరూపించు పలుకులు. సత్యాహింసలకు స్వస్తి పలుకుడనుట తద్వారా గాంధీ ఆశయమును ఫలింప చేయుడనుట వీరి సిద్ధాంత సారము గాంధీ లేడని మీ రెంచెదరేమో ? అది పొరబాటు 'దీనమగు కుక్క కిడి - తినఁ జూచు భిక్షకుని కంటిలో' బాపుజీ కలడని వీరు వివరించుట ఈ భావనకు 'కొస మెఱపు'. 'గాంధీ జయంతి' ఖండికలో వీరు గాంధీని పురుషోత్తమునిగా చిత్రించిన విధము మహోత్తమము. గాంధీ సత్య గుణమునకు మారు రూపు - పేదల పాలిటి పెన్నిధి - వినయమునకు ప్రాపు - దరిద్ర నారాయణుల పాలి ప్రోపు - ధర్మ చింతనమునకు స్థానము - సత్యాగ్రహ విధానమునకు ఆస్థానము - పదవీ వ్యామోహ మెఱుగని నిస్వార్థ సేవా పరాయణతకు ఆధారము అగునని వీరు ప్రశంసించిన తీరు అనన్యము అంత మాత్రమే కాదు. అతడు మానవతకు పట్టుగొమ్మ యగుననియు - ఇట్టి గుణముతో భూమిని స్వర్గతుల్య మొనర్చె ననియు, నాకము దెసకు నడిపించె ననియు స్పష్టముగా వివరించెను గాంధీ ప్రశంస ఒక్క యీ ఖండముననే గాదు 'వినయాశ్రమ' 'కృతజ్ఞవాణి' మొదలగు ఖండికల యందును ఉద్వేగ పూరితముగా నొనర్పబడినది. అట్టి మహాత్ముని ఆత్మశాంతికి, ఆత్మ తృప్తికి కనీసము "మద్యపానమునకు మంగళము పాడుటే" సరియైన మార్గమని తెల్పుట 'కొసమెఱపు" సందేశము.

"ఉగాది ఖండిక యందును నేటి దుస్థితిని కనులకు కట్టించిన తెఱంగు మహనీయము, మాననీయము ఇది సంభాషణాత్మకమగు ఖండిక తుమ్మల వారి విశిష్ట రచనా ప్రక్రియ ఎల్లరకు సుబోధకమగు శైలిలో సామాజిక స్పృహను చిప్పిలచేయు ఖండిక ఇది. 'సంక్రాంతి ముచ్చట్లు' - 'వరినాటు' మొదలగు ఖండికలకు ఇది తోడబుట్టువు. అభ్యుదయ కవితల కన్న సరళము, సుస్పష్టమునగు పద్యరచన మిది

ఈనాటి సమాజమున నైతిక స్థాయి దిగజారుచున్నదనియు, స్త్రీకి భద్రత లేకుండె ననియు - ఎల్లెడల అశాంతి, అసత్య వాక్కు తాండవించుచున్నదనియు - హింసా భావం చెలరేగుచున్నదనియు - కుల మత ప్రాంత విభేదములు ఆచరణములో తొలగి పోలేదనియు - ప్రజలలో భోగాసక్తి పెచ్చు మీరుచున్నదనియు 'సోమ సుందరు'ని వాక్కుల రూపమున కవి ప్రకటించెను. ధైర్యము కరుణ చెలిమి నమ్రత మొదలగు గుణములను పెంచుకొని ప్రజలెల్లరు 'తమకు తామే దిద్దుకొనిన' నాడు సంఘము పురోగతి చెందునని విదిత మొనర్చెను.

ఈ ఖండిక వీరి చివరి రచనము ఇందు వీరి నైతికోద్ధరణ ప్రవణత తేటతెల్లము. సమాజాభివృద్ధికై వీరు నలిపిన పోరాటము, వీరు పడిన ఆరాటము ఇందలి కవితా వస్తువు.

ఉదాత్తసరణిని బ్రతుకుటకు ప్రజలెల్లరు కంకణధారులు కావలెనని 'రాయల'చే ప్రతిజ్ఞ చేయించుట కూడ వీరి కొస మెఱపు భావనయే

# కొన్ని సుద్దులు

శ్రుతి - సూక్తి - శుద్ధిః - శబ్దములకు తెలుగున 'సుద్ది' యని వ్యవహారము ఇది వికృతి రూపము. పై మూడు శబ్దములు విభిన్నమైన ప్రత్యేకార్థములు గల శబ్దములు ఆ మూడు విధములయిన అర్థములు మన తెలుగు సుద్దిలో నిబద్ధమయిన కారణముగా సుద్ది శబ్దార్థము అతి విస్తృతము. వినబడు పవిత్రమైన పలుకులు సుద్దమైనవి. సామెతు, లోకోక్తులు నానుడులు అను వ్యవహారమున నొప్పు పలుకుబళ్ళు సుద్దులు అట్టి సుద్దులను పద్యరూపమున వెలువరించి శ్రీ తుమ్మలవారు తెలుగు నీతిని - తెలుగు రీతిని చవిచూపించుట వీరి కృతకృత్యతకు నిదర్శనము ఈ సుద్దులు శారద పాదార్పితములగు పూజాపుష్పములు తెలుగు సరస కవి పండిత శిరోధార్యములగు దివ్యాక్షతలు ఇవి ఎక్కట్లకు, చక్కట్లకు, సందేశాలకు ప్రతిరూపములు

ఇందలి సుద్దులు కొన్ని ప్రభు శాసనముల వంటివి మరికొన్ని సుహృత్సన్నిభములు ఇంకను కొన్ని కాంతాసమ్మిత మృదుసార భాషణములు కొన్ని సాలంకారములు మరికొన్ని నిరలంకృతులు కొన్ని అనుకరణములు, మరికొన్ని స్వకీయములు. దృష్టాంతములచే విషయ మును సుస్పష్ట మొనర్చు ప్రజ్ఞ వీరికి సహజ సిద్ధము.

'లక్ష్మి దక్కునని తలంచెనా? మందర - గిరిని మోయునాఁడు కేశవుండు'

'ఏల వలచె విష్ణు నిందిర?' 'గిరిని మోసి పరుల తనిపె గాన'

'అన్న మాటను తప్పరా దన్నగోవు' ....... ... నొచ్చెనా ?

పాలు చిక్కని వయ్యును బంచదార - గలియకున్న రసజ్ఞ కీఁగలవె తృప్తి?

'పాలనమ్మువాఁడు ప్రోలెల్లఁ దిరుగాడు - మదిర నమ్మువాఁడు కదలకుండు' ఇట్టివి అపారములు - అనేకములు.

ఈ ఖండిక నందలి 5, 13 పద్యములలోని ఉపమా చమత్కృతి అత్యంత మనో హరము. ఏ విధమైన అలంకృతుల జోలికి పోక అతి సామాన్యముగా వీరు గూర్చిన నీతుల యందును కళా కమనీయత అంతర్లీనముగా భాసించు ననుటకు ఉదాహరణములు కోకొల్లలు.

"స్వర్గమన్ననేమి? సర్వస్వ మనదల - వంత లణcగ నప్పగింత కాక"

"కూడు లేక మూల్గు తోటి మానిసికి - నీ విచ్చు రొట్టెముక్క యీశ్వరునకు నొసcగు కాన్క"

"దీనతాహతుcడై కుందు మానవునకుc జేయు సేవయె మాధవసేవ"

తుమ్మలవారి హేతు పుష్టికి, సేవాదృష్టికి ప్రతీకలగు పసిడి పలుకులివి

ఇందలి రచనా విధానము సరళమయ్యు పేలవము కాదు ఇందలి జిగిబిగి బృహత్కృతులలోని గాంభీర్యమును, పటుత్వమును తలపునకు తెచ్చునట్టిది, వీరి రచనములోని లాలిత్యము "నాకధునీ పద్మవనీ ప్రాకట మాద్వీక పాక పరిపంక్తి"ని తలపించు నట్టిది

"యిద్దానిc ద్రోత మెచcదగిన చేత"

"శ్రీదేవి సేవ వలయు మేలి త్రోవ వలయు"

"సత్యశౌచ శాలి కాపదలు రావు, రాని సౌఖ్యములు లేవు"

"సాహితీ నాకవనము రసికలోక ధనము"

అంతియే గాదు దాతను "ఊరుగాయ ముక్కనుంబోలె చప్పరించుట" "మూcడు పూలాఱు కాయలై మెరయు" మొదలగు తెలుగు పలుకు బళ్లతో వీరికైత నుడికారపు సంపదను గ్రుమ్మరించు చుండును దిట్టలైన వీరు దిగి వచ్చి సామాన్య పాఠకుల నలరించు పలుకు పలుకుట వీరి పరిణతికి నిదర్శనము. ఈ విధంగా తుమ్మల వారి కైత రసికలోక ధనము

# చివర పలుకు

తుమ్మల వారు సమ సమాజ నిర్మాణమునే పలవరించుచు, కనుమూసి రనుటకు వీరి చివరి పద్యమే నిదర్శనము కుల భేదము వలదను బ్రాహ్మణుడు న్యాయబద్ధమగు లాభముతో తృప్తి నందు వ్యాపారి - వీరిరువురే సమ సమాజ స్థాపనకు ముఖ్యమైన కార్యకర్తలని తెల్పుట వారికి గావించిన హెచ్చరిక. లోక కళ్యాణమే ధ్యేయముగా, విశ్వశాంతియే లక్ష్యముగా, నెంచి తన కవితను తత్ గమ్యమును జేర్చు సాధనముగా పునీత మొనర్చి, తన జీవితమును సార్థక్య మొనర్చుకొనిన శ్రీ తుమ్మలవారు కృతికర్తలే గాదు ఉత్తమ ప్రవక్తలు, సంఘ సంస్కర్తలు గూడ

నాకీ అవకాశ మొసంగిన శిష్యుడు శ్రీ తుమ్మల శ్రీనివాసమూర్తికి నా కృతజ్ఞతలు. ఈ సమాలోకన, సమాలోచనములు అక్షర రూపము దాల్చుటకు తన సహకారము నందించిన చిరంజీవి టి. కృష్ణకుమారికి నా ఆశీర్వాదములు.

# కృతజ్ఞతలు

"దివ్యజ్యోతి" అను కృతిని నా తండ్రి తుమ్మల సీతారామమూర్తి గారు ఆరోగ్యము సరిగా లేనందువలన ప్రచురించకయె ఈ లోకమును వదలి వెళ్ళినారు. దీనిని వెలువరించుట నా ధర్మముగా భావించి, ఆ పనిని నేడు పూర్తి చేసితిని. ఇది తుమ్మలవారి చివరి గ్రంథము.

ఈ కృతిని కవిగారు కీ.శే. జనాబ్ గౌస్‌బేగ్ గారికి అంకితము చేసినారు. నేడు వారిద్దరు భౌతికముగా లేరు. వారిద్దరు జాతీయోద్యమములో కలసి పనిచేసినారు. వారిద్దరికి ఒకరిపై నొకరికి గాఢమైన గౌరవాభిమానములు గలవు. ఆ అనుబంధమునకు గుర్తుగా తుమ్మలవారు తమ కావ్యమును జనాబ్ గౌస్‌బేగ్ గారికి అంకిత మొసంగినారు. అంతేగాదు హిందూ – మహమ్మదీయ సఖ్యత కిది చక్కని జ్ఞాపిక కూడ. జనాబ్ గౌస్‌బేగ్ గారు స్వాతంత్ర్య సమర యోధులు, నిరాడంబరులు, సద్గుణ సంపన్నులు. జాతీయోద్యములో వారు లాఠీ దెబ్బలు అనేకసార్లు చవి చూసినారు; జైలు శిక్షలు అనుభవించినారు. వారు చీరాల వాస్తవ్యులు వారి రాజకీయ గురువులు ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాల కృష్ణయ్య గారు. వారు నిక్కముగా గురువునకు తగిన శిష్యులు. వారి శతజయంతి మహోత్సవము 1990 జనవరిలో వైభవముగా జరిగినది.

నేనీకృతిని జనాబ్ గౌస్‌బేగ్ గారి కుమారులు జనాబ్ ఖుద్దూస్ బేగ్ గారికి సవినయముగా సమర్పించితిని, దీనిని వారు స్వీకరించి నందులకు వారికి నా హృదయపూర్వక వందనములు.

ఈ కృతికి అలంకార ప్రాయముగా చక్కని పీఠికను వ్రాసి తుమ్మల వారి పట్ల భక్తిని, నా పట్ల శిష్య వాత్సల్యమును ప్రదర్శించిన ఆధునిక కవి శ్రేష్ఠులు, నా గురువులు శ్రీ తాళ్ళూరి సత్యనారాయణగారికి నా భక్తి పూర్వక నమోవాకములు. వారు పి.బి.యన్. కాలేజీలో ఆంధ్ర శాఖాధ్యక్షులుగా పనిచేసి, పదవీ విరమణ చేసినారు. వారు కవులే గాదు, విమర్శకులు కూడ. వారి కవితా మార్గము ప్రాచీనము, అయితే భావములు ఆధునికములు. వారి కావ్యములు తెలుగు భారతికి అమూల్యాభరణములు.

ఈ కృతిలో ముద్రించిన 1. రాజా వాసిరెడ్డి స్మృతి, 2. పోతన స్మృతి, 3. ఆంధ్ర లక్ష్మీ నరసింహ స్తోత్రము, 4. కృష్ణావతారము, 5. నిరాశ మున్నగు ఖండికలు భారతి, ఆంధ్ర పత్రికలలో ముద్రితములైనవి. వీటిని డా॥ సూర్యదేవర రవికుమార్ గారు శ్రమచేసి సేకరించినారు. వారు వృత్తిరీత్యా వైద్యులు, ప్రవృత్తిరీత్యా సాహిత్య పరిశోధకులు, విమర్శక శ్రేష్ఠులు. వారికి నా కృతజ్ఞతాపూర్వక నమస్కారములు.

ఈ కృతిని రమణీయముగా ముద్రించుటకు చక్కని శ్రద్ధ తీసుకొనిన శ్రీ నటరాజ ప్రింటర్స్ యజమానులకు, పనివారలకు నా కృతజ్ఞతలు.

ఇట్లు
విధేయుడు
తుమ్మల శ్రీనివాసమూర్తి

# నజరానా

(అభినవాక్కరలు)

నవయుగం బది, గాంధియుగ మది వేయేండ్లనాటిఁ బానిసఁము ద్రోపాడి
భువనంబునన్ దలయెత్తఁగా భారత భూప్రజల్ కంకణం బూని
త్రివిధ బహిష్కరణోద్యమంబు సబర్మతీయోగిరాడ్నిశ్చితంబు
నవునని యూరూర మొరయించు తూర్యాళి కభ్ర మల్లాడు కాలమది. 1

వేలు వేలు గడించున్యాయవాదులు గాంధి వినుచు సందేశమాలించి
మేలెంచి తమవృత్తి మాని కాంగ్రెసున కమేయమైన జనాదరంబు,
పాలకత్వంబు, రాఁదలఁచి వేసటనోర్చి పల్లెలన్ గుఱువెట్టువారి
మేలుకొల్పఁ దొడంగి రపుడు దాస్యముకంటె మిత్తి మంచిదిసుఁడీ ! యనుచు 2

మాయూరు కావూరి కేతెంచె ధర్మజ్ఞ మౌళి నాఁ దనరు శిష్టాన్వ
నాయుండు పార్వతీశము సమిత్రమ్ముగా వారింపరాని వేడుకను;
వేయించిరపుడు పెద్దలు తమ్మటన్ నాల్గువీథులన్ గర్జించునట్లు
సాయంతనపువేళ సాగె వాగీశ్వరీ సదనాంగణమునన్ సదస్సు 3

పడరానియిక్కట్లు పడి, జర్మనీ నోర్చి పదపడి తమకున్ స్వరాజ్య
మడిగిన పంజాబువారలం దెలవార లపుడు వేల్వేలను గాల్చి
మడియించినట్టి రాక్షసకృత్యమును జాటి మనుగడన్ మఱచిపోలేని
యుడుకు నాపాదించెఁ బార్వతీశము సదస్యులచిత్తవీథి నవ్వేళ 4

ఈయన్నతో నేగుదెంచిన గౌసుబే గింగ్లీషువారు కయ్యమున
శ్రేయమందిన వెన్క నోడినటర్కీకిఁ జేసిన ఘోరాపరాధ
మాయుర్వినేలు తేనికి వన్నె దెచ్చు మతాధికార మణంచివేఁత
హా ! యని ముస్లిముల్ దురపిల్లుటయుఁ దెల్పె నావేశ మార్తియున్ విరియ 5

ఎట్టిటో నిలఁబడి యే నేలుబడి మెఱిఁగినంత వచించి గాంధి
పుట్టినాఁ డెన్నఁడో పోయిన భారతభూమీ స్వతంత్రతన్ దేర
దిట్ట యీాతం దార్షతేజంబు బలముగా దిక్కులన్నిటి నోర్వఁ జాలుఁ
గట్టుఁడీ కంకణం బితని మార్గమ్మునఁ గదలుఁడీ సోదర్యు లంటి. 6

నా పల్కులను మెచ్చి పార్వతీశము కొన్ని నాళ్ళు మాతో నీవు నుంట
కూఁపవే తల యనఁ జిత్తముచిత్తమం చుత్తరం బిడితి నా సభను;
రేపల్లెసీమలో నటనటం గాంగ్రెసు రీతిని జాటుచున్ మేము
రేపుమాపులు విస్మరించి, పైనము లాచరించితిమక్కాలమందు. 7

గరిమ దుంపా వేంకటేశ్వరుఁ గనగాలఁ గాంగ్రెస్సు బంటుఁగాఁ జేసి
యరుదారుగతి భట్టిప్రోల్ ప్రేఁగు గిరిరావు నఱకడన్ నిల్పితి మపుడు
నరసింహు వేంకటేశ్వరు ధూళిపూఁడిలో నగరమ్మునం దుత్కటముగ
మెఱయింపుఁ డీ నిరాకరణోద్యమం బిచ్చు మేలుతీరనుచు వేఁడితిమి. 8

పదపడి దక్షిణాంబుధి చెంతఁ గల నిజాంపట్నమ్మునకుఁ బోవుదెంచి
మదినిడి కాజవా రిదు విందునకు నుబ్బి మాపటితతి నూరినడుమఁ
గదిరినసభ నేలికలచంద మెఱిఁగించి కాంగ్రెసు బలిమి నార్జించి
పెదపల్లి చూచి, మున్ముదురు చేరితిమి అంపిల్లిన యుత్సాహమునను 9

విదుడు కృష్ణారావు యాజమాన్యమునఁ బెద్దలపిన్నలతోడ
నొదవినగోష్ఠిలోఁ బార్వతీశ్వరుఁడు నేఁడోటు నిచ్చుట బానిసమున
కెదతోడ స్వాగతసత్కారము నొసంగుటే! యనఁగా జనాబ్ గౌసు
కదనం బిది మతాలకులముల పొడలేని కర్ణమయ్యా! యని వినిచె 10

పదినాళ్ళ యాత్రగా నిది సాగుటం జేసి బడలికం జిక్కిన మేము
పదపడి స్వగ్రామములకుఁ జేరితి మంత బహుమార్గములఁ బన్నుబెడఁద
పొదలించు పురముగా నేర్పడెఁ జీరాల పొన్నున్నవారు, సౌఖ్యముల
కెదురుచూచెడివారు కోరఁగా దొరలు సరే! యని చట్టమ్ము సేయ 11

రామదాసునకు గోపాలకృష్ణుకు భారతమహీస్వాతంత్ర్య సిద్ధి
కామించి పెనఁగు దిట్టకుఁ బ్రజల్ తమపాలి కష్టంబులను విన్నవించి
యామేటిమాటనే దలఁదాల్చి యూర్వీడి యలఁతిపాకాలలో నొదిఁగి
సీమదాఁక వెఱంగు పుట్టించిరానాఁడు చీరాల – పేరాలవారు 12

చీరాల కాఁపైన గౌసుబేగీ సుప్రసిద్ధ సంగ్రామమ్ము నందు
శ్రీరామదాసున కండగా నిలిచి యార్జించె నెల్లరి మెచ్చుకోలు
కారాగృహమ్మునం దెన్నిన్ని తడవలో కాలమ్ము గడిపి నిరంత
రారాధకుండుగా నిలిచె దేశమ్మున కదిర ! కాయం బూడ్చు దనుక 13

అనఘుఁడు యోగీంద్రుఁడగు గాంధి మెఱయు మా యభిజనంబున గుదుర్కొనిన
వినయాశ్రమం బెల్లవిధములన్ గెలుపంద, విదిత సీతారామశాస్త్రి
ప్రణుతచారిత్రుండు బసవయ్య, దుర్గాంబ, బ్రహ్మయ్య, రంగయ్య, తనియుఁ
దన సేవ లర్పించి ధన్యతం గనె నమ్రతానిధానము గౌసుబేగు. 14

"కవిజీ!" యటంచు నన్ గనినంత గట్టిగాఁ గౌఁగిటం బొదివి మన్నించు,
నవభారతమ్ముగా బాపూ చరిత్రమున్ వ్రాసి ధన్యత గంటి వనుచు,
కవిత పల్కుట చెఱసాలలోఁ గాలమ్ము గడుపుటకంటె హెచ్చైన
నెవు లనున్, బిడ్డలు సుఖముండిరే యనున్, నెమ్మిసంద్రము వోలె నెగయ 15

మంచానఁ బడె గౌసుబే గన్నవార్త నా మదిని గారింపఁగా వెడలి
కాంచితి నితని, మీ వెత లెట్టి వంటిని, "కవిజీ" సలాము సలామ
టంచు నాల్గైదుమార్లనెఁ గాని యొండు పల్కనలేక యూర్చుచున్ గనుల
నించె నీ రవలఁ గొన్నాళ్లలో మేన్వీడె నెయ్యురాప్తులు పెద్దపొగుల 16

చా వెల్లరకును దప్పని విపత్తే; బంటు చక్రవర్తియుఁ జచ్చువారె,
యీ వసుంధర నొడల్ దాల్చిన ప్రతిజీవి యీల్గుట నిక్కంబ, కాని
యీవిలో సేవలో నుతులందుకొన్నవా రిహయాత్ర చాలించినపుడు
బావురు మనుట తప్పదు వేదవేదాంత పరమార్థవేత్తకునైన 17

ఛాత్రుఁడై, మిత్రుఁడై సడిసన్న వేంకటేశ్వరుని గాఁకరపర్తివంశ్య
గాత్ర మీ కొనకున్న నపుడప్పు డెదబల్మిఁ గదలి చీరాలకుఁ జేరి
మిత్రుని గని సాహితీప్రసంగంబు లామెతలుగాఁ దనియింపఁ బగలు
రాత్రియన్ భేదమ్ము మఱతు నీసుఖము శారదప్రసాదం బనుకొనుచు 18

చెలికాని యింటికి నొకనాఁడు వచ్చుచుఁ జెక్కబోర్డును దారిప్రక్కఁ
దిలకించి దానిపై "గౌస్‌బేగురోడ్డ"ను తియ్యనిపల్కులు చదివి
పులకించి మంచిపనిం బొనర్చిరి బలా ! పురమేలువా రని యెంచి
యిల నేఁడు లేఁడు గదా! మిత్రుఁ డితఁ డని యెదఁద నింపుకశేషపు వగచి 19

ఈ 'చెక్క' యెన్నినా ళ్ళితని కీర్తిని నిల్పు నీ పురమ్మున యందు, శేషపు
రాచతికము సేయ వచ్చు వారందఱు రద్దు గావింప కీ చిన్నె
నాఁచి మన్నింతురా! యేమొ? తిప్పన్నరో డ్డప్పన్న రోడ్డుగా నగుట
చూచుచున్నాము కదా కొన్ని యెడల నిచ్చోచేయఁదగుగృత్య మేమి ? 20

నాకైత చాలదా గౌసుకీర్తిని నిల్ప నగము లంబుధు లుండుదనుక
ఈ కృష్ణవేణి గౌతమి పినాకిని తెల్గుటిలకు నన్నముపెట్టు దనుక
లోకంబు లేలు వెంకన్న తిర్మలలో వెలుంగులన్ విరియించు దనుక
శ్రీకవిత్రయభారతం బాంధ్రజాతి కుజ్జీవకంబుగ మ్రోయుదనుక 21

చాలుఁజాలు సుహృన్మణీ మామకీన మీసాహితీ సమ్మానమంది
నా లాల్ బహద్దరుశాస్త్రి, లూథరుకింగు నర్మిలిన్ నినుఁ బెద్దసేయ
మేలుమేల్ తుమ్మలకవి సదాశయుఁడు సుమ్మీయని బాపుజీ పల్క
నేలోటు లేని యానందరాజ్యంబు నిఁక నేలుకొమ్మా ! గౌసుబేగ ! 22

కలఁడిందు జగదేకగురుఁడు భారతమహీ కల్యాణసంధాతగాంధి
కల రిందు బాపుజీ కదనమ్ములకు దూఁకి కడిమి చాటిన యోధవరులు
కల రిందు యుగధర్మగతిఁ గృతుల్ పల్కిన కవిపుంగవులు, సదాశయులు
కల రిందు దాతృతానిధు లాత్మవేత్తలు గౌసూ ! గ్రహింపు మీకైత. 23

ఏఁడీ ? గ్రహింప నీ గౌసని ననుఁగొంద తెగతాళి సేయుదురేమొ;
చూడనేర్చినవారు, నిన్నుర్వి, నబ్ధిని, సురమార్గమునఁ దారకముల
గాడుపునందు, నింగలమునందు, సహస్రకరునందు, బ్రాణులం, దెల్ల
మాడువులం, దద్రులందుఁ, జూతురు "పరమజ్యోతి" వీవు గౌస్‌బేగ ! 24

(పై పద్యములన్నియు అభినవాక్కరలు ఈ ఛందము తుమ్మలవారి సృష్టి. ఈ పద్యమున ప్రతిపాదమునకు 6 ఇంద్రగణములు, 1 సూర్యగణము ఉండును. 5వ గణము మొదటి అక్షరము యతి స్థానము. ప్రాస నియమము కలదు) (26-4-86)

# రాజావాసిరెడ్డివారి స్మృతి

శా॥ శ్రీమత్క్రమకులాబ్ధిచంద్ర ! గుణరాశీ ! వేంకటాద్రీంద్ర సం
గ్రామోర్వీ సురరాట్కుమార ! నగధీరా ! సుందరాకార ! నా
నామాణిక్యవిరాజమానమకుటాంచన్మస్తకా ! కోవిద
స్తోమస్తుత్యచరిత్ర ! దీనజనబంధూ ! రాజకంఠీరవా ! 1

చ॥ అరయఁగ నీవు జాముతడ వర్థులకిచ్చు ధనంబుతోడ నీ
ధరఁగల రాజు లందఱును దా మొకవత్సర మాశ్రితాళికిన్
గరుణనొసంగు విత్తమయినన్ సరివచ్చునె ? జగ్గధారుణీ
శ్వరతనయా! దయానిలయ! సర్వధరాధిప! లోకభూషణా! 2

ఉ॥ ఎంతతపం బొనర్చెనో భళీ! యమరావతి పట్టణంబు భూ
కాంతవరేణ్య! మీరచటఁ గాపురముండగ నాంధ్రదేశ మెం
తెంత తపం బొనర్చెనో ? తదీశుఁడవై వెలయంగ నీవు ధీ
మంత ! కళానిశాంత ! గుణమండన ! శాత్రవలోకభంజనా ! 3

సీ॥ తన యెత్తు బంగారు త్రాసునందున దూఁచి, బ్రాహ్మణోత్తములకుఁ బంచిపెట్టె
నన్న ప్రదానంబు ననుదినంబును కోటి, ధారుణీసురులకు దయ నొనర్చె
అగ్రవర్ణులకిచ్చె నగ్రహారశతంబు, నతివేడ్కతో గోరినట్టిచోట్ల
మించినభక్తి గట్టించెను శివకేశ, వాలయంబు లనేక మవనిలోన 4

గీ॥ సేతుశీతాద్రిమధ్యధాత్రీతలమునఁ, దనకు సరియనఁగా దగుదాతలేడ
టంచు బేరందె నఖిలజనాళిచేత, వీరుఁడౌ వేంకటాద్రిపృథ్వీవరుండు 5

సీ॥ సంస్కృతాంధ్రాదిభాషలలోన మిక్కిలి, పాండిత్యవిభవంబుఁ బడసి మించి
కవిపోషణంబందు ఘనుఁడైన కృష్ణరా, యలకన్న మిన్నయన్ ఖ్యాతినంది
దేవిభాగవతాది దివ్యకావ్యంబులఁ, గృతినంది సాటిభూపతులమెచ్చ
పండితకవికోటివలన 'నద్యతనభోజ' సమాఖ్య బిరుద రాజంబునంది 6

గీ॥ తోటిరాజులలో నెల్ల మేటి వగుచు, వాసిగాంచితి వయ్య శ్రీవాసిరెడ్డి
వేంకటాద్రిమహీపతి! విమలకీర్తి!, కవిజనస్తుతనామ! సంగ్రామభీమ! (1921)–భారతి 7

# పోతన స్మృతి

శా॥ శ్రీమద్బమ్మెరపోతనాహ్వయ! యశస్సీమంతినీకామ! శ్రీ
రామస్వామి పదారవింద భజనా ప్రహ్లాద ! రాజద్గుణో
ద్దామా ! కేసనపుత్ర ! ధీరసుకవీంద్రా ! దివ్యచారిత్ర ! నీ
సామర్థ్యం బెఱింగింప నల్వకయినన్ శక్యంబె ముమ్మాటికిన్ 1

మ॥ బళిరే ! నీ పద కోమలత్వమును నీ పాండిత్యమున్ నీ విని
ర్మలనారాయణపాదభక్తియును నీ మాధుర్య పాకంబు నీ
లలితంబైనపదప్రయోగము రసాలంకారచాతుర్యమున్
దలఁపన్ వేఱొకసత్కవీంద్రునకు లబ్ధంబౌనె ? నిక్కంబుగన్ 2

సీ॥ ఘనపండితోత్తముల్గని మెచ్చి శీర్షంబు, లూఁచుచందంబున నొక్కచోట
సత్కవిప్రకరంబుఁ జదివి సెబాసంచు, నుల్లాసపడురీతి నొక్కచోట
పౌరాణికశ్రేణి పరికించి యిది పురా, ణోత్తమం బనునట్టు లొక్కచోట
భక్తాగ్రగణ్యులు బఠియించి హరిభక్తి, జిక్కి చొక్కెడు లీల నొక్కచోట

గీ॥ నాంధ్రదేశీయులెల్ల రాహో యనంగ, భాగవత సత్పురాణంబు భవ్యశయ్య
దెనుఁగుఁ జేసిన నిన్నుఁ గీర్తింపఁ దరమె ?, బుధనుతివిరాజ బమ్మెరపోతరాజ ! 3

ఉ॥ నన్నయతిక్కనాది కవినాథు లనేకులు సంస్కృతంబునం
దున్న పురాణరాజముల నొప్పుగ వ్రాసిరి తెన్గుబాసయం
దెన్నఁగ నాంధ్రభాగవత మీవురచించితి వాపురాణముల్
విన్ననువైన మీమృదుకవిత్వవిధేయతఁ జూపకుండునే ?

సీ॥ పాఱుఁబోతునకైనఁ బౌరుషం బొదవు నీ, సంగ్రామవర్ణనల్ చదువుచున్న
రహి నపుంసకుఁడైన రమణులగోరు నీ, శృంగారవర్ణనల్ చేరివిన్నఁ
గటికవానికినైనఁ గఱఁగుఁ జిత్తంబు నీ, కరుణారసార్ద్రసత్కథలఁ గన్న
నజ్ఞానియైన దివ్యజ్ఞానరాశియై, పొదలు యుష్మద్భక్తిబోధనెన్న

గీ॥ క్షితి భవద్విరచిత భాగవతపురాణ, రత్నమున కెద్దిసాటి పురాణకోటి
మాన్యచారిత్ర ! కేసనమంత్రి పుత్ర! సద్యశస్సాంద్ర ! పోతరాట్సత్కవీంద్ర ! 5

సీ॥ అనఘ ! నీకావ్యకన్యామోహితాత్ములై, నీచెంత కరుదెంచి నిఖిలనృపులు
షడ్రసోపేతభోజనముఁ బెట్టెద మన్న, గూడదం చంబలి గ్రోలినావు

పసిడిమేడలలోన వసియింపుఁ డీరన్న, నొప్పక పాకలో నుండినావు
పట్టుపుట్టంబులఁ గట్టఁబెట్టెదమన్నఁ, గాదని పేలికల్గట్టినావు

గీ॥ ఎన్ని శుల్కంబు లొసఁగెద మన్న నీచ, మానవున కీయ మామక మాననీయ
కావ్యకన్యనటంచు సద్గతుల గోరి, చెలఁగి శ్రీరామమూర్తి కిచ్చితివి, బళిరె !

చ॥ వినుతకవీంద్ర ! కొంద అవివేకులు గాకవులందునం దలా
క్షణికుఁడటంచు మిమ్ములను జాటిరి దానఁ గొఱంతగల్గునే !
ఘనతరగంధసింధురము గ్రామమునం బయనం బొనర్చుచో
శునకము లన్నియున్ మొఱుఁగుచో గజరాజున కేమిలోటగున్ ?

సీ॥ పాపనాశన మిహపరసౌఖ్యదము భాగ, వతపురాణంబు భవద్రచితము
నీయిష్టదైవము నిఖిలేశ్వరుం దగు, రఘుకులాభరణుఁడు రామమూర్తి
మదినెంచ నీబావమఱఁది సర్వకళా స, నాథుఁడై వెలయు శ్రీనాథసుకవి
కవిశిరోమణియనం గణుతికెక్కినయట్టి, మల్లన్న నీదు కుమారకుండు

గీ॥ బళిరె ! నీవంటి సత్కవిప్రవరుఁ గన్న, యాంధ్రమాత యదృష్ట మేమనఁగవచ్చు
వసుధ నేతల్లిగాంచె నీవంటి కొమరు, భూరిగుణధుర్య ! బమ్మెరపోతనార్య ! 8

సీ॥ ఆంధ్రకవిశ్రేష్ఠులందఱు నిన్గవి, సార్వభౌముఁడవంచు సన్నుతింప
వ్యాకరణాచార్యలోకచూడామణి, వని సత్కళావిదుల్ వినుతిఁజేయ
తర్కశాస్త్రజ్ఞులు తార్కికోత్తముఁడ వ, టంచు నిన్నెంతయు నభినుతింప
స్థిరభక్తివేదాంతజిజ్ఞాసువులు మహా, వేదాంతివని నిన్ను వేడుచుండ

గీ॥ పరమభక్తుఁడ వని భక్తవరులు గొల్వ, జగతి హాలికవృత్తి స్వచ్ఛందజీవ
నం బొనర్చిన నిను వర్ణనంబొనర్పఁ, బుడమి నెవఁడోపు బమ్మెరపోతరాజ ! 9

**(1923)** – భారతి

# దేశబంధు స్మృతి

సీ॥ సర్వస్వమును దేశజననిదాస్యముఁ బాప, ధారవోసిన మహోత్యాగమూర్తి
వెదకి పేదల నెల్లవిధుల రక్షణచేసి, ప్రథితిగాంచిన దీనబాంధవుండు
ద్వంద్వప్రభుత్వ పద్ధతి రూపుమాపఁగాఁ, బోరి గెల్పందిన వీరమౌళి
దీక్షతోడ స్వరాజ్యపక్ష సైనికకోటి, నడపి పేర్గన్న సేనావిభుండు

గీ॥ గణుతికెక్కిన భారతకర్మయోగి, ప్రణుతికెక్కిన మంత్రతంత్ర ప్రయోగి
యద్వితీయ స్వరాజ్యభోగానురాగి, యకట ! దేహపరిత్యాగి యయ్యె నేడు 1

సీ॥ పడిపోయె నేఁడు నాకుడిబుజం బని యెంచి, దిగులొందుచుండె గాంధీమహర్షి
నన్నుద్ధరించు నందనుఁడేగె దివికంచుఁ, బలవరించుచు నుండె భరతమాత
పతి వోయె నా కింక గతి యెవ్వరని యేడ్వ, సాగె స్వరాజ్యపక్ష ప్రజాళి
యాత్మీయరాష్ట్రసింహము వోయె ననుచుఁ జిం, తించుచుండిరి వంగదేశ జనులు

గీ॥ అకట! కలియుగరాధేయుఁ డస్తమించె, ననుచు నర్థార్థులెల్లరు నడలుచుండి
రిట్టి దుస్థితి మా కంటఁగట్టి పెట్టి, దేశబంధూ ! సుధర్మకై తివుట పడితె 2

సీ॥ కబళించితివి జగత్కల్యాణదాయి దా, దాభాయి నానాఁడు తనివిదీఱ
దిగమ్రింగితివి మాతృదేశభక్తవతంసు, గోక్లేమహాశయు న్గోర్కిదీఱ
మ్రింగివైచితి వాక్రమించి పాంచాల వీ, రవరేణ్యకోటి నారటముదీఱ
గుటకవైచితి విసీ ! కుటిలాత్మవై బాల, గంగాధరుని సముత్కంఠదీఱ

గీ॥ నిందఱన్ బలిగొనియు సంతృప్తిలేక, చిత్తరంజను విఱిచివైచితివె ? నేఁడు
కట్ట ! నీ కెంతటి దురాశపుట్టె నమ్మ !, పూజ్యులౌనందురే ? నిన్ స్వరాజ్యశక్తి ! 3

22-6-1925

# ఆంధ్రరత్నము స్మృతి

సీ॥ ఆంధ్రగీర్వాణహూణాది సాహిత్య సా, మ్రాజ్యంబు నేలిన రాజరాజు
ప్రాచ్యపాశ్చాత్య సంబంధి వేదాంత వా, రధి మథించిన బుధారాధ్యయశుఁడు
బౌద్ధ హిందూ క్రైస్తవమహమ్మదీయాది, మతమర్మములు గన్న మహితగుణుఁడు
వివిధనాగరికతావిజ్ఞానములఁ బరి, శోధించినట్టి సంశుద్ధమూర్తి

గీ॥ దీక్ష విడువని భారతదేశభక్తుఁ, డిద్ధచరితుండు గోపాలకృష్ణు డాంధ్ర
మాతృకాగర్భరత్నంబు మనల విడిచి, దివికిఁ బయనించె ఘోరదుస్థితి ఘటించె. 1

సీ॥ ఎవ్వాని మధురవాగింద్రియమ్మున మించు, నవరసంబులు చింది నాట్యమాడు
నెవ్వాని మోహనాకృతి గాంచి లోకంబు, మేలు మే లని పొంగి మేను మఱచు
నెవ్వాని పాటవంబెల్లదీవుల యందు, స్వేచ్ఛావిహారంబు సేయు చుండు
నెవ్వాని వాగ్వాద మెంతేని నిశితమై ప్రతివాది ధీరతాచ్యుతు నొనర్చు

గీ॥ నతఁడు భారతమాతృపాదారవింద, ఘటిత దుర్దాస్యశృంఖలాఖండనోత్థ
చండ రణరంగ వీరమార్తాండుఁ డాంధ్ర, రత్న మింక లేఁడె మనకుఁ జీరాలవిభుఁడు 2

సీ॥ పిలిచినంతనె తల్లిపిలుపునాలించి "అ, మ్మా! యేమి సెల" వంచు నడుగునాఁడు
మహనీయులగు లోకమాన్యాదులఁ దలంచి, కంకణంబును గేలఁ గట్టునాఁడు
రాజకీయోద్యోగరాజంబు నల్పత్ృ, ణప్రాయముగ విడనాడునాఁడు
తెలుఁగుసీమలనెల్లఁ దిలకించి దేశదు, స్థితులు వర్ణించి బోధించునాఁడు

గీ॥ కారలోఁ జిక్కి కాలంబు గడపునాఁడు, క్రొత్తచీరాల – పేరాల కూర్చునాఁడు
ఎట్టి దీక్షాబలంబు నిన్నెనసియుండె, నది మముం జేరుఁగాక ! వీరాంధ్రమౌళి ! 3

**15–6–1928**

# నాగయ్య స్మృతి

గీ॥ విదియజాబిల్లి రేకల వేయిమార్లు, కనెడి భాగ్యము దక్కె నాగయ్య ! నీకు
ఎన్నఁదగు నాయు విదియైన నిన్నుఁ బోలు, లోకసేవకునకు నల్పమే కదయ్య ! 1

గీ॥ సంతత ప్రజాసేవలో స్రగ్గువారు, పరులసుఖ మాత్మసుఖముగా నరయువారు
దవ్వగుట యోర్వఁజాలదు ధర; నిరంత, రాయురారోగ్యములు వారి కాసచేయు 2

ఆ॥ కర్షక ప్రజావికాసంబు దేశంబు, నుద్ధరించు నన్న బుద్ధితోడ
నిన్న మొన్న గాదు నీ వర్పదేఁడుల, నాఁడె ! నడుముగట్టి నలఁగి తౌర ! 3

గీ॥ అచట నచట భవాదృశులబ్బుకతనఁ - గడలుకొన్నది రైతురంగా మహత్త
విశ్వకర్షకనేతగా విమలశీల - దాతగా నుతులందె నుదాత్తుఁడితఁడు 4

క॥ ఈ సజ్జన చూడామణి, నీ సేవానిష్ఠ నీ మనీష నిజోప
న్యాసమ్మున మును మెచ్చుక, యేసభ నేసీమఁ బల్కె నితరాంశములన్ ? 5

క॥ బడియైన బాటయైనను, సడిసన్న కళాతపస్విసత్కృతి యైనన్
బొడమినదా ! నీవు కడుం, గడు వేసటపడక యప్పికట్ల పురానన్ 6

ఆ॥ అప్పికట్ల యనిన నాచంట నాగయ్య - మదికి వచ్చు సర్వ మండలముల
మఱవలేరు నిన్ను మానవుల్ తెమ్మెర - వీచుదనుక మల్లె పూచుదనుక 7

7-6-81

# అనసూయ స్మృతి

(ఆంధ్ర లొయోలా కళాశాల వ్యవస్థాపకులలో ప్రముఖులైన
శ్రీ కాట్రగడ్డ రఘురామయ్యగారి సతీమణి)

చ॥ కుసుమసమృద్ధితోఁ బసపుఁగుంకుముజల్లుల వెల్గువెల్లితో
నొసపరిబందుగుల్ పరపునూర్పుల వెచ్చనతో విచారముల్
ముసరని మోముతో సుకృతమూర్తులు నా నుతిగన్నవారికిన్
వసపడు దివ్యలోకమున వాలితివా మము వీడి సోదరీ ! 1

ఉ॥ రామునిగొల్చినట్లు రఘురాముని గొల్చి నితాంతగౌరవ
శ్రీ మహనీయవై వినయసేవధివై కరుణావిధేయవై
ధీమదపత్యసంపద నుదీరితవై విజితాత్మవై సతీ
స్తోమలలామ వైతి వనసూయ ! నినుం గొనియాడ శక్యమే ! 2

గీ॥ పేరు కొందఱకున్ నేతిబీఱ కాఁగఁ, గొందఱకు రసాలం బయి కూర్చు యశము;
లేశమును నీకు నీరస లేమిఁజేసి, సోదరీ ! భవదాఖ్య సంస్తుత్య మయ్యె 3

ఉ॥ అత్రియ నీవిభుండు, జగదభ్యుదయంబు వరించి యుత్తమ
చ్ఛాత్రుల నంతరింపఁగల సద్గురుపీఠము పార్థివీటికిన్

మాత్రవనీగళస్థ మణిమంజులమాలకుఁ జేర్పఁగాఁ బగల్
రాత్రియు విస్మరించి ఋషిరాజగుటన్ మహిళామచర్చికా ! 4

చ॥ రుసిపని యింద్రియార్థముల రోయుట, తత్త్వరహస్యవేత్తగా
మసలుటగాక సేవదెసమక్కువ చూపుట, యైహికార్థముల్
వసపడునట్లు లోకమునవారికి దయ్యుట, పామరప్రజన్
బసరపుబాటనుండి నరపద్యకుఁ జేర్పఁగ నారటింతయున్ 5

గీ॥ శ్రుతులు గోవులు సూనృతవ్రతులు దాన, రతులు నీవంటి సత్ పతివ్రతలు గాక
యెవ్వరు మహీభరమ్ము సహింపనేర్తు ? రెవ్వ రీ కలికలుచ మాయింపఁగలరు ? 6

ఉ॥ నీపతి రామభక్తిగణనీయుఁడు శ్రీరఘురాముఁ డాంధ్రసే
వా పరతంత్ర చిత్తుఁడు భవద్యశ మాశశి భాస్కరమ్ముగా
నీపుడమిన్ దనర్చుపని కీకొని చేకొని రామగాథ పు
ణ్యాపణ మందచందముల కద్దముగా వెలయించె మానినీ ! 7

ఉ॥ రామునివంటివారు కలరా నరు లన్యు లశేష సద్గుణ
స్థేమము నాఁచికొన్న ప్రభుశేఖరు నీతని వేల్పుఁగా బుధ
గ్రామము నమ్మికొల్చుఁగద ! కల్కియు ముల్కియుఁ బల్కునున్ రఘు
స్వామికి నొక్కఁడే యనిన సైఁపనివా రిల నుండరేకదా ! 8

ఉ॥ దిక్కుదిబాసిలేని పెడదీవిని దుర్విధికోడి నిల్చినన్
రక్కస రక్కసుల్ దురితరాసులు కత్తి కటారి దూసినన్
ధిక్కృతశంకయై నిజసతీత్వమహత్త్వము గాచుకొన్న సీ
తక్కచరిత్ర రామకథకాంతరకాంతి కదా ! యవీయసీ ! 9

సీ॥ ఎది సుఖమ్ములయందు నిమ్ముదప్పులయందు, నద్వైతపరిపాటి నవధరించు
ఎది యెల్లదశలలో నెడపడ కితరేత, రస్వాంతములకు నూఱట ఘటించు
ఎది వార్ధకస్థితినేని హార్దమ్మున, కావంత కొఱంత దాయమికిఁ బెనఁగు
. ఎది మెల్లమెల్ల జంకు దొలంగ, సిగ్గు జా, ఱఁగ నారఁబండినరక్తి నలరు

గీ॥ నదికదా జంటతన మన నదికదా గ, ణేయ దాంపత్య మన; దీనినిలుపు పొలుపు
నభిలషింతురు సడిసన్న యాలుమగలు, మప్పెదరు లోకమునకు ధర్మంపుగుట్టు 10

నవంబరు 1982

# గాంధి జయంతి

ఆ॥ మగుడ వచ్చె బుద్ధభగవానుఁ డనుచు ని - య్యవని యెవని చంద మరసి మురిసె
నమ్మహాత్ముఁ డుదితుఁడైన ప్రొద్దిది; యిది - యుర్వి కుద్దిలేని పర్వదినము 1

ఆ॥ ఏను వేల్పుగాను, మానవుఁడను; మహో - పురుషులియ్యకొన్న తెరువు నాది;
పేదవానిఁ దేర్పఁ బెనఁగుదు; నతనిలోఁ - గాంతు నీశు; నన్న గాంధి నెంతు 2

ఆ॥ అప్పుడపుడు తప్పటడుగులు వైచెద, మరల మంచిబాట కరుగుదెంతు
పలికిన ట్లొనర్ప నలఁగుదు నే; నన్న బాపు సూనృత స్వరూప మనెద 3

గీ॥ అలఁతిమానిసి నేను, నా కలవియైన, చేఁత మానవులందఱున్ జేయగలరు
చాలు నొకయోర్మి వీరికిన్ జయము గూర్ప, నన్న బాపు గదా వినయమ్ము ప్రాపు 4

గీ॥ రామునకు రాట్నమునకు వేఱడములేని - భక్తిఁ జాటుచు నేకులో బయలుమెఱయు
నూలున దరిద్రనారాయణుని గనంగ - నేర్పిన మహాత్ముఁ గారుణ్యనిధిని దలఁతు 5

గీ॥ మరల నాకు మనుష్యజన్మము లభించు - భాగ్య మబ్బిన మలమెత్తుపని వరింతు,
సుగతి గాంతు నటన్న కస్తూరి భర్త - యెంత యెదిగెనహెూ ! ధర్మచింతనమున 6

గీ॥ పగతుఁ బరిమార్ప కాతని పరువుదీయ, కతని దుర్బుద్ధి నణఁగించి యతని చెల్మి
నతని మన్ననఁ బడయు సత్యాగ్రహంబు, నడుప నొకగాంధికే చెల్లినది జగాన 7

గీ॥ శత్రువు పిసాళి యగుఁగాక జగము తనకు, నందయగు నన్న విశ్వాస మగ్గలించి
కత్తికిని మిత్తికిని జంక కెత్తినట్టి, పడగ దింపని బాపుజీ కడిమి మెత్తు 8

ఆ॥ నన్ను గెల్చువాఁడు నహి నహి నా యాన - కద్ద మిల్లె యిల్లె యన్న చెనఁటి
గ్రుడ్ల తేలవైచె గురుఁడుబాపూ మ్రోల, - నసురశక్తులెల్ల నంజలించె 9

గీ॥ దేశమునకు స్వతంత్రతన్ దెచ్చినట్టి - వీరుఁ డెవ్వాఁడు గద్దెకు విముఖుఁడాయె ?
వలఁతు లెందఱు వేఁడినన్ వలదు పదవి - నాఁగ నొక గాంధికే చెల్లినది జగాన 10

గీ॥ అఖిల దైవ సంపదాస్థాన మగు గాంధి - నరుఁడుగా జనించి పురుడులేని
మహిమ సంతరించె మానవతకు దివిన్ - భువికిఁ దెచ్చె భువిని దివికిఁ జేర్చె 11

ఆ॥ అన్నలార ! గాంధి నలరించుపని యొక్కఁ, డైన మనము నేఁడు పూనవలయు
మద్యపానమునకు మంగళమ్మును బాడి - యవల నెత్తుకొందమా! శిరమ్ము? 12

2-10-85

# ఆంధ్రలక్ష్మీ నృసింహ స్తోత్రము

ఉ॥ శ్రీనుతవార్ధివాస ! సురశేఖర ! చక్రవిరాజమానస
త్పాణిపయోజ ! శేష ఫణిభవ్యఫణాగ్రమణి ప్రకాశితాం
గా ! నిఖిలాత్మ ! యోగివరదా ! భవసాగరయానపాత్ర ! ల
క్ష్మీనరసింహ ! నాకొసఁగుమీ భవదీయకరావలంబమున్ 1

ఉ॥ శ్రీనలినోద్భవేంద్రశశిశేఖరమారుతభాస్కరాది గీ
ర్వాణకిరీటకోటిమణిరాజితపాదసరోజ ! భార్గవీ
పీనకుచాబ్జహంస ! సుకవిప్రకరస్తుత ! సచ్చరిత్ర ! ల
క్ష్మీనరసింహ ! నాకొసఁగుమీ భవదీయకరావలంబమున్ 2

ఉ॥ ధీనిలయా ! భవాఖ్యజలధింబడి కామకరాళ నక్ర సం
తానముపాలుచేసితిఁగదా తనువంతయు రాగవీచికా
శ్రేణి నిపీడితుండనయి చిక్కితి దిక్కెవరింకనాకు ల
క్ష్మీనరసింహ ! నాకొసఁగుమీ భవదీయకరావలంబమున్ 3

ఉ॥ గానకళాభిమాన ! భవగాఢవనాంతరవర్తినై గతిం
గానక మారభీకరమృగంబుముఖంబునఁ జిక్కి మత్సరా
నూన నిదాఘపీడనలనొందుచుఁ గుందుచునున్నవాఁడ ల
క్ష్మీనరసింహ ! నాకొసఁగుమీ భవదీయకరావలంబమున్ 4

ఉ॥ త్రాణకళాప్రవీణ ! భవదారుణకూపములోనఁ జిక్కి బా
ధానిచయోరగంబులకుఁ దావలమై దరిఁగానలేక నీ
ధ్యానమొనర్చుచుంటిఁ దమదాసుఁడనంటి నఘంబుగెంటి ల
క్ష్మీనరసింహ! నాకొసఁగుమీ భవదీయకరావలంబమున్ 5

ఉ॥ మానధనాఢ్య ! సంసరణమత్తకరీంద్రకరాభిఘాత సం
తానముచేత దేహము యధాయధలై చనెనక్కటా ! యికన్
బ్రాణములుండఁజాల వతిబాధజనించె సహింపజాల ల
క్ష్మీనరసింహ ! నాకొసఁగుమీ భవదీయకరావలంబమున్ 6

ఉ॥ భానుసహస్రతేజ ! ఫణిభంజనవాహ ! సుధాపయోధివా
సా ! నిఖిలేశ ! సంసరణసర్వవిషానలదగ్ధమూర్తినై
దీనతఁ జెందితిన్ భవదధీనుఁడనైతిని జాలమేల ల
క్ష్మీనరసింహ ! నాకొసఁగుమీ భవదీయకరావలంబమున్ 7

ఉ॥ జ్ఞాననిధాన ! సంసరణజాలములోపల నైహికాఖిలా
షానికురుంబనామ బడిశంబునఁజిక్కి తపించి మోక్షముం
గానఁగలేక చేఁపవలె గాసటబీసటఁ జెందుచుంటి ల
క్ష్మీనరసింహ ! నాకొసఁగుమీ భవదీయకరావలంబమున్ 8

ఉ॥ ఓనిగ మాంతవేద్య ! దురితోత్కరబీజమనంతకర్మశా
ఖానివిడంబు నింద్రియనికాయ దళాన్వితమంగజాత స
త్సూనయుతంబు దుఃఖఫలశోభితమైన భవాఖ్యభూరుహం
బేనిపుడెక్కి క్రిందఁబడి యేడ్చుచు దుర్గతిజెందియుంటి ల
క్ష్మీనరసింహ ! నాకొసఁగుమీ భవదీయకరావలంబమున్ 9

ఉ॥ ఏనిక నేమిసేతు జగదీశ ! భయంకరమై భవాఖ్య దా
వానలకీల లిప్పుడకటా ! ననుఁజుట్టె నిఁకెందుఁజొత్తు ని
మ్మేన గచంబులుం గమరె మీచరణాపగ నమ్మినాడ ల
క్ష్మీనరసింహ ! నాకొసఁగుమీ భవదీయకరావలంబమున్ 10

ఉ॥ నేనిపు డీభవాబ్ధిని మునింగితి నూపిరిసాగదాయె నీ
దీనునిఁగూర్మిఁగన్గొనఁగదే యిసుమంత మొరన్ వినంగదే
దానవపుత్ర కష్టసముదాయవినాశ పరావతార ! ల
క్ష్మీనరసింహ ! నాకొసఁగుమీ భవదీయకరావలంబమున్ 11

ఉ॥ దానకళానిధాన ! ఖలదైత్యభయంకర ! జన్మమృత్యుసం
తానదవాగ్నిహోత్ర ! భవదంతివిపాటనకర్మవీరపం
చానన ! భక్తలోకవరదా ! మురదానవగర్వభంగ ! ల
క్ష్మీనరసింహ ! నాకొసఁగుమీ భవదీయకరావలంబమున్ 12

ఉ॥ ఆనతవైరి ! సింధుతనయాకుచలిప్తమృగీమదార్ద్రవ
క్షా! నిఖిలేప్సితంబులును సంసృతియందుదయించ నందుచేఁ
బూనితి సర్వకర్మములఁ బొందితి బాధలనెల్ల నింక ల
క్ష్మీనరసింహ ! నాకొసఁగుమీ భవదీయకరావలంబమున్ 13

ఉ॥ ఓనలినాక్ష ! మిన్నదరు హుంకృతులన్ యమకింకరుల్ గళ
స్థానమునందు బంధనవితానముఁ జుట్టి బిగించి లాగుచో
దీనుఁడు నొంటివాఁడగుట దిక్కెవరీతని కీవుదక్కల
క్ష్మీనరసింహ ! నాకొసఁగుమీ భవదీయకరావలంబమున్ 14

ఉ॥ జ్ఞానధనంబు నంధుఁడనుగావున నింద్రియనామ చోరసం
తానము తస్కరించి బలదర్పములం బ్రకటించి మించె న
జ్ఞాన మహాంధకారమయ కందరమందునఁ జిక్కినాఁడ ల
క్ష్మీనరసింహ ! నాకొసఁగుమీ భవదీయకరావలంబమున్ 15

ఉ॥ ధీనిధి ! మాధవా ! సురపతీ ! సకలాత్మ ! మఖాధిపా ! మధు
ప్రాణహరా ! జనార్దన ! కృపాకర ! కేశవ ! వాసుదేవ ! సు
జ్ఞాన ! మహామహా ! బుధసఖా ! జగదాకృతి ! పద్మనాభ ! ల
క్ష్మీనరసింహ ! నాకొసఁగుమీ భవదీయకరావలంబమున్ 16

ఉ॥ దానవపుత్ర నారద సుధర్మ పరాశర పుండరీక శ్రీ
శౌనక కీరనామఋషిసత్తమ సాత్యవతేయ హృన్నివా
సా ! నిరవద్యభాగవతసంచయపాలనపారిజాత ! ల
క్ష్మీనరసింహ ! నాకొసఁగుమీ భవదీయకరావలంబమున్ 17

ఉ॥ మానుగ నొక్కకేల నసమంబగుచక్రముఁదాల్చి శంఖముం
బూని మఱొక్కచే జలధిపుత్రిక నొండొకకేలనూని యా
పై నొకసవ్యహస్తమున భక్తజనాభయముద్రఁబూను ల
క్ష్మీనరసింహ ! నాకొసఁగుమీ భవదీయకరావలంబమున్ 18

ఉ॥ శ్రీనిధి ! జన్మమృత్యుగజసింహ ! దినేశగిరీశ ! వేదవం
ద్యానుపమప్రభావ ! కమలాసనపద్మమరందమత్తభృం
గా ! నినునమ్మితిం దురితకర్ముఁడ నంచుఁ దలంచఁబోక ల
క్ష్మీనరసింహ ! నాకొసఁగుమీ భవదీయకరావలంబమున్ 19

ఉ॥ మీన ! కిటీంద్ర ! కచ్ఛప ! యమేయగుణాఢ్య ! రమాదికామినీ
ప్రీణన ! పాకశాసనవిరించిహరాదిసురాభివంద్య ! సు
జ్ఞాన విరాజమానయతిసత్తమచిత్తసరోజహంస ల
క్ష్మీనరసింహ ! నాకొసఁగుమీ భవదీయకరావలంబమున్ 20

ఉ॥ నే నిరతంబు నాదుజననీజనకుల్ గురుమిత్ర సోదరుల్
జ్ఞానము విత్తమున్ నృపశిఖామణియున్ సకలంబు నొక్క నీ
వే నిజమంచునమ్మితిఁగదే జగదీశ ! రవిప్రకాశ ! ల
క్ష్మీనరసింహ ! నాకొసఁగుమీ భవదీయకరావలంబమున్ 21

ఉ॥ దానవపుత్రచిత్తవనతామరసాంతర మత్తభృంగ ! గం
గానిభనిర్మలాంగ ! మణిక్రమకిరీటవిరోజితోత్తమాం
గా ! నలినాలయావదనకంజపతంగ ! దయాతరంగ ! ల
క్ష్మీనరసింహ ! నాకొసఁగుమీ భవదీయకరావలంబమున్ 22

మ॥ అనవద్యంబయి శంకరార్యరచితంబై యొప్పు నీస్తోత్రమున్
ఘనభక్తిం బఠియించువాఁడు దళితాఘస్తోమ్ముఁడై మౌనివం
దనుఁడై నిర్మలచిత్తుడై యభవుఁడై తా శాశ్వతానందభా
జనమై రాజిలునట్టి విష్ణుపదవీ సంవాసియై వెల్గదే ! 23

ఉ॥ ఏనరు లీభవాంబునిధి నీదఁగలేక తపించి తీరమున్
గానఁగలేరొ వారి కనుకంప జగద్గురు శంకరార్యులీ
శ్రీ నరసింహసంస్తవముఁజెప్పిరి యొప్పగు లెస్సయౌనటుల్
గానఁ బఠించి దీని భవకంధిఁ దరించుడి సర్వమానవుల్ 24

ఉ॥ శ్రీనరసింహ ! సర్వవిభుశేఖర ! ఖేచరరాట్పతాక ! తా
పానలవర్షరూప ! భుజగానలవృశ్చికనీరరోగతృ
ష్ణానిచయార్తినాశ ! కరుణాజలధీ ! దురితాంతకా ! నినున్
ధ్యానమొనర్తు వందనశతంబులనిత్తు ననుగ్రహింపుమా ! 25

సీ॥ గుంటూరుసీమ నెక్కుడుసంపదలనొప్పు, కావూరునామ సద్గ్రామవాసి
కమ్మవంశభవుండు తుమ్మలనారయా, హ్వయుఁడు శ్రీమతి చెంచమాంబ యందు
గనినట్టికొమరుఁడు కలితసీతారామ, మూర్తినాముఁడు బంధముక్తిఁగోరి
రక్తాక్షి సంవత్సరమునఁగార్తికమాస, శుద్ధపంచమి సుప్రసిద్ధమైన
శాలివాహశకంబు శాస్త్రవేదగజేందు, సంఖ్యలం దనరారు సమయమందు
శ్రీశంకరోక్త లక్ష్మీనరసింహస్తోత్ర, మాంధ్రీకరించె తానంచితముగ

గీ॥ జగతి నీగ్రంథ మాస్తికజనములందు, నతిశయవ్యాప్తినంది కీర్తినిఁ జెంది
యాదివాకరతారాసుధాకరంబు, శ్రీనృసింహుని కరుణ రాజిల్లుఁగాత ! 26

భారతి – 1925

# కృష్ణావతారము

సీ॥ నిరతంబు గోపిక ల్నినుఁగూడి క్రీడింప, మున్నెట్టితీర్థాలమునిఁగిరొక్కో ?
నిను ముద్దుకొమరుగాఁ గని పొంగదేవకీ, వసుదేవులేదానమొసఁగిరొక్కొ ?
లాలించి నిన్జేతికీలుబొమ్మ నొనర్ప, రాధ యెంతటి భాగ్యరాశి యొక్కొ ?
హాయిగా నీతోడ నాటపాటలు సల్ప, గోపబాలకు లేరిఁ గొలిచిరొక్కొ ?

గీ॥ శిలల నవలీల నీరుగాఁ జేయు నీదు, మృదుమధురవేణుగాన సత్సుధను గ్రోలి
పరవశతనంద ద్వారకాపురనివాసు, లెన్న నేమేమి చేసిరో చిన్నికృష్ణ ! 1

సీ॥ గీర్వాణభాష నిన్గీర్తించి నుతిగాంచ, బాదరాయణ తపః ఫలమదేమొ ?
తెలుఁగుపల్కుల ముద్దులొలుక నిన్ బలుకంగఁ, బోతనార్యుని పూర్వపుణ్యమేమొ ?
నీలీలలెల్ల వర్ణించి సన్నుతిగాంచ, లీలాశుకుని భాగ్యలీల యేమొ ?
నినుఁగాంచి జగమందు నిత్యకీర్తి గడించ, భరతమాత తపః ప్రభావమేమొ ?

గీ॥ మృదు మధుర గేయ ఫణితిఁ గోవిదులు మెచ్చ, నీ చరిత్రంబులెల్ల వర్ణించినట్టి
దివ్యమూర్తి నారాయణతీర్థసుకవి, సుకృత మదియేమొ ? లోకైక సుందరాంగ ! 2

సీ॥ ఆచార్య పీఠంబు నందు నధిష్టించి, ధర్మోపదేష్టవై తనరితీవు
అర్జునాదులచేత నఖిలధర్మంబులఁ, జేయించితీవు సాక్షిత్వమూని
స్వయముగా మానవాచారంబు లివియంచు, నోపికతోఁ జేసి చూపితీవు
ధర్మేతరప్రవర్తనులనెల్లరఁ గూల్చి, బలితంపు ధర్మంబునిలిపితీవు

గీ॥ గురుతరసుషుప్తి నుండి మేల్కొలిపితీవు, సలిపినాఁడ వమానుషచర్యలెన్నొ
సర్వశక్తిస్వరూప ! విశ్వప్రదీప ! దళితసంతాప ! సద్గుణోద్యత్కలాప ! 3

సీ॥ కోమలామలఘనశ్యామలాంగముతోడ, ముద్దుఁగుల్కెడు నవ్వుమోముతోడఁ
శిఖిపింఛసంచయాంచితమస్తకముతోడఁ, జెలువమౌ బంగారువలువతోడఁ
గరుణారసంబొల్కు కన్నుదమ్ములతోడ, నవరత్నమయభూషణములతోడ
ఘల్లుఘల్లని మ్రోగు పిల్లగజ్జెలతోడ, మతిచిన్ని పంగనామములతోడ

గీ॥ రమ్యశారదచంద్రికారాత్రులందు, విమలయమునానదీసైకతముల నిల్చి
మురళిఁబాడిన నీదివ్యమూర్తిఁ జూపి, ననుఁ గృతార్థునిఁ జేయుమో నందతనయ !4

\- భారతి

# కొనియాట

శా॥ ఆశీతాచల చందనాచల మనన్యప్రాప్యకీర్తిప్రభా
ప్రాశస్త్యంబు నిగిడ్చి భారతమహీభాగ్యోదయాధారతన్
'దేశోద్ధారక' పట్టముం బడసి దీప్తిన్‌గన్న నీకిచ్చెదన్
'కాశీనాథ' కులీన ! హారతుల నుత్కంఠాతిరేకంబునన్ 1

సీ॥ నెలకొల్పితివి తెలుంగులవెలుంగులు మిట్టి, పడనాంధ్రపత్రికా భారతులను
పోషించితి త్రిలింగభూవిరాజదశేష, జాతీయవిద్యానికేతనముల
గౌరవించి తనేకకవిరాజపండిత, కుంజరంబుల నెల్లకోర్కు లొసఁగి
వెలయించితి వమూల్యవిజ్ఞానమయములౌ, కావ్యరాజములఁ జొక్కమునటింప

గీ॥ బలియొసంగితి సర్వంబు భరతమాతృ, చరణరాజీవపీఠికాసమ్ముఖమున
ధన్యుఁడవు నీవ, సుకృతిమూర్ధన్యమూర్తి !, విశ్వసేవకముఖ్య ! నాగేశ్వరాఖ్య ! 2

సీ॥ రాజనరేంద్రు ధర్మపరాయణత్వంబు, శబ్దశాసను మనీషావిభూతి
రుద్రభూపతి సమున్నిద్రశౌర్యస్ఫూర్తి, తిక్కన రాజనీతిజ్ఞతయును
భాస్కరు వితరణపాండితీవిభవంబు, బాలుని యుద్రేకపాటవంబు
రాయల మాతృకారాధనాసక్తియు, వేమనార్యుని తత్త్వవేత్తృతయును

గీ॥ ఆంధ్రజననీహిరణ్యగర్భాంతరమునఁ, గలసికొని యేకమై భవల్లలితమూర్తిఁ
దాల్పఁ బూర్వాంధ్రజాతీయతాస్వరూప, మిపుడు సాక్షాత్కరించె నాగేశ్వరాఖ్య ! 3

**2-10-1931**

# హితవు

క॥ శ్రీమదమూల్యశ్రీశుభ, నామా ! సద్గుణనికేతనా ! మృదుకవితా
సామర్థ్యప్రాప్తయశః, శ్రీమంజుల ! నిచ్చ నీకుఁ జేకుఱు జయముల్ 1

గీ॥ కవిత మననెయ్యమున కాదికారణంబు, మనసు మనవియ్యమున కండయనుట నిజము
ప్రథితిగన్న యీసాహితీబాంధవమ్ము, తనరుఁగాక వాణీకృపన్ దరతరాన 2

క॥ ఈవు కళాయోగివి, నీ - భావమ్ములు విశ్వమానవత కంకితముల్
నీవియ్య సేయుపల్కులు - పూవులకున్ మృదుతనేర్పుఁబో ! సాధుమతీ !

ఆ।। కులము మతము లేదు గుణమెన్నుతతి నీకు - నార్తుఁగన్న వెన్నయగుదువీవు
వినయమార్జవంబు నినువీడ వింకేమి - వలయుఁగవికిఁ దమమువాపు రవికి

గీ।। పద్యమును గేయమును హృద్య బాట పద్య నడుపు, నొడుపు నీపాలిదని యెల్లయెడలఁ దోఁచు
సాముచేసిన నబ్బదీ చదురు సహజ, వైదుషీదీప్తిగానబ్బవలయుఁగాని

క।। మకరార్కమహస్సు కవి - ప్రకరప్రత్యగ్రకవన పణితవ్యము, భ
వ్యకళామంజులకృతి సృ - ష్టికి నినుఁ బ్రేరేచుఁగాక స్థిరతరధిషణా !

క।। కవితలు పల్కుచు విద్వ - న్నివహమ్ముల మెప్పు గనుచు నిఖిలానంద
చ్ఛవులన్ గాంతువు నీ వీ - నవాబ్దమున బంధుహితజనమ్ములు తనియన్

క।। నీకృతులు తెల్గుశారద - కాకల్పము లగుత ! సత్సభావళి విద్వ
ల్లోకము నినుఁగీర్తించుత ! - మీ కుదు రాంధ్రమున మేలిమేలిది యగుతన్

క।। మానకు మాంధ్రీవరివ - స్యానిష్ఠను లాఁతిబరువు లవి పెల్లయినన్
మేనికి నెడఁదకు సౌఖ్య - శ్రీనొసఁగన్ జాలుఁ గావ్యసృష్టి వయస్యా !

# అమృతోత్సవము

(ముత్యాలసరాలు)

అతనిమది ప్రాసంగువిత్తఁట - అతనికిన్ పగవారు లే రఁట
గ్రామజీవనమాధురికి తా - ర్కాణ మాతఁ డఁట
అవని కిది మేలైనపని యని - యతఁడు తోరముగట్టుకొనెనా
హరిహరాదులు విక్రమించియు - అఁపలే రతనిన్ 1

బాపుజీ రణకాహళము సా - బర్మతీతటి మ్రోసినంతనె
అతఁడు మొగబంటై నిలంబడె - నంధ్రసైన్యమునన్
తెల్లదొర బోటెక్కఁగానే - చల్లఁబడలే దతనిమగటిమి
తెంపెఱుగని లోకసేవా - దీక్ష నతఁడుండెన్ 2

కర్మఫల మతఁడాశ్రయింపడు - కార్యమగుపని నుజ్జగింపఁడు
ఓగుబాగుల నొక్కమైఁ గను - యోగివరుఁ డతఁడు
అభయమున్నది వినయమున్నది - అతనిలో సత్యాదులున్నవి
తరుణదశనే వానికబ్బెను - దైవ సంపదలు 3

గాంధియుగమున రాణకెక్కిన - ఘనులలో తొలిబంతి యతనిది
ఎందతోలే రిప్పు డతనికి - నీడుపడువారల్
అతఁడు డెబ్బదియైదునిండిన - ముతుకయని అమృతోత్సవంబిది
సంతరించిరి తమకృతజ్ఞత - చాటఁగా సుజనుల్ 4

అతఁడెవరో తెల్పుమందురు - శ్రోత; లీపని యేటికని యన
రాదులే ! వెలువోలు సీతా - రామయ అతండు
పెద్దలను గుర్తించి మెచ్చెడి - పిన్న లిమ్మహినుండునంతకు
రా దరిష్టము రాదువిలయము - రాష్ట్రములయందున్ 5

విశ్వసేవానిష్ఠయగు ప్రజ - వీథివీధికి నబ్బవలయును
మానవుఁడు కనవలయుఁ దన్ను స - మస్తభూతములన్
బ్రదుకవలయు శతాబ్దముల జన - హితుఁడు సీతారామ యాఖ్యుఁడు
ఇతని మిత్రులు బహుసదస్సుల - నుతుల నందవలెన్ 6

17-5-83

## నవావధాని

అప్పుడు భట్టుమూర్తి మొదలైన కవుల్ బుజ మప్పళించి నా;
రిప్పుడు మేడసాని ధ్వజమెత్తె వధానవిధాన చాతురిన్ ;
ముప్పిరిగొన్న మోదమున మోహనుపైఁ దెఱగంటితోఁటపూల్
గుప్పి రయారె యంచు సరికొండమనీషియు మాదభూషియున్ 1

ఆశు వటంచు నీరసములైనపదమ్ములఁ జేర్చి యన్వయ
శ్రీ శతధావధించి కవిసింహులు ప్రాక్తను లేగుత్రోవలన్
నాశమొనర్చు వారివదనమ్ములు వంగ నభంగ భారతీ
కౌశల మాశుధార నిడి కంటి వపారయశమ్ము మోహనా ! 2

తిరుపతి వేంకటేశకవిధీరులు కొప్పరపుంగవీశ్వరుల్
దురము లొనర్చునాఁడు రసతోయధి మున్గినతెన్గువారికిన్
మరల నవావధానములు మంజుతరాశుకవిత్వముల్ పొరిం
బొరిగ నొనర్ప నిన్నిడిన పుస్తకపాణికి వాణి కంజలుల్ 3

అవిరత రాజకీయసమరాంకితజీవితమై కలంగుచున్
నవయుజనమ్ము సమ్మదసనాథము కావలెనన్న సాహితీ
ప్రవణము కావలెన్ గళలపట్ల మమత్వము నేర్చుకోవలెన్
కవులకుఁ జుట్టమై మెలఁగఁగావలయున్ గనువిప్పఁగావలెన్ 4

6-1-86

# రసోరాజా !

(అభ్యుదయకవి శ్రీరంధి సోమరాజు - విశాఖపట్టణము)

(ముత్యాలసరాలు)

అఱువదేండ్లకు నేమి ? యింకొక - యఱువదేం డ్లీధరణి నిల్వుము
సోమరాజా ! నీకలమ్మున, సుధలు కురియంగన్ 1

తెలుఁగు పేదలనాల్క నురలెడి - పలుకుపస నీపాలి దాయెను
కలిమివాసనలేని బ్రతుకుల - కథలు నీవాయెన్ 2

అగ్రహారము నందుఁ బెరిఁగిన - అయ్య లెఱుఁగరు తెనుఁగుపోరులు
పల్లెపట్టున కంకితంబై - పరఁగు నీసొబగుల్ 3

గ్రాంథికమ్మున కంటె బిగువై - కంద పెంచినవ్యావహారిక
మడుగువారికి బడుగువారికి - హర్షమెట్లొసఁగున్ 4

చదువునేర్చినవాఁడ వయ్యును - సాములెతిఁగిన ప్రోడవయ్యును
ఇచ్చపడవు బడాయిబాసకు - నెడఁద మృదు వగుటన్ 5

అసుర శక్తుల రెచ్చఁగొట్టుట - కాసచేయని కైసరుండవు
మానవత్వము నాదరించెడి - మంచితనముంటన్ 6

కరుణ నేర్పును సమత నేర్పును - కష్ట సుఖములనోర్మి నేర్పును
ఈవి నేర్పును, నేర్పు నార్తుల - సేవ, నీకవితల్ 7

కల్లయెఱుఁగని, కపట మెఱుఁగని, - కాసులకుఁ బెడదారి త్రొక్కని
వలపులోఁతులు చాటు నిపుణత - వలచెఁబో ! నిన్నున్ 8

సంప్రదాయము మానినంతనె - చక్కచక్కనికైత పుట్టదు
అర్జవం బావేశ మున్నపు - డది బయల్ వెడలున్ 9

కులగిరుల్ తూఁగాడి క్రుంగిన జలనిధిన్ బడబాగ్ని రేఁగిన
బ్రజామానిత రసోరాజా ! - వరలు నీకవితల్ 10

మల్లియై జేజేలఁ దనిపెడి - వెల్లియై పున్నమనెఱాజా
బిల్లియై నీకీర్తి దిశలకు - వెల్లవేయు నయా ! (2-2-86) 11

# ఆకాంక్ష

(శ్రీ నల్లపనేని మార్కండేయులు, రిటైర్డ్ ఇంజనీరు)

మేలిమేలికైతల నను - మెచ్చిన మార్కండేయా !
యేల వీనికొఱ క్శ్రమ - నీకొంటివి బుధవిధేయ !

నీవంటియుదారమతులు - పావనభావప్రసిద్ధు
లీవసుధన్ గొందఱుంట - నేనొక కైసరుఁడ నైతి

ఏ నెఱుఁగని దెంతోకల - దెఱిఁగిన దావంతసుమీ !
యైనను గవితానిర్మితి - మానలేని వెఱ్ఱినైతి

మందులతో నావ్యాధులు - మానవు కవనమునఁ గాక
విందైనది ముసలిబ్రదుకు - నందైనను నాకీపని

నీ కవితాభ్యుదయంబును - నీకీర్తిని నీతృప్తిని
నీకృతకృత్యతను సతత - మాకాంక్షింతును వయస్య !

మధురవాణి నీకున్నది - మంచిమనసు నీపాలిది
సుధ లూరెడికృతులుపల్కి - సుకవిస్తుతులందుకొమ్ము (4-4-86)

# నిరాశ

ఉ॥ భారతసార్వభౌమపదభాసురుఁ డొక్కదినాన శంతను
క్ష్మారమణుండు వేఁట తమకంబున నయ్యమునాతరంగిణీ
తీరభయంకరాటవులఁ ద్రిమ్మరుచున్ జనకంటకంబులన్
గ్రూరమృగంబులన్ గడిమిఁ గూల్చుచునుండెఁ బ్రచండమూర్తియై 1

వ॥ అయ్యవసరంబున - 2

క॥ మృగమదఘనసార మరు, జ్జగతీసుమసౌరభములఁ దలఁదన్నుచు నిం
పగు తావి గుబులుకొనఁదా, నిఁ గడున్ ధరణీశ్వరుండు నెమ్మదిమెచ్చెన్ 3

గీ॥ మెచ్చి యెచ్చటనుండి తా వచ్చె నీ య, పూర్వసౌరభ్యమనుచు నబ్బురముగాంచి
వేఁట చాలించి యాతావి వీచునట్టి, దెసకుఁ బయనించె మూలంబు దెలియనెంచి4

క|| చని శంతనుఁ డంతం గను, గొనె యమునం బడవనడుపు కోమలిఁ గన్యా
మణి సౌందర్యనిధిని యో, జనగంధిఁ దటిల్లతాంగి సౌజన్యఖనిన్ 5

ఉ|| అంతట యింతి సౌరభమునారసి యంటినఁగందుమేని సొం
పెంతయు నిండగాఁ బొగడి యింపగునాచిరునవ్వు పొంకమున్
జింతనఁజేసి కన్నుఁగవచెల్వము వేమఱునుగ్గడించి భూ
కాంతుఁ డనంతరాగమునఁ గన్నియపై మదినిల్పి యిట్లనున్ 6

క|| ఎవ్వతె ? వెవ్వని కూఁతుర ?, వెవ్వంశము ? నామధేయమెయ్యది ? తరుణీ !
మవ్వంబగు నీదగు లే, జవ్వనమిటు లేటిపాలు సలుపం దగునే ? 7

గీ|| అనిన నయ్యింతి సకలలక్షణసమేతు, శంతనునిఁ జూచి వదనాంబుజాతసీమ
లేనగవుఁ జిఱులజ్జయు లీలవెలయ, మందమందమృదూక్తి నిమ్మాడ్కిఁ బలికె 8

క|| ఆర్య ! వసుక్ష్మాపాలక, వీర్యంబునఁ బుట్టి దాశ విభుఁ డెంతయు నౌ
దార్యంబునఁ బెంపఁగ ని, క్కార్యం బొనరింతు నాన్నగారి యనుజ్ఞన్ 9

క|| జననాథ ! సత్యవతినాఁ, దనరెద మాతండ్రి యేటిదరినొప్పెడు నా
జనపదమున యందుం గలఁ, డని తనవృత్తాంతమెల్ల నంగన వినిచెన్ 10

క|| అత్తరుణిపల్కులన్ విని, యుత్తమవీర్యప్రసూత యోహో ! యిది యం
చత్తినరాగము తాల్మిని, తుత్తునియలు సేయ నృపతి తొందరపడియున్ 11

క|| ధీరుండుగాన మదన వి, కారము లోలోన నడఁచి "కైవర్తవిభుం
జేరి మిటారిపయింగల, కోరికి నెఱిఁగించు టొప్పగు" నటం చెంచెన్ 12

గీ|| ఎంచి యమ్మించుబోఁడినిగాంచి "పాంధు ననుఁ దరింపఁగఁ జేయుమో నాతి" యనిన
నబల చిఱునవ్వునవ్వి 'రం' దనుచు నతని, నద్దరికిఁ జేర్చెఁ దన నావయందు నిలిపి 13

క|| భూనాధుఁ డంత సత్యవ, తీ నవలావణ్యమును మదిం జూచుచుఁ బ్ర
జ్ఞానిధి నప్పల్లెదొరం, గానఁగఁ జనె వానియింటికడకుం గడఁకన్ 14

ఉ|| తత్తఱపాటుతోడ భరత ప్రభుఁగన్గొని దాశరాజు తా
నత్తఱి యోగ్యసత్క్రియల నవ్విభునిం బరితుష్టుఁ జేసి య
త్యుత్తమమైన పీఠమున నొప్పుగనిల్పి యనల్ప సమ్మదా
యత్త మనంబుతోడ వినయంబు నయం బెసలార నిట్లనెన్ 15

ఉ॥ అర్కసమానతేజ ! భవదాగమనం బది యెంతయున్ శుభో
దర్కముగాదె ? మీచరణతామరసామలరేణురాజి సం
పర్కముచేత మద్గృహము పావన మౌటదియెంతవింత ? యే
తర్కముకల్గు ? నాభవము ధన్యతఁజెందెనటంచుఁ బల్కినన్ 16

క॥ "ఊరకరారుమహాత్ము ల, కారణముగ" ననుచు నంద్రు గావున నుదువం
గోరెద నీయధమునికడ, కీరరుదేరంగ హేతు వెయ్యది ? నృపతీ ! 17

క॥ మనుజేశ్వర ! భవదర్థం, బొనరింపం దగిన కార్యముండిన దానిం
దనయోపినంతవఱకుం, బొనరింపంగలఁడితండు పూర్ణాసక్తిన్ 18

చ॥ అన జననాథుఁడిట్లులనె నల్లనవ్వుచు "దాశరాజ ! నీ
కనయము సేమమేకద ! మదాత్మకునెంతయు మోదమయ్యె నీ
వినయము, నీవివేకమును విశ్రుతమౌ మరియాదనుం గనుం
గొన నుచితజ్ఞులుందుకొఱకుం గులభేదమొకందుకల్గునే ? 19

క॥ పాలకుఁ డీతం డనుచున్, బాలితుఁడను నే నటంచు భావించెద వి
ట్లేలాభయంబు ? నీవుం, బాలకుఁడవుగావె యిచటిపల్లెలకెల్లన్ 20

క॥ రాచఱికమున్న వాఁడవు, నీచుండవు గావటంచు నెమ్మదియం దా
లోచించియ చనుదెంచితి, నీ చుట్టఱికంబుఁగోరి నేఁ డియ్యెడకున్ 21

ఉ॥ చందనగంధి సత్యవతి చక్కదనంబునుజూచి పెండ్లియా
డం దలపోసి తండ్రివగుట న్నినుఁగోరుట పాడియంచు నా
సుందరితో మదాశయము సుంతయుఁజెప్పక వచ్చినాఁడ నీ
మందిరసీమ కో సుగుణమండన ! నన్నెటులాదరించెదో ! 22

గీ॥ మహితభారతసామ్రాజ్యమాననీయ, సింహపీఠోపవిష్టయై చెలఁగునట్టి
భాగ్యమునకంటె నీముద్దుపట్టికింక, వలయుసౌభాగ్యమెద్ది ? కైవర్తరాజ !" 23

వ॥ అనిన నతం డిట్లనియె - 24

ఉ॥ "ధన్యుఁడనైతి మత్సుతను దామువరించుటఁజేసి యోజగ
న్మాన్యచరిత్ర ! యుష్మదసమానదయాపరిలబ్ధి నూత్నచై
తన్యముఁగల్గి మత్కులము దానతిపావనమై వెలింగె సా
మాన్యమె నీదుబాంధవము మాకు లభించుట రాజసత్తమా ! 25

క॥ "గొనములకొటారు చక్కం, దనమునకుం బట్టుఁగొమ్మ తరుణీమణి నీ
కనుకూలమైన కన్నియ", యని వేఱ వచింపవలయునా సత్యవతిన్ 26

ఉ॥ శీలము వంశగౌరవము చిత్తమెలర్చెడిసోయగంబు ల
క్ష్మీలలనాకటాక్షము ప్రసిద్ధివహించినబంధుమిత్రులు
ద్వేలయశంబు ప్రాయము వివేకముగల్గిన యట్టివానికిన్
బాలికనిచ్చుటర్హమని పల్కుచునుంద్రుగదయ్య ధీనిధుల్ 27

క॥ కావున మీకిచ్చుటకై, భావంబున సంశయింపఁ బనియేమి ధరి
త్రీవల్లభ ! మత్తనయన్, 'శ్రీవచ్చిన కాలనడ్డు' చెనటులు గలరే ! 28

గీ॥ అని దురాశాగ్రహంబు తన్నావరింప, "నృపుఁడు కామాతురుండౌట నిప్పుడెంత
కైన వెనుదీయఁబోఁడిదే యద" నటంచు, వరమొకండిచ్చగించి భూవరున కనియె29

క॥ "అకలంకచరిత ! మత్పు, త్రిక నీకు నొసంగుటకు మదిన్ సందియమిం
చుకలేదు, గాని నాకిపుఁ డొకకోరికి కలదు దాని కొడఁబడవలయున్ 30

క॥ అని యనుచితంబు గానన్, దన తలఁపుం దెలుప వెఱచు నాతని గని నీ
కనుమానమేల ? వీలై, నను దీర్చెద నొడువు" మంచు నరపతి యనినన్ 31

ఉ॥ భూపవతంస ! నీ వలనఁ బుణ్యచరిత్రకు మత్కుమారికిన్
రేపుదయించు నందనుఁ డరిందముఁ డాతఁ డఖండభారత
క్ష్మాపతి నీపరోక్షమునఁ గావలెనంచుఁ దలంచినాఁడ నీ
వీ పని కియ్యకొన్న నిపుడే నడపింతు వివాహతంత్రమున్ 32

ఉ॥ ఇదియ మదీప్స" మటంచుం గొదుకక దాశుండు వల్క ఘోరవరం బ
య్యది నృపునకుఁ బిడు గడఁచిన, విధమైన నతండు మిగుల విహ్వాలుఁడయ్యెన్ 33

వ॥ అంత శంతనుండు నిజాంతర్గతంబున - 34

క॥ "కటకట కైవర్తవిభుం - డెటువంటివరంబుఁగోరె నిది యెంతయు దు
ర్ఘటము గదా" యంచుఁ దలఁచి - కుటిలాలకమీఁదికోర్కి కొనలిడుకతనన్ 35

ఆ॥ "ఇది యసాధ్యమగుట నింకెద్దియైనఁ గో, రం గదయ్య దాశరాజ!" యనిన
బిఱ్ఱబిగిసి యతఁడు "పృథివీశ ! నాకొండు, తలఁపు లేదటంచుఁ దా వచించె 36

ఉ॥ అంతట శంతనుం డిఁక రవంతయులాభములేదటం” చిసీ
కాంతలపొందుఁగోరి కలకాలము మాయనిదుర్యశంబు నా
ర్జింతునె ? రూపసాహససుశీలనయాదిగుణప్రసిద్ధు వి
క్రాంతవినీతు నగ్రసుతు రాజ్యవిదూరు నొనర్ప పాడియే ! 37

ఉ॥ ముద్దియమీఁదిమోహమున ముందును వెన్కయుఁజూడఁబోక నా
పెద్దకుమారునిన్ విడిచి పిన్నకుఁ బట్టముగట్టినన్ జనుల్
తద్దయుఁ గీర్తిగన్న హిమధామకుల ప్రథరూపుమాపు నీ
మొద్దని బ్రువ్వఁదిట్టరొకొ ? మూర్ఖుఁడనై యిటుసేయుటొప్పునే ! 38

వ॥ అని వితర్కించి - 39

క॥ లోకాపవాదభీతియు - నాకన్నియమీఁదివలఁపు నంతంతకు న
ఱ్ఱాఁకలఁబెట్టఁగ హృదయ - వ్యాకులమేపార నాతఁ దరిగెన్ బురికిన్ 40

భారతి - జనవరి - 1928

# స్వతంత్రభారతి

సర్వస్వతంత్రతాసంపన్నులై భారతోర్వీజనుల్ జగం బొసఁగు మెప్పులు గన్న
దినమురా ! యిది సోదరా ! మనపర్వ గణములో నిది మిన్నరా !

నలుసంతగానున్న తెలవారిపెత్తనము, తొలఁగి మనదేశముద్ధూత విచికిత్సమై
తలయెత్తి నిల్చినదిరా ! యీనాఁడు, తొలిదీవి పులకించెరా !

ఏమతం బేకులం బేజాతి వారైన - నీమహిం బాలింప నెల్లరున్ దగుదురని
పరమధర్మము చాటెరా ! యీరాచ - పందు వభయాస్థానిరా !

చెఱకేగి లాటీల నుఱక నెత్తురుగార్చి - యురికంబముల కెక్క నోర్చి నారీనర
శ్రేణి యీసిరి దెచ్చెరా ! బాపుజీ - వాణితోఁగను విచ్చెరా !

కొడుకు చచ్చిననాఁడె నడిచె బంది కొకండు, పడఁతి యొక్కతె సాగెఁ బ్రసవవేదనలతో
పుడమి కంపించి నదిరా ! మనవారి, కడిమిగని సొగసినదిరా !

గతముదెస కొకసారి కాంచి, సత్యమెఱింగి, ధృతి తోడ మతి తోడ దేశసేవకు నొగ్గి
వితరణవ్రతదీక్షతో సోదరా ! విజయముల నందుకోరా !

కూడుగుడ్డలు లేక గుడిసెలే కిచ్చోట, గోడు గుడిచెడివారు కోట్లు కోట్లున్నారు
ముందు వీరిని దేర్పరా ! సోదరా !, ముక్తికిదియే చాలురా !

ప్రెగడయైనను నెఱాప్రెగడయైనను జగంబగురా ! యనంగ ముక్తినందలేఁడు నరుండు
బడుగుదెస దన్సి నపుడే ధన్యతా భాజనంబగు సోదరా !

ఈ సింహపీఠంబు నెక్కవే నీ వనుచు, వాసిగలవా రెన్నివంద లర్థించినను
ద్రోసి వీధుల నూడ్చెరా ! మనగాంధి దొడ్డపాఠము నేర్పెరా !

పసిఁడిపాఁతఱలతోఁ బటుతరాస్త్రములతో వసుధ నిర్భీకమై వర్ధిల్లుట హుళక్కి
నిఱుపేద పెంపుతోనే శాంతికది నెలవుగా నగు సోదరా !

కలిమిపెంచెడువానికంటె దొంగయె మేలు, కలవారిలో నీర్ష్యగాకేమి వర్ధిల్లు ?
ఈసరమునకుఁ బంటగా సోదరా ! యిల రణమ్ములు రేఁగురా !

నరునిజీవనరీతి – పరమార్థమయముగా, మెఱయవలె, సమతా సమిద్ధమై విరియవలె
ఫలముగోరని యోగిగా – మనుజుండు, బడలవలయును సోదరా !

ప్రేమవాహిని పొంగి – భేదబుద్ధు లడంగి, సామాజికానంద – సంతృప్తమైనపుడె
బ్రదుకు మధురం బౌనురా ! – సోదరా ! అది కామధేను వగురా !

పుడమి క్రుంగును గాక – కడలిపొంగును గాక, నడినెత్తిపై మిన్ను పడుఁగాక – వ్రయ్యలై
సత్యమునకు నహింసకున్ – నరుఁడు పూజారిగా మనవలయునురా !

ఎల్లమతములవారి – హితుఁడుగా నుతులందె నెల్లజీవుల యందు – నీశ్వరుని దర్శించె
ఎల్ల యెఱుఁగని కరుణరా ! – మనగాంధి, యెనలేని త్యాగమ్మురా !

మాగాణములమాట – మండలమ్ములమాట, రేఁగులై నాగులై – సాగు కులములమాట
మఱచిపోదము సోదరా ! – యీనాఁడు మనగాంధి కిది కాన్కరా !

లేనిగాంధికిఁ గాన్క – లీనేల ? యందువా ? దీనమగుకుక్క కిడి – తినఁ జూచు భిక్షుకుని
కంటిలో నున్నాఁడురా ! – బాపుజీ, కన్ను విప్పుము సోదరా ! 23-1-83

## వినయాశ్రమము

గీ॥ కర్మఫలమున కాశ్రితుల్గానివారి, సేవచే నీవిచే లెస్స చేవ గనుచ
బాపుజీధర్మమును దేటపఱుచు నొజ్జ, యగుచు వినయాశ్రమము నిచ్చనెగడుఁగాక !

ఆ॥ బిచ్చగాఁడు లేని ముచ్చులేని కటారి, లేని రాజ్యమునకు మానవాళి
యెదురుసూచుచున్న దీ మేల్మి పండించు, వీరు లిచట నుద్భవింత్రుగాక !

క॥ అందఱిలోఁ దన్నుంగని, యందఱఁ దనయందుఁ జూచు ననఘులు, శుచితా
సుందరు లీయాశ్రమమున, వందలువే లవతరింపవలె సంతతమున్

క॥ అధికారమునకు రూకకు, వృథారణంబున కసూయ కీర్త్యకులోనై
ప్రథ గోల్పడువారికి సత్, పథమ్ము నిది చూపుఁగాక ప్రాజ్ఞులు మెచ్చన్

గీ॥ ఆశ్రమశ్రేయమున కర్థమాయురాది, బలియొసంగిన నెఱజోదు బసవయాఖ్య
యతివరేణ్యు సీతారాము నభినుతించి, లాఁతిపెద్దల నర్థిన్ దలంతు నేఁడు

6-2-1984

## కృతజ్ఞవాణి

(చంపకమాలిక)

సరసకవీంద్రులార ! బుధసత్తములార ! సదస్యులార ! ని
ర్భర నిరవద్యసౌహృదవిభాసితులార ! కళాసరస్వతీ
నిరత జయోదయప్రియమనీషితభూషితులార ! దాతృతా
పరిణతచిత్తులార ! శుచిభావనికేతనులార ! నమ్రతా
భరమున మీకు మ్రొక్కి పదిపల్కులు పల్కెద – నిప్పు డెందఱో
బిరుదులు సాహితీసృజనఁ బేరుగడించినవార లుంట నా
యెఱుఁగనివార్తకా – దయిన నే సుకృతంబొ మదీయ మిమ్మహా
పరిష దుపస్థిత ప్రముఖపౌరు లుదారులు మీ రొసంగు న
బ్బురమగు పేర్మి కూర్మి తలఁబూనుటకున్ ననుఁ బాత్రుఁ జేసె నీ

గరిమకు నన్ను నెన్నిన జగద్ధితు 'రామప్రసాదరాయ'నిన్
గురుతర చేతనాకలితు గోకులకృష్ణు, సహిష్ణుఁ గొండయన్
వెరవరిశాంతసాహ్వయుని, విజ్ఞతఁబండిన రామయార్యు ని
త్తఱి మునుముందు మెచ్చెద; నుదారతకున్ నెలవైన వీరికిన్

నరసురసిద్ధచారణగణస్తుతులన్ నతులన్ గరంగుచున్
దిరుమలపైఁ గుదుర్కొనినదేవర, భక్తజనావళీ మరు
త్తరు, వలమేలు మంగపతి, దక్షిణభారతధాత్రి కీర్తి కా
దరు వగు వేంకటేశుఁడు సదా సకలార్థము లిచ్చుఁగాక; నా

చరితము నా కవిత్వముఁ బ్రశంస యొనర్చిన ధర్మదేవతా
సురుచిరపీఠి "చల్ల" కులసోముఁడు తెన్గుఁదనంపుసొంపులన్
గురియు నుదాత్తమానవుడు కొండయకున్ గవితాపయోనిధిన్
దరిచి సుధన్ గ్రహింపఁగలదంటకు శ్రోతలఁ దేర్చువాగ్మికిన్
కరమున బంతివేల్ ధనము కానుకగా నిడి తల్లిబాసపై
విరిసిన భక్తి వెల్వఱుచు వేంకటశేషయరామయాఖ్యు సు
స్థిరలగిసెట్టివంశజలధిస్ఫుట కైరవమిత్రు మేలి తీ
రరసిన నాకె కాదు సభనందఱ కబ్బె నపూర్వపర్వ - మీ

ధరఁ బురుష ప్రయత్నమును దైవము హేతువుగా నపారమౌ
సిరుల రహించుసాహులకుఁ జెప్పకచెప్పెను మేటిపాఠ మీ
గఱువ - సమార్జితార్థమును గాచుటకున్ సరిలేనిరక్షగాఁ
బరఁగినదీవి - యీవి యిదు భద్రములన్ సవనాదులీయ - వీ
సరణిని విత్తవన్మణులు సాగిన మేలు జనించు - నాఁగినన్
బొరపులు పోరులున్ గుటిలబుద్ధులు రేఁగి జగాన శాంతికిం
గఱవు ఘటిల్లు - జాతిపితగాంధి, జగన్నుత ధీ వినోబయున్
గఱపిన ధర్మ విట్టి - దిది గైకొని శేషయరామయాంకుఁడ
ద్దిర ! జగతీవికాస నిరతిన్ నిలిచెన్ - గెలిచెన్ - వదాన్యతా
శరణ మితండు నిత్యజయశాలిగ సజ్జనమౌళిగా రమా
వరు పరమేశు పద్మజ దివస్పతి ముఖ్య సురార్చనావిక
స్వరు కరుణన్ శతాబ్దములు వర్ధిలుతన్ ! వనితాసుతా ప్తసో
దరిపరివారవార సుఖ దర్మకుదౌత - యశః ప్రభాపరం
పర సమరాపగా కుముద బాంధవ హీర తుషారమల్లికా
✦ దర శరదభ్రశోభల నదల్చుత - వెండియు నొక్కమాట మీ

✦ దర : శంఖము

యెఱుకకుఁ దెత్తుఁ - జెన్నపురి నే నిపు దందిన యీ ★ నెఱావరా
మెఱవణి చూచి మిట్టిపడ - మేరువు నా మొగసాల నిల్చినన్
గరువము నంద - నిట్టిపని కానిదటందు జగం బొసంగు నా
దరములు నా కనేకములు దక్కెఁజుఁడీ ! కనకాభిషేక సుం
దరములు - నా యణంకువయు ధర్మపరత్వము వీన హెచ్చె - నా
పరువ ★ మశీతివర్షములపై మతిమూఁడుశరత్తు - లామయ
స్ఫురణము సెప్పనేల - యిది పోవనిచుట్టము నాకు - నిమ్మెయిన్
నెతిచెడి యుందుఁగాక విడనేర సమాజవికాసకృత్ కృతిన్ -
మతి నను నొంచు నొవ్వులను మార్కొనుజెట్టి కవిత్వసృష్టి - యీ
తెరువునఁ బోకకే వసుమతిన్ జనియించితి నేను - నాకుఁ జే
కుఱిన సమస్తసంపదలకున్ గవనంబ నిదాన - మీపనిన్

జరిగెను దెబ్బదేండ్లు - కవిసత్తము లాద్యులు నన్నుతిక్కనల్
తరలిన బాట వంక నవధానమునన్ గనుచున్, బ్రయోగపున్
✦ గరగరికన్ గణించుచు జగమ్మును రాచు పరాయి రాయలన్
✦ గఱకరి కత్తికయ్యమునఁ గాక యహింసన పాటవమ్మునన్
నిరుపమ సత్యనిష్ఠ నవనీజనమెల్ల నహో ! పురే ! యనన్
దఱిమిన బాపుజీకథ, నథః కృతకర్మఫలానుషక్తతన్
మెఱసిన బాపుజీకథ, నమేయదయన్ దులలేని శేముషిన్
నరతతికష్టబాంధవుఁడనన్ గురురాట్టన వాదవాదలన్
దిరిగిన బాపుజీకథ, నతీవదరిద్రత దయ్యువారికై
తిరిసిన బాపుజీకథ, నతీంద్రియతత్త్వముగన్న జ్ఞానియై
మురిసిన బాపుజీకథ, నమోఘకృతుల్ పొనరించితిన్ - జనుల్

చిరతర సామ్యయోగరుచిచేఁ దనరన్ బదయాత్రసల్పి శం
కరుఁ దలఁపించి విశ్వమవుఁగా యనఁగాఁ దనజీవితమ్ము లేఁ
బరక వలెన్ దృజించిన తపస్వి వినోయతి ధర్మవీరతన్
జఱుతలు శిష్టులుం దనియుఁ జెప్పితి - నల్గడ నాంధ్రరాష్ట్రపున్

★ నెఱావరామెఱవణి: గొప్పధనసమ్మానము; ★ అశీతి: ఎనుబది;
✦ గరగరిక : నైర్మల్యము; ✦ గఱకరి : కఠినమైన;

గరిమకుఁ బోరు ✦ రాహుతుల కాహళికల్ ✦ మొరయన్ ద్రివిక్రమ
స్ఫురదవతారమూని కలముం గొని ప్రాక్తనులైనతెల్గుపో
టరుల పరాక్రమంబు, ప్రెగడల్ మతిసంపద, మేదినీపురం
దరుల గరిష్ఠధర్మరతి, దాతల పెక్కువ, చాన మేల్మి, పల్
తరముల జాతిగాథలను ద్రచ్చి గడించి వెలార్చి రే పవల్
గుఱకలు పెట్టు భ్రాత నెసకొల్పి నిజక్షితివేషభాషలన్
గుఱిచి కడింది పేర్మియును గూర్మియుఁ వివేకిఁ జేసితిన్ –

వఱపుల వానలన్ దిగులువాఱు కృషీవలు తీరుగాంచి లోఁ
గరఁగి, బికారి దీనతకుఁ గార్మికు లేమికి నూర్చి, పల్లెలన్
బెరిఁగిన యీరసం దలఁచి పెద్దయుఁ గుంది, ✦ వెలందిరాచపెం
✦ పుఱని ప్రబుద్ధులం దొడరియున్, బుడుతం బెడదారికీడ్చు ము
ష్కరు నదలించియున్ బ్రజ మజా ! యనఁ గూర్చితి ఖండకావ్యముల్ –
నెఱసరిదేశభక్తుల, గణేయకవీంద్రులఁ, బాండితీధురం
ధరుల, సమాజనుత్యగుణధన్యుల మెచ్చుకవిత్వముల్ పొరిం
బొరిగ సృజించితిన్ – ✦ సురిఁగిపోయినకైతలు పోవ నేఁటి కే
నిరువదివేలపద్యముల కెక్కుడుగాఁ బదిలింపఁ గంటి – నీ
వెరవిడినట్టి భారతి, కవేలదయాకృతి, కజ్జ్ఞతాతమః
పరివృత మానవప్రకరభావసహస్రమయూఖదీప్తికిన్

శిరమిది వంచి విన్నపము చేసెద నొండొకవార్త – కైతలో
నెరసులు రామికంటె మును నే నవలంబము సేయు మన్గదన్
గొఱఁతలు రామికిన్ గడు నెగుల్పడు మానిసినౌట నెన్నఁడున్
గరమును జాఁప, కర్థి మదిఁ గాఱియ పెట్టక, సత్యనిష్ఠ నే
మఱక బడాయిగద్దియలమాటకుఁ బోక, కిరీట ధర్తలన్
దఱియక సర్వసంపదలఁ దన్వియ మిన్న యటన్న నెన్నుడిన్
మఱవక నిక్కు టెక్కులకు మన్నన లీక, యసంగయోగమున్
దొఱఁగక, యింద్రియమ్ములకుఁ దొత్తుగ మాఱక, వేల్పుపట్ల వి
స్మరణము లేక, దేశికసమస్యలు మానక, యాశ్రితున్ గవిన్
దురుసుఁదనమ్మునన్ వెలికిఁ ద్రోయక, నన్ సవరించు కోవిదుల్
ధరఁ గలరన్న నిర్ణయము దప్పక, రూకలజోలి మాలి సత్

✦ రాహుతల : వీరుల; ✦ మొరయన్ : మ్రోగఁగా ✦ వెలందిరాచపెంపు : స్త్రీ రాజకీయోన్నతి,
✦ ఉఱని : పాటింపని; ✦ సురిఁగి : అదృశ్యమై;

పురుషునకున్ మదీయకృతి ✦ పోరచిగా నిడునట్టి నేమ మె
త్తతి నయినం దృజింప, కిది దగ్గఱనున్న తెనుంగువారితో
సరియని భారతీయతc బ్రశస్తివహించినదిట్టలాల్ బహ
ద్దరును, విదేశదీనజనతాహితుమార్టినులూథరున్ ✦ మఱా
కొరసి జనాళిc జీల్చుటకు నోదని ✦ గాములు వర్ణముల్ మతా
లరయక వర్గవాదముల కాప్తుcడcగాక సమస్తమానవో
త్కరశుభమాసచేయుకవిగాc గవిగౌరవరక్షణార్థిగాc

గరము శ్రమింతు నే ✦ నుదుటుగందము లేని "తెనుంగులెంక" యన్
గుఱుతునc దెల్గుశారదను గొల్తును నేను - దెనుంగుc గబ్బమం
దఱువదిపాళ్ళపాటి తెలుcగైనను నిల్పుట కారటించు కై
సరుcడను నేను - దిక్కనకుc జాగిలి మ్రొక్కుదు నేను - సంస్కృతం
బురుతరశక్తిమంత మని యొప్పెద - నందు మహాకవీంద్రు లెం
దఱో జనియించినారనియు నమ్మెదc - గాని తదీయమైన పెన్
బరువునc దెల్గుమూల్గిన సెబాసన లే - నిది వేళ యౌట స
చ్చరితుcడు ✦ నన్నపార్యుని దెసం దిలకించుచు సాహసించి నా

తెలcగొకకొంత చాటితిని - దీనిని సొంతపొగడ్తcగాc దలం
పరయని ✦ మానసింతు గుణభద్రులు మీరు సదస్యులార ! - క్ర
మ్మఱ నిదె మీ కొనర్చెద నమస్కృతి - నీకొనుcడీ కృతజ్ఞతా
భరనత తుమ్మలాన్వయ విభాకరభాషితసాహితిన్ - మనో
హర లగిసెట్టి రామయ కృతాదర భావితభవ్యభారతిన్

**20-10-1984**

✦ పోరచి కానుక, ✦ మఱాక మఱవక, ✦ గాము : దయ్యము, ✦ ఉదుటు · గర్వము, ✦ నన్నయగారి "తనకుల బ్రాహ్మణు" అను పద్యమును జూచుచు, ✦ మానసింతు తలcతు

# ఉగాది

(ఇది తుమ్మల వారి చివరి కవిత)
(గీతమాలిక)

వచ్చెనా ! నేఁటి పత్రిక ? వార్తలేమి ?
తమ్ముడా ! యన్న సోమసుందరుని జూచి
రమ్మిర మ్మన్నయా ! యని రామరాయ
లాదరానురాగమ్ముల నతనిఁ బిల్చి
నేఁడు మా గారెయున్ రుచి చూడుమయ్య !
యిది యుగాదికదా ! యింట నింటఁ బిండి
వంట సాగించు పండువు వచ్చినది క
దా ! యనిన సోదరునకు నిట్లనియె నన్న ;

భక్ష్యముల మెక్కి సంతుష్టిపడెడి కాల
మగునొకో ! యిది; యెటుగన్న నవధిలేని
దిగులతో లోక మీనాఁడు పొగులుచుంట,
పొంగిపొరలు నశాంతితోఁ గ్రుంగుచుంట,
దిక్కుగానక రేపవల్ స్రుక్కుచుంట,
నీవు సైత మెఱుంగవా ? నిజము పల్కు
నతని నీప్రొద్దు మన్నించునా జగంబు ?
వలదు వలదు హింస యటన్న వాని బ్రదుకు
సాగునా ? యొంటిమైఁ గళాశాల కేగు
తరుణి యింటికిఁ జేరునా పరువుతోడ ?
చట్టముల నాదరించునా జనచయమ్ము ?
కుల మత ప్రాంతభేదముల్ గొప్పగొప్ప
సభల నుండవు గాని యాచరణమందు
వీసమేని తొలంగునా? కాసుకొఱకు
నరుఁడు త్రొక్కని పెడదారి ధరణిఁ గల ద
టందువా ? నీచభోగాల కారటించుఁ
గాని వలచునా యతఁడు త్యాగమును ? జెపుమ !
పెత్తనము రాకకై వెడయెత్తు లూని
యలయుఁ గాని గణించునా యార్తసేవ ?
దానవతఁగాక మానవతన్ గనంగ
నేర్తుమా మనమూఁకలో నేఁడు మనము ?

ఊరికే నల్గురో మంచివార లుంద్రు
గాక, చాలుదురా వారు కలుష మడఁప ?
ఎల్లవాఁడును దనకుఁ దా నిచ్చతోడ
నాత్మపరిశోధనంబున కంగవించి
ధర్మమునకు విధేయమై తనరు మేలి
మనుగడన్ దలఁదాల్చి సమస్తలోక
భద్ర మర్థించినపుడె యీ క్షుద్రభయద
తిమిర మణఁగారి శాంతిచంద్రికలు వెడలు;

ఏ నలంతిని నేర్పులు లేనివాఁడ
నా వలన నేమి యగునని నరుఁడు జంక
"కుద్ధరేదాత్మనా" యన్న సూక్తి నెంచి
యతని నాతండె దిద్దుకోనగును, సకల
దేహముల నీశ్వరుం డుంట తెలియవలయు,
నీశ్వరుఁడొకండ యనుగుట్టు నెఱుఁగవలయు
నెడఁదను జయింపవలయు మిత్రుఁడు, విరోధి
యదియ యని కానవలయు, ధైర్యంబు, కరుణ,
చెలిమి, నమ్రత నేర్చుకోవలయుఁ, దాను
మాఱినంత సమాజమున్ మాఱు నని త
లంపవలయును, దేశకల్యాణమునకు
సొగుజన్నమునం దొక సమిధ యగుట
కతఁడు వాంఛింపవలయు సాహస మొనర్ప
వలయు నిటుగానినాఁడు దేవతలు పల్వు
రిలకు దిగివచ్చినను లోకహితముకొఱకు
నెందఱు మహాత్మ లసువుల నెడసినను వృ
థాశ్రమం బగుఁగాన నుదాత్త సరణి
బ్రదుకుటకు మన మీనాఁడు ప్రతిన పూన
వలయు; రాయలూ ! ముం దిది సలిపి పిదప
గారెలన్ దినవచ్చును గన్నెమావి
చివురులన్ మెక్కి క్రొందేనె చిందునట్లు
పికము క్రోల్చెడిగీతముల్ వినుచు వినుచు
నిదురపోవచ్చుఁ గలంత లన్నియును మఱచి (11-2-88)

# సుద్దులు

ఆ॥ అతని వీను బధిర మన్యుదోషము విన, జిహ్వా మూక యొరునిచెడుగు నుడువ,
నేత్ర మంధ మొరునినేరమి నీక్షింప, నెతఁడు పడయు శాంతి నతఁడు గాక ? 1

ఆ॥ నరకమన్ననేమి ? నాకు బంగరుకొండ, రాకవలయునన్న రంధిగాక;
స్వర్గమన్న నేమి ? సర్వస్వమనదల, వంతలణఁగ నప్పగింత గాక 2

గీ॥ దేవుఁడన నేమి ? సంఘమే; దిబ్బెమునకుఁ, జేరవలసినరూక దళారిమూఁక
పాలు కాఁగూడ; దిది చక్కఁబడిననాఁడు, మూఁడు పూ లాఱుకాయలై మురియుఁ బేద 3

క॥ నిగమవచనంబులన్నియు, భగవద్భాషితము లనుచు భావింపను, నా
దగు బుద్ధికి నీతికి నెదు, రగు భాష్యము నొప్ప, నను మహాత్ముని గనుఁడా ! 4

క॥ తనయం దొదవిన త్రుప్పున, నినుము ఖిలం బగువిధాన నేనఃఖని తా
నొనరించు నకృత్యమ్ముల, వనరి వనరి దిక్కులేనివాఁడై సమయున్ 5

క॥ నిద్దురయు, నోగిరంబును, హద్దులలో నుంట వలయు; నన్నువయైనన్
బెద్దయయినన్ రుజాదులు, తద్దయుఁ బీడించు నరు నుదగ్రము లగుచున్ 6

ఆ॥ తగినతిండి దిన్నతతిఁ దక్కు నరునకు, మంచితలఁపు మేలిమాట చేఁత
తెగు లొకండ కాదు దిగఁబాటు లెన్నేని, మూడు నొప్పరాని కూడు గుడువ 7

ఆ॥ పాలనమ్మువాఁడు ప్రోలెల్లఁ దిరుగాడు, మదిరనమ్మువాఁడు కదలకుండు
అలఁత లేక మంచి కాదర మబ్బదు, చెడ్డ కొదవు బైసి సేద లేక 8

గీ॥ ఈయవలసిన చిలిగవ్వ నిచ్చువాఁడు, వ్రాయవలసిన చిఱుకమ్మ వ్రాయువాఁడు
చేయవలసిన విధులెల్లఁ జేయఁగలఁడు, మోయవలసిన యశమెల్ల మోయఁగలఁడు 9

ఆ॥ పికమునుండి నుడి; పిపీలికనుండి క, ష్టించి బ్రదుకుతీరు; చెట్టునుండి
పెఱల కింపు సేఁత; పెన్నేటి నుండి ముం, దడుగువేఁత; నేర్వనగు జగమ్ము 10

ఆ॥ నిప్పువంటివారు నిల్పినసంస్థలు, విన్నఁబాటె వారు కన్నుమూయ;
బొగ్గువంటివారి, భోగాలకవి నేఁడు, సాధనమ్ము లాయె జగము వగవ 11

ఆ॥ తృష్ణ యుసుఱుదీయుతెగు, లిది వదలదు, నరుని శిరము, కరము నరయుఁగాక
కడుబెడందఁ గూర్చుఁ గామినీతృష్ణ, యి, ద్దానిఁ ద్రోఁత మెచ్చఁదగిన చేఁత 12

గీ॥ నదిని మున్గుచుఁ దేలుచు నుదిలపడెడి, నరుని జిఱుకొయ్య రక్షించుకరణిఁ గసటు
లేనియెడఁదకు నోఁచినవాని యలఁతి, పలుకు దారికిఁ దెచ్చు మొక్కలిని దుదకు 13

ఆ॥ ప్రాజ్ఞుఁడైనవాఁడు పడఁతికిఁ దాఁ గన్న, మంచి చెడ్డ వక్కణించు టొప్పు
నిది యొనర్పఁడేని యిల్లాలియజ్ఞత, సంతు నావరించి జాతి క్రుంగు 14

క॥ సిరి లేదని వాపోవుట, మొఱకుందన; మలసి కర్షముల్ సల్పినచో
సిరి దక్కునని యెఱుంగమి, నెఱమొఱకుందన మటంద్రు నేర్చినవారల్ 15

ఆ॥ లక్ష్మి దక్కునని తలంచెనా ? మందర, గిరిని మోయునాఁడు కేశవుండు;
తలఁపకున్న నేమి ? తప్పదు ఫలము ని, ష్కామయోగదీక్ష గన్న కృతికి 16

ఆ॥ ఏల వలచె విష్ణు నిందిర ? ఫలవాంఛ, నోసరించి గిరిని మోసిమోసి
పరులఁ దనిపెఁ గాన; నరు లీ రహస్యంబు, గానవలయు లక్ష్మి కరుణ నంద 17

ఆ॥ కీర్తిఁగోరువాని, కార్తికి దవ్వుగా, బ్రతుకఁగోరువాని, కెదురులేని
గెలుపుగోరువానికిని సదా శ్రీదేవి, సేవ వలయు మేలిత్రోవ వలయు 18

ఆ॥ సత్యదృష్టితోడ శ్రుత్యర్థ మెఱుఁగుట, మానినపుడు సమత మమత సమయు
స్వార్థచింత హెచ్చి జనులచిత్తము పరా, భూత మగును గుటిలబుద్ధితోడ 19

గీ॥ అన్నమాటను దప్పరా దన్నగోవు, తినుము తిను మని పులిని బ్రార్థించుగోవు
చచ్చెనా ? నొచ్చెనా ? సత్యశౌచశాలి, కాపదలు రావు రాని సౌఖ్యములు లేవు 20

ఆ॥ దిట్టలైనవారు దిగివచ్చి సామాన్య, పాఠకుల నలర్చు పలుకు పల్క
నియ్యకొన్ననాఁడె యెదుగును సాహితీ, నాకవనము రసికలోక ధనము 21

గీ॥ దీనతాహతుఁడై కుందుమానవునకుఁ, జేయు సేవయె మాధవసేవ నాఁగ:
మానవుం డన నెవ్వండు ? మాధవుండె, తెలివిగలవార లిచ్చిన తీర్పిదోయి ! 22

క॥ విం దన్న నేమి ? భోక్తకు, మందులపనిఁ దేనితిండి; మమకార మెదన్
సందడి చేయఁగ మఱిచెడి, కొందఱు తినువాని మొత్తుకోల్ విన రకటా ! 23

ఆ॥ 'నిన్న' లేదు; 'రేపు' నీది కా; దిఁక నీకు, నొక్క 'నేఁడు' మిగిలియున్న దోయి !
చేయఁదగిన పనులు చేయుమీ నేఁడె స, మీక్ష చేసిచేసి యిహము పరము 24

గీ॥ మంచితన మెంతయున్నను మధురవాక్కు, లేనినాఁడాదరము నందలేఁడు నరుఁడు;
పాలుచిక్కని వయ్యును బంచదార, గలియకున్న రసజ్ఞ కీఁగలవె తృప్తి ? 25

గీ॥ తగునుగాని వదాన్యత; దాని కవధి, యుండవలయును; లేని నాఁ డూరుఁగాయ
ముక్కనుంబలెఁ దెక్కలిమూఁక లెగసి, చప్పరించును దాత నిచ్చకములాడి 26

ఆ॥ తనయొనర్చుపనులు తగు నగు నని యూరు, నాడు పల్కుదనక నరుఁడు సుఖము
నందఁగలఁడు ; జీవితానందమును గోరు, వా రెఱుంగవలయు నీ రహస్సు 27

ఆ॥ వెనుక ముందు చూచి విద్వాంసులు సవర్ణ, దీర్ఘ సంధి కనుమతించి యుంద్రు
ఎట్లు కుదురు నర్థ మిపుడు కొందఱుమోయు, పట్టములకు దీని ప్రాపులేక 28

క॥ అనవద్యమైన పెద్దల, ఘనతం గని పొంగవచ్చుఁ గాని నరుం డీ
కొనవలయు వారిచరతయు, మనవలయు నుదాత్తధర్మ మానితుఁ దగుచున్ 29

ఆ॥ కూడులేక మూల్గు తోడిమానిసికి నీ, విచ్చురొట్టెముక్క యీశ్వరునకు
నొసఁగు కాన్కగాక యొండగునా ! బ్రహ్మ, కర్మ మన్న నిదియ కనుము నేస్తి ! 30

ఆ॥ నేఁడు సమసమాజ నిర్మాణమునఁ గార్య, కర్త లిద్ద ఱగ్రగణ్యు లనెద
నొకఁడు కులవిభేద మొప్పని విప్రుండు, చాగమునకు ✦ వార్చు సా హెూకండు. 31

(ఇది తుమ్మల వారి చివరి పద్యము)

✦ వార్చు : ప్రతీక్షించు